ప్రమోదూత సం. **ఆంధ్రపత్రిక** శా. శ. ౧౮౫౨






1930 ANDHRA PATRIKA Reg. No. M. 1092. 1931




# ఇరువదియొకటవ సంవత్సరాదిసంచిక

౧౯౩౦–౩౧

## ప్రమోదూత సంవత్సరము

C.M.V. Sharma

ఆంధ్రవిద్వన్మహాజనులచే వ్రాయఁబడిన

### రాజకీయ సారస్వత చారిత్రక సాంఘికాదివిషయక

వ్యాసములును, దేశభక్తుల చిత్రములును గలవు

ఆంధ్రపత్రికా ముద్రాలయమున ముద్రితము; ఆంధ్రపత్రికాధిపతిచేఁ బ్రకటితము

**6-7, తంబుశెట్టి వీథి, జార్జిటవును, మద్రాసు**

**1930-న సంవత్సరము మార్చినెల 31-వ తేది**

ౘ

# విషయానుక్రమణిక

౨. పద్యవ్యాసములు

# చిత్రానుక్రమణిక

త్రివర్ణ చిత్రములు:—౧. రాధ, ౨. శ్రీయుత పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు, ౩. కీ. శే. బ్రహ్మశ్రీ, మహోపాధ్యాయ వేదము వెంకటరాయశాస్త్రిగారు, కలాప్రపూర్ణ, ౪. అచ్చర, ౫. రాధాకృష్ణులు, ౬. బొలుదు-మాంచాల, ౭. రాణీసంయుక్తసందేశము, ౮. విహారసుందరి.

వ్యంగ్య చిత్రములు:—పార్కులో వేడుకలు పు. ౬౨, ౨. రూపాయలు, అణాలు, పైసాలు పు. ౧౧౮, ౩. ఉత్సాహి ౧-('నాలా' పాఠకుడు) పు. ౧౪౯, ౪. ఉత్సాహి ౨. (మద్దెలకాడు) పు. ౧౫౬, ౫. ఉత్సాహి ౩ (బంతియాట) పు. ౧౯౮, ౬. పొట్టకూటికి పాటుపడుచున్న యుద్యోగి గౌరవము పొందుచుండ ప్రజల జ్ఞానాభివృద్ధికి పాటుపడుచున్న జ్ఞానిని చూచేవారు లేరు పు. ౨౦౬, ౭. ఏలాగైతేనేం, అల్లుడు మామ కలుసుకున్నారు. పు. ౨౧౨. ౮. పిచ్చా—తగాదా. పు. ౨౯౫.

అజంతాచిత్రములు:—౧. హంసజాతకము పు. ౪౮, ౨. అంతఃపురద్వారము పు. ౧౦౪. పాత నాణెముల చిత్రములు పు. ౧౨౭.

సాధారణ చిత్రములు:—ద్రాక్షారామము దేవాలయమునందలి వినాయక ప్రతికృతి పు. ౨౨౪, శివపూజకు పు. ౨౨౮, సామర్లకోటచెంతనున్న కుమారారామభీమేశ్వరాలయముననున్న నాట్యశిల్ప ప్రకృతి పు. ౨౩౨, నీళ్లకు పు. ౨౪౦, రాధాకృష్ణ. పు. ౨౫౧, వివాహబహుమానము పు. ౨౯౫.

౧ ౪౪వ అఖిలభారత జాతీయమహాసభా చిత్రములు, లాహోరు; అధ్యక్షుని ఊరేగింపునకు సంబంధించినవి ౧-౫; శ్రీసేవాదళము, సభాధ్యక్షుడు సర్దారుసింగు మొదలగు నాయకులు, మహాసభా మంటపము.

౨ జాతీయపతాకారోహణము ౨, లజపతిరాయి నగర సింహద్వారము ౧; లజపతిరాయి నగరములోని దృశ్యములు ౨.

౩ ఆకస్మిక ఛాయాచిత్రములు: పూరిమహాతటాకము, 'తెప్పలు' తిరుపతి;

౪ పురాణపఠనము; ఉత్తరము.

౫ వేలూరుకోట; ఆశ.

౬ మహామఖ దేవాలయము - కుంభకోణము; నరసింహులకొండ – నెల్లూరివద్ద.

౭-౧౦ అమరావతీ స్తూప చిత్రములు.

౧౧ శ్రీ నూనె పానకాలు శ్రేష్ఠిగారు, శ్రీ. యం. రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, ఆంధ్రమహాసభాస్థాపనము; శ్రీ రామస్వామిగారు, శ్రీ పంచరత్నముగారు, శ్రీ కె. కె. పాలట్‌గారు, శ్రీ ప్రకాశరావుగారు.

౧౨ శ్రీ రామబాలభక్తవాఙ్మయసేవాసంఘసభ్యులు-రాజమండ్రి, సంస్కృతోన్నత కళాశాల - రాజమండ్రి; శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు, ఆంధ్రరాష్ట్ర మహాసభ-బెజవాడ;

౧౩ ఆంధ్రమహాజన సభాసమావేశము, ఆంధ్రదేశ హిందూస్థాన సేవాదళ సమావేశము; ఆంధ్రకృష్ణాపత్రికాధిపతుల కొసగిన రజతపేటికలు, ఆంధ్రకృష్ణాపత్రికల సన్మాన మహోత్సవము.

౧౪ నేమాన వాసుదేవమూర్తిగారు, శ్రీ కదిరి శ్రీనివాసాచార్లుగారు, కీ॥ శే॥ అనంతపంతుల వేంకటేశ్వర్లుగారు, శ్రీ చెరుకువాడ వెంకటనరసింహారావుగారు, శ్రీ వంకాయల అప్పల నరసింహభుక్తగారు; శ్రీ. యం. వి. పాపన్నగుప్తగారు, శ్రీ మాచిరెడ్డి వెంకటస్వామి రెడ్డిగారు, శ్రీ కర్లపాలెం కృష్ణరావుగారు, కృష్ణామండల మూడవ అర్చక మహాజనసభ.

౧౫ ఎలిమెంటరీస్కూలు - నరసింగపురము, ఆదిఆంధ్రాశ్రమమునందలి బాలికలు; ఎలిమెంటరీస్కూలు, ఆదిఆంధ్రాశ్రమమునందలి బాలురు-పిఠాపురము.

౧౬ శ్రీ వేంకటకాళిదాసకవులు, శ్రీ గుడిపాటి సత్యనారాయణ శర్మగారు, శ్రీ సింగంపల్లి వెంకటాద్రిగారు, శ్రీ కార్యమపూడి వేంకటకృష్ణ శతావధానిగారు, శ్రీ గున్నేపల్లి అక్షయలింగంగారు; శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్య చౌదరిగారు, శ్రీ బొల్లిని మునుసామి చౌదరిగారు, శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు, శ్రీ శతశిల్పి నూతులపాటి నరసింహచౌదరిగారు.

౧౭ విఘ్నేశ్వరాది ఆంధ్రభజనకూటము, శ్రీ వెలగల సుబ్బారెడ్డిగారు, శ్రీ సత్తి సాంబారెడ్డిగారు, కమ్మ యువజనసంఘ హిందీపాఠశాల - అయితానగరప్పాళెం; శ్రీ వామన రామచంద్ర నాయకుగారు, కీ॥ శే॥ కార్యమపూడి రాజమన్నారుకవిగారు, శ్రీ కవిరత్న నరసింహశర్మగారు, ఆంధ్రదేశ హిందూమహాసభా సమావేశము బెజవాడ.

౧౮ శ్రీ. డి. యస్. పుట్టన్నగారు, శ్రీ. పి. టి కుమారస్వామి శెట్టిగారు, వ్యవసాయ కళాశాలాంధ్ర విద్యార్థిసంఘము - కోయంబత్తూరు; శ్రీ గుడిపాటి శేషగిరి రావుగారు, శ్రీ. కే. కనకయ్యగారు, శ్రీ మారుతివ్యాయామ మండలి, నంద్యాల.

౧౯ శ్రీమతి పానోదేవిగారు, అల్లూరి వెంకట సీతమ్మగారు, కిట్టిశివరావుగారు, దర్శి అన్నపూర్ణమ్మగారు, పద్మాబాయి సంజీవరావుగారు; ఆంధ్రఆర్టు థియేటరు. బెజవాడ, శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులుగారి నాటక బృందము, షేక్స్పియరు సింబలైను నాటక పాత్రధారులగు చెన్నపురి యువతీమణులు.

౨౦ శ్రీమతి యం, యు. మిల్సుకన్యగారికి సన్మానము, శ్రీ శారదాలేడీస్ యూనియను (తిరువల్లిక్కేణి) వర్షవర్ధంతి; శ్రీమతి ఫెలీసియా దేవసహాయం కన్యగారు, అన్న టి. మామెను కన్యగారు, కే. పార్వతిఅమ్మగారు, విమన్సు ఇండియన్ అసోసియేషన్, చెన్నపురి.(ఎగ్మూరు).

౨౧ శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు, యస్. కమల గారు, బాల్యవివాహ నిరోధశాసనమును ఖండించు స్త్రీల మహాసభ, చెన్నపురి; శ్రీమతులు ఆనందబాయి కన్యగారు, డి. లక్ష్మీదేవిఅమ్మగారు, బి. సుబ్బమ్మ-కామాక్షమ్మగార్లు, సుబ్బమ్మ సీతారత్నంగార్లు.

౨౨ విక్టోరియా హిందూ వితంతు శరణాలయము-రాజమహేంద్రవరము; సికంద్రాబాదు బాలికాపాఠశాలోపాధ్యాయులు, శ్రీ. సి. యన్. నల్లముత్తు అమ్మాళ్ కన్య వీడుకోలు, బాల్యవివాహ నిరోధశాసనమును బలపరచు స్త్రీలమహాసభ, చెన్నపురి.

౨౩ శారదాబిల్లును బలపరచు స్త్రీలసభ, ఆంధ్ర స్త్రీల మహాసభ - బెజవాడ; భారతమహిళా సంఘసభ - బెజవాడ, గుంటూరు భారతమహిళా సమాజము.

౨౪ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు శ్రీ కృష్ణ పాత్రధారి, జాకోబి శకుంతలాకన్య, శ్రీ మాధవనాటక సంఘము-ట్రెయినింగుస్కూలు-మచిలీపట్టణము; శ్రీమతి తాడూరి రమణాబాయమ్మగారు, కే. నాగరత్నమ్మాళ్ కన్యగారు, స్త్రీల సనాతన ధర్మసమావేశము. చెన్నపురి.

౨౫ శ్రీ మారేమండ నరసింహారావుగారు, శ్రీ రావుల లోకనాథంపంతులుగారు, శ్రీ ముద్దా విశ్వనాథం గారు, బ్రహ్మసమాజసభ్యులు, పిఠాపురము; తెనాలి సంస్కృతకళాశాలా పండితబృందము, తెనాలి సంస్కృత కలాశాలా విద్యార్థి బృందము.

౨౬ శ్రీ బొడ్డపాటి వెంకటప్పయ్య పంతులుగారు, శ్రీ నడింపల్లి వెంకట హనుమంతరావు పంతులుగారు, శ్రీ దామోదర కృష్ణమూర్తిగారు, శ్రీ తూనుగుంట నాగరత్నం శ్రేష్ఠిగారు; గూడూరు తాలూకా ప్రాథమికోపాధ్యాయ ప్రథమమహాసభ-వాకాడు, వైశ్యవ్యాయామ కళాశాల-గుంటూరు.

౨౭ శ్రీ గానవిశారద జి. రంగనాయకులుగారు, శ్రీ ప్రొఫెసరు టి. దక్షిణామూర్తిగారు చీరాల, శ్రీ బాల సరస్వతీ లైబ్రరీ-అంగలూరు, కృష్ణాజిల్లా; శ్రీ చల్లపల్లి రాజాగారు, శ్రీ రాజా హరిశ్చందన జగద్దేవుగారు - తెక్కలి, తెక్కలి సీనియరు జమీందారుగారు, సర్ నార్మన్ మార్ష్ బ్యాంక్సుగారు.

౨౮ స్కూలుఫైనలువిద్యార్థులు ఆదిఆంధ్రాశ్రమము పిఠాపురము, ఆదిఆంధ్రాశ్రమ సహాయమును పొందుచున్న ఇతరగ్రామములనుండి వచ్చినవిద్యార్థులు; ఎలిమెంటరీ స్కూలు ఫకీర్ దీన్ పాళెము, బ్రహ్మసమాజము వారిది, పిఠాపురము, కందరాడ ఎలిమెంటరీస్కూలు, పిఠాపురము.

౨౯ ది॥ బ॥ శ్రీ. కొ. సూర్యనారాయణ మూర్తిగారు, రా॥ సా॥ శ్రీ. చి. తమ్మిరెడ్డిగారు, డా॥ శ్రీ పల్లెంపాడు గోపాలకృష్ణగారు, రా॥ సా॥ గుడ్లవల్లేటి వెంకటరత్నం పంతులుగారు, రా॥ సా॥ వి. వి. యస్. యన్. శర్మగారు; శ్రీ. పి. సత్యనారాయణగారు, శ్రీ కారుమూరి సర్వేశలింగంగారు, శ్రీ శనగపాటి పూర్ణయ్యగారు, శ్రీ రామకృష్ణ సేవాశ్రమము, ఇచ్ఛాపురము.

౩౦ శ్రీ. యన్. డి. జోసఫ్‌గారు, శ్రీ పోసాని ప్రకాశరావు చౌదరిగారు, శ్రీ చక్రవర్తుల నరసింహాచార్యులుగారు, వైద్యరత్న వైద్యరాజ కవిరాజ పండిలకక్ష్యలు, శ్రీ అన్నావఝ్ఝల శివరామయ్యగారు, శ్రీ. ఉడిపి గోపాలాచార్లుగారు - తులసిపూజ, శ్రీ సీతారామ హరిభజన భక్తిసమాజము-ఉంగుటూరు.

౩౧ శ్రీ చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శ్రీ దంతులూరి శ్రీ రామచంద్రరాజుగారు, శ్రీ ఓరుమళ్ల వెంకాజీగారు, శ్రీ డాక్టరు పిళిపాటి వెంకటరమణయ్యగారు, శ్రీ వి. ఆర్. చిత్రగారు, కీ॥ శే॥ పేరేపి సూర్యకాంత సత్సంగినీగారు; శ్రీమతి రాజరాజేశ్వరమ్మగారు, దామెర్ల కమల రత్నంగారు, శ్రీయుతులు పి. జోసఫ్ విల్‌సన్ దంపతులు, శ్రీమతి లైడియా వేదనాయకంగారు, శ్రీ. బి. వి. సుబ్బమ్మగారు, డా॥ జాన్‌సతిగారు.

౩౨ శ్రీ డబ్ల్యు. ఏ. ఆర్యదాసుగారు, ఆర్యవైశ్యాభివర్ధనీ సంఘము మదనపల్లె, శ్రీ విమెన్సు ఇండియను అసోసియేషనువారు, శ్రీ అంకాల వెంకటసుబ్బారావుగారు; శ్రీ యం. ఆర్. శాస్త్రిగారు, (దుర్యోధనుడు పార్సీపద్ధతి) శ్రీ రాణా రాజసింహ (రాజపుత్రయోధుడు) పార్సీయువతి, దేవయాని.

౩౩ శ్రీ నడింపల్లి జగన్నాథరావు పంతులుగారు, కీ॥ శే॥ సోడిశెట్టి వెంకటరత్నంగారు, కీ॥ శే॥ నాగుమంత్రి సూర్యనారాయణగారు, శ్రీ వాసిరెడ్డి రామానాయడుగారు, శ్రీ పాదబాపన్నగారు, శ్రీ యస్. నారాయణాచార్యులుగారు; శ్రీ కాంచీ కామకోటి పీఠాధీశ్వర జగద్గురు శ్రీమ చ్చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ స్వాములవారు, పండిత చిదిరమఠం వీరభద్రేశ్వర శర్మగారు.

౩౪ కీ॥ శే॥ తటవర్తి రామబ్రహ్మముగారు, రా॥ బ॥ యన్. వెంకటరెడ్డిగారు (కడప రెడ్డి మహాసభాధ్యక్షులు), భారతదేశీయ విద్వత్సమ్మేళన తెనాలి, శ్రీ శాల్లకూరి గోపాలరాయ కవిగారు, ఆంధ్రవిద్యార్థులు సూపరువైజరు తరగతి చెన్నపురి టెక్స్టయిలు ఇన్‌స్టిట్యూటు.

౩౫ శ్రీ బత్తుల కామాక్షమ్మగారు, శ్రీ జి. యన్. శారదాకన్యగారు, శ్రీ. సి. కె. కౌసుకుట్టి కన్యగారు, కీ॥ శే॥ పంతగాని లూధియాదేవిగారు, శ్రీ గ్రేస్. ఆనందరావుసతిగారు, శ్రీ గ్రేసు వేదాంతాచారికన్యగారు, శ్రీ బాలసుందరంశెట్టి సతిగారు, శ్రీ చిన్నలక్ష్మమ్మగారు; శ్రీ భారత మహిళా శారదాసమాజము, అనంతపురము, శ్రీ అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు, శ్రీ ఎమిలీ కిన్నర్డు కన్యగారు, కీ॥ శే॥ సబ్నవిస్ వెంకటసుబ్రహ్మణ్య కృష్ణారావుగారు, శ్రీ వెలువోలు సీతారామయ్య చౌదరిగారు.

# చిత్రములవివరణము

## అమరావతి చిత్రములు

### చిత్రము ౧

ఈ రెండు స్త్రీ విగ్రహములును, ఇట్టివి మరికొన్నియును దరుజులకు లోనైపున ఒక్కొక్కరంగమును వేరుజేయుటకుగాను గోడలకు జేరినట్లుగా జెక్కబడియున్నవి. వీని శిల్పము చాల వింతగొల్పుచున్నది. ఎడమవైపుననున్న విగ్రహముకుడిచేత నొక దివిటీయున్నది. దాని తలవెనుక పాము ను ఉన్నది. కుడివైపుననున్న బొమ్మకుడిచేతియం దొక మానవశిరమునందు గ్రుచ్చినకత్తియున్నది. ఇవి మానవశరీరములనుండి విడదీయబడిన శిరములో లేక నట్టియాకారముగల పాత్రలో నిశ్చయింప వీలులేదు.

### చిత్రము ౨ అ. ఆ.

ఇందలి మొదటి చిత్రమునందు జూపబడిన చక్రస్తంభమునందలి శిల్పము విశదముగనున్నది. లోగ్రాదియందలి చిత్రావయవసన్నివేశమును గుర్తెరుంగుట కిది బాగుగ నుపయోగించును.

రెండవ చిత్రమునందుండు గ్రాదియు, రెండువరుసల శిల్పము, దానిపై దాగోబాయు నొకేరీతియందున్నవి. వాటియొక్క పరిమాణముకూడ వాటిపైననే గుర్తింపబడియున్నది.

పైశిల్పము ధర్మాశోక రాజుయొక్క గాథను దెలుపుచున్నది.

"రాజు స్వర్ణసైకతములను సమీపించిన పిదప దేవతలు తన వద్దకువచ్చి లంకేశ్వరాజ్ఞచే దేవాలయాధోభాగమున బుద్ధుని దంతాస్థికలు దాచబడినవని చెప్పినట్లు స్వప్నముంగాంచెను. మరునాడు ధర్మాశోకుడు ఆచైత్యమును ద్రవ్వుటకు మనుష్యులబంపెను. కాని కాకులో, వాని రూపముననున్న భూతాదులో వారి నడ్డగించిరి.

అప్పుడు నాగేంద్రు డేడుశిరములతోడను, ఏడుతోకలతోడను ఆచైత్యమును గాపాడుచుండెను. ధర్మాశోకుకు ఇంద్రుడు సహాయార్థమంపిన మాతలితోడను, పరివారముతోడను దానిని సమీపించునప్పటికి ఆచైత్యమును చుట్టుకొనియున్న నాగేంద్రుడు తనంతట మెల్లగా చైత్యమును వీడిపోవుచుండెను.

రోమ్ముదేశాధీశ్వరుసహాయముచేత సఫలప్రయత్నుడైన ధర్మాశోకు డప్పుట నొక పట్టణమును గట్టించి యందు దా సంపాదించిన బుద్ధదంతాస్థికలకొరకొక చైత్యమును గూడ గట్టించెను.

ఈ చిత్రమునందు గానవచ్చు చైత్య మదియే కానోపును.

### చిత్రము ౩ అ. ఆ.

ఈ శిల్పమందలి స్వారస్యము క్రింది భాగమందలి గడ్డముగల వ్యక్తిపై నాధారపడియున్నది. ఈ వ్యక్తి దస్యువో, తక్షకుడో, కావలెను. అతని బట్ట, జుట్టుకట్టులను బట్టి యతడు పై రెండు జాతులలో దేనిలో నొకదానికి జెందినవాడని నిర్ణయింపదగియున్నది. అతనిని వెంబడించు మృగములవలన నిత డొకయరణ్యవాసి యని చెప్పకతప్పదు. వెనుక నతనికుటీరము కననగు. అదియొక గుండ్రనిపూరిగుడిసె కాక చదురపుటిల్లుగానున్నది. దానికి ప్రక్క నొకగోరీ కలదు. దానిపై నలుమూలల నొక్కొకపూలతొట్టికలదు. అది దాగోబాయో, గోరీయో, చైత్యమో నిర్ణయింప వీలులేకున్నది. స్త్రీలు భక్తితో నతనిని సమీపించురీతిని, రథమునందలి పురుషు డాతని కుపహారము లర్పించురీతిని బట్టి యాత డొకమహర్షి గ నుండునని తలపదగును. ఇచటగల రథము, మహర్షి, రాజుయొక్క తలపాగాయు నమరావతియం దికనెచ్చటను గనబడవు. రావిచెట్టునకుముందున్న బలిపీఠమును, స్త్రీలు తమనెండ్రుకల నలంకరించుకొనియుండు రీతియు మెచ్చదగినవి. చిత్రమున పైభాగముననున్న రాజుయొక్క తలపాగాయును మిగుల వింతగనున్నది.

### చిత్రము ౪

మొదటి చిత్రమునం దొకపల్లకియం దేవురు పురుషులు కూర్చొనియున్నారు. దానిని మోయుటకు సుమారు పండ్రెండుగురు కావలసియున్నను, ఇరువురే కాన్పించుచున్నారు. పల్లకియందలి మనుష్యులు ముందుభాగముననున్న యేదో యొక దేవత కాభరణములను దెచ్చుచున్నారు.

### చిత్రము ౫ అ. ఆ.

రెండవ మూడవ చిత్రములు ప్రాకారపు లోభాగమందలి దరుజులయొక్క మరిరెండుభాగములను దెలుపుచున్నవి. శిల్పవైఖరి, చెక్కిన కమలములు అమరావతియందలి శిల్పముల బోలియున్నవి. రెండవ చిత్రమందు దన యిరువురు భార్యలనడుమ గూర్చొనియున్న పురుషుడు శుద్ధోదనుడో అతని కుమారుడు సిద్ధార్థుడో కావచ్చును. మూడవచిత్రమునందు బుద్ధు డొకయాసనముపై గూర్చొనియున్నాడు.

### చిత్రము ౬

ఒకటవభాగము—ఇది యొక గొప్పగ్రాదియొక్క ఆరుస్తంభములుగల లోభాగమును, వాటిమధ్యనున్న బింబములను పై భాగ

మండలి దరుజును దెలుపుచున్నది. చిత్రమంతయు సంపూర్ణముగా శిల్పముతో నిండియున్నది.

రెండవభాగమందలి దరుజుపై దానియంత పరిమాణముగలదియే యైనను మరియొక భాగమునకు సంబంధించినది. ఇది యేసింహద్వారము యొక్క పై శిల్పముగనో, ఉచ్చైత్తు శిల్పముగనో ఉండును.

చిత్రము ౭

ఇదియొక గొప్పగ్రాదియొక్క వెలుపలి భాగము. ఇందలివిశేషమేమన నిందు గ్రింది భాగమున జంతువులయొక్క దరుజున్నది. అది గ్రాదికంతటికి నస్థిభారముగనున్నది.

చిత్రము ౮ (౧)

మొదటి విభాగమునం దొకహిందూరాజు తనకూజానుండి యొకానొకని హస్తముపై నీళ్లు పోయుచున్నాడు. అతని వెనుక మరియొకడు చేత నొకగొడుగును ధరించి నిలుచుకొనియున్నాడు. వీరిద్దరి నడుమ నొక పొట్టివాడు పూజా కాధారముగనో లేక పవిత్రములను దానియందలి యుదకబిందువుల బట్టుకొనుటకో ఒకతబుసను తనతలయం దిడికొని నిలువబడియున్నాడు.

తరువాతి విభాగమునందు రెండెద్దులగూడబండి యొకటి గానగు. అది యమరావతియందలి శకటముల బోలియున్నది. దానికెదురుగ నొకడు చేత నొకగొడుగు నిడికొని వచ్చుచున్నాడు. అతనికి పై భాగముననున్న పురుషుడు చిన్నగొడుగు నొకదానిని చేత నిడికొని వెడలుచున్న మరియొకనిని వెంబడించుచున్నాడు. అతని కొకయున్నత పురుషుడు ఇరువురు పిల్లల వెంట నిడికొనివచ్చి స్వాగతము చెప్పుచున్నాడు.

మూడవవిభాగమునందు ముష్వురు కూర్చొనియున్నారు. వారు కానుకలకోటి రాయబారమును స్వీకరించుచున్నారు.

(౨)

మొదటివిభాగమునందు దాగోబా పూజ యథావిధిగ నెరవేర్పబడుచున్నది. కుడివైపున నంతఃపురమందలి చిత్రములలో నొకటి గానగు. ఒక యాసనమున నొక మహాపురుషుడు కూర్చొనియున్నాడు. అతనికి రాజచిహ్నములేవియు లేవు. అత డాయాసనము నందే కూర్చొనియున్న యొకనారీమణి చుబుకము పుణుకుచున్నాడు. ఆమె తలచుట్టు నొకప్రభ వెలుగుచున్నది. ఈమె మాయాదేవి కాదు. ఏలన నామె సిద్ధార్థునిగన్నపిదప ఏడురోజులకే లోకాంతరగతయయ్యెను. ఒకవేళ నామె తలచుట్టునున్నది ప్రభకాక వెనుకనున్న పరిచారికలచేతి యందలి వస్తువేదియైన గావచ్చును. ముందువెనుకలనున్న పరిచారిక లుపహారముల గొనివచ్చుచున్నారు. అందులో పెద్దయగు నొకపరిచారిక చేత నేదియో తినుబండము నుంచుకొనియున్నది.

విగ్రహములు రమణీయములుగను, శిల్పవిధాన మమరావతియందలి శిల్పములలో జక్కనిదిగ నున్నది.

(3)

మొదటి విభాగమునందు బుద్ధునితండ్రియగుశుద్ధోదను డొక సింహాసనముపై గూర్చొనియున్నాడు. అతనికుడివైపున మాయాదేవి కూర్చునియున్నది. ఆమె శిరముచుట్టు నొకప్రభ యున్నది. అతని యెడమవైపున నతని ప్రధానమంత్రియు, తరువాత మరినలుగురు మనుష్యులను గూర్చొనియున్నారు.

మధ్యమ విభాగము బుద్ధునిజననమును గూర్చిన యొకగాథను దెలుపుచున్నది. మాయాదేవి తనకాలము సమీపించుట నెరింగి పురమును వదలి రమణీయమగు లంబినీ యుద్యానమునకు వెడలి యట నొక మహాపుత్రుని గనెను: ఆమె వెనుక నామె మత్తగారు నిలుచుకొనియున్నారు. ఆమె చేత నొకఛత్రమును ధరించియున్నది. మరియు మాయాదేవి ప్రక్కన నలుగురు దేవతలు ఒక వస్త్రము బట్టుకొనియున్నారు. వారు దాని నామెకు జుట్టుటకు సంసిద్ధులైయున్నారు. ఆమె యెడమవైపున శిశువును ప్రసవించెను. ఉయ్యాల ముందుభాగమున నున్నది. దేవత లాదృశ్యమును జూచుచు స్తోత్రము చేయుచున్నారు.

మూడవవిభాగమున సిద్ధార్థు డొక మేలుకట్టు క్రింద నొక మంచముపై గూర్చొనియున్నాడు. దానిపైననే యతని మొదటి భార్యయగు గోప కూర్చొనియున్నది. ముందువైపున నొకతె వీణవాయించుచున్నది. మరియొకతె పిల్లనగ్రోవినూదుచున్నది. వారికిముందిద్దరు గానమును వినుచునో. లేక పాడుచునోయున్నారు. ఒకతె యొక చిన్నపిల్లతో నాడుకొనుచున్నది. మరియొకతె గద్దెపై గూర్చొనియున్నది.

ఈ భాగములన్నియు నొకదానితో నొకటి కలియకుండ నేర్పుతో విభజింపబడియున్నవి.

చిత్రము ౯

పైవరుసలో మొదటిచిత్రమునందలి దాగోబాకు ముందువైపున నైదుశిరములుగల సర్పమొకటి గలదు. ఇచటగల యారాధకులు హిందువులనుట కేమాత్రము సందియములేదు. తక్కిన యన్నిటియందును శిల్ప మొకింత నొండొంటితో భేదించియున్నది.

అక్షయలింగం గారు, గున్నేపల్లి

వీరు అమలాపురగ్రామ నివాసులు. విశ్వబ్రాహ్మణులు. వీరిది పండిత కుటుంబము. ఆంధ్రగీర్వాణములయందు మంచి ప్రవేశము కలవారు. కవులు. కుశలవరామాయణము, రుక్మిణీబాయి, సీతాపవాదము, సోమేశ్వరశతకము, హిరణ్మయి మొదలైన గ్రంథములు వీరి రచనలు. వీరు కపిలేశ్వరపురమున సెకండరీ పాఠశాలయందు

ఆంధ్ర గీర్వాణ పండితులుగా నున్నారు. పత్రికలయందు వీరివ్యాసము లు కాన్పించు చుండును.

### అన్నపూర్ణమ్మ, దర్శి

కడచిన ఆంధ్రయువతీ సమావేశముయొక్క ఆహ్వానసంఘమున కీమె కార్యదర్శినిగానుండినది.

### అన్నా టి. మామెన్ కన్యగారు

శ్రీ గంగాధరం లక్ష్మీనారాయణమ్మగారి పేరనున్న బహుమతిని ఈమె యం. బి. పరీక్షయందు కృతార్థురాలై గడించినది.

### అప్పల నరసింహ భుక్తగారు, వంకాయల

వీరు గంజాముమండలమునందలి పొన్నాము గ్రామనివాసులు. వీరి కాంధ్రసాహిత్యమునందును సంగీతకళయందును ప్రవేశముకలదు. గురుకులముపద్ధతుల ననుసరించి బాలురకు విద్యను నేర్పించుచున్న వదాన్యులు వీరు. కొన్ని భక్తిరసప్లావితములగు గేయకావ్యములను వీరు రచించియున్నారు.

### ఆంధ్ర దేశ హిందూమహాసభా సమావేశము, బెజవాడ

ఈ చిత్రమున అధ్యక్షుడు: డాక్టరు మూంజిగారును ఇతరులును గలరు.

### ఆంధ్రవిద్యార్థులు, కోయంబత్తూరు వ్యవసాయకళాశాల

ఇప్పు డీ కళాశాలయందు నలునదిమంది యాంధ్రవిద్యార్థులు వ్యవసాయశాస్త్రమును నేర్చుచున్నారు. వ్యవసాయశాస్త్ర జ్ఞానావశ్యమును గుర్తించి క్రమముగ నాంధ్రదేశీయులు ఇచట నధికసంఖ్యాకులు విద్యార్థులుగా వచ్చుచుండుట మోదావహము.

### ఆనందబాయికన్య

మదరాసు హైకోర్టులో అడ్వొకేటుగానున్న యువతీమణి.

### ఆనందరావుసతి, గ్రేసు

ఈమె నెల్లూరు మునిసిపలుకౌన్సిలుకు మెంబరుగా ఎన్నుకొనబడెను.

### ఆర్యదాసుగారు, డబిల్యూ. ఏ.

సింహళద్వీపమునందలి 'గలి' అను గ్రామ మీతనిజన్మస్థానము. అచ్చట మహిందాకాలేజిలో విద్య నభ్యసించి యంత్రనిర్మాణ శాస్త్రమునం దభిరుచి కలవారగుటచే అచ్చటినుండి యాంధ్రదేశమునందలి బందరున గల ఇంజనీరింగు కలాశాలకు వచ్చి అచ్చట యంత్రనిర్మాణశాస్త్రమును చక్కగా నభ్యసించి అచ్చటనే అసిస్టాంటు ఇంజనీరుగా కొంతకాలము పనిచేసిరి. బందరులో చదువుకొనుచున్న కాలముననే కలిమ జాతీయకలాశాలకుబోయి అచ్చట చిత్రవిద్యనుగూడ నేర్చికొనిరి. వీరి చిత్రములు (రేఖాచిత్రములు, వర్ణచిత్రములు మున్నగునవి) చాలగా భారతి, గృహలక్ష్మి మొదలైన తెలుగుపత్రికలందును కొన్ని ఇంగ్లీషు పత్రికలందును ప్రకటితము లగుచుండును. వీరు, అప్పుడప్పుడు హెల్తు కౌన్సిలువారికి హెల్తు ఎగ్జిబిషనులకు మూడేండ్లు బొమ్మలువ్రాసియిచ్చి వారిమెప్పునుపొంది వారిచే నొక బంగారుపతకమును బడసిరి. ఇపుడు నగలవర్తకమున సుప్రసిద్ధులైన సురాజ్ మల్ ల్లూభాయికంపెని(చెన్నపురి)లో నగలకు క్రొత్తక్రొత్తనమూనాలు (Designs)తయారుచేయుచున్నారు. వీరిచిత్రములుకొన్ని పేరుగన్నవి.

### కనకయ్యగారు, కె.

వీ రొక యఫ్. యల్. తరగతియందలి విద్యార్థి. చెన్నపురి వ్యాయామప్రవీణ ప్రొఫెసరు బులుసు రామజోగారావుగారి శిష్యుడు.

### కమలగారు, యస్.

ఆంధ్రవిశ్వవిద్యాలయమున పట్టభద్రురాలైన ఆంధ్ర యువతీమణి.

### కాంచీ కామకోటి పీఠాధీశ్వర జగద్గురు శ్రీమచ్చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీస్వాములవారు.

శ్రీవారు శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యవర్య జగద్గురు పరంపరకు చెందినవారు. కొన్నియేండ్ల నుండి వీరు ద్రావిడమండలమున సంచారముచేయుచు సనాతనధర్మ ప్రచారము కావించుచున్నారు. శ్రీవారు బహుశాస్త్రపారంగతులు; బహుభాషాకోవిదులు; ఉదారాశయులు; ప్రశాంతమూర్తులు; ప్రతిభావంతులు. శ్రీ కాంచీ కామాక్షీదేవాలయ పునరుద్ధరణము కావింప తలపెట్టియున్నారు. తదర్థము వలసిన ధనము సేకరింప నాంధ్రమండలములకుగూడ ప్రకృతము తమశిష్యవర్గమును పంపియున్నారు. ఆంధ్రుల యథాశక్తి ధనసాహాయ్యము నిందుల కావశ్యకము కాకపోదు.

### కమ్మయువజనసంఘ హిందీపాఠశాల- అయితానగరప్పాళెం- తెనాలి

ఈ చిత్రమున మధ్యనుకూర్చున్నవారు శ్రీ యెలమంచిలి వెంకటప్పయ్యచౌదరిగారు, ఉపాధ్యాయులు.

### కామాక్షమ్మగారు, బత్తుల

ఈమె విద్వాన్ పరీక్షయందు కృతార్థురాలైన యాంధ్రయువతీమణి.

### కిట్టీ శివరావుగారు

ఈమె శివరావుగారిసతి; ఆస్ట్రేలియాను నారీమణి. కాశీలోని స్త్రీల థియసాఫికల్ కళాశాలలో నుద్యోగమున నున్నది.

### కుప్పుస్వామిచౌదరిగారు, జాగర్లమూడి

వీరు పదియవ కమ్మమహాజనసభా ప్రారంభోత్సవమును జరపిరి.

### కుమారస్వామిశెట్టిగారు, పిట్టి, బి. యే.

వీరు త్యాగరాయ శెట్టిగారి కుమారులు. రెండవ అఖిలభారత దేవాంగ మహాసభ కధ్యక్షులు, కోయంబత్తూరు.

### కృష్ణమూర్తిగారు, దామోదర, బి. ఏ., బి. యల్.

వీరు పద్మశాలి సంఘమునకు జెందినవారు. వీరు నాలుగేండ్ల నుండి కాకినాడ మునిసిపాలిటీకి ఛేర్మనుగా నున్నారు. కడచిన అఖిల భారత పద్మశాలి ఆరవమహాసభ కధ్యక్షులు. కాకినాడయందున్న సుప్రసిద్ధ న్యాయవాదులలో నొకరు.

### కృష్ణరావుగారు, కర్లపాలెం

వీరు చీరాలలోని సారస్వత సమితికి కార్యదర్శిగా నున్నారు.

### కౌసుకుట్టికన్యగారు, సి. కె., బి. యే.

బి. యే పరీక్షలో హిస్టరీ, ఎకనమిక్స్ శాఖలలో సర్వోత్తమురాలుగా విజయము గాంచెను.

### గోపాలకృష్ణగారు, పల్లెంపాటి (డాక్టరు)

బొంబాయిలో మిలిటరీ యింజనీరింగ్ శాఖ నందుద్యోగమున నున్న శ్రీ పి. లక్ష్మీనారాయణగారి కుమారులు. వీరు న్యూయార్కునందలి యితాకా విశ్వవిద్యాలయమున వ్యవసాయశాస్త్రములో డాక్టరు బిరుదునుపొందిరి. వీరు ది ఫస్టు ఇంటర్నేషనలు కాంగ్రెసు ఆఫ్ సాయిలుసైన్సు (The first international congress of soil science) లో హిందూదేశప్రతినిధిగా నుండిరి. న్యూయార్కునుండి యూరపునకుపోయి యచ్చటచ్చట వ్యవసాయ కళాశాలలయందు వ్యవసాయ ప్రయోగశాలలయందును కొంతయనుభవమును గడించిరి. ప్యారిసులోను లీప్జిగులోను వ్యవసాయమున కొత్తపద్ధతులను కొన్నిటిని కనిపెట్టిరి. ప్రస్తుతము డాక్టరుగారు బొంబాయి ప్రభుత్వము క్రింద సాయిల్ రీసర్చి స్పెషలిష్టుగా పనిచేయుచున్నారు.

### గోపాలాచార్లు, ఉడుపిక్షేత్ర నివాసులు

ఉడుపి మఠమునందున్న మధ్వ బ్రాహ్మణులు. వీరు పదిసంవత్సరములు కాశ్యాదిదివ్యక్షేత్రయాత్రలుచేసివచ్చి యిప్పుడు ౧౩ సం॥ ములుగ నచ్చటనేయున్నారు. ఈమహనీయుడు యాచ్ఞాదైన్యము నెరుగని కష్టజీవి. కష్టార్జితమగు ధనము సుమారు ౧౫ వేలవరకు వెచ్చించి పెక్కు ధర్మకార్యములనుచేసిరి. ఇపుడు లక్షతులసిపూజ చేయుచున్నారు.

### చిత్రగారు, వి. ఆర్.

వీరు విశాఖపట్టణమువారు. చిన్నవయసుననే శాంతినికేతనమునకు పోయి చిత్రవిద్య నభ్యసించినారు. వీరిపుడు చెన్నపట్టణమునందలి చిత్రకళాశాలలో నుపాధ్యాయులుగ నున్నారు. వీరి చిత్రములు (త్రివర్ణచిత్రములు, ఏకవర్ణ చిత్రములు) తరచుగ భారతి, ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక మొదలగు తెలుగుపత్రికలందును, హిందూ మొదలైన యాంగ్లపత్రికలందును ప్రకటితము లగుచుండును. వీరి చిత్రములు కొన్ని పేరుపొందినవి.

### చిన్నలక్ష్మమ్మగారు

ఈమె అనంతపురముజిల్లా విద్యాసంఘమునందు మెంబరుగ నున్నారు.

### జగన్నాధరావుగారు, నడింపల్లి

నరసారావుపేటలో వీరు న్యాయవాదిగా నున్నారు. ఆంధ్ర సామ్రాజ్యము, కొండవీటి సామ్రాజ్యము, చేజెర్ల మాహాత్మ్యము మొదలగు నాంధ్రచారిత్రక గ్రంథములను రచియించినవారు. ఇంకను చరిత్రపరిశోధనను సల్పుచున్నారు.

### జోసఫ్, యస్. డి.-బి. ఏ., బి. ఇ. డి.

వీరు పూర్వ మాదిమాంధ్రులు. ఉత్తరసర్కారుల క్రైస్తవ మహాజనసభకు కార్యదర్శులుగానుండి నిమ్నజాత్యుద్ధరణము చేయుచున్నారు. చిత్రమున నట్టనడుమ నిలువబడియున్నవారే వీరు.

### తమ్మిరెడ్డిగారు, బి. ఎ.-రా. సా.

బళ్లారిజిల్లా ఆదవానితాలూకాబోర్డు ప్రెసిడెంటుగానున్నారు.

### తెనాలి సంస్కృతకళాశాలా పండితబృందము

శ్రీ కం. రామమూర్తిశాస్త్రి గారు (వ్యాకరణాచార్య) ప్రిన్సిపాలు శ్రీ త్రి. వీరరాఘవస్వామిగారు వైసుప్రిన్సిపాలు.

### నరసింహారావుపంతులుగారు, బి. యే., మారేమండ

వీరు సికింద్రాబాదు వాస్తవ్యులు. వీరు యన్.జి. యస్.రైల్వే కంపెనీలో డెప్యూటీ ఆడిటరుగా నున్నారు. వీరీనడుమ ఇంగ్లాండు ఐర్లండు మొదలగు విదేశములందు సంచారముకావించి వచ్చినారు.

### నరసింహశర్మగారు, కవిరత్న, సాహిత్యసరస్వతి

వీరు భగవద్గీత పరీక్షలో ఉత్తముడుగా కడతేరి బెజవాడలోని యస్. బి. యన్. సమాజమువారిచేత బంగారు పతకమును బడసిరి. మరియు నొక రజతపాత్రమును మరియొక ప్రత్యేక బహుమానమును బడసిరి.

### నరసింహచౌదరిగారు, నూతులపాటి (శతశిల్పి)

వీరికి ఈ సంవత్సరమునజరగిన పదియవ కమ్మమహాసభలో సువర్ణ గండపెండేరము బహూకృతమైనది.

### నరసింహాచార్యులుగారు, చక్రవర్తుల, ఎ. ఆర్. ఎ. సి.
### ఆయుర్వేద వైద్యభూషణ, వైద్యవిద్వాన్.

వీరు బెజవాడయందలి శ్రీరామమోహన ఆయుర్వేద ధర్మవైద్యశాలలో సీనియరు డాక్టరుగా నున్నారు. వీరి కాంధ్రాయుర్వేద విద్యాపీఠ పరీక్షలలో నుత్తములుగ నుత్తీర్ణులైనందున సువర్ణపతకము బహుమానముగ లభించినది.

### నల్లముత్తుఅమ్మాళ్ సి. యన్. కన్యవీడుకోలు

ఈమె రాజమండ్రి స్త్రీలట్రైనింగుస్కూలులో ప్రధానోపాధ్యాయినిగానుండి చెన్నపురి లేడీ విల్లింగ్డన్ ట్రైనింగ్ కళాశాల కుపాధ్యాయినిగా నియమింపబడినది. శ్రీమతి అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారి సతి (రాజమండ్రి) ఈమెకు వీడుకోలువిందు నొసగినది.

### నాగరత్నం శ్రేష్ఠిగారు, తూనుగుంట్ల

బ్యాంకరు, జనరలుమర్చెంటు, మునిసిపలు కౌన్సలర్, వైశ్య వ్యాయామ కళాశాల కధ్యక్షులు, గుంటూరు.

### నారాయణాచార్లుగారు, యన్.

వీరిది అనంతపురముజిల్లా తాడిపత్రి గ్రామము. విశ్వబ్రాహ్మణ కుటుంబమువారు. విశ్వబ్రాహ్మణ మతప్రచారకులుగ నున్నారు.

### పట్టాభిరామయ్య చౌదరిగారు, కొమ్మారెడ్డి

వీరు పదియవ కమ్మమహాజనసభ కాహ్వానసంఘాధ్యక్షులు.

### పద్మాబాయి సంజీవరావు, బెనగలు, బి. యే, అలహాబాదు

ఈమె చెన్నరాజధానిలోని మంగళూరునకు చెందినది, కాశీలోని స్త్రీకళాశాలకు ప్రిన్సిపాలు; ఈమె కైజరీ హింద్ (ఉత్తమ శ్రేణి) బంగారు పతకమును ప్రభుత్వమువారివలన బడసినది.

### ప్రకాశరావుచౌదరి గారు
### పోసాని, బి. యస్‌సి, (ఆనర్సు)

వీరు గుంటూరు తాలూకాబోర్డు ప్రెసిడెంటుగా నెన్నుకొనబడినారు.

### పాపన్నగుప్తగారు, యం. వి.

వీరు మదనపల్లె నివాసులు. ఆర్యవైశ్య బాలవితంతూద్వాహ సభా కార్యదర్శి. ఆర్యవైశ్య యువజనసంఘపక్షమున వెలువడు "వాసవి" పత్రికా కార్యనిర్వాహసభకు కార్యదర్శిగా నెన్నుకొనబడిరి.

### పార్వతి అమ్మగారు కె.

ఈమె క్రాంగనూరు వాస్తవ్యురాలు. బి. యే. పరీక్షయందు రసాయనశాస్త్రమున మొదటి తరగతియం దుత్తీర్ణయైనది. ఈమె ఇంగ్లాండునకువెళ్లి విద్యాభ్యాసమును గావించెడిని.

### పుట్టన్నగారు, డి. యస్. (డాక్టరు)
### బి. ఎ, యఫ్. ఆర్. సి. యస్. ఇ.

వీరు మైసూరువారు. కోయంబత్తూరున రెండవ అఖిలభారత దేవాంగమహాసభాసమయమున జరిగిన యువజన సమావేశమున కధ్యక్షులు.

### పూర్ణయ్యగారు, సెనగపాటి

గుంటూరు నివాసులు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలయందు మంచిపాండిత్యముగల విశ్వబ్రాహ్మణులు. వీరు జిల్లాకోర్టులో సూపరింటెండెంటు మొదలైన యుద్యోగముల నుండిరి. వీరు సెనగపాటి పూర్ణయ్యాశ్రమ మనుపేర నొకయాశ్రమమును ౧౯౨౮ సం. స్థాపించియందు అన్ని జాతుల బాలబాలికలకు కొంతకాల ముచితముగ ప్రాథమికవిద్యను చెప్పించిరి. తమకున్న యాస్తినంతయు, మరియు తామగడించుచున్న జీతమును శ్రీ సెనగపాటి పూర్ణయ్య అన్నపూర్ణాదేవుల విద్యార్థివేతనము లనుపేర ప్రతిసంవత్సరమును బీదవిశ్వబ్రాహ్మణ విద్యార్థులకు విద్యార్థివేతనముగ నొసగుచున్నారు. ఈ యాశ్రమముననే విద్యార్థుల కొక హాస్టలు కలదు. వీరు నిరంతరము సత్కార్యాచరణ దీక్షాపరాయణులై యుండువారు.

### ఫెలీసియా, దేవసహాయం కన్యగారు

ఈమె చెన్నపురి ప్రెసిడెన్సీకళాశాలలో బి. యే. (ఆనర్సు) పరీక్షలో కృతార్థురాలై డాక్టరు టి. యం. నాయరుగారి బంగారు పతకమును బహుమానముగా గడించినది.

### బాపన్నగారు, శ్రీపాద

సామర్లకోట పురపాలక సంఘమునకు 1918 నుండి 1924 వర కధ్యక్షులుగనుండి యచ్చట నొక యున్నత విద్యాలయమును నెలకొన జేసినారు. 1924 మొదలు కోఆపరేటివ్ సంఘముల యభివృద్ధికై మిగుల పాటు పడుచున్నారు. ప్రజాహితపరాయణులు.

### బాలసుందరంశెట్టి సతిగారు

ఈమె అఖిలభారతదేవాంగ స్త్రీమహాసభ ఆహ్వానసంఘమునకు అధ్యక్షురాలు. జిల్లా విద్యాసంఘమున నొక మెంబరు; మరియు ఆనరరి మేజస్ట్రేటుగా నున్నారు

### బాలా త్రిపురసుందరమ్మగారు, అయ్యదేవర

వీరిది కృష్ణాజిల్లాలోని నందిగామ గ్రామము. ఈమె శ్రీ కాళేశ్వరరావుపంతులుగారి మరదలు. మంచి దేశాభిమానముగల యువతీమణి. గృహలక్ష్మి, హిందూసుందరి మొదలగు పత్రికలయందు నీమె వ్యాసములు ప్రకటితము లగుచుండును. మదరాసులో జరగిన

కాంగ్రెసు మహాసభయందుకూడ స్త్రీ వాలంటీరుగా నీమె సేవ చేసి యుండెను.

### బాల్యవివాహ నిరోధశాసనమును బలపరచు స్త్రీల మహాసభ, చెన్నపురి.

ఈ సభయందు విమెన్స్ ఇండియన్ అసోసియేషన్, మదర్స్ యూనియన్, ఇండియన్ లేడీస్ సమాజ్, విమెన్స్ గ్రాడుయేట్సు అసోసియేషన్ మొదలైన సంఘములవారు ఇందు గలరు.

### బాల్యవివాహ నిరోధశాసనమును ఖండించు స్త్రీల మహాసభ.

చెన్నపురి సనాతనధర్మసభ. హిందూలేడీస్ లక్ష్మీవిలాససభ తరపున జరిగినది. అధ్యక్షురాలు ఎ. వేదాచల అయ్యరు సతి.

### భారత మహిళా శారదా సమాజము, అనంతపురము

పదియవ వర్ష వర్ధంతినాడు తీసిన ఛాయాచిత్రము. ఆర్.యస్. కృష్ణస్వామయ్యరుగారి సతీమణి అధ్యక్షురాలు.

### మిల్సుకన్య యమ్. యమ్. గారికి సన్మానము

ఈమె చెన్నపురికివచ్చినపుడు వై. డబ్ల్యు. సి. ఎ. వారు సన్మానించిరి. అపుడు తీసినఛాయా చిత్రము. మిల్సుకన్యగారు వరల్డ్సు వై. డబ్ల్యు. సి. ఏ. కు ఇంటర్నేషనల్ సెక్రెటరీ.

### మునుస్వామిచౌదరిగారు, బొల్లిని

పదియవ కమ్మమహాజనసభ కధ్యక్షులు.

### రమణాబాయమ్మగారు, తాడూరి

ఈమెకు తెలుగు, ఇంగ్లీషు, హిందీభాషలయందు పాండిత్యము కలదు. పెక్కు సంవత్సరములకు ముందునుండి జాతీయోద్యమాభివృద్ధికి పాటుపడుచున్నారు. స్త్రీసంఘాభివృద్ధికిని పాటుపడుచున్నారు.

### రాజమన్నారుకవిగారు, కార్యమపూడి, శతావధాని కీ. శే.

వీరు ఆంధ్రగీర్వాణ సాహిత్యములయందద్వితీయ ప్రతిభ గలవారు. పద్మశాలి కులమువారు, చతుర్విధకవితావిశారదులు. గద్వాల, పిఠాపురము మొదలైన రాజాస్థానములందు శతావధానము నొనరించి బహూకరింపబడినారు. వీరు బహుగ్రంథములను రచియించినవారు, వీరియ ముద్రిత గ్రంథములను జీవితచరిత్రమును ప్రకటించుటకు వీరిజన్మభూమి యగు చీరాల గ్రామమున నొక గ్రంథాలయము స్థాపితమైనది.

### రామచంద్రనాయక్, వామన్

ఒక హైదరాబాదు జాగీరుదారులు. సువర్ణోత్సవ (గోల్డన్ జూబిలీ) సందర్భమున విద్యాభివృద్ధికొరకును సాంఘికాభివృద్ధికొరకును ఇరువదియైదువేల రూపాయల నుచితముగ నొసగిరి. వీరును సంఘ సంస్కార ప్రియులు.

### రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, యమ్.

వీరిది చాగలమర్రి కర్నూలు జిల్లా. వీరు సహాయనిరాకరణ పక్షమువారు. స్వగ్రామమున రాత్రిపాఠశాల నొకదానిని స్థాపించి పాటకపు జనులకు విద్యను నేర్పించుచున్నారు. నంద్యాలలోను, సొంతముగ ముద్రణాలయమును బెట్టుకొని 'హిందూ శ్రీ' అను మాసపత్రికను ప్రకటించుచున్నారు. బాలభారతీ గ్రంథ నిలయమను పేర నొక గ్రంథమండలిని స్థాపించి అందు రెండు నెలల కొకటివంతున నవలలను ప్రకటించుచున్నారు. మరియు చాగలమర్రి నుండి వెలువడు నవశక్తి యను పత్రికకు సంపాదకులుగను ప్రొద్దుటూరు నుండి వెలువడు 'భారతకథానిధి' యను మాసపత్రికకు ప్రకాశకులుగను నున్నారు. బాలభారతీ విలాసమను పేర కీ॥ శే॥ తమతండ్రిగారి జ్ఞాపకార్థ మొక సత్రమును గట్టించి యందన్నదానము చేయుచున్నారు.

### లక్ష్మీదేవి అమ్మగారు, డి.

ఈమెది బళ్లారి. నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్ వారి వ్యాస రచనా సంబంధమగు పోటీపరీక్షయందు కేసరిగారి బంగారుపతకమును పొందిన యువతీమణి.

### లక్ష్మీనరసమ్మగారు

ఆంధ్రవిశ్వవిద్యాలయమున పట్టభద్రురాలైన యువతీమణి.

### లూథియాదేవిగారు, పంతగాని, కీ. శే.

పి. సామ్యుయేలు శాస్త్రులుగారి ధర్మపత్ని. ఈమె ఉయ్యూరు నందలి కెనెడియను బాప్టిస్టు మిషనున బోర్డింగు సూపర్ వైజరుగా ౧౮౮౭వ సంవత్సరమున ప్రవేశించి తనకు ౭౫ సంవత్సరములు వయస్సు అగువరకు ఆయుద్యోగమునందే యుండి నిమ్నజాత్యుద్ధరణమునకయి మిగుల పాటుబడినది. సంస్కృతాంధ్రాంగ్లములయందు మంచి ప్రవేశము గలిగి జీవితమును పరోపకారపరముగ గడపిన సతీమణి.

### లోకనాథంపంతులుగారు, రావుల

వీరు చీరాల మునిసిపల్ కౌన్సిలుకు వైస్ ఛైర్మనుగానున్నారు. మరికొన్ని జిల్లాలోని కొన్ని యితర సంఘములలో మెంబరుగానున్నారు.

### విక్టోరియా హిందూ వితంతు శరణాలయము— రాజమహేంద్రవరము

స్థాపకులు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు. ఇందు పదునైదుగురు బాలికలున్నారు. వారిలో పదునల్గురు వితంతువులు.

ఒకతె యవివాహిత. వీరిలో బ్రాహ్మణులు పదునొకండుగురు; బ్రాహ్మణేతరులు నలుగురు. ఇద్దరు ఇంటరు జూనియరు, ఒకరు స్కూలు ఫైనలు, నలుగురు ఫస్టుఫారము, ముగ్గురు ఎలిమెంటరీ ట్రైనింగు తరగతి, మరియొకరు రెండవ తరగతి చదువుచున్నారు. తక్కిన నలుగురు ఉన్నతములగు తరగతులలో జేరునిమిత్తము శిక్షణాలయమునందే చదువుకొనుచున్నారు. ఒక బాలికకు కడచిన నవంబరులో వివాహమైనది.

## విమెన్స్ ఇండియన్ అసోసియేషన్, చెన్నపురి

ఈచిత్రము ఈ సభ వర్షవర్ధంతినాటిది బిసెంటుగా రధ్యక్షురాలు.

## విశ్వనాథముగారు, ముద్దా

విశాఖపట్టణముజిల్లా మేలుపాక గ్రామనివాసులు. కవితాసమితిసభ్యులు. ఆంధ్రాంగ్లములయందు ప్రవేశము గలవారు. భారతి మొదలైన పత్రికలయందు వీరి వ్యాసములు ప్రకటితము లగుచుండును. ఈసంచికయందు ప్రకటితమయిన 'ఛాయ' అనునాటకము వీరు రచియించినది.

## వీరభద్రేశ్వరశర్మ, చిదిరెమఠము

సాహిత్యవిశారద, పండిత బిరుదాంచితులు. వీరి స్వగ్రామము నల్లగొండ. కాని యిపుడు కాశీయందున్నారు. కడచిన వేసవియందు వీరు హిమాలయపర్వతమందలి గంగోత్తరి, యమునోత్తరి, బదరీనాథ్ మొదలగు క్షేత్రములకు కాలినడకను పోయివచ్చినారు. వీరు తమ యాత్రావిశేషములను కేదారఖండయాత్రయను పేర గ్రంథరూపమున వెలువడజేయనున్నారు.

## వెంకటప్పయ్యపంతులుగారు, బొడ్డపాటి

శ్రీ రామమోహన ఆయుర్వేద ధర్మవైద్యశాలను, కళాశాలను స్థాపించి వాటి యభివృద్ధికి మిక్కిలి కృషిచేయుచున్నారు.

## వెంకటరత్నముగారు సోడిశెట్టి (కీ. శే.)

వీరిది రాజమహేంద్రవరము. వైశ్యకులమువారు. వీ రుదారపురుషులు. రాజమండ్రి అన్నదానసమాజమున కధిపతిగనుండి ప్రతి అమావాస్యదినమున సుమారు వేయిమంది బీదలకన్న మిడుచుండువారు. రాజమహేంద్ర పురపాలకసంఘసభ్యులుగ నుండినవారు.

## వెంకటసుబ్బారావుగారు, అంకాల

వీరు వెలమవారు. చిత్రకళయందు మంచి ప్రవేశముకలవారు. వీరు పోటీపరీక్షయందు గెలిచి సంపాదించిన వ్యవసాయశాఖయందలి యుద్యోగమును చిత్రకళను పెంపొందించుకొనుటకై వదలుకొన్నారు. వీరి చిత్రములు కొన్ని ప్రశంసనుగాంచినవి. వీరు భీమవరం హైస్కూలునందు చిత్రకళోపాధ్యాయులుగా నున్నారు.

## వెంకటాద్రి, సింగంపల్లి

వీరిది బాపట్ల. వీరు వివిధవిషయములను గూర్చిన వ్యాసములను పెక్కు తెలుగుపత్రికలయందు వ్రాయుచుందురు. వీరి వ్యాసములు చాలావర కనువాదములుగనే యుండును.

## వెంకాజీరావుగారు, టి.

టేకుమళ్ల రాఘవరావుపంతులు గారి కుమారులు. జననము 1897. బి. యే. పరీక్షయందుత్తీర్ణులైనవెనుక రహస్యంగా కలకత్తా టిటాఘుర్ పేపరుమిల్సులో రోజుకు 10 అణాల కూలి మీదగను, జామ్‌షెడ్‌పూర్ (Iron works)లో లేబరేటరీ బోయిగా రోజుకు 12 అణాలకూలి మీద పనిచేసెను అటుపిదప ప్యారీ అండు కో అస్కా (sugar works)లోను, పాండిచేరి (Iron works) లోను పనిచేసెను. కర్నాటిక్ పేపరుమిల్సుకు మొదట కేన్వాసింగ్ ఏజంటుగాను, తరువాత D. P. wood క్రింద unpaid apprentice గాను, పిదప జి. కే. నాయుడు గారి క్రింద నెలకు రు. 35 వేతనము మీదను పనిచేసెను. బొంబాయికి canvassing కి పంపినప్పుడు బొంబాయి గిర్గాంపేపరు మిల్సులోను, పూనా Reary పేపరు మిల్సులోను రహస్యముగా పనిచేసెను. 1924 వరకు carnatic paper mills లో పిదప Mr. William Raitt F. C. S., M. I. Chem. E. Officer-in-charge of Paper, Pulp Section, Forest Research Institute and Government of India cellulose expert, క్రింద ట్రెయినింగు అవుటకు డేరాడూన్ వెళ్లెను. 1924 డేరాడూన్ 1925 కర్నాటిక్ పేపర్ మిల్సు రాజమండ్రి (U. S. A- Pulp and Paper Industry) టెక్నికల్ సెక్షన్ మెంబరు అయ్యెను. (Elected as a graduate of the Institution of chemical Engineers of Great Britain in 1926) న్యూయార్కు ట్రేడ్ జర్నలులో కాగితపు పరిశ్రమనుగురించి వ్యాసాలు వ్రాసినందువల్ల ఇండస్ట్రీస్ డైరెక్టరు ఖాన్ బహదరు బజులుల్లా, డిప్యూటీ డైరెక్టరు L. B. గ్రేన్ రాజమండ్రి కర్నాటిక్ పేపరు మిల్సుకువచ్చి పనిచూచి Foreign Countries కి పంపవాగ్దానము చేసిరి. గవర్నమెంటు స్కాలరుషిప్పుమీద గ్రేటుబ్రిటన్ మొదలైన విదేశములకు వెళ్లి కడచిననెల 16 వ తేదీన వచ్చినారు. విదేశములలోని ప్రధానమైన కాగితపు పారిశ్రామిక సంఘములలో సభ్యులుగా ఎన్నుకొనబడియున్నారు.

## వేంకట కాళిదాస కవులు

వీరు విజయనగరనివాసు లగు జంటకవులు. అభినవకవితాధోరణి కలవాటుపడినవారు. భారతి మొదలైన పత్రికలయందు సరసములగు వీరి ఖండకావ్యములు తఱచు ప్రకటింపబడుచుండును. 'మన్మథమూర్తి' యను వీరి రసవత్ఖండకావ్యము ఈ సంచికయందు ప్రకటితమై

నది. వీరి కవితాశక్తి నానాటికి పెంపొందుచుండుట వీరి రచనల యందు గాంచనగును.

## వేంకటకృష్ణ శతావధానిగారు, కార్యమపూడి

వీరు పేరాలవాస్తవ్యులగు పద్మశాలి వంశీయులు. వీరు కీ. శే. శతావధాని రాజమన్నారుగారి సోదరపుత్రులు. స్వసంఘాభివృద్ధికై యెక్కువ పాటుపడుచుందురు. వీరికి నాలుగవ పద్మశాలి మహాసభ వారు 'పద్మశాలి మహాసభా పితామహ' యని బిరుదము నిచ్చినారు. ఆంధ్రగీర్వాణ భాషలయందు ప్రవేశము కలవారు. కవితాధార గలవారు. శతావధానములను చేసియున్నారు.

## వేంకటసూర్యనారాయణ శర్మగారు, (రావుసాహేబు)

వీరు విశాఖమండలమునందలి వంతరాము గ్రామనివాసులు. ప్రకృతము గంజాము జిల్లా ఎగ్జక్యూటివ్ ఇంజనీయరుగా నున్నారు. శిష్టకులమునకు చెందినవారు. వీరికి ఇంజనీరింగునందుకల పాండిత్యముచేతను, తమయుద్యోగ ధర్మమును ప్రజానుకూలముగ నిర్వహించుటచేతను ఈ పదవిని పొందినారు. వీరు జ్యోతిర్విద్యావిశారదులు, దాత.

## వేంకటరమణయ్యగారు, పిసుపాటి, డాక్టరు

వీరు నెల్లూరు మండలమునకు చెందిన ఆంధ్రులు. వీరాంగ్ల వైద్యము నభ్యసించి పట్టభద్రులయి నైజామురాష్ట్రమునందలి హైదరాబాదు నగరమున నివసించుచు నచ్చట రెసిడెన్సిబజారున స్వీయ ఔషధాలయమును స్థాపించి వైద్యము చేయుచున్నారు. బీదవారికి ఉచితముగ వైద్యము చేయుదురు. నైజామురాష్ట్రాంధ్రుల అభ్యుదయముకొఱకు పాటుపడు ప్రముఖులలో వీరొకరు. సరసులు; ఉదారస్వభావము గలవారు. మన ఆంధ్రమండలములనుండి హైదరాబాదునకు పోవు నాంధ్రులకు వీరి గృహము స్వగృహము. ఎందఱికైన సాదరముగ నాతిథ్యము నొసగుదురు. వీరి సతీమణియు సుగుణములయందు వీరి కింతయైన తీసిపోవునదికాదు. ఈమె శాంతస్వరూపిణి, విసుగువేసటలు చెందక నిరంతరము అతిథులకు మృదుసోపేతముగ భోజనోపాహారాదులచే సత్కరించుచుండును. ఆపతి కాసతి, ఆసతి కాపతి యెంతయు తగినవారు. ఈ దంపతులకు చిరాయురష్టైశ్వర్యములను, ఇతోధికాతిథి సేవాపారాయణతను పరమేశ్వరు డనుగ్రహించుగాత!

## వేంకటేశ్వర్లుగారు, అనంతపంతుల, బి. ఏ., బి. యల్.

విశాఖపట్టణముజిల్లాలో పార్వతీపురములో వీరు ౧౮౯౨ సంవత్సరమున జన్మించిరి. విద్యాభ్యాసము నారంభించినదిమొదలు ప్రతి క్లాసున మొదటి తరగతివారుగ కృతార్థులగుచుండెడివారు. ఇరువది రెండుసంవత్సరముల ప్రాయమున బి. యల్. పరీక్షలో కృతార్థులైనారు. పదునారవయేటనుండి వీరు కవితజెప్పుచుండెడివారు. ఇరువది సంవత్సరముల ప్రాయమున వీరు రచించిన 'సరోజిని' యను నొక స్వతంత్రపద్యకావ్యము గత రెండు సంవత్సరములలో ఆంధ్రయూనివర్సిటీ ఇంటర్మిడియేటు క్లాసునకు పఠనీయగ్రంథముగా నుండెను. విద్వాన్ పరీక్షకుగూడ నదియే పఠనీయగ్రంథము. ఇదికాక యనేక ఖండకావ్యములను వీరు రచించియున్నారు. వకీలువృత్తిలోగూడ వీరు పెద్దపేరు పొందినవారు. గత సంవత్సరము అక్టోబరు ౨౧ తేదీని కలరాచే వీరు ముప్పది యారవయేట నకాలమరణము నొందినారు.

## వేదాంతాచారికన్యగారు, గ్రేసు

ఈమె కర్నూలు మునిసిపాలిటీకి మెంబరుగా నియమింపబడిరి.

## వైశ్య వ్యాయామ కళాశాల, గుంటూరు

1929 సం॥ము నవంబరు 30 వ తేదినాడు జరిగిన కలాశాలా చతుర్థవార్షికోత్సవసమయమున తీసిన ఛాయాచిత్రము. అధ్యక్షులు (కలాశాలాపాలకసంఘము) శ్రీ తూనుగుంట్ల నాగరత్నము శ్రేష్ఠిగారు, ఉత్సవసభాధ్యక్షులు కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు.

## షానోదేవి

జల్లందూరు కన్యా మహావిద్యాలయ ప్రధానోపాధ్యాయ. విద్యాలయముకొరకు లక్షరూపాయలను సంపాదింప నెంచి తూర్పు ఆఫ్రికాకు పోయి అచటనుండి వచ్చి మరల దక్షిణఆఫ్రికాకు పోయియున్నారు.

## శారదాకన్యగారు, జి. యస్., బి. యే., యల్. టి.

ఈమె చిత్తూరుజిల్లా ఎజుకేషనల్ కౌన్సిలుకు మెంబరుగా నియమింపబడిరి.

## శారదాలేడీస్ యూనియన్ వర్షవర్థంతి, తిరువల్లిక్కేణి

శ్రీ యస్. వి. రాఘవన్ (అకౌంటెంటు జనరల్) సతిగారధ్యక్షురాలు.

## శివరామయ్యగారు అన్నావఝ్ఝల (కీ. శే.)

వీరిది కృష్ణాజిల్లా పెడన. వీరశైవ మతప్రచారకులు. బసవ పురాణము స్కాందపురాణము మొదలగు శైవగ్రంథములను హరికథలుగా రచియించినారు. నిరతాన్నప్రదాత.

## శ్రీనివాసాచార్యులు, కదిరి

వీరు రాయలసీమవారు సహాయనిరాకరణవాదులు. రాయలసీమయందు ఖద్దరు నిర్మాణకార్యక్రమమునకును వ్యాప్తికిని తోడుపడుచుండువారు. సంఘసంస్కరణాభిలాషగలవారు. వీరు యువకు లగుటచే

రాయలసీమలో పెక్కు యువజనసమితులను స్థాపించుచున్నారు. దేశ సేవకులు.

### శేషగిరిరావుగారు, గుడిపాటి

కైకలూరు తాలూకాలోని కలిదిండి వేంకటాపురకాపురస్థులు. వ్యాయామమందును, మల్లవిద్యయందును నేర్పరులు. వీరు ఐస్తాదు పిన్నమరాజు రమణయ్యపంతులు గారి ప్రియశిష్యులు.

### షేక్స్పియర్ సింబలైను నాటకపాత్రధారులగు చెన్నపురి యువతీమణులు

తిరువల్లిక్కేణి శ్రీ శారదా విద్యాలయమునకొరకు ధనమును సంపాదింపగోరి యీనాటకము ప్రదర్శింపబడినది.

### సంస్కృతకళాశాల-తెనాలి

1913 సం॥మున స్థాపింపబడినది. ఈపాఠశాలకు కీ. శే. ముదిగొండ చంద్రమౌళిశాస్త్రిగారు తమ ధర్మసత్రమును సమర్పించినారు. పాఠశాలయందలి బాలురకు భోజనాదిసౌకర్యము లన్నట నిరంతరాయముగా జరుగుచుండును. ఇచ్చట నలువదిమంది బాలురు చదువుచున్నారు. దీనికి శ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారు ప్రధానోపాధ్యాయులు. శ్రీ పోతుమాచి శ్రీరామమూర్తిగారు ఈ కళాశాలను చక్కగా నడుపుచున్నారు.

### సంస్కృతోన్నతకళాశాల-ఆర్యాపురము-రాజమహేంద్రవరము

ఈ కళాశాల రాజమహేంద్రవరమున 1921 సం॥మున ప్రతిష్ఠింపబడినది. ఇచ్చట న్యాయమీమాంసావ్యాకరణాది శాస్త్రములను సాహిత్యమును, దేశచరిత్ర మన్నగునవియు నేర్పుచుందురు. ఇచ్చట పలువురు విద్యార్థులు ప్రాచ్యపరీక్షలందు కృతార్థులగుచున్నారు. నెల ఒకటింటికి నంసపాతికరూపాయలకు పైగా దీనికి వ్యయమగుచున్నది. తగినంత నాదాయము లేకున్నది. ప్రాచ్యవిద్యాభిమానులగు నాంధ్రులు యథోచితముగ ధనసాహాయ్యము గావింపవగును. ప్రస్తుత మిందు ప్రధానోపాధ్యాయులు శ్రీ గొడవర్తి శఠకోపాచార్యులు గారు, (తర్కశిరోమణి) గారు.

### సత్యనారాయణ శర్మగారు, గుడిపాటి

వీ రొక బాలకవి.

### సర్వేశ్వరలింగముగారు, కారుమూరిగారు.

వీరిది రాజమహేంద్రవరము. శ్రీ రామ బాలభక్త పుస్తకభాండాగార, వాఙ్మయ సేవాసంఘ సంయుక్తకార్యదర్శులు. ఈబాలభక్త వాఙ్మయ సేవాసంఘము ౭-౨-౧౯౨౩ సం.న స్థాపితమైనది.

### సాంబారెడ్డిగారు, సత్తి

వీరు పశ్చిమగోదావరిజిల్లా మారుటేరు నివాసులు. సహాయనిరాకరణవాదులు.

### సికంద్రాబాదు బాలికాపాఠశాలోపాధ్యాయులు

మిస్. షేరీఖాను, బి. యే., మిస్. మేరీ డేవిడ్. బి. యే., యల్. టి. ప్రధానోపాధ్యాయి, పి. కామేశ్వరమ్మ గారు బి. యే. వీరు ముప్వురును కడచిన సంవత్సరమున ఈ యుపాధ్యాయపదవులందు ప్రవేశించిరి.

### సీతారామయ్య చౌదరిగారు, వెలువోలు

వీరు తెనాలితాలూకా అమృతలూరు గ్రామనివాసులు. వీరు రచియించిన వ్యాసము లాంధ్రపత్రిక, భారతి మొదలగు తెలుగుపత్రికలయందు ప్రకటింపబడుచుండును. వీరు గ్రంథకర్తలు కూడను.

### శ్రీల సనాతనధర్మ సమావేశము, చెన్నపురి

ఈ సభ చెన్నపురి కన్యకాపరమేశ్వరీ దేవాలయమున జరిగినది. శ్రీ సత్యవతిదేవి అమ్మాళు అధ్యక్షురాలు.

### సుబ్బమ్మగారు, బి. కామాక్షమ్మగారు, బి.

సుబ్బమ్మగారు విశాఖపట్టణములోని మేరీహైస్కూలులో నాంధ్రోపాధ్యాయిగానున్నారు. కామాక్షమ్మగారు రాజమండ్రిలోని వైశ్యసేవాసదనమునకు సూపరింటెండెంటుగానున్నారు.

### సుబ్బమ్మ, సీతారత్నమ్మగార్లు, రాజమండ్రి

వీ రిరువురు దివ్యజ్ఞానసమాజ సభ్యురాండ్రు.

### సుబ్బారెడ్డిగారు, వెలగల

వీరిది పశ్చిమగోదావరిజిల్లా మారుటేరుగ్రామము. వీరు సహాయనిరాకరణవాదులు. దైవభక్తిపరాయణులు. చదువరికాకయే కొన్ని హరికథలను, కొన్ని శతకములను రచించిరట.

### శ్రీ చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బి. ఏ. (ఆనర్సు), ఏ. యస్. ఏ. ఏ.

వీరు సుప్రసిద్ధ రూపచిత్ర చిత్రకారులయిన చావలి నాగేశ్వరరావుగారికి సోదరులు. బొంబాయి విశ్వవిద్యాలయమున పట్టభద్రులై ఇంగ్లాండునకుపోయి అచ్చట ఇన్కార్పొరేటెడ్ అకౌంటెన్సీ పరీక్షయందు విజయమును గాంచి స్వదేశమునకు వచ్చిరి. చెన్నపట్టణమున ఆడిటరుగానున్నారు. వీరు విదేశమునందు గడించిన యీ ప్రత్యేకసామర్థ్యమును స్వదేశమగు నాంధ్రదేశముయొక్క అభివృద్ధికై వినియోగింతురుగాక!

### సూర్యకాంత సత్సంగినీగారు, పేరేపి, కీ. శే.

ఈ సాధ్వీలలామ సకలవిద్యల కాటపట్టయిన విజయనగరమున 11—8—1912 తేదినాడు జన్మించి చెన్నపురియందు పెరిగి "లేడీ విల్లింగ్డన్ ట్రెయినింగు" స్కూలునందు ఆంగ్లము మున్నగుభాషల నేర్చుకొని 1919 వ సంవత్సరమున అనగా నేడు వత్సరముల ప్రాయమున 'ఆగ్రా' దయాల్‌బాగునందుండు 'రాధాస్వామి' గురువర్యులచే నుపదేశమును బడసి యోగాభ్యాసము చేయుచుండెడిది. ఈమె యేడవ వత్సరమునుండియు సంగీతసాహిత్యము లభ్యసించుచు హిందీ, అరవము, ఆంగ్లము, ఆంధ్రము, సంస్కృతము మొదలగు వానియందు ప్రావీణ్యమును బడసి సహృదయుల మనంబుల రంజింపచేయుచుండెడిది. కళాశాలయందు చదువు కాలములలో నాటకములయందు బహుమతులు పొందినది. సంగీతమున, గాత్రము, హార్మోనియము, ఫిడేలు మున్నగువాని యందు మిగుల పాండిత్యమును సంపాదించి పేరువహించినది. మద్రాసునందలి సంగీతసభలలో మెంబరుగా నుండెడిది. ఈమెకు జ్యోతిషము, సాముద్రికము, కుట్టుపని, బెత్తపుపని, డ్రాయింగు మొదలయిన కళలయందు ప్రావీణ్యము కలదు. ఈమె చర్ఖామీద స్వయముగా నూలువడికి మగ్గముమీద నేయించి ఆవస్త్రములనే యుపయోగించుచుండెడిది. 1925 సం॥ జూను 10-తేదిని పేరేపి వెంకటసుబ్బయ్య, (యం. ఏ., బి. ఇ. డి.) గారిని (Mathematics Assistant Board High School, Gudur) వివాహముచేసికొనినది. ఈమె భిషగ్రాజవైద్య భాస్కర వేంకటేశ్వరరావు మాండలికగారి ఏకపుత్రిక. మహాజ్ఞాని. శాంతస్వభావముగలది. ఈ సతీమణి ౩౧-౧-౧౯౩౦ తేది శుక్రవారము ౯.౨౦ నిమిషములకు మదరాసునందు నిర్యాణమును జెందినది.

### సూర్యనారాయణమూర్తినాయుడుగారు, కొమ్మిరెడ్డి,బి.బ.

బెజవాడలో జరగిన ఆంధ్రసంగీత మహాసభ కధ్యక్షులు.

### సూర్యనారాయణగారు, నాగుమంత్రి. కీ॥ శే॥

వీరు విశాఖపట్టణము జిల్లా సర్వసిద్ధి తాలూకా కలవలపల్లి గ్రామవాసులు. శిష్టకరణకులమువారు. వీరు ధర్మకార్యముల గొన్నిటినిచేసి పేరుగాంచినవారు.

### సర్వేశలింగంగారు, కారుమూరు

వీరిది రాజమండ్రి.

### సత్యనారాయణగారు, పి.

వీరు రంగూనులో 40 వ నంబరువీధిలో 259 నంబరు ఇంట్లో నున్న ఆంధ్రులు. 'రంగూను డెయిలీన్యూస్' పత్రికకు పదిసంవత్సరములనుండి రిపోర్టర్లలో ప్రధానులుగా నున్నారు. తత్పూర్వము వీరు చెన్నపట్టణమున 'న్యూ ఇండియా' పత్రికకును, ఆంధ్రపత్రికకును రిపోర్టరుగా నుండిరి. వీరు జన్మస్థానము ఏలూరు

### శ్రీ విఘ్నేశ్వరాది యాంధ్రభజన కూటము

ఇది రంగూనులో పిరియా అన్నసదేశమున నున్నది.

### మిలిటరీ కళాశాలా విద్యార్థులు

౧ రామస్వామిగారు; వీరు గ్యారేజి కంపెనీ యజమాని సి. రాజంగారి కుమారులు, ౨ పంచరత్నంగారు; తిరుచినాపల్లి నివాసులు; విశ్వనాథయ్యరుగారి కుమారుడు. ౩ ప్రకాశరావుగారు; సుప్రసిద్ధులగు క్రికెటుయోధులు యం. వెంకటరామానుజంగారి కుమారులు. ౪ కె. కే. ప్యాలటుగారు, వీరు ప్రొఫెసరు కాండెతుగారి కుమారులు, సర్ శంకరనాయరుగారి మనుమలు. ఈనలుగురు డెహరాడూనులో నున్న మిలిటరీ కళాశాలయందు యుద్ధవిద్య నభ్యసింప నియమితులై కడచిన ఫిబ్రవరి 18 వ తేదీన బయలుదేరి డెహరాడూనుకు పోయిరి. అచట విద్య పూర్తియైన పిదప ఇంగ్లాండుకువెళ్లి అచ్చటను యుద్ధవిద్య నభ్యసింతురు.

---

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ ప్రమోదూతనామ సంవత్సర సిద్ధాంత పంచాంగము

శ్లో. శ్రీకల్యాణసుఖావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం, గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్;
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం, నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.







ఈ పంచాంగము

శ్రౌతస్మార్తశైవమార్గప్రవర్తకులు, జోస్యుల వంశార్ణవ పూర్ణశశాంకులు నగు
బ్రహ్మశ్రీ మల్లయారాధ్యులవారి పుత్త్రులిందును, బ్రహ్మశ్రీ కప్పా వేంకటకృష్ణశాస్త్రి,
యీ. నాగేశ్వరశాస్త్రులుగార్ల ప్రియశిష్యుండును నగు

## కనకయ్యా సిద్ధాంతిగారు గణించినది.

Ch. V. Sharma

ఆంధ్రపత్త్రికా ముద్రాశాలయందు ముద్రితమైనది.

## సంవత్సరఫలము

ఈ సంవత్సరమున చైత్ర వైశాఖమాసములం దప్పుడప్పుడు తుషారవృష్టి గలుగును. క్రమక్రమముగ నెండలు మెండై పశ్చిమవాయువు వీచ నారంభించును. జ్యేష్ఠమాసమున ఉష్ణాధిక్యము పశ్చిమవాయువు మెండుగనుండి అప్పుడప్పుడు స్వల్పవర్షము కురియును. ఆషాఢమాసమున సస్యానుకూలవృష్టియు, శ్రావణభాద్రపదములయందు సువృష్టియు, ఆశ్వయుజ కార్తికములయందు మధ్యవృష్టియు కలుగును. వడ్లు మొదలగు ధాన్యములు చక్కగ ఫలించును. జలధాన్యములు మెట్టధాన్యములు భాగుగ ఫలించును. పచ్చనిభూములు, ఎఱ్ఱభూములు బాగుగ ఫలించును. ప్రజలు రాజులవలనను వ్యాధులవలన బాధనొందెదరు. రాజులు యుద్ధాసక్తులగుదురు. అపరధాన్యములకు, నువ్వులు, నూనె మొదలగు వానికి ధరలు హెచ్చును. పశువులు క్షేమముగ నుండును. జ్యేష్ఠ శు ౯ మొదలు ఆషాఢ శు ౧౧ వరకు గురు మౌఢ్యము. కార్తిక బ ౧౧ మొదలు మార్గశీర్ష శు ౬ వఱకు పశ్చాదస్తమిత శుక్రమౌఢ్యము. ఆశ్వయుజ శు ౧౫లు స్వల్పమైన చంద్రగ్రహణము. జ్యేష్ఠ శు ౧ గురువారమున సరస్వతీనది పుష్కరప్రవేశము. మూడుతూముల వర్షము కురిసి పదివీసముల కెక్కుడుగా పంట ఫలించును.

స్వస్తి సర్వేజనాః సుఖినో భవంతు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## శ్రీగురుభ్యోనమః

వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే;
యన్నత్వా కృతకృత్యా స్స్యుస్తన్నమామి గజాననమ్.

అవాచ్యాత్మస్వరూపాయ శివభావ ప్రదాయినే;
నమః సద్గురునాథాయ షట్స్థల బ్రహ్మరూపిణే.

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్;
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః.

## గురుస్తవము

శ్రీకుప్పాన్వయవారిరాశిశశినా కౌండిన్యగోత్రాంచితౌ
విద్యార్థివ్రజవత్సలౌ సుచరితౌ సాంగత్రయీపారగౌ;
రాజద్రాజసుపూజితౌ సవినయం స్వాభ్యాత్రభాజౌ సురూ
ప్రాజ్ఞౌ వేంకటకృష్ణనామసుమనో నాగేశ్వరాఖ్యౌ భజే

## దైవజ్ఞవంశావళిః

శ్రీమజ్జ్యోత్స్నల వంశమౌక్తికమణి ర్బ్రహ్మాహేళజాలాగ్రణి
శ్శుద్ధాత్రేయ మహర్షి గోత్రమహితో మోహాదివిధ్వంసకృత్;
విశ్వఖ్యాత చరాశ్వలాయన మహర్షి ప్రోక్త సూత్రాంచిత
శ్శైవాచార పరాయణోహి కనకారాధ్య స్స ముజ్జృంభతే.
తస్య హ్యాత్మభవో భవాంఘ్రియుగళీసద్భక్తి కుంభోద్భవో
దూరోత్సారిత ధూర్తమానసరుచో యోగోల్లసత్ప్రాభవః;
సల్లీలాయుత మల్లికార్జున సమాఖ్యాఖ్యాత దిగ్వైభవో
దేశే మద్యతనే చకాస్తి పరవస్తూపాస్త్యపాస్తోద్భవః.
తస్యాహం తనయ స్సమిద్ధ వినయ స్సర్వేశ్వరాంఘ్రిద్వయీ
సేవాసాదిత తత్కృపాధిగత సత్యాత్మ ప్రబోధోదయ;
శ్రీమజ్జ్యోతిష తంత్రవారిధివిగాహోద్యగశుద్ధాత్రిశు
స్సాధుశ్రీ కనకాహ్వయో వ్యరచయన్ పంచాంగ మేత న్ముదా.

## సంవత్సరాది దివసకృత్యము

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నాన మాచరేత్;
వస్త్రై రాభరణై ర్దేహ మలంకృత్య తత శ్శుచిః.
విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞ మభిపూజ్యచ ;
సంవత్సరఫలం సమ్య క్ఛృత్వా విప్రాన్ సమర్చయేత్.

ఈ (ఆంధ్ర) దేశమున లోకవ్యవహారముకొఱకు చాంద్రమానాబ్దము గ్రహించునది. శేషాచలమునకు దక్షిణదేశమున సౌరమానాబ్దము గ్రహించునది. వింధ్యమున కుత్తరదేశమున బార్హస్పత్యమానాబ్దము గ్రహించునది. అంతటను గుర్జరదేశమున మార్గశీర్షాబ్దమును గ్రహించునది. చాంద్రమానము ననుసరించి ఈ సంవత్సరమునకు ప్రమోదూత నామ సంవత్సరమని పేరు:—సౌరమానము ననుసరించి చైత్ర శు ౧ మొదలు చైత్ర శు ౧౪ వరకు శుక్ల నామసంవత్సరమనియు, అటుపైని సంవత్సరాంతమువరకు ప్రమోదూత నామ సంవత్సరమనియు పేరు. బార్హస్పత్యమానము ననుసరించి, ఈసంవత్సర చైత్ర శు ౧ లగాయతు జ్యేష్ఠ బ ౫ వరకు వృషనామ సంవత్సరమనియు, అటుపైని చిత్రభాను సంవత్సరమనియు పేరు.

ఈ ప్రమోదూతనామసంవత్సరము నాటికి

| | |
|---|---|
| సృష్ట్యాదిగత సౌరాబ్దములు | ౧౯౫,౫౮,౮౫,౦౩౧ |
| కల్యాది గతాబ్దములు | ౫౦౩౧ |
| శాలివాహనశకగతాబ్దములు | ౧౮౫౩ |
| ప్రభవాది గతాబ్దములు | ౨ |
| హూణశకగతాబ్దములు | ౧౯౩౦-౩౧ |
| ఫసలీ | ౧౩౩౯–౧౩౪౦ |
| హిజిరి | ౧౩౪౦ |

అనుచున్నది.

సకలకల్యాణభాజన మైన ఈ ప్రమోదూతనామ సంవత్సరము నాటికి సౌరసిద్ధాంతము ననుసరించి ఆదిసృష్టికర్తయగు బ్రహ్మయొక్క పరమాయుష్యమున సగమునకుపైన మొదటి వత్సరమున, మొదటిమాసమున, మొదటి పక్షమున, మొదటిదివసమున పగలు, ౧౩ గడియలు ౪౨ విగడియలు గడచినది.

## చాంద్రమానాబ్దఫలము

శ్లో. సువృష్టి స్సర్వదేశానాం ధనధాన్యసమృద్ధయః;
క్షేమం సుభిక్ష మారోగ్యం ప్రమోదే ధర్మ ఈదృశః.

## సౌరమానాబ్దఫలము

శ్లో. శుక్లాబ్దే నిఖిలా లోకా స్సుఖిన స్సజనై స్సహ;
రాజానో యుద్ధనిరతా పరస్పరజయేచ్ఛయా.

ఈ ఫలము సంవత్సరారంభమునుండి చైత్ర శు ౧౪ వరకు.

తరువాత సంవత్సరాంతము వరకు పైన చెప్పిన చాంద్రమాన ప్రమోదూత సంవత్సరఫలమును జరుగును.

## బార్హస్పత్యమానాబ్దఫలము

శ్లో. వివిధై రన్నపానాద్యైః హృష్టపుష్టాంగచేతసః;
మదోన్మత్తాఽఖిలా లోకా వృషాబ్దే వృషసన్నిభాః.

ఈ ఫలము సంవత్సరారంభమునుండి జ్యేష్ఠ బ ౫ వరకు.

తరువాత సంవత్సరాంతము వరకు చిత్రభానుసంవత్సర ఫలము.

శ్లో. చిత్రార్ఘ వృష్టి స్సస్యాద్యై ర్విచిత్రా నిఖిలా ధరా;
నిరాకులాఖిలా లోకాః చిత్రభాన్వాఖ్యవత్సరే.

## గురూదయాబ్దఫలము

శ్లో. సోమవర్షే త్వనావృష్టిః సస్యహాని రనేకధా;
రాజానో యుద్ధనిరతా శ్చాన్యోన్యవనధకాంక్షిణః.

ఈ ప్రమోదూత సంవత్సరమునకు రాజు మొద లయిన పరిపాలక వర్గము-తత్ఫలము:

### రాజు-చంద్రుడు

శ్లో. సోమస్య రాజ్యే ఒఖిలలోకగేహా
కల్యాణకార్యాణి గవాం వివృద్ధిః;
వృష్టిప్రభూతా బహుసస్యసంపత్
సౌఖ్యం జనో విందతి రోగహానిః.

ఈ ఫలము విదర్భ పాంచాల సౌరాష్ట్రదేశముల కధికముగా కలుగును.

### మంత్రి-సూర్యుడు

శ్లో. సూర్యే ప్రధానే జ్వలితా ధరిత్రీ
క్షుధాభిభూతం జగ దల్పసస్యమ్;
మహోగ్రతా రోగభయం జనానాం
యుద్ధం నృపాణా మతులం సువృష్టిః.

ఈ ఫలము పౌండ్ర కళింగదేశములయం దధికముగా గలుగును.

### సేనాధిపతి-శుక్రుడు

శ్లో. సువృష్టి రత్యంతసమృద్ధసస్యం
సుభిక్ష మర్ఘం బహుళం ధరిత్ర్యాం;
నరాః స్త్రియః కామరతాః ప్రవృత్తాః
సైన్యాధిపత్యే ఖలు భార్గవస్య.

ఈ ఫలము అన్ని దేశములయందు ప్రాప్తించును.

### సస్యాధిపతి-బుధుడు

శ్లో. మధ్యవృష్టి ర్మందసస్యం మేఘా వాతేన పీడితాః;
త్రసంతి మనుజా నిత్యం బుధే సస్యాధిపే సతి.

ఈ ఫలము ఘూర్జరయవనదేశముల కెక్కుడుగా గలుగును.

### ప్రకారాంతరముగా-సస్యాధిపతిఫలము

శ్లో. జలధాన్యాని సర్వాణి స్థలధాన్యాని యానిచ;
పాండుభూమిస్తు ఫలితా బుధే సస్యాధిపే సతి.

### ధాన్యాధిపతి-చంద్రుడు

శ్లో. బహుక్షీరప్రదా గావః సర్వేవ్యాధివివర్జితాః;
సుభిక్షంచ మహావర్షం చంద్రే ధాన్యాధిపే సతి.

ఈ ఫలము అన్ని దేశములకు ప్రాప్తించును.

### అర్ఘాధిపతి-శని

శ్లో. వృష్టిస్తు మధ్యార్ఘపతౌ శనౌ చే
ద్వాతంకచోరాగ్నియుతా మహీ స్యాత్;
భయం భవే దన్నసమృద్ధి రల్పా
కృష్ణాని సస్యాని ఫలంతి భూమౌ.

ఈ ఫలము అన్ని దేశములకు ప్రాప్తించును.

### మేఘాధిపతి-సూర్యుడు

శ్లో. మహద్భయం ఫలం స్వల్పం వర్షంస్యాత్ ఖండమండలే;
రక్తసస్యం సుఫలితం సూర్యే మేఘాధిపే సతి.

ఈ ఫలము ఆంధ్రదేశమున కెక్కుడుగా కలుగును.

### రసాధిపతి-శుక్రుడు

శ్లో. సుగంధవస్తూని సితే రసేశే నిర్గంధవస్తూని రసాధికాని;
క్షీరాణి సర్వాణిచ కందమూలఫలానిపుష్పాణి బహూనిదస్యుః.

ఈఫలము కొంకణమాగధ దేశములకు ఎక్కువ ప్రాప్తించును.

### నీరసాధిపతి-బుధుడు

శ్లో. గారుత్మతాని రత్నాని ధాన్యాని వివిధానిచ;
సర్వాణి వృద్ధి మాయాంతి బుధే నీరసనాయకే.

[ఈఫలము మాళవదేశమున కెక్కువకలుగును.]

### పశుపాలకుడు-శ్రీకృష్ణుడు

శ్లో. పశువృద్ధి స్సుభిక్షంచ బహుసస్యార్ఘసంపదః;
సంపూర్ణత్వాగ్నివృష్టిశ్చ గోపాలే పశునాయకే.

### స్థానసంరక్షకుడు-బలరాముడు

శ్లో. బలభద్రే ప్రవర్ధనమ్.

### పురోహితుడు-బుధుడు

శ్లో. పురోహితే యదా సౌమ్యే బుద్ధియుక్తాః పురోహితాః;
జనానాం సుఖ మత్యంతం రాజాన స్సుఖసంయుతాః.

### పరీక్షకుడు-కుజుడు

శ్లో. చోరాగ్ని శస్త్రబాధాచ ఫలితా రక్తజాతయః;
రక్తద్రవ్యసమృద్ధి స్స్యా ద్భూమిసూనౌ పరీక్షకే.

### గణకుడు-గురువు

శ్లో. గణకేతు సురాచార్యే గణకా స్సూక్ష్మబుద్ధయః;
నరాణాం సుఖ మత్యంతం ద్విజా శ్చాధ్వరతత్పరాః.

### గ్రామపాలకుడు-సూర్యుడు

శ్లో. గ్రామాణాం పాలకే సూర్యే క్రూరాః స్యుర్గ్రామవల్లభాః;
ప్రజాపీడారతా నిత్యం మధ్యసస్యార్ఘ వృష్టయః.

భాగములు సామ్రాజ్యరక్షణమునకు సహాయము చేయవలసిన విధమును సామ్రాజ్యసభ నిరూపించినది. ఐరోపా మహాసంగ్రామమునకు మిత్ర మండలి 40,963,600,000 సవరనులును, శత్రుపక్షము 15,122,300,000 సవరనులును మొత్తము రెండు పక్షములును కలసి 56,086,900,000 సవరనులు వ్యయము చేసినవి. ఆవ్యయమునందు గ్రేటుబ్రిటను 11,076,000,000 సవరనులును, భరతవర్షము 687,100,000 సవరనులను భరించినవి. యుద్ధవ్యయము గ్రేటుబ్రిటనునందు తలకు 1800 రూప్యముల వంతునను. దేశసంపదలో 33 వంతునను గలిగినది. ఇంత దుర్భరమైనవ్యయము యుద్ధమునందు జేరిన యేయితర రాజ్యమునకును గలుగలేదు. దుర్భరమైన యీ సంగ్రామ వ్యయభారముతో గ్రేటుబ్రిటను క్రుంగిపోవుచున్నది. బ్రిటిషుసామ్రాజ్యము ప్రజాపోషణమునకు సాధనభూతములైన ఆహారపదార్థములను, ఖనిజములను, ముడివస్తువులను, పరిశ్రమలను, సహజసంపదలను గలిగి స్వయంపోషణమున కన్ని విధములను తగియున్నది.

గ్రేటుబ్రిటను 95,030 చదరపుమైళ్ల విస్తీర్ణమును 4,45,00,000 ప్రజలను గలిగి అఖండమైన సామ్రాజ్యాధిపత్యము ననుభవించుచున్నది. అఖండమైన సామ్రాజ్యాధిపత్యమును, జాతీయాహంకారము, సంగ్రామపరిణామమును గ్రేటుబ్రిటను స్థితిని దుర్భరము చేసినవి. ఐరోపా మహాసంగ్రామమువలన గ్రేటుబ్రిటనునకు లాభము కలిగినదో, నష్టము కలిగినదో నిర్ణయించుట దుస్తరముగ నున్నది. ఓడిపోయిన జర్మనుదేశము శుభస్థితియందున్నదో, గెలుపొందిన గ్రేటుబ్రిటను శుభస్థితియందున్నదో నిరూపించుట సాధ్యము గాకున్నది. ఐరోపామహాసంగ్రామము బ్రిటిషు పరిశ్రమలను, వ్యాపారములను స్తంభింపజేసినది. చిరకాలసంవర్ధితములైన సంపదలు నాశమును బొందినవి. ప్రపంచమునందు ఋణదాతగ నుండిన గ్రేటుబ్రిటను అప్పులపాలయినది. గ్రేటుబ్రిటను, స్వదేశస్థులకును విదేశస్థులకును 1928 సంవత్సరాంతమునందు 771,602,404 సవరనులు బాకీపడినది. ఆ మొత్తమునందు అమెరికా సంయుక్తరాష్ట్రములకు 109,52,29,463 సవరనులు బాకీపడినది. ఇతరదేశములు గ్రేటుబ్రిటనుకు 2,18,60,22,166 సవరనులు బాకీయున్నను "అప్పులక్కు-ఆకురాల్పు" అనుసామెత గ్రేటుబ్రిటను వ్యవహారములందు సార్థకమైనది. రుష్యా 17,4,62,74,182 సవరనుల అప్పును వివిధదేశములకును 62,20,00,000 సవరనులను గ్రేటుబ్రిటనుకు చెల్లించుటకు నిరాకరించినది. బ్రిటిషుప్రజలు 1913-14 సంవత్సరమునందు తల యొకటికి పౌ. 3-11-4 చొప్పునను చెల్లించిన పన్ను 1928—29 నందు తలయొకటికి పౌ. 15-2-8 వంతున పెరిగినవి. గ్రేటుబ్రిటనుకు 1928-9 రాబడి 818,041,000 సవరనులు, వ్యయము 836,635000 సవరనులు మద్యపానమునకై గ్రేటుబ్రిటనునందు 1929 సంవత్సరము నందు తలకు 129 షిల్లింగులచొప్పున 2,882,00,000 సవరనులు వ్యయ మైనవి. ఆయుధధారణభారము గ్రేటుబ్రిటనును పడద్రోయుచున్నను సామ్రాజ్యాభిమానము పెరుగుచున్నది కాని తగ్గుటలేదు. ఇట్టి విషమపరిస్థితులందు బ్రిటిషు రాజ్యాధికారు లితరరాజ్యములు కలిసివచ్చినను రాకపోయినను వారియావచ్ఛక్తిని ప్రపంచమునందు ఆయుధనిషేధమునకును, శాంతిస్థాపనమునకును వినియోగించుట శ్రేయస్కరము, వివేకము, ధర్మము.

**కార్మిక ప్రభుత్వము**

గతసంవత్సరమునందు జరిగిన యెన్నికలయందు కార్మికపక్షమునకు విజయము గలిగినది. ఎన్నికలందు కార్మికసభ్యులు 287, కన్సర్వేటివులు 260, లిబరలులు 59, ఇతరులు 9 స్థానములను బడసిరి. కార్మికుల కితరపక్షముల సహాయము లేకను పరిపాలించుటకు శక్తిలేదు. ఇతరపక్షముల కీయవకాశమైనను లేకున్నది. లిబరలుపక్షము కార్మికపక్షమును పోషించుట ధర్మమైనను లాయిడు జార్జిగారి నాయకత్వమున దుర్మార్గము నవలంబించుచున్నది. కార్మిక పక్షమునకు నాయకుడైన రామ్సె మెక్డొనాల్డు గారు మంత్రిపదవి నధిష్ఠించుట సహజమైనను మెక్డొనాల్డు గారి నాయకత్వము కార్మికపక్షమునకును, భరతవర్షమునకును,

ప్రపంచశాంతికిని సంతృప్తిని గలుగజేయజాలకున్నది. కార్మికపక్షమునం దతివాదులకు ప్రాతసంస్కారము గల మెక్డొనాల్డుగారిమీాదను విశ్వాసము గలుగకుండుట సహజము. గ్రేటుబ్రిటనులోని యన్నిపక్షములవారికిని భరతవర్షముమీాద గల ప్రేమ స్వార్థపరమైన ప్రేమ యను విషయము సర్వత్ర తెలిసినవిషయము. బ్రిటీషురాజ్యనీతిజ్ఞులకు స్వప్రయోజనములందుగల లక్ష్యము ప్రపంచశాంతిసంరక్షణమునందును భారత స్వాతంత్ర్యస్థాపనమునందును లే దనువిషయము సుప్రసిద్ధము. కార్మికపక్షము బ్రిటిషు రాజ్యనీతిలక్ష్యమును సాంఘిక రాజ్యాంగ పరములు చేయుటయును శాంతిసంరక్షణమునకు, మరల్చుటయును ప్రశంసనీయముగ నున్నది.

కార్మికపక్షము స్వశక్తిమీాద నాధారపడుటకు వీలు లేకపోయినను స్వల్పకాలములోనే చూపిన సాహసధైర్యములు ప్రశంసనీయములు కన్సర్వెటివుపక్షము ప్రతిషేధించిన సోవియటుప్రభుత్వముతో సంధిని చేసికొనుటయందు కార్మికపక్షము చూపిన దూరదృష్టి గ్రేటుబ్రిటనునకును రష్యాకును, ప్రయోజనకరము కాగలదు. గ్రేటుబ్రిటనులోని నిర్మాణపదార్థములకును, రష్యాయందలివ్యవసాయపదార్థములకును వినిమయము గల్గి రెండుదేశములును పూర్వమువలెనే లాభము బడయగలవు. కాని పూర్వమువలె బ్రిటిషురాజ్యతంత్రజ్ఞులు సంగ్రామపరికరముల విక్రయించి సోవియటుప్రభుత్వమును సంగ్రామరంగమునందు ప్రవేశపెట్టుటకు వీలు గలుగదని విశ్వసింపదగియున్నది. కార్మికపక్షము జర్మనుదేశము నాక్రమించిన బ్రిటిషు సైన్యములను స్వదేశములకు మరల్చి శాంతిస్థాపనకు తోడ్పడినది. నష్టపరిహారద్రవ్యమును నిర్ణయించుటయందును స్వీకరించుటయందును కోశాధ్యక్షుడు ఫిలిప్సు స్నోడన్‌గారు చూపిన సాహసధైర్యములు బ్రిటిషుప్రతిష్ఠను పెంపొందించినవి. కార్మికపక్షము భరతవర్షముపట్ల నితరపక్షములవలెనే నిరసనభావము చూపుచున్నను, ఆపక్ష మవలంబించుచున్న రాజ్యనీతి బ్రిటిషు ప్రపంచశాంతిని గాపాడుటకు తగియున్నది. ప్రపంచమునందలి నౌకాదళములను నియమించి దుర్భరసంగ్రామవ్యయభారమును తగ్గించుటకై కార్మికప్రభుత్వము చేయుచున్న ప్రయత్నములు శ్లాఘ్యముగ నున్నవి.

సంగ్రామము బ్రిటీషుపరిశ్రమలను వ్యాపారములను పాడుచేసిన విధమును గ్రేటుబ్రిటనునందు ప్రబలిన పరిశ్రమలక్షీణత, నిరుద్యోగులసంఖ్య విశదముచేయుచున్నది. గ్రేటుబ్రిటను శుభస్థితికి కీలకములైన బొగ్గుపనులు, ఇనుపపనులు, దూదిపనులు క్షీణించినవి. ఎగుమతులు క్షీణించుచు దిగుమతు లభివృద్ధిని జెందుచున్నవి. జర్మను ఫ్రాన్సుదేశములందు బొగ్గుపను లభివృద్ధిని జెందుచు గ్రేటుబ్రిటను పరిశ్రమను స్తంభింపజేసినవి. దూదిపరిశ్రమ గిరాకిలేక జపాను ఇటలీ మొదలగుదేశముల పోటీవలన క్షీణించుచున్నది. ఆదాయము తగ్గుచున్నను సంగ్రామసన్నాహములకును నితరవ్యవహారములకును వ్యయభార మభివృద్ధిని బొందుచున్నది. కోశాధిపతి ఫిలిపు స్నోడను గారీవిషయమునను సువ్యక్తము చేసిన లెక్కలు పరమవిషాదమును గలుగజేయుచున్నవి.

నౌకాదళమునకు ప్రపంచములోని రాజ్యములు సాలునకు 90,00,00,000 సవరనులను ఖర్చుపెట్టుచున్నవి. ఆవ్యయమునందు 100 కి 60 వంతులు యూరపురాజ్యములు, 20 వంతులు అమెరికా సంయుక్తరాష్ట్రములు, 20 వంతు లితరరాజ్యములు నౌకాదళభారములు వ్యయము చేయుచున్నవి. ఐరోపా యుద్ధమువలనను గ్రేటుబ్రిటనుకు ?00,00,00,000 సవరనులకు పైగా అప్పయినది. బ్రిటీషు ప్రజ లీయప్పును తీర్చుటకు దినమునకు 10,00,000, గంటకు 40,000, నిమిషమునకు 600 సవరనుల నీయవలసియున్నది. ఈరీతిగ తీర్చినను అప్పును తీర్చుటకు 150 ఏండ్లు పట్టును. దీనికి తోడు నౌకాదళసంరక్షణమునకు 11,50,00,000, పింఛనులకు 560,00,000 సవరనులు వ్యయమగుచున్నవి. సంగ్రామసన్నాహములకును పనివాండ్రకును నిమిషమునకు 1000 సవరనులు వ్యయమగుచున్నవి. దేశాదాయమునుండి మూడువంతులు సంగ్రామ

సన్నాహములకై వినియోగపడుచు ప్రజాస్థితి దుర్భరమగుచున్నది. గ్రేటుబ్రిటను మహాసామ్రాజ్యాధిపత్యఫలము ననుభవించుచున్న విధమును పైలెక్కలు చెప్పకచెప్పుచున్నవి. యూరపురాజ్యములు, గ్రేటుబ్రిటను మహాదుఃఖవేదన ననుభవించుచున్నను జ్ఞానోదయము గలుగలేదని యూరపురాజ్యములు చేయుచున్న సంగ్రామసన్నాహమును, గ్రేటుబ్రిటను అవలంబించుచున్న రాజనీతియును విశదముచేయుచున్నవి. ఇపుడైనను యూరపురాజ్యములకును, గ్రేటుబ్రిటనుకును జ్ఞానోదయము గలుగుటకు భగవదనుగ్రహము గలుగుగాత! ఇటలీ ఫ్రాన్సు రాజ్యములస్పర్ధ తగ్గి సమాధానము కుదురనపుడు గ్రేటుబ్రిటను జపాను అమెరికా సంయుక్తరాష్ట్రములు కలిసి సమాధానమును జేసికొనుటయును లోకశాంతికి ప్రయోజనకరము.

**ఆసియా ప్రబోధము**

జపాను _ రుష్యాయుద్ధముతో నారంభమైన యాసియా ప్రబోధమును ఐరోపా మహాసంగ్రామము వికసింపజేసినది. యూరపు రణరంగములం దాసియాసైనికులు యూరపియనుసైనికుల పటాటోపమును ప్రత్యక్షముగ గనుగొనగలిగిరి. యూరపియనుల ప్రతిష్ఠ మిథ్యాప్రతిష్ఠయని రణరంగములు విశదముచేసినవి. ఫ్రాన్సురణరంగములందును, ఇతర రణరంగములందును భారతయోధులు బ్రిటీషు యోధులవలెనే సామ్రాజ్యసంరక్షణమునకై ప్రాణములను సమర్పించి ఆత్మశక్తిని గనుగొనగలిగిరి. ఆసియాఖండమునందు తుర్కీ, పారసీకము, ఆఫ్గనిస్థానము, చీనా స్వాతంత్ర్యమును గలిగి సంపూర్ణవికాసమును బడయుచున్నవి. జపాను సంగ్రామరంగములందును, పరిశ్రమవ్యాపారరంగములందును, కళాశిల్పరంగములందును జూపిన యభ్యుదయము పాశ్చాత్యులకును, ప్రాచ్యులకును జ్ఞానోదయమును గలుగజేయుటకు దోడ్పడినది. తెల్లవారియాధిక్యము నల్లవారిన్యూనత తెల్లవారి కల్పనలని విశదమైనది. సమానావకాశము లున్నపుడు మానవు లందఱును జాతిమతభేదములు లేక స్వధర్మనిర్వహణమును జేయుటకు సమర్థులని విశదమైనది. ప్రాచ్యుల కాత్మవిశ్వాసముగలిగినది. పాశ్చాత్యులు కల్పించినవ్యామోహము పోయినది. ప్రాచీన సభ్యత్వము గల భరతవర్షమునందు పాశ్చాత్యులు కల్పించిన వ్యామోహము పోయి ఆత్మవిశ్వాసము గలిగినది. ఆత్మవిశ్వాసము గల గాంధిమహాత్ముని నాయకత్వముక్రింద భారతీయుల యాత్మవిశ్వాసము బలపడి కార్యరూపమును దాల్చుటయును సహజము. ఆసియావిజ్ఞానము ప్రపంచమునంతయును జయించినది. ప్రపంచమునందు ప్రధానమతములైన బౌద్ధ హిందూ క్రైస్తవ మహమ్మదీయ మతము లాసియాఖండమునందు బుట్టినవి. ఆసియాకు గల విజ్ఞానవిజయము భౌతికవిజయమునుగూడ సమకూర్పగలదు.

**భరతవర్షము**

ప్రపంచమునందు గల దేశములందు భరతఖండమునకుగల సత్త్వమే యితరదేశమునకును లేదని నిరాక్షేపణగాను చెప్పవచ్చును. ప్రాచీనములైన అస్సీరియా, చాల్డియా, ఈజిప్టు, గ్రీసు, రోము మొదలగు సామ్రాజ్యములు నశించినవి. ఆసామ్రాజ్యములప్రతిష్ఠ శిథిలనిర్మాణములందును, పుస్తకములందును గోచరం బగుచున్నది. సామ్రాజ్యనిర్వాహకులైన ప్రజలయందు గోచరం బగుటలేదు. భరతవర్షమునందు రాజులు మాఱినను, రాజ్యము లంతరించినను, మతములు మాఱినను, ప్రాచీనసంస్కారము చైతన్యమును గలిగి నేటికినిఅవిచ్ఛిన్నముగను వెలయుచున్నది. భారతీయసంస్కారము కైలాసశిఖరమువలె లోకోత్తరమై వెలుగుచున్నది. భరతవర్షము అనిత్యమైన భౌతికవిషయములందు పారతంత్ర్యము ననుభవించుచున్నను నిత్యమైన ఆధ్యాత్మికవిషయములం దప్రతిహతమైన స్వాతంత్ర్యము ననుభవించుచున్నది. అహింసాసిద్ధాంతమును సర్వాత్మత్వతత్త్వమును ప్రపంచమునకు ప్రసాదించిన భరతవర్షము సత్యమైన స్వరాజ్యసౌఖ్యము ననుభవించుచున్నది. ప్రపంచవ్యాప్తమైన బౌద్ధమతమునకు భరతవర్షము జన్మస్థానము. ప్రపంచవ్యాపకమును గల మహమ్మదీయ క్రైస్తవ మతములకును భరతవర్షము మూలగోత్రమై యుండు

నని పండితులు చేసినవిమర్శనలు ప్రతిపాదించుచున్నవి. భారతీయవిజ్ఞానము ప్రపంచము నంతయును జయించి నేటికిని నద్వితీయముగ పాలించుచున్నది. భారతీయ బలమును, శక్తిని, విజ్ఞానమును, సంపదలను 'వందేమాతరం' గీతము వర్ణించుచు సంశయాత్ములకును జ్ఞానోపదేశమును జేయుటకు జాలియున్నది. జగదీశచంద్రబోసు, రేపండితుడు, రవీంద్రనాధుడు, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, గాంధిమహాత్ముడు పుట్టిన భారతవర్షము ప్రపంచసౌభాగ్యమునకు సాధనము గాగలదు.

భారతీయవిజ్ఞానము విశ్వప్రవృత్తిని స్వార్థపరమైన భిన్నలక్ష్యములతో గాక పరార్థపరమైన ఐక్యతాలక్ష్యముతో జూపుచున్నది. వైదికమతముతో నారంభమైన విజ్ఞానము భిన్నయుగములందు భిన్నరూపములను వెలసినను పరమార్థలక్ష్య మవిచ్ఛిన్నముగ వెలయుచున్నది. భారతవిజ్ఞానము కర్మయోగము, జ్ఞానయోగము, ధర్మయోగము, భక్తియోగములను రూపములను మానవకల్యాణమునకు వినియోగపడినది. వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, పురాణేతిహాసములు తత్త్వసందర్శనము ననంతేముఖములను ప్రతిపాదించినవి. వైదికసంస్కారములు కర్మమార్గమున ప్రతిపాదించిన తత్త్వనిరూపణమును ప్రస్థానత్రయము జ్ఞానమార్గముననను, బౌద్ధసిద్ధాంతములు ధర్మమార్గమునను, పురాణేతిహాసములు భక్తిమార్గమునను ప్రతిపాదించినవి. ప్రాచీనాగతంబైన యాధ్యాత్మికవిజ్ఞానము సామాన్యప్రజాహృదయము నావరించిన విధమును ప్రజలనిత్యజీవనము విశదము చేయుచున్నది. పాశ్చాత్య సంపర్కము భారతీయులకు పరిపాటి యైన ఆధ్యాత్మికప్రవృత్తిని స్తంభింపజేయుటకు సమకట్టినది.

భారతీయ విజ్ఞానము

పాశ్చాత్యవిద్యాసంస్కారములు ప్రజాహృదయము నాధిభౌతికపరము చేయుట కుపచరించినవి. భారతీయుల పరతంత్రస్థితియందు బ్రిటీషు ప్రభుత్వము సంవర్ధించుటకు సమకట్టిన భౌతికలక్ష్యము నధిష్ఠించుట యును దుస్తర మైనది. భారతీయుల కుభయత్ర భ్రష్టత్వము గలిగినది. పరతంత్రస్థితియందు భౌతికభాగ్యభోగముల ననుభవించుట భారతీయుల కవకాశసామర్థ్యములు లేకున్నవి. ఆధ్యాత్మిక ప్రయోజనములందు విశ్వాసము పోయి సంయమభావ మేర్పడినది. భారతీయుల స్థితి స్వదేశమునందును, విదేశములందును దైన్యమును బడసినది. సాహిత్యమునందును, కళలయందును, సాహసధైర్యములందును, విజ్ఞానమునందును, భారతీయులకు నిర్మాణదక్షత్వము పోయి జడత్వ మేర్పడినది. భారతీయులు పూర్వాచారపరాయణులై, దాసానుదాసులై, స్వప్రయోజనములకును, ప్రపంచప్రయోజనములకును నిరుపయోగులుగ నున్నారు. విదేశప్రభుత్వమునకు సేవకవృత్తియే పరమార్థమైనది. ముప్పదిమూడుకోట్ల ప్రజల నావహించినపారతంత్ర్యసమ్మోహమును పోగొట్టుట దుస్తరముగ నున్నది. ప్రతిభాశాలులైన భారతీయులకు సైతము విషాదయోగము శరణ్యమైనది. దేశభక్తాగ్రేసరుడు లోకమాన్య తిలకుమహారాజనుభవించిన నిర్బంధపరంపర లీవిషయమునకు మహావ్యాఖ్యానముగ నున్నవి. భారతీయ నిరంకుశప్రభుత్వమునకు మోంటేగుగా రాపాదించిన జడత్వము, నిర్వీర్యత్వము, అయోమయత్వము భారతీయులను యథార్థముగ నాశ్రయించి దేశమును, ప్రజలను మృతప్రాయులను జేసినవి. ఈవిలయావస్థనుండి మాతృదేశము నుద్ధరించుటకు దేశారాధకులు చేసెడిప్రయత్నములు రాజద్రోహముగ పరిణమించుట ధర్మవైపరీత్యముగ నున్నది. తిలకుమహారాజు వారియవసానకాలమునందు జేసిన ధర్మోపదేశము దేశదాస్య విమోచనమునకును లోకకళ్యాణమునకును సాధనంబుగ నున్నది.

విషాదావస్థ

శ్లో. యదాయదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్.
భగవద్గీత.

వర్తమానయుగమునందు లోకమునందంతటను ఆసురబలసంవర్ధితమైన జాతీయాహంకారము ప్రబలి మహాసంక్షోభమును గలుగజేయుచున్నవిధమును ఐరోపా

దైవాసుర ధర్మములు

మహాసంగ్రామము విశదముజేసినది. పాశ్చాత్త్యులు ఆసురబలము నారాధించుచు స్వదేశమందును, విదేశములందును దుఃఖవేదనను వ్యాపింపజేయుచున్నారు. పాశ్చాత్త్యుల ప్రయత్నము లన్నియును దుఃఖభూయిష్ఠమైన ఆసురధర్మము నారాధించుటకు వినియోగపడుచున్నవి. దేశసంపద లన్నియును, సంగ్రామసన్నాహములకును, భోగమునకును, పరపీడనమునకును, వినియోగింపబడుచు లోకము దుఃఖమయము చేయబడుచున్నవిధమును ప్రాజ్ఞులు బోధించుచున్నారు. గ్రేట్‌బ్రిటను కోశాధికారి ఫిలిప్సు స్నోడన్ గారు లండనునగరమందు కూడిన ఆయుధనిషేధసభయందీవిషయమును గంభీరముగ విశదముచేసిరి. పాశ్చాత్త్యజాతులు దుఃఖవేదన ననుభవించుచున్నను ఆసురబలవ్యామోహమును విడువజాలకున్నవి. మానవులు ఆసురధర్మమును విడిచి దైవధర్మమును బడయుటకు ఘోరమైన తపస్సును జేసినవిధమును భారతీయేతిహాసములు వేనోళ్లను చాటుచున్నవి. సిద్ధార్థుడు దైవధర్మము నారాధించుటకు రాజ్యమును సంసారమును త్యజించెను. అశోకుడు దైవధర్మము నారాధించుటకు యుద్ధమును నిషేధించెను. శ్రీకృష్ణుడు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు విజయునకు యుద్ధరంగములందును దైవధర్మప్రయోజనమును బోధించెను.

వర్తమానకాలమునందు దైవధర్మపరాయణమైన ఆధ్యాత్మికధర్మము లుప్తమై ఆసురధర్మపరాయణమైన ఆధిభౌతికధర్మముప్రబలి ఆత్మధర్మస్థాపనములోకకల్యాణసాధనమైనది. ధర్మసంస్థాపనార్థముభారతీయులు చిరకాలాగతమైన విజ్ఞానము నాత్మోద్ధరణమునకును,ప్రపంచశాంతికిని వినియోగించుటకవసరముగలిగినది. భారతీయవిజ్ఞానము ప్రతిపాదించిన అహింసాధర్మమును, సత్యధర్మమును, ప్రేమధర్మమును పునరుద్ధరించి దైవధర్మమును ప్రతిష్ఠించుటకు సుముహూర్తము గల్గినది. మహత్తరమైన దైవధర్మమును ప్రతిష్ఠించుటకు ప్రాచీనభారతసంస్కారసంపన్నుడైన గాంధిమహాత్ముడు సర్వవిధములను తగియున్నాడు. ఆత్మధర్మమునందు విశ్వాసము లేని సంశయాత్ము లహింసాధర్మమును పరిహాసపాత్రము చేసినను అన్నిధర్మములును అహింసాధర్మమునం దిమిడియున్నవని ప్రాజ్ఞులు గ్రహింపగలరు. ధర్మాగాధనమునందు ప్రేమకును, త్యాగమునకును గల శక్తిసామర్థ్యములు ద్వేషమునకును భోగమునకును లేవని యన్ని మతములును చాటుచున్నవి. ప్రపంచమునకు వర్తమానకాలమునందు సకలవ్యవస్థలకును కార్యసిద్ధికి పరిపాటియైన ఆసురబలవ్యామోహమును పోగొట్టి ఆత్మబలసాధనమున స్వరాజ్యస్థాపనమును చేయుట ప్రాచీనమైన భారతీయసంస్కారమునకు ఫలము. అహింసాధర్మశక్తిని వర్తమానకాలమునందు భారతీయులును బ్రిటీషుప్రజలును గ్రహింపజాలకపోయినను కాలక్రమమున గ్రహించి ఆత్మధర్మసంస్థాపనమునకై వారియావచ్ఛక్తిని వినియోగించెదరుగాత !

శ్రీమతి బెజంటమ్మను బోలినయాంగ్లేయులకును నితరనాయకులకును కార్మికపక్షము భరతవర్షమునకు మహోపకారమును జేయు నని పేరాస యున్నను నా

భరతవర్షము కార్మికప్రభుత్వము

యాశ నిరాశ యని కార్మికపక్షవ్యవహారములు విశదముచేసినవి. రామ్సే మేక్డొనాల్డుగారు, వెజివుడు బెన్నుగారు మొదలగు కార్మికనాయకులు చూపుచున్న నిరాదరణస్వభావము భారతీయులహృదయమునందు నిరాశను గలుగజేసినది. బెన్నుగారు స్వాతంత్ర్యప్రియు లైనను భరతవర్షమునకు స్వాతంత్ర్యప్రదానమునకు వారు పూనుకొనరని వారిప్రసంగములు విస్పష్టము చేసినవి. డిసెంబరు మాసమునందు బ్రాక్వేగారు పార్లమెంటునందు ప్రతిపాదించిన తీర్మానమును కార్మికపక్ష మాశీర్వదించుటయును, పార్లమెంటు అంగీకరించుటయును కార్మికపక్షసానుభూతికి నిదర్శనమైనను భారతవర్షాశయములకు నిరుపయోగముగ నున్నది.

"భారతి స్వపరిపాలనసమస్యను పరిష్కరించు విషయమున భారతీయులు మనకు తోడ్పడ నంగీకరించుచున్నా రనుటకు నిదర్శనములగు సూచనలను ఈసభవారు స్వాగత మొసగుచు, పరిపాలనలోను

కార్యనిర్వహణమునందును, ముఖ్యముగా రాజకీయాభిప్రాయములను వెల్లడించుటలోను భారతీయులలో సద్భావము కలుగునట్లు ఇండియా దొరతనమువారు ప్రోత్సహింతురని విశ్వసించుచున్నారు."

ఇంగ్లాండునందు బెన్నుగారును ఇండియాయందు ఇర్విను ప్రభువుగారును భారతీయులను తియ్యనిమాటలతోను కఠినకార్యములతోను సంతృప్తిపఱచుటకు జేసిన ప్రయత్నములు నిరర్థకము లని వ్యవహారములు విశదముచేసినవి. బ్రిటీషుప్రభుత్వము స్వపరిపాలనసమస్యనే తలపెట్టనపుడు భారతీయులలో సద్భావము గలుగుటయును, ఇండియా ప్రభుత్వమువారు ప్రోత్సహించుటయును నసంభవములు. బెన్ను, ఇర్విను ప్రభువుగారల ప్రసంగముల కేమివ్యాఖ్యానములను జేసినను డిల్లీనగరమునందు ఇర్విను ప్రభువునకును గాంధి, నెహ్రూ, జిన్నా, సప్రూగార్లకును డిసెంబరు 23 వ తేదిని జరిగిన సంప్రతింపులు యథార్థస్థితిని బయటపెట్టినవి. డిల్లీయందు జరిగిన సంప్రతింపులందు గాంధిమహాత్ముడు కోరినవిషయము సంప్రతింపులకు మూలాధార మైన స్వరాజ్యము. సకలపక్షసమావేశమును కాంగ్రెసు కార్యనిర్వాహక సభయును, అధినివేశపరిపాలనమును మూలాధారముగ గైకొని రౌండుటేబిలు సమావేశమునకు బోవుటకు నిర్ణయించినవి. అధినివేశస్వపరిపాలనవిషయమై కార్మికపక్షముగాని, బెన్నుగారుగాని, తుదకు ఇర్విను ప్రభువుగాని అభయము నొసంగజాలనపుడు సమావేశమువలన నెవరికిని ప్రయోజనము గలుగజాలదు.

డిల్లీనగరమునందు ఇర్విను ప్రభువునకును, గాంధి, నెహ్రూ, సప్రూ, జిన్నాగార్లకును జరిగినసమావేశము గోప్య మైనను దూరాధిరూఢముగ బరిణమించినది. ఆ సమావేశమునందు నడిచిన వ్యవహారములు రాజ్యతంత్ర్యమునకును, ధర్మనిర్వహణమునకును గల భేదమును విశదము చేసినవి. ఢిల్లీసమావేశమునందు త్రికోణసంరంభము వ్యక్త మైనది. లండను నగరమునందు గూడవలసిన వివిధపక్ష సమావేశమునకు మూలాధారము అధినివేశ

అధినివేశ స్వపరిపాలనము

స్వపరిపాలనము. రాజప్రతినిధియును,జిన్నా, సప్రూగార్లును వారిదృష్టిని వివిధపక్షసమావేశమునందు లగ్నము చేసిన టులు అధినివేశస్వపరిపాలనమునందు లగ్నము చేయలేదని గాంధిమహాత్ముని లాహోరుప్రసంగములు, నవజీవనపత్రికలోని వ్యాసములు, రాజప్రతినిధి సామ్రాజ్యశాసనసభయందు జనవరి 25-వ తేదిని జేసిన ప్రసంగము విశదము చేసినవి. వివిధపక్షసమావేశము చేసిన నిర్ణయములను బ్రిటీషుప్రభుత్వము సమర్థించుటకు బూనుకొననపు డా నిర్ణయములు కార్యరూపము దాల్పక కాగితపు నిర్ణయములుగానే యుండును. నిర్ణయములను బ్రిటీషు ప్రభుత్వము నిరాకరించినను ఇర్విను ప్రభు వైనను సమర్థించుటకు బూనుకొననపుడు వివిధపక్షసమావేశమువలనను స్వరాజ్యనిర్ణయమునకు ప్రయోజనము గలుగ దని విశద మైనది. పేరంటమునకు వలెను సమావేశమునకు బోవుటకు సప్రూజిన్నాగార లంగీకరించినను గాంధిమహాత్ముడు నిరాకరించి మాతృదేశమునకు మహోపకారమును జేయగలిగెను. స్వరాజ్యప్రయోజనము లేని వివిధపక్షసమావేశమును కాంగ్రెసు నిరాకరించుట ధర్మము గాని ఆమోదించుట ధర్మము గాదు. స్వరాజ్యలక్ష్యము లేని సమావేశమును నిరాకరించిన గాంధిమహాత్ముడు ప్రశంసలకు పాత్రుడు గాని నిందలకు పాత్రుడుగాడు. అధినివేశ స్వపరిపాలనమును సంపాదింపగల నాయకులు లండను నగరమునకు పోయి స్వపరిపాలనమును సంపాదించినచో కాంగ్రెసు కృతజ్ఞతతో స్వీకరింపగలదు.

ఇర్వినుప్రభువు చేసినప్రసంగములు సద్భావములకును, సానుభూతికిని నిదర్శనము లైనను భారతీయప్రయోజనములకును, నిరంకుశదుర్గమును లోహపంజరమును ఛేదించుటకును నిరుపయోగములు. ఇర్విను ప్రభువు ప్రియోక్తులను జెప్పుటయందు జూపెడి సామర్థ్యమును సత్యప్రకటనమునందు జూపజాలకున్నాడు. ఇది బ్రిటీషు నిరంకుశప్రభుత్వమునకు సహజలక్షణము. భారతీయనాయకులు రౌండు టేబిలు సమావేశమునకు రావలయునని ఇర్విను ప్రభువు

ఇర్వినుప్రభువు

హెచ్చరించుచున్నాడు. కాని సమావేశమునందు గలుగగల ప్రయోజనము నెఱుగక ఆత్మగౌరవము గలనాయకు లెవరును లండనునగరమునకు పోజాలరు. అన్నిపక్షముల కును ప్రాతినిధ్యము గలుగు నని ఇర్విన్‌ప్రభు వభయము నొసంగుట వారిసౌజన్యమున కనురూపముగ నున్నది. కాని రాజ్యాంగపక్షములందు ప్రబల మైన కాంగ్రెసుపక్షము రౌండుటేబిలు సమావేశమును నిరాకరించినపుడు రౌండుటేబిలు సమావేశము సైమను కమిషనువలెనే బహిష్కరింపబడుటయును సహజముగ నున్నది. రౌండుటేబిలు సమావేశమునకు మూలాధారము'అధినివేశస్వపరిపాలన' మని అన్నిపక్షములవారును నంగీకరించుచున్నారు. స్వదేశమునందు సైమనుకమిషనును బహిష్కరించిన కాంగ్రెసుపక్షమును లిబరలుపక్షమును విదేశమునందు తలతోక లేని రౌండుటేబిలుసమావేశమునకు పోవుట పరిహాసాస్పదము. లండనుసమావేశమునందు రాజ్యాంగనిర్మాణముల కధినివేశస్వపరిపాలనము ప్రాతిపదికముగ గైకొనబడు నని భారతప్రభుత్వముగాని, బ్రిటీషుప్రభుత్వముగాని, హిందూదేశమంత్రిగాని, రాజప్రతినిధిగాని, కార్మికప్రభుత్వముగాని అభయము నొసగజాలనపుడు సమావేశముతో కాంగ్రెసునకును, స్వరాజ్యప్రియులకును సంబంధ ముండ జాల దని గ్రాహ్య మగుచున్నది. నిరంకుశప్రభుత్వ మవలంబించుచున్న నిర్బంధవిధానము ప్రభుత్వహృదయమునందు పరివర్తనము కలుగలేదని విశదముచేయుచున్నది. దేశభక్తు లన్నిరాష్ట్రములయందును నిర్బంధింపబడుచున్నపు డిర్విన్‌ప్రభువు కోరెడిశాంతివాతావరణము దుర్లభము. ఇర్విను ప్రభువు గాంధిమహాత్మునిసందేశమునకు పంపిన ప్రత్యుత్తరము ప్రభుత్వమునకు హృదయపరివర్తనము గలుగలేదని విశదము చేయుచున్నది. బ్రిటిషుప్రభుత్వహృదయమునందును, రాజ్యాంగ నీతియందును పరివర్తనము గలుగనపుడు లాహోరుకాంగ్రెసు పూర్ణస్వరాజ్యతీర్మానమును జేసి యాత్మగౌరవమును గాపాడుకొన్నది.

**లాహోరు కాంగ్రెసు**

లాహోరునందు సమావేశమైన ౪౪ వ భారత జాతీయ మహాసభ కాంగ్రెసు పరమార్థమును విస్పష్టము చేసినది. కాంగ్రెసు నారంభించిన హ్యూము, వెడ్డరు బరను, బెనర్జి, దాదాభాయిగారులు మొదలగు నాయకులు సుపరిపాలనమునకు పాటుపడిరిగాని స్వపరిపాలనమునకు పాటుపడలేదు. స్వపరిపాలనధర్మము ముసుగులో గుద్దులాటవలె నుండెను. దాదాభాయినౌరోజి, లోకమాన్యతిలకుగారులు స్వరాజ్యము భారతీయుల జన్మహక్కని నిర్వచించినను స్వపరిపాలనాశయమును విస్పష్టము చేయలేదు. ఐరోపామహాసంగ్రామము, స్వయంనిర్ణయధర్మను స్వపరిపాలనధర్మమును విస్పష్టము చేయవలసిన యవసరమును గలుగజేసినది. అవసరమునకు బాధ్యులు బ్రిటీషుపరిపాలకులు గాని భారతీయులుగారు. స్వరాజ్యము సంపూర్ణస్వాతంత్ర్యమని నిర్వచనము చేయుటకు పదేండ్లుపట్టినది. లాహోరు కాంగ్రెసు పూర్ణస్వరాజ్యము బ్రిటీషు ప్రభుత్వముతో సంబంధములేని పూర్ణస్వాతంత్ర్య మని ప్రతిపాదించినది. కాంగ్రెసు ఆమోదించిన ప్రస్తావము బ్రిటీషుసామ్రాజ్యాభిమానులకు మనస్తాపమును స్వాతంత్ర్యప్రియుల కాహ్లాదమును గలుగజేసినది. కురుక్షేత్రమునందు శ్రీకృష్ణుడు విజయునకు సారథ్యమును బూని పాండవులకు విజయమును గలుగజేసిన విధమునను లాహోరుకాంగ్రెసునందు గాంధిమహాత్ముడు జవహరిలాలు నెహ్రూగారికి సారథ్యమును బూని కాంగ్రెసునకు విజయమును సమకూర్చినవిధము చరిత్రాంశము. గాంధిమహాత్ముడు కలకత్తాయందు జేసినప్రతిజ్ఞ కనుసరణముగను డిసెంబరు ౩౧ వ తేది రాత్రి ౧౨ గంటలకు లాహోరునందు కాంగ్రెసు సంకల్పము పూర్ణస్వరాజ్యమని కాంగ్రెసు నిర్ధారణచేసినది. ఆ శుభసమయమునందు వృద్ధులు యువకులు, పండితులు పామరులు, స్త్రీలు పురుషులు వ్యక్తముచేసిన పరమోత్సాహము దేశావృతమైన స్వాతంత్ర్యాభిలాషను దశదిశలందును పూరించినది. మంగళవాద్యములు, జయఘోషలు, నృత్యగాన

ములు, ఉత్సవములు ప్రజాహృదయమునం దుప్పొంగుచున్న స్వాతంత్ర్యేచ్ఛను విశదముచేసినవి. ప్రజాహృదయమునందు ప్రవర్ధమానం బగుచున్న స్వాతంత్ర్యసంకల్పమును నిర్బంధించుట గాంధిమహాత్మునకును సాధ్యము గాదని లాహోరుకాంగ్రెసు వ్యవహారములు విశదముచేసినవి. నిరంకుశవర్గమును వారియభిమానులును, దీనియర్థమును మననముచేయుదురుగాత!

కాంగ్రెసు తీర్మానము

"ఈసభవారు అక్టోబరు ३౧ వ తేదిని రాజప్రతినిధి గావించిన ప్రకటనసందర్భములో కాంగ్రెసువాదులతో సహా వివిధపక్షనాయకులు సంతకములు చేసి గావించిన ప్రకటన విషయమై కాంగ్రెసువారు గావించిన చర్య ననుమతించుచు, స్వరాజ్యమునకై గావింపబడుచున్న జాతీయోద్యమమును రాజీగా పరిష్కరించుటకై వైస్రాయి పడిన శ్రమ కభినందించుచున్నారు. మోతీలాల్ నెహ్రూ మున్నగు నాయకులు వయిస్రాయితో సంప్రతించుటవలన కలిగిన ఫలితముల గమనించి ప్రస్తుతపరిస్థితులతో కాంగ్రెసు రౌండుటేబిల్ సమావేశమునందు పాల్గొని లాభము లేదని యీసభవారు తలంచుచున్నారు.

మరియు, గతసంవత్సరము కలకత్తా కాంగ్రెసులో గావింపబడిన తీర్మానము ననుసరించి ఈ కాంగ్రెసువా రిపుడు కాంగ్రెసు ఆదర్శమందలి 'స్వరాజ్య' పదమునకు 'సంపూర్ణస్వాతంత్ర్యము' అను అర్థము నిర్వచించుచున్నారు. కావున అధినివేశప్రతిపత్తికిగా నిర్మింపబడిన నెహ్రూప్రణాళిక ఇంతటితో రద్దయిన దని ప్రకటించుచున్నారు. మరియు కాంగ్రెసునందలి సర్వపక్షములవారు తమ యావచ్ఛక్తుల సంపూర్ణస్వాతంత్ర్యసంపాదనకై వినియోగింప గలరనియు, నెహ్రూరిపోర్టులో సూచింపబడిన తాత్కాలిక, సాంఘీక వివాద పరిష్కార సాధనముల మూలమున కాంగ్రెసునుండి ఎడతొలంగవలసిన లేక కాంగ్రెసునందు చేరుటకు వీలుగాని, ప్రముఖులును, నేడు మరల కాంగ్రెసునందు చేరి ఎల్లరకు సంబంధించిన ఈ ఆదర్శమును సాధించుటకు తీవ్రకృషి సలుపుదురనియు నమ్ముచున్నారు.

సంపూర్ణస్వాతంత్ర్యసమరము సాగించుటకు సన్నాహమొనర్ప మొదటి మెట్టుగాను, కాంగ్రెసు విధానము ఆదర్శము మార్చినందుల కనుగుణముగ నుండుటకుగాను రాష్ట్రకేంద్ర శాసనసభలను బహిష్కరింపవలయునని ప్రకటించుచు, ఇకపయి ప్రత్యక్షముగ గాని, పరోక్షముగ గాని, ఈ శాసనసభలతో జోక్యము కల్పించుకొన రాదనియు, ప్రస్తుతము శాసనసభలందు సభ్యులుగా నున్నవారు తత్క్షణమే రాజీనామా నిచ్చివేయవలయుననియు కాంగ్రెసువాదులను కోరుచున్నారు. మరియు, దేశీయులు తమ యావచ్ఛక్తుల నిర్మాణకార్యక్రమము నిర్వహించుటకయి వినియోగింపవలయు నని కోరుచు, తయారుగానున్నట్లు తోచినపుడు అవసరమైన అన్ని జాగ్రత్తలతోను కొన్నిప్రత్యేకస్థలములలో గాని, సమష్టిగా గాని పన్నుల నిరాకరణముతో సహా శాసనోల్లంఘనము ప్రారంభించుటకు అఖిల భారతకాంగ్రెసుసంఘమునకు ఈసభవా రధికార మిచ్చుచున్నారు.

కాంగ్రెసునిర్ధారణ పిడుగువలె స్వప్రయోజనపరాయణుల హృదయమునందు భయకంపములను గలుగజేయుచున్నది. శాంతికాములును దేశక్షేమపరాయణులును నిరంకుశవర్గమును కన్నులు విప్పి యథార్థస్థితిని గ్రహించుట ప్రయోజనకరము గాని, నిందించుటయును నిరసించుటయును నిర్బంధించుటయును ప్రయోజనకరము గాదని గ్రహింతురుగాత!

పరాధీనరాజ్యములు స్వాతంత్ర్యమును సంపాదించుటకు మూడుసాధనములు గలవు. మొదటిసాధనము సక్రమాందోళనము. భరతవర్షము కాంగ్రెసు ముఖమునను, ఇతరసంస్థలముఖమునను స్వరాజ్యమునకై 40 ఏండ్లు సక్రమాందోళనమును జేసి విసిగి నిరాశను జెందినది. కడపటివైన మోంటుఫర్డు సంస్కరణము లీపరమరహస్యమును విశదముచేసినవి. ద్వంద్వప్రభుత్వము రాజ్యాంగములందేశాఖయందును యథార్థమైన స్వాతంత్ర్యమును గలుగజేయలేదని పదేండ్లయనుభవము విశదముచేసినది. సైమనుకమిషను విచారణయును నిర్ణయములును నీపరమార్థమునే విశదముచేయనున్నవి. కేంద్రసంఘము చేసినసూచనలు సైమనుకమిషను చేయనున్న సూచనలవలెను దేశప్రయోజనములకు నిరుపయోగములుగ నున్నవి. సక్రమాందోళనమువలన ప్రయోజనము గలుగ దని చిరకాలానుభవము విశదముచేసినది. రాజ్యాంగసంస్కరణములు నిరంకుశదుర్గరక్షణమునకై వినియోగపడుచున్నవి.

స్వాతంత్ర్య సాధనము

స్వాతంత్ర్యసంపాదనమునకు రెండవసాధనము దౌర్జన్యసహితమైన విప్లవము. ఈసాధన పాశ్చాత్యులు ప్రపంచమున కభ్యాసము చేసిన సామాన్యసాధనము. కాంగ్రెసు దౌర్జన్యసాధనమును సంపూర్ణముగ నిరసించినది. బాంబుప్రయోగమును నిరసించుచును, ఇర్విన్ప్రభువు నభి

నందించు మను లాహోరు కాంగ్రెసు చేసిన తీర్మానమువలన స్వాతంత్ర్యమును సంపాదించుటకు విప్లవసాధనమును కాంగ్రెసు నిరసించుచున్నదని విశదమగుచున్నది.

మూడవది దౌర్జన్యరహితమైన సత్యాగ్రహసాధనము. ప్రపంచమునకు విశేషాభ్యాసములేని యీ సాధన మసి ధారావ్రతముగ నున్నది. అనుభవములేని దురారాధ్య మైన యీసాధనమును, పాశ్చాత్యులును పాశ్చాత్యవిజ్ఞానా రాధకులును పరిహసించుట సహజము. ఆగ్రహము, దౌర్జ న్యము హింస పశుబలమును, నిగ్రహము, శాంతము అహింస ధర్మబలమును విశదము చేయుచున్నవి. ఆగ్రహ మును బూనుట, నిర్బంధించుట సులభము. నిగ్రహమును బూనుట, నిర్బంధము ననుభవించుట దుష్కరము. దుష్క రమైన సత్యాగ్రహసాధనమునను పూర్ణస్వరాజ్యమును సాధించుటకు లాహోరు కాంగ్రెసు నిర్ణయించినది. ప్రా చీనధర్మసంస్కారము గల భరతవర్షమునకు పూర్ణస్వరా జ్యనిర్ణయమును, శాంతిసాధననిర్ణయమును ధర్మవిజయ మునకును, శ్రేయఃప్రాప్తికిని సాధనములుగ నున్నవి. సంకల్ప సిద్ధికి సత్యాగ్రహసాధనమునందు విశ్వాసాను భవములుగల గాంధిమహాత్ముడు సత్యాగ్రహసంరంభము నందు నాయకత్వమును వహించుటకు సకలవిధములను దగియున్నాడు.

గాంధిమహాత్ముడును కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమును సంప్రతించి ప్రకటించిన పూర్ణస్వాతంత్ర్య ప్రక టన ప్రజాహృదయమును లోకమునకు వ్యక్తముచేయు చున్నది.

### సంపూర్ణస్వాతంత్ర్యప్రకటన

"ప్రపంచములోని తక్కిన అన్నిజాతులవలెనే, భారతీయు లుకూడ స్వాతంత్ర్యమును బొంది తమ కష్టార్జితమును తా మనుభవించుచు, జీవయాత్ర కావశ్యకమగు అన్నవస్త్రాదులను బడసి, జాతీయాభ్యుదయమునకు వలయు పరిపూర్ణావకాశములను కలిగియుండవలయు ననియు, ఈ విషయములో వారిహక్కు అప్రతిహత మనియు మా విశ్వాసము. ఏప్రభుత్వమైనను, ప్రజలకుండే ఈ హక్కులను హరించి వారిని పీడించేయెడల ఆప్రభుత్వమును మార్పుచేయుటకు గాని, మాపు చేయుటకు గాని ఆప్రజలకు గూడ హక్కు ఉన్నదని మా నమ్మకము.

భారతదేశములోని బ్రిటిష్ ప్రభుత్వము భారతజాతియొక్క స్వాతంత్ర్యమును హరించుటయే కాక, భారతీయ ప్రజాసామాన్యమును తన స్వప్రయోజనమునకు వినియోగించుటవలననే వర్ధిల్లుచు, భారతదేశపు భాగ్యభోగ్యములను, రాజకీయస్వాతంత్ర్యమును, విజ్ఞానసంపత్తిని, స్వధర్మమును నశింపజేసినది. (కావున) భారతదేశము బ్రిటిష్‌వారి సంబంధమును విడగొట్టుకొని 'పూర్ణస్వరాజ్యము'ను అనగా 'సంపూర్ణ స్వాతంత్ర్యము'ను సంపాదింపవలె నని మా ఆశయము.

భారతదేశపుభాగ్యము నాశనము చేయబడినది. ప్రజలయొద్ద వసూలుచేయుచున్న పన్నులు వారి ఆదాయముతో నెట్టి సంబంధమును లేకుండ మితిమీఱియున్నవి. మనదేశములో సగటున మనిషికి దినమునకు అణాముక్కాని మాత్రమే నిత్యాదాయము. మనము చెల్లించెడి దుర్భరమైన పన్నుల భారములో నూటికి ౨౧ వంతులు రైతు లిచ్చుకొను భూమిశిస్తు, నూటికి 3 వంతులు బీదలను పీడించే ఉప్పుపన్ను. రాటముతో నూలు వడుకుట మొదలగు గ్రామపరిశ్రమలన్నియు ధ్వంసము చేయబడినవి. అందుచే రైతులు కనీసము ఏడాదిలో నాలుగు నెలలు నిర్వ్యాపారులై చేతిపను లేమియు లేక బుద్ధిమాంద్యముతో వృథాకాలక్షేపము చేయుచున్నారు. నాశనము చేయబడిన చేతిపరిశ్రమలకు ప్రత్యామ్నాయముగ నితరదేశములలోవలె నిట వేఱొద్దియు నెలకొల్పబడియుండలేదు. నాణెముల చెలామణి, సరకులరవానాపై పన్నులు, వీనివిషయములో చూపు హస్తలాఘవమువలన రైతుల నెత్తిపై నింకను భారము పడినది. మన దిగుమతిసరకులు విస్తారముగ బ్రిటిష్‌వారు తయారుచేయు వస్తుసామగ్రియే. రవానాపన్నులు చూచినచో, బ్రిటిష్‌వారు తయారుచేయు సరకులపట్ల చూపు పక్షపాతము విశదమగును. ఇట్టి ఆదాయమును ప్రజలపన్నులభారమును తగ్గించుటకు గాక, అమితవ్యయముతో గూడిన ఈ ప్రభుత్వమును నిలువబెట్టుకొనుటకే ఉపయోగించుకొనుచున్నారు. నాణెముల చెలామణి నిర్ణయముతో గూడ వారిచిత్తము వచ్చినట్లు వ్యవహరించుటచే కోట్లకొలది ధనప్రవాహము దేశాంతరమునకు తరలిపోవుచున్నది.

రాజకీయముగ జూచిన భారతదేశస్థితి బ్రిటిష్‌వారి హయాములో దిగినంత అధోగతి కెన్నడును వచ్చియుండలేదు. ఏ రాజకీయ సంస్కరణములవల్లను ప్రజలకు నిజమైన అధికారము లభింపలేదు. మనలో మహామహులుసహితము విదేశీయాధికారమునెదుట తలలొగ్గవలసియున్నది. స్వేచ్ఛగా మన అభిప్రాయముల ప్రకటించుటకును, సమావేశమగుటకును మన కుండదగు హక్కులు నిరాకరింపబడినవి. మనదేశీయులు చాలమంది విదేశములలో ప్రవాస మనుభవించుచున్నారు. వారు మాతృదేశమును తిరిగి సందర్శించుటకు ప్రాప్తము లేకుండ నున్నది. మన దేశీయుల పరిపాలనాదక్షత రూపుమాపబడినది. ప్రజలు గ్రామనౌకరీలతోను, గుమాస్తాగిరీలతోను తృప్తిపడి యుండవలసి వచ్చినది.

ఇక విజ్ఞానసంపత్తి చూచెదమన్న, ఇప్పటి విద్యావిధానము మన పూర్వసంప్రదాయతంతువులను ఛేదించి వైచినది. మనము పొందిన శిక్షణమువలన మనలను నిర్బంధించు సంకెళ్లే మనకు మురిపెము లై పోయినవి.

స్వధర్మరీత్యా యోచించిన, నిర్బంధముగ మనల నిరాయుధులను చేయుటచేత మనకు మగసిరి అంతరించినది. మనదేశము నాక్రమించుకొన్న విదేశీయసైన్యము మన నిరోధకశక్తి నతిదారుణముగ నణచివేయుటకు నియమింపబడి, మనలను మనము జాగ్రత్తపఱచుకొనజాలమనియు, ఈ విదేశీయులదాడి నరికట్టజాలమనియు, దొంగాతోడుబోతులవల్ల అపాయము లేకుండ మన ఇల్లువాకిళ్లను, భార్యాబిడ్డలను సంరక్షించుకోజాలమనియు దలంపజేయుచున్నది.

మనదేశము నిట్లు చతుర్విధముల విపత్తు పాల్సేసిన ఈపరిపాలనకు ఇంకేమాత్రమును లొంగియుండుట దైవద్రోహ మనియు, మానవద్రోహ మనియు మా యభిప్రాయము. ఐనను, మనస్వాతంత్ర్యమును స్థాపించుటకు, ప్రబలతమ సానుకూలమార్గము కత్తిగట్టుట కాదని గుర్తించుచున్నాము. కావున, బ్రిటిష్ ప్రభుత్వముతో మాకు గల ఐచ్ఛికసంబంధమునంతను సాధ్యమైనంతవఱకు వదలుకొని, పన్నులనిరాకరణముసహా, శాసనోల్లంఘనమునకు సన్నాహము గావించెదము. మేము స్వేచ్ఛాపూర్వకముగ గావించు సహకారము మానివైచి, ఎంత రెచ్చగొట్టినను దౌర్జన్యమునకు దిగకుండ పన్నులను నిరాకరింపగల్గుచో ఈ యమానుష పాలన మంతరించుట రూఢి యని మాకు నచ్చినది. కాన 'పూర్ణస్వరాజ్యము'ను స్థాపించుటకుగాను ఎప్పటి కప్పుడు కాంగ్రెసువారిచ్చు ఆదేశముల నెఱవేర్చెదమని ఇందుమూలమున ప్రమాణపూర్వకముగ నిశ్చయించుకొనుచున్నాము. వందే మాతరమ్."

జనవరి 26 వ తేదిని దేశమునందంతటను స్వాతంత్ర్యప్రకటనమును చేయుటయందు దాబాల గోపాలము చూపిన సాహసధైర్యములు, ప్రశాంతస్వభావము, పరమోత్సాహము ప్రజాహృదయమునందు సుప్రతిష్ఠితమగుచున్న స్వాతంత్ర్యేచ్ఛను విశదము చేయుచున్నది. అధికారుల ప్రవర్తనమును ప్రశంసనీయము. బ్రిటీషు ప్రభుత్వము కాలప్రభావమును గ్రహించి స్వధర్మనిర్వహణమును జేయుటకు శుభసమయ మేర్పడినది.

లాహోరునందు భరతవర్షము శాంతిమార్గమున పూర్ణస్వరాజ్యము సంపాదింపవలయు నని కాంగ్రెసు నిర్ణయించినది. నిర్ణయమున కనురూపముగ జనవరి 26 వ తేదీని భరతఖండమం దంతటను పూర్ణ స్వాతంత్ర్య ప్రకటనమును జేసినది. స్వాతంత్ర్యసిద్ధికి శాసనోల్లంఘనప్రస్థానమును నిర్ణయించుటకు సబర్మతీ సత్యాగ్రహాశ్రమమునందు ఫిబ్రవరి 14 తారీఖున కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము కూడినది.

గాంధిమహాత్ముడు సత్యాగ్రహ ప్రస్థానము

ఆసభకు వివిధప్రాంతములనుండియు నాయకులు వచ్చియుండిరి. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము ఈ క్రింది తీర్మానమును చేసినది:

"పూర్ణస్వరాజ్యమును బడయుటకు అహింసాధర్మమునందు సంపూర్ణవిశ్వాసము గలవారే శాంతిసహిత శాసనోల్లంఘనమును ప్రారంభింతు రని కార్యనిర్వాహకసంఘమువారు నమ్ముచున్నారు. కాని, కాంగ్రెసుసంస్థయందు అట్టివారే గాక ప్రస్తుతస్థితిలో అహింస నవలంబించుట తాత్కాలికముగ లాభకరమని నమ్మువారుగూడ చేరియున్నందున, గాంధిమహాత్ముని సూచనను ఈ సంఘమువారు ఆమోదించి, వారును, వారితో గలసి పాటుపడుచు అహింసను విధ్యుక్తధర్మ మని విశ్వసించువారును శాంతిసహిత శాసనోల్లంఘనమును వారి యిష్టము వచ్చినప్పుడు వారు చేయదలచిన విధమున వారు నిర్ణయించెడి పరిమితిలోపల నిర్వహించుటకు అధికార మిచ్చుచున్నారు. ఈ సంరంభము కొనసాగుచున్న సమయమున, కాంగ్రెసుసభ్యులందఱును, తదితరులును సత్యాగ్రహులకు సర్వవిధముల దోడ్పడి, ఎట్టి కోపకారణములమధ్య నయినను సంపూర్ణమగు దౌర్జన్యరాహిత్యమును అవలంబించి దాని కట్టుభంగము కలుగకుండ కాపాడెద రని కార్యనిర్వాహక సంఘమువారు నమ్ముచున్నారు. సమష్టిశాసనోల్లంఘనము జరుగునెడల, నింతవరకు ప్రభుత్వముతో ఐచ్ఛికసహకారము సలుపుచున్నవారు, అనగ న్యాయవాదులును, ప్రభుత్వముద్వారా లాభము బొందుచున్నవారు, అనగ విద్యార్థులను సహకారమును మాని, దానివలన గలుగు లాభములను విడనాడి, స్వాతంత్ర్యమునకై జరుగు సంరంభమునందు పాల్గొనెద రని కార్యనిర్వాహకసంఘమువారు నమ్ముచున్నారు. నాయకులు అరెస్టుచేయబడి, కారాగృహమునందు బంధింపబడినపుడు వెనుకనుండి త్యాగబుద్ధియు, సేవాసక్తియు, గలిగినవారు కాంగ్రెసు సంస్థలను నిర్వహించుచు, కాంగ్రెసు ఉద్యమమును శక్తివంచన లేకుండ సాగించెద రని కార్యనిర్వాహకసంఘమువారు నమ్ముచున్నారు."

ఈ తీర్మానము గాంధిమహాత్మునకును, వారి యనుచరులకును శాసనోల్లంఘనప్రస్థానమును నడిపించుటకు సంపూర్ణాధికారము నొసగుచున్నది. గాంధిమహాత్ముడు శాసనోల్లంఘనప్రస్థానమును కాంగ్రెసుఆజ్ఞననుసరించి నడుపుచున్నను, స్వయముగ నడుపుచున్నటులును కాంగ్రెసుపక్షమున నడపనటులును పై తీర్మానము విశదము చేయుచున్నది. గాంధిమహాత్ముడు చేయదలచిన శాసనోల్లంఘన ప్రస్థానవిషయమై రాజప్రతినిధికి మార్చి 2 వ తేదీని శ్రీముఖమును బంపియుండిరి. ఆలేఖయందలి సద్భావము బ్రిటీషురాజ్యాధికారులు ఊహింపవలసి

యుందురు. ఇర్విన్‌ప్రభువు పంపిన శ్రీముఖము బ్రిటిషు రాజ్యనీతిజ్ఞుల యహంభావమును, నిర్లక్ష్యస్వభావమును విశదము చేయుచున్నది.

అహమ్మదాబాదునందు మార్చి 21 వ తేదీయందు కూడిన అఖిలభారత కాంగ్రెసు సంఘము నీవిధానమ నేకగ్రీవముగ నామోదించినది. గాంధిమహాత్ముడు శాసనోల్లంఘనము చేసి నిర్బంధింపబడినంతవఱకును ఇతరులు శాసనోల్లంఘనమును జేయగూడదని గాంధిమహాత్ముడు తెలిపియుండెను. మహాత్ముని నిర్బంధానంతర మన్నిరాష్ట్రములవారును వారివారిసంస్కారానుసారము పట్టణగ్రామములందు శాసనోల్లంఘనము చేయవచ్చుననియును, ఆప్రస్థానమును ఆపజనదనియును మహాత్ముడు తెలియజేసెను.

కాంగ్రెసునందు రెండుపక్షములు కలవు. ఒకపక్షము అహింసాధర్మమును పరమధర్మ మని నమ్ముచున్నది. రెండవపక్షము అహింసాధర్మము వర్తమానకాలమునందు స్వరాజ్యసంపాదనకు సాధనముగా నంగీకరించుచున్నది. ఈ రెండుపక్షములవారును శాసనోల్లంఘనప్రస్థానమును కాలక్రమమున నడుపవచ్చు నని గాంధిమహాత్ముడు తెలిపియున్నాడు. దౌర్జన్యమునకు అవకాశములు నిరంకుశప్రభుత్వవిధానమునందే కలవు. ప్రజలందఱును శాసనోల్లంఘనప్రస్థానమును చేయుటకు పూనుకొనినపుడు దాని పరిణామము నిర్ణయించుట దుస్తరము. ప్రజాహృదయము నందు ఉత్సాహము, కార్యపరత్వము ప్రబలునపుడు వేలకువేలు నిరంకుశాధికారవర్గమును ప్రతిఘటించుటకు బయలుదేఱుట సహజము. గాంధిమహాత్ముని స్వరాజ్య ప్రస్థాన మీవిషయమును రుజువుచేయుచున్నది.

మార్చి మాసారంభమునను సబర్మతి ఆశ్రమము నందు గూడిన కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమును, నితరనాయకులును స్వాతంత్ర్య సంపాదనార్థము సత్యాగ్రహ ప్రస్థానమును నడుపుటకు గాంధిమహాత్మునకు సంపూర్ణాధికారము నొసంగిరి.

ఈ సంపూర్ణాధికారప్రదానము వితండవాదములకు మూలమగుట సంతాపకరము. గాంధిమహాత్ముడు సత్యాగ్రహప్రస్థానమును స్వయముగా చేయుట కధికారమును బడసెను. కాంగ్రెసు అనుమతిని బడసినను కాంగ్రెసుపక్షమున జేయుట లేదు. నిరంకుశాధికారారోపణమునకును ఆశ్రమవాసుల నిరసనమునకును కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము చేసిన తీర్మానమునం దవకాశములు లేవని ధీమంతులు గ్రహింపగలరు. గాంధిమహాత్ము డీవిషయమును వారివ్యాసములందును నుపన్యాసములందును వెల్లడిచేసియుండెను. అహింసామార్గము స్వరాజ్యసంపాదనమునకు గాంధిమహాత్మునకు త్రికరణశుద్ధిగాను ధర్మమార్గము. ఆమార్గమునందు విశ్వాసము గలవారందఱును పనిబూనుటకు గాంధిమహాత్ముడు కాంగ్రెసు సమ్మతిని బడసెను. అహింసామార్గమునందు గాంధిమహాత్మునకు గల విశ్వాసము లేనివారు ప్రస్తుతపరిస్థితులందు అహింసాధర్మము నొకసాధనముగాను నమ్ముచున్నారు. దౌర్జన్యమునందు విశ్వాసముగలపక్షము ప్రబలుచున్నవిధమును దేశవ్యవహారములును లాహోరు కాంగ్రెసు వ్యవహారములును విస్పష్టము చేసినవి. దినదిన ప్రవర్థమానం బగుచున్న దౌర్జన్యమార్గమును నిరోధించుట ధర్మపరాయణులకు ధర్మమై యున్నది. స్వరాజ్య స్థాపనమునం దాలస్యము హెచ్చినకొలదిని దౌర్జన్య మార్గము వ్యాపించుటయును సహజము. ఈ మహోపద్రవమునుండి దేశమును గాపాడుటకు సత్యాగ్రహప్రస్థానమును బూనిన గాంధిమహాత్ముడు సకలజనులధన్యవాదములకును పాత్రుడు. గాంధిమహాత్ముడు సత్యాగ్రహ ప్రస్థానమును నారంభించుటకు పూర్వము రాజప్రతినిధికి వ్రాసిన లేఖ దేశస్థితిని నిరంకుశవర్గవిధానమును ప్రజల కర్తవ్యమును విశదముచేసినది.

### రాజప్రతినిధికి గాంధిమహాత్ముడు పంపిన అంత్యలేఖ

'ప్రియమిత్రమా! ఏ సత్యాగ్రహమును ప్రారంభించి దాని బాధ్యతల కన్నిటికిని తలయొగ్గుటకు నే నిన్ని వత్సరముల నుండియును జెఱచుచుంటినో, దాని నిపుడు ప్రారంభింపవలసియున్నది. కావున మార్గాంతర మేదైన కలదా యని తెలిసికొనుటకే ముందుగా మీకీ లేఖను వ్రాయబూనితిని. వ్యక్తిపరముగా నాకు సంపూర్ణవిశ్వాసమే కలదు. ప్రాణముగల యే ఆకృతికినిగూడ నేను బుద్ధిపూర్వకముగా నెట్టి అపకారమును చేయజాలను. ఇక మానవులకు-వారు నాకును నావారికిని అతిదారుణమగు హానిని కలిగించియుండినను గూడ-నే నసలే యెట్టి అపకారమును చేయజాలను. కావున బ్రిటీషు పరిపాలనము

మహానర్థక మనియే నేను భావించుచుండినను ఆంగ్లేయులలో నేవ్యక్తి కైన గాని యీ దేశమునందు వారికి న్యాయమగు హక్కు గల యేసొత్తు కైనగాని నే నెట్టి అపకారమును చేయదలచుకొనలేదు. నా అభిప్రాయమును సరిగా తెలిసికొనగోరెదను. అపార్థమును చేసికొనగూడదు. భారతదేశమున బ్రిటిషు పరిపాలనము మహానర్థకమనియే నేను నమ్మి చుండినను అందువలన నాంగ్లేయులందఱును ప్రపంచమునందుగల యితర జాతులవారందఱికంటెను అధములేయని నేను భావించుటలేదు. ఆంగ్లేయులలో నాకు ప్రాణమిత్రులగువారు చాలమంది కలరు. బ్రిటీషు పరిపాలనమును గూర్చి అహ్లాదకరముగాని సత్యమును వెల్లడించుటకు సంశయింపనట్టి ధైర్యశాలులగు నాంగ్లేయులు దాపటికము లేకుండ వ్రాసిన వ్రాతలవలననే బ్రిటిషు పరిపాలనమునందలి హానిని నేను తెలిసికొనగలిగితిని.

### బ్రిటీషు పరిపాలన మనర్థక మగుట కేమి కారణము?

ఈపరిపాలనము అనర్థక మని నేను భావించుటకు గల కారణమేమి? క్రమక్రమముగ పెరిగిపోవుచున్న ధనాపహరణవిధానమును, భారతీయు లెన్నటికిని గూడ భరింపజాలనట్టి వినాశనకర మగు దుర్వ్యయముతోఁగూడిన సివిలు మిలిటరీ శాఖల పరిపాలన విధానమును అవలంబించుటవలన ఈ ప్రభుత్వము కోట్లకొలది నోరులేని భారతీయులను నిఱుపేదలనుగా నొనరించినది. రాజకీయముగా మమ్ము బానిసలను గావించినది. మా విజ్ఞానముయొక్క మూలాధారములకే ముప్పు తెచ్చినది. మమ్ము నిరాయుధులను గావించుటచే ఆధ్యాత్మికముగ గూడ మమ్ము నీచస్థితికి పాలుచేసినది. దానివలన మేమాంతరంగిక శక్తిని గోల్పోయి అసహాయులమును, పిరికిపందలము నైతిమి.

### ఢిల్లీ సందర్శనము

రౌండుటేబిలు సభవలన నేదో యొకచారి యేర్పడుట నిశ్చయమని నా దేశీయులలో పెక్కుమంది సంతసించినటులు నేను గూడ సంతసించితిగాని, పూర్ణస్వరాజ్యగౌరవము చేకూరుటకు తగిన విధానమును సమర్థించుటకు మీరుగాని, బ్రిటిషుమంత్రివర్గముగాని పూచీపడెదరని వాగ్దానము చేయజాల నని మీరు స్పష్టముగా తెలిపియుండినందున, విద్యాధికులగు భారతీయులు మనఃపూర్వకముగను, తదితరులగు నోరులేని కోట్లకొలది ప్రజలు పరిజ్ఞానములేకుండను దేనికొఱకు పరితపించుచున్నారో అట్టి ఫలసిద్ధి రౌండుటేబిలు సభవలన సిద్ధించుట కవకాశము లేదని స్పష్టమయినది. పార్లమెంటువా రిటుపిమ్మట నెట్లు పరిష్కరించెదరో యిపుడే తెలుపవలెనను ప్రశ్నే యెన్నడును కలుగనే లేదు. పార్లమెంటువా రటుపిమ్మట అనుకూలముగానే పరిష్కరింపగలరను నాశతో నేదయొక విధానము జరిగితీరును. ముందుగానే మంత్రివర్గమువారు వాగ్దానముచేయుట క్రొత్తపద్ధతి గాదు. వెనుక చాల సారులు వారట్లు చేసియేయున్నారు. ఈరీతిగా ఢిల్లీసందర్శనము విఫలమగుటచే 1928 సం॥ కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభలో పవిత్రభావముతో నామోదింపబడిన తీర్మానమును కొనసాగించుటకు నేనును, పండిత మోతీలాలు నెహ్రూగారును పూనుకొనకుండుటకెట్టి అవకాశమును లేకపోయినది. "అధినివేశనస్వపరిపాలన మనగా సమగ్రమగు సంపూర్ణ స్వాతంత్ర్య మన్నమాటయే" యని బాధ్యత గల బ్రిటిషు రాజనీతిజ్ఞులు స్పష్టముగా తెలిపియుండలేదా? ఆ కారణమున మీ ప్రకటనలో మీరు వాడిన అధినివేశనస్వాతంత్ర్యశబ్దమునకు నా అర్థముతోనే మీరు వాడియుండినచో కాంగ్రెసు మహాసభవారు పూర్ణస్వరాజ్యతీర్మానము నామోదించినందుల కెవరు నాందోళనమును చెందవలసిన ఆవశ్యకతయే కలుగదు. కాని త్వరలో నట్టిస్వపరిపాలనమును భారతదేశమున కియ్యవలెననెడియుద్దేశము వారి కెన్నడును కలుగనేలేదని నేను తలచుచున్నాను.

### బ్రిటిషు విధానముయొక్క వైఖరి

ఇదియంతయును పూర్వచరిత్ర. మీరు ప్రకటనచేసినపిమ్మటను గూడ బ్రిటిషు విధానముయొక్క వైఖరిని స్పష్టపరచునట్టిపను లెన్నియో జరిగి యున్నవి. భారత దేశమునకును, బ్రిటను దేశమునకును వాణిజ్యవిషయమున గల సంబంధమునకు నష్టమునుకలిగించెడు నేపద్ధతికిని బాధ్యతగల బ్రిటిషు రాజనీతిజ్ఞు లెవ్వరు నంగీకరింపరనియును, బ్రిటను భారతదేశములకు గల ఆర్థికసంబంధమును నిష్పాక్షికముగను సాకల్యముగను పరీక్షించుటకుగూడ వా రిష్టపడరనియును నిస్సంశయముగా నే వెల్లడియైనది. ఈ ధనాపహరణవిధానమును రూపుమాపుట కెట్టిశాస్త్ర్యను జరుపకున్నచో నిరంతరమును హెచ్చిపోవుచున్న వేగముతో భారతదేశమును పూర్తిగా పీల్చివేయవలసినదే. 1/6 మాఱకపు రేటు (రేషియో) స్థిరమైనవిషయమే యని ఆర్థికసభ్యుడు నుడివెను. దీనివలన నొక్కకలము పోటుతో కొన్నికోట్ల రూపాయలు భారతదేశమునుండి హరింపబడగలవు. ఇట్టి అనర్థకము లెన్నియో కలవు. వాని యన్నిటిలోను ఈయొక్క విషయమును మాత్రమే మార్చుటకుగాను సాత్వికనిరోధము నవలంబింపగోరి గట్టిప్రయత్నము జరుపబడగానే, యీదేశమును పూర్తిగా నలిపివేయుచున్న లా-ఆర్డరుల పేరిట ఈ ప్రయత్నము నడచివేయుటకు మీకు తోడ్పడవలెనని భూస్వాములను కోరుటకు మీరుగూడ సంసిద్ధులయితిరి.

భారతజాతిపేరిట పనిచేయుచున్నవా రందఱును పూర్ణస్వరాజ్యమును కోరుటకుగల ముఖ్యోద్దేశమును సరిగా గ్రహించి దానిని దృక్పథమునం దుంచుకొన కున్నచో నిజముగా పూర్ణస్వరాజ్యము లభించినపు డది యెవరి కొఱకు కోరబడుచున్నదో, యెవరికొఱకది పడవలసినదిగా నున్నదో అట్టికోట్లకొలది నోరులేని ప్రజలకు దానివలన ఇట్టిలాభమును కలుగకుండబోవునట్టి మహానర్థకముగూడ కలుగుట నిశ్చయము. అందులకే నేనిటీవల స్వాతంత్ర్యమెట్టిదిగా నుండవలెనో ఆవిషయమును ప్రజలకు బోధింప నారంభించితిని.

### భూమిశిస్తు మున్నగు నిక్కట్టుల దారుణభారము

ముఖ్యములగు కొన్నివిషయములను మీకు తెలుపగోరుచున్నాను. ఆదాయములో అత్యధికభాగము దారుణభారమును కలిగించు

చున్న భూమిశిస్తువలననే లభించుచున్నది. పూర్ణస్వరాజ్యమునం దిది చాలవరకు తగ్గింపబడవలెను. చాల పొగడబడుచున్న పెర్మనెంటు సెటిలుమెంటులవలన గూడ నెవరో కొద్దిమంది జమీందారులకు మాత్రమే లాభము కలుగుచున్నది. కాని రైతుల కట్టిలాభమును కలుగుటలేదు. రైతుస్థితి యథాప్రకారము చాల దుర్భరముగానే యున్నది. రైతుహక్కు కేవలము తాత్కాలికమే కావున రైతుల అభివృద్ధినే ప్రాధాన్యముగా భావించి భూమిశిస్తును చాలవఱకు తగ్గించుటయే కాక శిస్తుల విధానమునంతనుగూడ సవరింపవలసియేయున్నది. కాని బ్రిటిషువిధానము రైతుప్రాణమునే హరించివేయునట్టిదిగా కనబడుచున్నది. ప్రజలు జీవించుటకు వారు ముఖ్యముగా వాడవలసిన ఉప్పుపైని పన్నువేయుటలోగూడ రైతులకే మిక్కిలి అధికమగు భారము కలుగునట్లు వేయబడినది. దీనిని విధించుటలో చూపబడిన నిష్కారుణ్యము నిష్పాక్షికత్వమువలన నిది బీదలకు మరింత గొప్ప భారముగా కనబడుటగూడ తటస్థించినది. ఏలయనగా, ధనికులకంటె బీదలే వ్యష్టిగను, సమష్టిగను మిక్కిలి హెచ్చుగా నుపయోగింపవలసిన పదార్థము ఈ యుప్పు ఒక్కటే. మద్యములవలనను, మందులవలనను వచ్చెడు ఆదాయములోగూడ మిక్కిలి హెచ్చుభాగము బీదలవలననే చెల్లింపబడుచున్నది. ఈ ఆదాయము వారి ఆరోగ్యమును, నీతినిగూడ పూర్తిగా నశింపజేయుచున్నది. వ్యక్తిస్వాతంత్ర్యమను అసత్యవాదముతో దీనిని సమర్థించుచున్నారు. నిజముగా ధనార్జనకొఱకే దీనిని విధించియున్నారు. 1919 రాజకీయసంస్కరణవిధానమును సిద్ధపరిచినవారు చాకచక్యముతో నీ ఆదాయమును ద్వంద్వపరిపాలనమునందలి బాధ్యతాయుతమనబడెడు ప్రజాయత్తపక్షమునకు వశపఱచిరి. కావున దీనిని నిషేధింపవలసిన బాధ్యతగూడ నాపక్షమువారిపైనే పడినది. అందువలన మొదటినుండియు నాపక్షి మెట్టిమేలునుగూడ చేయజాలకపోయినది. ఏమంత్రియైన నీ మద్యసుంకమును రద్దుచేయుటకు సాహసించినచో దీనివలన కలిగెడు నష్టమును పూర్తిచేయుటకు ప్రస్తుత స్థితిలో నతనికి మరియొక అవకాశమేదియును లేకుండుటచే నతడు ధనలోపమువలన విద్యాశాఖను విరమింపవలసివచ్చును. ఈరీతిగా పన్నులభారము పైనుండి బీదలను నొక్కివేయుచుండగా, వ్యవసాయమునకు సహాయపరిశ్రమయగు నూలుపరిశ్రమను రూపుమాపి యుండుటచే వారికి గల ధనార్జనావకాశముగూడ నశింపజేయబడెను.

## ప్రపంచమునం దత్యధికవ్యయమూలమగు ప్రభుత్వ మిదియే

భారతదేశముపేరిట చేయబడిన బదుళ్ల వృత్తాంతమునుగూడ పేర్కొనిననేకాని భారతదేశవినాశనకథ పూర్తి కాజాలదు. ఈబదుళ్లనుగూర్చి సభలలోను, పత్రికలలోను ఇటీవల చాల విస్తారముగానే వివరింపబడెను. పూర్ణస్వరాజ్యము వచ్చినపిమ్మట నీబదుళ్ల నన్నిటిని గూర్చియు సాకల్యముగా పరీక్షింపవలసి యున్నది. నిష్పాక్షికమగు న్యాయస్థానమునందు, అక్రమములును నన్యాయములునని వీనిలో నేవి నిర్ణయింపబడునో వానినన్నిటిని నిరాకరింపవలసి యున్నది. విదేశీయమగు నీపరిపాలనము కొనసాగించుటకే, పైని పేర్కొనబడిన అక్రమములవంటి అక్రమము లన్నియును జరుపబడుచున్నవి.

మీ జీతముసంగతి చూడుడు. ప్రభుత్వమువారు ఎన్నియో యితరవ్యయములనుగూడ భరించుచు పైగా మీకు నెలకు 21000 రూపాయిలనుగూడ నిచ్చుచున్నారు. బ్రిటనుప్రధానమంత్రికి సాలుకు 5000 పౌనులు జీతమిచ్చెదరు. ప్రస్తుతపు మారకపు రేటునుబట్టి అది నెలకు 5,400 రూపాయలకంటె కొద్దిగా హెచ్చుగా నుండును. భారతదేశమునందు దామాషాను ఒకవ్యక్తికి ఒకరోజునకు ఆదాయము రెండు అణాలు మాత్రమే యైనను మీకు ఒకరోజునకు 700 రూపాయలు జీతము ముట్టుచున్నది. బ్రిటీషుదేశమునందు దామాషాను ఒకవ్యక్తికి ఒకరోజునకు ఆదాయము రెండు రూపాయలు గాని అచటిప్రధానమంత్రికి ఒకరోజునకు 180 రూపాయలు మాత్రమే జీతము ముట్టుచున్నది. భారతదేశమునందలి దామాషా ఆదాయముకంటె 5000 రెట్లు హెచ్చుగా మీకు ముట్టుచున్నది. బ్రిటనుదేశమునందలి దామాషా ఆదాయముకంటె 90 రెట్లు హెచ్చుగా మాత్రమే అచటిప్రధానమంత్రికి లభించుచున్నది. కావున ఈ అపూర్వస్థితినిగూర్చి మీరు నిదానముగా నాలోచింపవలె నని నేను అత్యంతవినమ్రతతో మిమ్ము వేడుచున్నాను. అతి దుఃఖకరమగు నీసత్యము మిక్కిలి బాగుగా మీమనసునకు నాటుటకే మీస్వవిషయము నిచట నిదర్శనముగ నేను వివరించితినిగాని మీకు మనస్తాపమును కలిగించుటకు కాదు. వ్యక్తిపరముగా మీపట్ల నాకత్యధికమగు గౌరవము కలదు. కాన నేనెన్నడు అట్లు చేయజాలను. మీరు పడయుచున్న జీతము మీ కవసరము లేదనికూడ నే నెఱుగుదును. బహుశః మీరు మీకు లభించుచున్న వేతనమునంతను ధర్మకార్యములకే వినియోగించుచుందురు. కాని యిట్టి యేర్పాటులతో కూడిన రాజ్యాంగవిధానము తత్క్షణమే నిర్మూలింపబడదగి యున్నది. రాజప్రతినిధిజీతమెటులు మిక్కిలి హెచ్చుగా నున్నదో అటులే పరిపాలనసంబంధమగు వ్యయమంతయును గూడ మిక్కిలి హెచ్చుగానే యున్నదని వేఱుగా చెప్పనవసరము లేదు.

## పూర్తియగు పరివర్తన మవసరము

ప్రభుత్వాదాయమును తగ్గించుట యెటులు న్యాయమో ప్రభుత్వవ్యయమును తగ్గించుటగూడ నటులే న్యాయమగుచున్నది. అనగా, ప్రభుత్వవిధానమునందు పరివర్తనమును కలిగించుటయన స్వాతంత్ర్యము లభించిననే కాని యిది సాధ్యపడదు. అందులకే 26-1-30 వ తేదిని పూర్ణస్వరాజ్యవాసరోత్సవము జరుపబడెను. ఆనాడు వేలకొలదిగా గ్రామస్థులందఱును ఎట్టి ప్రోత్సాహమును అవసరములేకుండనే ఆ ఉత్సవమునందు పాల్గొనిరి. వారికి స్వాతంత్ర్య మనగా ప్రాణములను పీల్చివేయుచున్న యీపెనుభారము నుండి వెలువడుటయే,

ఈరీతిగా భారతదేశమునందలి ధనమును హరించుటనుగూర్చి భారతీయులు ఏకగ్రీవముగానే పలుసారులు తమ అసమ్మతిని తెలుపుచుండినను గూడ అనుదినమును బ్రిటిషువా రొనరించుచున్న యీ ధనాపహరణపద్ధతిని వదలివేయుటకు బ్రిటను దేశమునందలి రాజకీయ పక్షములవా రెవరును గూడ పూనుకొనుట లేదనియే నేను తలంచుచున్నాను. కాని భారతదేశ మొక ప్రత్యేకజాతిగా జీవింపవలె నని నను భారతీయులు తిండిలేక పస్తుపడి యవసియవసి చావకుండ వారిని కాపాడవలె నినను వెంటనే యీబాధలను తొలగింపజాలిన యొక సాధనమును కనుగొనక తప్పదు. జరుపబడదలచిన రౌండుటేబిలు సభ వలన అనర్థకములు తొలగజాలవు. ఇది నమ్మకమును కలిగింపజాలిన శక్తులు మార్గొనుటయే యగునుగాని హేతువాదమువలన నమ్మకము కలిగింపబూనుట గాదు. ఏలనగా బ్రిటను దేశీయులకు భారతదేశమునందుగల వాణిజ్యాదిలాభములను కాపాడుకొనుటకు తమకుగల సర్వశక్తులను వారు తప్పక వినియోగించెదరు. కావున మృత్యుదేవత బిగి కౌగిలినుండి తప్పించుకొనుటకు మిక్కిలి పటిష్ఠమగు శక్తినే భారతీయులు కనుగొనవలసి యున్నది. ప్రస్తుతము యీ దేశమునందు దౌర్జన్యపక్షమునకు కట్టుబాటును, పలుకుబడియును మిక్కిలి తక్కువగానే యుండినను క్రమముగా దానికి స్థానబలమును సంఖ్యాబలమును గూడ నధికమగుచునే యున్నవి. ఆపక్షమువారికిని నాపక్షమువారికిని గూడ ఆశయ మొక్కటియే కాని ఆపక్షమువారు కోట్లకొలది నోరులేని ప్రజలకు సౌకర్యములను బడయజాలరనియే నేను రూఢిగా నమ్ముచున్నాను. బ్రిటిషు దొరతనమువారికి గల కట్టుబాటుతో గూడిన దౌర్జన్యమును నిరోధించుటకు అకలంకమగు అహింసావిధాన మొక్కటియే సమర్థమగును. మరేదియును సమర్థము కాజాలదను నమ్మకము నాకు మరింత ప్రబలమగుచున్నది.

## అహింస కార్యసిద్ధిని కలిగింపగల శక్తియే

అహింస కార్యసిద్ధిని కలిగింపగలశక్తి కాదని చాలమంది తలచుచున్నారు. నా అనుభవము పరిమితమేయైనను అహింస అతిసమర్థమగు మహాశక్తి కాగలదని నా అనుభవమువలననే నేను గ్రహింపగలిగియున్నాను. కట్టుబాటు లేకుండినను దేశమునందు క్రమముగా పెరుగుచున్న దౌర్జన్యపక్షము నొకవంకను, కట్టుబాటుతో కూడిన దౌర్జన్యపరమగు బ్రిటిషు పరిపాలనము నొకవంకను ప్రతిఘటించుటకు ఈ మహాశక్తిని ప్రయోగించుటయే నా కర్తవ్యము. ఈ స్థితిలో మిన్నకుండినచో ఈరెండు దౌర్జన్యపక్షములును గూడ చెలరేగుట నిశ్చయము. అహింసా విధానము నేను గ్రహింప గలిగినంతవఱకు దానిపటిమయందు నిస్సంశయమును నిశ్చలమునగు విశ్వాసము నాకున్న తరుణమున నే నింకను ఉపేక్షచేయుట పాతకమే యగును. ఈ యహింసావిధానము సత్యాగ్రహరూపమున నిపుడు వెల్లడింపబడును. ప్రారంభమునందు సత్యాగ్రహాశ్రమమువారు మాత్రమే దీనియందు నియమింపబడెదరు. కాని క్రమక్రమముగా నీ విధానములందలి పరిమితుల నన్నిటిని సరిగా గ్రహించియుండియు దీనిలో చేరగోరువా రందఱును దీనిలో చేరుట కుద్దేశింపబడెను. ఈ యహింసావిధానమును ప్రారంభించుటలో 'పిచ్చిప్రమాదము' అనబడు ఆపదకు నేను గుఱియగుట తటస్థింపవచ్చుననికూడ నే నెఱుగుదును. తఱచుగా అతిదారుణములగు ప్రమాదములకు సైతము గుఱియగుచుండిననే కాని యెన్నడును గూడ సత్యవిజయము చేకూరియుండలేదు. తనకంటె నత్యంతప్రాచీనమే యైనను విజ్ఞానమునందు తనకంటె వెనుకబడియుండిన భారతజాతిని, తెలిసియో తెలియకయో, బ్రిటీషుజాతి తనలాభముకొరకు వినియోగించుచున్నపుడు ఆ బ్రిటీషు జాతిని సన్మార్గమునకు గొనివచ్చుట కట్టి ప్రమాదమునకైన సిద్ధపడవలసినదే. లేనిచో నిట్టి మహాప్రయోజనము చేకూరజాలదు. సన్మార్గమునకు గొనివచ్చుట అనుపదమును నేను నిరర్థకముగా వాడియుండలేదు. బుద్ధిపూర్వకముగనే ప్రయోగించితిని. అహింసావిధానము నవలంబించి బ్రిటీషు జాతిని సన్మార్గమునకు మరల్చి భారతదేశమునకు తాము చేసిన అక్రమమును వారు గ్రహింపగలుగునట్లు చేయుటయే నా ఆశయము.

## రౌండుటేబిలు సభ జరుగుటకు పూర్వము అనర్థములను తొలగింపవలెను

మీప్రజలకు నేను హానిని కలిగింపగోరను. నాప్రజలకు నే నెటుల సేవజేయ గోరెదనో అటులే మీవారికిగూడ సేవచేయ గోరెదను. ఎల్లపుడు నేనటులు చేయుచుంటిననియే నమ్మెదను. 1920 వరకును అంధప్రాయముగా నేను వారికి సేవచేసితిని. అపుడు నిజస్థితి నాకు తెలియవచ్చుటచే అసహాయోద్యమమును కనుగొంటిని గాని దాని యుద్దేశముగూడ వారికి సేవజేయుటయే. నాకుటుంబములోని నా ఆప్తబంధువుల విషయమున నే సాధనమును ప్రయోగించి సఫలుడనైతినో దానినే మీవారి విషయమునగూడ ప్రయోగించితిని. నాకు నావారిమీదను, మీవారిమీదను సమానప్రేమ యుండుటయే నిజమయినచో నది చిరకాలము దాగియుండజాలదు. నాకుటుంబమువారు గూడ పెక్కు వత్సరములపాటు నా విధానమును పరీక్షించిన పిమ్మటనే నాకు వారిపై ప్రేమయుండుటవలననే నే నావిధానమును ప్రారంభించితినని గ్రహింపగలిగిరి. అటులే మీవారుగూడ నీ విషయమును కాలక్రమమున గ్రహింపగలుగుదురు. నేను భావించుచున్నరీతిని చాలమంది భారతీయులు ఈ సత్యాగ్రహమునందు చేరినచో త్వరలోనే బ్రిటిషువారు తమపద్ధతిని మార్చుకొనినయెడల తప్ప, సత్యాగ్రహయోధులందఱును అతిదారుణములగు కష్టములకు పాల్పడుట నిశ్చయము. వానిని కాంచినంత మాత్రముననే కఠినపాషాణకర్కశహృదయములందు

సైతము మార్పుకలుగగలదు. పైని పేర్కొనబడిన అనర్థకములవంటి అనర్థకముల నన్నిటిని తొలగించుటకే సత్యాగ్రహము నవలంబించుచున్నాము. మేము బ్రిటిషువారితో గల సంబంధమును ఛేదింప గోరుటకు కారణ మేమనగా యీ అనర్థములన్నియును తొలగిపోయినచో మార్గము సుకరమగును గాన నపుడు మైత్రితో గూడిన రాయబారములు జరుపబడును. భారతదేశముతో బ్రిటిషువారికి గల వాణిజ్యసంబంధమునందు చేరియున్న దురాశ తొలగిపోయినచో మాస్వాతంత్ర్యమును మీరు సులభముగనే గుర్తింపగలుగుదురు. కావున ఈ అనర్థకములను వెంటనే తొలగించుటకు సౌకర్యములను కలిగింపవలెననియు అటులు చేసినచో సమానస్థితిగల రెండుదేశములవారు మనఃపూర్వకముగా సమావేశమై సకల మానవహితార్థము సోదరభావముతో నాలోచించుటకు వీలగుననియును, ఆ సభలో రెండుదేశములవారికిని సమానముగా లాభకరమగు వాణిజ్యవిధానమును నిర్ణయించుటనుగూర్చియు పరస్పర సహాయమునుగూర్చియు నాలోచింప వీలగుననియును నేను మీకు సగౌరవముగా విన్నవించుచున్నాను.

## ఉప్పుపన్ను మిక్కిలి అన్యాయ మైనది

భారతదేశమునందలి మతకలహములకు అనవసర మగు ప్రాధాన్యము నొసగుచు మీరు ముచ్చటించితిరి. ఒక ప్రభుత్వవిధానమును స్థిరపఱచుటకు అవి ముఖ్యమైనవే యనుట కెట్టిసంశయమును లేదు గాని ప్రబలసమస్యలను పరిష్కరించుటకు వీనివలన నెట్టి అభ్యంతరమును కలుగదు. ఏలయనగా ఈ గొప్పసమస్యలు అన్ని మతములవారికిని సమానముగనే వర్తించును. ఈ అనర్థములను తొలగించుటకు మీ కిష్టములేనియెడలను ఈ నెల 11 వ తేదీలోగా ఈలేఖ మీచిత్తము నాకర్షింపజాలక పోయినయెడలను నేను తీసికొనిపోగలిగినంతమందిని తోడ్కొని ఉప్పునిబంధన నుల్లంఘించుటకు ఆశ్రమమునుండి బయలుదేరెదను. బీదవారిస్థితినిబట్టి చూచినచో, అన్నిపన్నులలోను ఉప్పుపన్నే మిక్కిలి అన్యాయ మైనదని నేను భావించుచున్నాను. పూర్ణస్వరాజ్యోద్యమము ప్రధానముగా బీదలకొఱకే యగుటచే ఈ ఉప్పు అనర్థకమును తొలగించుటకే తొలుదొల్త ప్రారంభింపదలచితిని. క్రూరమగు నీసుత్తపద్ధతికి మేమింతకాల మెటులు సైరింపగలిగితి మనునదియే మిక్కిలి చోద్యమైన విషయము. మీరు నన్ను అరెస్టు చేయుటవలన నా సంకల్పమును నిరోధించుటకు మీ కవకాశము కలదని నే నెఱుగుదును. నన్ను మీరు అరెస్టు చేసినపిమ్మట నీ ఉప్పుచట్టమును ఉల్లంఘించుటలో కట్టుపాటుతో సత్యాగ్రహము నొనరించుటకును, శిక్షాస్మృతి కెన్నడును కళంకమును తెచ్చియుండనట్టి శిక్షల ననుభవించుటకును సంసిద్ధు లయినవారు లక్షలకొలదిగా ముందునకు రాగలరనియే నే నాశించుచున్నాను.

## ఈలేఖ బెదరించుటకు వ్రాయబడినది కాదు

నాకు సాధ్యమయినంతవఱకు మీకనవసర మగునట్టి యిబ్బందినిగాని మరియెట్టియిబ్బందినిగాని కలిగించుట నా అభిప్రాయము కాదు. ఈ లేఖలో ముఖ్యవిషయము లేవైన గలవనిమీరు తలచునెడలను, వానినిగూర్చి నాతో చర్చింపవలెనను అక్కఱ మీకుండినయెడలను, అందులకు గాను ఈలేఖ నంతవరకును ప్రకటింపవలదని మీరు కోరునెడలను, ఈ లేఖ మీకు చేరినవెంటనే మీ రారీతిగా నాకు తంతివార్తను పంపినచో నే నటులే చేసెదను. ఈ లేఖలోని విషయములను అనుసరించుటకు మీ కవకాశము కలదని మీరు తలచినయెడల తప్ప, మీరు నా ప్రయత్నమునకు అంతరాయమును కలిగింపకుందురుగాక యని మిమ్ము వేడుచున్నాను. నేను సత్యాగ్రహమును ప్రారంభించుటకు ముందు మీ కీ లేఖను పంపుట యొక్క పవిత్ర మగు విధి యని నేను భావించుటవలననే మీ కీలేఖను వ్రాసితినిగాని మిమ్మును బెదరించుటకు వ్రాయలేదు కావున భారతీయుల ఆశయమునందు నమ్మకము గలవాడును అహింసా విధానమునందు గాఢవిశ్వాసము కలవాడును నామిత్రుడు నగు నొక ఆంగ్లేయయువకుని పరిముఖముననే మీకీ లేఖను నేను ప్రత్యేకముగా పంపియుంటిని. ఇందులకే యీ ఆంగ్లేయయువకుని భగవంతుడు నా ఆశ్రమమునకు పంపెననికూడ నేను నమ్ముచున్నాను.

చిత్తగింపవలెను:

విశ్వసనీయుడగు మీ మిత్రుడు,

యం. కే. గాంధి.

ప్రియమైన గాంధిగారూ!—ఈ నెల 2 వ తేదిని మీరు వ్రాసిన లేఖ చేరినదని మీకు తెలియచేయవలెనని రాజప్రతినిధి నన్ను కోరెను. శాసనోల్లంఘనమును, శాంతికి అపాయమును విధిగా కలుగజేయదగు పద్ధతిని, మీరవలంబింపదలచుచున్నారని వినుటకు రాజప్రతినిధి చింతిలుచున్నాడు.

చిత్తగింపవలెను:

పి. కన్నింగుహాము,

ప్రైవేటు సెక్రిటరి.

ఇర్విను ప్రభువునకు పంపిన లేఖ.

గాంధిమహాత్ముని లేఖయందలి కఠినోక్తులు భరతవర్ష మనుభవించుచున్న హృదయవేదనకు నిదర్శనములు. బ్రిటీషుప్రభుత్వము ప్రజాసత్త్వమును నిర్వీర్యము చేసినది. ప్రజాసత్త్వమును చల్లార్చెడి ప్రశాంతస్థితి ప్రజాప్రయోజనములకు నిరుపయోగము. ప్రాణములేని దేశమునకు శాంతి రైళ్లు యానవాహనములు సుపరిపాలనము నిరుపయోగములు. విదేశప్రభుత్వము స్వప్రయోజనములకై యేర్పడినవిధము నాంగ్లాధికారు లనవరతము సంస్మరింపజేయుచున్నారు. జవసత్త్వములు గల భరతవర్షము

వలెజవసత్త్వములులేని భరతవర్షము స్వప్రయోజనము లకును బ్రిటీషు ప్రయోజనములకును ప్రపంచప్రయోజన ములకును వినియోగపడజాలదు. ఇర్విన్ప్రభువును, బ్రిటీషు పాలకవర్గమును నీపరమార్థమును గ్రహించుట ధర్మము. ఇర్విన్ప్రభువు పంపిన ప్రత్యుత్తరము గౌరవసూచక మైనను నిరుపయోగముగ నున్నది. గాంధిమహాత్ముడు కోరినవిషయములం దొకవిషయమునకైనను సమాధాన ములేని ప్రత్యుత్తరము సామ్రాజ్యాభిమానమునకువలెను ధర్మలక్ష్యమునకు సాధనము గాదని లేఖార్థము విస్పష్టము చేయుచున్నది. గాంధిమహాత్ముడును ఇర్విన్ప్రభువును ప్రకటించిన యుత్తరప్రత్యుత్తరములు భారతీయులకు కర్త వ్యమును సువ్యక్తము చేయుచున్నవి. సకలజాతులకును జన్మహక్కయిన స్వరాజ్యసంపాదనమునకు భారతీయు లవలంబింపవలసిన ధర్మప్రస్థానమును గాంధిమహాత్ము డవ లంబించుట ధర్మవిజయమునకు శుభసూచకముగ నున్నది.

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

ప్రపంచచరిత్రయందును, హిందూదేశచరిత్రయం దును శుక్లసంవత్సర ఫాల్గున శుద్ధద్వాదశీ బుధవారము పర్వదినముగ పరిగణింపబడగలదు. గాంధిమహాత్ము డా

సత్యాగ్రహ ప్రస్థానము

నాడు ప్రాతఃకాలమునందు సత్యాగ్రహా శ్రమమును వదలి సత్యాగ్రహదళముతో సత్యాగ్రహప్రస్థానము నుపక్రమించెను. గాంధిమహాత్ముడు పూనిన సత్యాగ్రహప్రస్థానము బుద్ధ దేవునిసంసారపరిత్యాగమును, శ్రీరాముని వనవాసస్వీకా రమును, ధర్మరాజాదులయరణ్యాజ్ఞాతవాసములనుసంస్మరింప జేయుచున్నది. సత్యాగ్రహప్రస్థానారంభమునందు మహా త్ముడు చేసిన హితోపదేశములు లోకమునందలి శాంతికా ములకును, స్వాతంత్ర్యప్రియులకును, సత్యాన్వేషులకును ధర్మనిర్వహణ మార్గమును బోధించుచున్నవి. ప్రపం చమునందు ధర్మాధర్మ సంరంభమునందు "యతో ధర్మ స్తతో జయః" అని గాంధారి దుర్యోధనునకు జేసిన సత్యోపదేశము సఫల మగుచున్నది. సుపరిపాలనము కన్నను స్వపరిపాలనము శ్రేష్ఠ మని రాజ్యాంగవిశా రదు లందఱును అంగీకరించుచున్నారు. పారతంత్ర్యము సకలానర్థములకును మూల మగుచున్నది. భారతీయ సంస్కారమున కపరిచితు లైన పాశ్చాత్యాధికారులు భార తీయులకు రాజ్యాంగశిక్షణమునకు గురువులు కాజాలరు. సామ్రాజ్యాభిమానమునకును జాతీయాహంకారమున కును, ప్రభువు లైన బ్రిటిషు రాజ్యాధికారులు స్వరాజ్య శిక్షణమునకు గురుత్వము వహించుట కలలోనివార్త. అనుదినమును క్షీణించుచున్న భరతవర్షమునకు స్వరా జ్యావసరమును రాజ్యాంగవేత్త లందఱును అంగీకరించు చున్నారు. దేశమునకు స్వతస్సిద్ధము లైన కులభేదములు మతభేదములు జాతిభేదములు స్వరాజ్యసంపాదనమున కును, సత్యాగ్రహప్రస్థానమునకును ప్రతిబంధకములు గాజాలవు. స్వార్థపరు లైన నిరంకుశాధికారులవలె, స్వార్థ పరాయణు లైనభారతీయనాయకులును పూర్ణస్వరాజ్యా శయమును సత్యాగ్రహప్రస్థానమును నిందించుటయును నిరసించుటయును సహజము. షౌకతాలీగారి మతాభిమా నము, సంఘాభిమానము వారిని సత్యాగ్రహప్రస్థానము నందు విముఖులను జేయుట సహజము. సత్యాగ్రహ ప్రస్థానమునకు మూలాధారము ధర్మనిరీక్షణము గాని వ్యక్తుల భేదాభిప్రాయములు గావు. గాంధిమహాత్మునిసత్యా గ్రహప్రస్థానము ప్రపంచదృష్టిని ధర్మనిరీక్షణమునందు లగ్నము చేయుచున్నది. స్వాతంత్ర్యసంపాదనమునకు పశు బలము మూల మను సిద్ధాంతమును నిర్మూలము జేయుటకు మహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానము ధర్మబల మును ప్రతిపాదించుచున్నది. ఖద్దరుబట్టలు, కదుళ్లు, ఏకు లు, స్వరాజ్యసంపాదనమును జేయుట హాస్యాస్పదముగ గనుపట్టినను ధర్మబలవిజయము కాలక్రమమున వ్యక్తము కాగలదు. దేశమునం దంతటను గాంధిమహాత్మునిపట్ల ప్రజ లు చూపుచున్న యాదరగౌరవములు సత్యాగ్రహవిజయ మునకు శుభసూచనలుగ నున్నవి.

గాంధిమహాత్ముడు సత్యాగ్రహదళముతో సత్యా గ్రహాశ్రమమును వదలి శాసనోల్లంఘనప్రస్థానము నారంభ

భించిన శుభదినము లోకమునం దంతటను పర్వదినముగ పరిగణింప బడగలదు. అహమదాబాదు పట్టణమునందు వేలమంది ప్రజలు శ్రీరామచంద్రమూర్తి అరణ్యావాసమునకు వెడలి నప్పుడువలెను విచారాక్రాంతులై నాలుగు మైళ్ల దూరమువఱకును గాంధిమహాత్ము ననుసరించిరి. స్థావరమైన సత్యాగ్రహాశ్రమము జంగమాశ్రమముగ మారినది. సత్యాగ్రహయాత్ర సత్యాగ్రహసత్రయాగ రూపమును దాల్చినది. గాంధిమహాత్ముడు సత్యాగ్రహ దళముతో విశ్రమించెడి స్థలములు పుణ్యక్షేత్రములై వెలయుచున్నవి. వేలకొలది ప్రజలు మార్గమునందును శిబిరములందును మహాత్ముని సందర్శించి కృతార్థులగు చున్నారు. ప్రజలు కానుకలను మంగళహారతులను సమర్పించుచున్నారు. గ్రామోద్యోగు లుద్యోగములను విసర్జించు చున్నారు. శ్రీరామసంకీర్తనలు, ప్రార్థనలు, గీతాపఠనము ధర్మోపదేశములు నియమములు శాంతి సమరప్రభావమును విశదముచేయుచున్నవి. వందలమంది ప్రజలు సత్యాగ్రహప్రస్థానమునందు జేరుట కుత్సాహమును జూపుచున్నారు. దుర్బలుడైన గాంధిమహాత్ముడు 61 వ ఏటను పరమోత్సాహముతో పూర్ణస్వరాజ్య సంపాదనమునకై చేయుచున్న సత్యాగ్రహప్రస్థానము నిరంకుశదుర్గమునందు సయితము సంచలనమును గలుగ జేసినది. ప్రపంచదృష్టియంతయును శాంతిసంరంభమున కాదర్శముగ నున్న సత్యాగ్రహప్రస్థానమునందు నాయకు డైన గాంధిమహాత్మునియందును లగ్నమగుచున్నది. దేశవ్యవహారము లతివేగముగ నడుచుచున్నవి. డిసెంబరు 31 వ తేదిని లాహోరు కాంగ్రెసు, కాంగ్రెసులక్ష్యము వెంటనే పూర్ణస్వరాజ్యస్థాపన మని నిర్ణయించినది. జనవరి 26 వ తేదిని దేశమునం దంతటను వేనవేలు సభలను జరిపి లక్షలమంది భారతీయులు పూర్ణస్వరాజ్యప్రకటనమును జేసిరి. ఫిబ్రవరి మాసాంతమునందు కాంగ్రెసు కార్యనిర్వాహకసంఘము సత్యాగ్రహప్రస్థానమును నిర్ణయించినది. మాసాంతమునందు గాంధిమహాత్ముడు రాజప్రతినిధి కంత్యసందేశమును బంపి మార్చి 12 వ తేదిని సత్యాగ్రహప్రస్థానము నుపక్రమించెను. ధర్మబలమునకును ఆత్మవిశ్వాసమునకును గల ప్రతిభను గాంధిమహాత్ముడు భారతీయసోదరులకును నిరంకుశవర్గమునకును ప్రత్యక్షము చేయగలిగెను. భారతీయులు సందేహసమ్మోహములను విడిచి ఆత్మవిశ్వాసమును గలిగి స్వధర్మారాధనమును జేసి కృతకృత్యులగుదురు గాత!

భరతవర్షస్థితికి మూలాధారమైన స్వరాజ్యాందోళనమునందు రాష్ట్రీయసమస్యలు ప్రాంతీయవ్యవహారములు దేశసేవాపరాయణుల లక్ష్యము నాకర్షింపజాలకున్నవి. స్వప్రయోజనపరాయణుల కీసమయము లాభదాయకముగ నున్నను ప్రజాప్రయోజనములకు ప్రయోజనకరము గాకున్నది.

**ఆంధ్రప్రబోధము**

భారతీయప్రబోధముతో నాంధ్రప్రబోధమును సర్వతోముఖమైన వికాసమును బొందుచున్న విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. శుక్లసంవత్సరము నందు గాంధిమహాత్ము డాంధ్రదేశమునందు సంచారముచేసి యాంధ్రప్రబోధమునకు దోహదంబు నొసంగిన విధమును మహాత్ముని సంచారవిధానము విశదముచేసినది. ఆంధ్రుల భక్త్యుత్సాహములను మహాత్మునిసంచారము సువ్యక్తముచేసినది. నిర్మాణకార్యక్రమమునం దాంధ్రులు చూపుచున్న యుత్సాహము వారి దేశభక్తిని, సేవాపరాయణత్వమును వెల్లడి చేసినవి. అనుకూలపరిస్థితులును, ప్రభుత్వాదరణమును లేకపోయినను స్వయంసహాయమూలమునను ఆంధ్రోద్యమము ఫలవంత మగుచున్నవిధమును దేశవ్యవహారములు విశదముచేయుచున్నవి. ఆంధ్రవిశ్వవిద్యాలయ నిర్మాణమునకై ప్రభుత్వమువారు శాసనరూపమునను నిర్ణయించిన 36 లక్షల ధనసహాయ మీఫలప్రాప్తికి వినియోగపడునని నమ్ముచున్నాము. ఆంధ్రాభ్యుదయమునకు మూల మైన భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణము భారత రాజ్యాంగసంస్కరణములకు సంబంధించియున్నది. రాజ్యాంగసంస్కరణములందు భాషాప్రయుక్తరాష్ట్రముల నిర్మాణమును నాయకులు నిర్ణయించి ఆంధ్రాభ్యుదయమును పోషించెదరుగాత!

శం: శా

ఆంధ్రాభ్యుదయము ప్రభుత్వాధీనసాధ్యము లైన విషయములందు వెనుకబడియున్నను స్వయంసహాయ మూలమునను సాధ్యమైన విషయములందు పురోవృద్ధిని బడయుచున్నది. సంగీతసాహిత్యములు, లలితకళలు, శాస్త్ర పరిశోధనలు, ధర్మకార్యములు వికాసమును బొందుచున్న విధమును సంవత్సరాదిసంచికలోనివ్యాసములు విశదము చేయుచున్నవి. మత సాంఘిక రాజకీయవిషయములందాంధ్రలోకాభినివేశమును భక్త సమాజములు, మత సమాజములు, సాంఘికసంస్థలు, రాజకీయనిర్బంధములు విశదము చేయుచున్నవి. ఆంధ్రమహిళలు విద్యాసంస్థలను నిర్వహించుచున్నారు. రాజకీయ మతసాంఘికవిషయములందు పాల్గొనుచు దేశాభ్యుదయమునకు పాటుపడుచున్నారు. యువజను లుద్రేకోత్సాహభరితు లై సకల రంగములందు పురోభివృద్ధిని గోరుచున్నారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటి స్వస్థలమునందును, పరస్థలములందును ఆంధ్రప్రతిష్ఠను సంవర్ధించుచున్న విధమును కాంగ్రెసు వ్యవహారములు విశదము చేయుచున్నవి.

గాంధిమహాత్ముడు పూర్ణస్వరాజ్యసంపాదనమునకు పూనిన సత్యాగ్రహప్రస్థాన మాంధ్రనాయకులయందును ప్రజలయందును పరమోత్సాహమును గలుగజేయుచున్నది. అన్నిమండలములందును సత్యాగ్రహప్రస్థానమునందు ప్రజలు చూపుచున్న ఉత్సాహ మాంధ్రుల స్వాతంత్ర్యాభిలాషను విశదముచేయుచున్నది. సత్యాగ్రహ ప్రస్థానమును ఏకముఖమునను ఏకప్రదేశమునను నడుపవలసినదియును, అనేకముఖములను అనేకప్రదేశములను నడుపవలసినదియును నిర్ణయించుట సాధ్యము గాకున్నది. ఏకముఖమున నడపుట యొకవిధమునను, అనేకముఖముల నడపుట మఱియొకవిధమునను ప్రయోగయోగ్యములుగ గనుపట్టుచున్నవి. ప్రారంభమునం దేకముఖమునను ఏక ప్రదేశమునను నడుపుటవలన కార్యవిధానము, గమ్యస్థానము, సాధకబాధకములు, భిన్నమండలములవారికి సుగ్రాహ్యములు కాగలవు. కాలక్రమమున నన్నిమండలముల వారును నీమార్గము నవలంబించుటకు సావకాశములు గలుగగలవు. అన్నిప్రాంతములవారును, మండలముల వారును శాసనోల్లంఘనమును చేయుట అవసర మైనపుడన్నిమండలములును సత్యాగ్రహమునకు సిద్ధముగ నుండుట అవసరమగుచున్నది. ఆరంభమునందు ఒకరీనసత్యాగ్రహదళము నైనను ఏకముఖమున నేకప్రదేశమున నడపుటయును, అనంతరము వివిధప్రాంతములందును, సత్యాగ్రహమును నడపుటయును ప్రయోగయోగ్యముగ గనుపట్టుచున్నది. సత్యాగ్రహప్రస్థానమును ఏకప్రదేశమున నడపినను, అనేకప్రదేశములందు నడపినను, ఆంధ్రనాయకులు భేదాభిప్రాయములను స్వస్థలాభిమానమును విడిచి కలసి పని చేసి గాంధిమహాత్మునిసంకల్పమును స్వరాజ్యాశయమును సఫలమును జేయుట ప్రయోజనకరము. ఆంధ్ర దేశమునందు సత్యాగ్రహప్రస్థానమునకు నాయకుడుగ నియమింపబడిన దేశభక్త కొండ వేంకటప్పయ్యపంతులు గారి నాయకత్వమున సత్యాగ్రహప్రస్థానము దౌర్జన్య రహితముగ దిగ్విజయమును బడయుటకు భగవదనుగ్రహము ప్రజల ఆదరణపోషణములును గలుగుగాక!

రాజకీయావలంబనమును, ఆశ్రయమును లేనిదే ఆంధ్రస్థితి యన్నిరంగములందును నసహ్యముగ నున్నవిధమును దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. చిరకాల సంవర్ధితము లైన ఆంధ్రవ్యక్తిత్వము పోషణలేక కృశించుచున్నది. స్వాతంత్ర్యస్థితిలేనిదేశమునందు సాహిత్యము, కళలుపరిశ్రమలు వికసించుట కవకాశములులేకున్నవి. రాజకీయసంరంభమునందును, నిర్మాణకార్యవిధానమునందును, ఆంధ్రరాష్ట్ర జాతీయోపసంఘము చూపుచున్న యుత్సాహము గాంధిమహాత్మునిప్రశంసలకు పాత్ర మై భావిభాగ్యోదయమునకు శుభసూచకముగ నున్నది. మార్చి 12 వ తేదిని ఏలూరునందు సమావేశమైన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము చేసిన తీర్మానమీవిషయమును విస్పష్టము చేయుచున్నది.

బెజవాడయందు ఫిబ్రవరి 23 వ తేదియందు కూడిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘసభ చేసిన యాక్రిందితీర్మా

నమును, ఏలూరునందు మార్చి 12 వ తేదిని కూడిన కార్య నిర్వాహకసభయును గాంధిమహాత్ముని శాసనోల్లంఘన ప్రస్థానమునందు విశ్వాసమును వ్యక్తముచేసినవి. ఆంధ్ర మహాజనులు గాంధిమహాత్ముని విశ్వాసమును ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుసంఘవిశ్వాసమును, పూర్ణస్వరాజ్యప్ర స్థానమును సాధించుటకు, సఫలముచేయుదు రని నమ్ము చున్నాము.

(ఎ) అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు ఈనెల 15 వ తేదిని శాసనోల్లంఘనమును గూర్చి కావించినతీర్మా నము నీసభవారు హృదయపూర్వకముగా నామోదించుచు, రాబోవు సంరంభములో మహాత్మగాంధిగారి నాయకత్వమునందు తమకు గల సంపూర్ణవిశ్వాసమును ప్రకటించుచున్నారు.

(బి) కార్యనిర్వాహకసంఘమువారి తీర్మానము నములు జరుపు టకు వలసిన స్వచ్ఛంద సేవకులను, అహింసావ్రతమును ధర్మవిశ్వా సముగా నమ్మినవారి నాయకత్వము క్రింద పని జేయుటకు శపథము వహించినవారిని, ఆంధ్రరాష్ట్రముయొక్క ఆవశ్యకమునకు చాలినంత మందిని సమకూర్చుట కీసభవారు తీర్మానించుచున్నారు.

(సి) ఈ రాష్ట్రములోని కాంగ్రెసు సభ్యు లందఱును శాసనో ల్లంఘనోద్యమమునందు కేరి శాసనోల్లంఘనాదులయెడల సర్వవిధముల సంపూర్ణ సహకారాభిమానములను జూపుచు, ఎంతటి ఆగ్రహోద్రేక సందర్భములలోను సంపూర్ణమైన అహింసావ్రతమునే చేపట్టియుండ వలయు నని యీసభవారు తీర్మానించుచున్నారు.

(డి) ఈదేశములో గవర్నమెంటువారితో పూర్తిగానో కొంత వఱకో సంబంధము గల సంస్థలలో జేరియున్నలాయర్లు, ఉపాధ్యా యులు, విద్యార్థులు మున్నగువారందఱును దేశముయొక్క ఆఖరుస్వా తంత్ర్యసమరములో జనసమూహ మందఱితోపాటు చేరవలె నని యీ సభవారు గోరుచున్నారు.

(ఇ) ఈతీర్మానములను ప్రయోజనకరముగా నములు జరుపుటకు కావలసినప్రచారము చేయుట, స్వచ్ఛంద సేవకులను సమకూర్చుట మున్నగు కార్యముల నిర్వర్తించుటకును, ఆంధ్రరాష్ట్రములో శాసనో ల్లంఘనసంరంభమును ప్రారంభించి నడిపించుటకు సంపూర్ణాధికారము పొందిన ప్రత్యేకోపసంఘము నొకదానిని నెలకొల్పుటకును ఆం. రా. కా. కార్యనిర్వాహకసంఘమున కీసభవారిందుమూలముగా అధికార మిచ్చుచున్నారు.

(యఫ్) ఈలోగా జిల్లా కాంగ్రెసు సంఘము లన్నియు తమ తమ స్థానికసందర్భముల కనుగుణముగా ఏయే అనుకూలప్రదేశము లందు ఎటువంటి శాసనోల్లంఘనప్రయత్నముల నెంతవఱకు సాగించు టకు వీలుగా నుండునో, అట్టిచోట్ల నెట్టి సానుభూతిసహాయముల కవకాశ మున్నదో ఆయావివరముల నెల్ల ౧౯౩౦ సం॥ మార్చి ౬ వ తేదిలోగా ఆం. రా. కా. సంఘ కార్యస్థానమునకు జేరునట్లు పంప వలె నని యీసభవారు కోరుచున్నారు.

(జి) ఈపైతీర్మానములను వీలైనంత త్వరలో అమలు జరుపుట కుగాను జిల్లా కాంగ్రెసు సంఘము లన్నియు కాంగ్రెసు ప్రచారకుల సమావేశములను తమతమ జిల్లాలలో వెంటనే సమకూర్పవలె నని యీ సభవారు కోరుచున్నారు.

ప్రమోదూత సంవత్సరాది సంచిక

భగవదనుగ్రహమువలనను ప్రమోదూతసంవత్స రారంభమునందు 21 వ సంవత్సరాదిసంచికను ఆంధ్ర లోకమునకు సమర్పింప గలిగినందులకు సంతసము గలుగు చున్నది. అనంతమైన కాలచక్రమునం దిరువదేండ్ల పరిమాణ మతిస్వల్ప మైనను ప్రపంచవ్యవహారములందును, ఆంధ్రదేశ వ్యవహారములందును విశేషముగ గన్పట్టు చున్నది. గతించిన 20 ఏండ్లయందును ప్రపంచవ్యవహారము లందు గలిగిన మహాపరివర్తనమును సంచికల సింహావ లోకనము విశదము చేయుచున్నది. రాజ్యాంగములు, సాంఘికవ్యవస్థలు, ఆర్థికసిద్ధాంతములు, తాఱుమాఱైనవి. ప్రపంచ మంతయును శాంతిని పునర్నిర్మాణమును గోరు చున్నవిధమును నానాజాతిసమితి, ఆయుధసంక్షేపసభలు, ధర్మసిద్ధాంతములు, స్వయంనిర్ణయసూత్రములు, విశదము చేయుచున్నను సంగ్రామప్రయత్నములు పూర్వమువలెనే సాగుచున్నవి. సంగ్రామప్రయత్నములను నియమించు టకు మహారాజ్యములు చేయుచున్న ప్రయత్నములు విఫ లము లైనవిధమును పంచమహారాజ్యముల సమావేశము విశదము చేసినది. ప్రపంచవ్యాప్తములైన మహాపరివర్తన స్వరూపస్వభావములను సంచికలయందలి వ్యాసములు, చిత్ర పటములు, పాటలు, పద్యములు, విశదముచేయుచున్నవి.

విశ్వప్రవృత్తియందు మానవధర్మాభ్యుదయమును నిరూపించుటకు కళాకావ్యములు సాధనములుగ నున్నవి. చిత్రకారులు రూపలేఖనమునను, కావ్యనిర్మాతలుభావ రూపమునను, శాస్త్రజ్ఞులు సిద్ధాంతముల రూపమునను నిరూపించెడు దివ్యవిలాసములు మానవధర్మాభ్యుదయ

మును వెల్లడిచేయుచున్నవి. దేశాభ్యుదయమునకును, ధర్మాభ్యుదయమునకును లలితకళాభ్యుదయము ప్రమాణముగ నున్నది. లలితకళలు శాంత, శివ, సుందరరూప భావములను దైవవిభూతులను ప్రత్యక్షము చేయుచు దుఃఖభూయిష్ఠమైన సంసారప్రవృత్తియందు ఆనందానుభవమునకు సాధన మగుచున్నవి. అజంతాశిల్పములు, బౌద్ధగాథలు, శ్రీకృష్ణవిలాసములు, నటరాజనృత్యములు మానవధర్మాభ్యుదయమునకు లలితకళలు వినియోగపడగల విధమును విశదము చేయుచున్నవి. ఆంధ్రాభ్యుదయమునకు లలితకళలు వినియోగపడుచున్న విధమును సంచికలలోని వ్యాసములు, చిత్రపటములు, ముఖపటము విశదము చేయుచున్నవి.

మానవజాతుల వ్యక్తిత్వము వారికళలయందును, కావ్యములందును, నిత్యజీవనమునందును గోచరించుచుండును. అజంతాచిత్తరువులు చిత్రకళయందు ఆంధ్ర వ్యక్తిత్వమును నిరూపించు చున్నవి.

**చిత్రపటములు**

అజంతాచిత్రములు వ్యక్తముచేసెడి లీలావిలాసములు భావరూపములు వస్త్రాలంకారములు ఆంధ్రహృదయమునకు ప్రియమైన శిల్పవిన్యాసమును విశదముచేయుచున్నవి. అజంతాశైలిని ఆంధ్ర చిత్రలేఖనమునందు మూర్తీభవింపజేయుటకు దామెర్ల రామారావుగారు చేసిన ప్రయత్నములు సార్థక మగుచున్నవి. ప్రమోదూత సంవత్సరాది సంచికయందు ముద్రితములైన త్రివర్ణచిత్రములు రూపలేఖనమందు ఆంధ్రవ్యక్తిత్వమును ప్రతిపాదించుచున్నవి. రామారావుగారు చిత్రించిన రాధావిహారము, శ్రీమతి బుచ్చి కృష్ణమ్మగారి రాణీసంయుక్త సందేశము, శ్రీయుత వేంకటేశ్వరరావుగారి విహారసుందరి, శ్రీమతి సత్యవాణిగారి రాధాకృష్ణులు, ఏ. వి. సుబ్బారావుగారి అచ్చర, గుఱ్ఱం మల్లయ్యగారి బాలుడు-మాంచాల, శిల్పరూపమునందును, భావమునందును, శృంగారవిన్యాసమునందును ఆంధ్రశిల్పశైలికి ప్రమాణముగ నున్నది. సుప్రసిద్ధాంధ్ర పండితులును, కవులును, విమర్శకులును నైన మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారి మరణ మాంధ్రలోకమున కపారమైన నష్టమును గలుగజేసినది. శాస్త్రిగారి త్రివర్ణచిత్రపటమును, కాంగ్రెసు అధ్యక్షుడు జవాహరిలాలు నెహ్రూగారి త్రివర్ణపటమును ముద్రింపబడినవి.

రూపలేఖనమునందు, ఆంధ్రశైలికిని, వంగమహారాష్ట్రశైలులకును రూపవిన్యాసమునందును, వర్ణసంయోగమునందును, వస్త్రాలంకార నిర్మాణమునందును, రూపసంభావనయందును గల భేదమును సంచికయందలి చిత్రపటములు విశదము చేయుచున్నవి. ఆంధ్రచిత్రకళ వికాసమును పొందవలసిన యవసరము చిత్రములు విశదము చేయుచున్నను సహజమైన సౌందర్యమును, లావణ్యమును, వ్యక్తిత్వమును గలిగి విలసిల్లుచు విశిష్టమైన ఆంధ్రాభ్యుదయమునకు నిదర్శనములుగ నున్నవి.

ముఖపటము లాహోరుకాంగ్రెసునందు సువ్యక్తమైన యువజనోత్సాహమును నిరూపించుచున్నది. కాంగ్రెసు సభాధ్యక్షుడు, యువజననాయకు డశ్వారూఢుడై శాంతిసమరమును నడుపుచున్న విధమును సూచించుచున్నది. భారతీయ విజ్ఞానసంయోగమునకు చిహ్నములైన హిందూ బౌద్ధ దేవాలయములు, మహమ్మదీయుల మసీదు, క్రైస్తవ ప్రార్థనామందిరము, ముఖపటకోణముల నలంకరించుచున్నవి. క్రిందిభాగమునందు యంత్రాలయము పొడగట్టుచున్నను వ్యవసాయపరిశ్రమ ప్రముఖముగ నున్నది. ఆపరిశ్రమకు చిహ్నములైన నాగలి ఎద్దులు బండి కాపుకుటుంబ పరమ కష్టజీవయాత్రకుప్రముఖముగ నున్నవి. ఉపరిభాగమునందు ఖద్దరుపరిశ్రమకు చిహ్నములైనరాటము, మగ్గము పనిచేయుచున్నవి. ప్రక్కలందు లలితకళలు గృహపరిశ్రమలు ప్రదర్శింపబడినవి. కళాపరిశ్రమాభ్యుదయమునకు స్త్రీలసాహచర్యసంయోగావసరమును ముఖపటము స్ఫురింపజేయుచున్నది. ముఖపటము భారతజాతీయస్వాతంత్ర్యసాధనము లైన సాంఘికసంయోగమును మతసహనమును కళావికాసమును వ్యవసాయపరిశ్రమాభ్యుదయమును స్ఫురింపజేయుచున్నది. శుక్లసంవత్సర ముఖపటమునందు పండిత మోతీలాలు

నెహ్రూగారును, ప్రమోదూతసంవత్సరముఖపటము నందు జవహారిలాలు నెహ్రూగారును ప్రాముఖ్యమును బడయుట వారి దేశాభిమానమును అదృష్టమని వెల్లడి చేయుచున్నది. సుప్రసిద్ధమైన వారి యానందభవనమును, కాంగ్రెసుకు సమర్పించుటయును, వారి ప్రతిష్ఠకు తగి యున్నవి. దేశవ్యవహారములకు సంబంధించిన ఛాయాపట ములు గలవు. లాహోరు కాంగ్రెసు, ఆంధ్రమహాసభలు మొదలయినవానికి సంబంధించిన ఛాయాపటములు, ఇత రాంధ్రప్రముఖుల ఛాయాపటములు, అమరావతి స్తూపచి త్రములు ఈసంచికయందు గలవు.

ప్రమోదూతసంవత్సరాదిసంచిక యందును శుక్ల సంవత్సరాదిసంచికయందువలెనె వ్యాసములు ౧. రాజ కీయము, ౨. సారస్వతము, 3. నాటకము, ౪. కథలు, (వ్యాసములు) ౫. చరిత్ర, ౬. సాంఘికము, ౭. జ్యోతి షము, ౮. సంగీతము, ౯. వైద్యము, ౧౦. వ్యవసాయము, ౧౧. ప్రకీర్ణకము - శీర్షికలందు విభజించి ప్రచురింపబడినవి. రాజకీయములందు జవహారిలాలు నెహ్రూగారి యధ్యక్షోపన్యాసము, లాహోరుకాంగ్రెసు తీర్మానములు గలవు. సారస్వతమునందు సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు యతిప్రాసలవిషయమై వ్రాసినవ్యాసమునందు విషయము స్పష్టము చేయక సందిగ్ధముగనే నిలిపివైచిరి. కవిత్వమునకు హృదయము భావ మైనపుడు మాటలప్రతిబంధకమును తొలగించుట వలనను కావ్యములందు రసానందమున కభ్యంతరములు గలుగజాలవు. కథలయందు ఉగాది కానుకలు, చేసిననేరం యేమిలేదు, బాబా నాబాబా, పన్నీరుపువ్వు సంసారము నందు జన్మకులమతాభిమానాతీత మైన పరిశుద్ధప్రేమ ప్రభావమును దేశమునందు పర్యాప్తం బగుచున్న సంఘ పరివర్తనమును చక్కగా విశదముచేయుచున్నవి. రాయ సం వేంకటశివుడు గారును, నితరులును కల్పనకథలను వ్రాయుటయందు జూపుచున్న కళానైపుణ్య మాంధ్ర సాహిత్యాభ్యుదయమును వ్యక్తము చేయుచున్నవి.

చరిత్ర శాస్త్ర శీర్షికలయందలి వ్యాసములు పరిశోధన లక్ష్యమును విశదము చేయుచున్నవి. వివిధశీర్షికలయం దును వెలయుచున్న పద్యము లాంధ్రహృదయమునకు సహజమైన భావోద్రేకమును, భావనాశక్తిని, నవో త్సాహమును, కరుణారసమును ద్యోతకము చేయు చున్నవి. ఆంధ్రులకు సహజమైన కల్పనాశక్తిని పద్య ములు వ్యక్తముచేయుచున్నవి. వ్యాసములు ప్రాతవాసన లను వ్యక్తముచేయునటులు నవీనాశయములను వ్యక్తము చేయుటలేదు. స్వాతంత్ర్యజవసత్త్వములు లేనిప్రజలు కైలాసశిఖర సందర్శనమునుగాని పాతాళలోక సందర్శ నమునుగాని చేయజాలరు. ఆంధ్ర హృదయము స్తంభిం చినవిధమును సాహిత్యము కళలు పరిశోధనలు వర్ణనలు విశదము చేయుచున్నవి. ఆంధ్ర హృదయావృత మైన సమ్మోహమును విడిచి ఆత్మశక్తిని సాక్షాత్కారమును జేసికొనవలసిన యవసరమును సాహిత్యకళాస్వరూప ములు విశదము చేయుచున్నవి.

శ్రీప్రమోదూత సంవత్సరాదిసంచిక వెలువడు టకు దోడ్పడిన వ్యాసకర్తలకు చిత్రకారులకు ఇతరసహా యకులకు వందనములను సమర్పించుచున్నాము. మహా సంకల్పమును జేసి పనులను ప్రారంభించుటయును స్వల్ప ఫలమును బడయుటయును ప్రవృత్తిలక్షణము. గుణగ్ర హణపరాయణులు మనోరథములకును కార్యములకును, సిద్ధాంతములకును, నిర్మాణములకును, మాటలకును, చేత లకును గలయంతరమును గమనించి ప్రమోదూతసంచిక యందలిగుణములను గ్రహించెదరుగాత !

శ్రీ ప్రమోదూత సంవత్సరము భరత వర్ష చరిత్రము నందును, ప్రపంచచరిత్రయందును దివ్యపర్వ ముగ పరిణమింపగలదు. లాహోరు కాంగ్రెసు భరత వర్షమునకు పూర్ణస్వరాజ్యము నంగీకరించినది. గాంధి మహాత్ముడు పూర్ణ స్వరాజ్యమును బడయుటకు సత్యా గ్రహ ప్రస్థానమును జేయుచున్నాడు. ఆంధ్ర నాయ కులు సత్యాగ్రహ ప్రస్థానమునకు సన్నాహములను

దేశభక్త వేంకటప్పయ్య పంతులుగారి నాయకత్వమున జేయుచున్నారు. ప్రపంచము శాంతి స్థాపనమునకు పరితపించుచున్నది. దుఃఖాక్రాంతమైన ప్రపంచప్రవృత్తిని సుఖదాయకిముచేయుట కాత్మసాక్షాత్కారము శరణ్యముగ నున్నది. గాంధిమహాత్ముఁడు విషాదయోగపరమైన భరతవర్షము స్వధర్మనిర్వాహణము జేసి ఆత్మసాక్షాత్కారమును బడయుటకు సత్యాగ్రహప్రభావమును స్వయముగ విశదముచేయుచు స్వాతంత్ర్యప్రస్థానమును జేయుచున్నాఁడు. గాంధిమహాత్మునిసత్యాగ్రహప్రస్థానము సంశయాత్ముల హృదయములందు మహాసంచలనమును గలుగజేసినది. నిరంకుశప్రభుత్వము దిగ్భ్రమను జెందినది. శాంతిశాసనసిద్ధాంతములు వికృతరూపమును దాల్చుచున్నది. మంత్రివర్గము రహస్యాలోచనలను జేయుచున్నది. పటాలములు శిబిరములను సన్నాహముచేయుచున్నవి. భారతప్రజాహృదయ ముత్సాహపరవశ మగుచున్నది. సత్యాగ్రహ సేవాదళములు దేశమునం దంతటను శాంతిసంరంభమునకు సంసిద్ధములగుచున్నవి. భారతహృదయమునందు స్వాతంత్ర్యోత్సాహము వెల్లువలై పొంగి పారుచున్నది. స్వాతంత్ర్యసమరమునం దాబాలగోపాలము సానుభూతిని జూపుచున్నారు. వృద్ధులు యువకులు, స్త్రీలు పురుషులు, పండితులు పామరులు, స్వాతంత్ర్యసమరమునం దుత్సాహమును గలిగియున్నారు. స్వాతంత్ర్యసంరంభమునందు ఆయుధపాణులైన అధికారులకును నిరాయుధులైన శాంతిసైనికులకును సంరంభము తటస్థించుట సహజము. స్వాతంత్ర్యసంరంభమునందు దౌర్జన్యము సామాన్యముగను దౌర్జన్యమునకు మూలమైన ఆయుధధారులవలననె తటస్థించుటయును సహజము. దౌర్జన్యమునకు గారణభూతు లాయుధ ధారులైనను స్వాతంత్ర్యసమరము నారంభించిన సత్యాగ్రహులు నిందార్హులు దండనార్హులు నగుట సహజము. ఇర్విను ప్రభువు గాంధిమహాత్మునకు వ్రాసిన ప్రత్యుత్తరమునందు "శాసనోల్లంఘనమును, శాంతికి అపాయమును, విధిగా కలుగజేయదగుపద్ధతిని మీ రవలంబించుచున్నారు" అని వ్రాయుటయే దీనికి నిదర్శనము, సత్యాగ్రహసాధనమునందు విశ్వాసములేనివారు స్వాతంత్ర్యసంపాదనమునకు బ్రిటీషు ప్రభుత్వపు దయాదాక్షిణ్యములు గాక వేఱొక యోగ్యమైనసాధనమును నిరూపించుట ప్రయోజనకరము. గాంధిమహాత్ము డిట్టినిందను సహించుటకును సంసిద్ధముగనున్న విధమును వారిప్రసంగములు విస్పష్టము చేయుచున్నవి. సత్యాగ్రహులు గమనించవలసిన విషయ మాత్మసాక్షాత్కారము ఆత్మత్యాగముగానిపరనింద,పరపీడనముగాదు. సత్యాగ్రహులకు అహింస, సత్యము, శాంతము, నిగ్రహము, త్యాగము సహజధర్మములు. సత్యాగ్రహ మసిధారావ్రతము. ఆవ్రతాచరణ మారంభమునం దుస్తరమైనను పరిణామమునం దమృతోపమము. దౌర్జన్యసాధన మారంభమునందు సుకరమైనను పరిణామమునందు విషతుల్యము.

శ్లో. యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్;
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్.

శ్లో. విషయేంద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్;
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్.

సత్యాగ్రహమునకు భారతీయ స్వాతంత్ర్యము నిమిత్తమాత్రము! ప్రపంచశాంతి నిత్యప్రయోజనము. సంగ్రామదావానలదగ్ధమైన ప్రపంచము శాంతిని గోరుచున్నది; పరమేశ్వరుని రౌద్రస్వరూపమును విడిచి సౌమ్యస్వరూపమును సందర్శింప గోరుచున్నది. ప్రవృత్తియందు బీజమున కనురూపమైన ఫలము గలుగుచున్నది. హింసాబీజములు హింసాఫలమును సమకూర్చు చున్నవి. సకల దేశములును అహింసాధర్మము నారాధించుచు స్వాతంత్ర్యమును గలిగియున్నపుడె ఆయుధనియమమును, సంగ్రామ నియమమును, ప్రపంచ శాంతియును సాధ్యములు.

సత్యాగ్రహసాధ్యమైన నవ ధర్మసంస్థాపనము భారతీయ స్వాతంత్ర్యమునకును, బ్రిటీషు సామ్రాజ్యప్రయోజనములకును,ప్రపంచశాంతికిని, మానవకల్యాణమునకును

సాధనము కాగలదు. ఏతన్మహోదయమునకు సేతునిర్మాణమున కుడుతభక్తిరీతిని సకల జనులును సాయపడుట పరమ ధర్మము. సామ్రాజ్యాధికారప్రమత్తులు చిరకాలాభ్యస్తమైన హింసాధర్మము నాశ్రయించినను నిరాయుధులును పారతంత్ర్యపాశబద్ధులును నైన భారతీయులు సనాతన మైన అహింసాధర్మము నాశ్రయించి స్వకీయ స్వాతంత్ర్యమును ప్రపంచ శాంతిని సాధించుట పరమధర్మము. సనాతన ధర్మసంస్కారులైన భారతీయులకు అహింసాధర్మారాధనము సుకరము. విజయుడు గీతోపదేశానంతరము మోహమును విడిచి సందేహములను విడనాడి స్వధర్మనిర్వహణమును జేసినవిధమునను భారతీయులు గాంధిమహాత్ముని సత్యాగ్రహప్రస్థానానంతరముననైనను సమ్మోహసంశయములను విసర్జించి సత్యాగ్రహప్రస్థానమునకు బూనుట యవసరము, ధర్మము.

బ్రిటీషురాష్ట్రీయులు స్వదేశసంస్థానములు, హిందువులు మహమ్మదీయులు, పారసీలు సిక్కులు, జైనులు, బౌద్ధులు, ఆర్యసామాజికులు క్రైస్తవులు అధికారులు అనధికారులు నైమిత్తికము లైన స్థలభేదములను, జాతిభేదములను, మతభేదములను దశాభేదములను పరిత్యజించి సత్యాగ్రహవ్రతపరాయణులై నిత్యమైన మాతృదేశారాధకు లై ధన్యవాదములకు పాత్రు లయ్యెదరు గాత !

శ్లో. నష్టో మోహ స్స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గత సన్దేహః కరిష్యే వచనం తవ.

ముప్పదిమూడుకోట్ల భారతీయులయందు స్వల్పసంఖ్యాకు లైనను గాంధిమహాత్మునివలెను ఆత్మబలమును గలిగి సత్యాగ్రహదీక్షాపరాయణులై భారతస్వాతంత్ర్యమును ప్రపంచశాంతిని సాధించుటకు భగవదనుగ్రహము గలుగుగాత ! గీతాంతమునందు సంజయుడు నిర్వచనము చేసిన విజయవిభూతిఫలములను భారతీయులు పడయుదురు గాత !

శ్లో. యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః, తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.





చిత్రము ౧



చిత్రము ౨



చిత్రము ౩



చిత్రము ౪

౧-౪ చిత్రములు అధ్యక్షుని ఊరేగింపునకు సంబంధించినవి.



చిత్రము ౫



స్త్రీ సేవాదళము ౬



సభాధ్యక్షుడు సర్దార్ సింగు మొదలగునాయకులు ౭



మహాసభామంటపము ౮

# ప్రమోదూత

బుర్రా బాలకృష్ణశాస్త్రి గారు

ప్రాక్ప్రతీచీ హృదంబుధి ప్రౌఢభంగ
సంఘములనూగుభారతాశయపుఁ
నంటెనిస్తరంగ ప్రవాహంపుమార్గ [దరణి
మందు నడుపుచు నౌకాశ్రయములఁ గూర్చి
పఱచి వెనుకొను ననుకూల వాయువులకు
నెఱి తలయూచి మెచ్చి స్వేచ్ఛాభిరతిని
బూని వేగ గమ్యస్థానమునకుఁ జేర్చు
కర్ణధారస్వరూపంబ! కాలపురుష
మూర్తిఁ గైకొన్న గోవిందమూర్తివైన
యో ప్రమోదూతవర్షంబ! యొసఁగుచుంటి
మివియె వందనశతముల నెల్లఁ గొనుము.

సకల ఫలదప్రకృష్టమాసములు దూత
లగు ప్రవృత్తి త్వదేకాశ్రయంబ యగుట
షష్టివర్ష పరిభ్రమత్ చక్రమందు
స్వప్రధానత్వ మబ్బిన సమయమందు
ప్రభవవిభవానుగతశుక్ల పథమునందు
లోకకల్యాణ సంధాన లోలమగుచు
ధర్మనిర్ణయ కార్యవిధాత వగుచు
వెన్క సుప్రజోత్పత్తికి బీజమగుచు
సుమపరిమళము నించు నాస్యములతోడ
భ్రమర ఝుంకృతి శ్రుతిచేసి మధువులొలుక
శాంతి గానంబు కోకిల స్వరముతోడ
సకల దిక్కాంతలును బాడఁ జదువుచెప్ప
నిపుడ "శుభమ" స్తనుచు మొద లిడుమ వేగ
ఇదె వసంతుఁడు స్వాగత మిచ్చుచుండె.

ప్రభుత నూను ప్రమోదూతవర్ష! యింక
ఇపుడు నీచక్రవర్తితాపృథులశక్తి
గనుము లక్ష్మీసనాథుఁడై కంజగర్భుఁ
డింక నీదూత జగములం దేది యడ్డు.

జగము నీచేతి కీల్బొమ్మ సర్వశక్తి
వఱలలో కోద్ధరణ మఖిలాండ విభుత
గల్గె నీకింక శాంతిసంఘటన వృత్తి
నైజమయ్యెను-నవ యుగోన్నతికి శంకు
వఱరి స్థాపించి పాంచజన్యంబు నొత్త
దూత కాజ్ఞల సిడుము నిర్ధూత భేద
మగుచు నానందపూర్ణమై యఖిలమలరు;
ప్రకృతిలక్ష్మీ నిధానమై పరిఢవిల్లు
సర్వవేదాంత సామగస్యము ఘటించు
నైక్యవిజయ ధ్వజంబు చీనాంశుకంబు
విష్ణుపదమందు నాడు వాతావరణము
సర్వజగదనుకూలమై సంఘటిల్ల
చక్రవాళాద్రి మణిమయ సానువులకు
అతను ముద్రాభిముద్రితలైనదివ్య
దంపతులు హారతుల్ పట్టి తాండవింప
సార్థమగుఁ బ్రమోదూత వనుట జగతి.








విద్వాన్. కే. బి. కోటిలింగ దేవర గారు

# పరమపురుషుఁడు

గాంగేయు నిష్కామ కర్మయోగంబును కృష్ణుని ఘనరాజకీయపటిమ
చంద్రమతీనాథు సత్య వచస్స్ఫూర్తి ధర్మజు పరమశాంతప్రవృత్తి
ప్రహ్లాదు సాత్త్వికాగ్రహరేఖ, జీమూత వాహు నాత్మత్యాగ వరబలంబు
శాక్యసింహుని యహింసాపరత్వము తపోధను జేసు నాత్మబోధాను భవము
గుహాభగీరథ కార్యనిర్వహణ గుణము-లేకమై యొక్క వ్యక్తిలో లోకమునకు
సత్క్రియా పూర్వముగ నాత్మశక్తి దెలుప-కర్మచంద్ర మోహనదాస గాంధి నామ
పరమపూరుషుఁ డుదయించె భరతమాత!

మహిత హిందూ మహమ్మదు మతాంబుధియుగ్మ సంధాన కర పయస్సంధి గాంధి
శమదమ నయదయా సత్యాది సుగుణ సుగంధ సంభరిత దిక్సంధి గాంధి
మతరాజకీయ సంగతి ధర్మయుగళ నిర్బంధిత పటుతరో ద్గ్రంధి గాంధి
అన్య దుర్లభ విశుద్ధాధ్యాత్మిక మహత్త్వ మంథనమ్మథద్వ పత్కంధి గాంధి
శీతనగసేతుమధ్యస్థ భూతలమున బొమిడికములేని సార్వభౌముండె గాంధి
యట్టిలోకోత్తర మహాత్ము నాత్మజునిగఁబడసితివి నీకుఁ గొఱుతేమి? భరతమాత!
శాంతరసాబ్ధిలో జ్వలితాగ్ని కణరాజి తిగ్మకాంతులు గన్న దీర్ఘదర్శి
రాట్ననిస్వనములో రాష్ట్రస్వతంత్రతా సవ్యగానము విన్న దివ్యశ్రోత
బాధానుభవములో ప్రథిత శాశ్వత సౌఖ్య రసమాధురిని గన్న రాజయోగి
ఖద్దరువలువలో కమనీయ కౌశేయ కాంతులం దిలకించు కర్మఠుండు
కర్మచంద్రమోహన దాసగాంధి దేవుఁడ మ్మహాత్ముని షష్టిపూర్త్యవసరోత్స
వంబుఁగావించు భాగ్యంబు బడసినార-మమ్మ, నీదయకల్మి నార్యావధూటి!
నవ్వుదువో భువనంబు లనంతముల్ పొఱసూపగల్గు నీ బోసినోట,
చూచుదువో భవత్సునిశితదృఙ్మాత్ర ప్రతివాది హృత్పేటి పగులు వార,
పంకింతువో తల భావనాబలసముత్కంఠ దీపింప దిక్కరటివోలె.
పలుకుదువో ధరాస్థలిఁగల్గు విజ్ఞాన నిధులెల్ల తలలూచి నిన్ను మెచ్చ
తారకామధ్యమున సుధాధాము లీవి-సకలజాతీయ పతినాయకుల నడుమ
దివ్యదర్శన మిదు నిన్ను దేఱిచూచు - భారతీయులు దాస్య భావంబు విడరె
అమలగుణ రత్నకంధి! మహాత్మగాంధి!

# ఆంధ్రమాతృనిర్వేదము

కాట్రావులపల్లి రామమూర్తిగారు

ఆంధ్రరాజ్యస్థాపనాచార్యులౌ శాతవాహనోర్వీశుల బాహుబలము
నిజదేశసౌభాగ్య నిర్మాణచతురులౌ చాళుక్యరాజుల సాహసంబు
మాతృదేశార్చనా మహితాత్ములైన కాకతినరేంద్రుల రణకౌశలంబు
అరిరాజవిపిన దావాగ్నులైన విజయనగరభూనాథుల మగతనంబు
బీరువోనిరెడ్డి విభుల విక్రమంబు-పద్మనాయక ప్రభువుల పౌరుషంబు
క్షత్రియనృపవరేణ్యుల శౌర్యపటిమ-కానరాదేమి నేటినాసూనులందు. ?

లేఁడుగా నేఁడు ఢిల్లీపాదుషాకనుల్ గప్పిన మంత్రియుగంధరుండు
కనుపింపఁడయ్యె నేఁడనుపమస్వాతంత్ర్య ధుర్యుఁడౌ మాధవాచార్యమంత్రి
కలవయ్యెఁగద నేఁడఖండదిగ్విజయ సంపద తేనికొసఁగు తిమ్మరుసుమంత్రి
అరుదయ్యె నేఁడు మహాలౌకికధురీణుఁడైన ఘనయశుఁడక్కన్నమంత్రి
అకట! నాకర్మమేమొ ? ప్రజానురంజకముగ నేర్పుతో రాజ్య చక్రంబుఁద్రిప్పఁ
జాలిన నిపుణుఁడౌ మంత్రి సత్తముండు-కానరాఁడేమి నేఁటినాసూనులందు. ?

ఆంధ్రభాషాప్రియుఁడౌ రాజరాజనరేంద్రుని వంటి భూమీశ్వరుండు
ఆంధ్రకావ్యోద్ధార కాగ్రగణ్యుండైన మనుమసిద్ధినిఁబోలు మనుజవిభుఁడు
ఆంధ్రకవిత్వ తత్వానందుఁడౌ కృష్ణ దేవరాయనినాటి భూవరుండు
ఆంధ్రకవిమహాజనాధారుఁడౌ తిమ్మ జగపతికైన సత్ప్రభుండు
వేమభూపాలుని పగిది వేడ్కతోడ-సాళ్వ తిమ్మభూపతిమాడ్కి సంతసమున
నాంధ్రకవితను బోషించు నట్టిఱేఁడు-కానరాఁడేమి నేఁటి నాసూనులందు.

నన్నయాదిసుకవి నాథులచందాన రచియించిరేల సద్గ్రంథ మొకటి ?
త్యాగరాజాది మహామహుల వితాన సలిపిరే భక్తి ప్రచారమింత ?

వేమనాదివిమల వేదాంతులనుబోలి ప్రకటించినారె వైరాగ్యపథము ?
తిక్కనామాత్యాది ధీరులతెన్నున నరిగిరే వీరవిహారములకు?
వేయుచున్నారె జాతీయ వేషమైన?-పలుకుచున్నారలే మాతృభాషనైన ?
నాసుతులకు విజ్ఞాన మేనాఁడుకలుగు?-అకటకట యెంతనిర్భాగ్య నైతినేఁడు !

ఆంధ్రరాష్ట్రముకోస మంగలార్చితిఁగాని యేర్పడలే దది యింతవఱకు
ఆంధ్రగ్రంథాలయో ద్యమమూనితిని గాని యెదుగుఁబొదుగునులే దింతయైన
దేశీయవస్తువు లాశించితిని గాని నిర్మింపఁబడలేదు నేఁటిదాఁక
జాతీయవిద్యాప్రచార మెంచితిఁ గాని కొనసాగకున్నది ధనములేక
ఆంధ్రవిశ్వవిద్యాలయ మవతరించి-గడియ కొకతావునకుఁ గప్పగంతు లిడుచు
జేరె నొకమూల కిఁక నేమి సేయుదాన-తెలియరాదు నాకింకేమి దిక్కుకలదొ ?.

ఊరూర గ్రంథభాండారంబు లవలీల కట్టింపకుందునే ఘనతమీఱ
అమలజాతీయవిద్యాశాలలెల్లెడ నిర్మింపకుందునే కూర్మిచెలఁగ
శ్రీస్వదేశీయపరిశ్రమా గారముల్ నెలకొల్పకుందునే నేర్పదనర
అతులితభావోన్న తాంధ్రపతాకంబు స్థాపింపకుందునే శాశ్వతముగ
ఆంధ్రవిజ్ఞానవల్లరు లతిముదమున-పెంచి కాపాడకుందునే పేర్మిలోడ
ఎంతవైభవంబు ననుభవింతునో గద-ఆంధ్రరాష్ట్ర మేర్పడుభాగ్య మబ్బెనేని.

కలదు వివిధసస్య ఫలవృక్షరాజితో వరలుచుండెడుభూమి వలసినంత
కల వనేకతరుగుల్మలతాదికములచేఁ గడుసొంపుఁగూర్చెడు కాననములు
కలవు నానారత్న జనకసంపన్నమై వరలుచుండెడు మేటిపర్వతములు
కలవు వినిర్మల జలపూరితంబులై ముదముఁగొల్పెడు మహా పుణ్యనదులు
గోగణము పచ్చికబయళ్లఁ గోరినన్ని-యున్న విట్టిభాగ్యంబు లింకెన్నొ గలవు
కాని ప్రత్యేకరాష్ట్రంబు లేనినాడు-కలదె నాకీ మహాభాగ్యముల సుఖంబు !.

---


జాతీయపతాకారోహణము ౧౦


జాతీయపతాకారోహణము ౯



లజపతిరాయనగర సింహద్వారము ౧౧




చిత్రము ౧౨

లజపతిరాయి నగరములోని దృశ్యములు




చిత్రము ౧౩




# జతీంద్రస్మృతి

వేంకట పార్వతీశ్వర కవులు

రహి స్వతంత్రతకు హోరాహోరి బోరాడు
యోధాగ్రణి ననంగ నొప్పినావు
తతరాజకీయ బంధితుల శ్రేయము గోరి
నిరశనవ్రతమూని నెగడినావు
మహితస్వరాజ్యనిర్మాణమ్మునకు నీ శ
రీరమ్ము బలిగ నర్పించినావు
భారత భ్రాతల భావిభాగ్యమునకై
కడకు ప్రాణము ధారవిడచినావు
బళిర! భారతమాతృగర్భప్రభూత
శుక్తిముక్తాఫలమ్మవౌ సుమ్ము జతీంద్ర!
మేలు! భవదీయకీర్తి కాంతాలలామ
నృత్యమొనరింపదే? అహర్నిశలు దిశల.

## గీతిక

కవికొండల వేంకటరావు గారు

విమలభారతి! విశాలభారతి! విబుధభారతి! నివాళి-మా
మహాభారతి! మధురభారతి! మాతభారతి! బళాబళా!

౧

సహస్రకిరణప్రసారితారుణ హిమాచలాఖిల శుభోదయమ్
విచిత్రమొహో! ఒహో! విచిత్రమవనీవనీఘనీమునిమణీమయమ్. విమ.

౨

మృగాంకతరుణ ప్రకాశమంజుల వినీలతటినీతరంగము
మనోజ్ఞమొహో! ఒహో! మనోజ్ఞముపరీఝరీశ్రితవరాంగము. విమ.

౩

కిరీటిరథసారథీ ప్రచోదితసితాశ్వఖుర భాస్వరక్షితి
నిదానమొహో! ఒహో! నిదానమహారహజయజయస్వనయశోన్నతి. విమ.

౪

సయామబరమాబలీసుమత్రల విశేష శేముషికలాకృషి
ప్రబోధమొహో! ఒహో! ప్రబోధమంబుధిసుధీనిధి స్తుతలిపిమషి. విమ.





౧. పూరి-మహాతటాకము

శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారు.

# ఆరోగ్యపంచాంగము

డాక్టరు ఆచంట లక్ష్మీపతి (బి. ఎ., యం. బి. సి. యం., భిషగ్రత్న) గారిచే రచియింపబడినది.

## ఓం పుణ్యాహమ్ దీర్ఘమాయురస్తు

ఓం. శుభదినమగు నీ సంవత్సరాదిదినము పుణ్యదిన మగుగాక. సమస్తభూతములును దీర్ఘాయువును బొందియుండుగాక!

శాంతిరస్తు, పుష్టిరస్తు, తుష్టిరస్తు, వృద్ధిరస్తు, అవిఘ్నమస్తు, ఆయుష్యమస్తు, ఆరోగ్యమస్తు.

ఎల్లదిక్కులను శాంతి, సంతోషము, పుష్టి, వృద్ధి, జయము, ఆరోగ్యము, దీర్ఘాయుస్సు వర్ధిలుగాక.



డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు, బి.ఏ.,యం.బి.సి.యం., భిషగ్రత్న.

## ఆరోగ్య ప్రచారము

హిందూదేశమునందు ఆరోగ్యాభివృద్ధికై ప్రచార మనేక విధముల జేయబడినట్లు తెలియగలదు. ఒకవైపున ధర్మశాస్త్ర నేత్తలు ధర్మాధర్మ పరిపాలనమని జెప్పి ఆరోగ్యసూత్రములను శాసించి ప్రవర్తింపజేయుచు వచ్చిరి. మరియొకవైపున వైదికులు కర్మకాండమను పేరుతో వ్రతాదులు కల్పించి వానిమూలమున ఆరోగ్యవిధులను ప్రజలు నిత్యం త్రికాలములయందు అవలంబించునట్లు చేసిరి. విద్యాపీఠములందు గురువులు తమ శిష్యులకు లక్ష్యలక్షణయుక్తముగా ఇతర శాస్త్రము లతోపాటు ఆరోగ్యసూత్రములను బోధించుచును ఆచరించుచునువచ్చిరి. నగరాధ్యక్షుల ద్వారా, పంచాయతుల ద్వారా ప్రజలు ధర్మ ప్రవర్తనముగలవారైయుండునట్లు రాజులు పరిపాలించుచువచ్చిరి. అధర్మపరులకు తీవ్రమైన దండనలు విధింపబడుచున్నట్లు అర్థశాస్త్రమునందు చూడగలము. దేశములో వ్యాధులుత్పన్నములైనప్పుడు రాజు నిందితుడుగా నెంచబడుచుండెను. 'తస్య మూల మధర్మం, అధర్మేణ ప్రజాం వర్తయంతి, తస్మాద్ధ్వంసంతే జనపదాః' వ్యాధికి మూలకారణ మధర్మ ప్రవర్తనము. ప్రజలు అధర్మమార్గముల సంచరించుచున్నప్పుడు రాజు ఉపేక్ష చేయుటచే దేశమునందు వ్యాధులు ప్రబలునని చరకుడు స్పష్టముగా వ్రాసియున్నాడు. వైద్యశాస్త్రజ్ఞులు రచించిన సూత్రములు అన్ని శాఖలలోనుండు ఉద్యోగులును శిరసావహించి ప్రజాహితార్థమై వారివారి యథాశక్తిని దేశమునందు ఆరోగ్యమును కాపాడుచుండిరి.

## ధర్మార్థకామములకు ఆరోగ్యము ప్రధానము

ధర్మార్థకామములు త్రివర్గమందురు. ధర్మమనగా ఋజుమార్గ ప్రవర్తనము. ధర్మము, అధర్మము అనునవి దేశకాలములనుబట్టి మారుచుండును.

ప్రత్యేకవ్యక్తులకు ధర్మ పరిపాలన యెట్లు ఆవశ్యకమో సంఘములకు గూడ అట్లు అవసరమే. ధర్మప్రవర్తనము లేనిచో సంఘము బలహీనమగును. పెద్ద చేపలు చిన్నచేపలను తినివేసినట్లు బలవంతుడగువాడు బలహీనుని మ్రింగివేయును. తిమి తిమింగిల న్యాయము ప్రకారము స్వోదరపోషణార్థమై తిమింగిలమునకు స్వజాతిహత్యధర్మమే యగును.

అర్థమనగా శక్తి. విద్యావంతునకు జ్ఞానమేయర్థము. సేనాధిపతికి మందుగుండు సామానులు, రథగజతురగపదాత్యాదులు అర్థము. ధనముయొక్క బలము ధనమును వివేకముతో నుపయోగించు శక్తిని బట్టియుండును.

కామమనగా సుఖమును కోరుట, లేక ఇంద్రియములకు తృప్తి చేయుట. సుఖానుభవమునకు ధర్మార్థములు చెడకుండుట ఆవశ్యకము. ధర్మార్థములు చెడినచో తుదకు సుఖము దక్కదు.

సుఖమనునది మానసికము. మనస్సునందు సుఖములేనిది అంతఃపురమున నున్నదియు, కారాగృహమున నున్నదియు సమానమే.

అర్థహీనుడగువాడు కామము ననుభవించుట దుఃఖసాధ్యము. ధర్మమును ప్రవర్తింపజేయుటయు కష్టమే. కాబట్టి ఏ కాలమునందు గూడ అర్థమే ప్రధానమని అర్థశాస్త్రజ్ఞులు చెప్పుదురు.

కాని స్వార్థమునిమిత్తమై ధర్మముతప్పి స్వజాతిని చెరిచి లోకకంటకుడైనవాడు తుదకు తన అర్థకామములే చెరుచుకొనును. కావున తన సౌఖ్యమునకైనను ధర్మప్రవర్తనము అత్యావసర మని ధర్మశాస్త్రజ్ఞులు చెప్పుదురు.

తనయొక్క అర్థమును, కామమును చెరుపుకొనకుండ ధర్మమును ప్రవర్తింపజేయవలయును. మరియు ధర్మము చెడకుండ అర్థకామములయందు ప్రవర్తింపవలయును.

ఇట్టి ధర్మార్థ సుఖములను సాధించుటకు ఆరోగ్యమత్యావసరము, అందుచే ఆరోగ్యమును పరిపాలించు విధులను ప్రతివాడును తెలిసికొనవలెను.

## అథ సంవత్సర ఫలాని

మానవుల శరీరారోగ్యము దేశకాల పరిస్థితులను బట్టి వృద్ధిక్షయముల జెందుచుండును. అందుచే ఆయాదేశములయందు స్వానుభవము ననుసరించి ఆరోగ్యవిధులను ప్రాచీనులు నిర్ణయించియున్నారు. హిందూదేశమున తెల్లవారుజామునే లేచి చల్లని సమయమునందు తమతమ పనులను నెరవేర్చుకొనుటవలన శరీరమునకు విస్తారము శ్రమ గలుగకుండ ఆరోగ్యమభివృద్ధి జెందును. "బ్రాహ్మేముహూర్తే ఉత్తిష్ఠేత్ స్వస్థోరక్షార్థ మాయుషః" అను నీ సూత్రము మన భారతీయులకు ఎంత యుత్తమమయినదైనను అన్నిదేశములవారికిని సమముగ వర్తించునని చెప్ప వీలులేదు. లండనులో నివసించు ప్రజలు ఉషఃకాలముననే థేమ్సునదిలో స్నానముచేయరు. మనదేశముననో ప్రవాహోదకమున ప్రాతఃస్నానము ఆరోగ్యవర్ధకము. ఇట్లు దేశముయొక్క శీతోష్ణస్థితిని బట్టియు, ఋతుభేదములను బట్టియు సదాచారములు మార్పుజెందుచుండును. అందుచే నీ యారోగ్య సూత్రములను దేశకాల పరిస్థితుల ననుసరించి లోకోపకారార్థమై పెద్దలు శోధించి గ్రంథస్థముచేసియున్నారు. ప్రస్తుతకాలమున పాశ్చాత్యవ్యామోహముచే పైసీమలనుండి వచ్చినదంతయు శ్రేష్ఠమని నవనాగరకులు దంతధావనముకూడా మానుకొని అనారోగ్యమునకు పాల్పడుచున్నారు. దీర్ఘజీవితము వాంఛించువారు ఆయుర్వేదాను సారముగ రచింపబడిన సూత్రములను సంవత్సరము పొడుగునను శ్రద్ధతో నాచరించి సంపూర్ణాయువును సర్వసుఖములను బడయుదురుగాక.

౧. 'బ్రాహ్మే ముహూర్తే ఉత్తిష్ఠేత్
స్వస్థో రక్షార్థమాయుషః॥'

వా. సూ. అ. 2

౨. 'నవేగాన్ ధారయేత్ ధీమాన్'

చ. సూ. అ. 2.

౩. 'ఏకైకం ఘర్షయేత్ దంతమ్'

సు. చి. అ. 24.

౪. 'అత్యంత మలినః కాయః నవఛిద్ర సమన్వితః।
స్రవత్యేవదివారాత్రౌ ప్రాతఃస్నానేన శుధ్యతి॥' వశిష్ఠః

వా. సూ. అ. 2.

౫. 'అభ్యంగ మాచరేత్ నిత్యం సజరాశ్రమ వాతహా।
దృష్టిప్రసాదపుష్ట్యాయుఃస్వప్నసుత్వక్త్వదార్ఢ్యకృత్॥'

వా. సూ అ. 2

౬. 'శిరఃశ్రవణపాదేషు తం విశేషేణ శీలయేత్॥'

వా. సూ. అ. 2.

౭. 'ఉద్వర్తనం కఫహరం మేదసః ప్రవిలాపనమ్।
స్థిరీకరణమంగానాం, త్వక్ప్రసాదకరంపరమ్॥'

వా. సూ. అ. 6

౮. 'శరీరచేష్టా యాచేష్టా స్థైర్యార్థా బలవర్ధనీ। దేహవ్యాయామ సంఖ్యాతా మాత్రయా తాం సమాచరేత్॥'

చ. సు, అ. 6.

౯. 'శరీరోపచయః కాంతిః గాత్రాణాం సువిభక్తతా।
దీప్తాగ్నిత్వ మనాలస్యం స్థిరత్వం లాఘవ మృజా॥
శ్రమ క్లమపిపాసోష్ణ శీతాదీనాం సహిష్ణుతా।
ఆరోగ్యం చాపి పరం వ్యాయామా దుపజాయతే॥'

౧౦. 'వయోరూపగుణైర్హీన మపికుర్యాత్ సుదర్శనమ్॥'

౧౧. 'వ్యాయామం కుర్వతో నిత్యం విరుద్ధమపి భోజనమ్।
విదగ్ధ మవిదగ్ధంవా నిర్దోషం పరిపచ్యతే॥'

౧౨. 'వ్యాధయో నోపసర్పంతి సింహం క్షుద్రమృగాఇవ॥'

౧3. 'నచాస్తి సదృశంతేన కించిత్ స్థౌల్యాపకర్షణమ్॥'

౧౪. 'నచ వ్యాయామినం మర్త్యం
అర్దయంతి అరయో భయాత్॥'

౧౫. 'నచైనం సహసాక్రమ్య జరా సమధిరోహతి॥'

౧౬. 'వయోబల శరీరాణి దేశకాలాశనానిచ। సమీక్ష్య కుర్యాత్ వ్యాయామం అన్యథారోగమాప్నుయాత్॥'

సు. చి. అ. 24.

౧౭. 'దీపనం వృష్య మాయుష్యం స్నానమూర్జాబలప్రద మ్।కండూమల శ్రమస్వేద తంద్రాతృడ్దాహపాప్మజిత్॥'

వా. సూ. అ. 2.

౧౮. 'ఉత్తమంతు నదీస్నానం
తటాకే మధ్యమం స్మృతమ్।
కూపే స్నానంతు సామాన్యం
భాండస్నానం వృథాభవేత్॥

(స్మృతిముక్తాఫలము)

౧౯. 'ద్వౌ కాలౌ ఉపస్పృశేత్॥'

చ. సూ.

౨౦. 'యామమధ్యే నభోక్తవ్యం యామయుగ్మంనలంఘ యేత్। యామమధ్యే రసోత్పత్తిః యామయుగ్మాద్బ లక్షయః॥'

యో. ర. 226 శ్లో.

౨౧. 'నజాతు భుక్తవాన్ ఖాదేత్
మాత్రాం ఖాదేత్ బుభుక్షితః॥'

చ. సూ. అ. 8.

౨౨. 'ఆహారస్య పరం ధామ శుక్రం తద్రక్ష్య మాత్మనః। క్షయో హ్యస్య బహూన్ రోగాన్ మరణంచ ప్రయ చ్ఛతి॥'

చ. ని. అ. 6.

౨౩.'ఏకః శయీత సర్వత్ర నరేతః స్కందయేత్ క్వచిత్॥'

౨౪. 'మాత్రాస్వస్రా దుహిత్రావానవివిక్తాసనోభవేత్। బలవాన్ ఇంద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి॥'

మను. స్మృ.

౨౫. 'నిద్రాయత్తం సుఖం దుఃఖం పుష్టిః కార్శ్యం బలా బలమ్। వృషతాక్లీబతా జ్ఞాన మజ్ఞానం జీవితంనచ॥'

౨౬. 'తస్మాత్ హితాహితం స్వప్నం బుద్ధ్వా స్వప్యాత్ సుఖంబుధః॥'

చ. సూ. అ. 8.

౨౭. 'గీతాధ్యయన మద్యస్త్రీకర్మభారఅధ్వకర్షితాః। అజీ ర్ణినః క్షతాః క్షీణాః వృద్ధాః బాలా స్తథాఽబలాః॥,

౨౮. తృష్ణాతిసార శూలార్తాః శ్వాసినో హిక్కినఃకృశాః। పతితాభిహతోన్మత్తాః క్లాంతాయాన ప్రజాగరైః॥

౨౯. క్రోధశోక భయక్లాంతాః దివాస్వప్నో చితాశ్చయే। సర్వః ఏతే దివాస్వప్నం సేవేరన్ సార్వకాలికమ్॥

౩౦. ధాతుసామ్యం తథాహ్యేషా బలం చాప్యుపజాయతే। శ్లేష్మా పుష్ణాతిచాంగానిస్థైర్యం భవతిచాయుషః॥

౩౧. 'గ్రీష్మేచాదాన రూక్షాణాం వర్ధమానే చమారుతే। రాత్రీణాం చాతి సంక్షేపాత్ దివాస్వప్నః ప్రశస్యతే॥

చ. సూ. అ. 21.

౩౨. మేదస్వినో స్నేహనిత్యాః శ్లేష్మలాః శ్లేష్మరోగిణః। దూషీవిషార్తాశ్చదివా నశయీరన్ కదాచన॥

చ. సూ. అ. 21.

౩౩. 'నిత్యం అనుపహతవాసాః సుమనాః సుగంధీస్యాత్॥ సాధువేషః ప్రసిద్ధకేశః మూర్ధ శ్రోత్ర ఘ్రాణ పాద తైల నిత్యః స్యాత్॥'

చ. సూ. అ. 8.

౩౪. 'త్రిః పక్షస్య కేశశ్మశ్రులోమనఖాన్ సంహారయేత్॥'

చ. సూ. అ. 8.

౩౫. 'సత్యసంధః సామప్రధానః పరపరుషవచన సహి ష్ణుః అమర్షఘ్నః ప్రశమగుణదర్శీ రాగద్వేష హేతూ నాం హంతాస్యాత్॥'

చ. సూ. అ. 8.

౩౬. 'సర్వప్రాణిషు బంధుభూతః స్యాత్॥'

౩౭. 'క్రుద్ధానా మనునేతా॥'

౩౮. 'భీతానాం ఆశ్వాసయితా॥'

౩౯. 'దీనానాం అభ్యుపపత్తా॥'

చ. సూ. అ. 8.

౪౦. 'నిత్యం హితాహార విహార సేవీ
సమీక్ష్యకారీ విషయే ష్వసక్తః ।
దాతా సమః సత్యపరః క్షమావా
నాప్తోపసేవీచ భవత్యరోగః॥'

వాగ్భటసూత్ర.

## ప్రమోదూతనామ సంవత్సర ఫలము

### దంతధావనము

బుద్ధిమంతుడగు వాడు మలమూత్రాదులను ఎంతమాత్రమును నిర్బంధింప కూడదు. దంతధావన మత్యంతము ఆరోగ్యకరమైనది. ఒక్కొక్క పన్ను శ్రద్ధతో నిర్మలమగునట్లు తోమవలయును.

### అభ్యంగము

శరీరమలములు నవచ్ఛిద్రములనుండి నిరంతరము వెలువడుచుండును. ఆశరీరము ప్రాతఃకాల స్నానముచే శుద్ధిచేయవలెను. స్నానమునకు పూర్వము నిత్యమువ్యాయామము, అభ్యంగము శ్రేష్ఠము. అభ్యంగముచే దృష్టి వృద్ధియగును. ఆయుస్సును ఆరోగ్యమును అభివృద్ధి జెందును. పుష్టిగలుగును; చక్కగా నిద్రపట్టును. శ్రమ తెలియదు. శరీర కాంతి అభివృద్ధిచెందును. కాబట్టి ఈ దేశమున నిత్యాభ్యంగము యౌవన స్థాపనము చేసి ముసలితనమును పారద్రోలునని హెచ్చుగా వర్ణింపబడి యున్నది. ఒడలునలిచి స్నానముచేయుటవలన కొవ్వుతగ్గును; అంగములకు దార్ఢ్యము కలుగును; శరీరమునకు కాంతివచ్చును. అందుచే ఆంధ్రదేశమునందు చిరకాలానుగతముగా సాంప్రదాయ సిద్ధమగు ఉద్వర్తనమును విడువకూడదు.

### వ్యాయామము

ఈ కాలమున దేహబలము క్రమముగా తగ్గుచున్నది. ఇందుకు ముఖ్యకారణము సరియైన వ్యాయామము లేక పోవుటయే. పిల్లలకు చదువునందు గల శ్రద్ధ శరీరము పెంచుకొనుటయందు లేదు. తల్లిదండ్రులు కూడ ఈ విషయమై బొత్తుగా శ్రద్ధ వహించుటలేదు. ఎట్లయినను పరీక్షఆయిన చాలునని యోచించుచున్నారే కాని బాలుర ఆరోగ్యమును, యౌవనమును క్రమశః నశించుచున్నదని వారు గ్రహించుటలేదు. మనస్సునకు ధైర్యమును, కండకు బలమును కలుగజేయు కర్మయేవ్యాయామము. ఆంగ్లేయ పద్ధతులనుగాని, ప్రాచీన పద్ధతులనుగాని ఇట్టి వ్యాయామకర్మలను ప్రతి బాలుడును బాలికలును అభ్యసించుట అత్యవసరము. మనదేశకాల స్థితులను బట్టి ఏర్పడిన దండెములు, బస్కీలు, కుస్తీలు, సాములు ఇవియే విదేశ పద్ధతులకంటె శ్రేష్ఠమైనవి. డబ్బు ఖర్చు అక్కరలేకుండ సుసాధ్యమైనవి. శరీరపుష్టి, కాంతి, అవయవములు చక్కగా విభాగము జెందియుండుట, అగ్నిదీపనము, సోమరితనము లేకుండుట మొదలగు గుణములు వ్యాయామముచే గలుగును. కురూపిగూడ వ్యాయామముచే సురూపియగును. నిత్యము వ్యాయామముజేయువాడు ఉడకని యన్నమును, మాడిన యన్నమును కూడ జీర్ణముచేసికొనును. సింహమును క్షుద్రమృగములు ఎట్లు అనుసరింపవో అట్లే వ్యాయామముజేయు వానిని రోగములు బాధింపవు. స్థూలత్వమును తగ్గించుటకు వ్యాయామముకంటె మందులేదు. వయస్సును, బలమును, శరీరతత్వమును, దేశకాలములను, భోజనపద్ధతులను అనుసరించి బుద్ధిమంతుడగు వాడు వ్యాయామమును సక్రమముగ జేయవలెను. లేనిచో వ్యాయామముచే లాభములేక పోవుటయేగాక వ్యాధులు కూడ కలుగవచ్చును. అతివ్యాయామము చేయకూడదు. శ్రమకలుగుటకు పూర్వమే వ్యాయామమును నిలుపవలెను.

### స్నానము

వ్యాయామమును స్నానమునకు ముందే చేయవలెను. వ్యాయామమువలన చెమటపట్టును; శరీరముయొక్క వేడిమి హెచ్చును. అందుచే వ్యాయామానంతరము స్నానముచేయ తగ్గది. కాని శ్రమతగ్గకపూర్వము స్నానముచేయకూడదు. వ్యాయామమయిన తరువాత అభ్యంగమును శరీరమర్దనమునుచేసి పిమ్మట స్నానముజేయుట ఉత్తమము. అందునదీస్నానము ప్రశస్తము; తటాకస్నానము మధ్యమము; కూపస్నానము సామాన్యము; భాండస్నానము వృథాయని చెప్పబడియున్నది. ఎందువల్లననగా భాండస్నానమునందు తగినంత జలసమృద్ధి లభింపదు. ఇదిగాక నదీ తటాకకూప స్నానములయందు ఈదులాడుట, జలక్రీడలు మొదలగువానిచే శరీరమునకు వ్యాయామమును, పరిశుభ్రతయు రెండును ఏకసమయమున సంప్రాప్తమగును. అందుచే భాండస్నానము అంత ప్రయోజనకారికాదని చెప్పబడియున్నది.

### ఆహారము

ఆరోగ్యవంతుడు ఈ దేశమున ఎక్కువ స్నానములను తక్కువ భోజనములను చేయవలెను. రెండుసార్లు భోజనము విధ్యుక్తము. అంతకంటె ఎక్కువ ఆరోగ్యవంతునకు తగదనియే చెప్పవలెను. కాని అల్పబలులును, బిడ్డలును రెండు యామములను మించి లంఘనముచేయరాదు. భుజించిన పిమ్మట ఒక యామములోపల తిరిగి ఏదియును భుజింపకూడదు. నవనవలాడుచుండు శాకములు, సకాలజములగు పండ్లును పాలును హెచ్చుగా నుపయోగింపవలెను.

### శుక్రమే తేజస్సు

ఆహారముయొక్క సారము శుక్రము. అదే తేజస్సు, అదే బలము. కాబట్టి దానిని ఎల్లప్పుడును రక్షింపవలెను. జిహ్వోపస్థలను జయించుటయే ఇంద్రియనిగ్రహము. ఎడనెడ గుడువక ఇరుప్రొద్దులను

భుజించువాడు సదోపవాసి, జలము పెరిగి కాలానుహితముగ స్వభార్య యందు వర్తించువాడు సద్బ్రహ్మచారి.

## నిద్ర

నిద్రవల్లనే సుఖము, పుష్టి, బలము, జ్ఞానము, ఆరోగ్యము లభించును. నిద్రలేమిచే దుఃఖము, దుర్బలత్వము మొదలగునవి కలుగును. గ్రీష్మఋతువునం దీదేశమునందు పగలు నిద్రించుట ఆరోగ్యకరము. అజీర్ణరోగులు, క్షీణించువారు, వృద్ధులు, బాలురు, ప్రయాణశ్రమకులోనైనవారు, క్రోధశోక భయములచే పీడింపబడువారు పగలు నిద్రించుట శ్రేయస్కరము. ఎవరికి నిద్రహితమో ఎవరికి అహితమో తెలిసికొని సకాలమునందు నిద్రించుట ఆయుర్వర్ధకము.

## శుచి

శుచి (శౌచము) రెండు విధములు. ఆత్మ శుచి, సంఘశుచి. ఆత్మశుచి రెండు విధములు. బాహ్యశుచి. అంతశ్శుచి. స్నానాదులచే బాహ్యశౌచము కలుగును. హితాహారమువలనను దైవప్రార్థనమువలనను అంతఃశౌచము కలుగును. సద్వర్తనముచే సంఘశౌచము కలుగును. మన ఇల్లు పరిశుభ్రముగా నుండినను ప్రక్కవారి యిండ్లు నిర్మలముగా లేనియెడల వ్యాధు లక్కడ ఉత్పన్నమై మనకుగూడ వ్యాపింపవచ్చును. కావున పరోపకారదృష్టిచే కాకపోయినను స్వలాభాపేక్షచేనైన సంఘశుచి ఆవశ్యకము.

## దినచర్య

ఎల్లప్పుడును హితమైన ఆహార విహారములను సేవించువారును, చక్కగా యోచించి క్రియలఁజేయువారును, దుర్వ్యసనములకు లోబడనివారును, దాతయు, సర్వభూతములయందు సమబుద్ధిగల వారును, ఎల్లప్పుడు సత్యమునందే ఆసక్తిగలవారును, ఓర్పు గలవారును, లభించిన దానితో సంతుష్టినొందువారును అగు స్త్రీ పురుషులు ఎల్లప్పుడును ఆరోగ్యము ననుభవించెదరు.

పై విధుల ప్రకారము నిత్యము త్రికరణశుద్ధిగా త్రికాలములయందు బాహ్య మానసిక శౌచముల నభ్యసించుచు సకాలమునందు హితాహార విహారములను మితముగ సేవించుచు తమ ఆరోగ్యమును కాపాడుకొనుట యెల్లరకును విధ్యుక్తధర్మము.

'సర్వ మన్యత్ పరిత్యజ్య శరీర మనుపాలయేత్ ।
తదభావే హి భావానాం సర్వాభావః శరీరిణామ్॥'

చరక. నిదాన. అ. 6.

ఇతరములైన వాని నన్నిటిని పరిత్యజించియైనను శరీరమును కాపాడుకొనుము. నీకు శరీరము లేనప్పుడు అన్నియును లేనట్లే.

## స్వస్తివాచకము

ఒక జాతియందు ఏమానవునకు బలహీనమైనను ఆ బలహీనత జాతికంతకు చెందినదగును. కోటమట్టుమ గోడ దిట్టముగానుండి ఒకచో లేనియెడల ఆ కోటబలమంతయు తగ్గినదే యని చెప్పవలెను. అదేప్రకారము ఒక్కొక్క మానవునియొక్క ఆరోగ్యమే జాతీయారోగ్యము. భారతదేశమున శాస్త్రములకు లోటులేదు. దుష్కాలములచే అభ్యాసము తప్పిపోవుటవలన ఈ కాలమునందు ధర్మము లుప్తమయి అధర్మము మూడుపాళ్లును. ధర్మము ఒక్కపాలు మాత్రము ప్రబలుచున్నది. ప్రాతఃకాలమున లేచినతోడనే పండ్లుతోముకొనుట నెరుగని నవనాగరకులవద్దనుండి ధర్మాధర్మములు మనము గ్రహింపవలసివచ్చినది. ఇట్టి విపరీతభావములను పోగొట్టి భారతీయనాగరకతను దిగంతరాళములకు వ్యాపింపజేయు భారము యువకులపై నున్నది.

ప్రభువులు న్యాయమైన మార్గముల ననుసరించుచు ప్రజల హితమును గోరి పరిపాలించుదురుగాక. శరీరబలము నభివృద్ధిచేయు శ్రేష్ఠమైన పాల నిచ్చు ఆవులకును, బుద్ధిబలము నొసంగు బ్రహ్మజ్ఞానవంతు లగు బ్రాహ్మణులకును ఎల్లప్పుడును శుభ మగుగాక. పిపీలికాది బ్రహ్మపర్యంతము నుండు సమస్త జీవరాసులకును శుభ మగుగాక.

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేనమార్గేణ మహీంమహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తునిత్యం
లోకా స్సమస్తా స్సుఖినోభవంతు.

## సంజ్ఞలు

సు=సుశ్రుతసంహిత.

చ=చరకసంహిత.

వా=వాగ్భటము.

సూ=సూత్రస్థానము.

ని=నిదానస్థానము.

చి=చికిత్సాస్థానము.

# పతిత భారతము

కె. అన్నమరాజశర్మ

భారత జాతీయతారుణ కిరణతతికి, గ్రుడ్లగూబలై శత్రులు కుందిగుహల
దాఁగుచుండిన తరుణంబు తరలిపోవ కాలచక్రంబు మనగుండె గాలమయ్యె!

అరరే! కాలవిపర్యయస్థితిని మాయంబయ్యె స్వచ్ఛంద సుం
దర శోభాపటలంబు, దిక్కు లలమెన్ దాస్యాంధ కారంబు ని
ర్భరమై, భారతజాతి వైభవయశః ప్రాభాత రేఖా మహో
త్కర మేనాఁటికి గోచరించు నొకొ స్వాతంత్ర్యంబు తేకెత్తఁగన్.

ప్రాచీనశిల్ప సంపదకు సాక్ష్యమొసంగు నలయజంతాగహ్వ రాలయములు
ప్రాచ్య సాహిత్య సౌరభ్యమ్ము వెదజల్లు శాకుంతలాది ప్రశస్తకవిత
ప్రాక్తన జ్ఞానాతిభరమును బ్రకటించు విశ్వవిఖ్యాతమౌ వేదచయము
పూర్వభూధవ కృపా పూర్ణతఁ గొండాడు మాసిపోవని శిలాశాసనములు
సమయగర్భనిలీనమై సమయనట్టి - భరత జాతీయ విగతవైభవముఁగూర్చి
వేయునేటికి మాటలు విశ్వమాతృ - హీరమకుటాయ మానమై యింపు లొలికె.

అర్థులవోలెఁ బ్రత్యర్థులకుం గూడ శరణం బొసంగిన శాంతగుణము
వాఙ్మాత్రముననె సర్వస్వమ్ము ధారగా దాన మొసఁగిన యౌదార్యభరము
శకునికై మేని మాంసముఁ గోసి కుప్పలు గాఁ దులఁ దూఁచిన కరుణ కలిమి
తండ్రికై ఘోరవ్రతమ్మున జీవిత కాలమ్ముఁ బుచ్చిన శీలమహిమ
భరతభూమినిఁ దక్క ప్రపంచమందు - కలవె గాలించి చూడ నేకాలమేని
చిరతపఃపుణ్యపరిపాక సిద్ధిగాక - కలుగునే జన్మ యీయార్య ఖండమందు.

చంద్రగుప్తు నియశశ్చంద్రికాసికరంబు పరదేశములకెగఁ బ్రాఁకునాఁటి,
పృథ్వీరాయని బాహు విక్రాంతిదావాగ్ని కరిసేన శలభంబు లైననాఁటి
శ్రీకృష్ణరాయదోర్వీర్య నిర్గతరక్తధారల జయలక్ష్మి దనరునాఁటి.
రాణాప్రతాపుదుర్వారాసి ఘాతంబు మార్తురఁ నులివెట్టి మాడ్చునాటి,
శౌర్యసందీప్త భారతమ్మౌ చరిత్ర-నొక్క మాటేనిఁ దలఁప మహోజ్జ్వలముగ
కుమిలిపోకున్నె రుధిరనాళములు పొంగి-పుట్టరే దేశమాతకుఁ బుత్రులగుచు ?

అన్యరాణ్మస్తకా భ్యర్చితాంఘ్రిసరోజ వైభవోన్నతిఁ గొన్న భరతజనని;
ప్రాణిప్రపంచ జీవనదాయకంబగు ఫలసస్యములఁ గూర్చు భవ్యవనము;
ప్రథిత విజ్ఞాన సౌరభ్య బంధురత దిఙ్మండలిఁ బఱపిన జన్మభూమి;
ఆర్యధర్మజ్యోతి నసమానదీధితి వెలిఁగింపఁ జేసిన వేదసీమ;
కటాకటా! నేఁడు దాస్య శృంఖలలఁ జిక్కి-బధిరితాశానభోంతర ధ్వనులతోడ
పొగులుచుండంగ గోట్లకుఁ బుత్రులుండి-మాతృనిర్వేదమును సుంత మాన్పలేరొ.

ఆర్యజాతి మనోహ రాంగకంబుల పొంది కలుసౌష్ఠవంబుగఁ గానఁబడవు
బ్రహ్మచర్యవ్రత ప్రాభవతేజస్సు ముఖమండలంబున మూర్తిఁ గొనదు

భరతదేశపుఁ దంతువాయ నిర్మితవస్త్ర కాంశంబు నెమ్మెనఁ గానఁబడదు,
మనభాష, మనజాతి, మన దేశమని జిహ్వ యభిమానమునఁ బల్క నానఁగొనదు
ఆత్మనాశంకరోత్సాహ మతిశయింప - వేషభాషాంకములచేత వివిధగతుల
జాతిసౌధాగ్రమున నుండి జారిపడిన - మనల గుఱుతించునే దేశమాతయిపుడు!

పారములేని సంపదలు పశ్చిమమార్గముఁ బట్టిపోవ ని
ద్రారతిఁ జొక్కియున్న భరతప్రజలన్ భవదీయ దివ్యశం
ఖారవమూఁది మేల్కొలుపు నంతటి దాఁకను దేశమాత ! చ
ల్లారదు తాప వహ్నికను లందడి యాఱవు బాష్పవాహినుల్.

అనుతాపాశ్రుకణ ప్రవాహమున సత్యస్నాతులై జాతిసే
వన దీక్షారతి పూర్వగౌరవము సంపాదింప త్యాగవ్రతం
బున నాత్మాంజలి దేశమాతృచరణాంభోజంబు లర్చింపఁగా
ననుమానింతురె? భారతప్రజలు! పూజాసక్తిప్రేరేఁచెడిన్.

భారత భూమివైభవ విభాతమహోదయ భానుగాత, స్వే
చ్ఛారుధిరంపు నిర్ఝరిణి జాల్గొనకాల్వలు దీయఁ డాత్మకే
దాగములందు సర్వసమ తత్త్వనిరూఢత జాతిజీవనో
ద్ధారణసేయు యోగమును నాల్పుఁ డపూర్వతపోభరంబునన్

లెమ్ము లెమ్మోయి, భారతా! లెమ్ము, లెమ్ము-జీర్ణమైకీర్తి నామావశిష్టమైన
పతితభారత వృక్షంబు పల్లవింప-వదలు మశ్రుధార తదాలవాలమందు.

కలకాలంబు సమగ్ర వైభవ మహాఃకల్యాణముం బొంద, ని
శ్చల సౌభ్రాత్రము నిండ నెల్లెడ ప్రజాస్వాతంత్ర్య బాలార్క కాం
తులు శోభిల్లఁగ శౌర్యధైర్యములతోఁ దూఁగాడ నానందతుం
దిల వీక్షాంకుశపాళి దేశజనయిత్రీ, మమ్ము దీవింపవే.

---

## స్మరణము

ఉభయభాషాప్రవీణ మిన్నగింటి గురునాథశర్మ గారు

కడఁకం బూర్వకవీట్చరిత్రముల నైకగ్రంథ దృష్టాంతమే
ర్పడ శోధించె శతాధికంబు లగు నుద్గ్రంథంబులం గద్య తి
క్కఁడునాఁ బేర్వడి వ్రాసి భాష నిలిపెంగా కందుకూర్యన్వవా
యుఁడు వీరేశము శ్రీపునఃపరిణయోద్యోగుండు హిందూరమా!

తనమంత్రిత్వము నిర్వహించుచును వేదంబుల్ షడంగంబులో
య్యన శోధించి రచించె గ్రంథములఁ బూర్వాంధ్రంబు గావించెఁ బె
ట్టైను జారిత్రక భిక్షునాంధ్రతఁ బ్రతిష్ఠించెం గనెం బాసలె
ల్లను "కే" వేంకటలక్ష్మణార్యుఁడు జనుల్ హర్షింప హిందూరమా!

'స్మరణము' నందలివి.

---

# జాబిల్లికి

చెఱుకుపల్లి శివరామయ్య గారు

శారదవినీల గగనసంచారమందుఁ
దస్కరునిభంగి జాలరంధ్రములనుండి
నేను శయనించు శయన మందిరము నిక్కి
తొంగిచూచెదవేల? ఓ తుహినకిరణ!

భావమున సిగ్గుబొందు ప్రౌఢకాంత
లీల సందేహమొందఁగానేల? నీదు
స్నేహితుని జూచుటకుఁగూడ సిగ్గువలెనె?
ఒక్కసారిగ దరికి రావోయి సఖుఁడ!

గగనభాగమునందుండి దిగుచు జాల
రంధ్రములనుండి నామందిరమున దూరి
ప్రీతి నాతోడ దాఁగిలి మూఁతలాడ
నరుగుదెంచితె నాదు పర్యంకమునకు.

నాలలాటంబు ముకుళిత నయనయుగళి
గాఢతరమైత్రి మామక గండపాళి
నట్టె ముద్దాడి పిదప దేహంబుబిగ్గఁ
కౌఁగిలింపంగ వచ్చితే? కలువఱేఁడ!

గాఢనిద్రాసుఖంబును గాంచునన్ను
దరినివీచెడు మంగవాతములునీదు
విమల శారద చంద్రికాసముదయంపు
గిలిగిలింతలు నిద్రమేల్కొలిపె వడిగ.

స్నేహవాత్సల్యమున శయనింత మిచట
హాయిగా నిర్వురముగూడి యస్మదీయ
మృదులశయ్యాతలమున నొకింత సేపు—
తరలిరావోయి తారాపథంబు వీడి,

తనివిదీఱ త్వదీయామృతంబుఁ గ్రోలి
సఖుఁడ! తావక కిరణ సంస్పర్శమాత్ర
సంభవానంద పారవశ్యమునఁ దవిలి
హాయిగా నిద్దురింతు శయ్యాతలమున.

---

# అజంతా చిత్రములు

హంసజాతకము



బ్రహ్మదత్తు డను కాశీరాజు నాజ్ఞ నొకవేటకాడు ధృతరాష్ట్రి, సుముఖు లను హేమహంసములను రెంటిని గొనిపోవుట.

---



3. పురాణపఠనము

శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారు-రాత్రి తీసినది.



## శ్రీయుత పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు

అధ్యక్షుడు

౪౪-వ అఖిల భారత జాతీయ మహాసభ-లాహోరు



చిత్రకారుడు : శ్రీయుత చావలి నాగేశ్వరరావుగారు, ఆంధ్ర చిత్రశాల, బొంబా

# ౧. రాజకీయము

## ౪౪-వ అఖిలభారత జాతీయమహాసభ, లాహోరు-అధ్యక్షోపన్యాసము

సోదర సోదరీమణులారా!

భారతదేశమునకు స్వాతంత్ర్యమును బడయుటకు 44 ఏండ్ల నుండి యీమహాసభ పనిచేయుచున్నది. ఈమహాసభ ప్రారంభమైనది మొదలు నేటివరకును చేయుచున్న కృషివలన చిరకాలమునుండి గాఢనిద్రాముద్రితులై యుండిన దేశీయులలో కొద్దికొద్దిగాను, క్రమక్రమముగాను జాతీయభావము పెరుగుచు రానురాను చివరకు జాతీయోద్యమము దేశమునం దిప్పటికి స్థిరపడినది. మనదేశ చరిత్రయం దొకగొప్ప పరీక్షావసరము కలిగిన యీసమయమునందే నేడు మన మిచట సమావేశమగుచున్నాము. మనకుగల బలాబలములను, గుణలోపములను మనము బాగుగా గుర్తించియున్నాము. భావిస్థితినిగూర్చి ఆశను, భీతినిగూడ కలిగియున్నాము. ఇట్టితరుణమున దేశీయనాయకులను స్మరించుటయే మనకు ప్రథమకర్తవ్యమగుచున్నది. తమ యనంతరము వచ్చెడువారు స్వాతంత్ర్యమును బడసి సుఖింపవలెననెడు మహదాశయముతో లేశమైన స్వార్థపరత్వము లేకుండ నెట్టి లాభము నాశింపకుండ వారు దేశసేవకొరకు తమ జీవితముల నర్పించియుండిరి. వారిలో చాలమంది దివంగతులైరి. ఆ మహాయోధులు నిర్మింప గలిగిన యీమహోన్నతస్థానమున ఆధునికులమగు మనము నేడు నిలువబడి తరుచుగా వారి పద్ధతులను నిరసించుచుందుము. ఇది ప్రపంచస్వభావము. కాని భారతస్వాతంత్ర్యమునకు పునాదులనువేసిన యశోవిశాలురగు భారతపుత్రులను, పుత్రికలను మన మెవ్వరమును ఎన్నటికిని గూడ మరువజాలము. ఫలితమునకు భంగము కలుగకుండురీతినే వారు నిండు యౌవనమునందే తమ జీవితములను మాతృదేవత కర్పించి, విదేశీయుల ఆక్రమణమును నిరసించుచు సుప్రకాశమగు తమ యౌవనదశను దుఃఖకరములగు కష్టములతోడనే గడపిరి. వారిలో చాలమంది పేరులైనను మన కిపుడు సరిగా తెలియవు. వారు నిరాడంబరముగా చేసి కష్టముల ననుభవించిరి. వా రెట్టి పేరు ప్రఖ్యాతులను కోరియుండలేదు. భారత స్వాతంత్ర్యబీజమును నాటి ఆనవాంకురము మొలకెత్తగానే తమ హృదయ రక్తమునే దాని కర్పించి దానిని వృద్ధినొందించిరి. ప్రస్తుతకాలమున మన ఆశయమును కొంతవరకు త్యజించుటకును, సవరించుటకును మనము సమ్మతించుచున్నాము గాని వా రిటుల నెన్నడును చేయలేదు. స్వాతంత్ర్యమును బడయుటకు భారతీయులకు హక్కుగలదు అని వారు నిర్ధారణగా ప్రకటించిరి. నిరంకుశత్వమునకును, బానిసత్వమునకును లొంగకుండ వారు నిలువబడుటచేతనే పరాధీనస్థితియం దుండినను గూడ భారతీయులలో జీవకళ ప్రకాశించుచునే దేశసేవ యున్నదని వారు లోకమునకు వెల్లడింపగలిగిరి. మన జాతీయోద్యమ సౌధమును వా రీరీతిగా మిక్కిలి ఓపికతో ఒక్కొకకేటునే వేయుచు నిర్మింప గలిగిరి. దేశమాతకొరకు ప్రాణముల నర్పించిన యోగుల శరీరములపై నుండియే తరుచుగా దేశమాత ముందునకు పోవలసి వచ్చుచుండెను. ఆమహావీరుల భౌతికశరీరము లిపు డీలోకమున లేకపోవచ్చును గాని వారి ధైర్యస్థైర్యములుమాత్ర మిప్పటికిని మనచెంతనే యున్నవి. కావుననే యిప్పటికినిగూడ జతీందాసు విజయులవంటి మహాత్యాగులు మన దేశమునం దుద్భవింప గలుగుచున్నారు.

మనకు పెద్దలు ప్రసాదించిన ప్రకాశమానమగు పూర్వార్జిత మిదియే. దాని కిపుడు నన్ను ధర్మకర్తనుగా నొనరింపవలెనని మీరు కోరుచున్నారు. మనఃపూర్వకమగు మీ సంకల్పమువలన గాక నొక విచిత్రసందర్భమువలననే నా కీస్థానము లభ్యమైనదని నేను బాగుగా నెరిగియే యున్నాను. ప్రస్తుతకాలమున సర్వమానవ వంద్యుడైయున్న యొక మహానాయకు డీస్థానము నధిష్ఠింపవలెనని మీరు నిశ్చయించితిరి. మీ నిర్ణయమే శ్రేష్ఠమైనది గాని ఆ మహానాయకుడును, విధియును ఏకీభవించి మీసంకల్పమునకు వికల్పముగా అధికశౌర్యతాయుత మగు నీభయంకరస్థానమున నన్ను పడవేసినపుడు నే నించుకయు నాకృతజ్ఞతను తెలుపదగునా? ఆత్మవిశ్వాసమే లేని నాయందు మీ రిట్టి విశ్వాసము నుంచినందులకు నేను మీకు మిక్కిలి కృతజ్ఞుడను.

ప్రస్తుతము మనలను కలవరపరుచుచున్న పెక్కుజాతీయ సమస్యలనుగూర్చి మీరు చర్చింపవలసియున్నది. మీ నిర్ణయములవలన భారత చరిత్రపథముగూడ మారవచ్చును. ఇట్టి సమస్యలు నేడు మన దేశమునమాత్రమే కలుగలేదు. ప్రపంచమునం దన్ని దేశములలోను గూడ కలిగియున్నవి. ప్రతిదేశమును, ప్రతిజాతియునుగూడ నిట్టి పరివర్తనమునందే చిక్కుకొనెను. సౌఖ్యమును స్థైర్యమును కలిగింపగల విశ్వాసముతో గూడిన కాలము గడచిపోయినది. ఇపుడు ప్రతివిషయమును పరీక్షకు గురిచేయబడుచునే యున్నది. మిక్కిలి శాశ్వతములనియును, పరమపవిత్రములనియును మన ప్రాచీనులచే గౌరవింపబడిన యంశములకుగూడ నిపుడు పరీక్ష తప్పుటలేదు. ప్రపంచమునం దిపుడు సంశయాస్తిమితములు చెలరేగినవి. సంఘరాజ్యముల మూలాధారములు కదలబారుచున్నవి. స్వాతంత్ర్యము, న్యాయము, సొత్తు, చివరకు కుటుంబము మున్నగువానినిగూర్చి స్థిరపడిన ఆశయములన్నియు నిపుడు ఖండింపబడుచున్నవి. కావున సందిగ్ధతయే ఫలితముగా నేర్పడినది. ఇది

ప్రపంచ చరిత్రలో నొక గొప్పపరివర్తన కాలము. ఈప్రళయము నుండి నూతనసృష్టి మరల కావలసియున్నది.

## భారతదేశభావిస్థితి

ముందేమి జరుగునో యెవ్వరును తెలుపజాలరు. కాని ప్రపంచ భావి విధాన నిర్ణయమునందు ఆసియాఖండమును, భారతదేశమును ప్రాధాన్యమును బడయునని మాత్రము మనము కొంత నమ్మకముతోనే తెలుపవచ్చును. అత్యల్పమగు పాశ్చాత్యుల ఆక్రమణకాలము త్వరలోనే ముగియనున్నది. ఆకర్షణకును, కార్యనిర్వహణమునకును గూడ నైరోపాఖండ మిపుడు ప్రధానస్థానముగా నుండలేదు. ఆఖండమునకు ప్రాధాన్యము తొలగినది. భావికాలమున అమెరికా ఆసియాఖండములే ప్రధానము లగును. చరిత్రలు అసమగ్రముగను, అసత్యముగ నుండుటచే ఎల్లకాలమును ఐరోపాఖండమే ప్రపంచమునంతను ఆక్రమించియుండెననియును, ఆసియా ఖండ మెల్లపుడును పాశ్చాత్యులకు దారి యొసగుచు తన ఆలోచనలోనే నిమగ్న మగుచుండెననియు చాల మంది భావించుచుందురు. "అనేక శతాబ్దములవఱకు ఆసియా ఖండమువారే కోట్లకొలదిగా ఐరోపాఖండము నాక్రమించియుండిరి. ఇపుడు ఐరోపాఖండమునం దున్నవా రందరును చాలవరకు విజేతలగు ఆసియా ఖండవాసుల సంతతివారే యగుదురు." అను విషయమును మనము మరచిపోతిమి. అలగ్జాండరు సైన్యశక్తిని తుదకు పూర్తిగా హతమొనరించినవారు భారతీయులే యను విషయమునుగూడ మనము మరచిపోతిమి. ఆధ్యాత్మికచింతనము మున్నగు మానసికపరిశోధనల ప్రఖ్యాతి ఆసియాఖండమునకును, ముఖ్యముగా భారతదేశమునకునే గాని మరేదేశమునకును లేనిమాట నిశ్చయమే గాని కార్యనిర్వహణమునందు గూడ ఆసియాఖండము తీసిపోలేదు. ఇటుపైనిగూడ నొక ఖండమువా రింకొకఖండము నాక్రమించుచుండవలె ననియే మనము కోరుటలేదు. ఈఆక్రమణములతో నందరికి నిదివరకే త్రాహి త్రాహి యనిపించినది.

## ప్రపంచోద్యమమున భారతభూమి నేడొకభాగమే

ప్రపంచోద్యమమున భారతభూమి నేడొకభాగముగా నేర్పడినది. ఈ యుద్యమమునందు చీనా, టర్కీ, పెరిషియా, ఈజిప్టుదేశములును, రష్యామున్నగు పాశ్చాత్యదేశములునుగూడ పాల్గొనుచున్నపుడు భారతదేశము మాత్ర మెటుల మిన్నకుండగలదు? మనదేశమునకు సంబంధించిన క్లిష్టసంకీర్ణ సమస్యలు మన కెన్నియో కలవు. వానిని వదలివేసి ప్రపంచమునకు సంబంధించిన విశాలసమస్యలనుగూర్చి మన మాలోచించుచుండజాలము. కాని మనము ప్రపంచము నుపేక్షించినచో ఆత్మవినాశనమే కలుగును. మన కాలమునందలి నాగరికత యేదో యొక జాతిచేతనే నిర్మింపబడినది గాదు. కాన దాని నెవరును గుత్తగొనియుండలేదు. అది యొక సంఘీభావరూపమైనది. దీనియం దన్నిదేశములకుగూడ సంబంధము కలదు. ఆయాజాతులవారు తమ కనుకూలమైనరీతిని దాని ననుసరించుచున్నారు. కావున భారతదేశము ఇతరదేశముల కొక విషయమును బోధింపజాలియుండినచో, ఉన్నదని నేను నమ్మెదను, ఇతరదేశములవలన చాలవిషయములను గ్రహింపవలసినదిగా గూడ నున్నది.

## ప్రాచీనభారతము

ఇపు డంతయును మారిపోవుచుండుటచే దీర్ఘతమ మగు భారతదేశచారిత్రను స్మరించుటగూడ అవసర మే యగును. భారతదేశమునందు అత్యద్భుతమగు సంఘనిర్మాణ సౌష్ఠవముకంటె ఆశ్చర్యకరములైన మరేమియును కనబడవు. వేలకొలది వత్సరములనుండి విదేశీయ విజాతీయ నాగరకతలు క్రమ్ముకొనుచుండినను సంఘర్షణలును, మార్పులు కలుగుచుండినను గూడ మన సాంఘిక సౌష్ఠవము చెక్కుచెదరకుండ నిలువబడ గలిగెను. వానిని సహనముతో తనలో నిముడ్చుకొనుచుండుటయే యిందులకు ముఖ్యకారణము. వివిధ విజ్ఞానములకు సామరస్యమును కలిగించుటయే దాని ఆశయము గాని యితర విజ్ఞానముల నిర్మూలించుట కాదు. ఆర్యులును, అనార్యులును పరస్పర విజ్ఞానమునామోదించి అన్యోన్యతను కలిగించుకొనగలిగిరి. మన దేశమునకు వచ్చిన పార్సీలు మున్నగు విదేశీయులుగూడ దేశీయుల ఆదరమును బడసి సంఘమునందు స్థిరపడగలిగిరి. మహమ్మదీయులు రాగానే సమత్వమునకు భంగము కలిగినది గాని దానిని మరల నెలకొల్పుటకు భారతీయులు ప్రయత్నించుటయే గాక చాల వరకు సాఫల్యమునుగూడ బడసిరి. మనముగూడ మరల నట్టి సామరస్యమును కలిగించుకొనుటకు వ్యవధి లేకుండ మన దురదృష్టమున మన రాజకీయనిర్మాణము శిథిలమైన బ్రిటిషువారు వచ్చిరి. మనము పరాధీనుల మైతిమి.

సంఘసౌష్ఠవము నేర్పరుచుటలో అత్యధికమగు విజయము భారతదేశము పడయగలిగినను అది మరియొక ముఖ్యవిషయమున విఫలమైనది. అందువలననే పడచ్యుతి కలిగినది. నేటివరకును ఆ లోనే యున్నది. సమత్వసమస్యను పరిష్కరించుట కెట్టిసాధనము లభింపలేదు. ఈ సమత్వమును పూర్తిగా నుపేక్షించి భరతమాత మత్వము నే తన సాంఘికనిర్మాణమున కాధారముగా నేర్పరుచు నెను. మనదేశమున కోట్లకొలది ప్రజ లిప్పటివరకునుగూడ ని జాతులుగా నుండవలసిన ఘోరపరిణామము కలుగుట కీ అసమత్వ కారణము. దీనివలననే వా రభివృద్ధి జెందుట కెట్టి అవకాశమును లేకుండపోయినది.

## ప్రస్తుతభారతము

ఐరోపాఖండవాసులు మతయుద్ధముల నొనరించినపుడును, క్రీస్తుపేరిట క్రైస్తవులలో భిన్నశాఖలవా రొండొరులను వధించుచుండినపుడును గూడ భారతదేశ మత్యధికమగు సహనమునే చూపగలిగెను. ఆహా! అట్టి సహనము గోరంతయైన నేను గోచరించుట లేదు గదా. ఐరోపాఖండమునందు మత స్వాతంత్ర్యము కొంత చేకూరగానే రా

కీయ స్వాతంత్ర్యముకొరకును, రాజకీయ న్యాయసమత్వముకొరకును వారు ప్రయత్నింపసాగిరి. ఈరెండునుగూడ లభింపగానే ఆర్థికసమత్వమును, స్వాతంత్ర్యమునుగూడ లభించిననే గాని లాభము లేదని వారు గ్రహింపగలిగిరి. కావున ప్రస్తుతకాలమున రాజకీయములకంటె సాంఘిక ఆర్థికసమస్యలకే ప్రాధాన్య మధికమైనది.

## భా వి భా ర త ము

ఈ సమస్యలను మనముగూడ సాధింపవలెను. లేనిచో మన రాజకీయ సాంఘికసమస్యలకు స్థిరత్వము చేకూరదు. వీనిని సాధించుటకు ఇదివరకు విదేశీయు లవలంబించిన పద్ధతులనే మనముగూడ ననుసరింప నక్కరలేదు. ఆపర్యవసానము మనదేశీయుల ధీశక్తిపైననే ఆధారపడవలెను. మన విజ్ఞాన-తత్త్వవిచారముల వలననే యేర్పడవలెను. లేనిచో నది శాశ్వతముగా నిలువబడజాలదు. అది నెరవేరినచో ప్రస్తుతము మనలను కలవరపరచుటకును, మన స్వాతంత్ర్యమును నిరోధించుటకును కారణముగానున్న సాంఘికవివాద లన్నియును అప్రయత్నముగానే అంతరింపగలవు.

## విభేదములను తొలగించుట

నిజమైన విభేదములు చాలవరకిదివరకే తొలగినవి. పరస్పరభీతి, అవిశ్వాసము, అనుమానము మున్నగున వింకను తొలగకుండుటచే నూతన కలహబీజములను నాటగలుగుచున్నవి. ఈ విభేదములను తొలగించుట యొక్కటే మనకుగల సమస్య కాదు. అవికూడ నొకమూల పడియుండి మన విజ్ఞానమును పెంపొందించుచుండవచ్చును. "భయమును, అనుమానమును తొలగించు టెటుల?" అనునదియే ముఖ్యసమస్య. ఇవి అగోచరములగుట సులభముగా చిక్కుటలేదు. వీనిని తొలగించుటకు అఖిలపక్షసంఘమువారు గట్టిప్రయత్నము చేసి చాలపనినిగూడ సాగించిరి. కాని, వారికి సంపూర్ణమగు విజయము లభింపకుండుట సంతాపకరము. చేయబడిన పరిష్కారములను సిక్కు మహమ్మదీయ సోదరు లామోదింపలేదు. ఆగ్రహములు మెండైనవి. భయసంశయములను తొలగించుటకు తర్కవాదము నిరుపయోగము. ఔదార్యవిశ్వాసములే వానిని తొలగింపజాలియున్నవి. కావున వివిధసంఘములవారికి ఈరెండు సుగుణములును విస్తారముగా లభించుగాక. మనదేశ మొక బానిసదేశముగను, మన మందరమును బానిసలుగ నున్నచో మనకుగాని, మన సంఘమునకుగాని యెట్టిలాభమైన కలుగునా? భారతదేశమునకు స్వాతంత్ర్యమును, మనకు దాస్యశృంఖలా విమోచనమును మరల కలిగినచో మన కందువలన నష్ట మేమున్నది? మనలోని వారు కానట్టియు, మనలను బద్ధుల నొనరించియున్నట్టియు, స్వాతంత్ర్య హక్కునే మనకు నిరాకరించినట్టియు విదేశీయులే మనకు గల కొద్దిహక్కు భుక్తములను కాపాడవలెనా? దృఢసంకల్పముగల అల్పసంఖ్యాకులను ఎట్టి అధికసంఖ్యాకులును గూడ నడచివేయ జాలరు. అల్పసంఖ్యాకమగు నొకపక్షమునకు శాసనసభలో మరిరెండు ప్రతినిధి స్థానముల నొసగినంతమాత్రమున నెట్టిరక్షణమును కలుగజాలదు. నేడు ప్రపంచమున అత్యల్పసంఖ్యాకులే ధనమును, అధికారమును వశపరచుకొని అత్యధికసంఖ్యాకులపై విజృంభించుచున్నారను విషయమును మీరు మరువగూడదు.

మతమునందు మూఢవిశ్వాసము, కఠిన నియమములు మున్నగువానిని నే నామోదింపజాలను. అవి యిదివరకే బలహీనమగుచున్నందులకు సంతసించుచున్నాను. సాంఘికత్వము (కమ్యూనిజము)ను నే నేవిధముగనుగూడ నామోదింపను. ఒక సంఘమునకును, మతమునకును చెందినవారి సంఖ్యపైననే రాజకీయ ఆర్థిక హక్కు లేల యాధారపడవలెనో నేను గ్రహింపజాలకున్నాను. మత-విజ్ఞానముల విషయములో స్వాతంత్ర్య మెంతు టవసరమె. భారతదేశమునం దీ స్వాతంత్ర్యములు మొదటినుండియు అంగీకరింపబడియే యున్నపుడు ఇక ముందు మాత్రము ఇవి యిట్టుల నేల కొనసాగకుండును? నేడు మనదేశమును ఆవరించియున్న భయసంశయములను రూపుమాపుటకు తగిన సాధనము నే మన మిపు డెటులైన కనుగొనవలెను. పాలితజాతుల రాజకీయములు చాలవరకు భయద్వేషములపైననే ఆధారపడియుండును. మనము చిరకాలమునుండి పరాధీనతకు పాల్పడియుండుటచే అవి సులభముగా తొలగజాలవు.

## హిందువులు ఔదార్యమును చూపవలెను

నేను జననమువలన హిందువునే యైనను హిందువుల పక్షమున మాటలాడుటకు నా కెంతవరకు హక్కు గలదో నాకు తెలియదు. మన దేశమున జననము వలననే హక్కుగలుగునని యిపుడుగూడ నంగీకరింపబడుచుండుటచే ఆజన్మహక్కునుబట్టియే హిందువులే ఔదార్యమునకు మార్గదర్శులు కావలెనని హిందూనాయకులకు విన్నవించుటకు నేను పూనుకొనుచున్నాను. ఔదార్యము మంచి నీతి యగుటయే గాక మంచి రాజకీయయుక్తియును, మంచి సమయస్ఫూర్తియును గూడనై యున్నది. స్వతంత్ర భారతమునందు ఎన్నడుగాని హిందువులు బలహీను లగుదురని యూహించుట కెట్టి ఆధారమును కనబడుటలేదు. "మీకు కావలసిన సదుపాయము లన్నిటిని నిరభ్యంతరముగా నైకొను"డని సిక్కు మహమ్మదీయ సోదరులకు మనఃపూర్తిగా నెరిగించుటకు నేనుమాత్రము సంసిద్ధుడనుగానే యున్నాను. అచిరకాలమునందే యీమతసాంఘిక నామములు నిరర్థకపదములు కాగలవు. ఇటుపైని మన సంఘర్షణములకు ఆర్థికములే కారణభూతము లగును. ఈలోగా మన అనుకూల్య మెటులుండినను ప్రమాదము లేదుగాని మనభావి అభివృద్ధికి మనము నిరోధములను మాత్రము కలిగింపకుండ నుండవలెను.

## స్వాతంత్ర్య ప్రకటనము

అఖిలపక్ష సభవారి నివేదికను మూల ద్రోసి నిర్విరోధముగా మనము ముందడుగు వేయవలసిన తరుణ మిదివరకే వచ్చినది. అఖిల

పక్ష విధానమును అనుసరించుటకు నిరుడు జరిగిన కాంగ్రెసు మహాసభలో నొకవత్సరము గడు వొసగబడెను. ఆసంవత్సర మిపుడు కించిదవశిష్టముగా ముగియవచ్చినది. కావున ఈమహాసభవా రిపుడు స్వాతంత్ర్యమును ప్రకటించుటయును, దానిని సాధించుటకు తగినసాధనమును నేర్పరుచుటయు నే ముఖ్యకర్తవ్యమై యున్నది.

ఈవత్సరము గడువులోపల అధినివేశ స్వాతంత్ర్యము మనకు లభింపలేమ గాని కఠినశాసనములును, ప్రజాపీడయును, జాతీయ కార్మికోద్యమములపై తీవ్రమగు విజృంభణమును మాత్రము కలిగినవి. మనతోడి సోదరులలో చాలమందిని విదేశ ప్రభుత్వమువారు నిర్బంధించి యీమహాసభకు వారు రా వీలు లేకుండ చేసిరి. వారిలో నెందరో విదేశములలో ప్రవాసము ననుభవించుచున్నారు. వారు మరల మాతృదేశమునకు రాకుండ నిరోధములు కలిగింపబడుచున్నవి. విదేశీయుల సేనాబలము తన కఠినముష్టియందు మనదేశమును నొక్కియుంచినది. మనలో మిక్కిలి శ్రేష్ఠులగునాయకు లెవరైన తల లెత్తునెడల వెంటనే ప్రయోగింపబడుటకు యమయముని దబుకు నిరంతరము సిద్ధముగానే యున్నది. కలకత్తా కాంగ్రెసుమహాసభలో జరిగిన తీర్మానమునకు ప్రత్యుత్తరము సిద్ధముగానే యున్నది.

## రాజప్రతినిధి ప్రకటన

ఇటీవల శాంతిసూచన చేయబడినట్లు కొద్దిగా కనబడెను. "భారత భావిరాజ్యాంగమునుగూర్చి ప్రభుత్వప్రతినిధులతో నాలోచించుటకు భారతనాయకు లాహ్వానింపబడుదు" రని బ్రిటిషుప్రభుత్వమువారి పక్షమున రాజప్రతినిధి ప్రకటించెను. రాజప్రతినిధి సదుద్దేశము నే గలిగియుండెను. అతని భాష శాంతిప్రదమగు భాషయే కాని ప్రత్యక్షముగా మనకు గోచరించుచున్న కఠినవిషయముల ముందు రాజప్రతినిధివంటి ఉన్నతోద్యోగియే తెలిపియున్నను ఇట్టి సద్భావమును, సౌమ్యవాక్యములునుగూడ నిరుపయోగము లే. బ్రిటిషు రాజనీతిజ్ఞతయందు గల విచిత్రమార్గము లన్నియును మన కిదివరకే మిక్కిలి బాగుగా అనుభవమునకు వచ్చియున్నవి. బ్రిటిషుప్రభుత్వమువా రిపుడుచేసిన సూచన నిరాధారముగను, సందిగ్ధముగను నున్నది. అది కొనసాగింపబడునని వా రెట్టివాగ్దానము నొనరించియుండలేదు. కలకత్తా మహాసభలో జరిగిన తీర్మానమున కిది ప్రత్యుత్తరమై యుండునని యూహించుటకు అత్యల్పమగు నాధారము మాత్రము కలదు. ఈప్రకటన జరిగినవెంటనే వివిధపక్షముల నాయకులు సమావేశమై యోచించిరి. వారు శాంతినే కోరుచున్నారు గాన నాశాంతికొరకు తమ ఆశయమును కొంతవరకు త్యజించుటకుగూడ వారు సంసిద్ధులై యీప్రకటనమునకు మిక్కిలి అనుకూలమగు వ్యాఖ్యానము నే గావించిరి. కాని దానినామోదించుటకు ముఖ్యముగా జరిగితీరవలసిన విషయములనుమాత్రము వారు మృదువాక్యములలో నే తెలిపినను మిక్కిలి విస్పష్టముగ నే తెలిపిరి. ఈసూచన కేవలము రాజకీయయుక్తియే యనియు, ఇది వంచనార్థమైనదే యనియు, మనలో చీలికలను కలిగించుటకే చేయబడినదనియు భా[illegible]చుచున్న సంపూర్ణస్వాతంత్ర్యవాదులకు మన నాయకులు చేసిన అం[illegible]కారసూచన అధికమగు మనస్తాపము నే కలిగించినది. దీని ఫలితమ[illegible] గూర్చి వారి కధికమగు నాందోళనముగూడ కలిగినది. గౌరవ[illegible]మగు శాంతి చేకూరుటకు లేశమాత్రమైన నవకాశము కనబడుచున్న[illegible] వరకు, దేశీయులలో అధికసంఖ్యాకులకు దారుణకష్టములు కలుగు[illegible] నిశ్చయమని మన మెరిగియుండియు ను ఉద్రేకముతో అతిభయా[illegible]మగు జాతీయ సమరము నిపుడే మనము కలుగజేయగలమా? [illegible] హృదయవ్యథతో నే నాయకుల ప్రకటనలో మేము సంతకము[illegible] చేసితిమి. అది తప్పో యొప్పో నే నిపుడు చెప్పలేను. అటుపిమ్మ[illegible] బ్రిటిషు పార్లమెంటు సభలోను, ఇతర స్థలములలోను ఆ ప్రకటన[illegible] గూర్చిన సమాధానములును, విపులవ్యాఖ్యానములును బయలుదేరి, [illegible] వరకు లేశమైన సంశయ ముండియున్నచో దానిని పూర్తిగా తొలగి[illegible] ప్రకటనయొక్క నిజార్థమును స్పష్టపరచినవి. అపుడు గూడ భా[illegible] కాంగ్రెసు సంఘమువారు రాయబారముల కింకను అవకాశము నేర్ప[illegible]యే యుంచిరి. దానిని గూర్చి అంత్యపరిష్కారము చేయ[illegible] బాధ్యత నీ మహాసభకే వదలిరి.

## ఇండియామంత్రి ప్రకటనము

ఇటీవలనే మరియొకసారి దీనిని గూర్చి బ్రిటిషు పార్లమెం[illegible] (కామన్సు సభ)లో చర్చ జరిగినది. ఆ సభలో ఇండియా మం[illegible] ప్రత్యుత్తర మొసగుచు, "భారతదేశవిషయమున బ్రిటిషుదొరతన[illegible]నకు గల నిష్కపటాభిప్రాయమును మాటలవలననే గాక క్రియల [illegible] గూడ పెక్కుసారులు ప్రభుత్వమువారు ధ్రువపరచియే యున్నారు" అని నుడివెను. భారతదేశమున కేదో కొంత ఉపకారమును చేయవ[illegible]ననియు, అందులకు భారతీయుల సద్భావమును బడయవలెననియు[illegible] వెడ్జివుడు బెనుగారు మనఃపూర్వకముగానే కోరుచున్నారని మన[illegible] గ్రహింపక తప్పదు. కాని పార్లమెంటులో బెను గారును, [illegible]రలు నొసగిన ఉపన్యాసములు మనల నంతకంటె ముందునకు [illegible] పోవుటలేదు. "క్రియలలోగూడ అధినివేశన స్వాతంత్ర్య మిది[illegible] యొసగబడెను" అని ధ్రువపరచుటకు బెనుగారు దీర్ఘోపన్యాస[illegible] నొసగిరి. కాని అది మనలను భ్రమింపచేయుటకు మాత్రమే [illegible] పచ్చును. ఏలయనగా దానివలన భారతదేశ ధనాపహరణము లో[illegible] లేదు. 1920 లో నొసగబడిన రాజకీయ సంస్కరణములవలన జన[illegible] మాన్యముయొక్క బాధ్యతలు వెనుకటికంటె నిపుడే అధికమైన[illegible] లండనులో హైకమీషనరులను నియమించుట, నానాదేశసభకు [illegible] ప్రతినిధులను పంపుట, సామగ్రులను కొనుట, భారతీయులను గ[illegible]రులుగను, ఉన్నతోద్యోగులుగను నియమించుట మున్నగు వానిని [illegible] మెన్నడును కోరియుండలేదు. భారతదేశమునందలి నిరుపేద[illegible] ప్రజలధనమును హరింపకుండ చేయుటయే మన సంకల్పము. మన[illegible]

కోరునది యథార్థమగు నధికారము గాని ఉద్యోగమునకు సంబంధించిన లాంఛనవచనములు కావు.

## "క్రియలో అధినివేశన స్వాతంత్ర్యము"

గత పదియేండ్లలోను దొరతనమువా రొనరించిన ఘనకార్యముల నన్నిటిని బెనుగారు వరుసగా నేకరువు పెట్టిరి. పంజాబులో సైనికశాసనము, జలియనువాలాబాగు సంఘుబలి, కఠిన శాసనములు, ధనాపహరణము మున్నగునవిగూడ నీ పదేండ్లలో నవిచ్ఛిన్నముగా జరిగినవే గాన వీనినిగూడ బెనుగారు చివగ చేర్చి యుండవలసినది. అధినివేశనప్రభుత్వ మనగా భారతీయులలో నత్యల్పసంఖ్యాకులకు నామమాత్రమగు కొద్ది అధికారముల నొసంగుట, ప్రజాపీడనము, బీదల ధనము హరించుట మున్నగునవే యనిగూడ బెనుగారు స్పష్టపరచి యుండవలసినది.

ఇప్పుడు కాంగ్రెసు చేయదగిన దేది? మనము సహకార మొనరించుటకు ముఖ్యముగా జరుపబడవలెనని మన నాయకులు వేనిని సూచించిరో అవేవియును జరుపబడియుండలేదు. యథార్థమగు స్వాతంత్ర్యము మనకు లభించునను పూచీ యొసగబడకుండునంతకాలమును మనము సహకారము చేయవచ్చునా? మన సహచరులు కారాగృహమున నలయుచున్న పుడును, కఠిన శాసనము లమలు జరుపబడుచున్న పుడును మనము సహకార మొనరింపదగునా? వారు నిశ్చయముగా శాంతినే కోరుచున్నారు. కాని రాజకీయ యుక్తి వలన మనలను లొంగదీయ జూచుటలేదను నమ్మకము మనకు కలిగింపబడునవరకును మనము సహకారము చేయవచ్చునా. ఖండాగ్రమునుండి శాంతిజనింపదు. విదేశీయు లింకను మనపైన అధికారమును చెల్లింపగోరుచునే యున్న యెడల అందులకు మనఃపూర్వకముగా మనము భాగస్వాములు కాకుండుటయే కనీసపక్షమగు మనకర్తవ్య మగుచున్నది.

## సంపూర్ణ స్వాతంత్ర్య మొక్కటియే మన ఆశయము

కలకత్తా మహాసభలో నామోదింపబడిన తీర్మానమే స్థిరపడుపబడునెడల నేడు సంపూర్ణ స్వాతంత్ర్య మొక్కటియే మన ఆశయము. సంపూర్ణస్వాతంత్ర్య మనగా ఒంటరితనము, ప్రత్యేకత అనునర్థ మేర్పడుచుండుటచే నీపదము ప్రపంచమునందిపుడు ప్రశామోదమును బడయుటలేదు. ఇట్టి సంకుచిత జాతీయతను నాగరికత యిదివరకే పూర్తిగా అనుభవించి విసివియున్నది. కావుననే విశాల సహకారము కొరకును, పరస్పర సహాయముకొరకును తడుములాడుచున్నది. కావున మన మీపదమును వాడుటలో విశాలాశయమున కెంతమాత్రమును విరుద్ధము కానిరీతినే వాడుచున్నాము. బ్రిటిషువారి సామ్రాజ్యమునుండియు, బ్రిటిషు ఆక్రమణమునుండియు పూర్తిగా వెలువడుటయే మనము కోరునట్టి సంపూర్ణ స్వాతంత్ర్యమై యున్నది. అట్టి స్వాతంత్ర్యము మనకు లభించిన పిమ్మట విశ్వసహకార—సోదర భావములను కలిగించుటకు చేయబడెడు ప్రయత్నముల నన్నిటిని భారతదేశమామోదింపగలదు. అట్టి విశాల విశ్వహితార్థము తన స్వాతంత్ర్యమును కొంత త్యజించుటకుగూడ సిద్ధముకాగలదు. ప్రస్తుతమున్న బ్రిటిషు సామ్రాజ్య మట్టి విశాలవిశ్వ మెంతమాత్రమును కాదు. ఎంతకాలము కోట్లకొలది ప్రజలను లోబరుచుకొనుచుండునో, వివిధదేశములవారి అభిప్రాయములకు వ్యతిరిక్తముగ ప్రపంచమునందలి పెక్కువిశాలదేశముల నెంతకాల మాక్రమించుకొను చుండునో అంతకాలమును ఈ సామ్రాజ్య మట్టి విశాలవిశ్వము కాజాలదు. దీనికి సామ్రాజ్యత్వమే మూలాధారముగను, విదేశీయుల ధనాపహరణమే జీవనాధారముగను ఎంతకాల ముండునో అంతకాలము నిది సమానప్రతిపత్తిగల సంయుక్తదేశమండలి (కామనువెల్తు) కాజాలదు. ప్రస్తుతము బ్రిటిషుసామ్రాజ్యమునందు క్రమక్రమముగా రాజకీయాధికార విభజనము జరుగుచున్నది. ఈ సామ్రాజ్యస్థైర్యము క్రమముగా కొరతవడుచున్నది. ఈసామ్రాజ్యమున దక్షిణాఫ్రికా, ఐర్లెండుదేశములు అనుకూల్యము కలవిగా నుండలేదు. ఈజిప్టు విడివడుచున్నది. సామ్రాజ్యత్వమును, దాని అనుబంధములను పూర్తిగా వదలునగకను భారతదేశ మీమండలిలో సమాన స్వాతంత్ర్యముతో గూడిన సభ్యతను బడయజాలదు. ఇది కొనసాగనంత వరకును భారతదేశ మీమండలికి అధీనదేశముగానే యుండవలసియుండును గాన ధనాపహరణముగూడ తప్పని సరియే యగును. కావున బ్రిటిషు సామ్రాజ్య సమాలింగనము భారతదేశమునకు ప్రాణాపాయకరమే యగుచున్నది. మనఃపూర్వకముగా నొసగబడిన ప్రేమపూర్వకమగు నాలింగనము ప్రాణపదము. అందులకు ప్రత్యాలింగనముగూడ నటులే సమకూరును గాని బ్రిటిషు సామ్రాజ్య సమాలింగన మట్టి దెంతమాత్రమును కాదు. కాని యో నిదివర కుండినట్లే యికముందు గూడ నది ప్రాణనిర్మూలన కరమగు మృత్యుదేవతాలింగనముగనే యుండగలదు.

ప్రపంచమున శాంతిని స్థాపింపగోరుచున్నారను వార్తలు వెలువడినవి. వివిధదేశములవా రందుకు ఒడంబడికలలో సంతకములుగూడ చేసిరి గాని వేరొకవంక యుద్ధనౌకల నిర్మాణము తీవ్రముగా జరుగుచునే యున్నది. ఇపుడు శాంతిదేవతకు లభించుచున్న ఆరాధనము మృదువాక్యములు మాత్రమే. యుద్ధకారణములను తొలగించిననే గాని శాంతి నెలకొనదు. ఒకదేశమువారు మరియొకదేశము నాక్రమించుచున్నంతకాలమును, ఒకజాతివారు మరియొకజాతివారి ధనమును హరించుచున్నంతకాలమును సుస్థిరమగు సమత్వము నెలకొనుట అసంభవము. పాలకుల ఆక్రమణమును తొలగించుటకు పాలితులు ప్రయత్నించుచునే యుందురు. సామ్రాజ్యత్వ—ధనికత్వములు చెలరేగు చున్నంతకాలము శాంతి లభించుట కలలోనివార్త. ఈ రెండును ధనాపహరణమునుగూడ ఈసామ్రాజ్యమునకు మూలాధారములై యుండుటవలననే వారు మనకు మనఃపూర్వకముగ నీదు స్థల మొసంగ జాలకున్నారు. జన

సామాన్యమునకు తటస్థించిన దుర్భరభారము తొలగినన్నచో మరెట్టి లాభమునుగూడ మనకు గ్రహింపదగినదిగా నుండదు. ఒక మహా సామ్రాజ్యముయొక్క భారమును వహించుట కడుదుర్భరమే యైనను మన దేశీయులు చిరకాలమునుండి దానిని సహించియే యున్నారు. చివరకు వారి వెన్నులు విరిగినవి. వారి ప్రాణములుగూడ కడంటినవి. అట్టిచో నీ ధనాపహరణభారము తొలగకుండు నంతకాలము వారీమండలిలో నెటుల భాగస్వాములు కాగలుగుదురు? చర్చింపబడవలసిన సమస్యలలో నధికభాగము ధనికులకు సంబంధించినవిగానే యుండును. వాని కన్నిటికిని బ్రిటిషు దొరతనమువారే కారకులుగానో, ప్రోత్సాహకులుగానో యుందురు. భారత సంస్థానాధిపతులు, బ్రిటిషు ఉద్యోగులు, బ్రిటిషు వారిలోను భారతీయులలోను ధనికులు, గొప్ప గొప్ప జమీందారులు మున్నగువారికి సంబంధించిన సమస్యలేతరచుగా మనయెదుట నుంచబడుచుండును. వారందరును రక్షణ కోరుచుందురు. నిజముగా రక్షణ బడయుట కర్హులైన దురదృష్టవంతులగు కోట్లకొలది ప్రజలు నోరెత్తుటయే లేదు. వారి కష్టములను విన్నవించువారును గూడ మిక్కిలి తక్కువగనే యున్నారు. బ్రిటిషు సామ్రాజ్యము ఏ రూపముతోనైన సరే, భారతదేశమునందు కొనసాగింపబడుచుండునంత కాలమును ఆ సామ్రాజ్య మిట్టి ధనికబృందములనే బలపరుచుచుండును. ఇట్టి బృందముల సంఖ్యనుగూడ నింకను వృద్ధి నొందించుచుండును. ఇట్టి ప్రతిబృందమునుగూడ మన మార్గమున కడ్డుపడుచునే యుండును. కఠిన శాసనములను ప్రయోగింపకుండ నిట్టిప్రభుత్వమును కొనసాగింప వీలులేదు. కాన నది తప్పనిసరియే యగుచున్నది. గూఢచారివర్గమే యీ పరిపాలనకు చిహ్నము. దూతలు, ప్రోత్సాహకులు, వార్తాహరులు, నేరము నొప్పికొనిన నిందితులు మున్నగు తుచ్ఛనీచసమితు లన్నియును దీనికి ఉపాంగములు.

1. అధినివేశన, 2. సంపూర్ణ స్వాతంత్ర్యము లను శబ్దములను గూర్చి మనలో మనకు చాల వాద ప్రతివాదములు జరిగినవి. ఈమాటలే కలహబీజములైనవి. ఏ పేరు పెట్టినను సరే అధికారవిజయమే మన వాంఛితార్థము. భారతదేశమున కేవిధమగు నధినివేశ స్వాతంత్ర్యము నిచ్చినను గూడ దానివలన మనకు నిక్కమగు నధికారము లభింపదు. విదేశీయ సేనను, ఆర్థికపరిశీలనను మనదేశమునుండి పూర్తిగా తొలగించుటయే యీ అధికారమునకు ముఖ్య నిదర్శనము. కావున మన మీ రెండిటినిగూర్చియు గట్టిదీక్షను బూనినచో తక్కినవన్నియు సులభముగానే లభించును.

కావున నేడు మనము సంపూర్ణ స్వాతంత్ర్యమునే కోరుచున్నాము. ఏ విధముగా గాని మనకాజ్ఞాపించుటకు బ్రిటిషుపార్లమెంటుకు అధికారము కూడదని యీ కాంగ్రెసు మహాసభ యిదివర కెన్నడును అంగీకరించి యుండలేదు. ఇకముందు గూడ నంగీకరింపదు.

కావున నీసభను మనము కోరదగిన దేదియును లేదు. ఏవిదే యాక్రమణమునకుగూడ నిటుపైని భారతదేశ మెంతమాత్రమును సహి పదను నొక్కవిషయమును మనము పార్లమెంటుకును ప్రపంచమునక కునుగూడ తెలియజేయవలసియున్నది. మనసంకల్పమును కొనసాగింప శక్తి ప్రస్తుతము మనకు లేకపోవచ్చును. మన దౌర్బల్యమును మన పూర్తిగా గుర్తించియే యున్నాము. కావున మనము బలయుతుల ప్రగల్భములు పలుకుటయును, గర్వించుటయును గూడ అనుచితము కాని మన సంకల్పబల మత్యధికమే. మనసంకల్పముగూడ దుర్బల అను భ్రాంతికి ఏదేశమువారును, ముఖ్యముగా బ్రిటిషువారును గురి గూడదు. దాని ఫలితములను బాగుగ గ్రహించియే పరమపవిత్ర భా ముతో మన మిట్టి దృఢసంకల్ప మొనరించుచున్నాము. ఇక తిరుగు లేదు. ఒక గొప్పజాతి ఒకసారి మనఃపూర్వకము నొక దృఢసంకల్ప మొనరించినచో ఆజాతిని చిరకాలము తృణీకరిం ట అశక్యము. ఒకటి రెండు సారులు మన ప్రయత్నములు విఫ కావచ్చును గాని మూడవసారి మనకు విజయము కలుగుట నిశ్చయ

మనము సంఘర్షణములతో విసుగు జెందియున్నాము. శాం బడసి మనదేశము నభివృద్ధి నొందింపవలెననియే మన మత్యధికము కోరుచున్నాము. మన కుటుంబములు విధ్వంసమగుచుండగను, ధీరు మనయువకులు కారాగృహములకును, ఉరికంబములకును పంపబడుచు గను చూడవలెనని మనము కోరుచున్నామా? అది మన కాసంప్రద తనకు లభించుచున్న నామమాత్రమగు నాదాయమునుగూడ గో యి తనకుటుంబమును తిండి లేకుండ మాడ్చి తాను సమ్మెకట్టవలె యేకార్మికుడైన కోరునా? గత్యంతర మేదియును కనబడక విధి సంఘర్షము కలిగినపుడే అత డటుల సమ్మెకట్టును. అటులనే గా యుతమగు శాంతిని బడయుటకు మార్గాంతరము లేకపోవుటవల మనముగూడ నట్టి వినాశనకరమగు జాతీయ సంరంభమునకు గడం సిన వార మగుదుము. మనము మనఃపూర్వకముగా శాంతినే కో న్నాము. సోదరభావ సూచకమగు మన హస్తమును గ్రహింపగో రందరును గ్రహింపగలుగుటకు దానిని మన మెల్లపుడును చా యుంచెదము. కాని ఆహస్తమున కాధారభూతమగు శరీర మెట్టి యమునకును లొంగదు. ఆ శరీరసంబంధమగు మనసు ఏప్రధాన యమును త్యజింపదు.

మన మింకను సంఘర్షణమునందే ప్రవేశింపవలసి యుండ భావి పరిపాలనావిధానమునుగూర్చి మన మిపు డాలోచింప నక్క లేదు. రెండేండ్లపాటు మనవా రనేక విధానములనుగూర్చి ఆలో చిరి. చివరకు అఖిలపక్షసభవా రొకపద్ధతిని పరిష్కరించిరి. దా కాంగ్రెసువారుగూడ నొకవత్సరము గడువుతో స్వీకరించిరి. ఇం వ్యయపరుపబడిన శ్రమ యెంతమాత్రమును వ్యర్థమైనది కాదు. మనకు లాభకరమే. కాని ఆ వత్సరము గడువును గడచిపోయి ఇటుపైని పనిచేయవలసిన పరిస్థితులనే మనము గమనింపవలసియున్న

గాన పరిపాలనా విధానములనుగూర్చి ఆలోచించుట కిపుడు తీరుబడి లేదు. కాని మనకు సంబంధించిన సమస్యలను మనము తృణీకరింపగూడదు. మన సంఘర్షణమునకును, మన భావి పరిపాలనావిధానమునకును సహాయకములును, నిరోధకములు నగు సమస్యల నన్నిటిని మనము గమనించుచునే యుండవలెను.

నేను సాంఘికవాదిని, ప్రజాప్రభుత్వవాదిని. రాజులయందును, యువ రాజులయందును నాకెట్టి నమ్మకమును లేదు ప్రస్తుతము గొప్ప గొప్ప పరిశ్రమలకు యజమానులుగా నున్నట్టివారిని కలిగించెడు పద్ధతి యందుగూడ నాకు నమ్మకము లేదు. ఈ పారిశ్రామిక ప్రభువుల కిపుడు మనుష్యులపైనను, వారి అదృష్టములపైనను కలిగియున్నంత అధికారము పూర్వకాలము నందు భూమీశ్వరులకుగూడ నుండియుండలేదు. ప్రాచీనకాలమునం దుండిన సామంతప్రభువుల పురాతనపద్ధతులనే యీపారిశ్రామికప్రభువు లిపుడుగూడ నవలంబించుచున్నారు. కాని, ప్రస్తుతము మన దేశమునకు సంబంధించిన పరిస్థితులలోను, ఈకాంగ్రెసు మహాసభకుగల కట్టుబాటులలోను సంపూర్ణ సాంఘిక విధానమును (సోషలిస్టికు ప్రోగ్రాము) ఈసభ అనుసరించుట కెంతమాత్రమును వీలు లేదని నేను గ్రహించియే యున్నాను. కాని, సాంఘికవాదుల సిద్ధాంతములు క్రమక్రమముగ ప్రపంచమునందంతటను మానవసంఘము నందు పూర్తిగా నిదివరకే వ్యాపించిన వని మన మంగీకరింపక తప్పదు. వానిని పూర్తిగా నాచరణలో పెట్టుటకు వలయు కాలసాధననిర్ణయ మునందు మాత్రమే భిన్నాభిప్రాయములు కలిగియున్నవి. భారతదేశమున దారిద్ర్యమును, అసమభంగియును తొలగవలెననిన భారతదేశము గూడ ఈమార్గమునే అవలంబింపవలసి యుండును గాని మన జాతీయ విజ్ఞానమున కనుగుణముగా మనము ఆశయములను, విధానములను నిర్ణయించుకొనవచ్చును.

## మూడు ప్రధానసమస్యలు

అల్పసంఖ్యాకులు, సంస్థానములు, కార్మిక–కృషీవర్గములు అను నీమూడును మనకు ప్రధానసమస్యలై యున్నవి. అల్పసంఖ్యాకుల సమస్యనుగూర్చి నేనిదివరకే ముచ్చటించి యుంటిని. వారివిజ్ఞానములును, సంప్రదాయములును చెక్కుచెదరకుండ నుండగలుగునని వారికి మనము క్రియారూపకమగు వాగ్దానము నొసగవలెను.

## సంస్థానములు

భారతదేశమునకు సైతము ఈ స్వదేశసంస్థానములు గత కాలమునాటి విచిత్రనిదర్శనములే యగును. ఇపుడున్న సంస్థానాధిపతులు నామ మాత్రమునకే రాజులుగా నుండినను వారిలో పెక్కుమంది తాము దైవాంశ సంభూతుల మనియును, సంస్థానమంతయు తమ సొంతమనియును, దానిని ఇచ్చవచ్చినట్లు వ్యయపరచుటకు తమ కధికారము కలదనియును ఇప్పటికినిగూడ నమ్ముచునే యున్నారు. వారిలో మిక్కిలికొద్దిమందిమాత్రమే తమబాధ్యతనుగుర్తించి ప్రజాసేవ చేయుటకు పూనుకొనుచున్నారు కాని తక్కినవారందరిలోను అట్టిసుగుణమేదియును కనబడుటలేదు. ఇందులకు వారిని నిందించుట న్యాయమని తోచదు. ఏలయనగా ఒక అనర్థకవిధానముక్రిందనే వారిట్లు తరబీతుచేయబడిరి గాన ముఖ్యముగా తొలగవలసినది ఆ అనర్థకవిధానమే. "భారత–బ్రిటను దేశములకు సంగ్రామము తటస్థించినచో నేను బ్రిటనుదేశముపక్షముననే నిలిచి మాతృదేశీయులతో పోరుసలిపెదను." అని ఒక సంస్థానాధిపతి స్పష్టముగా తెలిపెను. అతని దేశభక్తి యీరీతిగా నున్నది. ఏ సభలోనైనను సంస్థానముల ప్రజల ప్రతినిధు లెవ్వరు నుండగూడదనియును, సంస్థానముల ప్రజలకు తామే ప్రతినిధులమనియును ఈ సంస్థానాధిపతులు తెలుపుటలోను, దానిని బ్రిటిషు దొరతనము వారామోదించుటలోను ఎట్టి వింతయును కనబడుటలేదు. తక్కిన భారతదేశమునంతను త్యజించి యీసంస్థానాధిపతులు ప్రత్యేకముగ నిలువగలుగుట అసంభవము. కావున వారికి విధికృతములగు పరిమితులను అంగీకరింపక పోయినచో నిటుల భావించినవారందరికి నెట్టి ఫలితము కలిగినదో వీరిగూడ నట్టి ఫలితమే కలుగగలదు. ఈసంస్థానముల భావిస్థితిని నిర్ణయించుటకు సంస్థానముల ప్రజలును, సంస్థానాధిపతులునుగూడ హక్కుదారులగుదురు గాని కేవలము సంస్థానాధిపతులు మాత్రమే హక్కుదారులు కాజాలరు. స్వయంనిర్ణయాధికారమును కాంగ్రెస్ మహాసభ కోరుచున్నది గావున ఈ అధికారము సంస్థానముల ప్రజలకుగూడ కలదని యంగీకరించుట విధి. కావున ఈ పరివర్తనము అత్యాకస్మికముగా కలుగకుండుటకు కాంగ్రెసుసభవారితో నాలోచింపగోరిన సంస్థానాధిపతులతో కలసి ఆలోచించుటకు సభవారు సర్వసిద్ధముగానే యున్నారు. ఎటులైనను సంస్థానములు ప్రజలను పరిగణించియే తీరవలెను.

## కార్మిక – కృషీవల వర్గములు

ఇదియే మిక్కిలి గొప్పసమస్య. భారతదేశ ప్రజలలో అత్యధికసంఖ్యాకు లీ రెండువర్గములవారే. వారిని మన మెంతవరకు వృద్ధినొందించి సంతృప్తి నొందింప గలుగుదుమో అంతవరకే మనము కృతార్థుల మగుచుందుము. ఈ రెండువర్గములవారి సహాయము కాంగ్రెసు కెంతవరకు లభించునో కాంగ్రెసుబలముగూడ నంతవరకే యుండును. వారి సమస్యయే దేశసమస్యగాన వారి సమస్యను మనము ఉపేక్షించినచో వారు మనకు తోడ్పడెదరు. ఇదివరకు పెక్కుసారులు కాంగ్రెసువారు ఈ రెండువర్గములకును తమ సద్భావమును తెలిపియుండుట తప్ప అంతకంటె మరేమియును చేసియుండలేదు. ధనికులు పేదలు, జమీందారులు రైతులు మున్నగువారందరిపట్లను కాంగ్రెస్ నిష్పాక్షికముగానే యుండవలెనని చెప్పెదరు. కాని యిపుడు కాంగ్రెసు అటుల నిష్పాక్షికముగా నుండలేదు. ఏలయనగా బలమంతయును ధనికులయందునను, జమీందారుల యందునను ఉన్నదే గాని పేదలయందును, రైతులయందును లేదు. అట్టిచో కాంగ్రెసువారు తటస్థులుగా నున్న

యెడల చిరకాలమునుండి వేరూనియున్న అక్రమమును, దోపిడిని ప్రోత్సహించినవారే యగుదురు. ఒకవర్గముపై నింకొక వర్గము విజృంభింపకుండునట్లు చేయుట యొక్కటే యిందులకు తగిన సాధనము. కొన్ని నెలలక్రితము బొంబాయిలో భారత స్థాయిసంఘ సభ జరిగినపుడు సాంఘిక ఆర్థికములలో మార్పునుగూర్చిన ఆశయమును వెల్లడించునట్టి యొకతీర్మానముగూడ నామోదింపబడెను. ఈ మహాసభవారుగూడ ఆతీర్మానమును స్థిరపరచి వెంటనే జరుపదగిన మార్పులను జరుపుటకు తగిన విధానమునుగూడ స్థిరపరుప గోరెదను.

ఈవిధానమునుగూర్చి నేడే కాంగ్రెసు వారందరును కలసి అధికముగా పనిచేయుట కవకాశము లేనిమాట నిజమేయైనను, ఈ ఆశయమును మాత్రము దృష్టిపథమునం దుంచుకొని దానికొరకు వానిని సాగించుచుండవలెను. ఈ సమస్య కేవలము భూస్వాములు రైతులకును, యజమానులు పనివాండ్రకు నొసంగెడు వేతనములకును, దయాధర్మ బిచ్చములకును మాత్రమే సంబంధించినది కాదు: యజమానులును, భూస్వాములును తాము పోషకులమనియు, రైతులును, పనివాండ్రును తమచే పోషింపబడు చున్నవారనియు భావించుటయే ఒక విధమగు దయాధర్మమగుచున్నది. అది యున్నంతకాలము ఈ అవమానమును, ఈ అనర్థకమును తొలగజాలవు. తాము ధర్మకర్తలమని మరికొందరు తెలుపుచుండుటగూడ నిట్టి నిస్సారవాదమే యగును. ధర్మకర్త అనగానే మంచిచెడ్డలను కలిగించునట్టి అధికారము స్వయం నియోజితులగు నీ ధర్మకర్తలయందే యుండును గాన దానిని వారు తమయిచ్చ వచ్చినట్లు వినియోగించెదరు. ధర్మకర్తగ నుండుటకు ఒకజాతికి మాత్రమే న్యాయమగు అధికారము కలదు గాని వ్యక్తులకును, సంఘములకును అట్టి అధికారము లేదు. తాము భారతదేశమునకు ధర్మకర్తలమని ఆంగ్లేయులలో పెక్కుమంది సద్భావముతోనే నమ్ముచుందురు. ఐనను వారీదేశము నెట్టి దురవస్థకు పాలుచేసిరో చూచితిరా?

పంటలను పండించుటయును, పరిశ్రమలను వృద్ధినొందించుటయును ఎవరి మేలుకొరకు? అను సమస్యను మనము పరిష్కరింప వలసియున్నది. ఇపుడు మనదేశమునందు సమృద్ధిగా పండింపబడుచున్న పంటలు వానిని పండించుచున్న కృషీవలులకును, పనివాండ్రకును గూడ నుపయోగపడుటలేదు. పరిశ్రమల ప్రధాన ప్రయోజనము కోటీశ్వరుల సంఖ్యను వృద్ధినొందించుటయే అను నభిప్రాయముగూడ కలిగియున్నది. పంట లెంత సమృద్ధిగా నుండినను, పరిశ్రమల యజమానులు కోట్లకొలది లాభమును పంచుకొనుచుండినను రయితులకును పనివాండ్రకును మట్టిగుడిసెలును, చీకటికొట్లును, దిగంబరత్వమును మాత్రము తప్పుటలేదు. బ్రిటిషు సామ్రాజ్యవైభవమును, మనదేశమున ప్రస్తుతమునం దున్న సాంఘిక విధానమును గూడ నీ దురవస్థలు లోకమునకు చాటుచున్నవి.

కావున మన ఆర్థికవిధానము, భూతదయ, మానవసహజ ప కనికరము మున్నగువానిపైననే ఆధారపడి యుండవలెను. ధన కొరకు మానవుల సౌఖ్యమును మంట గలుపునదిగా నుండగూడదు. ప వాండ్రను పస్తులపాలు చేయకుండ నొకపరిశ్రమను కొనసాగింప లేనిచో దానిని నిలిపివేయుటయే కర్తవ్యమగును. పొలములో చేయువారికే సమృద్ధిగా ఆహారము లభింప వీలు లేనపుడు ఆపంట కొంతభాగమును హరించుచుండిన మధ్యవర్తు లందరును తొలగిపో నదే. పొలములలోను, యంత్రశాలలలోను పనిచేసెడువారు సామా సౌఖ్యస్వాతంత్ర్యముల ననుభవించుటకు ఎంతవేతన మవసరమో తమాత్రమైన వారికి విధిగా లభించుచుండవలెను. ఇది కేవలము క పరిమాణమే. ఈసిద్ధాంతమును అఖిలపక్షసభవా రామోదించి సూచనలలో చేర్చియున్నారు. కాంగ్రెసువారుగూడ నట్టుల నామోదించుటయే గాక సహజములగు దీని ఫలితములను కరించుటకు గూడ సంసిద్ధులు కావలెను. సరిగా జీవితసౌఖ్య ననుభవించుటకు తగిన వేతనము లొసగబడ వలెనని కార్మి కోరుచున్నారు. కాన వారి కట్టి వేతనములు లభించుటకును, కా సంఘములు దేశమునందంతటను ఏర్పడుటకును, వారు సహకారప పరిశ్రమలను పరిపాలింపగల స్థితికి రాగలుగుటకును తగిన సహా మొనరించుటను గూర్చిన తీర్మానమును గూడ నీ మహాసభ రామోదింపవలెను.

భారతదేశమునందలి పెక్కుకోట్లమంది ప్రజలలో పరిశ్ర లలో పనిచేయుచున్న వారిసంఖ్య అత్యల్పాంశమే యైనను వారి శీఘ్రముగనే అధికమగు పలుకుబడి లభించుచున్నదను విషయ మనము గుర్తింపక తప్పదు. తమ బాధలను తొలగింపవలెనని సాయపు పనివాండ్రే మిక్కిలి హెచ్చుగను దీనముగను, మొర చున్నారు గాన వారి ప్రస్తుతస్థితిని చక్కబరుచుటకు తగిన నమును మనము నిర్ణయింపవలెను. భూములకు సంబంధించిన చ లును, ఇపు డున్న భూమి హక్కు (ల్యాండు టెన్యూరు) పద్ధతి మారిననే గాని వారికి నిజమైన మేలు కలుగదు. ఈ సభలో చాల గొప్ప భూస్వాములుగూడ సభ్యులుగా నున్నారు. ఒకని ఐందలకొలది, వేలకొలది యకరములభూమికి యజమానుడై యు పద్ధతి ప్రాచీనకాలమున ఐరోపాఖండమునందుండిన సామంత పద్ధతివంటి పద్ధతిఫలన కలిగినదే. ఇపుడు ప్రపంచమునం దం గూడ ఈ పద్ధతి మిక్కిలి శీఘ్రముగనే తొలగిపోవుచున్నదని భూస్వాములుగూడ గ్రహింపదగును. ధనికుల ప్రాబల్యమే మి హెచ్చుగా నుండిన దేశములందుగూడ గొప్పగొప్ప సంస్థాన విభజించి ఆభూములలో పనిచేయగోరెడు కృషీవలులకే వాని చున్నారు భారత దేశమునందుగూడ చాలచోట్ల వ్యవసాయదా భూస్వాములుగూడనై యున్నారు. ఈపద్ధతియే దేశమునం దం



౫. వేలూరు కోట

శ్రీ యం. క. రంగస్వామయ్యంగారు.



౬, 'ఆశ'

శ్రీ యం. కె. రంగస్వామయ్యంగా

వ్యాపింపవలెను. ఈ విధానమునందు గొప్పగొప్ప భూస్వాములలో కొందరైననుగూడ మనకు తోడ్పడెదరుగాక.

ఈ మహాసభ వార్షిక సమావేశమునందు ఆర్థికవిషయమును గూర్చి వివరములతో గూడిన విధానమును మన మేర్పరుమట కవకాశము లేదు. మన మిపుడు కొన్ని ముఖ్యనియమములను మాత్రమే యేర్పరచి తక్కిన పనియంతయు స్థాయిసంఘమువారికి వదలివేయవలెను. వారు ఈ సమస్యతో ముఖ్యముగా సంబంధముగల ట్రేడు యూనియను కాంగ్రెసు మున్నగు సంఘముల ప్రతినిధుల సహాయముతో వివరములను స్థిరపరుపవలెను. నేమనలు కాంగ్రెసు మహాసభకును, ట్రేడు యూనియను కాంగ్రెసుకును పరస్పర సహకారము చాల అధికముగా కలుగగలదనియును, ఇకముందు జరుగబోయెడు స్వరాజ్య సంపాదన ప్రయత్నములలో నీ రెండు సంఘములవారును ఏకీభవించియే పనిచేసెదరనియును నే నాశించెదను.

మన కధికారము లభించువరకును ఇవన్నియును కేవలము శుభకాంక్షలు మాత్రమే యగును. కావున మనకుగల నిజమైన సమస్య అధికారవిజయమే. అందులకు యుక్తి చమత్కారములను, న్యాయవాదుల పన్నుగడలను మన ముపయోగింపగూడదు. జాతీయ సంకల్పమును కొనసాగించుటకు తగిన సాధనములనే మనము నిర్ణయింపవలెను. అదియే యీ మహాసభవారికి ముఖ్యకర్తవ్యమై యున్నది.

## దీక్షతో పనిచేయుటకు తగిన విధానము

గత వర్షమున మనము సన్నద్ధులము కావలెనని నిశ్చయింపబడెను. కాంగ్రెసు సంఘములను మరల సంస్కరించి సభ్యులసంఖ్యను వృద్ధిపొందించుటకు సర్వశక్తులను వినియోగించి మనము పనిచేసియుంటిమి. అందువలన అధికమగు మేలు కలిగినది. అసహాయోద్యమము ప్రారంభమైన పిమ్మట కాంగ్రెసు సంఘము లిదివర కెన్నడును గూడ నింత శ్రేష్ఠమైన స్థితిలో నుండియుండలేదు. కాని మనలోపములు గూడ మిక్కిలి హెచ్చుగానే యున్నవి. అవి స్పష్టముగానే గోచరించుచున్నవి. కాంగ్రెసు సంఘముల సభ్యులలో పరస్పర ద్వేషములు అన్ని సంఘములలోను గూడ కనబడుచున్నవి. ఎన్నికల విషయమున సభ్యులు శక్త్యుత్సాహములను పూర్తిగా వ్యర్థపరచుచున్నారు. చిరకాలమునుండి వేరూనిన యీమనోదౌర్బల్యమును, నీచమగు స్వార్థపరత్వమును మనము అతిక్రమింప జాలనిచో నిట్టి ఘనకార్యములను మన మెటుల సాధింపగలుగుదుము?

దీక్షతో పనిచేయుటకు తగిన విధాన మిపు డీ మహాసభవారేర్పరిచినచో నిట్టి లోపము లన్నియును తొలగగలవనియును, నిష్ఫలములును, నిరుత్సాహకరములు నగు నీకలహములను మన మెంతమాత్రమును సహింపమనియును నేను పూర్తిగా నమ్ముచున్నాను.

## ధర్మబద్ధములును, శాంతియుతములు నగు పద్ధతులనే అవలంబింపవలెను

ఈ విధాన మెటుల నుండవలెను? మన సంవిధానమువలన గాక అంశములను, పరిస్థితులను బట్టియే మన కవకాశము మిక్కిలి స్వల్పముగానున్నది. సంవిధానమును మన మిచ్చవచ్చినట్లు మార్చవచ్చును గాని అంశములును, పరిస్థితులును అటుల మారునవి కావు. మన పద్ధతులు ధర్మబద్ధములును, శాంతియుతములు నై యుండవలెనని కాంగ్రెస్ ప్రథమనిబంధన శాసించుచున్నది. మన పద్ధతు లెల్లపుడును ధర్మబద్ధములుగానే యుండగలవని నే నాశించెదను. ఏలయనగా మనము పూనుకొనిన యుద్యమము పరమపవిత్రమును, మహత్తరమును నై యున్నది. కావున దానికి కళంకము నాపాదించునట్టియు, పిమ్మట మనలను పశ్చాత్తాపమునకు పాలుచేయునట్టియు కార్యములను వేనిని గూడ మనము చేయగూడదు. దౌర్జన్యయుతములగు పద్ధతులకంటె శాంతియుతములగు పద్ధతులే శాశ్వతములును, అవలంబనీయములునుగూడ నగుటచే మనపద్ధతులు శాంతియుతములుగనే యుండవలెను. దౌర్జన్యయుతములగు పద్ధతులవలన మిక్కిలి తరుచుగా దుష్ఫలితమును, దుర్నీతియునే కలిగియున్నవి. మన దేశమునందు ముఖ్యముగా దౌర్జన్యయుతములగు పద్ధతులవలన నైకమత్యము పూర్తిగా తొలగిపోగలదు. నేడు ప్రపంచమందంతటను కట్టుబాటుతో కూడిన దౌర్జన్యమే ప్రబలియున్నదనుటకెట్టి సంశయము లేదు గాన మనముగూడ దానినే అవలంబించి మేలు పడయవచ్చునుగాని అటులు కట్టుబాటుతో గూడిన దౌర్జన్యమును కొనసాగించుటకు మన కభ్యాసమును, అంగబలమునుగూడ లేవు. వ్యక్తిపరములును, స్థానీయములు నగు దౌర్జన్యప్రయత్నములు నిరాశాసూచకములుమాత్రమే యగును. ఈ దౌర్జన్యవిధానమును నిరాకరించుటతో అత్యధికసంఖ్యాకులు నీతిపథమునుండి గాక ఫలితపథమునుండియే పరీక్షించుచున్నారనిగూడ నేను తలచెదను. మనము దౌర్జన్యమును నిరాకరించునెడల దానివలన అధికమగు లాభము కలుగు సూచనలు లేకపోవుటయే అందులకు ముఖ్యకారణ మగును. భావికాలమునందెపుడైన దేశముగాని, యీమహాసభగాని దౌర్జన్య సాధనములవలననే మనకు దాస్య విమోచనము కలుగునని తలచినచో అపుడు ఆవిధానమే అవలంబింప బడగలదని నేను నిస్సంశయముగా తెలుపగలను. దౌర్జన్యము అధమమేగాని దాస్యము అధమతరము. "పిరికితనమువలన పోరాడుటకు నిరాకరించుటకంటె పోరాడుటయే ఉత్తమ"మని అహింసాసిద్ధాంతమును మనకు బోధించిన మహా ప్రవక్తయే స్పష్టపరచియున్నాడు.

## శాంతియుతమగు సమష్టి ఉద్యమము

మనకు స్వాతంత్ర్యము లభించుటకు మన మవలంబింపవలసిన యే యుద్యమములైనను సమష్టి ఉద్యమములుగానే యుండవలెను.

సార్వజనికములుగా నుండవలసిన సమష్టి ఉద్యమములన్నియును శాంతియుతములుగానే యుండుట విధియైయున్నది. సంఘీభావముతో గూడిన విప్లవమునందుమాత్ర మీ నియమమును పాటింప నవసర ముండదు. పదియేండ్లక్రితము అనుసరింపబడిన అసహాయ విధానమునే మరల మన మవలంబింప దలచినను, లేక ఆధునికమును, కార్మిక సాధనమునగు సమష్టి సమ్మెకట్టు పద్ధతిని మన మవలంబింప గోరిననుగూడ సంఘ నిర్మాణమును, కార్యనిర్వహణమును శాంతియుతములుగానె యుండవలెను. ప్రధానోద్యమము శాంతియుతముగా నుండినను లేకున్నను, దానితోపాటు స్థానికములుగా దౌర్జన్య ప్రయత్నములు గూడ జరుగుచున్నచో ప్రధానోద్యమము సరిగా కొనసాగజాలదు. శాంతియుత దౌర్జన్యయుత విధానములను రెండిటిని ఏకకాలమున కొనసాగించుట అసంభవము. దేనినో యొకదానినే నిర్ణయించి నమః పూర్వకముగా ఆపద్ధతినే కఠినముగా మన మనుసరింపవలెను. ఈసభ వారు ఏపద్ధతిని నిర్ణయించెదరను విషయమున నా కెట్టిసంశయము లేదు. వారు శాంతియుతమగు సమష్టిఉద్యమమునే నిర్ణయించుట నిశ్చయము.

మనము మరల అసహాయోద్యమ విధానమునే అనుసరింపవలెనా? ఆవిధానమునంతను మన మనుసరింప నవసరముండదు. కాని దానికి మూలాధారమగు సిద్ధాంతమునుమాత్రము మనము స్వీకరింపక తప్పదు. పరిస్థితులనుబట్టి యీ విధానములను నిర్ణయించుచుండవలెను. వానినన్నిటిని వివరముగా నీస్థితి యందీ మహాసభవారు నిర్ణయించుట కవకాశము లేదు. ఆపనిని స్థాయిసంఘమువారే నెరవేర్పవలసి యుండును. కాని ముఖ్యవిషయములను మాత్రము ఈ మహాసభవారే నిశ్చయింపవలెను.

## విద్యాశాలలను, న్యాయస్థానముల నిపుడు బహిష్కరించుట సముచితమని తోచదు

శాసనసభలు, న్యాయస్థానములు, విద్యాశాలలు వీనినిమూడింటిని బహిష్కరించుటయే వెనుకటి విధానమై యుండెను. క్రమముగా సేనలో పనిచేయుటకును, పన్నులను చెల్లించుటకును నిరాకరించుట గూడదని ఫలితములుగనే అంగీకరింపబడెను. జాతీయసమరము కడు తీవ్రముగా జరుగుచున్నపుడు దానిలో పాల్గొనుచున్నవారు ఎట్లు న్యాయస్థానములలోను, విద్యాశాలలలోను పనిజేయుచుండ గలుగుదురో నేను గ్రహింపజాలకున్నాను. కాని ప్రస్తుత స్థితిలో వీనిని రెంటిని బహిష్కరించుట సమంజసమని నాకు తోచుటలేదు.

## శాసనసభలను బహిష్కరింపవలెను

శాసనసభలను బహిష్కరించుటనుగూర్చియే వెనుక కడుతీవ్రములగు చర్చలు జరిగెను. దానినిగూర్చియే ఆసభలలో రెండుపక్షములుగూడ నేర్పడెను. ప్రస్తుత పరిస్థితులు చాల భిన్నములుగా నుండుటచే ఆవివాదమును మన మిపుడు మరల కలిగింప నవసరములేదు. కొన్నియేండ్ల క్రితము కాంగ్రెసువారు శాసనసభలలోనికి వెళ్లుటకు ఈమహాసభ అనుమతి నొసగెను. అది తప్పనిసరియే యనియు, అందువలన కొం లాభము కలుగక పోలేదనియునుగూడ నేను నమ్ముచున్నాను. ఇపు వానివలన మనకు కలిగెడు లాభ మేమియును లేదు. కావున వా పూర్తిగా బహిష్కరించుటయా? లేక పూర్తిగా దొరతనము సహకార మనుసరించుటయా? అను నీరెండు అంశములలోను ఏ యొకదానిని మన మిపుడు స్థిరపరుపవలెను. వేరు మార్గ మేదియు లేదు. నామమాత్రములగు శాసనసభలు కాంగ్రెసువారిలో నెట్టి గ్ధకములను కలిగించినదియును మనకందరకును బాగుగా తెలిసి యున్నది. ప్రభుత్వమువారి సంఘములు మనలోనున్న ఉత్తమ ఘలను ఆకర్షించుచున్నవి. మనలో దేశారాధకులసంఖ్య మిక్కి తక్కువగా నున్నది. కావున నిడివరకు శాసనసభలో పనిచేయుచు కాంగ్రెసువాదులు ఆదివ్యర్థవనముల పట్ల విముఖులై దేశసేవకు గ వనే గాని సమష్టి ఉద్యమ మేదియునుగూడ కొనసాగజాలదు. మీ మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్యమునే ప్రకటించునెడల వారు మరల నెటుల నాశాసనసభలకేగి నిరుపయోగములను నిత్యకృ ములను కొనసాగింపగలిగెదరు? శాశ్వతముగ నొక విధానమును గా యొకపద్ధతిని గాని యేర్పరుచుట కెట్టి అవకాశమును లేదు. కా భారతదేశీయు లందరుగాని, కనీసము కాంగ్రెసు వాదు లందరై గాని ఒక విధానమునే యెల్లకాలమును కొనసాగించుచుండవలె ఈ మహాసభగూడ నిర్బంధింప వీలులేదు కాని నేటి స్థితిగతులను కాంగ్రెసువారు ముఖ్యముగా శాసనసభలను పూర్తిగా బహిష్క వలెననియే నేను సవినయముగా విన్నవించుచున్నాను. దీనిని 19 జూలై నెలలోనే స్థాయిసంఘమువారు సూచించి యుండిరి గాన నములు జరుపుట కిదియే ముఖ్యసమయము.

## పన్నులను చెల్లింపకుండుట

శాసనసభల బహిష్కరణము ఫలసిద్ధి కొక సాధనముమాత్ర యగును. శాసనసభలను బహిష్కరించుటవలన సమర్థులగు దేశీయ చాలమంది దేశసేవ నొనరించుట కవకాశము లభించును. అపుడు తమ దృష్టిని యథార్థమగు సంఘర్షణము వంకకు మరల్ప వీలగును. పన్నులను నిరాకరించుటయే యదను. వీలున్నచోట్లలో కార్మి ఘముల సహాయముతో సమష్టి సమ్మెకట్టులనుగూడ కలిగింప యుండును. ప్రత్యేక స్థలములలో పన్నులను నిరాకరించుటకు ఏర్పాటులు జరుగవలసియుండును. ఎచట ఎపుడు అది సాధ్య తోచునో అపుడు దానిని కొనసాగించుచుండుటకు స్థాయిసంఘమ ఈమహాసభవారు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసగవలెను.

## నిర్మాణ విధానమును కొనసాగించుచునే యుండవలె

నిర్మాణ విధానమునుగూర్చి నే నింతవరకు నేమియును యుండలేదు. ఈవిధానము విధిగా జరుగుచునే యుండవలెనుగా

లము దానినే అనుసరించినయెడల శీఘ్రకాలములో మనకు సంకల్పసిద్ధి కలుగదని కొన్నియేండ్లనుండి కలిగిన అనుభవమువలన మనము గ్రహింపగలిగియుంటిమి. ముందు జరుగవలసిన పనికి అది యిపుడు రంగమును సిద్ధపరుచుచుండును. పదియేండ్లపాటు శాంతముగా జరుపబడిన కృషి నేడు ఫలవంతమగుచున్నది. ముఖ్యముగా విదేశవస్త్రములను, బ్రిటిషుసరకులను మనము బహిష్కరించుచునే యుండవలెను.

## రాజకీయ — ఆర్థిక బహిష్కరణము

మన విధానమునందు రాజకీయబహిష్కరణమును, ఆర్థికబహిష్కరణముగూడ చేరి యుండవలెను. మనము సంపూర్ణ స్వాతంత్ర్యమును బడయువరకు ఇతరదేశములను పూర్తిగా బహిష్కరించుట మనకు సాధ్యము కాదు. స్వాతంత్ర్యము లభించిన పిమ్మటగూడ మరియొక దేశమును పూర్తిగా బహిష్కరించుటకును, దానితో నెట్టిసంబంధమును లేకుండ చేసికొనుటకును మనకు వీలుండదు. బ్రిటిషు ప్రభుత్వముతో గల సంబంధమును పూర్తిగా త్యజించి మనపైననే ఆధారపడుటకు మనము గట్టి ప్రయత్నము నొనరింపవలెను. భారతదేశమునకు గాను ఆంగ్లదేశమువారు చేసిన ఋణముల కన్నిటికిని మేము బాధ్యతను వహించుట కంగీకరింపమని గూడ మన మిపుడు స్పష్టపరుపవలెను. ఇట్టి తీర్మానము గయలో జరిగిన మహాసభలో ఇదివరకే ఆమోదింపబడెను. కాన మనము దానినే బలపరుపవలెను. భారతదేశోపయోగముకొరకు చేయబడిన ఋణములను తీర్చుటకు మాత్రము మన మంగీకరింపదగును. భారతదేశభారమును వృద్ధి నొందించుటకును, దానిని శాశ్వతముగా నడచియుండుటకును చేయబడిన ఋణములను వేనినిగూడ మన మంగీకరింపగూడదు. తమ రాజ్యమును విస్తరింపజేయుటకును, భారతదేశమున తాము స్థిరపడుటకును, అవసరమగు యుద్ధములను చేయుటకు ఆంగ్లదేశము చేసిన ఋణములను తీర్చుటకు దారిద్ర్యమున మునిగియున్న భారతీయు లెంతమాత్రము నంగీకరింపజాలరు. ధనాపహరణముకొరకు మనదేశమునకు వచ్చిన విదేశీయులవలన తగిన ప్రతిఫలమునైన బడయకుండ వారికి చేయబడిన అపరిమితములగు సదుపాయములనుగూడ మన మంగీకరింపజాలము.

## విదేశములలోనున్న భారతీయులు

వీరినిగూర్చి నేనిదివర కేమియును చెప్పియుండలేదు. ఇపుడైనను అధికముగా చెప్పదలచుకొనలేదు. తూర్పు దక్షిణాఫ్రికాలు, ఫిజీ దీవులు మున్నగు విదేశములలో మన దేశీయులు అధికసంఖ్యాకుల నెదుర్కొని ధైర్యముతో పనిచేయుచున్నారని నే నెరుగుదును. వారిపట్ల నా కధికమగు సానుభూతియును కలదు గాని వారి భావిస్థితి యిపుడు మనము భారతదేశమున ప్రారంభింపనున్న మహాసంరంభమువలననే పరిష్కారము కావలసియున్నది గాన వారినిగూర్చి నే నిపు డధికముగా చెప్పదలచుకొనలేదు.

## విధేయత అత్యవసరము

ఈసంరంభము శ్రేష్ఠముగా జరుగుటకు కాంగ్రెసువర్గములు అతి సమర్థములుగా నుండవలెను. మన కాంగ్రెసు విధానమును, అంగనిర్మాణమును కడుసుందరముగా పనిచేయుచుండుటచే విషమస్థితి కలిగినపుడు వెంటనే యుపయోగింపజాలకుండ నున్నవి. గొప్పగొప్ప ప్రదర్శనములతోనే తృప్తినొందునట్టి కాలము గడచినది. ఇపుడు శాంతముగను, అప్రతిహతముగను పనిచేయువారే కావలసి యున్నారు. సంపూర్ణవిధేయత నెలకొనిననే గాని యిది సాధ్యపడదు. ఈమహాసభలో ఆమోదింపబడెడు తీర్మానము లన్నియును విధిగా ననుసరింపబడవలెను. ఈ రీతిగా సంపూర్ణ విధేయతతో కాంగ్రెసుమహాసభవారి ఆజ్ఞలను నెరవేర్ప బూనిన వారి సంఖ్య యిపుడు మిక్కిలి తక్కువగా నుండినను గూడ క్రమక్రమముగా కాంగ్రెసుకు అత్యధికమగు బలము చేకూరుట కెట్టి సంశయమును లేదు. కృతనిశ్చయులైన అత్యల్ప సంఖ్యాకులే జాతుల అదృష్టమును పూర్తిగా మార్పు నొందింపగలిగిరి. ఆజ్ఞ పాటింపలు లేనివారు కోట్లకొలదిగా నుండినను వారివలన నెట్టిలాభమును కలుగదు. స్వాతంత్ర్యమునకు నియమానుసరణమును, విధేయతయును ప్రధానాంగములే కావున మనలో ప్రతివ్యక్తియును దేశహితార్థము స్వార్థమును త్యజింపవలెను.

మన దేశమునందు కాంగ్రెసు మహాసభ యేదోఒక అల్పసంఖ్యాకవర్గమునకు ప్రతినిధిగా నుండియుండలేదు. చాలమంది మనోదౌర్బల్యమువలన ఈ మహాసభలో చేరి పనిచేయజాలక పోయినను తమ విమోచనమునకు మాత్రము దీనిపైననే ఆధారపడియున్నారు. కలకత్తా మహాసభలో తీర్మాన మామోదింపబడినప్పటినుండియు ఈ మహాసభ మరల సమావేశమగునట్టి యీ గొప్పదినముకొరకే దేశీయులందరును అధికోత్కంఠతో నిరీక్షించుచుండిరి. మనము దేని నెపుడు సాధింపగలుగుదుమో మనలో నెవరునుగూడ తెలుపజాలరు. విజయము మన అధీనతయందు లేదు. అది మన ఆజ్ఞలకు లొంగునది కాదు. కాని ధైర్యముతో పనిచేసెడువారికే తరుచుగా విజయము కలుగుచుండును. ఫలితములకు భయపడుచుండునట్టి భీరువులకు విజయ మెన్నడును లభింపదు. మన ఆశయము మహత్తరము. ఘనకార్యములను సాధింపగోరినచో తత్ప్రయత్నమునందు కలిగెడు ఘనతరములగు కష్టముల ననుభవించుటకు సంసిద్ధులము కావలెను. మనకు జయము శీఘ్రకాలములో కలిగినను దీర్ఘకాలములో కలిగినను, ఈ ఘనప్రయత్నమును చేయకుండను, అతి దీర్ఘమును, అధిక విఖ్యాతము నగు భారతదేశ చరిత్రలో మరియొక ఉత్తమమగు పుటను చేర్చకుండను మనలను ఇతరు లెవ్వరును గూడ నిరోధింపజాలరు.

మన దేశమునం దిపుడు చాలచోట్ల కుట్రకేసులు విచారణలో నున్నవి. అవి యెల్లపుడును గూడ నున్నవే గాని నేడు క్రొత్తగా వచ్చి

నవి కావు. రహస్యముగా కుట్రలను పన్ను కాలము గడచిపోయినది. విదేశీయుల ఆక్రమణమునుండి మనదేశమునకు విముక్తిని గలిగించుటకు ఇపుడు మనము చేయుచున్నది బహిరంగమగు కుట్రయే గాని రహస్యమగు కుట్ర గాదు. కావున, సోదరులారా! మీరందరును మనదేశీయులగు సోదరీ సోదరు లందరునుగూడ నీకుట్రలో చేరుటకు కోరబడుచున్నారు. ఇందువలన ప్రస్తుతము మీకు కలిగెడు బహుమానములు కష్టముల పాలగుట, కారాగృహములకు పంపబడుట, చివరకు మ... శిక్షకు గురియగుట మున్నగునవియే. "అనంతకాలలీన మైనను నిత్య... వనభాసురయగు భారతమాతకు యథాశక్తిని సేవ చేయగలిగితి... ప్రస్తుతము మానవసంఘమునంతను బంధించియున్న దాస్యశృం... నుండి దానిని తొలగించుటకు స్వల్పమగు సేవ చేయగలిగితిమి" అ... దియే మీకు దీనివలన కలుగగల హృదయామోదము.

# తీర్మానములు

## ౧

భారత కాంగ్రెసు స్థాయిసంఘమునకు వెనుక కార్యదర్శిగా నుండిన పండిత గోకర్ణనాథ మిశ్రగారు, ప్రొఫెసరు బి. ఎం. పరంజపి గారును, శ్రీయుత పి. భక్తవత్సల నాయుడుగారును, రోహిణీ కాంత గారును, ఆర్. కె. లాహిరీగారును, బి. చక్రవర్తిగారును దివంగతులైనందులకీ మహాసభవారు సంతాపమును వెల్లడించుచున్నారు.

## ౨

జతీంద్రనాథ విజయులు గావించిన మహాత్యాగము నీసభవారభినందించుచు వారికుటుంబమునకు సానుభూతి తెల్పుచున్నారు. మరియు భారతదేశమునగల విదేశీయ ప్రభుత్వమే వీరి ట్లాత్మసమర్పణ కావించుటకు కారణమని అభిప్రాయపడుచున్నారు.

## ౩

ఈ సభవారు వయిస్రాయి బండిమీద గావింపబడిన బాంబు ప్రయోగమును నిరసించుచు, ఇట్టిచర్యలు కాంగ్రెసు సిద్ధాంతమునకు వ్యతిరేకమనియు, జాతీయ సమరమునకు నష్టకరమనియు తమకు గల యభిప్రాయమును తిరుగ దృఢపరచుచున్నారు. మరియు దైవవశమున ఇర్విన్ దంపతులు, వారిపరివారము ప్రాణోపద్రవము లేకుండ తప్పించుకొనగలిగినందులకు వారి నభినందించుచున్నారు.

## ౪

ఈ సభవారు అక్టోబరు ౩౧ వ తేదీని రాజప్రతినిధి గావించిన ప్రకటన సందర్భములో కాంగ్రెసువాదులతో సహా వివిధ పక్ష నాయకులు సంతకములుచేసి కావించిన ప్రకటన విషయమై కాంగ్రెసువారు గావించిన చర్య ననుమతించుచు, స్వరాజ్యమునకై కావింపబడుచున్న జాతీయోద్యమమును రాజీగా పరిష్కరించుటకై వయిస్రాయి పడిన శ్రమ నభినందించుచున్నారు. మోతీలాల్ నెహ్రూ మున్నగు నాయకులు వయిస్రాయితో సంప్రతించుటవలన కలిగిన ఫలితముల గమనించి ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసు రౌండుటేబిల్ సమావేశమునందు పాల్గొని లాభము లేదని యీసభవారు తలంచుచున్నారు.

మరియు, గత సంవత్సరము కలకత్తా కాంగ్రెసులో గావిం... బడిన తీర్మానము ననుసరించి ఈ కాంగ్రెసువా రిపుడు కాంగ్ర... ఆదర్శమందలి 'స్వరాజ్య' పదమునకు 'సంపూర్ణస్వాతంత్ర్యము' అ... అర్థము నిర్వచించుచున్నారు. కావున అధినివేశప్రతిపత్తికిగా నిర్మిం... బడిన నెహ్రూప్రణాళిక ఇంతటితో రద్దయినదని ప్రకటించుచున్నా... మరియు కాంగ్రెసునందలి సర్వపక్షములవారు తమ యావచ్ఛ... సంపూర్ణస్వాతంత్ర్య సంపాదనకై వినియోగింప గలరనియు, నెహ్రూ... రిపోర్టులో సూచింపబడిన తాత్కాలిక సాంఘిక వివాద పరిష్కా... సాధనముల మూలమున కాంగ్రెసునుండి ఎడతొలంగవలసిన, ... కాంగ్రెసునందు చేరుటకు వీలుగాని, ప్రముఖులును నేడు మ... కాంగ్రెసునందు చేరి ఎల్లరకు సంబంధించిన ఈ ఆదర్శమును సాధిం... టకు తీవ్రకృషి సలుపుదురనియు నమ్ముచున్నారు.

సంపూర్ణస్వాతంత్ర్యసమరము సాగించుటకు సన్నాహమొన... మొదటిమెట్టుగాను, కాంగ్రెసువిధానము, ఆదర్శము మార్చినందుల క... గుణ్యముగ నుండుటకుగాను రాష్ట్రకేంద్ర శాసనసభలను బహిష్కరిం... వలయునని ప్రకటించుచు, ఇకపయి ప్రత్యక్షముగ గాని, పరోక్షమ... గాని ఈశాసనసభలతో జోక్యము కల్పించుకొనరాదనియు, ప్రస్తుత... శాసనసభలందు సభ్యులుగా నున్నవారు తత్క్షణమే రాజీనామా ని... వేయవలయుననియు కాంగ్రెసువాదులను కోరుచున్నారు. మరియు ... దేశీయులు తమయావచ్ఛక్తుల నిర్మాణ కార్యక్రమము నిర్వహించు... కయి వినియోగింపవలయునని కోరుచు, తయారుగా నున్నట్లు తో... నపుడు అవసరమైన అన్ని జాగ్రత్తలతోటి కొన్ని ప్రత్యేకస్థలముల... గాని, సమష్టిగాగాని పన్నులనిరాకరణముతో సహా శాసనోల్లంఘన... ప్రారంభించుటకు అఖిలభారతకాంగ్రెసు సంఘమునకు ఈ స... రధికార మిచ్చుచున్నారు.

## ౫

తూర్పు-ఆఫ్రికాయందు భారతీయులు పట్టుదలతోనుండి ... జాతీయభావమును ప్రకటించినందుకు వారి స్వసౌఖ్యమునయిన త్యా... యీమధ్యనే ఆదేశమునకు వెడలివచ్చిన శ్రీమతి సరోజినీనాయ... గారిని కాంగ్రెసుసభ అభినందించుచున్నది. సాంఘిక ప్రాతినిధ్య...

లను, ఆస్తి గల భారతీయులనుకూడ ఓటింగు అధికారమియ్యక అనవసరభేదములు పాటించు నిర్మాణవిధానమెట్టిదికూడ భారతీయులకు సంతృప్తికరముగ నుండజాలదని యీసభవారు తలంచుచున్నారు.

౬

శ్రీ సాపూర్జి సక్లత్వాలాగారును, పార్లమెంటుమాజీసభ్యులును ఇంగ్లాండులోను, యితర విదేశములందున్న యితర భారతీయులును తిరిగి స్వదేశమునకు రాగోరినపుడు అనుమతిపత్రముల నివ్వకుండుటను ఈసభవారు నిరసించుచున్నారు.

౭

కాంగ్రెసులో పేదవారును, సామాన్యజనమును ఎక్కువ ప్రాతినిధ్యము వహింపవలసి యున్నందునను, డిసంబరుఆఖరున సభజరిగినచో పేదవారు చలినుండి సంరక్షించుకొనుటకు ఎక్కువవస్త్రములు మున్నగు వానికొరకయి చాల వెచ్చింపవలసి యున్నందునను, ఇంక ననేకవిధముల వారికి అసౌకర్యముగ నుండుటచేతను, కాంగ్రెసుసభ యికముందు ఫిబ్రవరి లేక మార్చిమాసములలో జరుపుటకు సభను, ఆహ్వానించు రాష్ట్రసంఘములతో సంప్రతించి వర్కింగుకమిటీవారునిర్ణయించవలెను.

౮

విదేశీయ పరిపాలకులచే ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని భారతదేశముపయి మోపబడిన ఋణబాధ స్వతంత్రభారతదేశము సహింపజాలదు.

౧౯౨౨ సంవత్సరములో గయా కాంగ్రెసు మహాసభవారిచే నామోదింపబడిన తీర్మానము నీ మహాసభవారు స్థిరపరుచుచు, ప్రస్తుత ప్రభుత్వమునుండి సంక్రమించిన బాధ్యతలును, సౌకర్యములును స్వతంత్రభారతదేశమునందు స్వతంత్రమగు నొకవిచారణసంఘమువారిచే పరీక్షింపబడుట ఈసభవారి యుద్దేశమని తెలిసికొనదగినవా రందరకు నిందుమూలముగా నీసభవారు ప్రకటించు చున్నారు."

౯

దేశీయ సంస్థానమునందలి ప్రజలకు సంస్థానాధీసులు బాధ్యతాయుత ప్రభుత్వ మొసంగ తగు సమయము చేకూరినది- కావున ప్రజల వాక్స్వాతంత్ర్యము, సభలుచేసికొను అధికారము, ప్రాణధనసంరక్షణము మున్నగునవి యొసంగుచు చట్టము గావింపవలెనని యీసభవారు సంస్థానాధీశులను కోరుచున్నారు.

౧౦

నెహ్రూనివేదిక రద్దయినందునను, స్వాతంత్ర్య ప్రభుత్వమునందు సాంఘికసమస్యలు జాతీయదృష్టితో పరిష్కరింపబడుననియునమ్ముచుండుటచేసాంఘికసమస్యలపట్ల కాంగ్రెసు విధానము వేరుగ ప్రకటింప నవసరము లేదు. కాని నెహ్రూ నివేదికయందు సూచింపబడిన సాంఘిక సమస్యా పరిష్కార విధానముపట్ల సిక్కులును, మహమ్మదీయులు, మరికొన్ని అల్పసంఖ్యావర్గములు అసంతృప్తి వెలిపుచ్చినందున, ఇకముందెదయిన నిర్మాణవిధానము సూచింపబడునప్పుడు అందుకు సంబంధించిన సంఘములవారికి సంతృప్తికరముగ నుండనిచో కాంగ్రెస్ సంస్థ యంగీకరింపదని యీసభవారు నమ్మకముగ తెల్పుచున్నారు.

౧౧

రాబోవు కాంగ్రెసు మహాసభ కరాచిలో జరుగుటకును; ౧. పండిత మోతీలాలు నెహ్రూ, ౨. మహాత్మగాంధి, ౩. జె. యం. సేనుగుప్త, ౪. మౌలానాఅబుల్ కలాం ఆజాదు, ౫. సర్దారు వల్లభభాయి పటేలు, ౬. సర్దారు శార్దూలసింగు, ౭. డాక్టరు సత్యపాలు, ౮. డాక్టరు పట్టాభి సీతారామయ్య, ౯. సి. రాజగోపాలాచారి, ౧౦. జయరామదాసు దౌలతరాం గార్లు సభ్యులుగను, డాక్టరు సయ్యద్ మహమ్మదు (బీహారు), శ్రీప్రకాశ్ (కాశి) గార్లు కార్యదర్శులుగను, జమ్నాలాల్ బజాజ్, శివప్రసాదగుప్తాగార్లు కోశాధిపతులుగను నుండుటకు ఈ మహాసభవారు తీర్మానించుచున్నారు.

# రాజనీతి-రాష్ట్రాంగములు

వి. బాపిరాజు గారు, బి. ఏ., బి. యల్.

వెనుకటి సంచికయందు రాష్ట్రాంగములలో రెండవభాగమైన పాలకవర్గమునుగూర్చి వ్రాసియున్నాను. మూడవభాగమైన న్యాయవర్గమునుగూర్చి వ్రాసిన పిదప శాసనవర్గమును గూర్చి వ్రాయుట క్రమమై యున్నది.

## న్యాయవర్గము

ఈభాగము ప్రజల మధ్యస్థమైనట్టియు, రాష్ట్రాధిపతులకును, ప్రజలకును మధ్య సంభవ మగునట్టియు తగవులను పరిష్కారము చేయు భాగమై యున్నది. ఇట్టి తగవులను పరిష్కారముచేయు హక్కును శాసనవర్గము గాని, పాలకవర్గముగాని కలిగియుండుట కవకాశము లేదు. అది యెట్లనిన, ఈ రెండువర్గములును ప్రజలహక్కులను అమలులో పెట్టుటగాని, తగ్గించుటగాని జరిగించుచుండును. అట్టి క్రియలను ఇతరవర్గ మేదైనను విమర్శింపవలెను గాని ఆవర్గము నే విమర్శించినయెడల పక్షపాతముగా నుండును. కాబట్టి శాసనపాలక వర్గముల కార్యములను న్యాయవర్గము తీవ్రమూలముగా విమర్శించుటయును, స్థిరపరుచుటయును ఈ వర్గము నియమములై యున్నవి. న్యాయబలము కాక బాహుబలమే ప్రధానమైన రాష్ట్రములలో పాలకవర్గమే యీన్యాయవర్గము విధులను జరిగించుచుండును. కాని సభ్యత మెంపొందిన రాష్ట్రములలో పైవిధులను నెరవేర్చుటకు ప్రత్యేకముగా నీభాగము నిర్మింపబడుచున్నది. శాసనవర్గ మామోదించు శాసనములును, పాలకవర్గము వాని నమలులోపెట్టు క్రియావిధానములును ప్రజలకు శ్రేయోదాయకములు కాక వారిహక్కులకు భంగము గల్గించునవిగా నున్న సందర్భములలో వానిని విమర్శించుటయును, అట్లుకాక వారి కుపయుక్తమైన పక్షములలో వానిని స్థిరపఱచి తిరస్కారము జరిగినప్పుడు శిక్ష విధించుటయును నీ వర్గముయొక్క ముఖ్య కార్యములై యున్నవి.

న్యాయవర్గ నిర్మాణమునందు గమనింపదగిన ప్రత్యేక విశేషములు

1. ఈవర్గము రాష్ట్రమందలి యితర సాంఘిక రాజకీయాది సంస్థలతో సంబంధము లేకుండగా నుండవలెను.

2. ఈవర్గము మిగిలిన రెండువర్గములతో సంబంధమేమియు లేక ప్రత్యేకముగా నుండవలెను. ఈ వర్గము పాలకవర్గముతో శాసనముల నమలులో పెట్టు వర్గమై యున్నందున ముఖ్యముగా పాలకవర్గముతో నేమియు సంబంధమును కలిగియుండ కూడదు.

హిందూదేశమం దిదియే కొఱతగా నున్నది. శాసనసభ లామోదించిన తక్షణము పాలకవర్గ మమలులో పెట్టును. ఈవర్గ మన్ననో, ఆయా శాసనములు తిరస్కరింపబడినప్పుడు తనకార్యక్రమము జరిగించును. ఇది పాలకవర్గమం దొకభాగమే యై యున్ననో, ఆవర్గము శాసనముల నమలులో పెట్టుటయందు సరియైన విధముగా ప్రవర్తించెనా లేదా యని విచారించుటకు స్వాతంత్రత యుండ నవకాశము లేదు.

3. న్యాయవర్గము నిర్భయముగా తీర్పు లివ్వవలెను. కనుక న్యాయాధిపతులు తమతీర్పులకు తా మెవ్వరికి నుత్తరవాదు లగుటకు వీలు లేదు. కావున నే "భగవంతునకును, అంతరాత్మకును తప్ప మరియెవ్వరికిని న్యాయాధిపతి యుత్తరవాది కా"డని చెప్పబడినది.

4. న్యాయాధిపతుల తీర్పులు ప్రచురింపబడవలెను.

5. న్యాయస్థానములు ధనవంతులకును, బీదలకును కూడ గమ్యస్థానములై యున్న వనుసంగతి అందఱకును తెలియునట్లు ఏర్పాటు గావలెను.

న్యాయాధిపతులను ఏర్పరచు విధానము

న్యాయాధిపతులు కొన్ని దేశములందు పాలకవర్గముచే నేర్పరుపబడుటయు, మఱికొన్ని దేశములందు ఎన్నుకొనబడుటయుకూడ కలదు. రాజకీయ విద్యావిధానము ప్రబలియున్న దేశములందు ఎన్నికలపద్ధతి సక్రమముగా నడచును. సాధారణముగా న్యాయస్థానములకు న్యాయశాస్త్రవేత్తలును, అనుభవజ్ఞులును మాత్రము తగియున్నవా రగుదురు. పాలకవర్గ మట్టివారినే యేర్పాటు చేయు టుచితమగును. న్యాయాధిపతుల నేర్పరుచునంతవరకే పాలకవర్గమున కధికారము కలదు గాని, ఏర్పాటు జరిగిన పిమ్మట ఈ రెండువర్గములకును వ్రాసినవిధముగా సంబంధ ముండకూడదు. కావుననే న్యాయాధిపతులను తొలగించు నధికార మెవ్వరికిని లేదని చెప్పబడుచున్నది.

న్యాయవర్గమందు "జ్యూరీ"కి గల ప్రాముఖ్యము

ప్రజాహిత పరిపాలనములందు "జ్యూరీ"కి చాల ప్రాముఖ్యము గలదు. న్యాయశాస్త్రమందు అనుభవము లేని యీసామాన్యులు న్యాయాధిపతికి సహాయభూతులే కాక వీరి యభిప్రాయమును న్యాయాధిపతి యవలంబింపవలెను. ఇది విపరీతముగ గాన్పించును కాని, న్యాయాధిపతి దృక్పథము న్యాయశాస్త్రముచే బంధింపబడి యాతని దృష్టి సర్వసాధారణమైన మనుష్యస్వభావమును గమనింపచాలని స్థితిలో నాతనికి ఈ సర్వసాధారణమైన మనుష్యులే సహాయులుగా నుండవలెనను సిద్ధాంతమే యీ "జ్యూరీ" పద్ధతికి మూలమై యున్నది. ఈపద్ధతి కొన్ని దేశములందు సివిల్ క్రిమినల్ కేసులలోను కూడ ఆచరణలో నున్నది.

శాసనవర్గమునకును న్యాయవర్గమునకును గల సంబంధము

శాసనవర్గముయొక్క శాసనములను పాటించుటయు, నాచరణమందు బెట్టుటయు న్యాయవర్గముయొక్క ముఖ్యోద్దేశములు; కావున నీవర్గ మాయా శాసనములను నిష్పక్షపాతముగా నమలులోనికి తేవలెను. ఈవర్గము న్యాయశాస్త్రమును సృష్టింపకూడదు. శాస్త్రములయొక్క అర్థము, నుద్దేశ్యమును గమనించి ఉపపాదింపవలెను. కాని కొన్నియెడల నీవిధముగా జరిగిన విమర్శనలలో నీవర్గము క్రొత్తన్యాయమును సృష్టించుటకూడ సంభవించుచుండును. ఇట్లు జరుగుటయే మేలు. ఏలయనిన, ఒకానొక శాసనమును నిర్మించుటలో శాసనవర్గ మాకాలమందలి స్థితిగతులను బట్టిమాత్ర మాశాసనమును నిర్మించుట కవకాశము గల్గును. కాని తదనంతరము సంభవించు మార్పులను, అవసరములను, తర్కించగల విషయములను గమనింప వీలు లేదు. అట్టి స్థితిలో ఆయాపరిస్థితులలో కాలానుగుణ్యముగ కల్గు మార్పులను గమనింపుచు, న్యాయవిరుద్ధమును, ప్రజాహితమును గాకుండ న్యాయవర్గము తత్ శాస్త్రముల నాచరణలో బెట్టుచుండును. ఈవిధమైన సంబంధము తప్ప మఱి యేవిధముగా నైనను ఈ రెండువర్గములకును సంబంధ ముండకూడదు. కావుననే శాసనసభలయందు న్యాయాధిపతులకు స్థానము లేదు.

అట్లయ్యు, రాష్ట్రనిర్మాణము లిఖితపూర్వకము జరిగి, అట్టినిర్మాణ మభేద్యమైన దేశములందు (e.g., Rigid Constitutions) న్యాయవర్గమునకు ప్రాముఖ్యము మెండు. కారణము:—శాసనవర్గోపాదిత శాసనములు లిఖితమైన రాష్ట్రనిర్మాణ క్రమానుసారములా? కాదా? యను విషయము న్యాయవర్గమే విచారణచేసి శాసనవర్గ హక్కుల కవరోధము కలిగించుచుండును; దీనినే "ultra vires" తర్కమందురు. ప్రతిఅంశమందును ఈ"ultravires" తర్కము ప్రత్యక్షమగుచుండును.

ఇంగ్లాండు దేశమం దీచర్చ వచ్చుట కవకాశము లేదు. ఈ విషయము "చట్టబల"మను విషయమందు విస్తారముగా వ్రాయబడును.

న్యాయవర్గమునకును పాలకవర్గమునకును గల సంబంధము

న్యాయవర్గమును నిర్మించుటయే గాని పిదప పాలకవర్గమునకు నీవర్గముతో నే సంబంధ ముండకూడదని



౨. మహామఖ దేవాలయము-కుంభకోణము

శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారు.



౮. నరసింహులకొండ-నెల్లూరివద్ద

శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారు.

తమై యున్నది. ప్రజలకును పాలకవర్గాధిపతులకును మధ్యగల వ్యవహారములను న్యాయవర్గము పరిష్కరించు చుండును. ఇట్లు జరిగించుటలో పాలక వర్గాధిపతుల నదిమియుంచి వారి నిర్మితపథమునుండి తొలగకుండ జేయును. అనగా తొలగినయెడల శిక్షించునని భావము.

పై విషయములను గమనింపగా తేలిన అంశ మేమనగా: శాసనపాలకవర్గములు కూడ న్యాయవర్గమునకు లోబడి యుండును. న్యాయవర్గమునకు లోబడనివాడు రాష్ట్రాధిపతి యొక్కడే. అనగా రాజు. కావుననే "రాజు ఏనేరమును చేయనేర"డను భావము. ఇదియే "శాసనరీతి" లేక "చట్టబల"మను విషయములను స్పష్టపఱచున్నవి.

## చట్టబలము

ఎవ్వరును న్యాయవర్గపు తీర్పులను జవదాటలేర నుటయును, రాష్ట్రవర్గములన్నియు న్యాయబద్ధములైన వనుటయు నే "చట్టబల" మను పదముయొక్క భావమై యున్నది. మఱియు "డైసీ" యిట్లు వ్రాయుచున్నాడు: "రాష్ట్రమందు నిర్మింపబడిన న్యాయవిధానమునకు వ్యతిరేకముగా నేమానవుడును తన దేహమునకు గాని, ఆస్తికి గాని హాని కలుగునట్లు శిక్షింపబడనేరడు". కాబట్టి యెవరైనను అక్రమముగా పాలకవర్గనియమములవలన బంధితుడయ్యేనేని, దానికి న్యాయవర్గమువలన "Habeas Corpus" ప్రకారము విమోచను డగుటకును, పాలకవర్గచర్యలను విమర్శింప కోరుటకు నధికారము గల్గియున్నారు. ఇట్టి విధముగా న్యాయవర్గము ప్రజల హక్కులను, స్వాతంత్ర్యమును రక్షించుచున్నది. ఇట్లు జరుగుటకు ప్రజలహక్కు లిద మిత్థమని ముందు నిర్ధారణ చేయవలసి యున్నది. హిందూ దేశమందు ముఖ్యముగా నీహక్కులు లిఖితముగా స్థిరపరుపబడవలసిన యావశ్యకత యెక్కువగా నున్నది. న్యాయవర్గముచే రక్షింపబడవలసినవి ముఖ్యముగా: (1) ప్రజల స్వాతంత్ర్యపు హక్కులు; (2) ప్రజలకు రాష్ట్రమందు గల పరిపాలన క్రమపు హక్కులు; (3) "ప్రెస్" యొక్క స్వాతంత్ర్యము; (4) ప్రజలు సభలను నడిపించు కొని, సమావేశములు జరిగించుకొను హక్కులు; (5) సైన్యమును కట్టుబాటు చేయు విధానము, అనగా సైన్య నిర్మాణము, కట్టుబాట్లు మొదలైనవి న్యాయవర్గమునకు లోనై యుండవలె ననుట. సైనికు డేకార్యమునైనను జేసి తాను తనయధికారికిగాని, మరియెవ్వరికిగాని యుత్తరవాది కాడని చెప్పరీతులు కొన్ని దేశములందు గలవు. కాని అట్టి సైనికుడుకూడ శాసనములకు లోబడి యుండవలె ననుట సర్వోత్కృష్టము. సైనికచట్టములను (Martial Law) గూర్చిన సందర్భమేమనగా, ఆవశ్యకమైనప్పుడు ప్రాణధనరక్షణార్థము సైనికచట్టముల నమలులో నుంపవచ్చునుగాని, అవసరానంతర మీచట్టప్రకారము ప్రవర్తించిన వర్గాధిపతులయు, భాగాధిపతులయు కార్యములు న్యాయవర్గముచే విమర్శింపబడవలెను. ఈకారణముచేతనే ఇంగ్లాండునందు "Standing Army" యొక్క ఆవశ్యకత న్యాయమునకు సమ్మతము కాదు. మఱియు మిలిటరీ కోర్టులయొక్క "జూరిస్ డిక్షన్" విషయములో సాధారణ న్యాయవర్గమే పైవానికంటె ఆధిక్యము కలిగియున్నది. ఏలయనిన; జూరిస్ డిక్షన్ విషయములో భేదాభిప్రాయములు కలిగినయెడల సివిలుకోర్టుల యభిప్రాయమే చెల్లవలసి యుండును. కొన్ని దేశములలో నొకసైనికుడు గావించిన నేరమునుగూర్చి సివిలుకోర్టులు విచారణచేసి తీర్పు చెప్పినపుడు ఆతీర్పును మిలిటరీకోర్టు మార్పుచేయుటకు గాని, పునర్విచారణ సల్పుటకు గాని అధికారము లేదు. ఇంతే కాక, అట్టి నేరస్థుడు మిలిటరీకోర్టుచేత శిక్షింపబడినయెడల సివిలుకోర్టుకు అప్పీలు చేసికొనవచ్చును. ఇదియే యుత్తమమైన పద్ధతి.

ఇటీవల చట్టబలముయొక్క ప్రాముఖ్యము మరియొకవిధముగా విదితమగుచున్నది. పాలకవర్గాధిపతులకును, అంతర్భాగాధిపతులకును, ప్రజలకును మధ్యస్థమైన సంబంధవిశేషములను విచారించుటకు ప్రత్యేకన్యాయవర్గములు నిర్మింపబడుచున్నవి. ఇట్టి న్యాయవర్గములయొక్క విశేష మేమనిన:

(1) సర్వసాధారణమైన న్యాయవర్గమువలె గాక, నీవర్గమునకు ప్రత్యేకమైన నిబంధనలును, ఏర్పాటులును, చట్టములును ఉన్నవి.

(2) పాలకవర్గముయొక్క చర్యలను, పద్ధతులను, లోపములను మొదలైన వానిని తెలిసికొని, అట్టిలోపములను విమర్శింపగలుగు నధిపతులే ఈవర్గమందు న్యాయమూర్తులుగా నిర్మింపబడుదురు. అనగా సాధారణ న్యాయాధిపతులు ప్రత్యేకపు అంతర్భావములను గ్రహింప లేనివారై యున్నచో పాలకవర్గాధిపతులు అక్రమముల జరిగించి శిక్షార్హులైనప్పుడు వారి చర్యలను విమర్శింప నసమర్థులగుదురు. కావున అట్టిసమర్థత గలిగిన ప్రత్యేకమూర్తులనే యీవర్గమందు నిర్మింపవలెనని భావము. మఱియు సాధారణపు న్యాయస్థానములు పైవిధముగా విమర్శన జరిగించుటకును, ప్రజల రాజకీయ హక్కులను స్థిరపరచి పాలకవర్గమునకును ప్రజలకును మధ్య సంభవించెడి భేదాభిప్రాయములను తీర్మానించుటకును తీరిక కల్గియుండుట సంభవము కాదు.

మనదేశమందలి ఆంగ్లేయ రాజ్యాంగతంత్రమ... న్యాయవర్గవిషయమై గమనింపవలసినవి రెండు విష... ములు:

(1) హైకోర్టు న్యాయమూర్తులకును పాలకవ... నకును సంబంధము లేదు కాని వైస్‌రాయిగారు, గవ... రులు, ఎక్జిక్యూటివు కౌన్సిలు మెంబర్లు, వీరల పాలకవర్గ... క్రియలు హైకోర్టు విమర్శించుటకు హక్కు లేదు. వ... యు వీరిని అరెస్టుచేయుటకు గాని, వీరికి కారాగార... నము విధించుటకు గాని హైకోర్టుకు హక్కు లేదు. ... తప్ప మిగిలిన పాలకవర్గాధిపతులును, అంతర్భాగాధి... లును సాధారణపు కోర్టులకు లోబడినవారై యున్నా...

(2) క్రిమినల్ కోర్టుల విషయములో పాలక... మునకును న్యాయవర్గమునకును సంబంధ ముండకూ... దను విషయము పాటింపబడుట లేదు. ఈ విషయము... పాలకవర్గాధిపతులును, న్యాయాధిపతులును కూడ నొక... రే యగుట సంభవించుచున్నది. ఇది చాల విరుద్ధమ... టచే నీవిషయములో వీనిని విడదీయవలెనని జరు... చున్న యాందోళనము ద్విగుణీకృతము కావలెను.

---

# ధమ్మపదము

## (వచనము)

గ్రంథకర్త: శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు, యం. ఏ., యల్. టి.

ఈ పుస్తకం ఆంధ్రగ్రంథమాలలో ఏడవది. బౌద్ధధర్మమతసారమయిన ధమ్మపదం అనే పుస్తకానికి అనువాదం ఇది. 'అహింస' ముఖ్యధర్మం అన్నవిషయం ఈ పుస్తకంలో చక్కగా వివరింపబడింది. మఱిన్ని కొన్ని గొప్పధర్మాలు విశ్వకల్యాణమున కుపకరించునవి—ఇందు ప్రతిపాదింపబడినవి. ధర్మజిజ్ఞాసువులు తప్పక చదువవలసిన పుస్తకం ఇది. ప్రతులు కొలదిగనే ఉన్నవి.

క్రౌనుసైజు పుటలు ౧౫౦, వెల రు. ౦-౮-౦-౦.

మేనేజరు—ఆంధ్రగ్రంథమాల, నెం. 7, తంబుశెట్టివీధి, మద్రాసు.

# * హిందూదేశములో ఆంగ్లేయుల ఆర్థికనీతి

మొదలెక్కడో సరిగ తెలియరాని రహస్యములగు ప్రపంచ చరిత్ర భాగములలో ఆంగ్లేయుల భారతదేశ విజయ మొకటి. ఆ విజయము ఏ పద్ధతుల ననుసరించి, యెవ్వరికిని తెలియకయే, కొనసాగినది? ఏకపటమార్గముల వెంటబడి సామ్రాజ్య స్థాపనముగ పెంపందినది? అను సంగతి అంతకన్న తెలియరానిది. అట్లు కాక, "ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే" అన్న న్యాయము ననుసరించి, యీ పురాతన దేశమును జయించుటకై, యిప్పటి మొట్టమొదటి ఆంగ్ల రాజ్యస్థాపకులు వెనుకటినుండియు యెత్తుగడయేదో ఆలోచించుకొనియే యుండిరని వాదించుటయు న్యాయము కాదు. స్వదేశములో అన్నవస్త్రములకు నోచుకొనక, ఆంగ్లేయులును, ఫ్రాన్సు, ఇటలీ, పోర్చుగల్, హాలండ్ స్పెయిన్ మున్నగు తోడియూరప్ దేశీయులతో బాటు పైరు పంటలను వెదకికొనుచు హిందూదేశమునకు వచ్చిరి; ఉన్నట్లుండి ఒకనాడు తామే హిందూదేశపు యజమానులుగ జూడగలిగిరి. ఇంతే ఈ సందర్భమున మనము చెప్పగలిగినది. ఆపైన మేదో స్పష్టముగ మనకు తెలియదు; కాని కడచిన మూడు శతాబ్దముల వ్యవహారమును జాగ్రత్తగ పరిశీలించినచో కొన్ని కొన్ని విస్పష్టములగు గురుతులు మనము కనిపెట్టగలము. వీనిని బట్టి చూచినచో, వర్తకులుగవచ్చి హిందూదేశములో ఫ్యాక్టరీలను స్థాపించుకొన్న ఇంగ్లీషువారు ముఖ్యముగ 1757 సం॥ నాటి ప్లాసీయుద్ధము ముగిసినప్పటినుండి 1858 సం॥ వరకును హిందూదేశమున పరిపాలనము సాగించిరనియు; 1858 సం॥ న ఈస్టిండియా కంపెనీవారు, రాణిగారికి రాజ్యమప్పజెప్పినది మొదలు, ఆమె సామ్రాజ్ఞి బిరుదమును స్వీకరించిన 1877 సం॥ వరకుగల యీ యిరువదియేండ్ల అల్పకాలములో, సామ్రాజ్యమును స్థిరపరచుకొనుటకును, రాజకీయముగనే కాక, ఆర్థికముగ గూడ హిందూదేశములో బ్రిటిషు సామ్రాజ్యమును నిర్మించుకొనుటకును ఏర్పాటులు జరిగినవనియు తెలియగలదు. ఒక జాతియొక్క జీవితమునకు దాని ఆర్థికదశ ఏవిధముగ కీలకమై యుండునో పారిశ్రామిక దేశములు స్పష్టపరుచుచున్నవి. ఏజాతియొక్క అధికారములకును, హక్కులకును, భంగము రాకుండగనే, ప్రపంచమున కంతకును సరిపడునట్లు, వాణిజ్యపుసుంకముల పద్ధతిని సరిపుచ్చుట యెట్లనునదియే ప్రస్తుతము నానాజాతి సమితి నెదుర్కొనుచున్న సమస్య. కాని యిది యిరువదవ శతాబ్దమున బుట్టిన సమస్య; యుద్ధము మూలముగ గలిగిన వాణిజ్య పారిశ్రామిక పరిణామము. ఈ పరిణామమున, ఐరోపాఖండమును, దాని రాజకీయసమస్యను మించినదైయుచున్న ఆర్థికసమస్య అమెరికా స్వాధీనములోనున్నది. ఈసమస్య మనకంతగ ప్రస్తుతము కాదు. నూటయేబది యేండ్లకు పైగ, పాశ్చాత్యదేశములచే ననుసరింపబడిన పారిశ్రామికనీతి నేడు, విపరీతముగ తలబరువెక్కి, అత్యంత క్లిష్టములు నిరాశాజనకములు నగు సమస్యలను తెచ్చిపెట్టుచున్నది. అందుచే, హిందూదేశములో ఆంగ్లేయుల ఆర్థికనీతిని పరిశీలించు నీసందర్భమున, పాశ్చాత్యజాతుల పద్ధతులపై భారతజాతీయతను నిర్మించు విధానమునందు గల అపాయములను గమనించి యుండుట మన కవసరము.

ఈస్టిండియా కంపెనీ పరిపాలనము కడచిన శతాబ్దము నడుమనే యంతరించిన దన్న సంగతి, మాటవరుసకు, నిజమే కావచ్చును. కాని అది మరల బ్రిటిష్ ఎంపైర్ కంపెనీ వారికే చోటిచ్చి పోయినదను సంగతి నెవ్వరును కాదనలేరు. హిందూదేశము కలెక్టర్లు, మేజస్ట్రీట్లు, జడ్జీలు మున్నగువారివలనకంటె, బ్యాంకర్లు, ఓడల యజమానులు రైల్వేకంపెనీలు మొదలగు వ్యాపారస్థులవలన ఎక్కువగ బాధపడుచున్నదన్న వాస్తవమునుబట్టి చూచినచో, హిందూదేశపు రాజ్యాంగవిధాన మంతయు, ఏవిధముగ కేవలము బ్రిటిషువారి వాణిజ్యశ్రేయస్సును సంరక్షించు ఆచ్ఛాదనముగ నేర్పడియున్నదో తెలియగలదు. వర్ణాశ్రమధర్మాశ్రయమున కలవాటు పడి ఫలానా తెగవారిది ఫలానాపనియని యేర్పరుచుకొను మనకు, రాజ్యపరిపాలకుడు వర్తకుడగుటయు, వర్తకుడు ప్రధాన మంత్రి యగుటయు, ప్రధానన్యాయాధిపతి వాణిజ్యసంఘమునకు ప్రధాన కార్యకర్త యగుటయు, నాశ్చర్యకరముగ నుండవచ్చును. కాని, యింగ్లండులో నేడిదేస్థితి. ప్రభుత్వన్యాయవాదిగ నుండి, అటుపై ఇంగ్లండుదేశపు ప్రధానన్యాయాధికారియై, తరువాత, హిందూదేశమున రాజప్రతినిధిత్వము సాగించిన రీడింగు ప్రభువు నేడు మరల ఇంగ్లండుదేశములో సౌత్ ఆఫ్రికన్ మైనింగ్ సిండికేట్‌కు (గనుల వ్యాపారమునకు జెందిన ఒక వాణిజ్యసంఘము) అధ్యక్షుడుగ నుండుట మన మెరుగుదుము కదా! బర్కెన్ హెడ్ ప్రభువుగారు నట్లే. ఈయన మొదట ప్రభుత్వన్యాయవాది; తరువాత లార్డ్ ఛాన్సెలరు;

* [ఇది శ్రీయుత డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి (Britains Econcmic Policy inIndia) అను ఆంగ్ల వ్యాసమునకను వాదము.]

అటుపై వూల్సాక్ పదవి వచ్చినది; పిమ్మట ఇండియా మంత్రి; తుదకిప్పుడు కస్టెక్ బెక్ గా రన్నట్లు, ఈయన "ఏవో వర్తకవ్యాపారాలలో నియుక్తుడై" యున్నాడు. ప్రభువులసభలో నున్న 412 సభ్యులలోను, ఇంచుమించుగ ప్రతియొక్కరును ఇంగ్లండు హిందూదేశముల వర్తకముతో సంబంధించిన ఏనాలుగైదు కంపెనీలకో డైరక్టర్లుగ నున్నవారే. వ్యవసాయము, బ్యాంకులు, మద్యపదార్థములు, సిమెంటు, కట్టడములు, కాలువలు, రసాయన పదార్థములు, ప్రత్తి, ఓడరేవులు, విద్యుచ్ఛక్తి, ఇంజినీరింగు, వినోదములు, ధనకోశములు, ఆహారము, వాయుపదార్థములు, హోటళ్లు, ఇన్స్యూరెన్సు, ఇనుము, బొగ్గు, ఉక్కు, భూమి, వర్తకము, బంగారు గనులు వజ్రపు గనులు, మోటార్లు, వార్తాపత్రికలు, నూనె, కాగితము, తోటలు, రైల్వేలు, ఓడల నిర్మాణము వ్యాపారము; వాయువార్తాప్రచారము, నేత, ట్రాంబండ్లు, నిధులు, వాహనములు, మరి యితరములగు నెన్నియోవిధములైన వానికి చెందిన కంపెనీలలో వీరు సభ్యులుగ నుందురు. ఇంచ్‌కేప్ ప్రభువు పి. అండ్ ఓ స్టీమ్ నావిగేషన్ కంపెనీకి ప్రధానాధికారి. హిందూదేశపు కోస్తావ్యాపారమునకు చెందిన ఓడల 8 కోట్ల టన్నేజ్‌లో 5 కోట్లీతనవి. మొన్నమొన్నటిదాక మదరాసు గవర్నరుగా నుండి తాత్కాలికముగ రాజప్రతినిధిత్వము వహించిన గోషన్ ప్రభువు ఒక ఇన్స్యూరెన్సు కంపెనీకి డైరెక్టరుగ నుండెను. ఇట్లించుమించుగ ప్రభువులసభలోని సభ్యులందరును, వర్తకమునకు గాని, పరిశ్రమలకుగాని సంబంధించిన ఏవో కొన్ని సంఘములలో డైరక్టర్లుగ నుండుటయే కాక, భారతదేశములోని యెన్నికంపెనీలకో, ఒక్కొక్కదాని, కీప్రభువులు నలుగురో ఐదుగురో డైరెక్టర్లుగ నేర్పడియున్నారు ఈ విధముగ కలకత్తాలోని గోగునారయంత్రములు, కాన్పూరుఉన్ని యంత్రములు, బొంబాయి ప్రత్తియంత్రములు, ఫారెస్ట్ ఇండస్ట్రియల్ సంఘములు, ఎన్నెన్నో రైల్వేకంపెనీలు, ఓడల కంపెనీలు—ఈ యన్నిటిలోను ఇంగ్లండు దేశపు ప్రభువంశములవారు, రాజ్యాంగవేత్తలు, పలుకుబడిగల డైరెక్టర్లుగ నున్నారు. (వివరములకు తుదినున్న పట్టికను చూడుడు.) మొన్నమొన్ననే బొంబాయినుంచీ, లండన్‌నుంచీ, మిక్కిలి ఆకర్షకమైన విశేషమొకటి తెలియవచ్చినది: "మదరాసు గవర్నరుగారి మేనల్లుడు, కన్సరేటివు పక్షమునకు ప్రధానసంచాలకుడునైన లార్డ్ స్టాన్లీగారు డిసెంబరు 27 వ తేదీనాడు బొంబాయికి వచ్చిరి." "మదరాసు గవర్నరుగారి మేనల్లుడు, కాన్సర్వేటివు పక్షమునకు చీఫ్‌విప్పు అయిన లార్డ్‌స్టాన్లీగారు డిసెంబరు 27 వ తేదీనాడు యూరప్ నుండి మెయిల్‌బోటులో వచ్చిరి. ప్రత్తిపరిశ్రమల స్థితిగతులను ఆయన పరిశీలించును. ఆయన స్వయముగనే ఒక యంత్రాలయానికి అధికారిగ నుండుటను బట్టి, ఈ సందర్భమున ఆయన రాకలో విశేషము కలదు. లాంకషైరు దుఃస్థితిలో నున్నదని ఆయన చెప్పెను. స్టాన్లీప్రభువు రాజకీయపరిస్థితులను గూడ బాగుగా పరిశీలించి భారతీయనాయకులవలన హిందూదేశపు స్థితిగతులకు చెందిన సరియైన వృత్తాంతమును సంపాదించును." వార్తాపత్రికలలో ఇట్టి వార్తయొకటి టింపబడినది. ఇంటర్నేషనల్ స్లీపింగ్ కార్ కంపెనీ డైరెక్ట చేరుటచేత లాయిడ్ ప్రభువు పలుకుబడిగల వాణిజ్యపారిశ్రామిక లను కనిపెట్టిన వెనుకటి రాజ్యాంగవేత్తల సంఘములో చేరుచు డని ఒక లండన్ వార్త చెప్పుచున్నది.

కడచిన కొన్ని నెలలలోపుగ విదేశవ్యవహారముల మంత్రిగ డిన సర్ ఆస్టిన్ చేంబర్‌లేన్ గారును, యుద్ధాంగమంత్రిగనున్న లేమింగ్ వర్దింగ్‌టన్ ఇవాన్స్‌గారును "గ్రేటర్ లండన్ అండ్ టీస్ ట్రస్ట్ లిమిటెడ్" డైరెక్టర్ల సంఘములో చేరిరి; బర్కెన్‌హెడ్ ప్రభువు అధ్యక్షుడు. వాణిజ్యాంగ మంత్రియైన ఫిలిప్ కన్‌లిఫ్ లిస్టర్ గారు, ఈనడుమనే స్థాపింపబడిన "టెక్ డ్యూసర్స్ ఎసోసియేషన్"కు అధ్యక్షులుగ ఆహ్వానింపబడిరి. శాంగమంత్రియగు లార్డ్ బ్రెంట్‌ఫర్డ్ (సర్ జాయిన్సన్ హి గారు "నార్తరన్ ఎస్యూరెన్సు కంపెనీ" యజమానసంఘములో వ్యవసాయమంత్రి సర్ ఆర్థర్ స్టీల్ మిల్లండ్ గారు "యునైటెడ్ నియన్స్ ట్రస్ట్ లిమిటెడ్" డైరెక్టర్లలో నొకరు. వాయు మంత్రి సర్ సామ్యూల్ హోర్ గారు రెండు ఇన్స్యూరెన్సు క నీల డైరెక్టర్ల సంఘములలో సభ్యుడు. కాంగ్రెసు పరిణామ యెడ తనకుగల గొప్ప ఆసక్తిని తెలియజేయుట కన్నట్లు, మొ కాంగ్రెసు సమావేశము ముగియగనే, రూటరు వార్తా సంఘము యార్కునుండి కడచిన జనవరినెలలో "అమెరికా సానుభూ ఆసక్తితో భారతదేశమందలి పరిణామములను గమనించుచున్న అని తంతివార్త నంపినది. మరియు, "స్వాములతో, మొసళ్ల బాల్యవివాహములతో, వితంతువుల దహనములతో గూడుకొ స్వాప్నికమైన దస్యుపుదేశము కాదు మాకు హిందూదేశము. కది అంతకన్న గొప్పది." అని హెరాల్డ్ ట్రిబ్యూన్ ప అమెరికా హిందూదేశముల పరస్పర వాణిజ్యాభివృద్ధిని గూ నుడువుచు వ్రాసినది. మరియు "ఆ దేశమున శాంతి స్థాపింపబడవ నని మేమాశించుచున్నాము. ఈ సందర్భమున, తాము చేసియు పనికై, చేయుచున్న పనికై, బ్రిటిషువారు గర్వపడదగినదే." అని వ్రాయుచున్నది.

ఇం తెందుకు? మాంటాగ్యూ వంశమువారి "సిల్వర్ ఫరస్ మాంటాగ్యూగారికి సంబంధ ముండెడిది. వెనుకటి ప్రధానమంత్రి బాల్డ్విన్ గారొక యినుమువర్తకుడుగ నుండెను. విల్లింగ్డన్ ప్ర గారు మదరాసు గవర్నరుగా నుండినప్పుడు ఆయన భార్య ఆ మంత్రులలోను మహారాజులలోను ఒక విలాసముగా నేర్పడియు సన్‌బీమ్ మోటారుకార్లను వ్యాప్తిలోనికి దెచ్చుటకు మిక్కిలి ఆ తో ప్రయత్నించుచుండెడి దట; ఆమె తండ్రియగు బ్రాసీ ప్ర గారికి ఆవ్యాపారముతో సంబంధ ముండెనట. "లాయిడ్ జార్జిగా

మార్కొనీ విభాగములు" ఎడతెగని ముచ్చట. ఒకానొక సమయమున రీడింగు ప్రభువుగారి పేరుగూడ దీనితో సంబంధించియుండక పోలేదు. ఇక నీ సివిల్ ఉద్యోగులు తమధనమును దాచియుంచు టెక్కడ? జమీందారీలలో గాదు; రయత్వారీభూములలో గాదు; ఇంటి ఆస్తులలో గాదు; ఎస్టేట్లలోను గాదు—ఎస్టేట్లయజమానులుగ నుండుటకు వీరి కధికారము లేదు—హిందూదేశములోని మిల్లులకును కంపెనీలకును సంబంధించిన వాటాలరూపమున పెట్టుబడి పెట్టుదురు. కావున వారిసానుభూతి తమ లాభములతో గూడుకొన్న కంపెనీలపైనను స్వదేశముపైనను ఉండుట సహజమని భావించుకొనదగును; మరియు, దీనితోబాటుగనే ఇంగ్లండు దేశమునకును హిందూదేశమునకును గాని, ఇంగ్లీషువారికిని భారతీయులకును గాని పరస్పరము సరిపడదనియు భావించుకొనదగును. ఇట్టి సందర్భములో—అది భారతీయుల లాభమునకు భంగమైన నగుగాక—తమ దేశీయులకే వారు సంపూర్ణముగ తోడుపడుటయం దాశ్చర్య ముండదు. ఇట్లు చెప్పుట హిందూదేశములో గాని మరి యెచ్చటగాని యున్న ఇంగ్లీషు జిమ్మేదార్ల విషయమున తీవ్రములగు నారోపణల గావించుటయే యగును. అందుచే యథార్థముల వల్లను అంకెలవల్లను నిర్ధారింపబడకయే, యీ ఆరోపణలను విడిచిపెట్టుటకు వీలులేదు. వాస్తవములను అంకెలను చూపించి యీ యారోపణను సమర్థించు వాదములను గన్పరచుటయే హిందూదేశచరిత్రకు సంబంధించిన ఈయధ్యాయముయొక్క పని.

ఉప్పు.

అల్పమగు ఉప్పు సమస్యతో ఆరంభించి, పైకి, పైన్యము వరకు, పోవుదము. లోకమునకు ఉప్పు అను పేరుతో పరిచితమైయున్న ఆ కేవలసాధుపదార్థము మొదలుకొని మానవప్రపంచమునకు సైన్యమన్న పేరున దెలిసియున్న అత్యంతక్లిష్టమగు నాసంస్థవరకు హిందూదేశములోని బ్రిటిషురాజ్యాంగనీతి యంతయు బ్రిటిషు ప్రజల లాభములను జాగ్రత్త పెట్టుటకు గాను ఏర్పడిన ఆర్థికదృష్టితోనే నడిపింపబడుచున్నది. 1903 సం. లో మొట్టమొదట గోఖలే గారు భారతరాజకీయరంగమున ప్రవేశించినప్పుడు ఉప్పుపన్ను విషయముననే గవర్నమెంటుపై ఆయన మొట్టమొదటి దాడి సాగించినది. ఇది అన్యాయమనియు, అనావశ్యక మనియు అమానుష మనియు ఆయన అభిప్రాయపడెను. గవర్నమెంటువారు ఎక్సైజుపన్నుగా ఉప్పుమీద మణుగు ఒక్కంటికి రు 2-8-0 చొ॥ పన్ను విధించిరి. ఉప్పు తయారుచేయుటవల్ల దాని యజమానికేమో లాభమువచ్చినదని కాని, ఆ ఉప్పు వాణిజ్యప్రపంచము నంతను స్వాధీనపరచుకొనుచున్న దని కాని కాదు ఈపన్నుకుకారణము; అఫ్యాక్టరీ గుమ్మమును దాటుటకుముందు రు 2-8-0 ల ఎక్సైజుపన్నును ఇచ్చుకొనుట దాని విధి యనియే యీ కారణము. అనవసరముగా, విపరీతముగా ఉప్పుధర పెరిగి పోవుటకు ఇది హేతువైనది. కడచిన ఇరువదియేండ్లనుండియు భారతరాజకీయనాయకులు ఎన్నిసార్లు ప్రయత్నించినను దానిని రు 1-4-0 కంటె తక్కువకు దించుట వారికి సాధ్యపడలేదు. 1929 సం॥ పుటారంభమున, భారతశాసనసభ ఈపన్నును రు 1-4-0 నుండి రూపాయికి తగ్గించుట కొక తీర్మానము నంగీకరించెను; కాని వైస్రాయిగారు రూపాయిపావలా పన్నును మరల పునరుద్ధరించిరి. మరి, జీవితాధారమైన ఈ ఉప్పు విషయమున, ఇంతటి ప్రజారంజకుడగు ఒక ఇర్విన్‌ప్రభువువంటి రాజప్రతినిధి ఇంతటి అసాధారణము, అసమ్మతమునగు పద్ధతి నేల యవలంబించెనని కనుగొనుటకు ప్రజలు శ్రద్ధవహించుటలేదు. గంజాయివంటి మద్యపదార్థమైనచో, త్రాగుబోతుతనమును గల్గించు కల్లుసారాయీలవంటి దైనచో, నల్లమందువలె కొయ్యబారునట్లుచేయు ఓషధియేమైన నైనచో, ఉద్రేకము బుట్టించు కొకెయిన్‌వంటి దైనచో, ఉప్పు పరిశ్రమ, నీవిధముగ పన్నువిధించి, శాసించుటలోగల సిద్ధాంతము నెవ్వరైన బోధపరచుకొనగలరు. అట్లుగాక, మనుష్యులకు పశువులకు గూడ నొక జీవితావసరముగ నున్నది. ఉప్పు. భారతశాసనసభలో సభ్యులుగ నుండి, కర్జన్‌ప్రభువు కాలములో గోఖలేగారు ఆపన్నును తగ్గించి యుంచగలిగిన మొదటి ఆరేండ్లలోను ఉప్పువాడకము ఎట్లు సంతృప్తికరముగా వృద్ధిబొందినదియు బాగుగ దెలిసిన సంగతియే. పదినేర్ల సెనగ గుర్రిల్లకు, ఆధమపత్రము, సేరున్నర ఉప్పు పశువులకు అవసరమైయుండును. కాని రైతులలోగాని, గుర్రముల యజమానులలోగాని, ఈ లెక్కననుసరించి తమ జంతువుల యాహారములో ఉప్పు కలుపుకొనగలవారెంతతక్కువగ నున్నారు!—మరి దీనికి కారణము: ఉప్పు ప్రియమగుట యొక్కటియే. 4500 మైళ్లు కోస్తాప్రదేశము గలిగిన దేశములో పైనుండి ఉప్పు దిగుమతి యగుటయు, కోస్తాప్రదేశములలోని ప్రజలు ఒక గిన్నెడు సముద్రపునీరు దెచ్చుకొని దానినుండి ఉప్పు తయారుచేసికొనుటకు నిషేధింపబడుటయు మిక్కిలి విలక్షణమైన సంగతి. అట్లు చేయుట యొక పాపభూయిష్ఠమగు నపరాధము.

బ్లంట్‌గా రిట్లు వ్రాయుచున్నారు: పేదలు మాత్రమే ఉప్పు నిర్బంధమునకు లోబడవలసివచ్చుచున్నది. దక్షిణ హిందూదేశములో దురదృష్టవశమున, నిరుపేదలే తప్పనిసరిగ దీనికి లోబడువారు. డక్కన్ ప్రదేశములో ఈభారము మరింత వ్యధాకరముగ నున్నది. అక్కడ, సహజముగనే, ఉప్పు నేల నంటుకొనియే యుండును. అందుచే, కావలసినంతయున్నను, ఉప్పువిషయమున ప్రజలు ఉపవాసము చేయుచున్నా రనిపించును. నేను సంచరించిన గ్రామములలో చాలమంది రయితులు తమ పశువులమందలను, ఏదో దొంగతనముగ నవి నాలుకతో కొంత నాకుటకైన నవకాశ ముండు నేమో యని ఉప్పుగల ప్రదేశములకు రాత్రివేళల దీసికొనిపోవలసి వచ్చుచున్నదనియు, వినను చట్టము నుల్లంఘించు చున్నట్లు కనుగొన్నచో కావలివాండ్రు తమ్ము ఖైదుచేయుచున్నారనియు, నేలపై గన్పించిన సహజమగు ఉప్పునంతను పోలీసువారు కుప్పలుకుప్పలుగా ప్రోగుచేసి నాశనము చేయవలెనని అతరువాత ఆర్డర్లు వచ్చినవనియు నాతో జెప్పిరి.

ముఖ్యమైన ఈ ఆహారపదార్థము లేకపోవుటవల్ల ఒకవిధమగు కుష్ఠ రోగము ప్రజలను పీడించుచున్నదని మరి కొన్నిచోట్ల వింటిని. దాని అసలు ధరకంటె నూటికి 1200 మొదల్కొని 2000 వరకు ఎక్కువ ధరకు ప్రభుత్వమువారు ప్రజలకు ఉప్పు అమ్ముచున్నారని లెక్క వేయబడినది." ప్రయోజనమునుబట్టి చూచినను, ఈపద్ధతి నిరసింపదగినదే. ఏలయన, దానిని ప్రోగుచేయుటకు ఖర్చు దానివల్ల వచ్చు మొత్తపు ఆదాయములో నూటికి ఇరువది వంతున తేలుచున్నది. రామ్సేమేక్డ నాల్డుగా రిట్లనుచున్నారు. "ఉప్పుపన్ను బలాత్కారము, నిష్ఠురము. ప్రజల కిది బోధపడినచో అసంతుష్టియే దానిఫలితము. ఒక లాభసాటి కంపెనీ హిందూదేశమును పీల్చి పిప్పిచేయుటకు సాగించిన పద్ధతిలో మిగిలియున్న భాగ మీ యుప్పుపన్ను."

కొలదిరోజులక్రింద హిందూదేశము ఉప్పును తయారుచేసికొను విషయమునను, ఉపయోగించుకొను విషయమునను స్వయమాధారముగ నుండజాలనా యని విచారించుటకు ప్రభుత్వమువారు టారిఫ్‌బోర్డువారిని విచారణ కంపిరి. బెంగాలులో విచారణ సాగించినపై, హిందూదేశపు మడ్డి ఉప్పుకన్న ఛెషైర్ తెల్లఉప్పునే ప్రజ లెక్కువగ కోరుచున్నారని తెలియవచ్చినదట. ఈకారణమువల్ల, బెంగాలు ప్రాంతమునకు సంబంధించినంతవరకు, అచ్చటి ప్రజలు తెల్లఉప్పునే కోరుచుండుటనుబట్టి, దానిమట్టుకది స్వయమాధారముగ జేయబడుటకు వీలులేదని రిపోర్టుచేయబడినది. తెల్లని విలాయతీ ఉప్పు, తెల్లని నిగనిగ బియ్యము, తెల్లని విదేశీగుడ్డ—బహుశః తెల్లని ఇంగ్లీషు కోడంద్రును—వీనిపైగల యీలాలస నిజముగ ఆశ్చర్యకర మే. వీనిలో నొక్కొక్కటియు వ్యక్తిలోగాని సంఘములోగాని ఎట్లు ఉపద్రవకరము, పీడాకరము నగునో తెలియజేయుటకు ఒక్కరవ్వంత విద్య చాలును. ఉప్పు, ఆరువేలమైళ్ల దూరమున, సముద్రములమీద నున్న ఇంగ్లండ్ దేశము నుండి ఎందుకు రావలయునో, దేశములో తయారైన దానికంటె చౌకగ నది యెట్లమ్మబడుచున్నదో యని యెవ్వరైన నాశ్చర్యపడవచ్చును. మరియు వైస్రాయిగారు వెనుకటి రూపాయిపావలా పన్నునే యెందుకు స్థిరపరుపవలె? పోనీ, ఎస్సెంబ్లీని సంతోషపెట్టుటకైన ఆయన పావలాతగ్గింపు నెందుకు అంగీకరింపలేదు? అనికూడ ఆశ్చర్యము కలుగవచ్చును. ఏమి, ఈపన్ను తగ్గించినచో, ఆకాశము తలక్రిందయ్యెడిదా? మహా సముద్రములు పొంగి పొరలిపోయెడివా? భూగర్భము బ్రద్దలై పోయెడిదా? సామ్రాజ్యము కూలిపోయెడిదా? అవును; మొనటిమాడూ జరిగినా జరుగకపోయినా, నాలుగణాల పన్ను తగ్గింపువల్ల సామ్రాజ్యక్షేమమునకు భంగము కలుగునన్న నాల్గవసంగతి మాత్రము నిస్సందేహము. ఇంతటి అసాధారణమైన ఫలిత మెట్లు సంఘటించునో పరిశీలింతము. నిజమిది: హిందూదేశపు ఎగుమతుల విలువ 316 కోట్ల రూపాయలు; దిగుమతులు 266 కోట్లు మాత్రమే ఖరీదు చేయును. రెంటికిని 60 కోట్ల తేడాకలదు. ఇంతేకాదు. ఎగుమతులన్నియు ముడివస్తువులుగాని, ఆహారపదార్థములుగాని ఐయుండును; అందుచేత

అవి ఎక్కువ బరువుగాను, పెద్దవిగాను ఉండును. కావున ఇంగ్ల డుకు పోవునప్పుడు దిగుమతులకన్న, ఎగుమతులు, ఓడలో ఎక్కు స్థలము నాక్రమించును. దిగుమతులన్నియు తయారువస్తువు టచే చిన్నవిగానుండి ఇమిడికగలవై యుండును. ఇందుచేత గా పోయినను, ఖరీదును ఒక్కదానినే పట్టి చూచినప్పటికీ, ఓడల ఎగుమతులకు, దిగుమతులకన్న, ఎక్కువ స్థలము కావలసి యుండును; కాని వస్తువుల స్వభావమును బట్టి చూచినప్పుడు, ఒ మేలెడు ప్రత్తి యెగుమతియైనచో దానివల్ల ఒక పెట్టెడు బట్ట మాత్రమే వచ్చునన్న సంగతి స్పష్టమగును. బరువునుబట్టి నిర్ణయిం బడే టన్నేజ్ మాత్రమే కాక ఓడలలో కావలసిన స్థలవైశాల్య గూడ, దిగుమతులకు కంటె, ఎగుమతులకు చాలయెక్కువగనే కావ యుండునని దీనినిబట్టి తెలియుచున్నది. మూడవసంగతి యింకొక హిందూదేశమునకు ఉన్నదని చెప్పుకో దగినంత నౌకాసంపద లే వెళ్లుటకును వచ్చుటకును, ఎగుమతులకూ దిగుమతులకూ కూడ, విదేశ లనుండియే ఓడలు రావలసియున్నవి. అనగా ఖాళీఓడలు కొని బరువు మోసికొని వచ్చినవి కాక, హిందూదేశమునుండి సరుకుల తీసికొనివెళ్లుటకై ప్రయాణమై వచ్చుచుండు నన్నమాట. ప్ర బియ్యము, గోధుమలు, కాఫీ, టీ, తోళ్లు, నూనెగింజలు ఖనిజము ఇవి, వీనినుండి వచ్చు తయారుసరుకులకంటె, యెక్కువ వైశాల్య నాక్రమించునని యిదివరకే చెప్పియున్నాము. ఇట్లు ఖాళీఓడ సముద్రములపై ప్రయాణము చేయునప్పుడు అవి తుపానుదెబ్బల కా కొనవలసియుండును. కాబట్టి, ఏదో యొక తూకపుబరువు లేక అవి రాజాలవు. అనగా, ఇట్టి తూకపుబరువురూపమున ఈచెషై ఉప్పు ఇండియాలో ప్రవేశించుచున్నదన్నమాట. ఒక్క ఉప్పేకా ప్రాతపత్రికలబేళ్లు, పింగాణిముక్కలు, ఇటాలియన్ పాలరాయి, బండ్లు, బంగాళాదుంపలు మొదలైనవన్నియు నిట్లే వచ్చును. యన్నియు హిందూదేశములో తయారైనవానికన్న, హిందూ ములో పండెడువానికన్న చౌకగ నమ్మబడుచుండెడి పదార్థము మనము బజారులో ఒకపౌను పంచదార కొనుచుంటిమన్న, విదేశీ ప దార యగుటయేకాక, అది యొక విదేశీకాగితములో చుట్టబడి ఉండును. కొంచెము వానివైపు శ్రద్ధతో చూచువారికి, డెయిలీమెయిల్ డెయిలీస్కెచ్, డెయిలీక్రానికల్, డెయిలీహెరాల్డు, డెయిలీన్యూస్ డెయిలీటెలిగ్రాఫ్ మున్నగు ఇంగ్లీషుపత్రికలను, వానికై యేమి ఖర్చుపెట్టకయే, చదువుకొనుట కవకాశము లభించును. పింగాణీ ముక్కలు బొంబాయి నగరమున భవనములలో నేలతాపడమున వాడ గింపబడుచున్నవి. రైల్వేలమీదను, ఓడలమీదనుగల ఎగుడుదిగుడు లనుబట్టి, తూకపుబరువుగా వచ్చు ఇటలీదేశపు పాలరాయి జయపుర పాలరాయికన్న చౌకగ నమ్మును. ఈపద్ధతిని, బ్రిటిషు దే ఉప్పు హిందూదేశములో అమ్మడగినట్లు చేయుటకుగాను, ఓడలకి నీలు పై ఓడలప్రయాణపు ఖర్చులను ఇండియాలో ఉప్పు అమ్మక

కూడబెట్టుకొనుటకు వీలగునట్లు, దేశవాళీఉప్పుపై పన్ను విధించు అసాధారణచర్య యవలంబింపబడినది. దీనినిబట్టి దేశవాళీ ఉప్పుపైని ఈపన్ను, రు 1-4-0 నుండి, రూపాయి మాట యటుంచి, రు 1-3-11 లకే తగ్గించినప్పటికిని, తూకపుబరువు క్రింద ఉప్పు తీసికొనివచ్చుట బ్రిటిష్ ఓడల కంపెనీలకు అసాధ్యమైపోవు ననుట స్పష్టమగుచున్నది. అనగా, ఎగుమతులను తీసికొనిపోవుటకు ఓడలు రాజాల వన్నమాట. అప్పుడు, ఇంగ్లండ్ దేశమునకు ఎగుమతులుండవు; ఈ ఎగుమతులు లేక పోయిన, ఇంగ్లండు దేశమునకు తిండి లేదని యర్థము. అంతటితో ఆఖరు సామ్రాజ్యము; సామ్రాజ్యము కాక పోయిన, అధమపక్షము, ఇంగ్లండైన ఆఖరు కాక తప్పదు. ఇదియే రాజప్రతినిధిగారి ఉప్పు పన్ను పునరుద్ధారణకు కారణము.

## రైళ్లు—ఓడలు

రైల్వేలకు ఓడలకు గల అన్యోన్యము మిక్కిలి అనుకూలమైనది. తమ చార్జీల ఏర్పాటులవల్ల దేశీయపరిశ్రమలకు నష్టము గలుగునట్లు వ్యవహారము నడుపుటకు ఈ రెంటికిని, పరస్పరము, స్పష్టములైన ఒడంబడికలు గలవు. లాంకషైరునుండి పంపబడు గుడ్డల బేలుపై విధించు ఓడకేవు ట్యూటికారన్‌కైనా సరే, బొంబాయికైనా సరే, మదరాసుకైనా సరే ఒక్కటిగానే యుండును; అంతేకాక, యీ కేవు అహమ్మదాబాదునుండి హైదరాబాదుకుగాని, నాగపురమునుండి ఢిల్లీకిగాని కావలసిన రైలుచార్జీకంటె తక్కువ. ఈ సరుకే, బెజవాడవంటి నాటు గ్రామమునుండి కాకినాడవంటి కోస్తాగ్రామమునకు పంపబడినచో, దానికి కావలసిన రైలు చార్జి కాకినాడనుండి బెజవాడకు, వెనుకకు, గావలసినదానిలో ఐదవ వంతు ఉండును. జయపురమునుండి మదరాసుకువచ్చే పాలరాయికి కావలసిన రైలుచార్జి ఇటలీనుండి హిందూదేశమునకువచ్చే పాలరాయికి గావలసిన ఓడ కేవుకంటె ఎక్కువ. కొంత యినుము ఆంట్వెర్ప్ నుంచికాని, బ్రస్సెల్స్‌నుంచి కాని, హిందూదేశమునకు, ఏరేవుకైనా సరే, దిగుమతియైనచో, దానికి ఓడ కేవు రు 10 లు; అంతటి యినుమే జమ్షెడ్‌పూర్‌నుండి నాగపురమునకు పంపబడినచో, అట్లు పంపుటకు రు 13 లు చార్జి. తిరుప్పూరునుండి ఢిల్లీకి ఎగుమతియగు ప్రత్తికి గావలసిన చార్జి తిరుప్పూరునుండి లాంకషైరుకు పంపబడు ప్రత్తికంటె ఎక్కువ. ఈ విధముగ, దేశీయపరిశ్రమలకు అడ్డంకులను గల్పించుటకు, వానిపై, విదేశీవస్తువులతో పోటీచేయుటకు సాధ్యపడని విధమున, చార్జీలను ఏర్పాటు చేసి నిస్సహాయమగు నీదేశములో విదేశవస్తువుల నన్నిటిని కుక్కుటకును, బుద్ధిపూర్వకముగ విధించిన యిట్టి యెగుమతిదిగుమతి చార్జీలను, వరుసగ, నెంతవరకైన నపహరింపవచ్చును, రైల్వే కంపెనీలకు, స్టీమర్ల కంపెనీలకు ఒడంబడికలు జరుగుచుండును; వీనినిబట్టి బెంగాలులో గోగునారను అమ్మదలచుకొన్న రైతు తన సరుకును ఏదో ఫలానా స్టీమర్ కంపెనీవారికే పంపవలసియుండును. అట్లు పంపకపోయినచో రైల్వేకంపెనీవారు ఆసరకులను తీసికొనిపోరు. గోగునారమిల్లులకు గోగునారపండించువారికి నారసప్లయినిగూర్చి ఒడంబడిక జరిగినప్పుడు, ఆ ముడిసరుకుయొక్క అమ్మకమును గూర్చియేకాక, దానిని కలకత్తాకు చేర్చువిషయమునగూడ, ఇంగ్లీషు వర్తకుల లాభములకు సంబంధించిన ఏదో ఫలానా స్టీమరుకంపెనీవల్లనే అది చేర్చబడవలయుననికూడ షరతు ఉండును. నారపండించువారు ఆకంపెనీకి సహాయపడకపోయినచో నారకొనేవారు పండించువారికి సహాయము చేయరు. ఓడలవ్యాపారమును ప్రత్యేకముగ దీసికొన్నప్పుడుగూడ, వాని ఖాతాదారులు శాశ్వతముగ ఆకంపెనీలకు ఒడంబడికలవల్ల లొంగియే యుండునట్లు చేయగల మినహాయింపు (Rebate) పద్ధతి యొకటి వానికి కలదు. ఈపద్ధతినిబట్టి, ఒకరేడు ఏవో కొన్ని ఓడల కంపెనీలకు తమ ఖాతా ఇచ్చినచో, ఆయేడువారు ఇచ్చుకొన్న కేవులలో కొంత మినహాయింపుసొమ్ము కంపెనీవారినుండి తిరిగి తీసికొనుటకు వారికి అధికారము గలదు. కాని యీమినహాయింపు మొత్తము, వచ్చేయేటికికూడ ఖాతా ఆకంపెనీకే యిచ్చు షరతుమీద, మరుసటి సంవత్సరము ఆఖరునమాత్రమే, వారికి వచ్చును. వంటవానికి గడచిన నెలకియవలసిన జీతము, ఈ నెలలోగూడ నతడు పనిచేయు షరతుమీద, ఇచ్చునట్లున్నదిది. ఈపద్ధతిని, నిర్దయుడైన తన యజమాని బారినుండి తప్పించుకొనుట అతనికి అసాధ్యమైపోవును. ముచ్చిలికా కూలీనివలె (Indentured Cooly) శాశ్వతముగ తన్నది కట్టుబాటులో నుంచుచుండుటచే, పైయెగుమతిదారుకు కంపెనీతో గల సంబంధముగూడ నిట్టిదే. హిందూదేశ చరిత్రయందీనాడు, కోస్తావ్యాపారమును స్వదేశీకంపెనీలకు ప్రత్యేకించియుంచుటకు ప్రభుత్వమువారికి చేతగాకపోవుటను గూర్చియు, దానియెడ వారికిగల ప్రతికూలభావమునుగూర్చియు నుదహరించుటకూడ అనవసరమే. 1928 సం॥న కలకత్తాలో పరిశ్రమల ప్రదర్శనము జరిగినప్పుడు విదేశముల ఓడల వ్యాపారముతో హిందూదేశపు వ్యాపారమునకుగల పోలిక దెలుపుటకై త్రికోణమగు గోపురము నొకదానిని నిర్మించిరి. హిందూదేశము చిట్టచివరభాగములో 24 వ స్థానమున నుండెను. హిందూదేశపు ఓడల వ్యాపారములో నూటికి 74 వంతులకు యజమానియైయున్న ఇంగ్లాండు, ఆగోపురముయొక్క విశాలమైన మొదటిభాగములో నుండెను. ఇరువదియేడు జాతులలోను హిందూదేశము ఇరువదినాల్గవ స్థానము నాక్రమించెను. ఓడల వ్యాపారములో నూటికి ఒకటింబాతిక వంతు మాత్రమే హిందూదేశపుది. ఈయేర్పాటులో హిందూదేశమునకు క్రిందనున్న టర్కీ, పోలండ్ ఛిల్లీ దేశములు—ఈమూడును నిజముగ హిందూదేశముకన్న ఎక్కువవే—ఈనడుమనే కోస్తావ్యాపారమును స్వదేశీ ఓడలకు ప్రత్యేకించుకొన్నవి. కాని ఈచట్టమే హాజీగారు భారతశాసనసభలో ప్రవేశపెట్టినప్పుడు, ఇర్విన్ ప్రభువువంటి విశాలహృదయుడగు వైస్రాయి అది దోపిడియనియు, బలాత్కారమనియు అధికారహరణమనియు నభిప్రాయపడెను. బ్రిటిషు ఓడల వర్తకులు, తమ ఓడల లాభమును గాపాడుకొనుటకును, ఇండియాలో చట్టము ఆమోదింపబడకుండు

నట్లు చేయుటకును, ఇంచుమించు 5 లక్షల పౌనులను చందాలు వేసి కొనిరని తెలియుచున్నది. ఈసందర్భములో యుద్ధకాలము నాటి సంగతి యొకటి జ్ఞప్తికి వచ్చుచున్నది. ఆరోజులలో బందరువాసియగు ఓడలు నిర్మించువతడొకడు ఒక ఓడను కట్టుటకు ప్రోత్సహింపబడెను. దానివల్ల అతనికి కొంత లాభము వచ్చినది విడువకుండ ఓడలను నిర్మించుటకై అధికారులతనిని పురికొల్పుచుండిరి. తుదకతడు రు 1,50,000 లు ఖర్చుచేసి ఒక ఓడను కట్టించెను. దురదృష్టవశమున, ఓడకట్టుట పూర్తికాగనే సంధి జరిగిపోయినది. అప్పుడయినదేమి? అక్యాబ్ నుండి కోరమాండల్ తీరమునకు బియ్యము తీసికొనివచ్చుటకు శెస్ట్ అండ్ కంపెనీవారి ఓడలు మాత్రమే కావలయునని ఒక గవర్నమెంటు ఆర్డరు వచ్చిపడినది. పాపమీ ఓడలుకట్టునతడు-అతని కొకటిరుగూడ వచ్చినది-తుదకు భంగపడవలసియేవచ్చెను. దీనికి తోడు వెనుకటి సంవత్సరములలో అతడు గడించుకొన్న లాభములకని రు 72,000 ల ఆదాయపు పన్ను విధింపబడినది. తుద కెట్లో రు 25,000 లను ఖర్చు పెట్టి, దానిని 47,000 కు -లెక్కలను బట్టి ఇదియొక లాభమేకాదు-అతడు తగ్గించుకొనగలిగెను. డబ్బులేక, యిబ్బంది పడిపడి, ఆఖరుకు, ఆరేండ్ల తరువాత తన పెద్ద ఓడను చిన్నచిన్న నావలుగా జేసికొనుటకై అతడు మరియొక రు 25000 లను వెచ్చించుకొనవలసివచ్చెను. స్వదేశీఓడల పరిశ్రమ కొనసంగబడుచున్న ఆదర మిది; అయినను, స్వదేశీఓడలకు తగిలే నష్టములు స్టీమర్ల కంపెనీలవారి ఓడలకుకన్న తక్కువయే యని యెల్లరెరుంగుదురు. ఏలయన, స్వదేశీఓడ 50,60 సం॥ల వరకుండును. స్టీమరు అందులో మూడవవంతు కాలమైన నుండదు. విదేశములతోడి సముద్రవ్యాపారములో హిందూదేశమునకు నూరింట రెండువంతులు మాత్రమే కలవు. కోస్తా వ్యాపారములో కూడ విదేశపు ఓడలకు 90 పాళ్లు; హిందూదేశపు ఓడలకు పదిపాళ్లు. క్రొత్తగా బయలుదేరిన ఓడలకంపెనీలతో బాగుగా ప్రతిష్ఠించుకొనియున్న విదేశీకంపెనీలు ఎట్టి, సరిసమానముకాని, పోటీకి దిగునో బాగుగ తెలిసిన సంగతియే. ఇంగ్లండ్-హిందూదేశముల ఓడల వ్యాపారుల సభయొకటి 1930 సం॥ జనవరి 3 వ తేదీనాడు వైస్రాయిగారి అధ్యక్షతక్రింద సమావేశమైనది. కాని అది రెండుపక్షమువారికిని రాజీ కుదుర్పలేకపోయినది. దీనికి కారణము హిందూదేశపురాజకీయ నాయకులు కోరిన అసాధ్యములైన షరతులుగాని, విధ్వంసాత్మకములైన షరతులుగాని కాదు. స్వలాభ పరులగు బ్రిటిషు ఓడలకంపెనీలవారినుండి హిందూదేశపు వర్తకులకు న్యాయములైన షరతులు దొరకకపోవుటయే యీ కారణము. ఇండియాకు ఏటేట ఒక్క ఓడను అమ్ముచుండవలయునని ఒక ప్రసంగము వచ్చినది. ఈ పద్ధతినిబట్టి, విదేశీ గుత్తవ్యాపారము అంతరించునప్పటికి నూరేండ్లు పట్టునని లెక్కవేయబడినది.

## ఇనుపదారులు; నీటిపారుదల

ఇనుపదారులు, నీటిపారుదల-ఈరెంటిలోను ఇనుపదారులమీద ప్రభుత్వము వారికి పక్షపాతము. రైళ్లు సైన్యములకొరకే ఉద్దేశింపబడి యుండవచ్చును గాని వానిమీద పెట్టుబడి పెట్టబడిన ధనముపై 5 లేక 6 వంతున లాభమునకు గ్యారంటీ కలదు; కొన్ని రైల్వేలు న... నకే పనిచేయుచున్నవి. ఐనను నీటిపారుదల ఏర్పాటు, ... ఒక్కటియు, లాభకారి యగునా కాదా యని పరీక్షింప... చుండును. కృష్ణాగోదావరీనదులకు ఆనకట్టలు కట్టుటకు, పూ... కావేరి ఆనకట్టను ఆధారముగా దీసికొని, బ్రిటిషు ఇంజనీర్లు ఎంత... సందేహించియుండిరి. ఐనను ఈరెంటివల్లను, వరుసగ, న... 19 వంతునను, 22 వంతునను లాభము వచ్చినది. అట్లయ్యు, దుర... వశమున, ఆనకట్టక్రింద సాగుబడికివచ్చిన ప్రతి యెకరమునకును ప్ర... త్వమువారిప్పుడు అదనపువిలువపేరున రు 25 ల ఎక్కువపన్ను ... చుట సంభవించుచున్నది. నీటిపారుదల యేర్పాట్లు ఉత్పాదకము... (Productive) సంరక్షకములు (Protective) అని రెం... ములుగ నున్నవి. ఈరెండవ తరగతి యేర్పాట్లుగూడ, వాని తరగ... బట్టి, కొంత ఆదాయము నిచ్చునవిగనే యుండవలయును. ... నడుమనే ఒంగోలు వారొకరు ఒకపద్ధతిని సూచింపగా ... ఉత్పాదకము కాదనియు, సంరక్షకముగ నుండుటకైన, దాని... తగినంత లాభ ముండదనియు మదరాసు ప్రభుత్వమువారు దా... నిరాకరించియున్నారు. కాని రైలుదారుల సంగతి వచ్చినప్పు... మాత్రము వాని ఉత్పాదకశక్తినిగాని, సంరక్షణశక్తినిగాని వా... లెక్కగొనరు. వడ్డీలకు గ్యారంటీయిచ్చి, వానిని ప్రజల సొత్తు... నిర్మింతురు. వడ్డీకి గ్యారంటీ యీయబడినప్పుడు దాని యర్థ మి... కదా! సైన్యములకొరకు మాత్రమే కాక విదేశవస్తువులను దేశ... నాలుగుమూలలకు గొనిపోవుటకును, ఎగుమతులను ఆయాప్ర... ములనుండి కోస్తాగ్రామములకు గొనిపోవుటకును గూడ రైళ్లుప... గించుట స్పష్టము. స్వదేశీవస్తువులకు అడ్డంకి గల్పించి వి... వస్తువుల దిగుమతులకు సాయపడుటకుగాను, ఓడల కంపె... లతో ఏకీభవించి రైల్వేకంపెనీలు ఎగుడుదిగుడు చార్జీలను విధిం... సంగతినిగూర్చి యిదివరలో చెప్పియుంటిమి. ప్రక్కలనున్న ... టూళ్ల ఆరోగ్యసౌకర్యములనుగాని, నడుమ వచ్చుచుండు పట్టణ... నిర్మాణసౌందర్యమునుగాని పాటించకయే రైలుదారులను నిర్మిం... నారు. బ్రిటిషువారు మలేరియాను హిందూదేశమునకు దీసికొనివచ్చి... జనవాక్యము—ప్రభుత్వమువారు దీనిని న్యాయముగ నేనిరసించినా... ఒకటి యున్నది. కాని, "యత్రధూమ స్తత్రవహ్నిః" అను న్యాయమ... బట్టి, యిట్టి అనుమానములను బుట్టించు వ్యవహారముల యేర్పాట్ల... పైప్రవాదమునకు ఏదో యొక్క స్పష్టమైన సంబంధ ముండి యుండ... యును. నిజమిది: మామూలుగ, మురికికాలువలు ప్రవహించు చోట్ల... డియే యీరైలుకట్టలు పోవుచుండును. ఇది బెంగాలులో మరి... ఈకట్టల కడ్డముగ నిర్మింపబడు వంతెనల కమానులు వెంటనే నీటిని ప్ర... హించి పోకుండజేయుటచే ఆకట్టలకు పైనుండు ప్రదేశములన్నియు ... తో నిండిపోవును. దీనికి ఫలితముగ ఏడాదిలో చాల భాగము బెంగా...

ప్రజలు నీటిలో నివసించుటయు, నీటితో నిండిన ప్రదేశములను మలేరియా చుట్టబెట్టుటయు, అందుచే నచ్చట లక్షలకొలది ప్రాణములు ధ్వంసమగుటయు సంభవించినది. ఇంగ్లాండు దేశపు వర్తకముపైకన్న హిందూదేశపు ఆరోగ్యముపై ఎక్కువశ్రద్ధ వహించియుండినచో, ఇట్టి నిర్లక్ష్యమైన రైల్వేనిర్మాణమునకును, నీటిపారుదల యేర్పాట్ల ఉపేక్షకును లేనియంగీకారము నీయకముందే, ప్రభుత్వము వీనినిగూర్చి యాలోచించియుండెడిది; కాని బ్రిటను దేశపు ఆర్థికలాభమే దాని ప్రధానాశయము.

## చలామణి; నాణెములు

ఒక గౌరవాస్పదమైన చలామణి పద్ధతి లేక పోవుట హిందూదేశపు దురదృష్టము. నాగరకతగల దేశము లన్నియు ఏకధాతుపరిమాణమునే (Mono-metalism) కలిగియుండ, హిందూదేశపు సౌభాగ్యము ద్విధాతుపరిమాణము (bi-metalism) వలన గలుగు మార్పులపై నాధారపడియున్నది. 1903 సం॥ లోనే కర్జన్ ప్రభువుగారు బంగారపు చలామణి ప్రవేశపెట్టుటకై బంగారుమారకపు ప్రమాణమును(Gold exchange standard) దీనినిబట్టి రూపాయి విలువ తగ్గినది. ఈ విధముగ వచ్చినలాభమంతయు గోల్డ్ ఎక్స్ఛేంజ్ స్టాండర్డ్ రిజర్వ్ అనుపేరున నొక నిధిగా నేర్పడినది. ఇదియొక పెద్ద మొత్తముగా పెరిగి, కాగితపు చలామణియొక్క పత్రపు-విలువమొత్తముతోగలిసి యిప్పటికి 235, కోట్ల రూపాయ లైనది. కాని, యీ సందర్భమున, ధనమంతయు ఇంగ్లండులో నుండుటయు, దీనిలోకొంత భాగమునైన ఇండియా సెక్రెటరీగారు, 15. రోజుల వాయిదా పద్ధతిని, నూటికి రెండు మూడు రూపాయల వడ్డీపై, తక్కువవడ్డీలకు బ్రిటిషు వర్తకసంస్థలకు అప్పిచ్చుటయు మిక్కిలి విషాదకరమైన సంగతి. ఇండియా ప్రభుత్వమువారు, తాము నూటికి 4 మొదలుకొని 6 వరకు వడ్డీ యిచ్చి అప్పుచేయుచు, తమ ధనమును రెండుమూడు రూపాయల వడ్డీ చొప్పున అప్పిచ్చుట కంగీకరించుట—అదియైన హిందూదేశపు వర్తకముయొక్కగాని పరిశ్రమలయొక్కగాని అభివృద్ధికిగాదు, బ్రిటిషువర్తకమును పెంపొందించి వ్యాపింపజేయుటకు—మిగుల నసాధారణమైన సంగతి. ఈ విధముగనే ఇంగ్లండులోని వర్తకసంఘము లన్నియు అప్పు సంపాదించుకొనుచు ఊరుపేరు లేని పనికిమాలిన వస్తువులనన్నిటిని హిందూదేశములోనికి దెచ్చుచున్నవి; ఇచ్చటికివచ్చి, సాగసైనచోట్ల నివాస మేర్పరచుకొని, వాని నన్నిటిని పెద్ద పెట్ట లాభములకు మన కమ్మ గలుగుచున్నవి. సర్ డానియల్ హామిల్టన్ గారు ఈనిధినంతను ఈదేశమునకు మార్చవలయునని ఒక పదియేండ్లనుండియు సలహా ఇచ్చుచున్నారు. కాని ఇంగ్లండులోను, ఇండియాలోనుగూడ హిందూదేశపు కోశముపై (Finances) నధికారులుగ నున్న పెద్దలు ఇట్టిమార్పును జాగ్రత్తతో ప్రతిఘటించిరి. మొన్నటి కర్రెన్సీ సంఘమువారు(యంగ్ కమిషన్) ఈనిధిని ఇండియాకు మార్చుటకు సలహానిచ్చుట కొంత సంతృప్తికరమే. కాని ఇండియా ప్రభుత్వము దాని ననుసరించుటకు శ్రద్ధ వహింపదు. ఈనిధి వినియోగము విషయమున సర్ డానియల్ హామిల్టన్ గారు సూచించిన పద్ధతి మిక్కిలి ఆకర్షకమైనది. ఆయన సూచన చాల సరళమైనది: 235 కోట్ల రూపాయలను ఇండియాకు మార్చినచో అది మూలధనముగ ఒక బ్యాంకు స్థాపింపవచ్చును. ఆ బ్యాంకు పై నిధియొక్క యాధారమున తనవిలువకు మూడురెట్లు ఋణపత్రములను (Debentures) ప్రకటింపవచ్చును. ఇట్లు ప్రోగుచేయబడిన మొత్తము 940 కోట్లగును. ఇందు 235 కోట్లు బంగారు రూపమునను, వెండిరూపమునను, పత్రములరూపమునను, ఎల్లప్పుడు బ్యాంకు చలామణిలో నుండవలయును. మిగిలిన 705కోట్లను ఈక్రిందివిధమున ఉపయోగింపదగును. 615 కోట్ల రూపాయలు, క్రూరమగు రైతుల అప్పును తీర్చుటకై, పెద్దవాయిదా పద్ధతిని అప్పులిచ్చుటకు; మిగిలిన 87 కోట్లలోను, 20 కోట్లు సహకారోద్యమమునకు; 15 కోట్లు మునిసిపల్ డిబెంచర్లకు;20 కోట్లు రైలుదారుల యభివృద్ధికి వినియోగించి,తక్కిన 33 కోట్లను, తగిన మురికికాలువలపద్ధతులతో బెంగాలులోని మలేరియా నంతరింపజేయుటకును,పంజాబు, సంయుక్తప్రాంతములు మధ్యప్రాంతములు మున్నగుప్రదేశములలో నీటిపారుదల యేర్పాట్లచే వ్యవసాయము నభివృద్ధిపరచుటకును ఖర్చుచేయవలెను. అదనపు పంటలు డిబెంచర్లపై వడ్డీని కూడ బెట్టుచుండును. ఈవిధముగ ఒక్క కలపుపోటుతో, అప్పులవల్ల అణగిపోయియున్న వ్యవసాయదారుని స్వాతంత్ర్యము, ఆత్మగౌరవము స్థైర్యము గల, పౌరునిగ జేయవచ్చును. ఐన, ధనమంతయు ఇంగ్లండునుండి ఇండియాకు మారవలయునని దీనియర్థము. అందుచే హిందూదేశము మూలమున నిప్పుడు,వర్తకమువిషయమున సులభముగ ఇంగ్లీషువారు పొందుచున్న సహాయము వారికి లేకుండ జేయవలయు నని దీని భావము. కాని, యీసందర్భమున జరిగిన అత్యంతదారుణమగు వ్యవహారము మారకమునకు సంబంధించినది. దీనినిగూర్చి ప్రత్యేకముగ చర్చింపదగును.

## మారకము

మొన్న మొన్నటిదాక మారకము రూపాయికి 1 షి 4 పెన్సుల చొప్పున నిర్ణయింపబడియుండుటయు, ఇంగ్లండులోని రు 235 కోట్ల రూపాయలును పౌను ఒక్కంటికి 15 రూపాయల లెక్క చొప్పున సమకూడియుండుటయు బాగుగ తెలిసిన సంగతియే. కాని యుద్ధ సమయమున నీ మారకము 1 షి 4 పె. నుండి 2 షి. 10 పె. లకు పెరిగినది; యుద్ధము ముగియుగనే, 1922 సం॥న, అసాధారణముగ, మారకము 2 షి. 10 పెన్సుల చొప్పున స్థిరపరుపబడినది. 1922సం॥న, ఆరువారములలో, ఇంగ్లీషువారు రివర్స్ కౌన్సిళ్ల రూపమున 120 కోట్ల రూపాయలను ఇండియానుండి ఇంగ్లాండుకు పంపిరి. హిందూదేశపు కోశములో $7\frac{1}{2}$ రూపాయలు చెల్లించినచో, ఇంగ్లండులో వారికొక పౌను ముట్టెడిది; అనగా, వెనుకటి సంవత్సరములలో పౌను రు 15 ల చొ॥ తాను సంపాదించిన ధనమును ఇండియా మంత్రి రు $7\frac{1}{2}$ ల చొ॥

అమ్మచుండెనని యర్థము. దీనికి ఫలితముగ ఆరువారములలో అరువది కోట్ల రూపాయీల నష్టము వచ్చినది. నిర్దయులై విమర్శకులు ఇండియా బ్రిటిష్ ప్రభుత్వముల యీ దారుణచర్యను శాసనసిద్ధమైన దోపిడీ యనియు కట్టుబాట్లుగల దొంగతన మనియు వర్ణించిరి. ఇంతవరకట్లు చెప్పిన వారెవరును శిక్షింపబడలేదు. ప్రభుత్వము, న్యాయము పేరిట, నిట్టి విమర్శకుల విషయమున నేచర్యగాని తీసికొనసుజాలదు. మారకము దిగుమతుల కెట్లు సాయపడుచున్నదో, ఆమేర కది యెగుమతుల నెట్లు నిరోధించుచున్నదో, చిన్నపిల్లలకు గూడ తెలిసినసంగతియే. ఇంగ్లండులో మనవారెవరైన ఉన్నచో, ఇంగ్లండ్ నుండి యేదైన సుద్దను తెప్పించదలచినచో, 2 షి 10 పె. ల మారకపు పద్ధతిని, పోస్టాఫీసులో రు 7–8–0 చెల్లించెద మేని, అక్కడ (ఇంగ్లాండులో) ఒక పౌను ఇచ్చునట్లు మనకు పోస్టల్ రసీదు ముట్టును. ఇందువల్ల దిగుమతిదారుకు లాభము; ఆమేరకు ఎగుమతిదారుకు నష్టము. ఇప్పుడు ప్రభుత్వమువారు దిగుమతులకు ప్రోత్సాహము గల్గించుటకుగాను, యుద్ధమునకు పూర్వ ముండిన 1 షి. 4 పె. ల మారకమును 1 షి. 6 పె. లకు మార్చిరి. దీనినిబట్టి, యీనడుమ, హిందూదేశములో నెన్నియో వ్యాపారసంస్థలు భగ్నముకావలసి వచ్చినది. ఈ విధముగ, నీ మారకము పూర్తిగ ఇంగ్లీషుపరిశ్రమలకు లాభమును, హిందూదేశపు వ్యవసాయదారులకు భంగపాటును గలుగజేయు విధమున నెందుకు ఏర్పరుపబడవలయునో మాకు తెలియుటలేదు. ఇట్లు హిందూదేశపు లాభములను భగ్నపరుచుట ఇంగ్లాండ్ ఆర్థికలాభములకు సరిపడియుండు ననుస్పష్టమైన సమాధానము తప్ప, యింతవరకు, దీనికి మరి యే సమాధానమును రాలేదు.

## తపాలా చార్జీలు; చెక్కులు

ఉప్పు మొదల్కొని సైన్యమువరకు, హిందూదేశపరిపాలనము బ్రిటిషువారి లాభముల ననుసరించి తదేకధ్యానముతో సాగింపబడిన దని చెప్పియుంటిమి. ఆ పరిపాలనలో అంతకన్న చిన్నవస్తువుతోనే మన మారంభింపవచ్చును. అది పోస్టుకార్డు. కార్డువెల కానీనుండి అర్ధణాకు, కవరువెల అర్ధణానుండి అణాకు ఎందుకు పెంచబడిన దని తెలిసికొనుటకు ప్రయత్నించినవారు చాల కొద్దిమందియే యుండవచ్చును. నిజముగ, కార్డు పేదవాని కొక భోగము. దేశములో పేదలు తమ సుఖదుఃఖములను ఒకరికొకరు తెలియబరచుకొనుటకు సాధనమిది. కాని, కార్డును సంపాదించుటకాని దానిని నింపుటకాని సులభమైన పనికాదు. 20,00,000 ల జనసంఖ్యను, రెండువేల గ్రామములను గలిగియున్న కృష్ణాజిల్లాలో 70 పోస్టాఫీసులు మాత్రమే కలవు. అందుచే కార్డుతెచ్చుకో దలచినవారు కొన్ని మైళ్ళదూరము నడువవలసియుండును; జనసంఖ్యలో నూటికి 93 పాళ్లు నిరక్షరులగుటచే, తాము తెలియజేయదలచినదానికై వారొక వ్రాతగాని నేర్పాటు చేసికొనవలసి యుండును; అటుపై, దానిని తపాలాపెట్టెలో వేయుటకు, వారు మరల నన్ని మైళ్లదూరము నడువవలసియుండును. ఐనను, నిరుపేదలగుపల్లెటూళ్ల వారి నెదుర్కొనుచున్న ఈపాటి కష్టములతో ప్రభుత్వమువారికి తృప్తికలుగక, నూటికి నూరువంతులు కార్డువెలను హెచ్చించిరి. భారతశాసనసభలో నెన్నివిజ్ఞప్తులు వచ్చినను, అందొక్కటియు నోరులేని కోట్లకొలది భారతీయుల కష్టమును పరిహరింపలేకపోయినది. మరి, దీనికి బదులుగ, ధనవంతుల విషయమున ప్రభుత్వమువా రేమి చేయుచున్నారు? చెక్కులపై స్టాంపుడ్యూటీ యెత్తివేసినారు. ఒక్కొక్క చెక్కుమీదను–అది యెంత విలువగలదైననై యుండవచ్చును—ఒకఅణా స్టాంపుడ్యూటీ యుండవలయునను నియమ ముండెడిది. దీనిని తీసివేయుటవల్ల ఎవరికి లాభము? హిందూదేశములోని ధనికులకు; అందును, చెక్కులను అధికముగావాడు యూరపియనులకు. ఆంధ్రా యూబ్ కంపెనీవంటి వ్యాపారసంస్థ రోజుకు 1000 చెక్కులను ఉపయోగించవచ్చును. దీనినిబట్టి, ఆ కంపెనీకి రోజుకు 1000 అణాలు (రు 62–8–0) లాభము వచ్చుచున్నది. ఇది నెలకు రు 1500 లు, సంవత్సరమునకు రు 18,000 లు అగుచున్నది. ధనికులకుగల యీలాభము పేదవాండ్ర లాభము నెత్తికొట్టి ఏర్పరుపబడినది. మరి, స్టాంపుడ్యూటీకిని రాబడిపన్నుకును విరుద్ధముగ ఎడతెగని పోరాటము సాగించుచువచ్చిన యూరపియన్ల కీలాభము అల్పముకాదు. వారి రాజ్యాంగవ్యవహార మంతయు నీరెంటితోనే యున్నది. వీనిలో నొకదాని విషయమున వారికి కావలసినంత సదుపాయము కలిగినది.

## బ్యాంకులు; భీమాకంపెనీలు

సివిల్ అధికారులును, పోలీసు సూపరింటెండెంట్లును మనదేశమును పరిపాలించుచున్నారని మామూలుగ ననుకొనుచుందురు. వీరు స్వయముగ నమాయికులు; నిజముగ, దేశమును అణచియుంచుచున్న అధికారులు రాజద్రోహకరమైనదని ఏవ్యాసము పేరుననో, ఏ ఉపన్యాసము పేరుననో, అంతగాఐతే, ఒక యేడాది ఖైదు మాత్రము విధింపగలరు. కాని వర్తకులు, బ్యాంకుయజమానులు ఇన్స్యూరెన్స్ ఏజంట్లు, ఇష్టమువచ్చిన, మనజీవితముల నే భగ్నముచేయగలరు. వ్యాపారస్థుల వాణిజ్యలాభ మంతయు, పూర్తిగ, బ్యాంకుల చేతిలో నున్నది. ఒక చిన్న స్వదేశీబ్యాంకు స్థాపింపవలయు నన్నచో అచ్చటి ఇంపీరియల్ బ్యాంకు శాఖకు జెందిన నియోజకులు (Constituents) అందు భాగస్థులు కాగూడదనియు, విచారణకర్తలుగా (Directors) గాని, ఉద్యోగస్థులుగాగాని, నియోజకులుగా గాని ఉండరాదనియు క్రమక్రమముగ నిషేధింపబడిన సందర్భములు గలవు. బ్యాంకులవారి సొంతమనియు, దేశములోని చిన్నచిన్న బ్యాంకులకు సహాయముచేయుటకే యేర్పడినదనియు సర్ బాసిల్ బ్లాకెట్టుగారు చెప్పుకొన్న ఇంపీరియల్ బ్యాంకుకూడ అదనపుహుండీ (Over-drafts)లిచ్చి యీ చిన్న చిన్న స్వదేశీవ్యాపారముల కేవిధముగను సాయపడుటలేదు. ఒక సందర్భములో, నాచే నడుపబడుచుండిన ఒకబ్యాంకు, ఒక యిరువదియైదువేల రూపాయలకై, తన ప్రోనోట్లనన్నిటిని విడిజామీనులుగా ట్రాన్సుఫర్ చేయుటకును, దానికితోడుగ, డైరక్టర్ల వ్యక్తిబాధ్యతపై ఒక జాయింటు, విడి, ప్రోనోటును వ్రాసియిచ్చుటకును,

అంతేకాక, బ్యాంకు పేరుననే నోటు వ్రాసియిచ్చుటకును సిద్ధపడెను. కాని ఇంపీరియల్ బ్యాంకు ఈ సూచనపై దృష్టియే ఉంచలేదు. ఈ అల్పసహాయమును పొందుటకై, యెన్ని ప్రయత్నములు చేసినను, లాభము లేకపోయినది. గుడ్డల మూలముగ ఈదేశమునకు ఏటేట గలుగు నష్టము 72 కోట్ల రూపాయలు. కాని బ్యాంకులవల్లను బీమా కంపెనీల మూలమునను గలుగు నష్టము 100 కోట్లని తెలియుచున్నది. ఒక ఆంగ్లేయుడు, వట్టిచేతులతోవచ్చి, ఇంగ్లాండునుండి ఇండియాకు పంపబడిన సరుకుల ఎగుమతులపట్టిక (Bill of Lading) నొకదానిని చూపించి, అడిగిన మాత్రమున, హిందూదేశములోని ఇంగ్లీషు బ్యాంకులనుండి అదనపుహుండీ సంపాదింపగలుగును. కాని అపరిమితమైన జామీనుపద్ధతిపై (Unlimited Liability) నేర్పరుపబడిన14000 సంఘములను,1000 కోట్లరూపాయల జామీనును కలిగియున్న సహకారోద్యమమునకు, 31 సెంట్రల్ బ్యాంకులకును ఒక ఎపెక్సుబ్యాంకుకును గలిసి, 54 లక్షలరూపాయల అదనపుహుండీ దొరుకునప్పటికి బ్రహ్మాండమగుచున్నది. అప్పటికిని, ప్రతిదినమును, ఇంపీరియల్ బ్యాంకు ఈబ్యాంకులపై ఏవియో సూదిపోట్లను మోపుచునే యుండును. చిన్నవాయిదా అప్పులకు కాలపరిమితి ఒకయేడాది యని యేర్పాటుచేయును; దీనినిబట్టి,అదనపుహుండీ ప్రకారము ముపయోగింపబడిన మొత్తము పైకాలపరిమితి ననుసరించి తీర్చవలెనని యేర్పాటుచేయును. ఆఖరు కిప్పుడు అదనపుహుండీకోసమీయబడుచున్న జాయింటుహామీలు (Collateral Securities) సహకారసంఘముల ప్రానోట్లుగ నుండగూడదనియుగవర్నమెంటు పత్రములై యుండవలయుననియు కోరుచున్నది. ఈసందర్భమున, ఈఇంపీరియల్ బ్యాంకే,యూరపియన్ వాణిజ్యసంస్థలకు,అదనపుహుండీలరూపమున, 9 మొదలు 120 లక్షల రూపాయలవరకు ఇచ్చి అపరిమితములైన సౌకర్యములను గల్గించుచున్న సంగతినూహించుకొనుడు. మదరాసు మౌంటురోడ్డులోగాని, బొంబాయి హార్న్బీ రోడ్డులోగాని, కలకత్తా చౌరంగీలోగాని, లక్నో మాల్ బజారులోగాని ఉన్న కంపెనీలు 14000 సహకారసంఘము లిచ్చుచున్న అపరిమితమైన హామీకన్న ఎక్కువ హామీ నీయజాలవనుట స్పష్టము. ఇది యంతయు సహకారోద్యమము విషయమున; ఇంక వాణిజ్యపారిశ్రామిక వ్యవహారముల దెసకు బోవుదము. అవసరమునుబట్టి, ఇంగ్లీషు బ్యాంకులనుండి తీసికొన్న అప్పుల మూలముగ యంత్రాలయము లెట్లు ఒకదానివెంట నొకటిగ క్షీణించిపోయినదియు బాగుగ తెలిసిన సంగతియే. ఇండియా ఇంపీరియల్ బ్యాంకు చిట్టివలస గోగు నారమిల్లులకు $13\frac{1}{2}$ లక్షల రూపాయలు అప్పిచ్చెను. దానికి యజమానులుగ నుండిన సౌత్ ఇండియన్ ఇండస్ట్రియల్స్ సంస్థవారు ఆయప్పును ఏడురోజుల అవకాశములో తీర్పజాలకపోవుటచే, మదరాసు హైకోర్టు ఆమిల్లులను మూసివేయవలయునని అరగంట సేపటిలో తీర్మానించినది. మెక్లిడ్ అండ్ కో (?) అనునొక కలకత్తా కంపెనీవారు బహిరంగపు వేలములో వానిని గొనిపైచిరి. ఎయిడ్సుటు ఇండస్ట్రీస్ శాసనము ననుసరించి మదరాసు ప్రభుత్వమువారు రాజమహేంద్రవరపు కాగితపు మిల్లులకు $4\frac{1}{2}$ లక్షల రూపాయల ఋణము నొసంగిరి. ఈమిల్లుల సందర్భమున ప్రభుత్వమువారు పూర్తిగ షరాబుపద్ధతినే ప్రవర్తించిరి. పైశాసనమునుబట్టి, వారికి, ఆమిల్లులను స్వాధీనపరచుకొని నడిపించుటకుగాని, అమ్ముటకుగాని, వాని యాజమాన్యమునకు దగిన యేర్పాటులను జేయుటకుగాని, అధికార ముండెను. దేశీయుడగు నొక మధ్యవర్తిద్వారా ఆమిల్లుల నొకయూరపియన్ కంపెనీకి చెందజేయవలయునని ప్రభుత్వమువారు ప్రయత్నించుచున్నట్లు ప్రవాదములు బయలుదేరగనే మదరాసు శాసనసభవారు పెద్ద ఆందోళనము సాగించిరి. దీనికి ఫలితముగ మిల్లులను స్వాధీనపరుచుకొనుటకు మరియొక జాయింట్ స్టాక్ కంపెనీ యేర్పడినది. ఈలోపుగ, 40 వేల రూపాయల అల్పఋణముపై, ఒక అప్పుదారు మిల్లులను మూయించివేయవలయునని, ఐదునిమిషములలో, మదరాసు హైకోర్టువారి తీర్పును సంపాదింప గలిగెను. కాని తుదకు విచక్షణ కొంతవరకు పనిచేయుటయు, కొందరు తెలుగు సాహుకార్ల దేశభక్తిమూలమున మిల్లులు అప్పుక్రింద పోకుండ నిలువగలుగుటయు సంతోషకరమైన సంగతి. ఇంక బెజవాడ నూలుయంత్రాలయముల సంగతి: వీనిని కట్టుటకు ఆరులక్షల రూపాయలు కావలసివచ్చినది. ఇందు మూడులక్షలు చెల్లింపబడిన మొత్తము. ఇండియన్ బ్యాంకు దీనికి రు 1,20,000 లు అప్పిచ్చెను. ఇంపీరియల్ బ్యాంకు రు 30,000 లిచ్చెను. ప్రధాన విచారణకర్త (Managing Director) నిస్స్వార్థముగ పనిచేసి, సాహసించి, స్వయముగ, రు 1,50,000 లను పెట్టుబడిపెట్టెను. ఐనను ఆమిల్లులకు ఈయేడు జూన్ నెల ఆరవ తేదీనాడు మూసివేయబడవలసిన స్థితి వచ్చినది. ఆఖరిది, బందరు పంచదార మిల్లులనుగూర్చి: విచారణకర్తల జాయింటు, విడి, హామీపై— విచారణకర్తల ఆస్తిలో అప్పు మొత్తము ముప్పదియవవంతుండును — ఇంపీరియల్ బ్యాంకు ఈమిల్లులకు రు 80,000 ల ఋణమునిచ్చెను. స్వల్పవాయిదా ముగియగనే తగాదా వచ్చినది. ఆఖరుకు, మూలధనము లేకపోవుటచే, వీనిని మూసివేయవలసియే వచ్చినది. అసలు సంగతియిది: ఈ ఇంగ్లీషు బ్యాంకులును, సగము ప్రభుత్వమునకు జెందిన బ్యాంకులును ఈదేశముయొక్క పారిశ్రామికాభివృద్ధి విషయమున తమకు బాధ్యత యేమియు లేదని తలచుచుండును; ఎగుమతి వస్తువులను ప్రోగుచేసికొనుటలో ఎక్కువ శ్రద్ధ గలిగియుండును. నిజముగా, శాసనమునుబట్టి, ఆరునెలలకంటె యెక్కువకాలమున కప్పిచ్చుటకు ఇంపీరియల్ బ్యాంకు కధికారము లేదు. ఇట్టి స్వల్పవాయిదా ఋణములు వర్తకమునకే కాని పరిశ్రమలకు సాయపడజాలవు. హిందూదేశములోని ఎగుమతి కంపెనీలన్నియు యూరపియన్ కంపెనీలే ఐయుండుట విచిత్రము— వాల్కార్ట్ బ్రదర్స్ కంపెనీలు, రాలీకంపెనీలు మొదలైనవే అన్నియు. దేశములోనిమారకపుబ్యాంకులతోను,తక్కినబ్యాంకులతోనుసంప్ర

తించి సహాయము సంపాదింపగలిగిన విధియే. హిందూదేశపు రైతు గాని, ఎగుమతిదారుగాని వ్యాపారము నడుపుట కనర్హుడు. ఒకవేళ, ఎవరైన ముందుకు వచ్చినను ఇంగ్లాండ్ దేశములో అట్టివారిపై నిరోధ మేర్పడును. అక్కడి బ్యాంకులు ప్రత్యక్షముగ వారితో వ్యవహరింపవు. ముఖ్యముగ, ఈవిధమున, యూరపియన్ వ్యాపారమునకు మాత్రమే సాయమొసంగుచు ఈ బ్యాంకులు హిందూదేశపు వాణిజ్యమునకు పరిశ్రమలకు అడ్డుదగులుచున్నవి. పంట జామీనుపై ఈ బ్యాంకులు ఋణమిచ్చునప్పుడు, భీమాపద్ధతిపై నవి యెక్కువ శ్రద్ధవహించును. ఇది న్యాయమే—కాని, మొన్న మొన్నటిదాక భీమావ్యవహారమంతయు విదేశీ భీమా కంపెనీలతో జరుపవలసియుండెడిది. ఈ బ్యాంకులకు పై ఊళ్లలోగల శాఖల యేజంట్లే ఆ కంపెనీలకు గూడ ఏజెంట్లుగ నుండెడివారు.

## విద్యుద్దీపములు; సైన్యము

ఇంగ్లండ్ దేశపు నిరుద్యోగసమస్య మూలమున అనటి పరిశ్రమలవారు, మంత్రులు, క్రొత్తక్రొత్త పొలములను బీళ్లను వెదకికొనుచు, దేశదేశములకు బోవలసివచ్చెను. "క్రొత్త క్రొత్త వర్తకస్థానములను, విక్రయశాలలను" అని మన మిప్పుడు చెప్పవచ్చును. విక్రయశాలలను, సరకులను చాలభాగ మాక్రమించుట యైన పిమ్మట, నిప్పుడు, విద్యుద్యంత్రములను గూర్చియు, వాని సామగ్రిని గూర్చియు ప్రచారము మొదలు పెట్టినారు. ప్రతి పట్టణములోను టెలిఫోనుల నమర్చి, వానిని ఒండొంటితో గలుపుటకు ప్రభుత్వమువా రిప్పుడు మిక్కిలి తొందర జూపుచున్నారు. రెండేండ్లకు మునుపు, కొన్ని పట్టణములలో విద్యుద్దీపముల నేర్పాటుచేసినచో, ధనసహాయము చేయుటకు సిద్ధముగ నున్నామని ప్రభుత్వమువారు ఆ మ్యునిసిపాలిటీలకు తెలియబరచియుండిరి. ఇది కొంతకాలము సాగినది. కాని రెండేండ్ల లోపుగనే కార్యవిధాన మంతయు మారిపోయినది. కాకినాడ, రాజమహేంద్రవరము, బెజవాడ, కర్నూలు కూనూరు మొదలగు మ్యునిసిపాలిటీలు హిందూదేశపు కంపెనీలకు కంట్రాక్టు ఇచ్చినవి; ఈ కంపెనీలవారు జర్మనీనుండియు, అమెరికానుండియు సామగ్రి దెప్పించిరి. ఇంతటిలో, బ్రిటిషు పారిశ్రామికునికి నష్టము గలుగుచున్నదని కనిపెట్టి, గవర్నమెంటువారు మదరాసు స్థానికప్రభుత్వమువారి పరిపాలన శాఖ ద్వారా, గవర్నమెంట్ ఎలెక్ట్రికల్ ఇన్స్పెక్టరు సలహామీదనే కాని,—ఈ ఉద్యోగి తప్పక ఇంగ్లీషువాడే యైయుండును—ఎలెక్ట్రిక్ సామగ్రికి సరుకుహుండీని ఏ మ్యునిసిపాలిటీయును అంగీకరింప గూడ దని ఒక క్రొత్త ఆర్డరు జారీచేసిరి. తమ యిష్టము వచ్చినట్లు కంట్రాక్టు ఏర్పరచుకొనుటకును, తమ యక్కరలను సవరించుకొనుటకును, సహజముగ, శాసనము ననుసరించి, మ్యునిసిపాలిటీల కన్నిటికినిగల హక్కులను ఊడబెరికికొని వానిని మూలద్రోయుటకు ఈ విధముగ ప్రభుత్వము వ్యవహరించుచున్నది. ఇంతకుమునుపు, మ్యునిసిపాలిటీల ప్రయత్నము లన్నియు పూర్తిగాకుండగనే, మూడేసి నాలుగేసి లక్షల అప్పుమొత్తములను ఎలెక్ట్రిక్ దీపములకై వానినెత్తినిరుద్ది, పరుసగ రెండుమూడేండ్లకు ఎడ్డీలను లాగుచుండిన ప్రభుత్వము, ఎలెక్ట్రిక్ సామగ్రి వాడకమంతయు బ్రిటిష్‌కంపెనీల లాభమునకు సరిపడునట్లు ఉండిననేగాని అప్పీయమని యిప్పుడు బెదరించుచున్నది. నిజమునకు దానియర్థ మిదియే. కలకత్తా ఎలెక్ట్రిక్ ఇంజనీర్ల సభచేసి, మదరాసు ప్రభుత్వమువారి యీ నీతిని బ్రహ్మాండముగ పొగడుచు, వారికి తమ యభినందనములను, ఆమోదములను అందజేసిరి.

## సైన్యము

ఇంక, సైన్యము కడపటిమెట్టు. శిక్షణ సామర్థ్యమునకు ప్రసిద్ధిగాంచిన తక్కిన పాశ్చాత్యజాతులవంటిదే బ్రిటిషుజాతియు. సరిగా ఈ శిక్షణముననే ప్రాచ్యదేశములు కొరవడియున్నవని పదేపదే ఒకయాక్షేపణ వచ్చుచున్నది. ఈ శిక్షణమేమో తెలిసినవారు చాల తక్కువగ నుందురు. శాంతిసమయములో శిక్షణమన్న పరిశ్రమల వ్యవహారము; యుద్ధకాలమున శిక్షణము, సైన్యవ్యవహారము. పారిశ్రామికరంగమున బ్రిటను దేశము పూర్తిగ తన వాణిజ్య పారిశ్రామిక లాభముల కొరకే హిందూదేశము నెట్లు పాలించుచున్నదియు తెలిసికొంటిమి. సైన్యవ్యవహారము విషయమున గూడ వారి నీతి యీ మార్గమునే యనుసరించునని యంగీకరింపక తప్పదు. హిందూదేశములో బ్రిటిషుప్రభుత్వమువారు 81,000 బ్రిటిషు సైనికుల నుంచియున్నారు. వారందరును 17, 24 ఏండ్ల మధ్యప్రాయమువారు. హిందూదేశపు ధనములో వారు తర్ఫీదుపొందుదురు. వారు పూర్తిగ సైనికు లైనప్పుడు-సరిగ నీ సమయముననే సైనికులుగ వారి సహాయము దేశమునకు మిగుల నుపయోగకరమైయుండును—హిందూదేశమునకు వారివలన లాభ మేమియు లేకుండపోవుచున్నది. వారిని విడిచిపైచి, హిందూదేశములో సైన్యమున జేరుటకుగాని, పోలీసుశాఖలోను ఇతర శాఖలలోను ఉద్యోగములను సంపాదించుటకుగాని, లేకున్న, ఇంగ్లాండుకు మరలిపోవుటకుగాని వారికి అనుమతి యొసంగుదురు. అనగా, కేవలము బ్రిటిష్ సైనికులు, బ్రిటిష్ పౌరులు సైన, వీరికందరికి హిందూదేశపు ఖర్చుతో తర్ఫీదు ఇచ్చుచున్నారని యర్థము. కాని యీ వైపరీత్య మింతటితో ముగియుటలేదు. తలకొక్కంటికి 25 పౌనుల చొప్పున హిందూదేశము వీరినందరిని గొనుచున్నది. ఈ విధముగ, ఈ 81000 సైనికులకును హిందూదేశము ఇంచుమించు ఇరువదిలక్షల పౌనులను ఇచ్చుకొనుచున్నది. మరియు, నిది, బ్రతికినన్నాళ్లకు, ఒకేసారిగ ఇచ్చివేయనగిన మొత్తము కాదు; ఇందులో ఏడవవంతు ఏటేట మరల నిచ్చుచుండవలయును. ఇట్టిది, హిందూదేశముయొక్క నిస్సహాయమగునవస్థ; ఇట్టిది, సైన్యశిక్షణమునకై ఇంగ్లాండు హిందూదేశమును కొల్లగొట్టుచున్న పద్ధతి. సేనలో భారతీయుల యుద్యోగముల విషయమున గల నిర్బంధములను గూర్చి వివరించుట యనవసరము. మనచర్చ కది అంతగ సంబంధించినది

కాదు. హిందూదేశములోని 3200 ఆఫీసర్లలోను, 61 రు మాత్రమే భారతీయులని తెలిసికొన్న జాలును. హిందూదేశమునకును ఇంగ్లాండు కును సైన్యవ్యవహారములను సవరించువిషయమున అభిప్రాయభేదము గలదు. బ్రిటిషు సైనికుల నెల 25 పౌనులకంటె హెచ్చింపవలయు ననుటయే దీనికి ప్రధానకారణ మని తోచుచున్నది.

సామానులు (Stores)

హిందూదేశముయొక్క ధనమును కొల్లగొట్టు ఈ విధానములో నన్నిటికన్న నింద్యమైన వ్యవహారము ప్రభుత్వమువారి సామానులకొనుబడికి సంబంధించినది. దీనికి సంబంధించిన ప్రభుత్వ శాఖ యంతయు ఇంగ్లాండుదేశముననే యున్నది. 1920 సం॥ లో నియమింపబడిన స్టోర్సుకమిటీవారి నివేదిక యింతవరకు మూలబడియే యున్నది. ఈ సామానులకొనుబడినిగూర్చి భారత శాసనసభలో నెన్నిప్రశ్నలు వచ్చినను ప్రయోజన మేమియు లేకపోయినది. కథ పెంచకుండుటకుగాను, ఈనడుమ, దీనివిషయమున ప్రభుత్వమువా రంగీకరించిన నియమములు కొంతవరకు తృప్తికరములై యున్నవని చెప్పిన జాలును. ఈ నియమములనుబట్టి, ముందు, దేశములో తయారైన ముడివస్తువులకు లేక హిందూదేశమునకు చెందిన వస్తువులతో హిందూదేశములో తయారైనవానికి; తరువాత, విదేశవస్తువులనుండి హిందూదేశములో తయారైనవానికి; అటుపై, హిందూదేశములో నిలవలో నున్న విదేశవస్తువులకు; చిట్టచివర, ఇతర దేశములలో తయారైనవానికి— యీవరుసను, కొనుబడిలో ఆయావస్తువుల కెక్కువ యాదరము నీయవలసియుండును. ఐనను, ఆయుధములు, మందుగుండుసామను, వానికి కావలసిన ప్రత్యేకములైన యుపకరణములు, మరి యితర యుద్ధసామగ్రులు—నావికసైన్యమునకు, పదాతిసైన్యమునకు, విమానసైన్యమునకు గావలసినవన్నియు—చిత్రరచనములకు, మాదురులకు, చిహ్నములకు లేక శిల్పములకు మున్నగువానికి సంబంధించినంతవరకు, ఆయాశాఖల సైన్యముల యధికారులవలన ఏర్పఱుపబడిన పద్ధతుల ప్రకారము, హిందూదేశములో దొరికిననే తప్ప — వానికై లండనులోనున్న ఇండియన్ స్టోర్స్ డిపార్టుమెంటువారికి దరఖాస్తు పెట్టుకొనవలయును అను నియమము కలదు. ఎట్లయినను, ఈ వస్తువులన్నియు విదేశీవస్తువులంత శ్రేష్ఠములై యుండవలయునను షరతుకూడ కలదు. పైనియమముల కేపాటి భంగముగలిగినను, దాని కీషరతు నాధారముగ గొనుట కవకాశము గలదు. ఇంక, నీ సామగ్రికంతకును రూపాయలలో లెక్క వేయవలయు నను స్పష్టమగు సూచన యొకటియే సంతృప్తికరమైన విషయము.

ముగింపు.

బ్రిటిషు ప్రజలును ప్రభుత్వమువారును, హిందూదేశ పరిపాలనమునకు జెందిన ప్రతిశాఖలోను, ఏవిధముగ ఒకేవిధమగు ఆర్థికనీతిని అనుసరించుచున్నారో పైన వివరించుటకు ప్రయత్నించితిమి. ప్రభుత్వమువారు తమ శక్తిని, అధికారమును పలుకుబడిని హిందూదేశమున బ్రిటిషువారిలాభముల యభివృద్ధికై వినియోగించుచు ఆవర్తకమునకు, పరిశ్రమలకు రక్షణమొసంగుట మాత్రమే చేయుచున్నారు. హిందూదేశము ఇంగ్లీషు సరుకులకు తగిన విక్రయశాల యైననే తప్ప దానియుపయోగము ఇంగ్లండు కేమియు లేదు. ప్రతివిక్రయశాలనుండియు ఇంగ్లీషు సరుకులు తరిమివేయబడినవి. ఇనుము బొగ్గు, ఈ రెంటి విషయమునను, ఇంగ్లాండు పేరందినది. కాని యీ రెండును నానాటికి ప్రపంచమున కనావశ్యకములై పోవుచున్నవి. ఏ టేటను మొత్తముమీద అన్ని దేశములలోను 120 కోట్ల మిలియన్ల మెట్రిక్ టన్నుల బొగ్గు లభించుచున్నది. కాని ఇంజన్ల అవసరము తగ్గిపోవుచున్నది. 10 యేండ్లకు మునుపు అమెరికాదేశమందలి వాణిజ్యపారిశ్రామిక వ్యాపారములు నూటికి 84 పాళ్లు బొగ్గుమీదనే యాధారపడి యుండెను. కాని యిప్పుడు 64 పాళ్లు మాత్రమే బొగ్గును అమెరికా ఉపయోగించుకొనుచున్నది. ఇటలీ, తన యవసరమునకుగాను, 9 మిలియన్ల మెట్రిక్‌టన్నుల ఇంగ్లీషుబొగ్గును ఉపయోగించుచుండెను. ఇప్పుడిటలీ దానికి బదులుగ హైడ్రో-ఎలెక్ట్రిక్ పద్ధతిని ప్రవేశపెట్టినది; కాబట్టి యీమేరకు ఇంగ్లీషు బొగ్గు వ్యాపారము నష్టపడినది. జలపాతములనుండి పుట్టుచున్న విద్యుచ్ఛక్తియు, నూనెచేగాని, గ్యాసుచేతను కలపచేతనుగాని, నడుపబడుచున్న ఇంజన్లనుండి జనించు విద్యుచ్ఛక్తియు బొగ్గు అవసరమును పూర్తిగా నెట్టివైచినవి. ఇనుమునకు సంబంధించినంతవరకు, దానిని తప్పించివైచి సీమెంటు కలగలుపుకట్టడములతో కమానువంతెనలను గట్టించుటకు తీవ్రముగ ప్రయత్నములు సాగుచున్నవి. ఈనడుమనే మదరాసు చీఫ్ ఇంజనీర్‌గారు వంతెనలు తూములు, ఎంతచిన్నవైనను సరే, ఇనుపబద్దీలతో నిర్మింపవలయునని యొక ప్రకటనము గావించిరి. ఇంగ్లాండు నిరుద్యోగశాఖ మంత్రియైన థామసుగారు, పదవి స్వీకరింపగానే, ఇంగ్లండులోనే తయారుగాదగినవిగ నున్నంతవరకు, దిగుమతియగుచున్న (పైదేశములనుండి) వస్తువులన్నియు ఇంగ్లాండు విక్రయశాలలనుండి తొలగింపబడవలెనని ప్రకటించిరి. మొట్టమొదట ఆయన మట్టడించినవి కొయ్యబద్దీలు; ఇంగ్లాండులోను, హిందూదేశములోను గూడ ఉక్కుబద్దీలు అతిశీఘ్రముగ నీనిస్థానము నాక్రమించివైచుచున్నవి. థామస్‌గారు ఈవిధముగనే ఇంగ్లాండ్ నిరుద్యోగసమస్యను పరిష్కరించుటకతితీవ్రముగ ప్రయత్నించుచున్నారు. ఈనిరుద్యోగుల సంఖ్య యుద్ధము ముగిసిన క్రొత్తలో 20 లక్షలుండెను. థామస్‌గారు మంత్రి పదవికి వచ్చు నాటికి 11 లక్షలుండెను; మరి నాలుగు నెలల కది 15 లక్షలైనది. థామస్‌గారు, తమసహోద్యోగుల కెరిగింపకయే, ఒక యోడనిండ బొగ్గును కనడాకు గొనిపోయి ఇంగ్లీషుబొగ్గు నుపయోగింపవలసిన దని కనడావారిని ప్రార్థించిరి; కాని వారు నోవాస్కోషియా బొగ్గుపై నెక్కువ యిష్టము జూపిరి. ఇంపీరియల్ ప్రిఫరెన్సు పద్ధతిని, కనడాలో ఇంగ్లీషుసరుకులకు అదనపుసౌకర్యములను సంపాదించుటకు

తించి సహాయము సంపాదింపగలిగిన విధియే. హిందూదేశపు రైతుగాని, ఎగుమతిదారుగాని వ్యాపారము నడుపుట కనర్హుడు. ఒకవేళ, ఎవరైన ముందుకు వచ్చినను ఇంగ్లాండ్ దేశములో అట్టివారిపై నిరోధ మేర్పడును. అక్కడి బ్యాంకులు ప్రత్యక్షముగ వారితో వ్యవహరింపవు. ముఖ్యముగ, ఈవిధమున, యూరపియన్ వ్యాపారమునకు మాత్రమే సాయమొసంగుచు ఈ బ్యాంకులు హిందూదేశపు వాణిజ్యమునకు పరిశ్రమలకు అడ్డుదగులుచున్నవి. పంట జామీనుపై ఈ బ్యాంకులు ఋణమిచ్చునప్పుడు, బీమాపద్ధతిపై నవి యెక్కువ శ్రద్ధవహించును. ఇది న్యాయమే—కాని, మొన్నమొన్నటిదాక బీమావ్యవహారమంతయు విదేశీ బీమా కంపెనీలతో జరుపవలసియుండెడిది. ఈ బ్యాంకులకు పై ఊళ్లలోగల శాఖల యేజంట్లే ఆ కంపెనీలకు గూడ ఏజెంట్లుగ నుండెడివారు.

## విద్యుద్దీపములు; సైన్యము

ఇంగ్లండ్ దేశపు నిరుద్యోగసమస్య మూలమున అనటి పరిశ్రమలవారు, మంత్రులు, క్రొత్తక్రొత్త పొలములను బీళ్లను వెదకికొనుచు, దేశదేశములకు బోవలసివచ్చెను. "క్రొత్త క్రొత్త వర్తకస్థానములను, విక్రయశాలలను" అని మన మిప్పుడు చెప్పవచ్చును. విక్రయశాలలను, సరకులను చాలభాగ మాక్రమించుట యైన పిమ్మట, నిప్పుడు, విద్యుద్యంత్రములను గూర్చియు, వాని సామగ్రిని గూర్చియు ప్రచారము మొదలు పెట్టినారు. ప్రతి పట్టణములోను టెలిఫోనుల నమర్చి, వానిని ఒండొంటితో గలుపుటకు ప్రభుత్వమువా రిప్పుడు మిక్కిలి తొందర జూపుచున్నారు. రెండేండ్లకు మునుపు, తమతమ పట్టణములలో విద్యుద్దీపముల నేర్పాటుచేసినచో, ధనసహాయము చేయుటకు సిద్ధముగ నున్నామని ప్రభుత్వమువారు ఆ మ్యూనిసిపాలిటీలకు తెలియబరచియుండిరి. ఇది కొంతకాలము సాగినది. కాని రెండేండ్లలోపుగనే కార్యవిధాన మంతయు మారిపోయినది. కాకినాడ, రాజమహేంద్రవరము, బెజవాడ, కర్నూలు మొదలగు మ్యూనిసిపాలిటీలు హిందూదేశపు కంపెనీలకు కంట్రాక్టు ఇచ్చినవి; ఈ కంపెనీలవారు జర్మనీనుండియు, అమెరికానుండియు సామగ్రి తెప్పించిరి. ఇంతటితో, బ్రిటిషు పారిశ్రామికునికి నష్టము గలుగుచున్నదని కనిపెట్టి, గవర్నమెంటువారు మదరాసు స్థానికప్రభుత్వమువారి పరిపాలనశాఖ ద్వారా, గవర్నమెంట్ ఎలెక్ట్రికల్ ఇన్స్పెక్టరు సలహామీదనే కాని,—ఈ ఉద్యోగి తప్పక ఇంగ్లీషువాడే యైయుండును—ఎలెక్ట్రిక్ సామగ్రికి సరుకుపహుండీని ఏ మ్యూనిసిపాలిటీయును అంగీకరింప గూడదని ఒక క్రొత్త ఆర్డరు జారీచేసిరి. తమ యిష్టము వచ్చినట్లు కంట్రాక్టు ఏర్పరచుకొనుటకును, తమ యక్కరలను సవరించుకొనుటకును, సహజముగ, శాసనము ననుసరించి, మ్యూనిసిపాలిటీల కన్నిటికినిగల హక్కులను ఊడబెరికికొని వానిని మూలద్రోయుటకు ఈ విధముగ ప్రభుత్వము వ్యవహరించుచున్నది. ఇంతకుమునుపు, మ్యూనిసిపాలిటీల ప్రయత్నము లన్నియు పూర్తిగాకుండగనే, మూడేసి నాలుగేసి లక్షల అప్పుమొత్తములను ఎలెక్ట్రిక్‌దీపములకై వానినెత్తినిరుద్ది, వరుసగ రెండుమూడేండ్లకు వడ్డీలను లాగుచుండిన ప్రభుత్వము, ఎలెక్ట్రిక్ సామగ్రి వాడకమంతయు బ్రిటిష్‌కంపెనీల లాభమునకు సరిపడునట్లు ఉండిననేగాని అప్పీయనని యిప్పుడు బెదరించుచున్నది. నిజమునకు దానియర్థ మిదియే. కలకత్తా ఎలెక్ట్రిక్ ఇంజనీర్లు సభచేసి, మదరాసు ప్రభుత్వమువారి యీ నీతిని బ్రహ్మాండముగ పొగడుచు, వారికి తమ యభినందనములను, ఆమోదములను అందజేసిరి.

## సైన్యము

ఇంక, సైన్యము కడపటిమెట్టు. శిక్షణ సామర్థ్యమునకు ప్రసిద్ధిగాంచిన తక్కిన పాశ్చాత్యజాతులవంటిదే బ్రిటిషుజాతియు. సరిగా ఈ శిక్షణముననే ప్రాచ్యదేశములు కొరవడియున్నవని పదేపదే ఒకయాక్షేపణ వచ్చుచున్నది. ఈ శిక్షణమేమో తెలిసినవారు చాల తక్కువగ నుందురు. శాంతిసమయములో శిక్షణమన్న పరిశ్రమల వ్యవహారము; యుద్ధకాలమున శిక్షణము, సైన్యవ్యవహారము. పారిశ్రామికరంగమున బ్రిటను దేశము పూర్తిగ తన వాణిజ్య పారిశ్రామిక లాభముల కొరకే హిందూదేశము నెట్లు పాలించుచున్నదియు తెలిసికొంటిమి. సైన్యవ్యవహారము విషయమున గూడ వారి నీతి యీ మార్గము నే యనుసరించునని యంగీకరింపక తప్పదు. హిందూదేశములో బ్రిటిషుప్రభుత్వమువారు 81,000 బ్రిటిషు సైనికుల నుంచియున్నారు. వారందరును 17, 24 ఏండ్ల మధ్యప్రాయమువారు. హిందూదేశపు ధనముతో వారు తర్ఫీదుపొందుదురు. వారు పూర్తిగ సైనికు లైనప్పుడు-సరిగనీ సమయముననే సైనికులుగ వారి సహాయము దేశమునకు మిగుల నుపయోగకరమైయుండును—హిందూదేశమునకు వారివలన లాభమేమియు లేకుండపోవుచున్నది. వారిని విడిచివైచి, హిందూదేశములో సైన్యమున జేరుటకుగాని, పోలీసుశాఖలోను ఇతర శాఖలలోను ఉద్యోగములను సంపాదించుటకుగాని, లేకున్న, ఇంగ్లాండునకు మరలిపోవుటకుగాని వారికి అనుమతి యొసంగుదురు. అనగా, కేవలము బ్రిటిష్‌సైనికులు, బ్రిటిష్ పౌరులు నైన, వీరికందరికి హిందూదేశపు ఖర్చుతో తర్ఫీదు ఇచ్చుచున్నారని యర్థము. కాని యీ వైపరీత్య మింతటితో ముగియుటలేదు. తలకొక్కంటికి 25 పౌనుల చొప్పున హిందూదేశము వీరినందరిని గొనుచున్నది. ఈ విధముగ, ఈ 81000 సైనికులకును హిందూదేశము ఇంచుమించు ఇరువదిలక్షల పౌనులను ఇచ్చుకొనుచున్నది. మరియు, నిది, బ్రతికినన్నాళ్లకు, ఒకేసారిగ ఇచ్చివేయవగిన మొత్తము కాదు; ఇందులో ఏడవవంతు ఏటేట మరల నిచ్చుచుండవలయును. ఇట్టిది, హిందూదేశముయొక్క నిస్సహాయమగునవస్థ; ఇట్టిది, సైన్యశిక్షణమునకై ఇంగ్లాండు హిందూదేశమును కొల్లగొట్టుచున్న పద్ధతి. సేనలో భారతీయుల యుద్యోగముల విషయమున గల నిర్బంధములను గూర్చి వివరించుట యనవసరము. మనచర్చ కది అంతగ సంబంధించినది

కాదు. హిందూదేశములోని 3200 ఆఫీసర్లలోను, 61 రు మాత్రమే భారతీయులని తెలిసికొన్న జాలును. హిందూదేశమునకును ఇంగ్లాండు కును సైన్యవ్యవహారములను సవరించువిషయమున అభిప్రాయభేదము గలదు. బ్రిటిషు సైనికుల నెల 25 పౌనులకంటె హెచ్చింపవలయు ననుటయే దీనికి ప్రధానకారణ మని తోచుచున్నది.

## సామానులు (Stores)

హిందూదేశముయొక్క ధనమును కొల్లగొట్టు ఈ విధానములో నన్నిటికన్న నింద్యమైన వ్యవహారము ప్రభుత్వమువారి సామానులకొనుబడికి సంబంధించినది. దీనికి సంబంధించిన ప్రభుత్వ శాఖ యంతయు ఇంగ్లాండుదేశముననే యున్నది. 1920 సం॥ లో నియమింపబడిన స్టోర్స్‌కమిటీవారి నివేదిక యింతవరకు మూలబడియే యున్నది. ఈ సామానులకొనుబడినిగూర్చి భారత శాసనసభలో నెన్నిప్రశ్నలు వచ్చినను ప్రయోజన మేమియు లేకపోయినది. కథ పెంచకుండుటకుగాను, ఈనడుమ, దీనివిషయమున ప్రభుత్వమువా రంగీకరించిన నియమములు కొంతవరకు తృప్తికరములై యున్నవని చెప్పిన జాలును. ఈ నియమములనుబట్టి, ముందు, దేశములో తయారైన ముడివస్తువులకు లేక హిందూదేశమునకు చెందిన వస్తువులతో హిందూదేశములో తయారైనవానికి; తరువాత, విదేశవస్తువులనుండి హిందూదేశములో తయారైనవానికి; అటుపై, హిందూదేశములో నిలవలో నున్న విదేశవస్తువులకు; చిట్టచివర, ఇతర దేశములలో తయారైనవానికి—యీవరుసను, కొనుబడిలో ఆయావస్తువుల కెక్కువ యాదరము నీయ వలసియుండును. ఐనను, ఆయుధములు, మందుగుండుసామను, వానికి కావలసిన ప్రత్యేకములైన యుపకరణములు, మరి యితర యుద్ధసామగ్రులు-నావికసైన్యమునకు, పదాతిసైన్యమునకు, విమానసైన్యమునకు గావలసినవన్నియు—చిత్రరచనములకు, మాదురులకు, చిహ్నములకు లేక శిల్పములకు మున్నగువానికి సంబంధించినంతవరకు, ఆయాశాఖల సైన్యముల యధికారులవలన ఏర్పరుపబడిన పద్ధతుల ప్రకారము, హిందూదేశములో దొరికిననే తప్ప — వానికై లండనులోనున్న ఇండియన్ స్టోర్స్ డిపార్టుమెంటువారికి దరఖాస్తు పెట్టుకొనవలయును అను నియమము కలదు. ఎట్లయినను, ఈ వస్తువులన్నియు విదేశీవస్తువులంత శ్రేష్ఠములై యుండవలయునను షరతుకూడ కలదు. పైనియమముల కేపాటి భంగముగలిగినను, దాని కీషరతు నాధారముగ గొనుట కవకాశము గలదు. ఇంక, నీ సామగ్రికంతకును రూపాయలలో లెక్క వేయవలయు నను స్పష్టమగు నూతన యొకటియే సంతృప్తికరమైన విషయము.

## ముగింపు.

బ్రిటిషు ప్రజలును ప్రభుత్వమువారును, హిందూదేశపరిపాలనమునకు జెందిన ప్రతిశాఖలోను, ఏవిధముగ ఒకేవిధమగు ఆర్థికనీతిని అనుసరించుచున్నారో పైన వివరించుటకు ప్రయత్నించితిమి. ప్రభుత్వమువారు తమ శక్తిని, అధికారమును పలుకుబడిని హిందూదేశమున బ్రిటిషువారిలాభముల యభివృద్ధికై వినియోగించుచు అవర్తకమునకు, పరిశ్రమలకు రక్షణమొసంగుట మాత్రమే చేయుచున్నారు. హిందూదేశము ఇంగ్లీషు సరుకులకు తగిన విక్రయశాల యైననే తప్ప దానియుపయోగము ఇంగ్లండు కేమియు లేదు. ప్రతివిక్రయశాలనుండియు ఇంగ్లీషు సరుకులు తరిమివేయబడినవి. ఇనుము బొగ్గు, ఈ రెంటి విషయమునను, ఇంగ్లాండు పేరందినది. కాని యీ రెండును నానాటికి ప్రపంచమున కనావశ్యకములై పోవుచున్నవి. ఏటేటను మొత్తముమీద అన్ని దేశములలోను 120 కోట్ల మిలియన్ల మెట్రిక్ టన్నుల బొగ్గు లభించుచున్నది. కాని ఇంజన్ల అవసరము తగ్గిపోవుచున్నది. 10 యేండ్లకు మునుపు అమెరికా దేశమందలి వాణిజ్యపారిశ్రామిక వ్యాపారములు నూటికి 84 పాళ్లు బొగ్గుమీదనే యాధారపడి యుండెను. కాని యిప్పుడు 64 పాళ్లు మాత్రమే బొగ్గును అమెరికా ఉపయోగించుకొనుచున్నది. ఇటలీ, తన యవసరమునకుగాను, 9 మిలియన్ల మెట్రిక్ టన్నుల ఇంగ్లీషుబొగ్గును ఉపయోగించుచుండెను. ఇప్పుడిటలీ దానికి బదులుగ హైడ్రో-ఎలెక్ట్రిక్ పద్ధతిని ప్రవేశపెట్టినది; కాబట్టి యీమేరకు ఇంగ్లీషు బొగ్గు వ్యాపారము నష్టపడినది. జలపాతములనుండి పుట్టుచున్న విద్యుచ్ఛక్తియు, నూనెచేగాని, గ్యాసుచేతను కలపచేతనుగాని, నడుపబడుచున్న ఇంజన్లనుండి జనించు విద్యుచ్ఛక్తియు బొగ్గు అవసరమును పూర్తిగా నెట్టివైచినవి. ఇనుముకు సంబంధించినంతవరకు, దానిని తప్పించివైచి సిమెంటు కలగలుపుకట్టడములతో కమానువంతెనలను గట్టించుటకు తీవ్రముగ ప్రయత్నములు సాగుచున్నవి. ఈనడుమనే మదరాసు చీఫ్ ఇంజనీర్‌గారు వంతెనలు తూములు, ఎంతచిన్నవైనను సరే, ఇనుపబద్దీలతో నిర్మింపవలయునని యొక ప్రకటనము గావించిరి. ఇంగ్లాండు నిరుద్యోగశాఖ మంత్రియైన థామసుగారు, పదవి స్వీకరింపగానే, ఇంగ్లండులోనే తయారుగాదగినవిగ నున్నంతవరకు, దిగుమతియగుచున్న (పైదేశములనుండి) వస్తువులన్నియు ఇంగ్లాండు విక్రయశాలలనుండి తొలగింపబడవలెనని ప్రకటించిరి. మొట్టమొదట ఆయన ముట్టడించినవి కొయ్యబద్దీలు; ఇంగ్లాండులోను, హిందూదేశములోను గూడ ఉక్కుబద్దీలు అతిశీఘ్రముగ నీస్థానము నాక్రమించివైచుచున్నవి. థామస్‌గారు ఈవిధముగనే ఇంగ్లాండ్ నిరుద్యోగసమస్యను పరిష్కరించుట కతితీవ్రముగ ప్రయత్నించుచున్నారు. ఈనిరుద్యోగుల సంఖ్య యుద్ధము ముగిసిన క్రొత్తలో 20 లక్షలుండెను. థామస్‌గారు మంత్రి పదవికి వచ్చునాటికి 11 లక్షలుండెను; మరి నాలుగు నెలల కది 15 లక్షలైనది. థామస్‌గారు, తమసహోద్యోగుల కొరిగింపకయే, ఒక యోడనిండ బొగ్గును కనడాకు గొనిపోయి ఇంగ్లీషుబొగ్గు నుపయోగింపవలసిన దని కనడావారిని ప్రార్థించిరి; కాని వారు నోవాస్కోషియా బొగ్గుపై నెక్కువ యిష్టము జూపిరి. ఇంపీరియల్ ప్రిఫరెన్సు పద్ధతిని, కనడాలో ఇంగ్లీషుసరుకులకు అదనపుసౌకర్యములను సంపాదించుటకు

ఇంగ్లీషువారుచేసిన ప్రయత్నములును వ్యర్థములే యయ్యెను. ఇంపీరియల్ ప్రిఫరెన్సు సిద్ధాంతముయొక్క లాభములను పొందవలసిన దిగుమతి సరుకులలో, అర్ధమపత్కము, నూటికేబది పాళ్లైన బ్రిటిషుపనివాండ్రచే చేయబడినవై యుండవలెనను ప్రస్తుత నియమమును సవరించుటకు కనడా టారిఫ్‌బోర్డువారు అంగీకరింపలేదని ఒట్టావా నగరమునుండి వచ్చిన వృత్తాంతము లాంకషైరులో తీవ్రమగు నిరాశను గల్గించినది. పూర్వపు నియమమైయుండిన నూటికి ఇరువదియైదువంతుల ప్రమాణమునకు అంగీకరింపకపోయినను, ఏకో కొంతతగ్గింపును అంగీకరించెదరని లాంకషైరులో ఆశించుచుండిరి. కనడాలో, ప్రత్తిని తెప్పించుకొనువారును ఉపయోగించుకొనువారును లాంకషైరును సమర్థించిరి. కాని నేతగాండ్రు, లాంకషైరుకు సామ్రాజ్యమునుండి కావలసినంత ప్రత్తి దొరుకుచున్నదని చెప్పి, ప్రతిఘటించిరి. ఫిబ్రవరి నెలలో ఆయవ్యయపట్టిక ప్రకటింపబడువరకు బోర్డువారి నిర్ణయమునుగూర్చి ప్రభుత్వమువారేమియు ప్రకటించుటకు వీలులేదు. ఈలోపుగ, హిందూదేశములో వాణిజ్యపు సుంకములు, ఈనడుమ చాలసారులు, లాంకషైరుకు విరుద్ధముగ నేర్పరుపబడిన సంగతినిగూర్చి లాంకషైరు పరిశ్రమలవారు ఖేదమునొందుచున్నారు. ఆస్ట్రేలియా ప్రస్తుతము కొన్నివస్తువులపై పన్ను ఎక్కువచేసినది. ఇంగ్లండుకు ఎక్కువ ఆశాజనకముగ నుండిన పద్ధతిని కనడా అవలంబించునట్లు కనబడదు. వ్యవహారము లిట్లుండుటచే, ఇన్నాళ్లనుండియు చిన్నచూపుతో చూచిన సోవియట్ రష్యాతో ఇంగ్లాండు రాయబారములు నడుపవలసివచ్చినది. 700 మిలియన్ల పెట్టుబడిగలిగిన 1500 బ్రిటిషు కంపెనీల ప్రతినిధులు, 80 మంది, సోవియట్ రష్యా విక్రయశాలల స్థితిగతులను పరిశీలించి, తీవ్ర నిరసనమునకు గురియైన ఆసోవియట్‌రష్యాతో, వర్తకసంబంధములను పునరుద్ధరించుసందర్భమున రష్యాకు వెడలియున్నారన్న సంగతి చాలమందికి తెలియదు. రష్యా వాణిజ్యశాలల కట్టుదిట్టములను గూర్చియు, వాని క్రమపద్ధతిని గూర్చియు వీరు విజ్ఞప్తులంపుకొన్న మీదటనే, లేబరు ప్రభుత్వము ఆ ప్రభుత్వముతోడి రాజకీయసంబంధములను మరల నేర్పరుచుటకై ప్రయత్నించుచున్నది. తా మొకటిపైనొకటి గుప్పుకొన్న దురంతములకును నిందలకును దరువాత, నీనాడు, ఆ రెండు దేశములును పరస్పరము రాయబారులను పంపుకొనుచుండుట మనము చూచుచున్నాము. ఈ విధముగ ఇంగ్లాండు, తన జాతీయజీవితము విషయమున నిరాశాపూర్ణమగు నవస్థకు వచ్చినది. దాని వ్యాపారమంతయు కట్లుబాట్లు తప్పిపోయినది. యుద్ధములో విజయము దాని ప్రజలకు నిరుద్యోగసమస్యను మాత్రమే తెచ్చిపెట్టినది. ఇంతకుమునుపు ఇంజన్లు, ఇనుము బొగ్గు ఇంగ్లాండునుండి కొనుచుండిన ఫ్రాన్సు, తనకు జర్మనీనుండి రావలసిన నష్టపరిహారములకు బదులుగ, ఈ వస్తువులను, ఏ ఖరీదును లేకుండగనే, యిప్పుడా దేశమునుండి తెచ్చుకొనుచున్నది. ఈవిధముగ, ఓడిపోయిన జర్మనీదేశము రాత్రింబవళ్లు, నిరుద్యోగమన నేమో యెరుగక, పనిసందడితో గింగురుమనుచుండ, ఇంగ్లండు, ఫ్రాన్సు విక్రయశాలలను గోల్పోయి, విజయముచే గలిగిన దుష్ఫలితముల మూలమున నవస్థపడుచున్నది. ఏ వైపు చూచినను, ఇంగ్లండుస్థితిగతులు మిగుల దుఃస్థితికి వచ్చియున్నవి. నేడు, అధినివేశప్రతిపత్తి నాధారముగగొని, ఆంగ్ల రాజ్యాంగవేత్తలు హిందూదేశముతో సంధికివచ్చుచున్నారన్న, దాని యాశయము, ఒకవేళ హిందూదేశపు లాభమే యైయుండినను, ఆ వేగకు ఇంగ్లండు లాభములు గూడ నందిమిడియే యున్నవి. ఈవివరములన్నియు సాధారణముగ హిందూదేశపు రాజ్యాంగవేత్తలకు తెలియవు. ఇందు ఒక్కొక్కటియు కష్టసాధ్యమగు పరిశీలనముచే తెలిసికొ దగినది; ఒక్కొక్కటి ఒక్కొక్క అధ్యాయమునకు సరిపడినది. ఐనను, రోజురోజుకు, గంటకు గంటకు, హిందూదేశపు వాణిజ్యపారిశ్రామిక జీవితమును, ప్రతిని మేషమును, ఏపద్ధతుల ననుసరించి బ్రిటిషువారు కొల్లగొట్టుచున్నారో ఆ పద్ధతులను, ఉన్నవున్నట్లుగ, పైఘట్టములలో చిత్రించుటకు ప్రయత్నించితిమి. ఈ విధముగ గల్పింపబడిన యభిరుచి, అగాధమైన ఎడతెగని యాకర్షణశక్తిగలిగిన యీ విషయమునుగూర్చి, విశేషముగ భారతదేశపు రాజ్యాంగవేత్తలలో కుతూహలము గల్గింపవచ్చునని మాయాశ. వస్త్రములవిషయమున బ్రిటిషువారు హిందూదేశమున నవలంబించుచున్న నీతినిగూర్చి యేమియు వివరింపబడలేదు. అది ప్రత్యేకముగ నొకభాగము నాక్రమించును. ఐనను, కెప్టెన్ బెన్ గా రన్నట్లు "బ్రిటిషు లాభములకై హిందూదేశమును కొల్లగొట్టవలయునను నభిప్రాయము అంతరించిపోయిన"దనియు, "పరిత్యజింపబడిన"దనియు నాశించుకొందము.

## ప్రభువులసభ సభ్యులలో వ్యాపారస్థుల వివరములు

| వ్యాపారముల పేర్లు | డైరెక్టర్ల సంఖ్య | వ్యాపార సంస్థల సంఖ్య | అధ్యక్షులు, పరిపాలకులు ఉపాధ్యక్షులువీరిసంఖ్య |
|---|---|---|---|
| వ్యవసాయము | 7 | 6 | |
| బ్యాంకింగు [1] | 93 | 44 | 14 |
| మద్యపదార్థములు | 30 | 22 | 12 |
| సిమెంటు, కట్టడములసామగ్రి మొదలైనవి | 9 | 5 | |
| కాలువలు | 9 | 5 | |
| రసాయన పదార్థములు | 36 | 30 | 14 |
| ప్రత్తిపంట | 5 | 3 | |

1. ఒక బ్యాంకుకు 9 డైరక్టర్లు, తక్కినవానికి 5 డైరక్టర్లు, మరికొన్నిటికి 3 డైరక్టర్లు.

| | | | |
|---|---|---|---|
| ఓడరేవులు | 9 | 9 | |
| విద్యుచ్ఛక్తి, దీపములు | 26 | 20 | 6 |
| ఇంజనీరింగు, యాననిర్మాణము | 44 | 83 | 8 |
| వినోదములు | 10 | 9 | 4 |
| ధనకోశము[2] | 61 | 44 | |
| ఆహారపదార్థములు | 17 | 15 | 6 |
| వాయుపదార్థములు | 6 | 5 | |
| హోటళ్లు, వగైరాలు | 10 | 10 | |
| బీమా[3] | 131 | 68 | 29 |
| ఇనుము, బొగ్గు, ఉక్కు | 78 | 70 | 37 |
| భూములు[4] | 68 | 64 | |
| వాణిజ్యసంస్థలు | 8 | 8 | 6 |
| లోహములు | 9 | 9 | 5 |
| సంచారములు, గనులు, బంగారు వజ్రములగనులు మొదలైనవి | 68 | 68 | 21 |
| మోటార్లు, సైకిళ్లు మొదలైనవి | 12 | 12 | 6 |
| వార్తాపత్రికలు మొదలైనవి | 19 | 19 | 12 |
| నూనె[5] | 73 | 73 | |
| కాగితముల పరిశ్రమ | 6 | 6 | |
| తోటలు (టీ, రబ్బరు మొదలైనవి) | 20 | 18 | 9 |
| ఇనుపదారులు[6] | 67 | 45 | 25 |
| నౌకా నిర్మాణము | 8 | 8 | |
| ఓడవ్యాపారము[7] | 72 | 50 | 36 |
| తంతివార్తలు మొదలైనవి | 22 | 18 | 4 |
| నేతపనులు | 13 | 13 | 4 |
| ట్రాములు మొదలైనవి | 10 | 9 | 5 |
| నిధులు | 48 | 41 | 17 |
| ఇతరవ్యాపారములు | 72 | 67 | 19 |

అనువాదకుడు : ప్ర. రంగాచార్యులు

---

# భావనారాయణా!

పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

చపలస్వాంతుఁడ మోహసంగతుఁడ నాశాపాశబద్ధుండ దు
ర్వ్యపలాపుండను నీతిబాహ్యుఁడ మహాహంకారచేతస్కుఁడన్
గృపణాత్ముండను దుష్క్రియారతుఁడ సంకీర్ణాభిమానుండ నా
యపవిత్రత్వము రూపుమాపవలెనయ్యా! భావనారాయణా!

జపమంచున్ దపమంచు వేదమని శాస్త్రంబంచు నీమంత్రమే
జపియింపన్ దలపెట్టినాఁడ బహువిశ్వాసంబుతో నీవు నా
యపరాధమ్ము లడంచి సంసృతివిషాదాంభోధి దాటించినన్
గృపతోఁ జూడుము మోక్ష మీయు మికఁ దంద్రీ భావనారాయణా!

పరితోషమ్మును బాడుసేయుటకు నీ పాపిష్ఠకోపమ్ము నా
దరియంజెంద్రి తొలంగకుండెఁ బరమార్థంబెల్లఁ బాడాయె
సంస్కారణాచారము లేటిలోఁగలసె వాక్సారస్యమే పోయె నో
వరదా! నాగతి యేమి చేసెదవు దేవా! భావనారాయణా!

దురితాలాప కథావిధానములచే దోసంబు లార్జించి శ్రీ
హరినామ స్మరణం బెఱుంగక ముధాయాసమ్ముచేఁ జిత్తమున్

---

2 ఒక కంపెనీ 5 డైరెక్టర్లను గలిగియుండెను. మరి మూడింటికి ఒక్కొకదానికి ముగ్గురు డైరెక్టర్లుండిరి.

3 ఒక కంపెనీకి 10 డైరెక్టర్లు, మరిరెంటికి ఒక్కొక్కదానికారుగురు, ఒకదాని కైదుగురు, మరి నాల్గింటికి ఒక్కొక్కదానికి నలుగురు.

4 ఈ 64 కంపెనీలలోను 21 జమీందారీలు

5 షేర్ స్టైడ్ ప్రభువు ఇందు 45 కంపెనీలలో డైరెక్టరు

6 వీనిలో 29 విదేశములకు జెందినవి

7 కైల్సంట్ ప్రభువు 42 కంపెనీలకు డైరెక్టరు

బరితాపమ్ముల పాలఁద్రోచిన మహాపాపాత్ముఁడన్ శ్రీహరీ!
శరణంబంటిని బ్రోవుమంటి జగదీశా! భావనారాయణా!

లోకుల్ గాకులు వార లొక్కపరి సంశ్లోకింతు రొక్కప్డు చె
వ్వాకు ల్వాగుచు దూరుచుంద్రు చపలవ్యాపారు లవ్వారు లో
కైకత్రాణపరాయణా! శరణ మీవే నాకు నాతండ్రి! నీ
శ్రీకారుణ్య సుధారసం బొసఁగవే శ్రీభావనారాయణా!

చలియం చాతపమంచు వర్షమని కష్టంబంచు లెక్కింపకే
పలుపాట్లం బడు మౌని సత్తములె దుష్ప్రాపంబు నీతత్వమున్
దెలియంజాలక క్రిందుమీదులయి యంధీభూతులై యుండ నీ
చల చేతస్కుని వృత్త మేమనెదు శ్రీశా! భావనారాయణా!

కలికాలమ్మున నీవొకండవు మహాకారుణ్య సంపత్తితో
వెల లేకుండ లభించు పెన్నిధివి హృద్వీథిన్ వసింపంగ నా
కిలలో నింత సుఖంబు గల్గెఁ బరమం దింకెంత సౌఖ్యమ్ము రాఁ
గలదో నేను వచింపఁజాల శ్రితభక్తా! భావనారాయణా!

ఆలుం బిడ్డలు బంధువుల్ ధనములం చాసక్తిమై నేడ్చి త
ద్వ్యాలోలత్వముచేతఁ బోషణముకై దాస్యమ్ము లెన్నెన్ని యో
కాలాకాలము లేకచేయుచు భవత్కైంకర్య భాగ్యంబు దు
ష్టాలాపాత్ముఁడు బొందలేఁడు జగదీశా! భావనారాయణా!

తొలిజన్మంబునఁ జేసినట్టి భగవత్పూజావిశేషంబుచేఁ
దలపంగల్గెను నీదునామ మిపు డాత్మన్ నాకు నాతండ్రి! ని
ర్మలినంబైన ప్రభావమేర్పడ సుషుమ్నాద్వారమందుండు నీ
వెలుఁగుంజూపి తమంబుమాపుటకు రావే? భావనారాయణా!

క్షణకాలమ్మున కొక్కరీతిగను సంకల్పంబు లేతెంచి పై
క్షణమందే వ్యథ లుద్భవించి విగతస్వాంతుండనై యుంటి నా
క్షణమాత్రంబులు చంచలంబులగు మాయాలిప్స లింకేల? నీ
ప్రణవమ్మున్ జపియించు వైభవము దప్పన్ భావనారాయణా!

ధరపైనాదు శరీర ముండువఱకున్ దైన్యంబు దుఃఖంబులున్
బరితాపంబులు రోగము ల్గలుగకుండన్ జేసి త్వన్నామసం
స్మరణావేశమునందు నామదిని సంస్థాపించి సంతోష సం
భరిత స్వాంతునిఁ జేయఁగావలయు నప్పా! భావనారాయణా!

అమలాచారపరాయణాత్ములకు నాయాసంబుఁ గల్పించు నీ
విమతాచారుల దుర్వివేకులను దుర్వీర్యాఢ్యులన్ దుష్టులన్
శమనంబుం బొనరించి సజ్జనుల కాశాస్యంబు లీడేర్చి సం
ప్రమదాంభోధిని ముంచి తేల్పవలె నప్పా! భావనారాయణా!.

---

౭ తాబుఖా.



చిత్రము 3

# యతిప్రాసలు

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

ఈ యతిప్రాసలను గూర్చి ఆధునిక పండితులలోను, కవులలోను భిన్నాభిప్రాయములున్నవి. కావలయు ననువారు కొందఱు, వలదనువారు కొందఱు. మొదటి తెగవారు తెల్పు అభిప్రాయములు ఇవి:—

'ప్రాచీనులు యతిప్రాస లుంచుకొని గ్రంథములు రసవంతములుగాఁ జెప్పియుండలేదా? వారు సమర్థులగు సర్వతోముఖపండితులు గనుక యతిప్రాసములకు జంకరైరి. ఆధునికులు భాషాపరిశ్రమ లేనివారగుటచే కాశికిఁ బోయిన వారు ఇష్టములేని శాకఫలాదులను విసర్జించునట్లే తమకుఁ గష్టముగానున్న యతిప్రాసలు విడువనెంచుచున్నారు. నదికిఒడ్డులువలెఁ బద్యమునకు యతిప్రాసలు ముఖ్యములు.'

అని. వీరు కేవలప్రాచీన సాంప్రదాయికులు. నూతన సంప్రదాయవాసన బొత్తుగా గిట్టనివారు.

నూత్న సాంప్రదాయికులలోఁ గూడ నొకతెగ వారు యతిప్రాస లుండవలెననియే వాదింతురు. కాని వారు తెలుపు క్రొత్తయుక్తు లేమియు లేవు.

కూడదనువారు తెలుపు అభిప్రాయము:—

'కవిత్వమునకు రసము ప్రధానము. 'వాక్యం రసాత్మకం కావ్యం' అని సాహిత్యదర్పణకారుఁడును, 'సాధ్యో హి రసో యథా తథం కవిభిః' అని ఆంధ్ర శబ్దచింతామణి కారుఁడునుఉచ్చకంఠములతోఁ జాటుచున్నారు. యతిప్రాసలురసోత్పాదకములుగావు. ప్రత్యుత కొన్నిచోట్లరసభంజకములునుఅగుచున్నవి. మఱియుఁ గవిత్వమునకునిర్బంధములుగూడవు. యతిప్రాసలు నిర్బంధములలోఁ జేరినవి. పంజరములోని పిట్టవలె భాషానిర్బంధములలో బద్ధుఁడై కవి గిలగిల కొట్టుకొనును. వానికి స్వాతంత్ర్యము కావలెను. ఆంధ్రమునందువలె సంస్కృతమున యతిప్రాసలు లేవు. అందు రసస్ఫూర్తి కలుగుటలేదా? ఆంగ్లమునను గొంతమంది మహాకవులు నియమోల్లంఘనముఁ జేసి వ్రాసిన కావ్యములు రసవత్తరములుగా నుండలేదా? కనుక యతిప్రాసములు తీసివేసినచోఁ గవిత్వమునకు హాని రాదు. అది కావ్యము కాకపోదు. యతిప్రాసము లున్నంత మాత్రముననే అది పద్యము కాదు. రసవంతమగు పద్యమును, గద్యమును గవిత్వమే. 'అయినచో పద్య మేల వ్రాయవలెను? రసవంతమగు గద్యమే వ్రాయరాదా? పద్యము వ్రాసినపుడు యతిప్రాసము లుంచరాదా' అందురా? అది ప్రశ్న గాదు. కవికిఁ దోఁచిన భావము పద్యమునందు గణనియమమును బొంది యొకవిధమగు సంగీతమునకు బద్ధమై చిత్తాకర్షకతను వహించి మాధుర్యమును గూర్చుచున్నది. గద్యమునందు గణనియమము లేకపోవుటచే సంగీతమునకు బద్ధముకాక చిత్తాకర్షణ శక్తి లేనిదై రసస్ఫూర్తియందుఁ గొఱవడియున్నది. మఱియు నొకటేభావమును గద్యమునందును, బద్యమునందును వ్రాసి చూడుడు. అప్పుడు మీప్రశ్నకుఁ గల విలువ మీకే తెలియఁగలదు. కనుక యతిప్రాసలు తీసివేసినచో రసపిండములగు కావ్యములు వెడలుననుట నిస్సంశయము.'

అని. ఈమతములం దున్న సత్యాసత్యములను మనము విచారింపవలెను. అందు ముందు ఈ యతిప్రాసల

నియమము ఇతర భాషలలోఁగూడఁ గలదా? మన భాషయందు వీనిని నియమించిన వారి అభిప్రాయ మేమి? వారి అభిప్రాయ మెంత సమంజసము? అను విషయమును బరిశీలింతము.

సంస్కృతభాషలో యతి, విశ్రాంతి, విరతి, విశ్రామము మొదలగునవి పర్యాయ పదములు. 'యతిర్విశ్రామసంజ్ఞికా' అని లక్షణము చెప్పఁబడినది. అనఁగాఁ బద్య పాదమును రెండుభాగములుగాఁ జేసి మొదటిభాగము చివర ఆపుట. రెండుభాగములును ఏకసమాసాంతర్గతములై కూడ నుండవచ్చును. కాని ప్రథమభాగాంతాక్షరమును, ద్వితీయ భాగాద్యక్షరమును ఏకపదగతములై యుండరాదు. కాని ఆంధ్రమందువలె సంస్కృతమున అక్షరమైత్రి లేదు. మఱియు సంస్కృతమున ప్రాసమేలేదు. కాని అంత్యప్రాసము గలదు.

"వృద్ధోయాతి గృహీత్వా దండం
తదపి న ముంచ త్యాశాపిండమ్."

ఇట్టి స్థలములందు అంత్యప్రాసము ఆంధ్రమందు పోతనకవిత్వమునందువలె హృద్యముగా నుండును. నిజమునకు మామూలుప్రాసముకంటె అంత్యప్రాసము శ్రావ్యతరముగా నుండును అని నాతలంపు. ద్రావిడ కర్ణాటకభాషలలోఁ గూడఁ బ్రాసనియమము గలదు. కాని యతి నియమము లేదు. "కన్నడక్కె యతి యిల్ల, కోణక్కె మతియిల్ల" అను కన్నడపు సామెత గలదు. అనఁగా కన్నడమునకు యతి లేదు, దున్నపోతునకు మతిలేదు. అని అర్థము. ద్రావిడభాషయందును యతి లేదు. ఈ ప్రాససంప్రదాయము ద్రావిడ కర్ణాటకభాషల నుండియు, యతి సాంప్రదాయము గైర్వాణము నుండియు వచ్చి యుండునని నాతలంపు. యతికి సంస్కృతమునందు వలెనే ఆంధ్రమునందును స్థాననియమ మేర్పఱచిరి కాని ప్రథమభాగాంతాక్షరమును, ద్వితీయ భాగాద్యక్షరమును ఏకపదగతములై యుండరా దను నియమమును బాటింపరైరి. ఆంధ్రభాషలో ఈయతిప్రాసముల నేర్పఱచినవారి అభిప్రాయము ఏమయియుండుననన్నచో, ద్రావిడ కర్ణాటక భాషలకంటె నియమ బాహుళ్యముచే గొప్పదనము కలుగునని.

ఈ యతిప్రాసములవలన రసస్ఫూర్తి కలుగునా? అనునది యొక ప్రశ్న. తెలుఁగుభాషలోఁ బెక్కుసామెతలు యతిప్రాసములు గలిగియుండి రసస్ఫూర్తినిఁ గలిగించుచున్నవి.

అంగిటిలో అన్నీ ఉన్నవి-అల్లునినోట శని ఉన్నది.
అప్పు లేకపోతే-ఉప్పు గంజి మేలు.
అన్నీ ఉన్నవి-ఐదోతనము లేదు.
ఉభయభ్రష్టత్వం-ఉపరిసన్న్యాసం.
బ్రాహ్మణులలో చిన్న-బెస్తలలో పెద్ద.
చచ్చినా వైకం దప్ప-దచ్చమ్మా నను తిట్టకు.

ఇట్టి తావులందు యతిప్రాసలు రసోత్పాదకములు గావని యెవరును జెప్పరు. రసోత్పాదక మనఁగా సౌందర్యోత్పాదకము అన్నమాట. ఈసామెతలందువలె ఆంధ్ర పద్యములందు యతిప్రాసలు రసోత్పాదకముగా లేవు. దీనికిఁ గారణములు మూఁడు:

౧. ఏ అక్షరమున కా యక్షరమును యతిస్థానమందుంచకుండుట;

౨. యతిస్థానము సంస్కృతమునవలె విభక్తను గాకుండుట;

3. పాదమునకుఁ బాదమునకు ప్రాసాక్షరము దూరమై యుండుట.

ప్రాసాక్షరము సమీపమం దున్నచో అను ప్రాసమునందువలె ఇంపు గలుగును. దూరముగా నున్నచోఁ గలుగదు. ఇప్పటి యతులలో వర్గయతి యొక్కటియే శ్రావ్యతను గలిగించును గాని మఱేదియుఁ గలిగింపదు. సంస్కృతమునందును గొన్ని స్థలములం దీయతి పైసామెతలందువలెఁ గనఁబడుచు శ్రవణసుఖము నిచ్చుచున్నది.

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే.

అథప్రజానా మధిపః ప్రభాతే.

నారాయణాయ నళినాయతలోచనాయ.

కనుక యతిస్థానమును విభక్తము గావించి ఏ యక్షరమున కా యక్షరమును యతిగా నుంచినచో యతి శైలికి సొంపు నిచ్చి తద్ద్వారా రసోత్పాదనము కావచ్చును.

ఇఁకఁ బ్రాస. నాలుగుపాదములకు ఏకాక్షరమునే నియమించుట మాని అదేపాదమునందు దగ్గరగా నేర్పఱిచినచో శైలికి సొంపును, తద్ద్వారా రసమునకు ఉపస్కారమును గాఁగలదు ఎట్లన,—

ఉ. అంతట సంతసంపడుచు
అంబురుహానన వచ్చి భర్తపా
దమ్ముల కాదర మ్మెసఁగ
దండము పెట్టియుఁ బల్కె నోప్రియా!
కన్నులకర్వు దీఱ నిను
కాంచుట యెన్నఁడు కల్గు నంచు నా
దేవుని వేవిధంబులను
దైన్యముతో సతతంబు వేఁడితిన్.

ఈ పద్యములో ౧, ౨, ౪, పాదములలో ప్రాసాక్షరమునకు సమీపమందే ప్రాసము వేయఁబడినది. మూఁడవ పాదములో ప్రాసము లేదు. ఉండఁగూడదని నియమము కాదు. 'కన్నుల కర్వు దీఱ' అనునది జాతీయము. ప్రాసకొఱకు దానిని విడిచివేయుట రసభంజకమగును. కనుకఁ దీసివేయఁబడినది. మఱియును గద్యమునకును, పద్యమునకును ఒక్కటే వ్యాకరణ ముండుట యుక్తమని తోఁచదు. కవికి గద్యమునందుఁ గల స్వాతంత్ర్యము పద్యమునం దుండదు. గణనియమమునకు దాసుఁడై యుండవలయును. అందుచే గద్యమునవలెఁ గాక భాషను స్వతంత్రముగాఁ ద్రిప్పుకొనవలసి యుండును. అట్టి సమయములందు విసంధి మొదలగునవి దోషములు కావనియు, యతి మొదలగువాని స్పష్ట శ్రవణమునకై విసంధి మొదలగునవి తప్పక ఉండుటయే మేలనియుఁ దోఁచుచున్నది. కనుకనే పైపద్యములో విసంధి చూపఁబడినది. గద్యపద్యములకు ఒకటే వ్యాకరణము గూడదను పరిభాషకు పూర్వకవుల వ్యాకరణవిరుద్ధ ప్రయోగములే జ్ఞాపకత్వము వహించుచున్నవి.

ఆంధ్రకవిత్వమునకు యతిని నియమించిన లాక్షణికులు పు ఫు బు భు ము-లకుఁ బరస్పరము మైత్రి చెప్పి ఫ ఫ బ భ మ-లకుఁ గూడ దనిరి. ఈయక్షరములు ప్రత్యేకముగా వారికిఁ జేసినమహోపకార మేమియో తెలియదు. మఱియును మైత్రినిజెప్పుటలో వ్యంజనములకు స్వరసాహిత్యము యొక్కమైత్రియు నిర్బంధముగా విధించిరి. పైసామెతలలో 'బ్రాహ్మణులలో చిన్న బెస్తలలో పెద్ద' అను సామెతలో 'బా బె'లకు యతి చెప్పఁబడినది. అందువలన రసభంగము అగుటలేదు. రసభంజకము కానప్పుడు స్వర మైత్రి యేల అవశ్యముగా నుండవలెనో తెలియకున్నది. కాని దయాపరులగు లాక్షణికులు యతులలోవలెనే ప్రాసములందును స్వరమైత్రిని విధింపక కవికి స్వాతంత్ర్య మిచ్చినందులకుఁ గవి వారికిఁ గృతజ్ఞత చూపవలెను. కనుకఁ బైని నేను సూచించినటులు యతిప్రాసములు పద్యమునకు సౌందర్యము నిచ్చు ననుటలో సందేహము లేదని నా మతము. ఒకానొకచో రసముకొఱకు యతిప్రాసములు విడిచినను హాని లేదు ("కన్నుల కర్వు దీర" యందువలె). ఈవిషయమున నావ్రాసినపద్యముల నిందుదాహరింతును:

క. శ్రీకృష్ణదేవరాయ
క్ష్మాకాంతుని జన్మదినము మన రాజేశ
క్ష్మాకాంతు నాధిపత్యము
మాకుం బండుగలమీఁదఁ బండుగలుగదా.

మ. కనుచుండంగనె తెంపి యెల్ల విభులన్
గల్పించెఁ బూఁజెట్టు నా
తన వైభవ్యముఁ గొన్న బాలఁగ దయా
దాక్షిణ్యముల్ మాని, ఆ

తని కీక్రౌర్యము కాదు కూడదని బో
ధల్ సేయదో? అంతరా
త్మ నిగూఢంబుగ, నంతరాత్మయును లే
దో? వానికే లేశముఁ?

ఈ రెండు పద్యములందును నాలవపాదమునందు యతి భ్రష్టమయినది. కాని అది పోయినదని చెప్పవలెకును దోఁపదు. ఏలన, అందలి భావసౌందర్యము పైకి హృదయము పోవునుగాని యతి పైకిఁ బోదు.

మనము పద్యము చదువఁగానే బాగుగానున్నదని చెప్పుదురనుకొనుఁడు. వారిలో ఎంతమంది రసమునకానందించుచున్నారో, యతిప్రాసముల కెంతమంది ఆనందించుచున్నారో విచారింపుఁడు. పైని మొదటి పద్యములోని 'పండుగలమీఁదఁ బండుగలు' అనునది నానుడి. మాకుఁ అను మకారముతో యతి సిద్ధించుటకై యీ నానుడిని ఎగురఁబెట్టుట భావ్యమా? నానుడి ద్వారా సిద్ధించుసౌందర్యముకొఱకుయతినిఁదీసివేయుట యుక్తమా! లాక్షణికులారా! యోజింపుఁడు. మీరొకవేళ "పండుగలమీఁదఁబండుగలుగదా" అనుదానిని యతిత్వసిద్ధికై "మంగళముమీఁద మంగళముగదా" అని యనరాదా? అప్పుడు సౌందర్యము చెడదుగదా అనవచ్చును. మంచిది. కాని "పండుగలమీఁదఁ బండుగలు" అను నానుడిలో నున్న సౌందర్యము "మంగళముమీఁద మంగళముగదా" అనునుడికారములో లేదని నా తలంపు. ఏలన, రెండవది మొదటిదానికి సంస్కృతీకరణము. ఈ రెంటికిని సహజమునకును, కృత్రిమమునకును గలభేదమే యుండును.

ఇఁక రెండవ పద్యములో నాల్గవపాదమునందు యతిత్వసిద్ధికై 'లేదో'అనుదానిని 'లేదా' అనరాదా అని మీరడుగవచ్చును. మంచిది. కాని 'లేదా' అనునప్పటి అర్థము వేఱు, 'లేదో'అన్నప్పటిఅర్థము వేఱు.అర్థముమాఱినచో అందము చెడును. దానితో రసభంగము. కనుక యతిత్వసిద్ధికై భిన్నార్థమును గలిగించి రసభంగముఁ జేయుట న్యాయ్యమా? యతిభగ్నమైనను రసము పోషించుట న్యాయ్యమా? విచారింపవలెను. కవిత్వమునకు జీవితము రసమని ఎల్లరును అంగీకరింతురు. మీరును భిన్నమని చెప్పరు. ఇట్టి యిక్కట్టులు గలిగినప్పుడు వృత్తమునే మార్చుకొని నానుడులు పోకుండను, భిన్నార్థకము రాకుండను, మఱియొకవృత్తములో వ్రాయరాదా అని మీరడిగినచో, లక్షణమునందుఁ గల అభిమానముచేఁ జెప్పుచున్నారు గాని రసదృష్టితోఁ గాదని విస్పష్టము.

అదియుఁగాక కవి పద్యమును ప్రారంభించినపుడు ఫలానిపద్యమును వ్రాయవలెనని యనుకొనఁడు. అప్రయత్నముగా నేదో పద్యము ప్రారంభింపఁబడును. దానిని నడపుచున్నప్పు డిట్టి నానుడి తోఁచఁగానే అది ఆపద్యమునకు సరిపోయి యింపుసొంపుగాఁ, గేవల యతిప్రాససిద్ధికొఱకు సౌందర్యమును ధ్వంస మొనర్చి పద్యమంతయు మార్చి, అట్లు సరిపోవు వృత్తములో వ్రాయుమనుట కేవల లాక్షణికులకుఁ జెల్లును గాని కవులకుఁ జెల్లదని నామనవి. కనుక నానుడులకు భంగము వాటిల్లునపుడును, భిన్నార్థము చే రసభంగమగునపుడును, మఱేవిధముగాఁగాని రసము తగ్గునపుడు ఔచిత్యమునకు లోపము రాకుండ లక్షణమును ద్రోసిరాజని రసమును బోషించుటయే నిజముగా కవికి అర్హాకృత్యము.

యతిప్రాసలు తీసినంతమాత్రమునఁ జాలదు. అదియంతయుఁ గవిత్వము కాదు. యతిప్రాసలు లేని కొఱంతలేకుండ రసము గుఱిపింపవలెను. అప్పుడుగాని ఆకవిత్వము కవిత్వము గాదు. నిశ్చయమునకు నిర్బంధము లున్నప్పటికంటె లేనప్పుడే కవికిఁ గష్ట మెక్కువయని నా యభిప్రాయము. అప్పుడు పద్యమునందు ఒక్కవ్యర్థపదమున్నను రోఁత పుట్టించును. ఇప్పుడు యతిప్రాసస్థానము లందలి వ్యర్థపదములతో సగము పద్యము నిండియున్నను అడుగువారు లేరు. యతిప్రాసములు తీసివైచిన వైలక్షణ్యము కవిత్వమునఁ జూపవలెను. కానిచో లాభము లేదు. కావున యతిప్రాసము లుండుటయే ఆవశ్యక మని యెంచినవారు పైమార్పులు చేసికొన్నఁగాని వానివలన సౌందర్యస్ఫూర్తి

కలుగదు. మఱియు యతులలో వర్గయతిని మాత్రము స్వీకరించి దానిపై స్వరమైత్రిని విసర్జించుటయు నర్హము.

యతులు తీసివేసి వ్రాసిన నాపద్యములఁ గొన్ని యిట నుదాహరింతును:

దీ్వపాంతరవాసము

గీ. భటులు నాపేరు పెట్టి ముమ్మారు పిలిచి
రేను దద్ధర్మసభ కేఁగి కేలుదోయి
కట్టుకొని ప్రాడ్వివాకుని కట్టెదుటను
నిలిచి యుంటిని గుండెలు కొట్టుకొనఁగ.

గీ. వారు నను గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నముల మీఁదఁ
బ్రశ్నములు వేసి దోషిగా నిశ్చయించి
నాకు ద్వీపాంతర ప్రవాసంబు శిక్ష
వేసి పంపిరి నే నెంత మొత్తుకొన్న.

సీ. ఒకసారి రెక్కల నూఁగించుచును మింటఁ
బఱచెడు పులుఁగుల బంతిఁ గాంచి
ఒకతేప వాత్యా విఘాతంబులై కదుం
గడుఁ బొఱలెంచు మేఘములఁ గాంచి
ఒకమా రనంతసాగరము భేదించి యా
వలిగట్టు చేరు నావలను గాంచి
ఒకసారి యంత్ర సామగ్రీబలంబుచేఁ
జదలఁ బర్విడు విమానములఁ గాంచి

గీ. తద్గతుల నభ్యసింపంగఁ దలఁచి తలఁచి
బిక్క మొగమునఁ బరికించి దిక్కు లకట!
దుర్మనాయమానుండనై త్రొట్రుపడుచు
సంచరించుచు నుంటి నీస్థలమునందె.

గీ. ఇంక నీజన్మతో నాకు శిక్ష దప్పి
నీముఖాంభోజమును గాంచి యెల్లవేళలు
మఱచి ముచ్చటలను నాడు కొనుచునుండు
భాగ్య మది నాకుఁ బట్టునే ప్రాణసఖుఁడ!

ఇందు మనుష్యజన్మము ద్వీపాంతరవాస శిక్షగా రూపించి యందున్న శిక్షితుఁడు తనో్మతమునకు అవస్థ పడుట చెప్పఁబడినది.

ఇందు కొన్నిస్థలములందు యతి అప్రయత్నముగాఁ బడినది. అట్లు రానిచోఁ బ్రయత్నింపఁబడలేదు.

యతిప్రాసములు తీసివేసినచో హాని లేదని నామతము. మంచికావ్యములు వ్రాయవచ్చునని నామతము.

---

# రాజశేఖరుని హారవిలాసము

శ్రీమాన్ యీయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు
(ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషదధ్యక్షులు, విజయనగరము)

రాజశేఖరుఁడు సంస్కృతసారస్వతరత్నాకరములోని యనర్ఘరత్నములలో నొకఁడు. ఇతఁడు బాల్యమునుండియుఁ గవితావనితాప్రియుఁడు. ఇతఁడు బాలకవి కవిరాజ బిరుదలాంఛితుఁడని తన్నిర్మిత 'కర్పూరమంజరీ సట్టకము' ('బాలకవిః కవిరాజః'. I-9)వలనఁ దెలియుచున్నది. ఇతఁడుబహుగ్రంథనిర్మాత; తద్గ్రంథములలో బాలభారతము (ప్రచండపాండవము),[1] బాలరామాయణము,[2] విద్ధసాలభంజిక[3], కర్పూరమంజరి[4] యను రూపకములును, కావ్యమీమాంస[5] యను సాహిత్యాలంకార గ్రంథమును సూర్యాలోకముం బడసినవి. భువనకోశ[6]మను భౌగోళికగ్రంథమునుగూడ నితఁడు రచించినట్లు రాజశేఖరునివలననే తెలియుచున్నది. ఇతఁడు బహుభాషాపారావారపారీణుఁడనియు, వివిధప్రబన్ధనిర్మాణచణుఁడనియు, రసభావనిరంతర కవితాకుశలుఁ డనియు ధృఢవ్యుత్పత్తిసంపాదనచణములగు నీతని గ్రంథములవలనఁ దెలియుచున్నది.

రాజశేఖరుని వృత్తాంతము సమగ్రముగఁ బూర్వోల్లి గ్రంథపీఠికలవలనఁ దెలియనగు. ప్రాసంగికమును వదలి కృత మనుసరింతము.

రాజశేఖరుని మహాప్రబన్ధమగు 'హారవిలాసమ కాలప్రవాహమున నంతరించినది. రాజశేఖరుని 'హా విలాసము' కవిన'మాఙ్కితమగు కావ్యమని హేమ ద్రుఁడు 'కావ్యానుశాసనవివేకము' (Kavyamala, N 71, 1901) లో (3?5వ పుట) నుడివి యున్నాఁడు:—

"స్వనామాఙ్కితా యథా రాజశేఖరస్య హారవిలాసే.

మఱియు హేమచంద్రుఁ డీమహాప్రబన్ధప్రథమసర్గస్థ శ్లో ముల రెండింటి నుల్లేఖించి యున్నాఁడు:—

1. "ఆశీ ర్యథా హారవిలాసే:—
'ఓమి త్యేకాక్షరం బ్రహ్మ
శ్రుతీనాంముఖ మక్షరం,

1. 'Kavyamala', No. 4. (Nirnayasagar Press, Bombay, 1887.) Edited by Pandit a Durgaprasada an Kasinatha Panduranga Farab. Also by Capeller under the name of 'Pracandapandava' Strassburg, 1885.

2. Published by E. J.Lazarus & Co., Medical Hall Press, Benares. Also by Pandit Jivanan Vidyasagara, B. A., (with com.) Calcutta.

3. Edited with a com. by Pandita J. Vidyasagara, Calcutta, 1883.

4. 'Kavyamala', No. 4. (N. S. P. Bombay, 1887.) Also critically edited in the original 'Prakrt', with index and an essay on the life and writings of the poet, by Sten Konow, and translated into English with no by C. R. Lanman (Harward Oriental Series).

5. Edited with introduction and notes by C. D. Dalal and R. Anantakrishna Sastry. Re-issue (c rected): Baroda, 1924, 'Gaekwad's Oriental Series', No. 1. For information about the poet and his wor the curious student is also referred to Dr. S. K. De's 'Sanskrit Poetics' in 2 volumes, and Prof. P. Kare's 'History of Alankara Literature', Bombay, 1923.

ప్రసీదతు సతాం స్వాన్తే
శ్వేకం త్రిపురుషీ మయమ్.' "

2. "సుజనదుర్జనస్వరూపం యథా హారవిలాసే:—
'ఇత స్తతో భషు న్భ్రారి న పతే త్పిశునః శునః,
అవదాతతయా కిఞ్చి న భేదోఽహం సతః సతః.'"

3. ఉణాదిసూత్రవృత్తిలో నుజ్జ్వలదత్తుఁడు 'హారవిలాసము'లోని శ్లోకార్థము నుల్లేఖించెను:

"దశాననశక్తి స్తఖురప్రఖణ్డితః
క్వచి ద్గతార్థో హారదీధితి ర్యథా."(ఇతి'హారవిలాసే.')
II-28.

4. ఉజ్జ్వలదత్తుఁడు శివపర్యాయపదములు గల యొక యర్ధశ్లోకమును రాజశేఖరుని దని యుల్లేఖించి యున్నాఁడు:

"చణ్డీకాన్తో భగాలీచ లేలిహానో వృషధ్వజః."
II-76.

ఈశ్లోకార్ధము 'హారవిలాసము'లోనిది కావచ్చును; లేదా రాజశేఖరుఁ డొక నిఘంటువును నిర్మించెననియు, ప్రకృతము లుప్తప్రాయమగు నానిఘంటువులోని దీయాకరమనియు మన మూహింపనగును. ప్రకృతోపలభ్యము లగు రాజశేఖరగ్రంథములకంటెఁ దన్నిర్మితములగు నితర గ్రంథములు కొన్ని లుప్తప్రాయము లాయెనని తోఁచెడి.

5. భోజదేవుని'సరస్వతీకణ్ఠాభరణము' (II పరిచ్ఛేదము)లోని యీక్రిందిశ్లోకము (రాజశేఖర నామాఙ్కితము) 'హారవిలాసము'లోనిదని విద్వదభిమతము:

"అష్టపత్రమేవ కవినామాఙ్కం యథా:

'శ్లో. రాతావ ద్వ్యాధిరాజ్యా విసరరరసవి
ద్వ్యాజవాక్ తుష్మపకారా
రాకాపతుష్మభశేషానయననయన
స్వాస్వయా స్తవ్యమారా,
రామావ్య స్తస్థిరత్వా త్తుహినననహితుః
శ్రీః కరతూరదారా
రాధారతుస్తు మహ్యాం శివ మమమవశి
వ్యాలవిద్యావతారా.

నిర్విష్టాష్టదలన్యాస మిదం పాదార్ధ భక్తిభిః,
అస్పృష్టకర్ణికం కోణైః కవినామాఙ్క మమ్బుజమ్.

తత్రాఙ్కో రాజశేఖరకమలః."—'స. క.' (II పరి. 261 పు. ద్రావిడ వీరేశ్వరశాస్త్రి ప్రకాశిత ప్రతి; జైన ప్రభాకరముద్రణాలయము, కాశీ.) రాజశేఖరుఁడు 'కవిరాజ' బిరుదము నధిగమించినపిమ్మట నీ 'హారవిలాసము'ను విరచించి యుండును. జల్హణసంగ్రథిత 'సూక్తిముక్తావళి'లో రాజశేఖరున కారోపితము లగు విశేషకవిప్రశంసాశ్లోకము లీ 'హారవిలాసము' లోని మొదటిసర్గలోనో, తుదిసర్గలోనో యుండి యుండవచ్చునని ప్రాచ్యసారస్వత పరిశోధకులు నుడువుచున్నారు. సామాన్యముగాఁ గవివంశాదికముఁ, బూర్వకవిప్రశంసయుఁ గథాఖ్యాయికలగు (బాణుని) 'హర్షచరితము', (ధనపాలుని) 'తిలకమంజరి', (సోడ్ఢలుని) 'ఉదయసున్దరీకథ' మొదలగు వానిలోఁ గానవచ్చుచున్నవి. మహాకావ్యములలోఁ గూడఁ బ్రాచీనకవిప్రశంస లేకపోలేదు. మంఖకుఁడు 'శ్రీకంఠచరితము'లోఁ బ్రాక్కాలికులును,సమకాలికులు నగుకవీశ్వరులఁ బ్రశంసించి యున్నాఁడు. సోమేశ్వరకవి 'కీర్తికౌముది' (I స.) లోఁ బూర్వకవులఁ బ్రశంసించి యున్నాఁడు. హేమచన్ద్రుని గురువగు దేవచన్ద్రుని 'శాన్తినాథచరిత'మను ప్రాకృత ప్రబన్ధములోఁగూడ నీప్రాచీన కవీశ్వర సంస్మరణము గానఁబడుచున్నది.

శైవకావ్యమగు 'హారవిలాసము'ను విరచించుటచే రాజశేఖరుఁడు వీరశైవుఁ డేమో యని తోఁచును. కాని 'కావ్యమీమాంస' లో (42, 43పు.) నుల్లేఖింపఁ బడిన విష్ణుప్రశంసాత్మకములగు శ్లోకములం బట్టి విచారింపఁగా రాజశేఖరుఁ డేకమతాభినివేశము గలవాఁడని తోఁచదు. రాజశేఖరోద్ధృతమగు విష్ణుస్తుతి పరమగు నొక శ్లోకము నుట్టంకించెద:—

శ్లో. "ఇతి వికసతి తస్మి న్నన్వవాయే యదూనాం
సమజని వసుదేవో దేవకీ యత్కలత్రమ్,
కి మపర మథ తస్మాత్ షోడశస్త్రీసహస్ర
ప్రణిహితపరిరంభః పద్మనాభో బభూవ."
—'కావ్యమీమాంస.'( IX అధ్యాయము; 42 పు.)

"ఓ మిత్యేకాక్షర" మ్మను 'హరవిలాస' మంగళ శ్లోకమువలన రాజశేఖరుఁడు త్రిమూర్త్యైక్యమునందు నమ్మకము గలవాఁడని తెలియుచున్నది.

సోమదేవుఁడు 'యశస్తిలకచంపువు' లో నిట్టులు వ్రాసియున్నాఁడు:—

"తదా ఉర్వ భారవి భవభూతి భర్తృహరి భర్తృమేణ్ఠ కణ్ఠ గుణాఢ్య వ్యాస భాస వోస కాలిదాస బాణ మయూర నారాయణ కుమార మాఘ రాజశేఖరాది మహాకవి కావ్యేషు, తత్రతత్రావసరే భరణప్రణీతే కావ్యాధ్యాయే, సర్వజనప్రసిద్ధేషు తేషుతే షూపాఖ్యానేషుచ, కథం తద్విషయా మహతీ ప్రసిద్ధిః."
—' యశస్తిలకచంపువు.' (IV ఆ. 2 భా. 113 పు.)

ఈ యాకరమువలన రాజశేఖరుఁడు సర్వమతములయందు సమానప్రతిపత్తి గలవాఁడనియుఁ, బ్రత్యేకము జైనులవిషయమై విశేషప్రతిపత్తిం జూపినట్లే యీతఁడు ప్రతి మతమునందును దుల్యప్రతిపత్తి గలవాఁడనియుఁ దెలియుచున్నది. దేవతాంతర, సాధనాంతర, మంత్రాంతరములు వర్జనీయము లను విశిష్టాద్వైత ప్రపత్తి కీ సర్వమత సమానప్రతిపత్తి విలక్షణముగా నుండును. కాని, 'ఉదార చరితా నాంతు వసుధైవ కుటుంబక' మ్మని కదా సూక్తి! రాజశేఖరుని 'హరవిలాస'మెన్నఁడు సూర్యాలోకముం బడయునో! శ్రీనాథకవిసార్వభౌముని (యాంధ్ర) 'హరవిలాసము' ప్రచుర ప్రచారము గలది యగుట నిట దానిం బ్రాసంగికముగానైనం బ్రశంసింప నవసరము లేదు. కాలాంతరమున నిట్టి విస్మృత సంస్కృతకావ్యావళింగూర్చి ప్రసంగించెదను.

---

# అమరావతీ స్తూప చిత్రములు



చిత్రము ౫ అ



ఆ

# కన్నడ వాఙ్మయములోని ఆంధ్రకవులు

పెనుమర్తి వేంకటరత్నము గారు

౧

దాక్షిణాత్య భాషలలో ప్రధానములైన, తమిళము తెలుగు, కన్నడము, మళయాళము, తుళూ మొదలగునవి ద్రావిడ భాషాకుటుంబమునకు చెందినవని Bishop Caldwell చాలా సంవత్సరాలక్రితం తన గ్రంథములో విస్తరించి నిరూపించాడు. కాల్డువెల్లు పరిశోధన శైశవదశలో నిర్ధారించిన విషయాలు నూత్నపరిశోధనలవల్ల కొన్ని తలక్రిందైనా, అతని ఏకకుటుంబత్వ నిర్ణాయకసూత్రము మాత్రం పరిశోధకుల మన్నన వడసింది.

ఈ ద్రావిడభాషలలో వాఙ్మయోపయోగిగా సంస్కరింపబడ్డ నాగరిక భాషలు తమిళము, తెలుగు, కన్నడము, మళయాళము అనునవి. చాలామంది పరిశోధకులు మళయాళాన్ని వక ప్రత్యేకభాషనుగా నంగీకరించడం లేదు. కాల్డువెల్లు మళయాళము తమిళమునకు కూతురుగాని సోదరి కా దంటాడు. తమిళంలో రామాయణము రచించిన ప్రసిద్ధ పండితకవి కంబను తన కాలంనాటికి మళయాళము తమిళభిన్నమైన భాష గాదని చెప్పెనని పండిత రాఘవయ్యంగారు వ్రాయుచున్నారు.

మిగిలినభాషల్లో తమిళము, తెలుగు, కన్నడమూ పరస్పర సన్నిహిత సంబంధం గలిగివున్నవి. ప్రాచీనమైన ద్రావిడభాష తొల్దొల్త తమిళము-తెలుగుగాను, కొలదికాలంలో తమిళము-తెలుగు-కన్నడంగాను మారిపోయింది. తమిళమునుండి మళయాళము తరువాత చాలాకాలమునకు పుట్టు వొందింది.

నేటికున్న వాఙ్మయము బట్టి చూస్తే కన్నడం తెలుగుకంటె ప్రాచీనమైన భాషని మన విమర్శకులు కొందరంటున్నారు. కాని నన్నయ్యయే తెలుగులో కవిత్వం పుట్టించాడనే దుర్భ్రమయే యీ వూహకు కారణము. తమిళ వాఙ్మయంలో పన్నెండో శతాబ్దాన వున్న ప్రసిద్ధ కవిరాజు 'జయంకొండన్' అనేవాడు కన్నడభాష తక్కువ తెలుగు, ఎక్కువ తమిళముయొక్క మిశ్రీకరణంచేత పుట్టినదంటున్నాడు.[1]

వక్ష్యమాణోదాహరణములబట్టి కన్నడవాఙ్మయమునకూ, ఆంధ్రవాఙ్మయమునకూ యెంత చుట్టరికమో విశదమౌతుంది. ప్రసిద్ధులైన ఆదికర్ణాటకవులందరూ ఆంధ్రులు. శైవవాఙ్మయంలో ఆంధ్రులు కన్నడమునకు చేసినసేవ నిరుపమానము. ఆంధ్రకర్ణాటకదేశములకు చాళుక్యులే రాజులైవుండడంచేత కన్నడ ప్రభువులాంధ్రకవులనూ, ఆంధ్రరాజులు కన్నడకవులనూ గూడా ఆదరించేవారు. చాళుక్యరాజవంశుడగు సత్యాశ్రయుడి కాలంలోనే దేశికవిత (అంటే తెలుగు, కన్నడం మొదలగు దేశభాషలకవిత) పుట్టింపబడ్డదని నన్నెచోడుడు వ్రాస్తున్నాడు.

కన్నడ కవులను ఆదరించిన ఆంధ్రప్రభువులలో మొదటివాడు గుణగాంకవిజయాదిత్యుడని (844-888 A.D.) తద్వాఙ్మయవేత్తలు చెపుతున్నారు. అమృతసాగరుడనే జైనుడగు తమిళకవి (11వ శతాబ్దానికి పూర్వుడు) తన 'యాప్పరుంగళక్కారిగై' అను ఛందోగ్రంథంలో 'గుణగాంకియం' అనే కర్నాటచ్ఛందస్సును అనుకరించానని చెప్పుకొన్నాడట.[2] ఈ గ్రంథం తూర్పుచాళుక్యరాజగు గుణగాంకవిజయాదిత్యుని కంకితమైవుంటుందని కవిచరిత్రకారుడి అభిప్రాయము. రాజనరేంద్రుని తండ్రియగు విమలాదిత్యుడు జైనమతప్రియుడని అతని కన్నడదాన శాసనం చెపుతున్నది. అతని వద్ద కన్నడకవు లెవరేని వుండియుండవచ్చు. రాజనరేంద్రుని యాస్థానంలో నారాయణభట్టున్నాడుగదా! ఇక ప్రతాపరుద్రదేవుని యాస్థానంలో హరీశ్వర, రాఘవ, కెరెయపద్మరస. అను కన్నడ కవులున్నారని తత్తచ్చరిత్రల విశదమగుచున్నది.

కాబట్టి పూర్వకాలం ప్రతిరాజువద్ద వివిధభాషావేత్తలైన కవులుండేవారనీ, మతాభిమానంచేత మాతృదేశం విడిచి, మాతృభాషను వదలి, అన్యదేశాలలో స్థిరపడి తత్రస్థభాషలను ఫలవంతములుగ చేసినారనీ మన మను మానింపవచ్చు. బ్రాహ్మణమత ప్రియులగు తూర్పుచాళుక్యులపాలనక్రింద వుండుట కిష్టంలేక జైనులగు నాదిపంపాదులు కన్నడదేశమునకు వలసపోవలసినవారైరి. మతభేదం మఱచిపోయే

1. See Tamils & Andhras, Pundit Raghava Aiyangar.
2. చూ. కన్నడకవి చరితె, భా ౧. పీఠిక.

నైశాల్యదృష్టియే వారి కున్నట్లయితే, మనమాతృభాష యెంత సౌభాగ్యవంతమై వుండేదో యని మాత్రం నిశ్శ్వసిస్తున్నాను మన మే పుణ్యభూమిలో పుట్టి, యేతీయనిభాషను మాట్లాడుతున్నామో, ఆపుణ్యభూమిలో మనకు పూర్వ మవతరించి రససిద్ధులైన మహాకవుల స్మరణ మనజీవితానికి చైతన్య మీయగలదు.

"పవిత్ర మ త్రాతను తే జగద్యుగే
స్మృతా రసక్షాలనయేవ తత్కథా."

౨

నాగార్జునుడు

కన్నడ వాఙ్మయమున కానుపించే ప్రథమాంధ్ర కవి నాగార్జునుడు. కాని ఇతని గ్రంథా లేమీ కనబడడం లేదు. 814–877లో నున్న రాష్ట్రకూటరాజు నృపతుంగుడు, తన 'కవిరాజమార్గం'లో యితనిని కన్నడ గద్యకావ్యకర్తలలో వకనిగా పేర్కొన్నాడు. మహాయానబౌద్ధు డైన సిద్ధనాగార్జును డాంధ్రుడనీ, గొప్ప పండితుడనీ టిబెట్టు చరిత్రకారులచే తెలుస్తోంది. ఇతడే తెలుగులో త్రిపిటకం రచియింపించి ప్రచురించాడని తేకుమళ్ల రాజగోపాలరావుగారు తమ South Indian Research Vol. IV.—No. 6. లో వ్రాశారు. ఇది వారికి బౌద్ధవాఙ్మయ వేత్తలైన పి. లక్ష్మీనరసుగారివల్ల తెలిసిందని యిటీవల సెలవిచ్చారు. కాని యిది సత్యము కాదని తొందరపడి చెప్పడానికి వీలులేదు. నాగార్జునుడు కన్నడంలో కవి అని నృపతుంగు డంటున్నాడు. తమిళ వాఙ్మయ సాక్ష్యం ప్రకారం ఆంధ్రం కూడ ప్రాచీనత్వం గలిగినభాషే అని నిష్కర్ష అయిందిగదా! కాబట్టి ఆ త్రిపిటకములు తెలుగులో రచింపబడి వుండవచ్చును. తదనంతర బ్రాహ్మణ వాఙ్మయవ్యాప్తిచే అది నశించియుండవచ్చు.

ఆదిపంపడు—941 A. D.

ఈ మహాకవి పులిగెరెలో రాజ్యంచేసిన పశ్చిమ చాళుక్యరాజు అరికేసరి ఆస్థాన కవి. కన్నడంలో ఆదిపురాణమూ, విక్రమార్జున విజయమూ * రచియించాడు. ఇతడు తనభారతం చివర తన వంశావళి చెప్పుకొన్నాడు.

వేంగీమండలమందున్న వేంగిపళువికి చేరిన వసంత, కొట్టూరు, నిడుగొంది, విక్రమపురము అను అగ్రహారములం దగ్రగణ్యు డై నటువంటి వత్సగోత్రోద్భవు డైనటువంటి మాధవసోమయాజి అనే బ్రాహ్మణు డుండెను. ఆయన కుమారుడు అభిమానచంద్రుడు. ఆయన కొడుకు కొమరయ్య. ఆయన తనయు డభిరామదేవరాయడు. ఈతడే మతములలోకెల్లా జైనమతమే శ్రేష్ఠమని తెలుసుకొని జినధర్మ మవలంబించాడు. ఈ అభిరామదేవరాయని కొడుకే ఆదిపంపడు.

ఇతడు కొండ కుందాన్వయమునకు జేరిన జైనుడు. ఇతని కవితాగుణార్ణవ, పురాణకవి, సుజనమనోమానసోత్తంసహంస, స్వతీమణిహార, సంసారసారోదయ అను బిరుదములు గలవు. ఈతని గురువు దేవేంద్రముని. ఇత డరికేసరివద్ద దండనాయకుడుగాకూడా వుండేవాడట.

ఇతడు జైనధర్మ మవలంబించిన తనతండ్రితోనే కన్నడదేశము పోయివుంటాడు. ఆది పంపడు 941 A. D. లో తన ఆదిపురాణం వ్రాశాడు. 'దుందుభివత్సరోద్భవం' అని చెప్పుకొన్నందున యితడు 902లో పుట్టెనని తెలుస్తుంది.

పంపన్న తనభారతంలో, అరికేసరిని అర్జునునిలో పోల్చి (కన్నడభారతమున నర్జును డొక్కడే కథానాయకుడు) అతని పరాక్రమాదుల నద్భుతంగా వర్ణించాడు. అరికేసరి, అర్జునుల కభేదం గల్పించాడు. ఇది ప్రాచీనాంధ్రకావ్యముల సంప్రదాయమని నాయభిప్రాయం (నన్నయకు పూర్వకావ్యములు). వివాదాస్పదు డైన నన్నెచోడుడు కూడా తన కుమారసంభవములో కృతిపతియైన మల్లికార్జునుకు శివునకు కభేదంగా నాశ్వాసాంతాలలో వర్ణించాడు. ప్రాచీనాంధ్రకావ్యముల యీసంప్రదాయాన్ని ఆంధ్రుడైన పంపన్న తొలుత కన్నడకావ్యాలలో ప్రవేశపెట్టాడని యనుమేయ మగుచున్నది. ఈపద్ధతి వర్ణనను రన్న కవి తన గదాయుద్ధంలోగూడ చేసియున్నాడు.

ఆది పంపడు ప్రసిద్ధుడైన ప్రామాణిక కవి. అతని నమస్కరింపకుండా కన్నడంలో కావ్యం ప్రారంభించేవాడు లేడు. ఆంధ్రంలో నన్నయాదులకన్న యీతని కెక్కువగౌరవం కన్నడంలో వుంది.

పొన్న—950. A. D.

ఈకవి శాంతిపురాణమూ, జినాక్షరమాలె అనే రెండు గ్రంథాలు రచించినాడు. ఆదిపంపనితండ్రివలె యితడుగూడా జైనమతం స్వీకరించి కన్నడదేశానికి వచ్చాడు. రాష్ట్రకూట నృపతి కృష్ణరాజు వా డితనికి 'ఉభయకవి చక్రవర్తి' అనే బిరుద మిచ్చాడు. ఇతడు శాంతిపురాణము రచించడానికి కారణ మిట్లు చెప్పాడు:

'వేంగీవిషయమందు కమ్మనాటిలోవున్న పుంగనూరు (ఇది యిప్పుడు చిత్తూరుజిల్లాలో వున్నది) గ్రామంలో కౌండిన్యగోత్రోద్భవుడునూ, యాజ్ఞవల్క్యసదృశుడునైన నాగమయ్య అనే జైన విప్రుడుండెను. అతనికి మల్లప్ప, పున్నిమయ్య అని యిద్దరు కొమాళ్లు. వీరిద్దరూ తమగురువైన జినచంద్రదేవునిమీద పరోక్షవినయప్రదర్శనార్థం యీగ్రంథం రచించమని పొన్నడిని కోరారు.'

ఇతనికి 'సౌజన్యకందాంకుర, కవిచక్రవర్తి, సర్వదేవకవీంద్ర' అనే బిరుదములుగూడా గలవు. ఇతను కాళిదాసుకన్నా తను చక్కని...

* జైనభారతము.

డనని చెప్పుకొన్నాడు. పొన్నడు మహాకవి అనడానికి సంశయం లేదు గాని అతని ఆత్మప్రశంస సహింపగూడనిది.

ఇతను వ్రాసిన 'ఉదయాస్తోన్నత శైలసేతు హిమవత్కుక్షిల పర్యంత సంపదెయిం'—అనేచరణం, నన్నయ్య ఉదయాస్తా చలసేతు శీతనగమధ్యోర్వీపతుల్' అనే చరణాన్ని జ్ఞప్తికి తెస్తున్నది

## నాగవర్మ—990 A.D.

ఈ నాగవర్మ 984లో పరిపాలించిన రక్కసగంగని ఆస్థానంలో వుండేవాడు. అజితసేనదేవుని శిష్యుడు. కన్నడములో ఛందోంబుధి అనే ఛందస్సున్నూ, బాణుని కాదంబరీ భాషాంతరీకరణమునూ గావించాడు. ఇతనిగుఱించి ఛందోంబుధివలన నీవిషయములు తెలియుచున్నవి:

'వేంగీవిషయమందున్న సప్తగ్రామములలో మనోహరమైన వేంగిపళువునందు కౌండిన్యగోత్రోద్భవుడైన వెన్నమయ్య అనే బ్రాహ్మణు డుండెను. అతనిభార్య 'కొండికబ్బె, కుమారుడు దామయ్య. దామమయ్యభార్య కుందకబ్బె. వీరిజ్యేష్ఠపుత్రుడు వెన్నమయ్య. వెన్నమయ్యభార్య పోళకబ్బె. వీరికుమారుడే నాగవర్మ.

ఇతనికి 'కవిరాజహంస', 'బుధాబ్జవన కలహంస', 'కందకందర్ప' మొదలగు బిరుదములు గలవు. 'కుంతీపుత్రం పోనార్ద రణదొళ్' అని చెప్పుకొన్నందున ఇతను యుద్ధవీరుడని కూడా తెలుస్తోంది.

ఇతను తనఛందోంబుధిలో భాషలగూర్చి యిట్లు ప్రసంగించాడు:

"సంస్కృతం ప్రాకృత మపభ్రంశ పైశాచిక మెంబమూఱువరెభాషెగళోళ్ పుట్టువ ద్రవిడాంధ్రకర్ణాటాది షట్పంచాశత్సర్వ విషయభాషాజాతిగళక్కుం". ఈవాక్యంవల్ల ద్రవిడాంధ్ర కర్ణాటాది భాషలన్నీ సంస్కృతమునుండీ, త్రివిధప్రాకృతములనుండీ పుట్టినవని నాగవర్మ అభిప్రాయము. నాగవర్మచెప్పిన పైవాక్యంవలన అతని కాలాన ఆంధ్రభాష ద్రవిడకర్ణాటములతో తుల్యంగా వృద్ధిపొందుతున్నదని గ్రహింపవచ్చు. ఈతని కవిత లలితమూ, మధురమూ, భావగర్భితమునై, హృదయంగమముగా నుండును

## రన్నకవి—993 A.D.

ఇతను అజితపురాణమున్నూ, సాహస భీమవిజయమనే గదాయుద్ధమున్నూ, రన్నకందమనే వక నిఘంటువునూ రచించాడు. అజితపురాణమువలన పరశురామ చరిత, చక్రేశ్వరచరిత అనే రెండు గ్రంథాలుగూడ రచించినట్లు తెలుస్తుంది.

రన్నకవి బెళుగరెనాడిలో ముదువోలను గ్రామమున పుట్టాడు. ఇతను వైశ్యకులజుడు. అబ్బలబ్బె తల్లిపేరు. తండ్రి జినవల్లభేంద్రుడు. సహోదరులు దృఢబాహు, రేచన, మారయ్యలు. భార్యలు జక్కి, కాంతి అనేవారలు. కుమారుడు రాయడు. కూతురిపేరు అతిమబ్బె.

ఇతని గురువుగూడా అజితసేనాచార్యుడే! ఇతనికి పశ్చిమ చాళుక్య రాజైన తైలపుడు (973—997) 'కవి చక్రవర్తి' అనే బిరుద మిచ్చాడు. ఇతని కింకా 'కవిరత్న', 'అభినవకవిచక్రవర్తి', 'కవికుంజరాంకుశ', 'కవి చక్రవర్తి', 'ఉభయకవి' అనే బిరుదము లున్నవి.

> కవి ముఖచంద్రం కవి చ
> క్రవర్తి కవిరాజశేఖరం కవిరాజం
> కవి జన చూడారత్నం
> కవి తిలకం కవి చతుర్ముఖం కవిరత్నం.

అని యితర బిరుదములు చెప్పుకొన్నాడు. ఈతనికి గల 'కవిరాజశేఖర, కవికుంజరాంకుశ' అనే యీరెండు బిరుదములు నన్నయ మిత్రుడైన నారాయణ భట్టునకుగూడ వున్నవి. రన్నకు, నారాయణ భట్టున కేదేని వివాదము సంభవించి ఒకరి బిరుదము లొకర పహరించిరేమో యని స్ఫురిస్తుంది. 'కవీ న్మనీషాలవ దుర్విదగ్ధాన్' అనే శాసన శ్లోక మాకాలంనాటి వివాదము నేదో తెలుపుతోంది. జైనుడైన రన్నడికి బ్రాహ్మణుడైన నారాయణ భట్టునకు మతవిషయ కలహంగాక, కవిత్వ విషయమైన కలహమే యేదో సంభవించి వుంటుందని అనుమానింపనగు.

రన్నడు మార్గనుడులయందూ, దేసినుడులయందూ గొప్పవాడనని చెప్పుకొన్నాడు. 'కవిమార్గదొళం పొసదేసెయనుడిగళొళం'... .........చతుర్ముఖం కవిరన్నం పొన్నవల్ల శాంతిపురాణం వ్రాయించిన వేంగీదేశవాసులు మల్లప్ప, పున్నిమయ్యలలో, మల్లప్ప కూతురైన అత్తిమబ్బెఆదేశం ప్రకారం రన్నడు శాంతి పురాణం తను వ్రాసినట్లు చెప్పుకొన్నాడు. ఈ అత్తిమబ్బె తన యసదృశదాన మహిమచే 'దాన చింతామణి' అనే బిరుదము పొందింది.

రన్నడు తన అజితపురాణంలో వేంగీదేశమును అందముగా వర్ణించాడు.

ఉ. కుంగమతం గజేంద్ర వనదిం ఫలభారవినమ్రనాళికే
   రంగళి నద్రికాననది నుత్తమశాలివనంగళిం చళ
   ద్భృంగకులాకు ళీకృత సరోరుహషండది నిక్షుపుష్ప వా
   టింగళి నావమండలము మంగెలె వందుదు వేంగి మండలం.

క. ఆళిగత కుసుమ పరిమళ
   ఫలరసమందానిలాద్రి కాననలీలా
   విలసనదిం భోగమహీ
   తళ మెనిపుదు విషయజనవె వేంగీవిషయం.

జలధితరంగ తాడిత మహీతళదొళ్ నెగప్పుద్తువేంగి మండలం .............ఇత్యాది.

అజితపురాణము, ౧ ఆ. ౨౧, ౨౩, ౨౪.

## నారాయణ భట్టు—1040 A. D.

నన్నయ్య సహాధ్యాయియైన నారాయణభట్టుగూడా కర్ణాటకంలో ప్రసిద్ధకవి అని నందంపూడి శాసనమువల్ల తెలుస్తోంది. ఇతనా భాషలో వ్రాసిన గ్రంథా లేమీ దొరకడం లేదు. పదునాల్గవ శతాబ్దాంతంలో భారతాన్ని కన్నడించిన నారణప్పయే నారాయణభట్టు అని కొందరు భ్రమపడుతున్నారు. (చూ. భారతాంధ్రీకరణ విమర్శను: కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, సాహిత్యపరిషత్పత్రిక.)

నారాయణభట్టు కూతురు కుపమ. శా. శ. ౯౭౭ (1055 A.D. ద్రాక్షారామ శాసనములో, నారాయణభట్టు పశ్చిమ చాళుక్యుడైన త్రైలోక్యమల్లుని ప్రధానియైనట్లు తెలుస్తోంది. కాని నందంపూడి శాసనమునాటికి (అనగా 1053 A.D.) ఇతను త్రైలోక్యమల్లుని ప్రధాని యైనట్లు కన్పట్టదు.

## రాజాదిత్య—1120 A.D.

ఈతడు గొప్పగణిత శాస్త్రవేత్త. వ్యవహార గణితము, క్షేత్ర గణితము, లీలావతి, జైనగణిత సూత్రోదాహరణ మొదలైన గ్రంథాలు రచియించాడు. దాక్షిణాత్య వాఙ్మయంలో మొదటి గణితకారుడు పావులూరి మల్లన, రెండవ యాతడు రాజాదిత్యుడని తోచుచున్నది. ఇతను జైనకవి. రాజవర్మ, భాస్కర్, బాచ, బాచయ్య, బాచిరాజు అనే పేర్లున్నూ, గణితవిలాస, ఓజెవెడంగ, పద్యవిద్యాధర అనేబిరుదము లున్నట్లు యితని గ్రంథముల వలన తెలుస్తోంది. కొండిమండలమున కనుపమరత్నమండనమైన 'పూవినబాగి' యితనినివాసము. భార్య కనకమాలె. జిననాథుడైన నేమి నాథుడు గురువు.

హొయ్సళరాజగు విష్ణువర్ధనుని యాస్థానమున నితడున్నట్లు తెలుస్తుంది. విష్ణువర్ధనునికాలము సుమారు 1120.

> 'ఈచతురబ్ధివేష్టిత మహీతళదొళ్, దొరె యార్ సమస్త
> విద్యాచతురాననంగె, విబుధాశ్రితకల్ప మహీరుహంగెనర్
> ఖేచర— — — (ఈచరణము దోషయుక్తము) సా
> శోచిత నందయాబ్ధిహిమరోచి యనప్రతిగంధ బాచియం,

ఈపద్యం మూడుచరణాలలో తెలుగువారియతి కనబడుతోంది. మూడవచరణము ఖిలమై దోషయుక్తమై వుండడంచే యతి వున్నదో లేదో నిర్ణయించడం కష్టము.

## మోళిగెయ మారయ్య, తత్పత్ని మహాదేవి—1160 A.D.

కన్నడవాఙ్మయంలో శైవమత ప్రాబల్యపు రోజులలో వచనములనే వక క్రొత్త వాఙ్మయశాఖ ప్రబలింది. వీరశైవమతోద్ధారకుడైన బసవన్న గూడా ఆభాషలో పెక్కు వచనములు రచియించాడు. ఆంధ్రంలోని తాళ్లపాకవారి వేంకటేశ్వర వచనములవలె యీవచనములు భక్తిభావపూరితాలు. తత్తదుపాస్య దైవముల కివి అంకితం చేయబడతవి.

మోళిగెయ మారయ్య యిట్టి వచనములను రచించినవారిలో వకడు. ఇతనిపత్ని మహాదేవి గూడా వీరశైవ కవయిత్రి. మోళిగెయ మారయ్య బందరుదేశంలోని మాండవ్యపురంలో శివభక్తుల నారాధిస్తూ వుండేవాడని తెలుస్తుంది. ఇతన్ని గురించి పాల్కురికి సోమన బసవపురాణం చూడవలసింది.

## మైదున రామయ్య

ఇతను కన్నడములో గీతములు పాడినట్లు తెలుస్తుంది. తండ్రి సోమనాథుడు. తల్లి మహాదేవి. ఆంధ్రదేశములోని భీమావతీపుర మితని కాపురస్థలము. ఇతనిగురించి మైదునరామయ్య రగళె మొదలగు కన్నడ గ్రంథాలు పుట్టినవి.

## మరుళదేవ

ఇతను మరుళదేవకంద, మరుళదేవ వచన అనే గ్రంథాలు రచించాడు. ఇతనికి మరుళశంకరదేవ అనే పేరుకూడ గలదు. కళింగదేశము జన్మభూమి.

## మల్లికార్జున పండితారాధ్యుడు

ఇతను కన్నడములో వచనములు, గణసహస్రనామము, ఇష్టలింగస్తోత్రము, బసవగీత మొదలగు గ్రంథాలనూ, తెలుగులో శివతత్త్వసారమునూ రచియించాడు.

గురురాజు 1430లో రచించిన సంస్కృత పండితచరిత, కంఠాచార్యుడు 1485లో కన్నడమున వ్రాసిన ఆరాధ్యచరిత్ర, సిద్ధనంజేశుని గురురాజచరిత్ర యితనివిషయములను విపులముగా జెపుతున్నవి. ఇతనిచరిత్రగురించి పాఠకుడు శివతత్త్వసారపీఠిక—కె. లక్ష్మణరావు గారిది, శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారిది చూస్తే విశదమవుతుంది.

## రేవణసిద్ధ

నైజాంలో కొల్లిపాక అనే గ్రామంలో, మహాలింగగర్భమందు పుట్టాడట. ఇతను సిద్ధరాముని గురువు. వైష్ణవబోధుని వాదించి వానిని వోడించాడు. ఇతని గ్రంథాలేమీ కానరావు. ఇతని గురించి కన్నడంలో (1) రేవణసిద్ధేశ్వరకావ్య (2) రేవణసాంగత్య, (3) రేవణసిద్ధేశ్వరపురాణ, (4) రేణుకార్యచరిత మొదలగు గ్రంథములు పుట్టినవి.

## పాల్కురికి సోమన్న—1195 A.D.

ఇతనివిషయ మిదివరకే ఆంధ్రభాషలో క్షుణ్ణమైవుంది కాన వ్రాయ ననవసరం. (బసవపురాణపీఠిక: ప్రభాకరశాస్త్రిగారు; వీరేశలింగం కవులచరిత్ర, Vol. I. New edition; వంగూరివారి శతకకవులచరిత—చూడవలసింది.)

## చక్రపాణి రంగనాథుడు

సోమన్న సమకాలికుడు. మొట్ట మొదట వైష్ణవుడయినా, సోమన్నతో వాదించి శివదీక్ష పొందినట్లు శైవగ్రంథములు చెపుతున్నవి. వీరశైవుడైన పిమ్మటనే కన్నడంలో గ్రంథాలు రచించినట్లు గురురాజచరిత్ర చెపుతోంది. వీరభద్రవిజయము, శరభలీలె అనునవి కన్నడంలోనూ, శ్రీగిరినాథ విక్రమమనునేది ఆంధ్రంలోనూ రచించాడట. గురురాజచరిత్రలోని యీ క్రిందిపాదం ఆంధ్రంలో వుండడంచేత తత్కవిగూడా ఆంధ్రుడేమోనని అనుమానింప వీలుంది: 'శ్రీశైలభర్తకును సీసంబు లేనూరు.'

ఇతని శ్రీ గిరినాథవిక్రమంలో కొంతభాగం తెలుగు బసవపురాణ పీఠికలో నుద్ధృతమైనది.

## పోలాళ్వ దండనాథుడు—1224 A.D.

ఇతని తండ్రి ఆంధ్రదేశములోని నారణపురవాస్తవ్యుడైన అత్తిరాజుని తల్లి నవిలాదెయక్క. ఇతను హొయ్సళరాజగు వీరబల్లాళుని వద్దా (1173-1220), అతని కొడుకు వీరనరసింహుడి వద్దా అమాత్యుడుగా వుండేవాడు. విష్ణుభక్తుడు. మహాపరాక్రమశాలి. అనేక దేవాలయాలు కట్టించి అగ్రహారము లనేకము లిప్పించాడు. ఇతన్ని గురించి ఒకశాసనంలో,-

"సంగీతసారన సజ్జనాధారన, కావ్యకర్త్తారన, కీర్తిభర్త్తారన, కవిజనాభరణన, సూక్తిసుధాకరణన, వితరణవిలాసన, లక్ష్మీనివాసన, వైష్ణవచక్రవర్తియ, జగన్మోహనమూర్తియ, సత్యస్వభావన, పోలాళ్వదేవ. ... ... ... ..."

కావ్యకర్తయైయిత డే గ్రంథాలు రచించాడో తెలియదు.

## భీమకవి—1369 A.D.

ఇతను పాల్కురికి సోమన తెలుగు బసవపురాణాన్ని కన్నడించాడు. 'భీమకవీశ్వరరగళె' అను నింకో గ్రంథం రచించాడు. సిద్ధనంజేశుడు భృంగిదండకమును గూడా భీమకవి రచించినట్లు చెపుతున్నాడు. తండ్రి శివకవిదేవుడు. భీమకవి ఉభయకవిత్వ సమర్థుడు.

ఇతనిని పద్మణాంకుడు (1385), విరూపాక్షుడు (1584), షడక్షరదేవుడు (1655), మొదలగు వీరశైవకవులు నుతించారు. ఇతనే వేములవాడ భీమకవి అని కవిచరిత్రకారు లనడం అవిమృశ్యకారిత. ఆవిషయ మిప్పు డప్రస్తుతం కాబట్టి విడిచివేస్తున్నాను.

### ACKNOWLEDGEMENTS:

1. Lives of Kannada Poets, Vol. I.
2. Kanarese Literature - E. P. Rice; B.A.
3. Adipurana—Pampa.
4. Kaviraja Marga - Nripatunga
5. Caldwell's Dravidian Philology.
6. Basavapurana - Palukuriki Somana.
7. Ajitapurana - Ranna. Andperiodicals etc.

# ఆంధ్ర రామాయణములు

కొణిదెన బాలకృష్ణయ్య గారు

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుం డగు పరమేశ్వరుని దివ్యావతారముల యందు శ్రీరామావతారము సకల భారతీజనో పాస్యమై, ఐహికాముష్మిక ఫలప్రదమై, భక్తకల్పద్రుమమై, యనుత్త మంబగుచుఁ బ్రకాశించుచున్నయది. అటులనే సత్యపరాక్రముఁ డగు నమ్మహామహుని పవిత్రచరిత్రము, శ్రీమద్రామాయణము పౌరుషేయ గ్రంథసముదయమునం దగ్రస్థానము నధిష్ఠించి, సాటిలేనిపటిమఁ బతన పాతన క్రమమున యుగాంతరములనుండియు సువిశాలభారత ప్రపంచ మున వ్యాపించి, యందలి యొక్కొకవర్ణమే మహాపాతకముల నశింపఁ జేయుననెడి రూఢియగు విశ్వాసమునుగాంచి విరాజమాన మగుచున్న యది. "కోరి తలఁచినవారికెల్లను కొంగుబంగరు రామనామము" అను 'దృఢనమ్మక' మనక్షరాస్యులగు సాధారణ జనులయందు సైతము స్థిర పడి యున్నది ఏతాదృశలోకోత్తర మహిమమహితుండగు శ్రీరామ చంద్రునికి యశః ప్రతిపాదకం బగు శ్రీమద్రామాయణము ప్రభావము కరము వర్ణనాతీతమును, అనుభవైకవేద్యమునై యున్నది. భగవదవతా రములయందు రామావతారమును, భక్తులయందు రామభక్తులను గ్రంథ ములయందు శ్రీమద్రామాయణమును మున్ముందు బరిగణింపఁదగును. కావున దీనిని "ఆదికావ్య" మని యార్యులు నిర్వచించిరి.

శ్వేతపద్మాసనాసీన-సరస్వతీదేవి, భగవన్నియుక్తయై వల్మీక భవుని జిహ్వాగ్రమున నిలిచి, ప్రసన్నయై, యమ్మహాముని ముఖమున శ్రీమద్రామాయణ మహాకావ్యమును వెలువరింపఁజేసెను. గీర్వాణ భాషా మహోదధికిఁ గౌస్తుభరత్నాయమానంబగుచు నిమ్మహాకావ్యము పాఠకజన చింతామణియై వినఁ జదువ కరము మనోహరంబగుచు సమస్త కలిపాపహరణసమర్థమై యొప్పారుచున్నయది. కావున నీ యుత్తమకావ్యమును బలువురు పలుతెఱంగుల సేవించి ధన్యులై శ్రీరామప్రసాదపాత్రులై యైహికాముష్మికములఁ బడసియున్నారు. కొంద ఱింకను నట్టిఫలము బడయనున్నారు. వారిలో శ్రీమద్రామాయ ణము నాంధ్రీకరించి యాంధ్రభాషాయోషనమూల్యాభరణముల నలంక రించి, యాంధ్రజనస్తవనీయ ప్రతిభాభాసమానులగు నాంధ్రకవీ శ్వరులు భాషాంతరీకరించిన రామాయణగ్రంథరాజములఁ బరామర్శిం చుటయే మన కిచటి ప్రస్తుతాంశము.

## ఆంధ్ర రామాయణములు

శ్రీమద్రామాయణమును జాలమంది కవీశ్వరులు తెలుఁగొనర్చి యున్నారు. కొందఱు పురాణపద్ధతిని, కొందఱు ప్రబంధపద్ధతిని, వారివారి యభిరుచులకొలఁది గ్రంథకల్పన మొనర్చిరి. ప్రబంధముల విష యమిపుడు మన కిచటఁ బ్రకృతముకాదు. కావున నిఁక పురాణశైలిని రచింపఁబడిన రామాయణముల నరయుదము. సనాతనాంధ్రకవులలో దిక్కన మహాశయుని పితామహుఁడు మంత్రిభాస్కరుఁడును, ఎఱ్ఱా ప్రెగ్గడయు నాంధ్రమున రామాయణరచన మొనర్చినటులఁ దెలియుచు న్నది. కాని వారిగ్రంథములు నేఁటిదనుకను మనకు లభింపవయ్యెను. కావున నవి ప్రబంధములో, పురాణములో, మూలానుసరణములో, లేక వ్యాఖ్యావివరణములో తెలిసికొనుభాగ్యము మనకుఁ గలుగలేదు. ఇపుడు మనకు లభ్యమైన యాంధ్రరామాయణములు నాలుగుమాత్రమై యున్నవి. అందు భాస్కరరామాయణము సనాతనము. తక్కినవి యాధునికములు. అవి

గోపినాథరామాయణము—గోపినాథము వేంకటకవి విరచితము.

ఆంధ్ర వాల్మీకి రామాయణము—ఆంధ్ర వాల్మీకి (వావిలికొలను సుబ్బారావుగారు) విరచితము.

ఆంధ్ర శ్రీమద్రామాయణము—అభినవాంధ్ర వాల్మీకి (కావ్య తీర్థ జనమంచి శేషాద్రిశర్మగారు) రచితము.

నవీనములగు నీ మూడురామాయణములును గ్రమముగా నొకటి తరువాత నొకటి యీశతాబ్దమున రచింపఁబడినవి. ఇందఱిటుల రామా యణగ్రంథము నేకారణమువలనఁ దెలుగున కనువదించిరో కనుఁగొందము.

### ౧. భాస్కరరామాయణము

ఆంధ్రభారత, భాగవతాది గ్రంథములవలె భాషాంతరీకరణ యుగమున, "బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమును" వెలయించుటకుఁగా రచింపబడినది. అందుచేతనే భాస్కరుఁ డాంధ్రభాషను వెల యించిన వాఁడుగా "సోముఁడు భాస్కరుండు వెలయింపఁగ" అను సూక్తివలన రామరాజభూషణుఁడు పేర్కొనియున్నాఁడు. చిరకా

లమునుండియు నీగ్రంథరత్నమును పరంపరగ మనపూర్వులును, నేఁడు మనమును జదువుచున్నాము. ఇయ్యది సకలాంధ్రజన హృదయాకర్షణ మునుగాంచి ప్రాగస్త కెక్కియున్నది. దీనిని గుఱించి మనము క్రొత్తగఁ జెప్పుకొనఁదగు ప్రమేయములేదు. భాస్కరరామాయణ మింపకమున్న జాల వాదోపవాదములకుఁ గారణమై యుండెను. ఈగ్రంథమే మరల రామాయణాంధ్రీకరణకార్యమునకు దారిచూపుచున్నటులఁ దక్కినవారి రామాయణ గ్రంథప్రస్తావనలు జదివిన ద్యోతకమగును. కారణము లివి:—దీని కర్తృత్వ మొకరిది కాదు. రచనము మూలకథ ననుసరించి స్వేచ్ఛగ పెంచి, కుదించి యొనర్పఁబడినది. నరాంకితము. శైలి (వేర్వేఱు కవులగుట) పలు తెఱంగులు. ఉత్తర భాగము లేదు. ఈకార ణములవలన నీరామాయణము గొందఱు విద్వద్వర్యులకు సంతృప్తి నీయఁజాలని దయ్యెనని తదితరాంధ్రరామాయణముల పుట్టుకయే చెప్పకఁ జెప్పుచున్నయది.

ఇవ్విషయములఁ జింతించి, కొన్నినియమములఁ బాటించి తెలుఁగున సమగ్రమగు రామాయణమును రచింప మొదలిడి యందుఁ గృతకృత్యులైన వారిలోఁ బ్రథములగు గోపీనాథము వేంకటకవిగారి ప్రణీతమైనది

## ౨. గోపీనాథరామాయణము.

"భాస్కరాదులు రచించిన యాంధ్రరామాయణంబు లందు వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణంబునం గల యర్థం బంతయు సమ గ్రంబుగాఁ గథితంబైనయది గాదనియు, భగవదంకితంబుగాదనియుం దలంచి యిమ్మహాకావ్యంబు గీర్వాణంబున కన్యూనాతిరిక్తంబుగా భగ వదంకితంబుఁజేసి యాంధ్రభాష. రచింపందగు సమర్థుండగు పండితుం డెవ్వఁ"డని వేంకటగిరి ప్రభువగు సర్వజ్ఞయాచమహీవరుఁడు పరిశీ లించి, సకల విద్వజ్జన సమక్షమున నీ గోపీనాథరామాయణమునంతయు సమగ్రంబుగ నాకర్ణించి, యియ్యది గీర్వాణంబున కనురూపంబై, తమ యభిప్రాయప్రకారంబున శ్రీకృష్ణాంకితముగా నున్నదని నిశ్చ యించి దీనినిఁ బ్రకటించి పుణ్యుఁ డయ్యెను. సర్వవిధముల మూలాను సరణముగను, దైవాంకితముగను, హృద్యముగను, సమగ్రముగను రామా యణ మాంధ్రమున రచించుటకు వేంకటకవి సంకల్పించెనని దీనివలనఁ దెలియనయ్యెడిని. శ్రీరాముని పవిత్రచరిత్రము గావున వ్రాయ దొర కొంటినని వేంకటకవి యుగ్గడించినను, పై జెప్పినవిధమున భాస్కర రామాయణమును మించి తమ గ్రంథ మన్ని తెఱఁగుల మిన్నగ నుండ వలెనని వీరి యాశయము. అయినను వీరు భాస్కరునిఁ దృణీకరింపకఁ దమగ్రంథమున స్తుతించియున్నారు. కవిత్వ ముండవలసినవిధమును వేంకటకవీశ్వరుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.

"చ. చతురత మీఱఁ బాకములు, శయ్యలు రీతు లలంకృతుల్ ధ్వనుల్
వితతరసంబులున్ మఱియు, వృత్తులు దోషములున్ గుణంబు లు
న్నతిఁ బరికించి సత్కృతి యొనర్చినఁ దత్కృతి లోకపూజ్యమై
యతులితభంగి వృద్ధిఁగను, నావిధు భాస్కరతారమై భువిన్."

"చ. అరుదుగ నాణిముత్తెములు హారము గూర్చిన మాడ్కి లో నెలిన్
మెఱుఁగులు దేరు శబ్దములు, మెచ్చుగఁ గూర్చి రసార్థగౌరవ
స్ఫురణదలిర్ప సత్కృతులు, పూని రచించిన సత్కవిత్వమున్
సరసకవిత్వమంద్రు కవిసత్తము లన్యకృతు ల్గణింతురే."

తనకవిత యిటులుండునని యియ్యనఘుఁ డీపద్యముల సూచించి నట్లు మనము గ్రహింపవచ్చును. రామాయణము వేదతుల్యమనియు, బరమపవిత్రగ్రంథమనియు, గాయత్ర్యాఖ్యపరబ్రహ్మనివాస మనియు వీరికి నమ్మకము. ఏలాకో, సమగ్రరామాయణము రచింపఁగడంగి యుత్తరభాగము నాంధ్రీకరింపకయు, మూలమున కన్యూనాతిరిక్తం బుగాఁ దమగ్రంథ ముండవలెనని ప్రతినఁబట్టి యందం దొకించుక స్వతం త్రించియు వేంకటకవీంద్రుఁడు గోపీనాథరామాయణ పరిసమాప్తిఁ గావించెను.

ఈ రామాయణమునఁ బూర్వభాగ మొక్కటి మాత్రము గలిగి యుండుట, యథావాల్మీకము గాక స్వతంత్రాభిప్రాయము లుండుట కారణములై మఱల రామాయణ మాంధ్రముల రచింపఁదగు నను నెడము గలిగించినవి. కావున నియ్యవసరమును దెలిసి యథామూలముగఁ బూర్వోత్తర భాగములు గలిగి వావిలికొలను సుబ్బారావుగారిచేఁ దెలిఁగింపఁబడినది

## 3. శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము.

దీని రచనకుఁ గారణము లీక్రిందిపద్యములలో నాంధ్రవాల్మీకిఁ దెలిపియుండెను.

"క. పూర్వులు నెవ్వరుఁ బలుకరు
పూర్వోత్తర రామకథల మునిపల్కిన య
త్తెరువునఁ దెలుఁగునఁ గావున
సర్వము నెఱిఁగింతు రామచంద్రునికరుణన్."

"చ. తతభవబంధమోచన నిదానమటంచు నెఱింగి ఘోర సం
సృత దృఢపాశబంధనము ఛేదమొనర్పఁగ శాశ్వతోరు సౌ
ఖ్యరతినెసంగ, నిత్యము నిరామయమైన ముకుందలోక సం
గతిఁ జెలువార, రామకథఁ గైకొనితిన్ రచియింప నీగతిన్.

ఇందలి తతభవబంధమోచనాదిక మనుభవైకవేద్యము. శ్రీరా మపాదభక్తుల కాతనిపైఁ గల గాఢ విశ్వాసమునకుఁ దార్కాణము. స్థూలదృష్టితోఁ జూచినయెడల "ముని పల్కిన యత్తెరువునఁ బూర్వు లు నెవ్వరు రచింపని పూర్వోత్తరరామకథల తెలుంగున" రచింపవలసి యుండుటయే ముఖ్యకారణమై వీరి నీకృతి నిర్మాణమునకుఁ బ్రేరే పించి యుండుననుటయు సత్యేతరముకాజాలదు. భాస్కరుని గ్రంథమున కన్న దనకృతి విలక్షణముగ నుండవలెనని సంకల్పించి

రచించిన వేంకటకవీంద్రుఁ డుత్తరభాగమును విడనాడి పూర్వభాగమున నందందుఁ గొంత స్వతంత్రమును గైకొనియున్నాఁడు కావున నిది యసమగ్రము, మూలగ్రంథాతిక్రమణము నగుట నీ మూఁడవ రామాయణరచనకుఁ దావు లభించినది. తొలుదొలుత బమ్మెర పోతన భాస్కరు నధిక్షేపించిన వాక్య మీగ్రంథకర్త చెవిసోకి రామాయణము బండ్లకెత్తింపనలయునన్న కుతూహలముతోఁ జాల పెంచి వ్రాసిరట. అదిచూచి వారి మిత్రులు క్రొత్తపల్లి పద్మనాభశాస్త్రులుగారు "యథామూలముగ నుండు గ్రంథ మిదివఱకు లేదనియు, మూలమునే యనుసరించి యీ గ్రంథముండిన నెక్కువగఁ బూజితంబనియు, సాధ్యమైనంతవఱకు మూలగ్రంథము నతిక్రమింపక, విషయము లోపింపక రచింపుమనియు, సంస్కృతంబున వాల్మీకిరామాయణము నట్టిద యాంధ్రమున నిదియనితోఁప నాంధ్రవాల్మీకిరామాయణమని పేరిడుమనియుఁ "దెలి పిరట.. అంతట సుబ్బారాయకవి పెంచిన గ్రంథభాగమును దొలఁగించి, మూలచ్ఛేదమొనర్చు ప్రక్షిప్తములఁ దొఱఁగి మూలమున ప్రత్యక్షరమునకు మాఱక్షరమువేయక, వక్తకు శ్రోతకు సుఖావహంబుగ నుండునట్లు, మూలమును విడిచి శాఖాచంక్రమణముచేయక యేకారణమున వాల్మీకి గీర్వాణమున నిర్వచనముగ రచించెనో యాకారణమున వారును నిర్వచనముగ రచించిరట. వీ రతి నిష్ఠుర నియమ సమన్వితముగ గ్రంథరచన మొనర్పఁ దలంచినట్లు పై వాక్యములు నిదర్శనములుగ నున్నవి. గాయత్రీ మంత్రాక్షరాదికము లాయా చోటుల సంస్కృత రామాయణమునందువలెఁ దమ యాంధ్రీకరణము నందును బొందు పఱచిరి. వేయేల? సంస్కృతరామాయణమువలె నిదియుఁ బారాయణాదికముల కుపకరింపఁదగియుండవలెనని వీరి భావమని చెప్పవచ్చును. "అంతా రామమయ"మ్మని భరన్యాసమొనర్చి యాత్మార్పణము గావించిన యిక్కవీంద్రునకు రామాయణ మహాకావ్యమునం దత్యంత ప్రమాణబుద్ధి గలదు. ఈ రచనకుఁ బ్రచ్ఛన్నముగ శ్రీరామమూర్తియే తనకుఁ బ్రోత్సాహము గలిగించినటుల వీరు దెల్పుకొనిరి. తనకుముందఱ రామకథాసమంచిత కావ్యసముదయము నొనర్చిన యాంధ్రకవులు మొల్లాంబామణినిగూడ మరువక పేర్కొని ప్రణుతి యొనర్చుటగాక సుబ్బారావుగా రించుమించు దనకు సమకాలమున రామాయణము రచించినవాఁడగు గోపినాథము వేంకటకవి నీక్రింది పద్యమునఁ బ్రస్తుతించిరి.

శా. శ్రీ రామాయణ పూర్వభాగము రచించె న్భక్తి నాంధ్రంబుగా
ధీరుం డార్యజనస్తవార్హుఁడును బృథ్వీదేవతాశ్రేష్ఠుఁ డు
ర్వీరామాత్మభవేశ భక్తుఁడగు గోపీనాథ వేంకార్యుఁ డా
సూరింగోర్చి నమస్కరించెదను సత్కూర్తిం బ్రశంసించుచున్.

శ్రీ మదాంధ్ర వాల్మీకిరామాయణమునకు వెనుకఁ గావ్యతీర్థ, యభినవాంధ్ర వాల్మీకి బిరుదాంకితులు, బ్రహ్మాండపురాణాద్యుత్తమ గ్రంథనిర్మాతలు నగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారు రచించినది

## ౪. ఆంధ్ర శ్రీమద్రామాయణము.

పైఁ జెప్పిన రామాయణగ్రంథనిర్మాణ కారణములలో నొ టియు నాంధ్ర శ్రీమద్రామాయణ గ్రంథమునకుఁ గలుగ లే కృత్యారంభవిధానమును సమర్థించు త్రోవ యంతగాఁ గన్పట్ట "ఆంధ్రభాషను దగంగ, నాదికావ్యము దెనిఁగింపవయ్య భవ్య, సత్కృత్య మిదియని పరమనియతి" నని శేషాద్రిశర్మగారు మిత్రులు వేంకటేశ్వరశాస్త్రిగారి పంక్తిని భుజియించు సందర్భమున శాస్త్రిగారు శర్మగారి నీగ్రంథరచనమునకుఁ బురికొల్పిర ఇదియ ముఖ్యమగు కారణము. ఈ యాంధ్రీకరణము నెందఱో చేసియుండ నిపుడేల మఱల నీప్రయత్న మను సంశయమును "యిందఱెం తెనుగుఁజేయఁదగు నీకృతి నంచు నియామమున్న యను సమాధానాదికములచే నాసంశయము నివృత్తిఁ జేసికొనిరి. ఇ షయము ఆంధ్ర శ్రీమద్రామాయణమున రామాయణ ప్రశంస నలుబదియారవపద్యమునఁ గలదు. ఈ పద్యమువలన రామకథ బును వ్రాయుచుండినఁ బుణ్యరాసులు, బూజ్యతరంబగు ముక్తి దును గాన గ్రంథము వ్రాయ నారంభించినట్లఁ దెలియవచ్చును. యే గ్రంథకర్త యుపోద్ఘాతమున నింకొకవిధమునఁ బలుకఁబడిన చూడుఁడు:

రామాయణము నెందఱో వ్రాసియుండ మరల నీ ప్రయత్న మేల? అని ప్రశ్నమొకటి కలదు. దానికి నుత్తరముగా నాల్గు మాటలు వ్రాయఁదలచితిని. సావధానముగా నాభావముం బరిశీలిం పండిత మహాశయులు మన్నింతురు గాక!

రామాయణమునకు భక్తులు పెక్కుమంది వ్యాఖ్యలుచేసి ఏల? వాల్మీకిముని రామాయణమును రచించి యిట్టి మహోపకా మును జేసిరని యందఱికిఁ దెలుపుటయే వారిభావము. మూలమున యర్థము; ఈ శ్లోక విషయమును దెలుపునని వారు వెల్లడించిరి... ......వారి వ్యాఖ్యలచేతనే శ్రీమద్రామాయణ మింత విఖ్యాతి దెను. గాని లేకున్న నేమూలనో పడియుండును. కావున వా రేయ మును దెల్పిరో యాయర్థమును స్పష్టముగా నాకుం దెలిసినంతవఱకుఁ దె పుటకే నాయీప్రయత్నము." శర్మగారి హృదయగతాభిప్రాయ యై యుండవచ్చును. ఇది ప్రశ్నకు సమాధానము కాఁజాలదు. వా వ్రాయఁదలచి వ్రాసిన నాలుగుమాటలు వారి రచనాప్రణాళికకు మ త్రప్రాయములు. ఎటులైననేమి, కావ్యతీర్థులు మిగుల ప్రయాసము సహించి యత్యంత విపులముగ వ్యాఖ్యాసారసమన్వితముగ నొ గొప్ప రామాయణగ్రంథము నాంధ్రభారతికి సమర్పించిరి. భాస్కర, గోపినాథ, వాసుదాసుల గ్రంథరచనా మార్గముల క ములు బంధించి నూతనమార్గద్వారాన్వేషణ మొర్పవలెనని యత్ని చిరి. తమ కవితాలతాంగి నామార్గమున నడుపఁ దలపెట్టిరి. కా

యుపోద్ఘాతమున నించుకంత వివరించిన రచనావిధానమును గ్రంథస్థ పద్యములలో నీక్రింది విధమున విపులముగఁ దెలిపిరి.

క. అనుచుం దలఁచుచు రామా
యణమును బఠియించి దాని వ్యాఖ్యలఁ జక్కం
గనుబొలఁ జూచి నెమ్మన
మున యందున్ వారి యర్థమును గైకొనుచున్.

తే. పెక్కువ్యాఖ్యలభావముల్ పెక్కుగతులఁ
దెల్పు సరిపడకుండు మదిందలంప
నొక్కదానికి వేఱొకఁ డొక్కచోట
నన్నియును గూర్చి తెనిఁగింప నగునె సరిగ.

క. జననీభావము గనఁబఱ
చు నొక్క విద్వాంసుఁ డట్టిచోటనె జక్కం
గను భార్య యనెడు భావము
గనఁబఱచు మఱొక్కసూరి కడుఁ బాండితిచేన్.

ఆ. ఇట్టి తావులందు నయ్యర్థములు రెండు
సరిగ నన్వయించు చందమునను
తెనుఁగు చేయుటనఁగ జనదె కష్టం బన
దీని దెలుఁగ రొక్క ధీరులెల్ల.

సీ. గోవింద రాజొక్క గూఢార్థములనెల్ల
నటు మహేశ్వరతీర్థుఁ డర్థమొందు
దెలుపునట్లే యితరులు వేఱుభావంబుఁ
గనఁబఱతురు వానిఁ దెనుఁగునందుఁ
బలుక శక్యముగాదు పలుతావు లందట్లు
కనఁబడుఁ గాన నేనును శ్రమించి
వ్యాఖ్యామహార్థంబు బాగుగ గ్రహియించి
సందర్భశుద్ధినిఁ జక్కనెఱిఁగి.

తే. తనదు పైత్యంబు కొంతయుఁ దాల్లపాక
వారిపైత్యంబు కొంతయున్ భంగి నిర్వ
రనువదించిన యర్థంబు గనఁబడునటు
కూర్చి నాభావమును గొంత చేర్చి మఱియు.

క. మునివాక్కులఁ గల యర్థం
బును వ్యర్థముచేయ కొక్కపోలికను దెనుం
గునఁ గూర్చితి వ్యాఖ్యాద్వయ
మునఁ గల్గిన యర్థయుగము మునుకొని యొకచోన్.

క. తెలియంగ లలితపదములఁ
బలికితి మూలార్థమునకు భంగ మదెట్టుల్
గలుగంగనీక పాండితి
గలిగినయందాకఁ గూర్పఁ గలిగితి జుండీ"

మునివాక్కులఁ గలయర్థము, ఇరువుర వ్యాఖ్యానములఁ గల యర్థయుగము, నియ్యర్థములు మాటిలోఁ దమ భావసమ్మేళనము నొనర్చి మిత్రాజ్ఞఁ గారణముగఁగొని, యిమ్మహాగ్రంథమును శర్మగా రాంధ్రీకరించిరి. కాని రామమూర్తి యాజ్ఞఁగొని యీకావ్యమును దెనిఁగింపఁ బూనలేదట. అయినను శ్రీరామమూర్తి కరుణ వారియందుఁ గలదు గదా యను నమ్మకముమాత్రము గలదట. సకారణ కార్యము గామి, శర్మగారి లేఖిని ప్రౌఢయయ్యు డొంకతిరుగుడు మార్గముల వడి చుట్లఁ బడవలసి వచ్చెను. మఱియు నిక్కార్య ప్రారంభమునకు రామాజ్ఞ లేకుండుటయుఁ గొఱతయగునేమో; వ్యాఖ్యాతల వివరణములు లేనిచో రామాయణ మెన్నఁడో పేరుమాసి యేమూలనో పడియుండుననియు, ఫలశ్రుతు లతిశయోక్తులనియుఁ బ్రమాణబుద్ధిఁ దొలఁగి సాహసమున వెల్లడించిన శర్మగారివంటి వారికిఁ గావ్యారంభమునకు రాముఁ డెట్లనుగ్రహముతో ననుజ్ఞ నొసంగును? నాకు మిత్రాజ్ఞ గలదని వచించినవా రంతతోఁ దనివి నొందక "రాముని యానతిఁగొని యీ కావ్యమును తెలిఁగింపఁ బూనలేదు." అని వచింప గల దెయ్యదియో. వీ రాంధ్రకవీశ్వర స్తుతియందుఁ దమ కంటె ముందు రామాయణముల నాంధ్రీకరించినవారి నొక్కరిని చేర్కొనియుండలేదు. వేంకటకవి, ఆంధ్రవాల్మీకు లాధునికులు గాన యభిప్రాయభేదము లేవియేని గలిగియుండిన నుండవచ్చును. ఆకారణమున వారిని దలఁప సమ్మతిలేకపోవచ్చును. కాని, సనాతనుఁడు, తెలుఁగుబాసను వెలయింపఁ దలంపుఁగొని తేనెసోనలు జిప్పిలు మృదుపదముల, స్వకపోలకల్పనల, రామకథ నాంధ్రమున రచించిన భాస్కరు నించుకేనియుఁ దలపఁదగియుండెను. అభినవాంధ్రవాల్మీకు లియ్యెడమఱచిరో; వలయునని నిరసించిరో; రాముని యానతియే పని లేనివారికిడ మాత్ర మంత యవసరమా? ఇంకొకవిశేషము. గోపినాథ రామాయణమును వారు చదువనేలేదట. అందందుఁ బదపద్యములు మాత్రము జదివిరట. ఆంధ్రవాల్మీకి రామాయణమును గూడ వారు చదువలేదట. నాలుగైదు పద్యముల నెందైన జదివియుందురేమోనట. కాని యాంధ్రవాల్మీకి రామాయణపద్యముల వీ రంతగా జదివినను, చదువకున్నను తద్గ్రంథోపోద్ఘాతమును మాత్రము వీరు జాలశ్రద్ధతోను, దీక్షతోను జదివియుండిరనునది యథార్థము. శర్మగారు గోపీనాథము నాంధ్రవాల్మీకిరామాయణము నామూలాగ్రముగఁ జదివియుండినచో వారు మగల నీ యాంధ్రీకరణమును దలపెట్టియుండరేమో; అది పొసఁగియుండిన నీ ఆంధ్ర శ్రీమద్రామాయణముగాక బ్రహ్మాండపురాణమునంటి వేఱొక నూతనపురాణము మనకు లభించియుండెడిది.

## అనుకరణము

ఇంత వనుకఁ జెప్పిన నాలుగు రామాయణములలో భాస్కర, గోపినాథ రామాయణము లొండొకటితోఁ గాని, తక్కిన రెంటితోఁ

గాని పోలియుండక విడివడి యున్నవి. ఆంధ్రవాల్మీకి రామాయణము, ఆంధ్రశ్రీమద్రామాయణము నొకటితో నొకటి గ్రంథాకారముల మాత్రము గాకఁ గొన్నియెడల సందర్భసామ్యమును గూడ గలిగి యున్నవి. అనఁగా గ్రంథకర్తలలో మొదటివారిని రెండవవారనుకరించి నారు. ఒకరికి లంకలపల్లె వేంకటసుబ్బార్యులు, యింకొకరికి వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు గ్రంథరచనకుఁ బ్రోత్సాహకులు. శ్రోత్రపల్లి పద్మనాభశాస్త్రి లాంధ్రవాల్మీకి రామాయణమునకు, కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రి లాంధ్రశ్రీమద్రామాయణమునకు నామకరణము లొనర్చిరి.

ఆంధ్రవాల్మీకి గ్రంథము ఒంటిమెట్ట కోదండరాముని యాలయమునను, శర్మగారి గ్రంథ మనటికిఁ బదిపంద్రెండు మైళ్లదూరమునఁ గల దేవునికడపయందలి శ్రీప్రసన్న వేంకటేశ్వరాలయమునను యుత్సవాదిక విభవముల ననుభవించినవి. ఒంటిమెట్టలో నీయుత్సవ సమయమున నేయేవేడుకలు జరుపఁబడెనో కడపయందు నట్టివేడుకలు జరుపఁబడెను. సభలు, సభ్యులు, అధ్యక్షులు, ప్రశంసావాక్యములు, నాటకప్రదర్శనములు, లడ్డూఫేణీలతో విందు భోజనములు, సత్కారములు మున్నగు నిరువదవశతాబ్దపు టాడంబరములు రెంటికిని జరిగినవి. ఒంటిమెట్టకవికి "ఆంధ్రవాల్మీకి" యని బిరుదు నొసంగిరి. కడప కవీశ్వరునికి "అభినవాంధ్ర వాల్మీకి" యను బిరుదప్రదానము గావింపఁబడెను. రెండును రెండే. ఇందుఁ దక్కువెయ్యది? ఈ గొడవ లంతగా భాస్కరరామాయణమునకుఁ బట్టెనో లేదో కాని గోపీనాథునకు మాత్రము గలుగలేదు. ఉభయగ్రంథములయందును పండితుల ప్రశంసా పద్యములు జేర్పఁబడినవి. ఆంధ్రవాల్మీకి రామాయణమునఁ టీకననుసరించి శ్రీరామనుతి గలదు. ఆంధ్ర శ్రీమద్రామాయణమున శ్రీరామ మహిమము గలదు. విషయభేదమున్నను పీఠికలు—ఉపోద్ఘాతములు నొకదాని జూచి వేఱొకటి సాగి నడిచినట్టు లున్నవి. గ్రంథభాగమున మాత్ర "మెవరికి వారే, యమునాతీరే" యను సామెత ననుసరించినారు.

## పీఠికలు—(ఉపోద్ఘాతములు)

ఇవి భాస్కర, వేంకట, కవీంద్రులు స్వయముగ లిఖించినవి లేవు. ఆకాలమున దమగ్రంథసంబంధమగు మంచిచెడ్డలు పద్యములతో గ్రంథాదిని యేదో సందర్భమున సంగ్రహముగ వివరించెడివారు. హూణ భాషా గ్రంథముల పరిచయమువలన నిప్పటి గ్రంథముల కన్నిఁటికిఁ బీఠికలు వ్రాయు నలవాటు మనకుఁ గలిగినది. పీఠిక లేని గ్రంథము కిటికీలు లేని గృహమునంటిదట. కావున గ్రంథాదినిఁ దత్సంబంధమగు పీఠికయుండుట మిగుల యుపయుక్తము. పైన నుదహరించిన వాటిలోఁ గడపటివగు రెండు గ్రంథములకు విపులములగు నుపోద్ఘాతములు గలవు. కాని సామాన్య గ్రంథపీఠికలకొఁ బట్టిన దురవస్థయే వీటికినిఁ గాన్పించుచున్నయది. విషయవిమర్శనమునఁ బానకములోని పుడకలరీతిఁ బూర్వపక్షుల నతినీచముగ, సాహంకారముగఁ దెగడు నీచవాక్యముల నుపయోగించు నలవాటు మనవారికి బాగుగ నభ్యాసము పడియున్నది. ఇయ్యది యాంధ్రవాల్మీకి రామాయణపీఠికయం దించుకయును, ఆంధ్ర శ్రీమద్రామాయణ పీఠికయం దొకింత హెచ్చుగను గలదు. ఏతత్సందర్భమునఁ గావ్యతీర్థులలేఖిని యెవ్వరిపైననో కయ్యమునకుఁ గాల్ద్రువ్వుచుఁ బలువులువారుకీలినిఁ జరించినదిగా దోఁచకమానదు. వ్రాయవలసినవన్నియు వ్రాసి, "నే నేమియు నెఱుఁగనుజుడీ" యనుట యీలేఖినికి అలవాటు. ఆంధ్రవాల్మీకిరామాయణ కర్త శ్రీమద్రామాయణము వేదమనియు, ధర్మశాస్త్రమనియు, మంత్రశాస్త్రమనియు, సాంఖ్యశాస్త్రమనియు, శ్రద్ధాభక్తులు గలిగినవారికిఁ గల్పవృక్షమనియుఁ దమ పీఠికయందు వ్రాసిరి. ఇవ్విషయములనే ఆంధ్ర శ్రీమద్రామాయణ కర్త తన గ్రంథపీఠికయం దిట్లు నిరసించియున్నాఁడు:

"ఇక్కాలమునఁ గొందఱు పుణ్యజనులు (రాక్షసులని శర్మగారి భావము) రామాయణమునుండి వేదత్రయము నేర్పఱుపవచ్చుననియు, దాని కిది మార్గమనియుఁ జెప్పుచు వంకరటెంకర యున్నట్లు వర్ణములను లాగి, లాగి, యిదిగో వేదమంత్ర మొక్కండైనది. ఇక రెండవ దిదిగో యని యుపన్యసించుట వినఁబడియెడు." (ఉపన్యసించుట యని వీరనుట పొరబాటు. ఈవాక్యములు ఆం. వా. రా. పీఠిక ౨౩—౨౮ పుటలలో నున్నవి. అవిచూచియే వీ రిట్లాక్షేపించిరి:)

"కొందఱు రామాయణ మహిమము నెన్నియో పద్ధతులుగాఁ గొనియాడుదురు. ఈ రామాయణమే సాంఖ్యమనియు, నిదే యోగమనియు, నిదియే వేదాంతమనియు నెన్నియోరీతులఁ దోఁచినట్లు తలతోఁకలేని చందముగా ఘోషింతురు. ......ఇదియే సకల శాస్త్రములనుటకన్న వెఱ్ఱితనము వేఱుగ నుండదు."

(ఇదియు నాంధ్రవాల్మీకి వాక్యములఁ గూర్చియే. చూడుడు: ఆం. వా. రా. పీఠిక ౪౨, ౪౮, ౫౯ పుటలు.)

ఇవ్విధమున నాంధ్ర వాల్మీకిరామాయణ పీఠికయందలి విషయముల శర్మగారు చాలవఱకు విమర్శించి, యెప్పటనో, యెవరో, యనఁగఁ దాము విన్నటులఁ బలుకుచుఁ దామాగ్రంథమును బాగుగాఁ జదువ లేదని వ్రాసియున్నారు. గ్రంథభాగమును జదివినను, చదువకున్నను టీకఁ జక్కగఁ జదివియున్నారు. చూడఁజూడ నాంధ్ర వాల్మీకి యగుననునది కాదనుటయె యభినవాంధ్ర వాల్మీకి మతమని తోఁచుచున్నది. అభినవాంధ్ర వాల్మీకికి రామాయణ ఫలశ్రుతియందుఁ బ్రమాణ బుద్ధిలేదు. ఫలశ్రుతి యతిశయోక్తికి లక్ష్యమట. అది గృఢభక్తిమైఁ బఠించినట్లగునేమో వచింపఁజాలరఁట. (చూ. ఆం. శ్రీ. రా. పీఠిక 37 పుట). దీనిఁబట్టిచూడ దృఢభక్తిమై వీరింతదనుక నిక్కావ్యమును బఠింపలేదని తేలినది. గ్రంథ ఫలశ్రుతికే యీగతికల్పించిన వీరు గోవిందరాజు లాగిన గూఢార్థములకు, తీర్థులవారు దెలిపిన విశేషార్థములకు నగ్రస్థానమునిచ్చి పనిలేని పనిఁగ నేల తెలిఁగించిరో, ఈ విశే

షార్థములు, గూఢార్థములకును—చమత్కారములకును, విద్వద్వినోదము లకేనా. ఫలశ్రుతియందు నిబద్ధబుద్ధియై ప్రమాణభావము గలిగినఁ గదా గ్రంథ పఠనమునకు, వినుటకు నొకనికి కోర్కెజనించును. ఫలశ్రుతి యతిశయోక్తియైనచో గ్రంథపఠనమువలని ఫలము హుళక్కియేనా! లేక తత్పరిశ్రమకుఁ బ్రతిఫలముగ భాషాజ్ఞానము నొకించుక ప్రసాదించి యీర్ష్యావేశేయుతవాగ్వాదములకుఁ బురికొల్పునా! మఱియు రసాలఫలమునకుఁ గ్రిందజీడిపలె శర్మగారు దమ రామాయణకావ్య పీఠికయందు "ముప్పుకుఁ బ్రాఁకుగట్టిలాగుట, పుణ్యాజనులు, లాగిలాగి, లాగినచోఁ జైకివచ్చును", మున్నగు నీచోక్తు లుపయోగించియున్నారు. ఎత్తిపొడుపులు, పుల్లవిఱుపు మాటలు, సంప్రదాయ విరుద్ధాభిప్రాయములుగాకఁ దక్కిన వీరి పీఠికయును చాల ముఖ్యములగు వివరణములతో, సిద్ధాంతములతోఁ జెలువొందు విషయ విమర్శనము పట్లఁ గావ్యతీర్థులకుఁ గల సమర్థత వేయిముఖంబులఁ జాటుచున్నయది.

## అవసరము

తెలుఁగున సమగ్రమగు రామాయణము లేనికొఱఁత యించుమించుగ గోపీనాథరామాయణముతోఁ దీఱినది. ఇయ్యది తెలుఁగున నింకొక రామాయణమువలయునను నవసరమును దోఁపనీయదుగూడను. అయిన నీగ్రంథ మొకింత మూలమును మించి గ్రంథకర్త స్వకీయాభిప్రాయములతోఁ గలసియున్నది. ఈ కారణమున నాంధ్రవాల్మీకి రామాయణము యథామూలముగఁ దెలిఁగింపఁబడి తత్ప్రతిబింబమువలెఁ జూపట్టుచున్నయది. భాస్కర, గోపినాథ, ఆంధ్రవాల్మీకి రామాయణముల మించి రామాయణము నాంధ్రమున రచించుటయన్న సామాన్యవిషయముగాదు; దుర్ఘటమగుకార్యము. ఎఱిఁగి యెఱిఁగి శేషాద్రిశర్మగారీమహోద్యమము నొనర్పవలసినంతటి యక్కఱ యంతగాఁ గన్పట్టదు. పద్యరామాయణములు దురవగాహములుగ నున్నవనుచుఁ దలఁచి కొందఱు పండితులు మూలానుసరణములగు రామాయణ వచనగ్రంథముల రచించియుండిరి. ఇట్టి సందర్భమునఁ దమకు వ్యాఖ్యావిశేషార్థములపైఁ గల భక్తిభావము తదర్థములఁ దెలుగొనర్పఁ బ్రోత్సహించియుండెనేని, సంస్కృతమున వాక్యరూపముగ నున్న వ్యాఖ్యానములఁ జక్కని వచనములుగఁ దెలిగించియుండినచో వారియుద్యమము సంస్తవనీయమై యుండెడిది. అటులుగాక వాక్యరూపముననున్న వ్యాఖ్యానముల నన్నిటినిఁ దెలుగున పదులు, యిరువదులు పాదములుగల పద్యములుగా బరిమీద జైత్రిపోతులు పరువులు వాఱు విధమున రచించుటలో స్వారస్య ముండనేరదు. సంస్కృత భాషాజ్ఞానము నెఱుఁగనివారిని గూడ నాకర్షించి మనోరంజకము గావించు శక్తి శ్రీమద్రామాయణమునకు స్వతస్సిద్ధముగఁ గలదు. అందుకు లోకోత్తర ప్రతిభాశాలియగు వల్మీక భవుని కవితావిభవము, పరమ పావనచరిత్రుండు - ఆర్తరక్షకుండు నగు శ్రీరామకథయును-గారణములు. శ్రీకృష్ణుని మురళీగానమునకు వ్యాఖ్యాత లెవ్వరు?మంద మృదుమధుర స్వరమున నాలాపింపఁబడు రాగావళులకుఁ డిప్పణు లెవ్వరు వ్రాసిరి? నైసర్గికమగు రంజక శక్తి వాటియందు గలదు. అటులే రామాయణమూలమునకును బాఠకుల, శ్రోతల నలరించి శ్రవణ మాత్రమున నానందకందళిత హృదయులఁ గావించు మహిమయున్నది. అది యవ్యక్త మధురకవితా రసప్రభావము. అట్టి యుత్కృష్టతమ గ్రంథరాజము వ్యాఖ్యానములు లేనియెడల నేమూలనోపడి పేరు మాసియుండునని శర్మగారు వ్రాయుటకుఁ గారణము సంప్రదాయ విజితులగు వ్యాఖ్యాతల వ్రాతలఁ దామూలగఁగొని గ్రంథము రచింపఁ దలఁచుటయే కాని యితరముగాదు. బుద్ధివైభవముగలవానికి గీర్వాణ భాష యెన్ని యర్థములఁ గల్పించుటకైనను నవకాశమొసంగును. దాని గభీరత యట్టిది. గాని యౌచితికి భంగము వాటిల్లునెడ విశేషార్థములు, రహస్యార్థములుగూడవ్యర్థము లేయగునేమో; ఔచితికిభంగమువాటిల్లినఁ గవిహృదయాభిప్రాయము కళంకిత మగును. తమయక్కఱకొలఁదిఁ జివురు నకుఁ జేవఁగల్పించురీతి మూలమునందు లేని భక్తిశ్రద్ధల వ్యాఖ్యలపైఁ జూపి శర్మగారు చాల యనవసరశ్రమకుఁ బాల్పడినారు. రామాయణ మెప్పుడుపుట్టినది? మూలముతోనే వ్యాఖ్యపుట్టినదా? మొట్టమొదటి వ్యాఖ్యాతయెవ్వఁడు? మూలమునకు వ్యాఖ్యకు మధ్య నంతరు వెన్ని సంవత్సరములు? ఆమధ్యకాలమున రామాయణ మేమూలపడియుండెను? మూలనున్న దానిని ముంగిలికిఁదెచ్చి ప్రథమమునఁ గీర్తిగడించినవ్యాఖ్యాత యెవ్వఁడు? వ్యాఖ్యపుట్టనంతదనుకను రామాయణము ప్రచారములో లేకనే యుండెనా? ఈ వివరములన్నిటినిఁ జర్చించి శర్మగారటుల వ్రాసినచో సమంజసముగ నుండును. తమకంటె ముందు రచించిన వారి రామాయణములమార్గము ననుసరించినచో యందుఁ గృతకృత్యత వహింపఁజాలమని తలంచి శర్మగారీవ్యాఖ్యామార్గముల నాధారముగఁ గొని మిత్రాజ్ఞమై నెట్టులేని రామాయణము రచింపవలయుగాన, నీ గ్రంథమును రచించినారనుట స్పష్టము. కాని వ్యాఖ్యావిసరణములఁ దెలుపు వాక్యగ్రంథము లుండగా దీనియవసరము గలుగఁ గారణము లేదు. రామాయణపఠనమువలనఁ గలుగు ఫలములఁ దెలుపు వాక్యము లతిశయోక్తులని నిరసించిన శర్మగారికి రామాయణ విశేషార్థములపై యెక్కువమక్కువ గలుగఁ గతమెయ్యదియో? అవసరమట్టి లనిపించెఁ గాఁబోలు! ఇట్టి యనవసరశ్రమకుఁ బాల్పడుటవలన వ్యాఖ్యార్థములఁ బద్యముల రచించుటగాక, దృష్టాంతములు, అభిప్రాయభేదములు, కొన్ని వివరణములు మున్నగునవి యించుమించుగ గ్రంథమాద్యంతములు పుటలకు క్రిందిభాగమున నుల్లేఖింపవలసివచ్చినది. అందున గ్రంథ బాహుళ్యమును నైనది. ఇట్టిపరిశ్రమ యేస్కాందపురాణాంధ్రీకరణ కార్యమునకో శర్మగారు వినియోగించినయెడల నాంధ్రలోకమంతయు వారికి బ్రహ్మరథము బట్టవలసియుండెడిది. రామాయణాంధ్రీకరణ గౌరవమంతయుఁ దొలుతటి ముగ్గురకు లభించినది. మిగులలేదు.

## భాషాంతరీకరణము

ఆంధ్రభాష నుద్ధరించి యాభాషయందు స్వతంత్రగ్రంథనిర్మాణ పద్ధతి స్థాపింపవలయునని నెడి మహోద్యమము నన్నయభట్టారకునితోఁ బ్రారంభమయ్యెను. సాధ్యమైనంతవఱకు నాంధ్రమునకుఁ దామను వదించిన గ్రంథములు స్వతంత్రగ్రంథములవలెఁ గన్పట్టుచు భాషాంతరీకరణము లన్నస్పృహయే చదువరులకు గలుగకుండ నుండవలెనని వారి యభిప్రాయ మనక తీరదు. కాఁబట్టియే వారికృతులు భాషాసంప్రదాయమునకును, నుడికారమునకును చాలములై తెలుఁగుసొలుపుఁ దెలుపుచున్నయవి. పుణ్యకథావిశిష్టము, జనాదరణపాత్రమునగు నొక గీర్వాణగ్రంథరాజమునందలియితివృత్తము ననుసరించి,స్వకపోలకల్పనా సంపద పొంపిరివోవు సరసకవితా సామగ్రిచే భాషాలలామఁ గైసేయుటయే వారి నియతధర్మము. కావుననే యాంధ్రమహాభారతము సంస్కృతభారతమునకన్న మిన్నఁగఁ జూపట్టఁదగు కవిత్వమహత్త్వముచేఁ దెలుఁగు దేశమున గౌరవింపఁబడుచున్నది. భాషాంతరీకరణ యుగమునఁ గవీశ్వరు లెల్ల రీవిధానమునే గౌరవించి గ్రంథముల రచించిరి. వారి యుత్తమగ్రంథములే యాంధ్రభాషాసౌధమునకుఁ బునాదులు. యథాసంస్కృతములైనను, రహస్యార్థ, విశేషార్థవిపులీకరణములైనను నాధ్యాత్మిక, మత, ధర్మ, వైద్యాదిక విషయములందును, నియత పారాయణాదికములకును, సంస్కృతగ్రంథములఁదప్ప, తెలుఁగు పొత్తముల నుపయోగించుట మనలోఁ జాల దక్కువ. ఇయ్యది వృద్ధాచారముగూడను. యథామూలములుగ భాషాంతరీకరణ గ్రంథ రచన మొనర్చు నియతి కవి కల్పనాస్వతంత్రత నరికట్టి సహజ కవితా సౌందర్యమును మఱుగుసేయును. కావుననే యుచితజ్ఞులగు కవిత్రయము, భాస్కరపోతనాదులు దమకృతుల ననన్యసామాన్యమగులీల రచించి పొగడ్తఁ గాంచియున్నారు. ఆంధ్రత్వము, ఆంధ్రభాష, స్వతంత్రాంధ్ర కవిత, ఆంధ్రదేశము, ఆంధ్రావళి, యనువిషయములయెడ వారికిఁ జాల అభిమానము. సనాతనాంధ్రభారత, భాగవత, రామాయణములు యథామూలము లను నియమభూయిష్ఠములై, స్వకపోలకవిత్వ, స్వతంత్ర కల్పనా శూన్యములైయుండినచో నింతటి పేరు ప్రతిష్ఠలఁ గాంచఁజాలక పోయెడివేమో: రామాయణ రచనమున భాస్కరుఁ డెంత స్వతంత్రతఁ గొనియెనో యంతటి నిర్బంధములను ఆంధ్రవాల్మీకి కల్పించుకొనెను. అన్నివిధముల నియమములఁ బాటించి భాషాంతరీకరణ గ్రంథరచనమొనర్చుట మిగుల కష్టతమపుఁ గార్యము. శ్రీరాముని యనుగ్రహములేనిచో నిట్టి మహత్తర కార్యసంఘటనము గానేరదు. భారతదేశమున శ్రీరామ భక్తిలేని భారతీయుఁ డుండఁడనిచెప్పవచ్చును. భక్తిని వెల్లడించి భగవదనుగ్రహపాత్రులు కాదగు మార్గములు పలుతెరఁగులు గలవు. "రామకథ నెంద ఱెన్నిమారు లెవ్విధములనైన రచింపవచ్చు"నని పాపరాజుగా రన్నవాక్యము నాదర్శముగ గొని సమర్థులగు పండిత ప్రకాండు లెల్లరు రామాయణమునే భాషాంతరీకరింప దొరకొన్నచో రానురాను జల్లికవితలు, బొల్లికవితలు వెలసి యాంధ్రభారతిని విరూపనుఁజేయును. రామకథనే రచింపఁ గుతూహలమున్నచో రామాయణ కథావస్తువు ననుసరించి స్వతంత్ర కల్పనావిలసిత మగు నుత్తమకవితా సమేతమగు స్వతంత్ర గ్రంథముల నొకరినించి యొకరు రచింపవచ్చును. అయ్యది యాంధ్రభాషాభివృద్ధికి, కవి కిహపరసాధనములకుఁ గారణము. భాషాంతరీకరణ గ్రంథరచన మొనర్చు కవీశులు తిక్కన, పోతనామాత్యుల రచనావిధానము నాదర్శముగఁగొనుట సమంజసమేమో.

## తెలుఁగు సేఁత

గ్రంథ బాహుళ్యమైనది. ఇఁక నించుక, యిక్కవికుల తిలకుల యాంధ్రీకరణనిపుణతయును, కవితామధురిమయును దెలిసికొనుపొంటె దిఙ్మాత్రముగ రామాయణమున నొకటి రెండుభాగములనుండి శ్లోకములను వాటి యాంధ్రపద్యములను జూపుచున్నాను.

౧. (విషయము—వనమునకుఁ దనవెంట రావలదని వారించుచున్న శ్రీరామునకు సీత ప్రత్యుత్తర మొసంగుట)

శ్రీమద్రామాయణము-అయోధ్యాకాండము ౩౧ స.

శ్లో. సా త ముత్తమసంవిగ్నా సీతావిపులవక్షసమ్;
ప్రణయాచ్చాభిమానాచ్చ పరిచిక్షేప రాఘవమ్. ౨

శ్లో. కింత్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః;
రామ, జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్. ౩

(భాస్కరుని స్వతంత్ర కవిత)

ఆ.వె. నన్ను నీకునిచ్చి నరనాథ, నాతండ్రి
సంతసించియుండు నెంతయేనిఁ
జనునె యగ్నిసాక్షి సహధర్మచారిణి
నయిన నన్ను నిలువుమనుట నీకు. భా. రా. అ. కాం. ౪౬.

## గోపీనాథుని వేంకటకవి

(మూలమున కన్యూనాతిరిక్తముగా నెగడెడి కవితయని వారు పలికినది)

వ.........యద్దేవి ప్రణయాభిమానంబుల నీషత్కోపదీప్తవదనయై వెండియు నిజవల్లభున కిట్లనియె.

చ. విను మిథిలాధినాథుఁ డతి విశ్రుతకీర్తి విదేహుఁడైన మ
జ్జనకుఁడు పత్నినైన నను సమ్మతిఁ బ్రోవఁగఁ జాల కొంటిపై
వనమునకేగు నిన్ను విని వారకలోపల స్త్రీస్వభావము
ఘన పురుషార్హరూపమును గల్గిన యల్లునిఁగాఁ దలంపఁడే.

తే.గీ. రామ! మాతండ్రి జనకుండు రమణతోడ
రూప మాత్రంబుచేతఁ బురుషుఁడ వైన

నిన్ను స్త్రీనిఁగా నెఱుఁగక నన్నొసంగె
నెఱిఁగియుండిన గని కని యేల యిచ్చు.

తే.గీ.అనఘ! మాయయ్య జనకుండు నిను మహాత్మ
నల్లునిఁగఁ గొని భువనత్రయంబునందుఁ
గలుగు భవదన్యపురుష విగ్రహము సర్వ
మాత్మలో నెంచె స్త్రీయని యనుదినంబు.

క. ఆప్తతబుద్ధి విదేహ
జ్యాతలనాథుండు, మాతయను కేకయభూ
నేత్రు సుతవలనఁ గలహం
బీతఱిఁ బుట్టునని యెఱుఁగ కిచ్చె న్నన్నున్.

వ. మఱియును

తే.గీ.కాంత, మాతండ్రి పురుష విగ్రహుఁడ వనుచు
రామ జామాత వనుచుఁ గరంబు నిన్నుఁ
గాంచి యుభయలోక సుఖంబుఁ గనము మున్ను
మగఁ దలంపుచు నానందపూర్ణుఁడయ్యె. గో. రా. అ. కాం.

## ఆంధ్ర వాల్మీకి నియమకవిత

(యథామూలముగ నుండఁగలదని చెప్పినది.)

ఉ. ఊఱడఁ దన్నుఁ బల్కు పురుషోత్తముఁ గన్గొని వెండి సీత దాఁ
గాఱడవిం జరించు పతి గల్గుట యిట్లను నిందు నెయ్యపుం
గోఱడముల్ మనంబు వెఱఁగొట్టుకొనం బరికంపమానయై
మీఱిన కింకచేఁ బతి నమేయపరాక్రము నట్టె చూచుచున్.

తే. నాదుజనకుండు మిథిలాధి నాథుఁ డిప్పు
డిది వినంగ వైదేహుఁ డే మెంచు నిన్ను
రామ! జామాత పురుషవిగ్రహముఁ గొన్న
స్త్రీయటంచును దలఁపడే చిత్తమునను. ఆం. వా. రా. అ. కాం.

## అభినవాంధ్ర వాల్మీకి యపూర్వకవిత

(మునిపల్కులఁ గల యర్థము, వ్యాఖ్యానముల యర్థము,
వారి భావము గలిపినది.)

చ. జనకమహీశపుత్రి పతి సాంత్వనవాక్కులు పల్కుచుండఁగా
వనముల కెట్టులైనఁ జని భర్తనుగూడి వసించు టొప్పునం
చని పనిపూని యెంతయును నంగము కంపమునొంద శూరుఁడై
తనరి విశాలవక్షము నుదారమనంబును గన్న రామునిన్.

క. కనుఁ గొని స్నేహము పెంపునఁ
దనవాఁడను నాశయమున దా నించుకయే
ననుమానింపక ప్రాణే
శుని దానుఁ దిరస్కరింపఁ జొచ్చెన్ గడఁకన్.

సీ. ప్రాణేశ, నీయందుఁ బరమసౌందర్యంబు
గలదు భ్రమింతురు గాంచి దానిఁ
గావున మిథిలేశుఁ డీవు నన్నొకతుకఁ
గావనేరక వీడి కాన కొకఁడ
వేఁగితి వని విచనే నిట్టి నిన్ను నా
జామాత వనిత నిజంబు పైకిఁ
బురుషవేషము దాల్చి తరుణి గ్రహించె నం
చాత్మ నెంచకయున్నె యకట మఱియుఁ
బురుషవిగ్రహమునఁ బొల్చెదు నిను రామ
జామాత నొంది యా క్ష్మావిభుండు.

తే. స్త్రీయటంచునువలఁచె నే మాయెఁగాని
నన్ను విడనాడి నీవు కానలకు నేఁగి
యేల దుఃఖింపఁజేసెద వెల్లరఁ గటు
ప్రజ్వలత్తీక్ష్ణకిరణుని భంగి నీవు. ఆం. శ్రీ.రా. అ. కాం.

## ౨. శూర్పణఖ శ్రీరాముని గాంచి వలచుట

## శ్రీరామసౌందర్య వర్ణనము

శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, ౧౭ సర్గము.

శ్లో. సా తు శూర్పణఖా నామ దశగ్రీవస్య రక్షసః,
భగినీ రామ మాసాద్య దదర్శ త్రిదశోపమమ్. ౬

సింహోరస్కం మహాబాహుం పద్మపత్రనిభేక్షణమ్;
ఆజానుబాహుం దీప్తాస్య మతీవ ప్రియదర్శనమ్. ౭

గజవిక్రాంతగమనం జటామండలధారిణమ్
సుకుమారం మహాసత్త్వం పార్థివవ్యంజనాన్వితమ్. ౮

రామ మిందీవరశ్యామం కందర్ప సదృశప్రభమ్;
బభూ వేంద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా. ౯

శ్లో. సుముఖం దుర్ముఖీ రామం వృత్తమధ్యం మహోదరీ;
విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్రమూర్ధజా. ౧౦

ప్రీతిరూపం విరూపా సా సుస్వరం భైరవస్వరా;
తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ. ౧౧

న్యాయవృత్తం సుదుర్వృత్తా ప్రియ మప్రియదర్శనా;
శరీరజ సమావిష్టా రాక్షసీ వాక్య మబ్రవీత్. ౧౨

## భాస్కరుఁడు

ఉ. అత్తఱిఁ బంక్తికంఠు చెలియ ల్కఠినాత్మక చుప్పనాక దా
నెత్తినవేడ్క నెప్పటికినేనియు నాఁడటు పోయిపోయి రా
జోత్తము రాముఁ జూచె నసితోత్పలవర్ణ వినీలకుంతలుం
జిత్తజ సన్నిభున్ నృపతిసింహు మనోహర దీర్ఘలోచనున్.

క. కనుఁగొని యెంతయు మెచ్చుచుఁ
దనివిసనక మఱియుఁ జూచి తద్దయు రాగం
బునఁ దల యూఁచుచు నెద న
య్యనఘుని యొప్పునకు వలచి యతివిస్మితయై.

సీ. రేకులన్నియు విచ్చి రేయెండ జిగినిండి
కర మొప్పు తెల్లఁదామరలకంటె
నలఁలేని నెఱదీప్తి మెఱుఁగెక్కి సరిమింటఁ
జరియించు సంపూర్ణచంద్రుకంటె
నునుఁదీఁగె జిగి దోఁగి నునుపారి నిగ్గారి
తనరు దిక్కరుల హస్తములకంటె
నిగిడి చేరువలెల్ల నీలోత్పలద్యుతు
ల్పచరించు హరినీల రుచులకంటె.

గీ. నితని కన్ను లొప్పు నీరాజు మో మొప్పు
నితని కరము లొప్పు నితని మేని
కాంతి యొప్పు ననుచుఁ గడువేడ్క నన్నిశా
చరి కనుఁగొనె రామచంద్ర విభుని.                భా. రా. ఆ. కాం.

## వేంకట కవీంద్రుఁడు

చ. దశముఖదైత్యరాడ్భగిని దారుణలోచన లంబజిహ్వ దు
ర్దశన దురాగ్రహప్రబలతావికటీకృతచిత్త భూరినీ
లశిఖరితుల్యగాత్రి యొకరాక్షసి శూర్పణఖాభిధాన యా
దశరథపుత్రు నాశ్రమపదంబునకుం జనుదెంచె లీలతోన్.

వ. ఇవ్విధంబునం జనుదెంచి,

సీ. ఇందీవరశ్యాముఁ గందర్పసమధాము నాజానుబాహు నీలాభ్రదేహు నరి
గమలపత్రనిభాక్షు విమలశోభనవక్షు నతిసుకుమారు విశ్రుతవిహారు
రాజచిహ్నసమేతు రాఘవాన్వయజాతు దరహాసవదను సౌందర్యసదను
రమణీయగుణజాలు విమలవిద్యాశీలుఁ గరుణాలవాలు భాసురకపోలుఁ

తే. దరుణయౌవన కలితు సీతాసమేతు
ఘనజటాధారి వల్కలాజినవిహారి
రాము నందంద చూచి శూర్పణఖ బహుళ
కామభారావసన్నయై కదియవచ్చి.

సీ. తనదుర్ముఖత్వమా యన సుముఖత్వంబుఁ
గాంచి రెంటికి నీడు గాఁ దలంచి
తనమహోదరము నాయనవృత్తమధ్యంబుఁ
గాంచి రెం డొకటిగా నెంచికొనుచుఁ
దనవిరూపాక్షు లాయనవిశాలాక్షులుఁ
బరికించి సరియకాఁ బ్రస్తుతించి
తనతామ్రకేశ మాయనసుకేశముఁ జూచి
తగునని డెందానఁ దమకమూని

తే. తనదువార్ధక మాయన తరుణవయసు
దనవికృతమూర్తి నాయన విమలమూర్తి
తనదుభైరవనాద మాయనసునాద
మరసి యజ్ఞానబుద్ధి తోఁ గనుచుఁ దలఁచి.

ఉ. ఆరఘుభర్తకిట్లనియె.................. గో. రా. ఆ. కాం.

## వావిలికొలను సుబ్బారాయకవి

గీ.............కాకుత్స్థమణి, దేవ
నిభు సదాటుగాఁగ నిర్జరారి
యైన పంక్తివదను ననుజాత శూర్పణ
ఖాఖ్య చూచి చొచ్చె నాశ్రమంబు.

సీ. హర్యక్షనిభవక్షు నరవిందపత్రాక్షు
సంతతోత్సాహు నాజానుబాహు
సలలితదీప్తాస్యు సజ్జనతోషాస్యు
నింద్రసమాను గజేంద్రయాను
వర్ణితసుకుమారు బహుళజటాభారు
సమధికప్రియదర్శు శత్రుకర్శు
నిందీవరశ్యాము సౌందర్యలలకాము
భూపలక్షణయుక్తు భూరిశక్తు

తే. గీ. రాముఁగనుఁగొని కుసుమనారాచశాత
బాణదారితచిత్తయై పాపశీల
రాక్షసాంగన యతనిఁ జేరంగ వచ్చె
వృత్తమధ్య మహోదరి వికటవృత్త.

చం. సుముఖుని దుర్ముఖీమణి, విశుద్ధసుశీలుని బాపశీల, యు
త్తమ శుభరూపవేషుని నితాంతవికారవిరూప, సుస్వరున్
సమధికభైరవస్వర, విశాలవిలోచను భీకరాక్షి, యా
భ్రమర వినీలకుంతలవిరాజితుఁ దామ్రశిరోజ, దక్షిణున్.

తే. వామభాషిణి, తరుణుని బలితదేహి,
దారుణాకార, ప్రియుని నుద్గాఢ భయద
వేష యిట్లనుఁ బంచశరేషు దగ్ధ
చిత్త యగుచును మోహంపుఁ దత్తరమున. ఆం. వా. రా. అ. కాం.

## జనమంచి శేషాద్రి శర్మ కవి

క. అక్కడికి స్వేచ్ఛ మీఱఁగ
రక్కసి యొక్కతుక వచ్చె రక్షోవిభుఁడై
యుక్కునఁ దగు రావణునకు
నక్కామిని భగిని శూర్పణాహ్వయ యది యా.

క. సురసన్నిభుఁడౌ శ్రీరఘు
వరుఁ గని చేరంగ నదియు వచ్చి నిడువయా

నురమున, దీర్ఘ భుజంబుల
సరసిజ పత్రేక్షణములఁ జంద్రద్యుతిచేఁ.

సీ. ఆజానుభుజముల నతిసుందరంబగు మోమునవెలసి సమోద మొసఁగు
దర్శనంబున నొప్పి దర్పగజాభవిక్రాంతయానంబులఁ గ్రాలి జటల
సంపును ధరియించి కోమలగాత్రుఁడై బలవిశేషంబులఁ బరఁగి రాజ
లక్షణసముదయ లక్షితుండయి నల్లఁగలువరేకులవంటి కాంతిదమున

తే గీ. సమసుతేజస్సు వెలయంగ శక్రుఁబోలి
యున్న శ్రీరాముఁ గాంచి యా యగ్రదనుజ
కాంత మదిలోన నెంతయుఁ గామ మడర
మోహ మందెను మదిలోని యూహ పోలయ.

చం. కనఁదగుమోమువాఁడు రఘుకాంతుఁడు, దుర్ముఖి యద్ది సంద్రమై
ననడుము సోగకన్నులు కనంగలవాఁ డతఁ డామెయో కనుం
గొనఁ బెనుపొట్టయుఁ వికృతిఁ గొల్పెడు కన్నులు గల్గియుండు మె
త్తని నునునెంద్రుకల్ వెలయఁ బా నలరారు నతండు రాతుసాం
గనయును దామ్రమూర్ధజనికాయము గల్గిన దెంలో సంతసం
బును దగ నిచ్చు నాకృతిని బొందినవాఁడతఁ డద్ది క్రూరమౌ
తనువున నొప్పుఁ జారునినదంబునఁ బొల్చెడువాఁడు రాముఁ డా
దనుజకుమారి భీమనినదంబున నొప్పుచునుండు రాఘవుం
డనుపమ యౌవనస్ఫురణ మందినవాఁ డది దారుణాకృతిం
గని జరతా విశీర్ణతనుగాంచిన దాతఁడు మంజుభాషి యం
గనయు వికారభాషిణి నికామసుశీలము గల్గువాఁ డతం
డనుదిన మెన్న దుష్టమగు నాచరణంబును బూను నద్ది యిం
పునిడెడు దర్శనంబుగల భూపతి యాతఁ డసహ్యదర్శనం
బునఁ దగు నద్ది యిట్లు కనఁ బోలని యాసురపుత్రి) యెంతయుఁ
గనఁదగియున్న రాఘవునిఁ గాంచి యనంగ వశంగతాత్మయై
చని నికటంబుఁజేరి మది సంతస మొప్పఁగఁ బల్కె నివ్విధిఁ."

ఆం. శ్రీ. రా. ఆ. కాం.

ఎవ్వరెవ్వ రెంతదనుకఁ దమతమ ప్రతిజ్ఞల నిర్వహింపఁ గలిగి నదియుఁ బై పద్యముల నొండొంటిఁ బోల్చిచూచినఁ దెలియఁ గలదు. భాస్కరుని కవిత పారతంత్ర్యము నెఱుఁగదు. గోపినాథుని వాణి స్వతంత్రపరతంత్రముల రెంటిని ననుభవింప నేర్పరి. ఆంధ్రవాల్మీకిగారి శారద నియమపరంపరల నారితేరిన ప్రౌఢయు, పారతంత్ర్య శృంఖలముల నలంకారమునకుఁ గైసేసిన భూషణములట్లు లోకులకుఁ జూపి యొప్పింపఁగల జాణయు. అభినవాంధ్రవాల్మీకిగారి భారతి స్వతంత్రపరతంత్రముల నెఱుంగక, ప్రౌఢ గాక-జాణ గాక, "ఆత్మబుద్ధిస్సుఖం చైవ" యనులోకోక్తి నెఱింగి మెలంగనేర్చిన యపూర్వచతుర. వేంకటకవి రచనము గొన్ని యెడల పోతనామాత్యుని కవనపుఁబోకడల ననుసరించినది. శేషాద్రిశర్మగారు వ్యాఖ్యానముల భాషాంతరీకరించి వ్రాసిన తెలుఁగు పద్యములకంటె నందందుఁ బుటలకుఁ గ్రిందిభాగములఁ బొందుపఱచినవారివివరణవాక్యములు చాలసరసముగ, మృదువుగ, సులభగ్రాహ్యములుగ నున్నవి. వ్యాఖ్యాన చతుష్టయవిశిష్టగీర్వాణ శ్రీమద్రామాయణమువలె వీరును మూలశ్లోకములకుఁ బద్యములును, ఆయాశ్లోకవ్యాఖ్యానములకు వాక్యములును నాంధ్రమున రచించియుండినఁ బాఠకులకుఁ జాల నుపకారముగను, సులభగ్రాహ్యముగను నుండెడిది. ఆంధ్ర శ్రీమద్రామాయణము తక్కిన మూఁడు గ్రంథములకంటెఁ బెరిఁగినది. భాస్కరునిగ్రంథ మన్నిటికంటె నాకృతినిఁ జిన్నది. తక్కినరెండును సమములని తలంపవచ్చును. ఆంధ్రవాల్మీకి రామాయణ రచనము క్లిష్టముగ నున్నదని యందందుఁ గొందఱితలంపు. కాని యెంత యత్నించియు నాగ్రంథము నంతకంటె సరళముగ రచింపఁజాలరని ఆంధ్రశ్రీమద్రామాయణము వెల్లడించుచున్నది.

## కల్పనాశక్తి

జాతీయము, భావము, కల్పన, ఔచితి, ప్రకరణానుసరణము సద్ధము నొసంగు లలితపద ప్రయోగము గలిగియుండినఁ గాని కవిత్వము గాదు. మూలమునకుఁ బ్రతిబింబములుగ నుండఁ గలఁపుఁగొని రచించుకావ్యముల విషయమునఁ దల్కర్తల కివియన్నియు నన్ని శృంఖలములే. పూర్వజన్మసుకృతవిశేషము-దైవానుగ్రహము నుండినఁగాని యనేకనియమనిర్బంధములతోఁగూడ జనాదరణపాత్ర మగు నుత్తమ కవిత యొనర్పఁజాలరు. యథామూలముగఁ దెలిఁగింపఁబడెడి గ్రంథమున స్వకపోలకల్పనముల కవకాశము లభింపదు. ఇతివృత్తమును మాత్రము మూలమునుండి కైకొని స్వేచ్ఛాకల్పితమగు కవిత రచించు కవీశ్వరునకుఁ దన కవితాశిల్పకల్పన నిచ్చకొలఁదిఁ గల్పించి తీర్చి దిద్ద నవకాశము గలదు. ఆంధ్రవాల్మీకి, భాస్కర గ్రంథములఁ దిలకించిన నిది తెలియఁగలదు. ఇం దుదాహరింపఁబడిన రామసౌందర్య వర్ణనమును గూర్చి వ్రాసిన పద్యములఁ జూడుఁడు: మూలశ్లోకములందలి మధురిమ గాని, భాస్కరుని పద్యములోని కల్పనాశిల్పముగాని తక్కినవారి పద్యములఁ గాన్పింపదు. గోపినాథుని పద్యములు మాత్రము కొంత స్వతంత్రము, కొంత మూలానుసరణము, కొంతదనుక భాగవతపద్యానుకరణము గలుగుటఁ జేసి లలితములై యాంధ్రత్వ గౌరవమునకుఁ దగియున్నవి. ఆంధ్ర వాల్మీకి రామాయణము "అసలుకు సరియైన నకలు" గాన దీన శేషాద్రి శర్మగారుచెప్పి నటులు గవి తనపైత్యముఁ జేర్ప నవకాశము లేదు. కావున కల్పనా శక్తి యెంత గలదని యీగ్రంథము నరయఁ గూడదు. మూలమునఁగల కల్పన దీనఁ గాననగును. మూలమునఁ గల్పన లేనియెడ దీనియందు నుండదు. ఆంధ్ర శ్రీమద్రామాయణ రచనమునఁ గొంత స్వతంత్రము గొందుమని సూచించిన శేషాద్రిశర్మగారు గూడ నూత్నకల్పనలఁ గల్పింపరైరి. అద్వైత విశిష్టాద్వైత మతవాదుల యభిప్రాయ భేదములకుఁ గారణములై, యతిసూక్ష్మ విమర్శలకు, వ్యాఖ్యానములకు నింకను దావునిచ్చుచు, హోరాహోరిఁ బోరాట

ములకుఁ గారణములగుచు, రహస్యార్థము-విశేషార్థము-లను పేరున ప్రకరణ విరుద్ధార్థకల్పనములకుఁ గురియగుచున్న శ్లోకార్థములకుఁ బద్దెముల వ్రాయుటకన్నఁ దమ కవిత్వపటుత్వమహత్వసంపదఁ బొంపిరిపోవు సరస నూత్నకల్పనముల శర్మగారు కల్పించినచో నీరామాయణము తదితర రామాయణముల మించియుండెడిది. చూడఁజూడ స్వేచ్ఛాకల్పనమున భాస్కరుని, యథామూలముగఁ దెలిఁగించుటలో నాంధ్రవాల్మీకిని, రామాయణ రచనావిధానమునఁ దక్కినవారు మించలేరని తోఁచుచున్నయది. ప్రత్యేక కారణము లీగ్రంథ ద్వయమునఁ గాననగుటనిటు లనవలసి వచ్చుచున్నది. గోపినాథుని కవనధోరణి లలితము, నిరంకుశము. శేషాద్రి శర్మగారి కవిత గభీరము. ఒకమనవి: యథామూలము లను నెపమునఁ గ్రమముగఁ గల్పనాశక్తి క్షీణింప సాగుచున్నది. యథామూలమైనను నాంధ్రభాషా సంప్రదాయపద్ధతికి దూరమైనచో నా గ్రంథము భాషసతికి నలంకారమా! భారముగాక. ఆంధ్రత్వ గౌరవముకొఱకుఁ బాటుపడి కావ్యసృష్టి యొనర్చిరి గావుననే సనాతన కవులు వాగనుశాసనులు, కవిబ్రహ్మలు, సర్వజ్ఞులు నై యశశ్శరీరముల నేఁడును జీవించియున్నారు.

## మనవి

వర్తమానమునఁ గవీశ్వరులకు నలయు సౌకర్యముల నొసంగి పోషించు నుదారు లంతగా లేరు. అందున నాంధ్రభాషాభివృద్ధికి నొనర్పఁదగు కృషియంతయు నపరవాణీ స్వరూపులగు పండిత ప్రకాండులపై నిలిచియున్నది. వారు కేవల భాషాభిమానమును, తదభివృద్ధియుఁ గోరి, యసూయా రహితహృదయములఁ గార్యక్రమ మొనర్పఁ గడంగినఁగాని కృతకృత్యతఁ గాంచి నన్నయాదులట్లు మహోన్నత యశస్సు గడింపఁజాలరు. ఎదియేని కారణము నొకటి యాధారముగఁ గొని యొకరు వ్రాసిన గ్రంథము నింకొకరు రచించుట, వ్రాసినను దమకు ముందు రచించిన వారిని మించి రచింపఁజాలకపోవుట, చర్వితచర్వణ మొనర్చుట యగుఁగాని యందువలన భాషాభివృద్ధి కానేరదు. అటుల రచింపఁబడిన పుస్తకసంపుటములు గ్రంథ విక్రయశాలల బీరువాల నలంకరింపఁగలవేమో కాని భాషాయోషనలంకరింపఁజాలవు. మఱియు నాగ్రంథములు నీరసము లగుటఁ బాఠకలోక మాదరింపదు. ఇక వాని పుట్టువువలన నేమిప్రయోజనము? సంస్కృతమునుండి తెలుఁగు సేయఁదగు మహాగ్రంథము లింక నెన్నియో వివిధ విషయములకు సంబంధించినవి గలవు. చేసినపనినే చేయుచుఁ దమయమూల్యమగు కాలమును వ్యయపఱుపక ఆంధ్ర పండితప్రకాండు లకార్యములకుఁ గడంగి యందుఁ గృతకృత్యులై మాతృభాషఁ బోషింపుచు నాంధ్ర సోదరుల వందనములకుఁ బాత్రు లయ్యెదరు గాతయని వినతి యొనర్చుచున్నాను.

---



శ్రీ నూన పానకాలు శ్రేష్ఠిగారు, చీరాల.



శ్రీ యం. రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి.



ఆంధ్రమహాసభాస్థాపనము, చెన్నపురి. అధ్యక్షుడు: ఆనరబుల్ జస్టిస్ వెంకటసుబ్బారావుగారు.



శ్రీ రామస్వామి గారు.



శ్రీ పంచరత్నము గారు.



కె. కె. పాలెట్ గారు.



శ్రీ ప్రకాశరావు గారు.



కీ. శే. బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ

వేదము వేంకటరాయశాస్త్రిగారు, కళాప్రపూర్ణ

'ఛాయాచిత్రమునుండి'



శ్రీరామ బాలభక్త వాఙ్మయ సేవాసంఘ సభ్యులు, రాజమండ్రి.



సంస్కృతోన్నత కళాశాల, రాజమండ్రి.



శ్రీ పొట్టూరి అన్నపూర్ణయ్యగారు.



శ్రీ బిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు.



ఆంధ్రరాష్ట్రమహాసభ, బెజవాడ. అధ్యక్షుడు: శ్రీ యర్ర. వెంకటలక్ష్మీనరసింహారావుగారు.

# నైషధకావ్యాదిప్రశంస

ఇవటూరి సుందయ్యా గారు

"నైషధం విద్వదౌషధమ్" అను నాభాణకము జగద్విదితము. "విద్ + మత్ = విద్వత్" అగును. దానికిఁ బుంలింగరూపము "విద్వాన్"గదా. విద ధాతువునకు జ్ఞాన మర్థము. ఆజ్ఞానము ద్వివిధము: ఐహికము, నాముష్మికము. ఈ రెండు విధములైన జ్ఞానము కలవారే విద్వాంసులు. అట్టివారి పాలిటికి నైషధ మౌషధము వంటిది. శరీరశక్తి కేదేనిలోపము వాటిల్లినపు డౌషధ మాలోపమును బోకడచి బాధను దొలఁగించునట్లే,విజ్ఞానవంతు లగువారి కాజ్ఞానమున నేదేని లోపము సంభవించినచో నట్టిలోపమును బోఁగొట్టి వారివిజ్ఞానము పూర్తి చేయఁగలది కనుక నే యాగ్రంథమున కట్టిప్రసిద్ధి కలిగినట్లు తోఁచుచున్నది. అనఁగా మానవున కావశ్యకమగు నైహికాముష్మికజ్ఞానసంపద నొసంగువిషయము లన్నియు దీనియందుఁ గలవనియు, దీనిని బఠించినచో మానవుఁడు సంపూర్ణవిజ్ఞానియై సుఖించుననియు ఫలితార్థము.

ఈ గ్రంథమును రచించినమహాకవి శ్రీహర్షుఁడు. ఇతని చరిత్రము సర్వజనవిదితము. ఇతఁడు కాశికిఁ బోయి "నేను వచ్చితిని" అని జయంతచంద్రునికి (రాజునకు) వర్తమానింప, నాతఁడు శ్రీహర్షునితండ్రియైన శ్రీహీరుని జయించిన పండితునితోఁ గూడ నెదు రేఁగినపుడు శ్రీహర్షుఁడు

"గోవిందనందనతయాచ వపుఃశ్రియాచ
మాస్మిన్నృపే కురుత కామధియం తరుణ్యః,
అస్త్రీకరోతి జగతాం విజయే స్మరః స్త్రీ
రస్త్రీజనః పున రనేన విధీయతే స్త్రీః."

("ఓతరుణులారా! ఈ రాజు గోవిందనందనుఁ డౌటచేతను, శరీరశోభచేతను మన్మథుఁ డనుభ్రాంతి నొందవలదు. మన్మథుఁడు జగద్విజయమునందు స్త్రీల నస్త్రీకరించుచున్నాఁడు.ఇతఁడో,అస్త్రీజనులను స్త్రీలుగాఁ జేయుచున్నాఁడు.") అను శ్లోకమును నాశువుగా రచించి చదివినాఁడని చెప్పుదురు. ఇతఁడు రచించిన గ్రంథమునకు విద్వదౌషధ మనుప్రసిద్ధి కలిగినదిగదా! ఇట్టి మహాగ్రంథమును రచించినట్టియు, ఆశువునుగూడ మంచి చమత్కారముతో రచించినట్టియు, ఇంకను నెన్నో మహాగ్రంథముల రచించినట్టియు నీమహాకవి విద్వదౌషధ ప్రసిద్ధి గాంచిన మహాకావ్యమందలి యాదిమశ్లోకమం దేదేని ధ్వనివిశేషము లేకుండ రచించునా యనుసంశయము జనింపకమానదు. అందు ధ్వనివిశేషము గాదుగదా, ఆశీర్వాదముగాని, నమస్కారముగాని యున్నట్లైన నెవ్వరును (వ్యాఖ్యాతలు) తెలిపియుండలేదు.

"ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్"

అను నాలంకారికశాసనాను సరణముగా వస్తునిర్దేశముతో నాదిమ శ్లోకమును రచించినాఁడు కావున ఆశీర్నమస్క్రియాకార్యము లనావశ్యకములనియు, అందుచేతనే వ్యాఖ్యాతృసార్వభౌముఁ డగు మల్లినాథసూరి తన వ్యాఖ్యానమందు "చికీర్షితావిఘ్నపరిసమాప్తి సంప్రదాయావిచ్ఛేదలక్షణఫలసాధనత్వాత్, ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖ మిత్యాశీరాద్యన్యతమస్య ప్రబంధముఖలక్షణత్వాచ్చ కథానాయకస్య రాజ్ఞో నలస్య భూతిలక్షణం పరమమంగళం వస్తునిర్ది

శతి" అని వ్రాసియున్నాఁడు- అనియుఁ గొంద ఱందు రేమో! నాయకభూతిలక్షణపూర్వకమగు వస్తునిర్దేశమాత్రముతో నాదిమశ్లోకమును రచించినను, దేవతాస్మరణమైన లేకుండ నాదిమశ్లోకమును రచించునాచారముసాధారణముగా మనలోఁ గానరాదు. కాళిదాసు రఘువంశమున గంభీరార్థయుక్తమగు నీశ్వరస్తవముతోడనే యాదిమశ్లోకమును రచించినాఁడు. కుమారసంభవమున దేవతాస్మరణపూర్వకమగు

"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః"

అను శ్లోకమును, మేఘదూత యందు సీతారామ స్మరణపూర్వకమగు

"జనకతనయాస్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు"

అను శ్లోకమును రచించినాఁడు. భారవి కిరాతార్జునీయమందు లక్ష్మీస్మరణపూర్వకముగా

"శ్రియః కురూణా మధిపస్య పాలనీమ్"

అను శ్లోకమును రచించినాఁడు. మాఘకవి శిశుపాలవధయందు విష్ణుస్మరణ పూర్వకముగా

"శ్రియఃపతి శ్శ్రీమతి శాసితుం జగ
జ్జగన్నివాసో వసుదేవసద్మని"

అను శ్లోకమును రచించినాఁడు. శాకుంతలాది నాటకములనాందీ శ్లోకములమాట వేఱ చెప్ప నవసరము లేదు గదా. ఈ నైషధారంభ శ్లోకమునందును "బుధ" శబ్దమొండు సాధారణముగా దేవతావాచకముగాఁ గనఁబడుచున్నది. కాని యింతటి గొప్పకవి యీలాటి గ్రంథమున నాదిమశ్లోకమం దీమాత్రముతోఁ దృప్తి నొందునా యను సందేహము కలుగక మానదు.

శ్రీహర్షుఁడు తన గ్రంథారంభమున 6 శ్లోకములలో నలునికథాప్రశస్తి, అద్భుతగుణవిశేషము, పావిత్ర్యము, విద్యావైశద్యము, ఈశ్వరాంశ సంభూతత్వము వర్ణించుచు,

1. "నిపీయ యస్య క్షితిరక్షిణః కథా
స్తథా ద్రియంతే న బుధా స్సుధా మపి,
నల స్సితచ్ఛత్రితకీర్తిమండల
స్స రాశి రాసీ న్మహసాం మహోజ్జ్వలః.

2. "రసైః కథా యస్య సుధావధీరిణీ
నల స్స భూజాని రభూ ద్గుణాద్భుతః,
సువర్ణదండైక సితాతపత్రిత
జ్వలత్ప్రతాపావళికీర్తిమండలః.

3. "పవిత్ర మత్రాతనుతే జగద్యుగే
స్మృతా రసక్షాళనయేవ యత్కథా,
కథం న సా మద్గిర మావిలామపి
స్వసేవినీమేవ పవిత్రయిష్యతి.

4. "అధీతిబోధాచరణప్రచారణై
ర్దశా శ్చతస్రః ప్రణయ న్నుపాధిభిః,
చతుర్దశత్వం కృతవాన్ కుతః స్వయం
న వేద్మి విద్యాసు చతుర్దశ స్వయం.

5. "అముష్య విద్యా రసనాగ్రనర్తకీ
త్రయీవ నీతాంగగుణేన విస్తరమ్,
అగాహ తాష్టాదశతాం జిగీషయా
నవద్వయద్వీపపృథగ్జయశ్రియామ్.

6. "దిగీశబృందాంశ విభూతి రీశితా
దిశాం న కామప్రసభావరోధినీం,
బభార శాస్త్రాణి దృశం ద్వయాధికాం
నిజత్రినేత్రావతరత్వబోధికామ్."

(1. ఏభూపాలుని కథా రసమును బానముచే... దేవత లమృతమునుగూడ దానినివలె నాదరింపరో, ఏ... సితచ్ఛత్రితకీర్తి మండలుఁడును, తేజోరాశియు, ను... జ్వలుఁడును నగు నలమహారాజు కలఁడు.

2. సుధాతిరిచ్యమాన స్వాదుచరిత్రము కలవాడును, దండముగాఁ జేయఁబడిన ప్రకాశయుక్త మ... ప్రతాపము, సితాతపత్రముగాఁ జేయఁబడిన కీర్తిమం... లము కలవాఁడును నగు నలుఁ డద్భుతగుణసంపన్నుఁ...

3. రసము (గంగాజలము) మాలిన్యమును క్షాళన మొనర్చునట్లు స్మరణమాత్రముచే దత్కథారసము కలియుగమున జగత్తునంతను బవిత్రము చేయుచుండఁగా, దత సేవనే చేయు నాజిహ్వ యావిలమైన దైనను, దానిని బవిత్రము చేయకుండునా?

4. చతుర్దశవిద్యలయందును అధీతి బోధాచరణ ప్రచారణాద్యుపాధులచే నాలుగవస్థలను (దశాః చతస్రః) బ్రాపింపఁజేయుచు నితఁడు మరల స్వయముగాఁ జతుర్దశత్వమునే యేల చేసినాఁడో తెలియకున్నది?

5. ఈనలమహారాజుయొక్క రసనాగ్రనర్తకియైన యావిద్య త్రివేదివలె షడంగగుణావృత్తిచే విస్తరించినదై, పదునెనిమిదిద్వీపములయందును వేఱువేఱుగా నగు జయలక్ష్మిని జయించు నిచ్ఛతో అష్టాదశత్వము నొందెను.

6. ఇంద్రాది దిక్పాలకాంశమహిమ కలిగిన దిగీశత్వముగల యాతఁడు కామప్రసభావరోధినియైన తనత్రినేత్రావతారత (ఈశ్వరావతారత) ను బోధించు ద్వయాధిక నేత్రమగు శాస్త్రమును భరించెను.)

అను శ్లోకములను రచించినాఁడు.

ఇందు మొదటిశ్లోకము నందు వస్తునిర్దేశమే గాక సగుణనిర్గుణ ప్రతిపాదకమగు దేవతాస్మరణము, ఆశీస్సు కూడ ధ్వనితములేమో యను నూహ పొడముచున్నది. ఎట్లనఁగా: ఇందలి "క్షితిరక్షిణ, బుధ, సుధా, మహసాం రాశిః, మహోజ్వల మొదలగు శబ్దములచేత నలకథ విష్ణువుయొక్కయు, దేవతల యొక్కయుఁ బ్రసాదముచే అమృతత్వము లభింపఁజేసి కీర్తి ప్రతాపములతో వర్ధిల్లఁజేయునని సగుణప్రతిపాదకమగు నైహిక సుఖసంప్రాప్తిని, వ్యాపనశీలమును, జ్ఞానస్వరూపమును, అమృత స్వరూపమును, తేజోమయమును నగు పరబ్రహ్మమునం దైక్య మొనరింపఁజేయునని నిర్గుణప్రతిపాదక మగు నాముష్మిక సుఖసంప్రాప్తిని నొసంగునట్టి దని సూచించుటయే గాక, వానివివరము నీక్రిందిశ్లోకములలో వివరించినాఁడని తోఁచుచున్నది:

"అట్టి ప్రతాపాదు లొసంగి వర్ధిల్లఁజేయునట్టిదియు, నమృతత్వాదుల నొసంగునట్టిదియు తత్కథ దుష్టశిక్షణమందు సూర్యప్రతాపమువలెఁ దీక్ష్ణమైనదై, సజ్జనావనమందుఁ జంద్రజ్యోత్స్నవలె శీతలత్వముకలదై యత్యద్భుత గుణసంపద కల దని 'సువర్ణదండైకసితాతపత్రితజ్వలత్ప్రతాపావళికీర్తిమండల, గుణాద్భుత' మొదలగు శబ్దములచే 2 వ శ్లోకమునను, అమృతత్వాదుల లభింపఁజేయు సుధ వంటి దేగాక, గంగాజలము వలె అమృతత్వ, శీతలత్వ, పావిత్ర్యములు కలదై స్మరించినంతమాత్రముచే సమస్త కల్మషములను క్షాళన మొనర్చి పవిత్రము చేయునని 'కథా, స్మృతా, రస, క్షాళన, ఆవిలాం, పవిత్రయిష్యతి' అను శబ్దములచేత 3 వ శ్లోకమునను, అట్లు పవిత్రత నొసఁగి, పిమ్మట బ్రహ్మైక్యప్రదమగు జ్ఞానవిశేషము లభింపఁ జేసి, వానియం దధీతిబోధాచరణప్రచారణసామర్థ్య మిచ్చి తురీయాశ్రమార్హునిగాఁ జేయునని 'విద్యా, అధీతిబోధాచరణ ప్రచారణ, చతస్రః' అను శబ్దములచే 4 వ శ్లోకమునను, అట్టిజ్ఞానము మూలమున, ఈషణత్రయ, అరిషడ్వర్గాది గుణదోషముల జయింపఁజేసి మోక్షలక్ష్మి నొంద నర్హునిగాఁ జేయునని 'విద్యా, త్రయీ, షడంగగుణ, జిగీషా, జయశ్రియాం' ఇత్యాది శబ్దములచే 5 వ శ్లోకమునను, అట్లు సమస్తమైన కామాదివికారదోషములను జయింపఁ జేసి జ్ఞానసంపదచే దిక్పాలకాది దేవతలకంటె నధికునిగాఁ జేసి చివర కీశ్వరైక్యము నొందునట్లు చేయునని 'కామ ప్రసభావరోధినీం, దిగీశబృంద, ఈశితా, త్రినేత్రావతరత్వ బోధికాం, ద్వయాధికాం' ఇత్యాదిశబ్దములచే 6 వ శ్లోకమునను సూచించినాఁడని తోఁచుచున్నది. మఱియు నీ విషయమంతయు 6 శ్లోకములలో వరుసగా వర్ణించుట నలుఁడు షడ్గుణైశ్వర్యసంపన్నుఁ డగు నీశ్వరుతుల్యుఁ డని తెలుపుటకే యని తోఁచుచున్నది.

ఇట్లు సగుణనిర్గుణ ప్రతిపాదకమైన దేవతానమస్కార మంగళపూర్వకముగాను, ఆశీఃపూర్వకముగాను, వస్తునిర్దేశ పూర్వకముగాను గూడ నాదిమ శ్లోకములను రచించియుండునేమో యను నూహ కలుగుచున్నది.

ఇట్లే ధ్వనివిశేషయుక్తముగా సమస్త పరిపూర్ణజ్ఞానదము లగు విషయము లీగ్రంథమం దిమిడియుండుటచేత నే యీ గ్రంథమునకు విద్వదాపధప్రశస్తి కలిగినదేమో యని తోఁచుచున్నది.

ఈభావము లిదినఱ కేవ్యాఖ్యాతలును వివరించి యుండలేదనియు,నట్టివిశేషము:లే యిందున్నచో వా రుపే క్షింతురా! యనియు, అచ్చటచ్చటఁగల యేవో పదముల గుదిగుచ్చి యిట్టిసార్థక్యములు చెప్పి గొప్ప సంపాదింప వలెనను నూహతో వ్రాసినయీవ్రాఁతలు విజ్ఞులగువారి యామోదమును బొందవనియుఁ గొంద అందురేమో! శాకుంతలాదినాటకములలోని

"యా సృష్టిః స్రష్టు రాద్యా వహతి విధిహుతం
యా హవి ర్యా చ హోత్రీ"

ఇత్యాది శ్లోకములలోని 'ఈశ,సృష్టి, విధిహుతం'ఇత్యాది శబ్దములచే దుష్యంతుఁడు, శకుంతల, వారి సంభోగము మొదలగువిషయములు సూచితముని యంగీకరించునపు డీవిషయములమాత్ర మేల యంగీకరింపరాదు? లేకున్నఁ బైని జెప్పిన శబ్దములనే యేల యుపయోగింప వలెను? ఆ శ్లోకములకు నట్టిపరస్పరసంబంధ మేల యేర్పఱచినాఁడు? అనుప్రశ్నముల కుత్తరము లేమియుఁ దోఁచుటలేదు. మఱియు

"పతి రతీవ ధనీ సుభగో యువా
పరవిలాసవతీషు పరాఙ్ముఖః,
శిశు రలంకురుతే భవనం సదా
తదపి సా యువతీ రుదతీ కుతః."

అనుశ్లోకమున సుభగశబ్దముచేత మంచి నక్షత్రమందే గాని తన్ను భర్త పొందఁడని భార్య రోదనము చేయు నను విషయము సూచితమని కొందఱును, ఈ సుభగ శబ్దముచేతనే నాథుఁడు పరసతీలోలుఁడని రోదించు నను విషయము సూచితమని కొందఱును సుభగశబ్దప్రయోగ ముచే ధ్వని నంగీకరించునపు డీపైని వ్రాసిన నైషధాదిమ శ్లోకములలోని ధ్వని విశేషముల నంగీకరించుట దోషము కాదు. కవియొక్క గొప్పను బట్టియు, లోకములోఁ దద్గ్రంథమునుగూర్చి వ్యాప్తమైన యాభాస కమును బట్టియు నీ యాదిమ శ్లోకములలో నే వేని విశే షము లుండకుండునా యని బాధించుసందేహము నివా రించుకొనుటకై యాలోచింప, నాకుఁ దోఁచిన విషయము లిందు వ్రాసినచో విజ్ఞులైనవారు వాని యథార్థ్యమును దెలుపుదురను నాసతో నీవ్యాసమును వ్రాసినాఁడను గాని గొప్పకై కాదని మనవిచేయుచున్నాను. ఈ 6 శ్లోకములకుఁ గల పరస్పరసంబంధము గాని, యీలాటివిషయము వర్ణింపఁ బడుటగాని యీశ్లోకములతరువాతి వానికిలేదు. ఆశ్లోకము లలో సాధారణముగా రాజుల నందఱనుగూర్చి వర్ణించు నట్లే పరిపాలనా విశేషము, యుద్ధయాత్రా విశేషము, దాతృత్వగరిమ, చక్కఁదనము మొదలగు విషయములు మాత్రమే వర్ణింపఁబడినవి. కాఁబట్టి విజ్ఞులైనవారు వీనిని బరికించి చిత్తగింతురుగాత మని ప్రార్థించుచు నింతటితో విరమించినాఁడను.

---

# పారిజాతాపహరణ మనుచరిత్ర రచనా కాలములు

కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.,

ప్రాచీనాంధ్ర కావ్యముల రచనాకాలము నిర్ణయించుట శశ విషాణాన్వేషణమును బోలు కార్యము. ఎవరో యొకరిద్దఱు మాత్రము తమ కావ్యములందు తద్రచనాకాలమును జేర్కొనియున్నారు. అయినను దత్కార్యసాధనమునకై లభించిన సామగ్రియున్న యెడల, కొంచె మెచ్చుతగ్గుగ, కాలనిర్ణయమును గావింపవచ్చును.

పారిజాతాపహరణ రచనాకాలమును గూర్చి మున్నొకసారి భారతిపత్రికకు వ్రాసియుంటిని. ఇప్పు డద్దానిని మఱల నెత్తుకొనుట పునరుక్తియైనను మనుచరిత్ర రచనాకాలమునుగూర్చి ప్రశంసించుటకేని దాని ప్రశంస రాకతీరదు.

పారిజాతాపహరణమునం దీక్రిందిపద్యమును జూడుడు:

సీ. ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె
        వినుకొండ మాటమాత్రనె హరించెఁ
    గూటము ల్సెనగంగఁ గొండవీ డగలించె
        జెల్లముకొండ యచ్చెల్లఁ జెజెచె
    వేలుపుఁగొండ యుద్వృత్తి భంగము సేసె
        జల్లిపల్లి సమగ్రశక్తిఁ గూల్చె
    గినుకమీఱ ననంతగిరి క్రిందుపడఁ జేసెఁ
        గంబంబు మెట్టు గ్రక్కునఁ గదల్చె
గీ. బలనికాయము కాలమట్టుల నడంచఁ
    గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
    డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
    రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు.

పైపద్యములో ఉదయగిరి, కొండవీడు మొదలగు దుర్గములను జయించి, శ్రీకృష్ణరాయలు కటకముపై దండెత్తుటకు సంసిద్ధుఁడుగ నుండెనని తెలిసికొననగును. పైదుర్గముల నెప్పుడు జయించి, కృష్ణరాయలు కటకముపై దండయాత్ర వెడలెనో మనకుఁ గల శాసనాధారముల ననుసరించి తెలిసికొనఁగలము.

శ్రీకృష్ణరాయని ధరణికోట శాసనమునందు, పైని వివరింపబడిన దుర్గములను సాధించి, శాలివాహనశకము ౧౪౩౭సం. యువసంవత్సర ఆషాఢ బహుళ ౧౨ భానువారము అమరావతికివచ్చి, అమరేశ్వరుని తులాపురుష దానము చేసినట్లున్నది. ఈశాసనమునకలు 'కవిజీవితములు' పుట ౫౧౬-౫౨౭లో ఈయఁబడినది.

'స్వస్తి శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరు రాయరగండ, అరిరాయవిభాడ, భాషిగెతప్పువరాయరగండ, అష్టదిక్కురాయ మనోభయంకర, పూర్వ దక్షిణ పశ్చిమసముద్రాధీశ్వర, యవనరాజ్య స్థాపనాచార్య, గజపతివిభాడ, శ్రీ వీరప్రతాప, శ్రీకృష్ణదేవమహారాయలు విజయనగరానుండి పూర్వదిగ్విజయయాత్రకు వేంచేసి, ఉదయగిరిదుర్గముసాధించి, తిరుమలరాయ మహాపాత్రుని బట్టుకొని అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము మొదలయిన గిరిదుర్గ స్థలదుర్గాలు అన్ని యేక ధాటిం గైకొని, కొండవీటి దుర్గము లగ్గలుపుచ్చుకొని ప్రతాపరుద్ర గజపతి కుమారుఁడు వీరభద్రరాయనిన్ని............జీవగ్రహముగా పట్టుకొని, వారికి అభయధాన మిచ్చి ధరణికోటకు అమరేశ్వరులకై వేంచేసి స్వస్తిశ్రీ..................'

అనగా యువ సంవత్సర ఆషాఢబహుళ ౧౨ భానువారము నాఁటికి పూర్వదిగ్విజయ యాత్రలోఁ బైని పేర్కొనఁబడిన దుర్గములు సాధించుటయైనది పారిజాతాపహరణములోని సీసపద్యమునందలి దుర్గముల నాతేదినాటికి సాధించెను. కావున పారిజాతాపహరణము పైతేదీ తర్వాతనే విరచింపఁబడి యుండవలెను. తరువాతను శ్రీకృష్ణరాయలు కటకముపై నెప్పుడు దండయాత్ర వెడలియుండెనని నిశ్చయింపవలెను. దీనికిప్రమాణ మాతని అహోబిలశాసన మున్నది. ఆశాసనముయొక్క నకలు 'కవిజీవితములు' ౫౧౧-౫౧౧ పుటలలో నీయఁబడినది. ఆశాసనములలో స్పష్టముగా ధరణికోటశాసనములో వివరింపఁబడిన దుర్గములను మఱల వివరించి, రాయలు ధరణికోటకువచ్చి విజయనగరమునకు వెడలిపోయెననియుఁ, దరువాత కళింగ దేశదిగ్విజయార్థమై బయలుదేఱెననియుఁ దెలుపఁబడియున్నది. అనఁగా పారిజాతాపహరణము పైసీసపద్యము చొప్పున ధరణికోటశాసనమునకును, అహోబిలశాసనమునకును నడిమికాలమున శ్రీకృష్ణరాయలు 'విజయనగరానకు విచ్చేసి, రత్నసింహాసనస్థుఁడై సామ్రాజ్యము చేయుచుండఁగా విత

చింపఁబడెనన్నచో సత్యమునకు దూరముగాదు. అహోబిల శాసనము లేదీ యువ సంవత్సర పుష్యశుద్ధ ౧౫ శుక్రవారము. పారిజాతాపహరణ కావ్యరచనా కాలము యువసంవత్సర ఆషాఢబహుళ ౧౨ భానువారమునకును, ఆ సంవత్సర పుష్య శుద్ధ ౧౪ శుక్రవారమునకును మధ్యమున ననుట విస్పష్టము. ప్రాచీన కావ్యరాజములలో నొకటియైన పారిజాతాపహరణ రచనాకాలము సులభముగ నిర్ణయింపఁగలిగితిమి గదా. అహోబిల శాసనము ధరణికోటశాసనమును ప్రాఁతయం దనుసరించియున్నది. దానిలోని కొంతభాగము నీ దిగువ నుదాహరించుచున్నాను: 'ధరణికోటకు విచ్చేసి, అమరేశ్వర మహాదేవుని తులాపురుష మహాదానమున్ను చేయ నవధరించి తిరిగి విజయనగరానకు విచ్చేసి, రత్నసింహాసనస్థుఁడై సామ్రాజ్యము చేయుచున్న, మఱి కళింగదేశ దిగ్విజార్థమై విచ్చేయుచు, అహోబలానకు వేంచేసి దేవుని దర్శించి, శ్రీవిజయాభ్యుదయ శా. స. ౧౪౩౭ అగు నేటి యువసం. పుష్యశుద్ధ ౧౫ శుక్రవారమందు శ్రీ అహోబలదేవునికి...............'

ఇఁక మనుచరిత్ర రచనాకాల ప్రశంసను దీసికొందము. ఇది పారిజాతాపహరణ రచనాకాల నిర్ణయమంత సులభసాధ్యము కాదు. ప్రతిబంధకము లనేకము లున్నవి కాని పండితులు సత్యాన్వేషణపరాయణులై తిలకింతురుగాక.

మనుచరిత్రములోని, యీ క్రిందిపద్యములను జూడుఁడు:—

సీ. తొలుదొల్త నుదయాద్రి శిలఁ దాఁకి తీండ్రించు
        నసిలోహమున వెచ్చనయి జనించె
    మఱి కొండవీఁడెక్కి మార్కొని నలియైన
        యలకసవాప్రాత్రు నంటి రాఁజె
    నట సాగి జమ్మిలోయఁబడి వేఁగి దహించెఁ
        గోన బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలెఁ
    గనకగిరిస్ఫూర్తిఁ గఱచె గౌతమిఁ గ్రాఁచె
        నవల నాఫొట్నూర రవులుకొనియె
గీ. మాడెములు వ్రేల్చె నొడ్డాది మసియొనర్చె
    గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవ
    దోఁకచిచ్చన నౌర, యుద్ధురతఁ గృష్ణ
    రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని.

వ. అభిరతిఁ గృష్ణరాయల జయాంకములన్ లిఖియించి తాళసన్నిభముగఁ బొట్టునూరి కడ నిల్పిన కంబము సింహభూధర ప్రభు తిరునాళ్లకుం దిగు సురప్రకరంబు కళింగమేదినీ విభునపకీర్తి కజ్జలము వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్.

కావున మనుచరిత్ర రచనాకాలము నాఁటికి కళింగ దిగ్విజయము పూర్తి కావింపఁబడెను. మనుచరిత్ర గద్యచొప్పున పెద్దనకు ఆంధ్రకవితాపితామహ యన్న బిరుదుకూడ లభించియుండెను. కళింగదేశము జయింపఁబడుటయు, 'ఆంధ్రకవితా పితామహ' యన్న బిరుదున మనుచరిత్ర రచనాకాలనిర్ణయమున కెంత తోడ్పడునన్నవో చూచెదముగాక.

ఇఁక మనకు శాసనము లెంతవఱకుఁ దోడ్పడఁగలవో పరిశీలింతము. శ్రీకృష్ణరాయల శాసనములు రెండు సింహాచల నృసింహదేవుని దేవాలయమునందుఁ గలవు. ఆరెంటిని నే నొకప్పుడు సింహాచల మేఁగినప్పుడు చదివితిని. అందొకటి దేవాలయమున కెడమప్రక్కను ప్రాకారమంటపమునంగల స్తంభముపైని చెక్కఁబడియున్నట్లు జ్ఞాపకము. రెండవది దేవాలయముమీఁదనే, యొకప్రక్క నున్న ట్లూహింతును. ఈరెండు శాసనములయొక్క నకళ్లు కవి జీవితములం దీయఁబడినవి. (పుటలు 509—517; (243 and 249 of 1889 Epigraphical report). అహోబిలశాసనము ననుసరించి రాయలు యువసంవత్సర పుష్య శు ౧౪ శుక్రవారమునకుఁ బూర్వమె కళింగ దిగ్విజయార్థము బయలుదేఱి, ఆ తేదినాఁటికి అహోబిలము వచ్చినట్లు స్పష్టము. రాయల మొదటి సింహాచలశాసనముప్రకారము సింహాచలస్వామి సన్నిధిని ధాతసంవత్సర చైత్రబహుళ ద్వాదశినాఁ డున్నట్లు తెలియుచున్నది. "........కృష్ణదేవ మహారాయలు విజయనగర సింహాసనారూఢుఁడై పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి, ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలయిన దుర్గాలు సాధించిరి. సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శా. స. ౧౪౩౭ అగు నేటి ధాత సంవత్సర చైత్ర-బ-ద్వాదశి వారాన సింహాద్రినాథుని దర్శించి......"

కృష్ణరాయల రెండవ సింహాచల శాసనము శా.శ.౧౪౪౧ ప్రమాది నామ సంవత్సర శ్రావణ శు ౧౪ సోమవారమునాఁడు వ్రాయింపఁబడినది. ఆశాసనభాగమును మనకు కావలసినంత మట్టుకు క్రిందిభాగమున నిత్తును;

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౪౧ అగు నేటి ప్రమాదినామసంవత్సర శ్రావణ శు ౧౩ సోమవారాన, శ్రీ మన్మహారాజాధిరాజ...............శ్రీ వీరప్రతాప కృష్ణదేవరాయలు విజయనగర సింహాసనారూఢుడై సింహాద్రినాథునికి తన పేరిట భోగము నడిచేటందుకు ప్రతాపరుద్ర గపజతి మహారాయలు చేతను పుచ్చుకొన్న గ్రామాలు, కళింగ దండపాటలోని గ్రామాలు, పెదగానిగ్రామం...................సింహగిరి అప్పనికి........"

మొదటి సింహాచల శాసనము ప్రకారము ఆ శాసనదినమున రాయలు సింహాద్రిపై నుండెను. రెండవ శాసనకాలమునాఁడు సింహాచలమందు గాక, విజయనగరముననే యుండెను. కాని కీర్తిశేషులైన శ్రీ లక్ష్మణరావుగా రీరెండవ శాసనము ప్రకారము రాయలు రెండవసారి కటకముపై దండెత్తి యుండెనని యూహించుచున్నారు. ఈశాసనము నకలు వారు చూచియున్నను ఇట్టి విభ్రా

లికిఁ గారణ మూహింప నలవికాకున్నది. మన ప్రస్తుతాంశమునకుఁ గావలసిన విషయ మేమనఁగ, పెద్దన మనుచరిత్రమునందు కళింగ దిగ్విజయమును బూర్తిగా వర్ణించుటచేత, రెండవ శాసనము కాలమునాఁటికి మనుచరిత్ర రాయలు కృతినందియుండవలెను. శ్రీలక్ష్మణరావుగారు ఈ శాసనము తేదీతరువాతనే మనుచరిత్ర పెద్దన రచించి యుండవలెనని నిర్ధారణచేసినారు. (చూడుఁడు: అల్లసాని పెద్దన్న, విజ్ఞానసర్వస్వము, పుట ౧౬౩౯.) ఆనిర్ణయము పొరపాటని పాఠకులకు మనవిచేయుచుఁ నీ క్రిందిరీతిని ఋజువుచేయుచున్నాను. రెండవ సింహాచలశాసనము విజయనగరమునందుండియో, మఱియెక్కడినుండియో రాయ లుండి, వ్రాయింపఁబడినదని ఆశాసనమే స్పష్టముగ జెప్పుచున్నది. రాయ లా శాసనమునాఁడు సింహాచలమున లేఁడు. అదియుఁగాక, కృష్ణరాయ విజయము, రాయవాచకము మొదలయిన గ్రంథములు రాయ లొకతూరియె కళింగముపై దిగ్విజయయాత్ర యొనర్చెనని వక్కాణించుచున్నవి. మనుచరిత్రములోఁ బై నుదాహరింపఁబడిన పద్యములు చదివినచో నా దిగ్విజయమంతయు నొకదండయాత్రతోనే ముగింపఁబడినదని తెలిసికొనవచ్చును. రాయ లీదిగ్విజయానంతరము తీర్థయాత్రలు వెడలెనని రాయవాచకము(See Sources of Vizayanagara history page 117) కృష్ణరాయ విజయములందు వివరింపఁబడెను. రాయలు తన స్వసైన్య నివహములతో బెజవాడయందు దండువిడిసి, ఒకవైపున మహమ్మదీయులతోను, ఒకవైపున గజపతితోను బోరు సలుపుచుండెనని మన మూహింపవచ్చును. రాయలు మొదటి సింహాచల శాసనము ప్రకారము సింహాద్రివఱకును బోయి, ఆ కాలముననే గజపతితో సంధి చేసుకొని, వెనుకకు మఱలి వచ్చి, ఆ సంవత్సరమే జూలై-ఆగస్టు ప్రాంతముల (July-August-1516) బెజవాడకు వచ్చి చేరియుండెను. (See Madras Epigraphists Cllections Nos. 243-245-of 1899. Vide: The Yet Remembered Ruler of a long Forgotten Empire, p. 17.) అనఁగా ధాతసంవత్సర శ్రావణ భాద్రపదమాసప్రాంతముల రాయలు కృష్ణవేణీ తీరంబున నుండెను.

రాయ లాతర్వాత దక్షిణదేశమందలి తీర్థయాత్రల సేవించి, మఱల కొంతకాల మైనపిదప మహమ్మదీయులతోఁ బోరాడి, తిరిగి బెజవాడకు వచ్చియుండెను. ఇందుకు తార్కాణముగా పెద్దన్న కోకటశాసనములు రెం డున్నవి.

అం దొకటి బెజవాడ మల్లిఖార్జునదేవుని సన్నిధిని, కోకట గ్రామములోని సకలేశ్వరునికి కొన్ని పొలములు ధారపోసిన శాసనము. ఈ శాసనకాలము బహుధాన్య సంవత్సర వైశాఖ శుద్ధపౌర్ణమి (౨౫-౪-౧౫౧౮). ఆసంవత్సరమె చెన్నకేశవస్వామి కిచ్చిన దానశాసన మింకొకటి కలదు. ఆ శాసనకాలము బహుధాన్య సం॥ కార్తిక బహుళద్వాదశి (౩౧-౧౦-౧౫౧౮). ఈ రెండుశాసనముల ననుసరించియుఁ బెద్దన్న యింకను రాయలతోడ నుండెననియు, నీకాలమునకు విజయనగరము చేరియుండలేదనియు స్పష్టము. (ఈశాసనముల నకళ్లు విజ్ఞాన సర్వస్వము, పుటలు ౧౬౩౮-౧౬౩౯ మధ్య నీయఁబడినవి.) అదియును గాక, శ్రీకృష్ణరాయల శ్రీకాకుళశాసనము ననుసరించి రాయలు బహుధాన్యనామసం॥ ఫాల్గుణశుద్ధ ఏకాదశినాఁడు శ్రీకాకుళమందు ఆంధ్రవల్లభుని సేవించుచుండెనని తెలియుచున్నది. (లక్ష్మణరాయవ్యాసావళి, పుట ౩౫.) ఈశాసనము తేదీ ఆంగ్లమానమున ౧౧-౨-౧౫౧౯. అనఁగా రాయలు విజయనగరమునకు ఆ తేదీ తర్వాతనే వచ్చియుండె నని మన మూహింపవలెను.

క్రీ. శ. ౧౫౧౯ ఫిబ్రవరి మాసాంతమున రాయలు మఱల విజయనగరమునకై బయలుదేఱి, తన్నగరమునకు బహుధాన్య సంవత్సరాంతమునకు విచ్చేసియుండును. అప్పటికి కళింగ దిగ్విజయము, మహమ్మదీయ వైరిధ్వంసము మొదలగు కార్యములై, నిజనగరమునకు విజయసంరంభముతో నేతెంచియుండును. పూర్వము పూర్వదిగ్విజయానంతరము పారిజాతాపహరణకావ్యము విరచింపఁబడి ఎట్లు రాయలకుఁ గృతియీయఁబడెనో, యట్లే యీ విజయసంరంభానంతరము మనుచరిత్ర రచింపఁబడి రాయలకు కృతి యీయఁబడియుండును.

ఇంకొక విశేష మున్నది. రెండు కోకటశాసనములలోను అల్లసాని పెద్దనకు 'ఆంధ్రకవితా పితామహ' యన్న బిరుదు లేదు. ఆయనకా బిరుదు మనుచరిత్ర రచించిన తరువాతనే వచ్చియుండునే కాని తత్పూర్వము కానేరదు. అనఁగా మనుచరిత్రము విరచింపఁబడియున్నయెడల ౩౧-౧౦-౧౫౧౮ (రెండవ కోకట శాసనకాలము) తర్వాతనే విరచింపఁబడియుండవలెను. ఇతని కీ బిరు దున్నట్లు అల్లసాని పెద్దన్న అన్నూరు శాసనమునుబట్టికూడ తెలియుచున్నది. (విజ్ఞాన సర్వస్వము, పుట౧౬౩౯; అల్లసాని పెద్దన్న యనువ్యాసము.) ఆశాసనములో 'ఆంధ్రకవితా పితామహులయిన పెద్దిరాజుగారు' అని పెద్దన్న వ్రాయఁబడెను. ఈశాసనకాలము ప్రమాదిసంవత్సర కార్తిక శుద్ధ పౌర్ణమి. ఆంగ్లమానమున ౬-౧౧-౧౫౧౯ అయియున్నది.

కావున అల్లసాని పెద్దన్న శ్రీకాకుళశాసనకాలమైన ౧౧-౨-౧౫౧౯ తేదీ తర్వాతను, అన్నూరు శాసనకాలమైన ౬-౧౧-౧౫౧౯ పూర్వమునను మనుచరిత్ర రచించి రాయల కంకిత మిచ్చియుండును.

సుప్రసిద్ధాంధ్రకవులచే విరచింపఁబడిన రెండు మహాకావ్యముల రచనాకాలము నాచేత నైనంతవఱకు కొన్ని మాసముల నడిమికాలమున విరచింపఁబడెనని నిర్ణయించితిని. ప్రమాదము పురుషలక్షణము. ఇందలి హేతువాదము ఖండించి, నిర్ణయము సరియైనది కాదని నిరూపించినయెడల వారికి నే నెంతయును గృతజ్ఞుఁడను.

కీర్తిశేషులైన శ్రీలక్ష్మణరావుగారు శ్రీకాకుళశాసనము ననుసరించి, రాయలు ఆముక్తమాల్యద రచించుటకుఁ బ్రారంభించిన తేదీ ఆశాసనకాలమైన ౧౧-౨-౧౫౧౯ తేదీ అని నిశ్చయించినారు. రాయలు తన గ్రంథమునందు ఆంధ్రవల్లభుని సేవించిన విషయమును చెప్పుకొని,

ఆదేవునాజ్ఞచే గ్రంథనిబంధనమునకుఁ బూనుకొంటినని వ్రాసికొనెనే కాని, ఆతేదీనుండియే గ్రంథరచన కారంభించెనని మన మూహింపరాదు. మనుచరిత్రలోని అవతారికపద్యములు ఆముక్తమాల్యదలో నుండుటచేత, రాయలు మనుచరిత్ర కృతినందిన తరువాత, నాపద్యములనే తన కృత్యాదిని గూర్చి యుండును. రాయలు నేను నిర్ణయించిన కాలము మధ్య మనుచరిత్రను గృతి నంది, తర్వాత తన గ్రంథమును వ్రాయుటకుఁ బూనుకొనియుండుననుట కేసందేహమును లేదు. కావున నేను నిర్ణయించిన మనుచరిత్ర రచనాకాలము మనుచరిత్రే ముందా, ఆముక్తమాల్యద ముందా అను ప్రశ్నకు ప్రతిబంధకము కానేరదు. ఇంతవఱ కెవ్వరును ఈ రెండుకావ్యముల రచనాకాలమును ఇదమిత్థమని నిర్ణయింపకపోవుటచే, నే నీకార్యమునకుఁ గడంగితిని. ఎంతవఱకుఁ గృతకృత్యుఁడ నైతినో పండితులే నిర్ణయింతురుగాక.

---

# అజంతా చిత్రములు



౨. అంతఃపురద్వారము



ఆంధ్రమహాజనసభా సమావేశము, బెజవాడ



ఆంధ్రదేశ హిందూస్థాన సేవాదళ సమావేశము, బెజవాడ.



ఆంధ్ర, కృష్ణాపత్రికాధిపతుల కొసగిన రజితపేటికలు, బెజవాడ.



ఆంధ్ర, కృష్ణాపత్రికల సన్మానసమయ ఛాయాచిత్రము, బెజవాడ.

## మాతృప్రేమ

కొల్లూరు ధర్మారాయకవి గారు, బి. యే.

గర్భ నరకంబటంచు విజ్ఞానులమని-పలుకుచుందురు వేదాంత వాక్యములను
ఎండ కన్నైనఁ జూపక యీవిషాద-విశ్వతోముఖవీచికావేష్టితమగు
కటిక లోకాన నెత్తుటి కందునొకనిఁ-గాంచి జోకొట్టు పిడికెడు గర్భనిలయ
మే కరణి "నరక"మొ మూఢలోకమునకు ?
తల్లి గర్భముఁ బాసి యీధరణి మీఁద-బడినయప్పుడె నేనెంతొ వగచియుంటి
నా నిరవధి కానంద విహాయసమున-నెగురగా లేక పుడమికి డిగుటఁజేసి.

శుక్తిపుట వినిక్షిప్తమౌ మౌక్తికమటు-లే యలౌకిక దివ్య దుర్జేయ సీమ
నుండియో వచ్చి యాకొని యున్న నీదు-పుత్త్రి పరితప్త గర్భానఁ బొడమినాను !
అవని జన్మము నొందిన యట్టినాఁడు-దుర్ముహూర్తము నాఁడెట్టిదో యొకింత
ముచ్చటేనియుఁ దీరకమునుపె తల్లి!-పాడులోకంబునే విడనాడినావు !
ఆ యచిరమాతృరాగ తృప్తావసరము-మూఁడు వత్సరాలఁట నాకు పూర్వ యామ
దర్శిత స్వప్నమటు లవేద్యముగఁ దోఁచు-కడుపుఫలమేదొ యొడిలోనఁ గాంచినంత
కంటికిని రెప్పవలె నన్నుఁ గాచి తమ్మ-యసురులన్నియు నామీఁద నుంచితమ్మ.

యష్టకష్టాల నా కొరక నుభవించి-పెంచిచేసితివమ్మ నన్ పెద్దవాని
చిరు నగవు నాదు మోమునఁ జిందులాడ-అమ్మ మోము హాసమున కొండంతయయ్యె
ఏడ్పు వినగానె రయమున నెగిరివచ్చి-యొడిని బెట్టుక పాలిచ్చి యూరడించి
యెన్నియో తన్ను దాన దూషించుకొనియె-స్వల్పరోగము నను గొంత బాధపెట్ట
గఠిన పథ్యంబులన్ కడు గాసిఁ జెంది-కలుగు దేవులకు ముడుపుఁ గట్టి యుంచి
తనకె వ్యాధివచ్చిన మంచి దనుచు మ్రొక్కి-మోము మోమునఁ జేర్చుచు ముద్దుఁగొనుచు
ఎట్టులున్నది చెప్పుమీ యిపుడు బాబు?-అనుచు ప్రేముడి నొలికించు నమ్మఋణము
నెటులు తీర్చియింతు నే నాఁటికేనిఁ గాని!-అక్కలందరు దరిఁజేరి యదియు నిదియు
కావలెనటంచు నడిగి చీకాకుబెట్ట-"నాకు సుఖమెప్పుడో"యని నాన్న విసుగ
నందరికి నన్నుఁజూపుచు ఆసలెల్ల-దీర్పఁగల్గును మాబాబు, ఓర్పుఁగనుఁడు
ఉన్నతోద్యోగములుచేయు నూళ్ల నేలు-నన్ని కోర్కెలు దీర్చు నా చిన్నికన్న
యనుచు మురిసి ముద్దాడిన యమ్మప్రేమ-కెటులు పాత్రుఁడనౌదునో యెఱుఁగలేను !
లోపములు ప్రేమదృష్టిచే లోపమొంద-నన్నుఁజూడ సంతోషంబు మిన్నుముట్ట
గర్వమెంతేనిఁ జెందిన కన్నతల్లి-కెట్లు సార్థక మొనరింతు నింతప్రేమ !

* * * * * *

జంట గట్టిన మూల బీజంబు లేవు-కప్పురపు ముక్కలట్టులు గాలిఁగలసె;
నేత దుద్భూత సౌగంధ వాతపోత-మే దిగంతాలకేగునో యెఱుఁగరాదు !

---

వేకువ, వికచము లగునా-లీకమ్ముల జుమ్మనుచు నళియుఁబోలె, నుతి
శ్లోకంబులతోఁ భక్తుఁడు-నీకోమలపదము లీశ! నెమ్మిభజించున్.

వ్రాయ నను వు పడనిపాణి గల్గిన,-నదిగాంచ శక్తిలేనికన్నె; యట్టి
యవిటికరణ మున్నకవికి, భావము పత్ర-మెక్క, లేకరియె తదింద్రియంబు.

మేఘపుష్పవృష్టి మింటను బగలు, రే-చక్షువులను దనుపు చందమామ;
చైత్రశుద్ధనవమి జరుగు నుత్సవములుఁ,-జాటు రామరాజ్య సౌఖ్యగరిమ.

రామునిపుట్టుఁ, బెండిలి, పరాక్రమ, మేల్బడి, లోకరంజనం
బీమెయినంచుఁ జాటు, నవమీద్యుమహంబున నేగుపెండ్లి రే,
వ్యోమ మగల్చువాద్యముల బుస్సని ధామ్మని యద్భుతారవా
క్రామిత దిక్కుడుంగవివరంబగు పద్దెగబాణసంచులన్.

నీ వేమి మహాబలుఁడవో-పూవుల నెత్తావిబరువు మోవంగా లే
కీవిధిని బడుచులేచుచు-నావలనికి వత్తు, దక్షిణపు గంధవహా!

తాపము రూపుమాపఁగ నదహ్రదకూప సరోవరాదులం
దాపము వేసవింగఁ, దహర్నిశ;మైనను, సాటిరాదు సు
మ్మోపవమాన! నీకు నది, యోపికదవ్వులనుండి వచ్చి మా
దాపున, కల్లసోఁకి మెయిఁ, ద్రావెదు నీదగదీఱ ఘర్మమున్.

అనలునితండ్రివౌర! యనిలా! యెటులైతివో యింత నీవు చ
ల్లన? మము మంగళంబునను లాజలువోలెను బేల్చు భానుఁడ
స్తనగముఁజేర, వచ్చినకతంబునఁ దోఁచెదొ యూరకట్లు? చం
దనతరుసాధుసంగతి నితాంతత, నిక్కమ యిట్లు మాఱితో?.

జీవులశ్వాసకోశములచేఁ గలఁడందురొ యేమొ కాని నా
భావమునందు రేపవలు వాయువుతోఁచుఁ బ్రణష్టుఁడైనటుల్;
గ్రావములన్ గదల్పఁగల గండఁడు తా నచలత్వమొందుటన్,
స్థావరసంజ్ఞద్రుమాకులకు సార్థకమయ్యెను నేఁడు రోహిణిన్.

కలవు మహీజముల్ పలురకంబులు; వన్నిటఁ దెల్లగన్నెరున్
దలఁతును ధన్యమంచు; నిరతంబు వసించుచు దేవళంబునన్

సలుపు నిజప్రసూనతతి సర్వము దైవసమర్పణంబుగా
నిలు విడనాడి యాత్మఁ బరమేశ్వరుఁ జేర్చు విరాగిలాగునన్

పచ్చని పండుటాకు లనుపత్తిరిఁ దల్లినిఁ బూజచేసి, క
న్మెచ్చుగఁ దావిపూలు దలనిండను దా ధరియించి కోవెలన్
హెచ్చిలుఁ దెల్లగన్నెరు మహీజము, తేఁటుల కన్న నత్ర మా
చిచ్చుచు నూత్నదంపతుల కీశుప్రసాదము పుష్పదామముల్.

పూవునఁగాయ, కాయను బ్రభూతము బీజము, దాన నంకురం
బీవిధి నైజమై పెరుఁగు వృక్షలతాదుల జాతులైన నా
త్రోవ యటుండ, నీశ్వరుని దుర్ఘటసంఘటనైకశక్తిచేఁ
బూవులు శాఖ లాకులును మూలములున్ గొనికొన్ని విత్తులా.

వివిధమనోజ్ఞరూపములు వింత లుదారము లౌ ప్రశస్త
వస్తువులు విహారయోగ్యవసతుల్ జగతిన్ గవితాలతాంగి కం
డ్రవియుఁ, దదన్యమెల్లఁ, బరమాత్మమయం బని మెంచువానిదా
కవితకుఁ, గాలుమోపనిది గల్గునె యొక్కఁ-ణువైన సృష్టిలోన్?

తామరపాకునఁ బోలెన్-జేమాకునఁ దరళమగును నీ; రయినఁ గవి
గ్రామణులు దానిఁ దలఁపరు;-శ్రీమంతుల గుణములే ప్రసిద్ధికి నెక్కున్.

ప్రత్తి, మెటేకు, రాట్నం, ముదరాన నమర్చెనో ధాత లూతకున్?
జెత్తగ నెంత్రుగా,కరయఁ జిత్రముగాదె తదీయశిల్ప? మే
యుత్తమతంతువాయుఁ డెటులోపెడు నంతటి సన్నునూలిపోఁ
గత్తుకొనంగ మాదిరికినైన, వితానపటంబు నేయఁగన్?

వెనుక నోకప్లు కేలిబొట్నవేళులు సాలెల వన్యజాతి ఖం
డన మొనరించె నోర్వనిగుణంబున నం డ్రటులైన, బాధితుల్
చిన పురుగూర్ణనాభికిని శిష్యులు గావలెఁ, గాక యగ్గిపె
ట్టెను బురుడించుదాన నిమిడింపఁగలాఁ రెటు కట్టుఁ బుట్టమున్?

దళపార్శ్వంబుల సన్నయంచులను, బెంద్రాడీఁదు డెంకాయచె
ట్టులపానిన్, దమత్రోటిఁ జీరి, గిజిగాఁడుల్ పన్నుగూఁడుల్ వెలిం
గొలయించుంగద; యూర్ణనాభి దనలో నుత్పన్నమౌ సూక్ష్మతం
తుల నిర్మించెడుపట్లుకావె యరుదుల్? దూరస్థముల్ రమ్యముల్.

పనసరములార! మీవలనఁ బాఁడిని బంటను సౌఖ్యమొంది, యీ
ముసలితనంబువందు మిము ముక్కలుగోయకసాయి కమ్ము పా

లసుల కృతఘ్నతాఘముఁ దలంచి, ఉలాయహాయుండు, వారలీ
వసుమతిఁ బాయఁద్రోయు నసిపత్రముపేరిటి నారకంబునన్.

* పురహారునర్ధమార్యా, సగముం దనుజారి హరించి, రందుచే
హరునియభావ మెల్లెడల నల్లుకొనంగను, గంగ చేరె సా
గరమును, నింగిఁ జంద్రకళ, భూమితలమ్మున భుజగాధి నాథుఁడున్
దిరిపపుఁ ద్రిప్పటల్ నను, దేవ! యధీట్సకలజ్ఞతల్ నిన్నున్.

తెలియఁబడకుండ నిద్దురవలెను వచ్చి యిష్టమౌతటి మరలిపోయెదును లచ్చి;
యొడలుమఱపించుఁ;గనుమూఁతపడఁగఁజేయు-నైనసౌఖ్యార్థమర్థింతురర్థిజనులు.

ఎక్కడ నిర్వ్యాజంతు వుదయించుతఱిన్ నియమింతొ నీవు, త
త్ప్రాక్కృతకర్మబీజముల పంటగఁ బ్రాణి కిడంగమేలు గీ
ళ్లక్కడ నిల్చెడుం గ్రహములన్నియు; నీజగదండ కోటులన్
జక్కఁగ నేల, సామికిఁ బ్రశస్తభటాదులు కాలముఖ్యముల్.

వివిధంబైన ప్రపంచవాంఛలను బ్రావృట్కాలకల్లోలినీ
నవవారిప్రతిమానమైన మనమున్ నైర్మల్య మొందింపఁగా
భవదీయాచల పాదసేవ, కతకప్రాయం బటం చెంచి మ
త్కావనంబున్ బచరింతుఁ దత్కృతి ముకుందా, భక్తచింతామణీ!

---

* ఈపద్యము సంస్కృతశ్లోకమునకుఁ దెలుఁగు.

పదములు

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు

పదముల మేము మీరు మము వాడుచునుందురుగాని మాదున
భ్యుదయము సృష్టికిం బరమొ పూర్వమొ మీ రొకనాఁడు నేనియుఁ
మదులఁ దలంచియున్నటులు మాకుఁ గనంబడలేదు మమ్ములఁ
బదిఁబదిఁ బండితోత్తములు భావనచేయుఁడు తత్త్వదృష్టితోఁ.

పరమేశ్వరునకు శక్తికిఁ-బురాతనపు వేళఁ బెండ్లి ముచ్చట యగు న
త్తఱిఁ బుట్టిన యర్థముతో-సరాసరిగ మాకుఁగూడ జన్మ ఘటిల్లెఁ.

కవి తన్మయతోన్మత్తుం-డవు పుణ్యపు ఘటికలందు నత్యుత్సాహో
త్సవమును జవమును గైకొని-దివిపై కెగురుదుము మేము దివ్యుల పోలెఁ.

అపుడు మే మింత బరువని యరయఁబోము-దారమునయందు నాణిముత్యాలు వోలె
నతుకుకొని యుందు మెందుఁ మే మర్థమందు-మమ్ముఁబోలు పతివ్రతామణులు లేరు.

చల్లనివేళ సత్కవి విశాలమనంబునయందుఁ బుట్టి సం
ఫుల్లత నొందు హల్లకము పోల్కి నొకళ్ల మొకళ్ల మోలిమై
నల్లన మేము విచ్చుచునె యర్థముతోడ రసంబునందులఁ
మెల్లఁ గరంగిపోయెదము మేలని మెచ్చెద రప్డు పండితుల్.

అల్ల రాసక్రీడయం దేము మేనెఱుం-గము మాకు నపు డది కలుగఁబోదు
మావల్లభుని మేము మాహస్తములతోడఁ-బెనవైచికొని యుందు మనుచు నెఱుఁగ
మాతండు తాఁగూడ నాచందమున మమ్ము-నెనయు నటంచు మే మెఱుఁగలేము
ఆతండు మేమును నల్లల్ల నొక్కళ్ల-మయిపోదు మొకహృదయంబుతోడ
అపుడు కొందఱు మముఁగాంచి యర్థమంద్రు-అపుడు కొందఱు రసమటంచంద్రు మమ్ము
ఇంక మీరందఱుంగూడ నేమియేని-చెప్పుకొనుఁడయ్య! యాలకించెదము మేము.

అంతన్ మాదుసమాధి దెల్పు మదితో వ్యాఖ్యాత మాయంగముల్
సాంతంబుఁ విఱుగంగఁ గొట్టి మఱి వస్త్రంబుల్ విభూషాదికం
బంతం ద్రోఁచి పృథక్కరించెడిని మాయర్థంబుతో మమ్ములన్
శాంతం పాప మతండు చంపక విడున్ దాత్పర్యముం దెల్పుచుఁ.

ఈయెడ శాకటాయనులు నెందఱు పాణిను లెంద ఱల్లకా
త్యాయను లెందఱెందఱు పతంజలు లెందఱు వ్యాడివామనుల్

పోయిరో? యెంతమంది యిఁకఁబోదురో నన్నయ చిన్నయాదు లౌ
రా! యొకమాఱు మేము పద మాన్చి పదంబును నెత్తు లోపలన్.

వరవైయాకరణులు మా-విరాజి సగుణస్వరూప వివిధాకారం
బెఱుఁగుదురు కాని వైయా-కరణ ఖసూచుల్ గ్రహింపఁగాఁగల రొక్కో?

అల్ల వైయాకరణ శిల్పి యరసి యరసి-మమ్ముఁ జిత్రించు; కొండ్రెల్ల మానవులును
మేము మా మానమున లేచి మెల్ల నూర్తు-మపుడు చిత్తరు వది తుదలందుఁ జెరుగు.

మరలన్ మాచిత్తరువునఁ-జెరిఁగిన భాగములఁ బూర్తిచేయఁగ వైయా
కరణుండు వచ్చు నీదెసఁ-దిరుగును జక్రంబు సకల దిగేశములన్.

వాఁ డుండె నేవాఁడు వాని పే రది యేమొ-యరసికుం డంచును ననఁగవచ్చు
వానికిఁ గొంచెము వ్యాకరణము వచ్చు-నర్థంబు మాట తా నతని కేల?
ఆతఁ డిక్కడ దోష మక్కడ దోషంబు-గ్రామ్య మీయది కారకంబు చెడియె
అన్యదేశ్యంబు లీయవి శిష్టజనములు-పలుకంగ నైనను బలుకఁ బోరు
అంచు మమ్ములనన్ నిరసించివైచి-కొసకుఁ దోలును మము మాలగూడెమునకు
అంతమాత్రాన మాప్రియ సుంత వీడ-మాతఁడుంగూడ మము వీడఁ డంతమాత్ర.

ఏ మల మాలగూడెమున కేఁగిన బాఁపన యగ్రహారపున్
సీమకు నేఁగినన్ సమమె నేమము తప్పినఁ దప్పకున్న నొం
డే మఱి మే మొగిన్ సుకవిహృత్కమలంబున నుండి సృష్టి గొ
న్నా మనుచో మహాజనులనాల్కకు భూషణ మౌదు మెంతయున్.

వీణియపై వేలు వేయదు వాగ్దేవి-మా నైజ సంగీత మహిమ వినుచు
నలినాసనుని నాల్గు నగుమోము లెక్కడె-క్కడ నంచు మాకు స్వాగత మొసంగు
మౌనివర్యులు మనోమందిరంబుల యందు-నలరింత్రు మాకు సింహాసనంబు
కవిరాజు లమృతంబు కడగాఁగఁ బెట్టి మ-మ్మాదరింతురు భావమేదురముగ
మేము లేకున్న మూగలు మీర లెల్ల-మేము వచ్చిన వాక్పతుల్ మీరలెల్ల
భావ మనిమెడు నెత్తావి బలిసియున్న-మేలు రేకుల విప్పారు పూల మేము.

---

# మన్మథమూర్తి

శ్రీ వేంకటకాళిదాస కవులు (ఆంధ్రగీర్వాణ సాహిత్య పరిషత్తు)

నీవు వసంతరాజ్యరమణీమణి నేలు ప్రియప్రభుండవో,
తావుల సంపదల్ పొలుపుఁ దప్పక యుండఁగఁ, దేనె మాధురుల్
పోవకయుండ, రేకుల సముజ్జ్వలశోభలు మాయకుండఁగాఁ,
బూవులసెజ్జపై నిదురవోవు మహాసుకుమార మూర్తివో.

వలపుతలంపులన్ దెలియవచ్చునె, పూవుల సోయగంబులన్
దెలియకమున్న మోహనమతీ! మధుమాసర మామనోహరా!
యలరులు గాంక్షసేయు ప్రణయార్ద్రసుధామయమూర్తు లేరొ? వా
రల హృదయంబు లెంతమధురంబులొ, యెంత మనోహరంబులో?

ప్రేమరహస్యముల్ వెలువరింపని గూఢమనోమనోహరా
రామములన్ ముదంబున నిరంతరమున్ విహరించుచుందువో
నీమధురానిలమ్ములు వినిర్మలతన్ స్పృశియించినంత స
ద్యోమృదుభావముల్ విరియునో పులకాంకురముల్ ఘటింపుచున్.

ఈ నవసాంధ్యవేళ నుదయించిన రాగమవౌదువో, పువుం
దేనియ వౌదువో, వలపుతియ్యదనంబుల నారగించు మం
దానిలముగ్ధబాలకుఁడ వౌదువో, ప్రేమరహస్య సంపదల్
పూనిన యాత్మభూపదవిఁ బొల్చెదవో, సుకుమారమన్మథా!

నీ చరియించునట్టి రమణీయ పథమ్ములయందుఁ బుష్పముల్
పూచునొ, నీకటాక్షపు వెలుంగులు సోఁకినచోటులన్ సుధా
సేచనసంపదల్ రుచులు చిల్కునొ, నీ సుకుమారవాయువుల్
వీచిన తావులన్ మివులఁ బ్రేమలతల్ చివురించునో, సఖా!

ఆర్తు లొసంగు నుష్ణనయనాశ్రు లలంతికఁ దాల్తువో, సుఖ
స్ఫూర్తి సమన్విత ప్రణయమూర్తు లొసంగు మనోహరంబులౌ
నార్తవపుష్పమాలికల నాదృతిఁ దాల్తువొ, ప్రేమదేవతా
మూర్తి, వసంతవిశ్వపరిపూర్ణుఁడ వొక్కఁడ వీవె మన్మథా!

తీయని ప్రేమవాసనల తేజము మాయని నవ్యయౌవన
ప్రాయవసంతపుష్పము లుపాయన మీయఁగఁ దెచ్చు ముగ్ధ లీ
లాయువతీజనంబుల విలాసముపై మరలించుచుందువో
నీ యభిమానపూర్వరమణీయ విలోకనపంక్తులన్ సఖా!

మోహనిబంధనమ్మగుచుఁ బొల్చు పరస్పరవీక్షణమ్ము, ల
జ్జాహసనమ్ము, కన్నుల 'నెసంగ వధూవరు లిష్టసక్తి వై
వాహికవేళ నాడు పువుబంతుల యచ్చపు సోయగంబులన్
మోహనమైన నీహృదయమున్ గనపర్చుచునుందువో సఖా!

ఈ మధుమాసవాసరములెల్ల వియోగమలీమసమ్ములై
తామసిపోలెఁ గన్పడవ్యథామతియై విధురాంగి దీనమై
ప్రేమపరీతమౌ విరహదృష్టి వహించిన కన్నులందు వాం
ఛామయముగ్ధనాట్యములు సల్పుచునుండుదువోయి మన్మథా!

చిరవిరహవ్యథావతుల చెక్కిళులన్ దిగజారు లోచనాం
తరగళితాశ్రు బిందువులఁ దావకరూపము గోచరించునో,
పరిమళపుష్పతల్పసుఖవైభవమున్ గొను దంపతుల్ పర
స్పర మిడుకొన్న చుంబనల సౌఖ్యములన్ గనుపట్టెదో సఖా!

ఈ యరసందె చీఁకటుల నెవ్వరికిం గనరాక యేకతం
బా యెలమావిగున్నపయి నాచివురాకుల సెజ్జలోపలన్
గోయిలకన్నె తావిరహకోమలకంఠము నెత్తి మెల్లఁగాఁ
దీయని ప్రేమగీతి నినదింపుచునున్నది వింటివా సఖా!

కోరికలెల్లవాడి సొబగుల్ కృశియింపఁగనున్న నాకు సం
ధ్యారుచి నిష్ఫలవ్యథల నందిన రాగముపోలెఁ దోఁచు; నా
తీరున నే తపించి యెలదేఁటి కుమారిలు నేమొ, జక్కవల్
పారములేని వేదనలఁ బాడునొ యేమొ వియోగగీతముల్.

చిరవిధురాంతరంగమున జీర్ణములై పడియున్న పుష్పమం
జరు లివిగోసుమీ వలపు సంపదలన్ విడలేక మోహబం
ధురగతి నిల్చియున్నవి కనుంగొనుమోయి, నితాంతభక్తి వి
స్ఫురణమునన్ స్మరించి నినుఁ బూజలొనర్చెదనోయి మన్మథా!

---



నేమాన వాసుదేవమూర్తిగారు.



శ్రీ కదిరి శ్రీనివాసాచార్లుగారు.



బి. ఏ. ఉసరెకపండుల వేంకటేశ్వర్లుగారు.



శ్రీ చెరుకువాడ వెంకటనరసింహారావుగారు.



శ్రీ వంకాయల అప్పలనరసింహ భట్టుగారు.



శ్రీ యం. వి. పావన్న గుప్తగారు.



శ్రీ మూచిరెడ్డి వెంకటస్వామి రెడ్డిగారు.



శ్రీ కత్తిపాలెం కృష్ణరావుగారు.



కృష్ణామండల మూడవ అర్చకమహాజనసభ.

# ఛాయ*

మద్దా విశ్వనాథం గారు

[వచన రూపకము]

పాత్రల వివరణము :

ధర్మారావు—ఇంటి యజమానుఁడు

రామకృష్ణయ్య — ధర్మారావుగారి యింటిలో అద్దెకున్న యొకాయన

భానుమూర్తి—రామకృష్ణయ్య పెద్దకుమారుడు

లలితాంబ— ,, భార్య

చిట్టమ్మ, రుక్మిణి — ,, కొమార్తెలు

ఛాయ— ,, పెంపుడుకన్నె

---

రంగము : తోటలోని రమణీయ మగు కుటీరము—గది. లలితాంబ, ఛాయ, చిట్టమ్మ, రుక్మిణి, మఱిద్దఱు పిల్లలు.

[ప్రవేశము : ధర్మారావు]

ధ— అమ్మా! రామకృష్ణయ్యగా రింటిలో నున్నారా?

ల—ఓహో! రావుగారా! దయచేయుఁడు. మన వా రందఱు క్షేమమా ?

ధ— ఆ, దైవకృప వలన. పిల్ల లందఱు ఖులా సాగా నున్నారా?

ల—తమ యాశీర్వచనమువలన. అయ్యో! నిలు చుంటిరే! చిట్టీ! ఆమడతకుర్చీ తెచ్చి రావుగారికి వేయుము.

[చిట్టమ్మ అటులు చేయును.]

ధ—మీ చిక్కులన్నియుఁ దీఱి, యిపుడు తెఱ పిగ నున్నారుకద! కృష్ణయ్యగారు పొలములోనికి వెళ్లి, నటులున్నది?

ల—అవునండి. మా పెద్దవాఁడు, రెండవ వాఁడు కూడ వెళ్లిరి. నూర్పులకాలము కాదా మఱి? ఈ నాలుగు రోజు లూపి రాడదు.

ధ—[పిల్ల లందఱవంకఁ జూచి] సరే, ఇదిగో, ఇద్దఱు—ముగ్గురు—న-లు-గు-రు—ఐఱుగురు ;—వీరే కాదమ్మా మీమిగత బిడ్డలు? అబ్బా! తేనెటీఁగలవలె నెంత కార్యదీక్షతో నున్నారు! ఏమి చుఱుకుదనము!

ల—అటులు సెలవిచ్చెద రేమి, రావుగారూ! మా కుటీరమున నిర్వ్యాపారత్వమున క్షేమాత్రము అవకా శము లేదు. మాపెద్దవాఁడు భానుమూర్తియు, నేనును గొడ్లకంటె నెక్కువగ పనిచేయుదుము. మాపిల్లలందఱ నటులే శ్రమపడునట్లు చూచెదము. కడపటివాఁడుమాత్ర మీడునకుఁ దగినచిన్నపనులు చేయఁగలఁడు కాని, మిగిలిన యందఱము శక్త్యనుసారముగా తగుకార్య ములు నిర్వహింతుము.

ధ—చాల మంచిపని. తల్లీ! మీవలె పాటుపడు వారలను, శాంతచిత్తులను చూచిన నెట్టి విషమస్థితిలో నైనను "దారిద్ర్యదేవత" తొలఁగిపోవలసినదే. ధనవంతుల బిడ్డలుగూడ నిటులు పనిచేసిన, నెంత బాగుగనుండునోకద!

ల—అయ్యా! ఐశ్వర్యములతో తులదూఁగు వారలకు లెక్క యేమి? పాటుపడ నవసర మేమి?

---

* "జువెనైల్ బడ్జెటు" నుండి.

ధ—భాగ్యము సంపాదించుటకంటె వెచ్చించుట సులభము కాదా? ఖజానాపెట్టె ఖాళీ యైనతరువాత, తిరిగి పూరించుటకు వారేమి చేయవలెను?

ల—నిజమే. మాశ్రమకుఁ దగిన ఫల మనుభవించుచు నెంతయు నుత్సాహముగ 'కడుపులోని చల్ల కదలక' యిటు లున్నారము. ఇంతకును పరమేశ్వరునికృప. వేరికిఁ దగినసద్గుణములు గల యింటియజమానులు దొరకుటకూడ మా యదృష్టమే.

ధ—'ముత్యము లన్నియు నొకచోటికిని, నత్తగుల్ల లన్నియు నొకదిక్కునకును చేరు'నను సామెత యిట సార్థక మగుచున్నది. లలితాంబగారూ! మీది సత్కుటుంబము గనుకనే నాకు సత్సహవాసభాగ్య మబ్బినది. మీసంప్రదాయము పూర్వమునుండియు నాకెఱుకయే. బిడ్డలారా! ఇటు రండు! మీకు తాయిల్లముఁ దెచ్చితిని. [మిఠాయియుండ లిచ్చును.]

ల—పిల్లలారా! రావుగారికి వందనము లర్పింపరేల?

ధ—[ఛాయను చూపించుచు]అమ్మా! మీయాఁడుపిల్ల లందఱును చిన్నవారే యనుకొంటిని. ఇంత పెద్దయాపె యున్నట్టు నాకు తెలియనేలేదు.

ల—లేరండి, ధర్మారావు గారూ! మాఅమ్మాయి కా దామె. కాని కన్నకూఁతుకంటె నెక్కుడుగ చూచుకొనుచున్నాము.

ధ—బంధువు కాఁబోలును.

ల—కాదండి.

ధ—మఱి?

ల—[నెమ్మదిగ] తరువాత చెప్పదను లెండు. [పైకి] ఛాయా! వేళ యయినది. వెళ్లి దూడను విడిచి రా, అమ్మా! [ఛాయ వెళ్లును.]

ధ—బహు నమ్రత గల పిల్ల సుండీ!

ల—ఔను, సౌందర్యమునకుఁ దగిన సుగుణ సంపత్తి గలది. ఈమె దూరదేశమునుండి దైవికముగ నిటకు వచ్చి యేఁడాది దాఁటినది. మీకు విన నిచ్ఛ గలదేని, యామెసంగతి యెఱిగించెదను.

ధ—తప్పక చెప్పుఁడు, తల్లీ! మిక్కిలి కుతూహలముగ నున్నది. ముందు కొంచెముదాహము తెప్పింపుఁడు.

ల—రావుగారూ! నామందమతికి క్షమింపవలెను. చూడుము, రుక్మిణీ! సత్తుగిన్నెలో ప్రొద్దుట గిలకొట్టిన మజ్జిగ యున్నది, వెండిగిన్నెలోఁ బోసి త్వరితముగఁ దెమ్ము. [రుక్మిణి వెళ్లును.]

ధ—ఇఁక వినిపింపుము, తల్లీ!

ల—గత దీపావళినాఁడు సాయంకాలమున మావారును, పెద్దవాఁడును పొలమునుండి వచ్చుచుండఁగా బండియొకటి ఘాటీలో పడిపోవుటఁ గాంచిరి. సాయము చేయుదమని యచటికి పోవఁగా, క్రిందఁ బడి మిక్కుటముగ దెబ్బలు తిన్న యొకముసలమ్మయు, నామెప్రక్క నేడ్చుచు కూర్చుండిన యీపిల్లయుఁ గాన్పించిరి. జాలి గుండెగల నా భర్తగారు వెంటనే యతిప్రయాసముతో బండి సరిగఁ దీసి, ముసలమ్మను తిరుగ బండిలో నెక్కించి, యింటికిఁ దీసికొనివచ్చిరి. వృద్ధురాలికి సమస్తోపచారములను శక్తివంచన లేకుండఁ జేసితిమి. కదల్చుటకు వీలు లేని స్థితియం దామె యుండెను. అందుచేత, సౌఖ్యప్రదమైన శయ్య నమర్చి, యామెను పరుండఁ బెట్టితిమి. తలకు గట్టి దెబ్బలు తగిలి యుండుటచే, మే మెన్ని తంటాలుపడినను, దినదినమున కామెస్థితి క్షీణదశ నందుచుండెను. మాపైని గల గౌరవభావముచే 'సర్జను' గారు దినమునకు రెండు పర్యాయములు 'నర్సు'ను బంపి గాయములకు కట్టించుచుండిరి. కాని, యేమియు ఫలము కనిపింపదాయెను. ఒకనెల యగునప్పటి కామె మరణోన్ముఖురాలై యున్నదని నిశ్చయించితిమి.

పాప! మీపిల్ల—ఛాయ—నాయనమ్మ నొకనిమిషమైన వీడక, రాత్రియుఁ బగలు నిరంతర ప్రేమతో, కనుతెప్ప వ్రాల్పక కనుపెట్టుకొని యుండెను. అయ్యా, రావుగారూ! ఈబిడ్డ దుఃఖము మా కెంత జాలిఁ గొల్పి

నదో తెల్పుటకు వశము కాదు. "ఈలోకములో నాకు దిక్కీ ముసలమ్మయే" యని విలపించును. "ఈమెకూడ లేకుండఁ బోయిన నాగతి యేమి, దైవమా!" యని పలుమాఱు కుందును. తలిదండ్రులు లేరఁట. నాయనమ్మను తీసికొని తూర్పున నున్న బంధువు లాదరింతురేమో యని బయలుదేఱఁగా, ఈవిపత్తు సంభవించినది. సరి, ఈగాథ యంతయు నెందులకు? మఱి వారము రోజులు తీసికొని ముసలమ్మ స్వర్గస్థురాలైనది. ఆమె మూటగట్టి పెట్టుకొనిన యాస్తియంతయు వైద్యునకును, దహనాది కర్మములకును వెచ్చింపఁగా, పదునేడు రూపాయిల చిల్లర మిగిలినది. పాప, మీపిల్ల కెట్టి దుస్థితి! రుద్రభూమి వదలి యీవలకు వచ్చుట బ్రహ్మాండ మైనది. చేతులు నులుముకొనుచు, గుండె బాదుకొనుచు, నీఛాయ ముసలమ్మకొఱకు పలువిధముల దుఃఖించినది. అయ్యో! చాల తడవయినది. ఈ చేటభారతముతో మిమ్ములను విసిగించితినే!

ధ—లేదు, లేదు, చెప్పు మమ్మా! మిక్కిలి జాలిఁ గొల్పుచున్న దీ గాథ.

ల—ఎన్నియో రీతుల నీపిల్ల నోదార్చితిమి. కాని పొరలి పొరలి వచ్చు దుఃఖముతో, "నా కిఁక గతి యేమి? నే నెక్కడకుఁ బోవుదును? దిక్కు కనఁబడదే, పరమేశ్వరా!" యని శోకించును. దీనవదన యగు ఛాయ విలాపము చూడ నామనసు కరఁగి, "ఈబిడ్డ నెటులయిన మన పోషణములో నుంచుకొందమ"ని మావారితో నొక్కి చెప్పితిని. దయాళుఁడగు నాభర్త యడ్డు చెప్పునా? నాయభిలాష విన్నవించిన దే తడవుగ, "ముమ్మాటికిని నట్లు చేయుము. నే ననఁబోవు మాట నీవే యడిగితి"వని చెప్పుచు, వారు సానుభూతియు, సమ్మతియుఁ దెల్పిరి. అంతట నీబిడ్డను చేరఁ బిలిచి నాయుద్దేశ మెఱిఁగించితిని. ఆమాట యాలించినక్షణము యామెముఖారవింద మేమని చెప్పుదును? ఇట్టె మాఱి, యెంతో వికాసవంత మయ్యెను. మునుపు లేనిధైర్యముతో నామె యిటు లనఁ దొడఁగెను:—

"తల్లీ! మీచెంత నుండుటకంటె నాకు వలయున దెద్ది? బంధువులు, మిత్రులు, తలిదండ్రులు, దైవము, సమస్తము నాకు మీరే. ఘాటీలోఁ బడిపోయినపుడు కృపాళువగు నా పరమేశ్వరుఁడు "రామకృష్ణుని"రూపమున వచ్చి మమ్ములఁ గాపాడినపుడే, ఇఁక ముందు నారక్షకులు మీరే యని నమ్మితిని. నేను లేశమయిన మీ కుపకరింతునా యని భయపడుచున్నాను. తెలియనిపనులు తప్పక నేరుచుకొని, మీసేవ చేసి ఋణము దీర్చుకొన యత్నించెద నమ్మా!"

అందులకు నేను, "నీకు చేతనైన పనియే చేయుము, బిడ్డా! నీ వొకటియు, మాపిల్ల లొకటియుఁ గాదమ్మా! నీకుత్సాహముగ నుండినన్నాళ్లు మాతో నుండవచ్చు" నంటిని.

ధర్మారావుగారూ! ఈఛాయ అప్పటినుండియు గృహకృత్యములన్నియు నోపికతోఁ గ్రమముగ నేర్చినది. ఇపుడు నా కండగా 'కుడిభుజము'వలె నున్నది. ఎట్టి యరమరయు లేక నాకూఁతులలో నొకతెగ సంచరించును. ఎపుడును చిద్విలాసమే గాని, విసుగనునది లేదు. మాయొద్ద తగిన శిక్షలో నుండి, 'తలలో నాలుకవలె' మెలఁగుచున్నది. తగుమాత్రము వ్రాయను చదువను తెలియును. కుట్టుపని నేర్చుకొన్నది. ఇంటిపని యంతయుఁ జక్కఁబెట్టి వీలు చేసికొని నాబిడ్డలకు పాఠములు చెప్పును. రావుగారూ! ఇది, సమాచారము.

ధ—చాల చిత్రమైన కథ, లలితాంబగారూ! మీకును, ఆపిల్లకును కూడ యశోదాయకమగు సంగతి. మీఛాయ యింటిపే రేమండీ?

ల—[ఆలోచించుచు] ఏమి, చెపుమా! 'శ్రీపురపువా' రని చెప్పినటులు జ్ఞప్తిలో నున్నది.

ధ—[ఆశ్చర్యముతో] శ్రీపురపువారా! మావారే నండీ! ఆఅమ్మాయి యేది? కొంచెము మాటాడవలెను.

ల—ఇదిగో పిలిచెదను.

[ప్రవేశము : ఛాయ]

ధ—అమ్మాయీ! ఇటు రమ్ము. నీసంగతి యంతయుఁ దెలిసి, మిక్కిలి పరితపించితిని. నీకు తలిదండ్రులు లేరఁట కాదా, పాపము?

ఛా—లేరండి.

ధ—మీయింటిపేరు శ్రీపురపువారా?

ఛా—మఱేనండి.

ధ—స్వగ్రామము?

ఛా—మాది నందిపల్లి. తలిదండ్రులు బాల్యముననే నన్ను విడిచి దివి కేఁగిరి. అప్పటినుండియు ధర్మవరములో మాపెదనాయనమ్మ చేరఁదీసి న న్నింతదానిని చేసినది.

ధ—ఆమె మీతండ్రి పెదతల్లి కాదా?

ఛా—అవునండి; విధవ యామె.

ధ—ఆమె నామధేయము?

ఛా—కనకాంబ.

ధ—కనకాంబా? సరి, సరి. విపత్తు సంభవించినపుడు మీ రెక్కడకుఁ బోవుచుంటిరి?

ఛా—'గరివిడి'లో మానాయనమ్మ తోడికోడలు గారింటికిఁ బోవ నుంటిమి. మ మ్మార్గస్థితిలో ఆమెమైన నాదరించు నను నాశతో బయలు దేఱితిమి.

ధ—అయ్యో! తల్లీ! నీవు చెప్పిన యంశము లెల్ల తూఁచినటుల సరిపోయినవమ్మా! ఆయ్యో! ఛాయా!

[ఆమె చెయిపట్టుకొని]

గరివిడి మాగ్రామమే నమ్మా! మీరు పోవలె ననుకొనిన ముసలమ్మ మాతల్లియే. నీతండ్రియు, నేనును పెదతండ్రి పినతండ్రి బిడ్డలము. కాలవశమున నిటుల విడిపోయితిమి.

నీవంశానుక్రమణ మెల్ల నిడుపు విశదమైనది. నీతండ్రి— అయ్యయ్యో!—చనిపోవుట నేను బాగుగ నెఱుఁగుదును. పేరొందిన చిత్రకారుఁ డమ్మా! పాపము! పతివియోగ బాధ భరింపలేక, ఆ కృష్ణవేణి—మీతల్లి—ఒకవారము తిరుగకుండఁగనే గుండె పగిలి యాకస్మిక మరణ మందినది.

అప్పటి నుండియు నీ సంగతియే తెలియలేదమ్మా! ని న్నీ యపురూపపుస్థితిలోఁ గనుట నా కెంతయు నాశ్చర్యమును, ఆనందమును గొల్పుచున్నది. ఇదంతయు భగవంతుని మాయ గాక వేఱేమి? ఛాయా! నీవు నాతో వచ్చి నా యొద్ద నుండుము. నీవంటి సుశీలను చూచుటకు మీ పెదతల్లియు, నీ సోదరీసోదరులును అమితోత్సాహముఁ జెందుదురు.

ఛా—మీదయ కే నెంతయుఁ గృతజ్ఞురాలను, బాబయ్యగారూ!

ధ—నీ నడతయు, సంభాషణ మర్యాదలును నీవు తగిన శిక్షణమునఁ బెరిఁగితివని చాటుచున్నవి.

ఛా—పాపము, చచ్చి స్వర్గమున నున్నది, మానాయనమ్మ. నాయీడునకుఁ దగిన నీతిబోధములు నాకు క్రమముగఁ గఱపినది.

ధ—నీవు మిక్కిలి యుక్తియుక్తముగ సంభాషించుచుంటివమ్మా! నీ తీయనిపలుకులు విన్న కొలఁది ముచ్చట యగుచున్నది. సరే. నీవు నాతో బయలు దేఱుటకు సిద్ధము గమ్ము. ఇంతకాలమునుండి నిన్నుఁ గరుదయతో పోషించిన యింటివారికి నుచితరీతిని నేను గృతజ్ఞతఁ దెల్పెదను.

ల—తల్లీ, ఛాయా! నీయదృష్టమునకు మిక్కిలి సంతోషమమ్మా! కాని, నీవు మమ్ము విడిచిపోయెద వని వినుటమాత్రము మనస్సులో బెంగ కొల్పుచున్నది, బిడ్డా.

ఛా—అమ్మా! మిమ్ము వదలుటకు నాకును కాలాడకున్నది. దిక్కెవరును లేని యాపత్సమయమున చేరఁదీసి, కన్నబిడ్డలలో నొకరినిగా చూచుకొంటిరి. నాజన్మములో నెపుడైన మీమేలు మఱవఁగలనా!

[ప్రవేశము : రామకృష్ణయ్య, భానుమూర్తి]

రా—ఓహోహో! ధర్మారావుగారా! ఎం… పయినది వచ్చి?

ధ—ఇప్పుడిప్పుడే. నేఁడు బయలుదేఱిన వేళా విశేషము చాల మంచిదండి, తలఁపని తలంపుగా శుభము గలిగినది.

రా—ఏమండి, సమాచారము?

ధ—బంధువయ్యా, కృష్ణయ్యగారూ! మీ రెంతో దయతో పోషించుచున్నారే, ఆబిడ్డ—ఛాయ—మా పెదతండ్రి మనుమరాలు.

రా—ఏమి?ఛాయయా? ఛాయ!

ధ—అవును. మీకును, లలితాంబగారికిని కృతజ్ఞతఁ దెలిపి, ఈబిడ్డను నావెంట తీసికొని వెళ్ల నున్నాను.

రా—చిత్రముగ నున్నదే యీవార్త! అమ్మా! ఛాయా! ఇటువంటిసద్గృహమునకు వెళ్లెదవని నా కెంతో ఆనందముగ నున్నదమ్మా! నీవంటి సచ్ఛీలకు తగిన గృహము. కాని తల్లీ! నీవు లేకుండ మే మెటు లుండఁ గలమమ్మా?

ల—అదియే నేనును అనినాను.

భా—[ఛాయతో] ఏమి! మమ్ముల వీడెదవా, ఛాయా? మన కింతటినుండి వియోగమేనా?

ఛా—[అతనితో] నే నేమిచేయుదును,మిత్రమా?

ధ—ఛాయ ప్రయాణమగుటకు నాలుగు దిక్కుల నుండియు ననంగీకార సూచనలు కనఁబడు చున్నవే?

ల—అవునండి, రావుగారూ! సహజమేకద! బిడ్డ లందఱును వత్సరమునుండి కలసిమెలసి యుండిరి.

భా—[ఛాయతో] మనవియోగము తప్పదని తోఁచుచున్నది. మమ్ములఁ బూర్తిగ మఱచిపోవకుమా!

ఛా—[అతనితో] మిత్రమా! ఇట్లు నిష్ఠురము లాడఁదగునా? మఱచుటయే! ఎంతమాట! ఎప్పటికిని అటులు జరుగదని నమ్ముము. ముమ్మాటికిని నమ్ముము.

ధ—సరి, సరి, మన యువజన మిత్రములలో కొంచెము కలకలము వినఁబడుచున్నది. అదేమో తెల్పఁ గలరా, లలితాంబగారూ?

ల—చెప్పుట కేమున్నది? ఛాయ మీబంధు వను సంగతి యింతకు ముందు మాకుఁ దెలియదు. మా పెద్ద వాఁడును, ఛాయయు మొదటినుండియు నత్యంతాన్యోన్యా నురాగముతో మెలఁగుచుండిరి. రూపమందును, గుణమందును చక్కనిచుక్కయగు నీకన్నెను వాఁడు పరిణయ మాడుదునని తెలిపిన యుద్దేశమునకు మే మడ్డుచెప్పి యుండలేదు.

రా—ఇఁక వెనుకటి ప్రసక్తి యేల?

భా—ఏల కూడ దందురు, నాయనగారూ?

రా—ఏమిరా, అబ్బాయీ! ఛాయ ధర్మారావు జమీందారుగారి బంధువని తెలిసియు నిటు లందువే?

ధ—ఛాయా! ఇటు రమ్ము. ఈవిషయమున నీయుద్దేశము విని సంతోషింతును.

ఛా—[సిగ్గు నభినయించుచు] బాబయ్యగారూ! భానుమూర్తి నాయందుఁ జూపిన కరుణయు, నవ్యాజప్రేమయు నపారము. మొదటిచూపుననే ఆయన నామనసు చూఱగొనెను. వారి యభీష్టము నెఱవేర్చి తరించుటకే నిశ్చయించుకొంటిని.

ధ—బిడ్డా! నీయాలోచన యెంతయు నుదారమైనది. ఈసద్బాంధవ్యమున కెంతయు నానందించుచున్నాను. నాకుఁ బరమసమ్మతము తల్లీ! తడ వేల? త్వరలోనే వలయు యత్నములు సేయుదము. ఈమాసములో గ్రహకూటముకూడ ననుకూలముగ నున్నది. "శుభస్య శీఘ్రము" మందురు గదా, విజ్ఞులు!

ఛా—[తల వంచుకొనును.]

ల—ధర్మారావుగా రెంతటి ధార్మికులు! ఏమి యౌదార్యము! వారికి వారే సాటి. ఛాయా! పుణ్యశీలా! రమ్ము తల్లీ! [ముద్దిడును.]

ధ—రామకృష్ణయ్యగారూ! మీకు తెలియదు కాఁబోలును! మీమాన్యమునకు పడమటి దిక్కున కట్టునకు సరిగనున్న నాలుగువీసముల తోఁట మాదే.

సాయంకాలము మన భానుమూర్తిని తీసికొనివెళ్లి రయితుల కెఱిఁగించెదను. ఇంతటినుండి యతఁడే సిస్తు వసూలు చేసికొనఁగలఁడు.

భా—[తనలో] ఇఁక నేమి! [చిఱునవ్వు నవ్వును.]

రా—ఏమి! భగవద్విలాసము! ధర్మారావుగారు మావియ్యంకు లైనారు! ఇట్టివింతలు కలలోనైనఁ గాంచఁగలమా! ఎంత ధన్యాత్ముల మైతిమి!

ధ—ఈ శుభసమాచారము మావారల కెఱిఁగించి, పెండ్లిపనుల కాయత్త పఱిచెదను. మాపురోహితులు సుముహూర్తము నిర్ణయించిన వెంటనే మీకు తెలియఁబఱిచెదను. కనుక రామకృష్ణయ్యగారూ!—కాదు—వియ్యంకుఁడుగారూ! ఎదురు సన్నాహమునకై మీ యత్నములో నుండుఁడు.

ఛాయా! మనము రాత్రి 'ప్యాసెంజరు'లో తప్పక వెళ్లవలె నమ్మా! సిద్ధముగ నుండుము.

ల—నీ యుపకారము మఱవఁగలనా, ఛాయా!

భా—[తనలో] నాయుపకారముముందు నీ యుపకార మెంత?

రా—పడినబండి యెత్తి పైకి లాగిన సమయమున నింతటిమేలు కలుగునని యెవరమును తలఁపలేదుకదా!

ల—"సత్కార్యము లూరక పోవునా?"

ఛా—ఊరక పోవని క్రియారూపమున సిద్ధాంత పఱుపవలసిన బాధ్యత నాపై నున్నది, తల్లీ!

[అందఱు నిష్క్రమింతురు.]

---




"రూపాయిలు, అణాలు, పైసలు—"

## శ్రీ సింహశైల ప్రశస్తి

విద్వా౯ కట్టి సాంబమూర్తి శాస్త్రి గారు

ఇచ్చోటఁగద లోకమెల్ల నుతింప బంగరుకంబము గనె నక్కజపుఁగొడుకు
నీతావునన కదా యేపుచూపె నృసింహదేవుఁడు దితిజు లుద్వేగ మంద
నిటఁగదా ప్రహ్లాదుఁ డీశభక్తిరసంబు వెల్లువ పఱపె నుర్వీతలమున
నీప్రదేశమకదా యాప్రత్నకిటికి నావాసమై మహితవైభవము గాంచె
హరవిరించిసురేశ్వరాద్యమరులెల్ల-సంస్తవం బొనరింతు రీస్థలమునకద
సింహశైలంబు భక్తినిబృంహితం బొ-నర్చుభక్తులపాలి సన్నగము గాదె.

రంహఃస్ఫూర్తి వరాహమూర్తి నిఖిలార్థంబు ల్ప్రసాదించుఁ దా
నంహస్సంహతులం దొలంచు నరసింహస్వామి పాపాటవీ
సంహారం బొనరించు మారుత తనూజాతుండు వేయేల యీ
సింహక్షోణిధరంబుఁ జేర్కొనినచో సిద్ధించు సర్వార్థముల్.

ఓరుఁగంటిప్రతాపుఁ డొసఁగె వాహనముల నర్పించె గజపతి హస్తిరథము
నన వేమభూనాథుఁ డర్పించె గ్రామంబు లల్లయవేఁ డిచ్చె వెల్లగొడుగు
వీరభద్రారెడ్డి వేయురత్నము లిచ్చెఁ బాలకి నర్పించెఁ బ్రౌఢరాజు
కవిసార్వభౌముండు కైవారము లొనర్చెఁ గరదీపిక లొసంగె నరసరాజు
కృష్ణరాయనృపాలుఁ డుత్కృష్టమైన-కృతి నిడి తనంత ధనము నర్పించె నౌర
యాపదార్థంబు లేవి యేయెడల నడఁగె!-సింహశైలాధినాథ లక్ష్మీనృసింహ!

గోగులపాటికూర్మకవి కూరిచెఁ బద్యశతోత్తరాష్టకం
బాగడికబ్బముం గొని నిజాంతరసీమ ముదంబు నొంది వే
వేగ దరల్చి తౌర పృథివీతలకంటకు లౌమరాటుల౯
భోగిశయాన సింహగిరిభూషణ మానవకేసరీ హరీ.

చాళుక్యనరపాల శస్త్రదీధితులు దిక్కులఁ బర్వె గోదాసలిలముఁ దాఁకి
పలనాటివీరుల బలము నింగికిఁ బ్రాఁకెఁ జంద్రభాగాతీరసైకతముల
మనుమసిద్ధినృపాలు మానంబు నెలవొందెఁ దతపినాకినిసాంద్రతటములందు
గాంగరాజులయశోగానంబు వినవయ్యె వంశధారాసరిద్వరముఖమున
పూషవాటినృపాలుర భూరికీర్తి-కృష్ణవేణ్ణాతటముల నుద్గీవ మయ్యెఁ
గటకటా, యామహానదు ల్కాలమహిమఁ-బూర్వరాజులకీర్తితోఁ బొల్పు వాసె
హరహరా, యాంధ్రవైభవం బస్తమించె.

చాళుక్యనరపాల చాతురి నశియించెఁ గాకతీయులరాజ్య గరిమ సమసెఁ
గొండవీటినృపాలగోష్ఠివార్తలు వోయె రాజమహేంద్రసామ్రాజ్య మణఁగెఁ
బెద్దాపురముకోట పెద్దమ్మ కిల్లయ్యె వీరఘట్టముపేరు వీటిపోయె
సింగారపుంగోట భంగంబుపాలయ్యె గజపతిరాజ్యంబు గలఁగిపోయె
మాడుగుల గాలె నొడ్డాది మచ్చమడఁగె-నాంధ్రవీరులు దాతలు నాత్మవిదులు
శాస్త్రవేత్తలు శిల్పులు చనిరి దివికి-హరహరా,యాంధ్ర వైభవం బస్తమించె.

ఎందఱో ప్రాక్తనక్షితిపు లేఁగిరి స్వఃస్థలి కంచు నెడ్డలోఁ
గుందఁగ నేల వారల యకుంఠిత దివ్యయశస్సువంతు లీ
సుందరసింహశైల మధుసూదను నాలయకుడ్యసీమలం
గ్రందుగ శాసనంబులయి క్రాలుచు వారలపొల్పుఁ దెల్పెడిన్.

పోయిరి పూర్వులంచు మదిఁ బొక్కఁగ నేటికి సింహశైలమం
దేమెడఁ జూచిన న్దివికి నేఁగిన పూర్వులసచ్చరిత్రముల్
హాయిగ గోచరంబయి యనంతముదం బొనఁగూర్చు చుండు న
య్యాయినృపాలకుల్ హరికి నప్పన సేసిన యీగిఁ దెల్పుచున్

అనవేమనరనాథు నశ్రాంత సువితీర్ణి తారహారఖ్యాతిఁ దనరుచుండ
ప్రౌఢదేవమహీశు ప్రాభవంబు సువర్ణధారాభిషేకంబు తనివి దీర్చ
వీరభోగవసంతు వీరవిహారంబు వజ్రాలకవచమై వన్నె మీఱ
కృష్ణరాయనృపాలకీర్తి రత్నకిరీట కనకాంగదోద్దీప్తిఁ గ్రాలుచుండ
ముష్కర తురుష్కసేనల మొరటుదనము-పటుతరగ్రావహస్త్యశ్వ భావ మొందు
నహహసింహ ధరాధరాగ్రాధివాస-దంభకేసరి కార్తసంత్రాణరతికి.

కుప్పల్ తిప్పలు దేవతానికర మీక్షోణీతలం బెల్లెడన్
విప్పారం గనుఁగొందు వారిఁ గొలువ న్వేసంబు చేకూర దీ
యొప్పు ల్గుప్ప వరాహమూర్తి నరసింహుండై ధరం బొల్చుమా
యప్పం డిచ్చు నభీష్టసిద్ధి నిజభక్తానీకము ల్మెచ్చఁగన్.

కలికలుషహారివైన నీకడకు వచ్చి-పూర్వవైభవములఁ దలపోసి పొక్కి-
భక్తిపూర్వకముగ నివె బాష్పకణము-లవిరిసరంబుగాఁ గూర్చి యంఘ్రి నిడితి
గీనిఁ గొనుమయ్య భక్తసంత్రాణశీల-సింహశైలాధినాథ, లక్ష్మీనృసింహా!

---



ఎలిమెంటరీ స్కూలు, నరసింగపురము. (బ్రహ్మసమాజమువారిది)



(5) ఆది ఆంధ్రాశ్రమమునందలి బాలికలు, పిఠాపురము.



ఏ. మాంటెసోరీస్కూలు, పిఠాపురము. (బ్రహ్మసమాజమువారిది)



ఆది ఆంధ్రాశ్రమమునందలి బాలురు, పిఠాపురము.

# ౮. క థ లు




## ౧

శ్రీ విభుసన్నిభ ప్రభువ
    రేణ్య, యనాథశరణ్య, కృష్ణరా
యా, వివరంబుగా నరయు
    మా: భవదంగన యన్నపూర్ణమా
దేవి యపాయముల్ తొలఁగి
    దేవరకుర్ నిరతంబు శ్రేయమే
కావలె నంచుఁ బంపె హిత
    గర్భితమైన యుగాది కానుకల్.

పసుపురాసిన తాటియాకుమీఁది పయిపద్యమును బ్రాహ్మణుఁ డొకఁడు చదివి, రాయలవారి చేతి కందించి నంతనే, యుగాదికానుకలతోడి పైఁడిపళ్లెరము దాసి నేలకు దించి చేతులు జోడించి నిలిచినది.

గరుత్మంతుని ముక్కు గలిగి, కనక కుండలములు కర్ణములందుఁ దాల్చి, కాశ్మీరపు సేలువ శరీరమునఁ గప్పుకొని, సింహాసనమున కెదుట నిలుచున్న యా బ్రాహ్మణుని జూచి గంభీరమైన కంఠధ్వనితో, "మీ పే రేమి?" అని రాయలవారు ప్రశ్నించిరి.

ప్రశ్నా వాక్యము కందముగా నైనను, శార్దూలముగా నైనను మొదలుపెట్టుటకుఁ దగియున్నది. తన్ను దర్శింపవచ్చిన విద్వాంసులు కవులగుదురో కారో తెలిసికొనునిమిత్తము రాయల ప్రథమప్రశ్నలు పద్యరూపములుగా నుండునని మును వినియున్న యా బ్రాహ్మణుఁడు ప్రత్యుత్తరము సమస్యాపూర్తి వడువున నుడువఁగా, ప్రశ్నోత్తరము లిట్లు తేలినవి :

శా. "మీ పే రేమి?" "రిపుప్రకాండముల భూ
    మిం బేరు లేకుండఁగా
రూపుర్ మాపి, యశోమిషర్ జమిలి క
    ర్పూరంపుఁ బేరుల్ దళం
బౌ పోల్కిం గకుబంగనాగళము లం
    దందంబుగా వైచు నో
క్ష్మాపాలోత్తమ, నంది తిమ్మకవి నాఁ
    గాఁ బేరు నేఁ గాంచితిర్." ,

"ముద్దుపలుకులుగల ముక్కుతిమ్మనవటయ్యా?" అని రాయ లచ్చెరువునఁ బ్రశ్నించిరి.

ఆప్రశ్న యయత్నపూర్వకముగా ఛందోబద్ధమై యాటవెలఁది యాటకుఁ దగియున్నందునఁ, గవి ప్రత్యుత్తరమునఁ బద్యము పూర్తిచేసెను. సంపూర్ణ పద్యము:

ఆ.వె. "ముద్దు పల్కులు గల ముక్కు తిమ్మనవట-
యయ్యా?" "వదాన్యమున నవాంబుముక్కు-
వగుట, ముద్దు పల్కు లాడె మత్కవితాను-
మారి వానపుల్గు మాడ్కి నధిప."

సంతోష మిముడక "'సెబా'సని రాయలవారు తొడ చఱచుకొని, "మేము మున్ను విన్నదానికి, నేఁడు ప్రత్యక్షముగాఁ గన్నదానికి సరిదాఁకి యున్నది. అల్లసాని పెద్దన గారిది యల్లిక జిగిబిగి; ధూర్జటి కవిది పలుకులమాధురి; మాదయగారిమల్లనకవిది రసపుష్టి. ముక్కుతిమ్మనకవీంద్రా, ముద్దుపలుకు మీసొమ్ము," అని ప్రశంసించిరి.

ఆస్తుతికి ముఖము వికసింపఁగా, "మహాప్రభూ, ఆంధ్రభోజులరని విఖ్యాతి గన్న దేవరవారి ముఖచంద్ర మండలము చూచిన వారికి సుధాసదృశమైన కవిత యూరుట యబ్బురము కాదు. ఏలిన వారు పేర్కొనిన పెద్దనాదులు దిగ్గజములు; నేను మశకమాత్రుఁడను," అని నంది తిమ్మకవి వినయమునఁ బలికెను.

"తిమ్మకవి కుంజరా, ఆంధ్ర భోజులమని మమ్ము, దిగ్గజములని పెద్దనాదులను మీరు గుగ్గడించిన మాటలు విని మాకొక క్రొత్త యూహ పుట్టినది. భోజరాజుగారియాస్థానమందున్నట్లే మాయాస్థానమం దష్టదిగ్గజముల నెలకొల్ప నిశ్చయించితిమి. అందు మీరొక్కరు కావలయును" అని రాయలువారు కోరిరి.

నంది తిమ్మన చేతులు కట్టుకొని, "ప్రభూత్తమా, మహాప్రసాదము. నేను ధన్యుఁడను. నాతాతగారు నంది మల్లయకవియు నా మేనమామగారు మలయమారుతకవియు దేవరవారి తండ్రిగారైన శ్రీ నరసింహ దేవరాయలవారికి వరాహపురాణము కృతియిచ్చినవా రగుటఁ బట్టి, తుళువవంశాశ్రయము మాకు నేఁటిది కాదు. ఇప్పటి నా ప్రభువు సమ్మతించిన చో—"

"కవీంద్రా, అట్లే కానిండు. మామామగారివలన మిమ్మరణపుఁ గవిగాఁ బరిగ్రహించెదము," అని రాయలు వారు చిఱునవ్వుతోఁ బలికిరి.

ఈవిధముగా నంది తిమ్మకవి శ్రీకృష్ణ దేవ రాయల యాస్థానమందలి యష్టదిగ్గజములలో నొకఁడైనాడు.

౨

వెనుకటి వృత్తాంత మెప్పటిదో, యెచ్చటిదో, తెలిసికొనవలయునన్న కుతూహలము చదువరులకుఁ గలుగుట సహజము; గనుకఁ దెలుపుట యవసరము.


శ్రీకృష్ణదేవరాయలు.

విజయనగరసామ్రాజ్య ధౌరేయుఁడైన శ్రీకృష్ణ రాయలు దక్షిణదిగ్విజయయాత్ర పూర్తియైన వెంటనే

పూర్వదిగ్విజయయాత్రకుఁ క్రీ. శ. 1513 సంవత్సరమున బయలువెడలి, తొలుదొల్త నెల్లూరుమండలమందలి యుదయగిరి దుర్గము ముట్టడించెను. ఆ ముట్టడి సాఁగి సాఁగి సాగిన కాలమున, రాయలకు నెల్లూరు మండల రాజధానియైన కనకగిరిఁ గూర్చిన ముచ్చటలు విన వచ్చినవి. మండలాధీశ్వరుని కొమార్త అన్నపూర్ణాంబ రతిని మించిన సౌందర్యవతి యని విని, యా కన్నియ రూపపటమును దెప్పించుకొని కనికరము మాలి విరివిలుతుఁడు వేయు శరాళివలన విరాళిగొని, తన యవస్థ పితృతుల్యుఁడై తిమ్మరసు మంత్రికి రాజు రహస్యముగాఁ దెలిపెను. అన్నపూర్ణాంబ తండ్రి వీరరుద్రగజపతి యోరుగంటి ప్రతాపరుద్రుని సంతతిలోఁ గడపటివాఁడగుటఁబట్టి యట్టి సత్క్షత్రియునితోడి సంబంధము కృష్ణరాయని వంశమునకుఁ బ్రఖ్యాతి తెచ్చుననియు, నెల్లూరుమండలాధిపతితోడి సంధిపూర్వదిగ్విజయయాత్రా కార్యమునుసులభము కావించు ననియు, ధీమంతుఁడైన తిమ్మరసుమంత్రి యూహించి, యందులకు రాయబారము నడిపెను. వీరరుద్రగజపతి కృష్ణరాయనితోడి వియ్యమునకుఁ గాని నెయ్యమునకుఁ గాని యియ్యకొనక కయ్యమునకే కాలు ద్రవ్వినందున రాయలు కినిసి, యుదయగిరి ముట్టడి రాయసము కొండమరుసయ్య యను దండనాథుని కప్పగించి, తాను దిమ్మరసుతోఁ గలిసి కనకగిరి మీఁదికిఁ బోయెను.

సంఖ్యయందేమి, సాధనసంపత్తియందేమి, సమరనైపుణ్యమందేమి, వీరరుద్రుని సేనకంటె రాయల సేన ముమ్మడి నలుమడి. కటకదేశాధీశ్వరుఁడైన ప్రతాపరుద్రగజపతి తనకుఁ దోడువచ్చునన్న యాశ వీరరుద్రునికి మొదటినుండి, యా హేతువుననే యాతఁడు రాయలను ధిక్కరించుటకు సాహసించెను. తన్ను మాలిన ధర్మము లేదన్న పద్ధతిలోనివాఁడైన ప్రతాపరుద్రుఁడు తన రాజ్యమును విడువనొల్లక, కృష్ణదాఁటి యీవలి కడుగుపెట్టని కారణమున వీరరుద్రుఁడు నిరాధారుఁడై చేయునది లేక రాయలకు లోఁబడి పిల్ల నిచ్చుట కొడంబడినాఁడు.

అప్పటికి మాఘమాసము నిండినది. మౌహూర్తికులు ఫాల్గుణబహుళసప్తమికి వివాహము నిర్ణయించిరి. రాణివాసమున కొజ్జ యనఁ దగు పెద్ద కొజ్జా యంతఃపురస్త్రీజనమును విద్యానగరమునుండి తోడి తెచ్చుటకుఁ దగిన యేర్పాటులు జరిగినవి. కనకగిరి వెలుపటి బయలున విడిసిన రాయల శిబిరము విశాలములైన వీథులతో, వివిధవస్తువులను విలిచెడి విపణిగృహములతో, వేడుకలకు నిలయములైన వినోదమందిరములతో, వెల్ల జెండాల తోడి గుడారముతోఁ గనకగిరికంటెఁ గడుఁబెద్ద నగరమై, 'యవనరాత్రుల వినోదము'లను కథలయందలి యద్భుత దీపస్తంభపు మహిమయా, మాయయా, మహేంద్ర జాలమా యనిపించెను. శుభలేఖలంది యింతలో రాజ బంధువులును, సామంతరాజులును రాఁ జొచ్చిరి: ఆర్వీటివారు, ఔకువారు, సంధ్యాలవారు, వెలుగోటివారు, పెమ్మసానివారు, బూదహాళివారు, ఇత్యాదులు చుట్టపక్కములు వచ్చిన కొలఁది విడుదులకిచ్చిన వెల్లగుడారములు హెచ్చి, యచ్చోటెల్ల విచ్చిన వెలిదామరలతోడి విరికొలను మచ్చున లచ్చికాటపట్టోయన ముచ్చట గొలుపఁ జొచ్చినది. ఫాల్గుణ బహుళసప్తమి యుదయమున శ్రీకృష్ణదేవరాయలు పెండ్లికొడుకై మహావిభవముతోఁ బట్టపుటేనుఁగుపై నెక్కి యూరేగి, పెండ్లిసింగారముల మూలముననే కాక నిత్యకల్యాణమును బచ్చతోరణము నైన కనకగిరికిఁ దరలి వెడలెను. రాయల వివాహము కథాంశముకాదు గనుక, దాని ప్రత్యేక వర్ణన మనవసరము. అంతటి మహారాజు పెండ్లి యెంతటిమహావైభవముతో జరుగవలయునో యట్లే జరిగెను. పెండ్లి యేనాళ్లయిన వెంటనే శోభనము కావలసినది. ఆటంకసూచకముగా దాసీజనమందు గుసగుసలు పుట్టినవి. ఉగాది నాఁటి ఉదయమున స్నానము; నాఁటిరాత్రి గర్భాధానము. రాయలు తన శిబిరమునకుఁ దిరిగి వచ్చి, యుగాదికొఱకు గడియ యుగముగాఁ గడుపుచుండెను. రాజులపై వాడి

వెడలిన రాయలపై రతిరాజు దాడి వెడలి, మామిడి చిగురువింట వేపపూవుటమ్ములు సంధించినాఁడు.

ఉగాది, మెట్టకేలకు, వచ్చినది. యుగాదియనియే రాయలు దానిని భావించెను: తన సౌఖ్యయుగమున కది యాది!

ఉగాది యుదయమున శ్రీకృష్ణదేవరాయఁడు రెండవ యాఖండలుఁడో యనఁదగిన యఖండవైభవమున నిండోలగ ముండెను. ఉదయమునుండి యుగాదికానుకల కెడ తెఱపి లేదు: తన వారు పెట్టినవి; కనకగిరివారు తెచ్చినవి; లోఁబడిన రాజులు పంపినవి; మణులు చెక్కిన నగలు; మంచి ముత్యాలపేరులు; బంగారు టంకములు; పట్టుపీతాంబరములు; అందమైన కవచములు; అపురూపమైన యాయుధములు; అరబ్బీ గుఱ్ఱములు; అంబారీ యేనుఁగులు......

అన్నింటికంటెఁ గడపటవచ్చినవి, యన్నపూర్ణాదేవి పంపినవి. ఆ యుగాది కానుకలతోనే మన కథ యారంభము.

## 3

అన్నపూర్ణాదేవిపంపిన యుగాది కానుకలు,మూఁడు బంగారు ప్రతిమలు. అవి స్త్రీవిగ్రహములు. ఒండొంటికి రెండంగుళముల యెడమునుండి, యవి యొకదానికొకటి సన్నని బంగారుకడ్డీలమూలమునఁ గలిసియున్నవి.నడిమిది సుమారుమూడంగుళముల యెక్కువయెత్తు గలిగి, మొత్తముమీఁద నొకయడుగు పొడుగుండును. ఆ పొడవు కిరీటము మూలమునఁ గావచ్చును. కిరీటములు లేకుండుటఁ బట్టియేకాక మోడ్పుచేతులఁ బట్టియుఁ, బార్శ్వముల నున్నవి పరిచారికావిగ్రహములని, మధ్యది దేవీ విగ్రహమని స్పష్టము. అంతేకాదు: మధ్యవిగ్రహమునకు వెనుక తట్టున "అన్నపూర్ణ" యన్నపేరు చక్కని విడి యక్షరములతోఁ జెక్కియున్నది. ఆపేరు విశ్వేశ్వరుని దేవిదో, కృష్ణరాయని దేవిదో, తెలియుటకుఁ దగినసూచనలేవియు లేవు. భర్తకు భార్య తనవిగ్రహమునే కానుకపంపుననన్యాయమున సభాజను లది రాయలవారి దేవేరిదే యని నిశ్చయించి, యా యుగాదికానుక యౌచిత్యమును వేనోళ్లస్తోత్రము చేసిరి.

పిదప, శిల్పిచాతుర్యము కొంతసొగడ్త పడసినది. ప్రక్కబొమ్మలమీఁదఁ బనివాఁడు నేర్పంతగాఁ జూపలేదు: ఏదో విధముగా వెట్టితీర్చుకొన్నట్లు ముగించి, రూఁడుపోల్తిమాత్రము తెచ్చివిడిచినాఁడు. పనివానితనమంతయు మధ్యవిగ్రహము దే. ఒక కుందనపుఁబనియేమి, చెక్కడపుఁబనియేమి, జిలుగుపనియేమి, నగిషీపనియేమి, నాజూకుపనియేమి, తనకుఁగల నైపుణ్యమంతయు వినియోగించి శిల్పి తన విశ్వకర్మనామము సార్థకము చేసికొనినాఁడు. మొగము, కన్నులు, ముక్కు, చెక్కిలు, చెవులు, చేతులు, కాళ్లు, శరీరము మొదలైన సకలావయవములను శ్రద్ధతో, సావధానతతోఁ, జాతుర్యముతో, సొంపుగా, సొగసుగా, సున్నితముగాఁ, జెక్కి, సాపుచేసి, మెఱుఁగుపెట్టి, యదియొకదివ్యమంగళ విగ్రహముగాఁ దేలువఱకు నతఁడు తృప్తి పొందలే దనుట నిశ్చయము. కుడికాలు కొంచెము వంచి ముందుకుంచి, యెడమచేయి నడుమునమోపి, కుడిచేయి కుడితొడ ప్రక్కకు జాఱఁ జాఁపి, సింగారముగుల్కు ఠీవితోఁ, జిఱునవ్వు మొగముతో, సిగ్గునఁ ద్రాలు కన్నులతో, జీవకళ లుట్టిపడ నిలుచున్న యాబంగారుబొమ్మనుజూచి తలయూఁచి మెచ్చనివాఁడు మచ్చునకైనను సభలో లేఁడయ్యెను. ఇఁక రాయని యవస్థ వలరాయనికే యెఱుక!

కల్వలరాయని యందలి మఱకవలె మధ్యవిగ్రహమందొక్కలోపము కలిగినది. దాని వెనుకనుగల "అన్నపూర్ణ"యన్న యక్షరము లొకదాని తరువాత నొకటిగా నుండక, యొకదానిక్రింద నొకటి యుండుటేగాక యెగుడుదిగుడుగాను దేలినది. ఎట్లనఁగా,'అన్నపూర్ణ'యని మీఁద నుండి క్రిందికుండుటకు మాఱు 'ర్ణపూన్నఅ' యని క్రిందనుండి మీఁదకుండెను. తొందరచేత శిల్పివిగ్రహమును దలక్రిందులుగాఁ బట్టుకొని యక్షరములు చెక్కియుండునని సభాసదులు సమాధానము చెప్పిరి.



"కవీంద్రా, ఇది మీరు రచించినదా"

ఉగాది కానుకలతో వచ్చిన పద్యము తిమ్మరసు మంత్రి దీక్షతోఁ దిలకించి తిలకించి తిమ్మకవితో, "కవీంద్రా, ఇది మీరు రచించినదా" అని యడిగెను.

"మంత్రిసత్తమా, అది నాకవిత్వము కాదు; అన్నపూర్ణాదేవిది."

"ఏమీ? కూర్పు కడు నేర్పుగా నున్నదే."

"సంగీతసాహిత్యములందుఁ జక్కని పాండితిగలది నా శిష్యురాలు."

"ఓహో! అట్లు చెప్పఁడు. మీరు కవితాగురువులైనప్పుడు మార్దవమున కేమికొఱంత? కవీంద్రా, దేవిగారికిఁ దగిన యుగాది కానుకలు ప్రభువువారాలోచించి పంపుదురని చెప్పఁడు," అని తిమ్మరసుమంత్రి రాయల వంకఁ దిరిగి, "ప్రొద్దెక్కుచున్నది. ఏలినవారు కొలువు చాలింతురా?" అనెను.

"అప్పాజీ, అట్లే కానిండు," అని కృష్ణరాయఁడు దిగ్గున లేచెను.

౪

గుడారమందలి యభ్యంతరభాగమునఁ బర్యంకము మీఁదఁ బట్టుదిండున కానుకొని కృష్ణరాయఁడు కూర్చుండి యుగాదికానుకగా వచ్చిన యన్నపూర్ణాదేవి విగ్రహము వంకఁ దదేకదృష్టితోఁ దనివితీఱక చూచుచుండెను.

ద్వారమున కాచ్ఛాదనముగా వ్రేలాడుచున్న యాకుపచ్చ మొకమలు తెరగుడ్డను ద్రోసికొని తిమ్మరసు మంత్రి లోనికివచ్చి వచ్చుటతోడనే, అబ్బాయీ, నీయందనురక్తి, యందులకుఁదగిన పతిభక్తి గలయిల్లాలు నీకు లభించినది," అనెను.

చేసన్న చేఁ దిమ్మరసును బర్యంకముపై నాసీనునిఁ జేసి యటుపిమ్మట రాయలు, "ఉగాది కానుకలు పంపుటయే యనురక్తికిఁ బతిభక్తికి సూచకములా?" అని మందహాసము చేసెను.

"అనురక్తియుఁ బతిభక్తియు మాత్రమే కాదు. యుక్తియు మనశ్శక్తియుఁ గలది నీవెలఁది."

"అప్పాజీ, ఉగాదికానుక లిన్ని విషయములను దెలుపుచున్నవా?"

"దేవిపంపిన పద్యముతోఁ గలసి."

"పద్యమా?" అని కృష్ణరాయఁడు కనుబొమ్మ లెగనెత్తెను.

"అవును. ఆ పద్యమందలి 'యపాయముల్ తొలఁగి' యన్న భాగముఁగూర్చి నీవు నిదానముగా నాలోచించితివా?" అని పద్యముగల తాటాకు తిమ్మరసు రాయలచేతఁ బెట్టెను.

పద్యము రెండుమూడుసారులు నోటిలోఁ జదువుకొని, "అప్పాజీ, నాకేమియు విశేషము కనఁబడలేదు. భర్తనైన నాకుఁ బగతుఃఅవలని యపాయములు తొలఁగవలయునని దేవికోరుట సహజము. అనుమానము మీ కేల కలిగినదో" అని రాయలనెను.

"మొదటిలో నేనును నీవలెనే యూహించితిని గాని, దేవీవిగ్రహముమీఁది మెఁగుడుదిగుడు వ్రాఁత నా యనుమానమునకు హేతువైనది."

"ఆ మెగుడుదిగుడునకు సభాసదులు చెప్పిన సమాధానము మీరు వినలేదు కాఁబోలు?"

"వింటినిగాని యది నాకు నచ్చలేదు. శిల్పి విగ్రహమును దల్లక్రిందులుగాఁ బట్టుకొని చెక్కిన యెడల, '[illegible]' యని యక్షరము లు తిరుగఁబడి యుండును గాని, ర్ణపూన్న అ యని తిన్నగానుండుట సంభవింపదు." రాయలు తటాలున విగ్రహము త్రిప్పిచూచి యచ్చెరువుతో, "అవునవును," అనెను.

"ఎగుడుదిగుడు ప్రమాదజనితము గాక ప్రయత్న పూర్వకమని తెలియఁగానే నేను మరలఁ బద్యమునుజదివి చూచితిని 'వివరంబుగా నరయుమా' యన్నమాట లప్పుడు నామనస్సు నాకర్షించినవి."

రాయలు ముఖమెత్తి యాలోచించి,? "పూర్తిగా దెలిసి కొమ్మని గదా దాని యర్థము." అనెను. "వినఁగానే స్ఫురించునట్టి యర్థముమదే. కాని, వివరముగా నరయుటకు దేవి తెలిపిన యనేకాంశములేవి? కాఁ బట్టి, వివరశబ్దమునకు రంధ్రమని, యర్థము చేసి, దేవీవిగ్రహమున రంధ్రముండు నని నిర్ధారణము చేసితిని. ఉగాది కానుకలు 'హితగర్భితమైన' వనుటయు సాభిప్రాయమని నాకప్పుడు బోధపడినది. ఇప్పుడు చదివి చూడుము, పద్యము."

చదివి చూచి సాలోచనముగా రాయలు, "అప్పాజీ, ఇప్పుడుమీరుచెప్పినదెల్ల బహుయుక్తియుక్తము, కాని, రంధ్రము కనఁబడదే?" అని విగ్రహము త్రిప్పిత్రిప్పి చూచెను.

"కుమారా, రంధ్రము గూఢముగా నుండుటకే యేర్పాటు. దానిని గనుఁగొనుటకే మెగుడుదిగుడువ్రాఁత. అక్షరములు దిగువనుండి మెగువకుండుట, సీల దిగువనుండి మెగువకు నొక్కుమనుటకు సూచన."

"సీలయా?" అని విస్మయమున.

"అవును. దేవీవిగ్రహమున కడుగున విధిగా సీల యుండును," అని తిమ్మరసు నిబ్బరముగాఁ జెప్పెను.

తొందరతో రాయలు చూడఁగా, సీల యున్న సూచన యేమియు లేదు. ఐనను మానక యన్నిచోట్లను వ్రేలుపెట్టి గట్టిగా నొక్కుచుఁ బోవఁగా నెక్కడనో టక్కుమన్నట్లయి తటుక్కున విగ్రహము శిరస్సుమీఁది కిరీటమొక ప్రక్కకొఱగి, శిరస్సునుండి లోపటికి రంధ్ర మేర్పడినది. ఉల్లిపొర వంటి సన్నని కాగితమొకటి యా రంధ్రములోఁ జుట్టచుట్టుకొని యుండెను. తీసి విప్పఁగాఁ దానిమీఁద ముక్తాఫలములను బోలిన చక్కని గుండ్రమైన చిన్న యక్షరములతోడి వ్రాఁత కనఁబడినది. వడి వడి వంగి, రాజమంత్రు లొక్కసారి దానిని జదువఁ దొడంగిరి.

౫

స్వర్ణపుష్పపూజయన్న నాదే అది చేసియేకదా
భవదమలపత్ని నైతి నన్నోచినట్టి వెలఁది పుడమి నున్నే
నాపాటి మాఁటదలరవు కాదుకాదాయుమవివేచనము
వరుస నొకవేళ రాజమౌళి మోపయా నా యానకి
పేరునితి భవానిమగనిఁ బ్రేమన్నాసి గడె నిలువఁబోకు
నన్నుబలెనే నాప్రతిమకన్గొనుదు రన్దుర్భ్రిమముపొడమి
యుగాదికానుకగ నేనిపు డంపిన దానభక్తిని శోధించి
త్రిప్పుదువా యెన్నఁటికేని నేను మీవిధేయ
నగుదు మరుఁడుతావకారి నే నచలజాత అన్నపూర్ణ.

కాగితము మీఁది యక్షరపంక్తి యిది. మొగమెత్తి రాయలు సంశయగ్రస్తునివలెఁ దిమ్మరసు వంకఁజూచెను.

"నాయనా, ఏమి నీ సందేహము?" అని తిమ్మరసు ప్రశ్నించెను.

"అప్పాజీ, విగ్రహమున వివరముకలదని, విగ్రహమున కడుగున సీలయుండునని, సీల దిగువనుండి మెగువకు నొక్కవలయునని, గ్రహింపఁగలిగిన మీ యప్రతిమాన ప్రతిభ ప్రశంసాతీతము. అందు మూలమున దేవి నాకు వ్రాసిన ప్రచ్ఛన్నలేఖ ప్రత్యక్షమైనది; ఆమెకు నాపైని గల భక్తి ప్రకటితమైనది. కాని, యామె సూచించిన

యపాయముల మాట యిందేమియు లేదు గదా యని యోజించుచుంటిని."

"పయికిఁ గనఁబడుచుండలే దనుట స్పష్టము."

"పయి కగపడనిది కొంతయున్నదా,దీనిలో?" అని రాయలు పృచ్ఛచేసెను.

"అబ్బాయీ, లేఖ పద్యరూపమా, గద్యరూపమా?" గద్యరూప మన్నది రాయల జవాబు.

"గద్యమైన యెడల, ధారాళమైన నడకయేల లేదు? 'నన్నోబలిన', 'ప్రేమన్నాసి', 'అన్దుర్భ్రిమము', 'ఉన్నే', 'ఆఁటది', మొదలైనవి గద్యరచనలో ననవసరములు. కాఁబట్టె యీలేఖలో గర్భితమైన గుప్తసందేశమేదో యున్నదనుట నిశ్చయము. లేకున్న లేఖ యింతనిగూఢముగాఁ బంపనేల? తనవారి యెఱుకలేకుండ లేఖను బంపిన భయమే, లేఖ యొరులచేతఁ బడినను సందేశమును బైకగపడకుండఁ జేయుటకు హేతువు.".

"నిగూఢమై యున్న లేఖ యొరులచేత నెట్లు పడును?"

"విగ్రహము నలుగురి చేతులలోఁ దిరుగునప్పటి రాపిడిని సీల తనంత యూడవచ్చును." తల పంకించుచు రాయలు: "మఱి లేఖలో గర్భితమైన సందేశమును వెలువరించుటకు మార్గము—"

"లేకపోలేదు. 'అన్నపూర్ణ' యన్న యక్షరముల యెగుడుదిగుడు, సీల యెగనొక్కుటకు మాత్రమే సూచన యనుకొంటిని. ఈలేఖ దిగువనుండి యెగువకుఁ జదువవలయు ననుటకుఁ గూడ నది యొకసూచన. లేఖయందలి 'త్రిప్పదురా' యనుమాట మఱొక సూచన."

రాయలు లేఖవంకఁ జూచుచు, "ర్ణపూన్నఅతజాలచననేరికావ—"అని దిగువనుండి యెగువకుఁ జదువ నారంభించెను.

తిమ్మరసు నవ్వుచు: "నీవు చదువుచున్నది యష్ట భాషలలోనిది కాదుసరిగదా, చీనబర్బర యవనాదులైన యన్యదేశభాషలందలిదియుఁ గాదు. లేఖలో నట్టె 'త్రిప్పదురా' యని కాక, 'శోధించిత్రిప్పదురా' యనియున్నది. అట్టిశోధన మొదటఁ గావలయును. బేసియక్షరములో,"

అనుసరికి రాయలు, "ర్ణ—న్న—త—ల—స—రి—వ—" అని కూడఁబలుక సాగెను.

చిఱునవ్వుతోఁ దిమ్మరసు: "బేసివి కావు.సరి—"

అర్ధోక్తిలోనే, "పూ—అ—జా—చ—నే—కా—తా—" అని మరల రాయలు.



"సరియక్షరములును గావు. మఱి యేమై యుండును?"

అడ్డువచ్చి తిమ్మరసు, "సరియక్షరములును గావు. మఱి యేమై యుండును? ఏదో సూచన దేపిపెట్టియే యున్నది. అదిపోల్చుకొన లేకుంటిమి," అని నోటిలో గొణఁగుకొనుచుదీర్ఘాలోచనలోమునిఁగి మిన్నుచూచుచు నిశ్శబ్దముగాఁ గూరుచుండెను.

ఆయాలోచనకు భంగము కలుగునేమో యన్న భయమున రాయలు కరచరణాదులు కదల్చుట లేదు; గాలి గట్టిగాఁ బీల్చుట లేదు.

నిద్రలో నుండి త్రుళ్లిపడినవానివలెఁ దిమ్మరసు మంత్రి దడాలున లేచి, "పరిచారికావిగ్రహములు, పరిచారికావిగ్రహములు!" అని కేక వేసెను.

ఉగాదికానుకలను జేతితోఁ బట్టుకొని రాయలు, "వీనియందును వివరము లున్నవా? అని పార్శ్వవిగ్రహములయధోభాగముల వ్రేలితో వడివడి నొక్క సాగెను,

"అది కాదు. ఆహా! రాజ్యాంగసంబధము లైన గూఢలేఖల నవలీలఁ జదువఁ గలనన్న ప్రసిద్ధి నాకున్నది. అట్టి నాకుఁ గన్నులయెదుటి యాకిటుకు పోల్చుకొనుట కెంతసేపు పట్టినది! భర్తకుఁ దన విగ్రహ మొక్కటి మాత్రమే పంపవలసినది, పరిచారికావిగ్రహములును గలిపి పంపినందున, దేవి కొంత యతిశయము కలదేమో యని సందేహించితిని. ఆవిగ్రహము లామెకలుపుట యుద్దేశపూర్వకమన్న సంశయమును నాకుఁ గలుగలేదు. ఇదియే కన్నులున్న గ్రుడ్డితనము," అని తిమ్మరసు తన బుద్ధిమాంద్యమును నిందించుకొన సాగెను.

"అప్పాజీ, ఈచిక్కుసమస్య యంతయు నింత చక్కగా విడఁదీయుశక్తి మీకొక్కరికిఁ దక్క వేఱెవ్వరి కున్నది? దేవి యింత గూఢసందేశము పంపుట మీబుద్ధి సూక్ష్మత నమ్మి కాని నా తెలివితేటలు నమ్మికాదు. ఏల యూరక మిమ్ముల మీరు నిందించుకొనెదరు? మఱి యీ పరిచారికావిగ్రహముల యందలి గుట్టేమో దయచేసి తెలుపుడు."

"నాయనా, స్పష్టముగాఁ గనఁబడుచున్నది. ప్రక్క బొమ్మలు పనికత్తెల వగుటచేత ముఖ్యములు కావు; నడిమి దేవీవిగ్రహమే ముఖ్యము. కాఁబట్టి లేఖయందు మూఁడేసి యక్షరముల చొప్పునఁ దీసి, యటునిటు నున్నవి విడిచి, నడిమి యక్షరములు మాత్రమే తీసికొనుచుఁ బోవలయును. ఇది దీనిలోని కిటుకు. తప్పదు, చూడుము," అనితిమ్మరసు తెలిపెను.

ఆత్రముతో రాయలు లేఖను జూచుచు: "ర్ణ— పూ—న్న—అ—"

తిమ్మరసు: "మఱేమి? త్రిప్పిన, 'అన్నపూర్ణ' అది దేవి సంతకము".

మరల రాయలు: "సి—దా—ద—ప—"

తిమ్మరసు సంతోషముతో, "పదదాసి. ఓహో! ఏమి సౌశీల్యము! నాయనా, నీవు మహాదృష్టవంతుఁడవోయి! ఇఁకఁ గాగితము మీఁద నంతయు వరుసగా వ్రాసి, త్రిప్పి చదువ వచ్చును," అనెను.

రాయ లట్లే చేయఁగాఁ దేలిన ఫలితము: "పూర్వ చరితా మనవి నేఁటి రాత్రి శోభనపు గది మిము స్వనుమ నాబదులుగ మగవానికి నా యోజ వేసము వేయుదురఁట, పానుపు వెలితి; పదదాసి అన్నపూర్ణ."

ఆ గూఢసందేశము బయలు పడిన తరువాత రెండు మూఁడు నిముసముల వఱకును మాటలు లేక యొండొరుల మొగములఁ జూచుకొనుచు రాజమంత్రులు కూరుచుండిరి. అటు పిమ్మట రాయలు తటాలునఁ దిమ్మరుసు కాళ్ల మీఁదఁ బడి, "అప్పాజీ, బృహస్పతిని మించిన మీ బుద్ధిబలము వేయి కన్నులతో నన్నుఁ జిన్నతనము నుండియుఁ గాచుచున్నది. మీ శేముషి మూలమునఁ గాకున్న నేఁటి రాత్రి,—" అని గొంచెము వడఁకు గొంతుక పెట్టెను.

అతనిని లేవనెత్తి తిమ్మరసు, "నాయనా, ఈనాఁడు నిన్నుఁ గాచినది నా శేముషి కాదు. అన్నపూర్ణాదేవి పతిభక్తియు బుద్ధిశక్తియు నీకు నేఁడు ప్రాణరక్షణకారణములైనవి. ఆమె పంపిన గూఢసందేశము లేకుండ, నేను నిన్నుఁ గాపాడుకొనఁ గలిగియుందునో, లేదో!" అనెను.

"అప్పాజీ, నాకుఁ గూఁతు నిచ్చి యెట్లు నన్నుఁ జంపించుటకుఁ బూనుకొనెనో వీరరుద్రగజపతి."

"నాయనా, ఉత్తమక్షత్రియుఁడను దానన్న యభిమాన మతనికి మిక్కుటము. అందు మూలముననే మొదటిలో నీతోడి సంబంధమున కంగీకరింపమి. నిర్బంధమున సమ్మతించినను, లోపటి పట్టుదల యతని యుచితానుచితజ్ఞానమును నాశనము చేసియుండును."

"అందు మూలమునఁ దన యేకపుత్రికను—"

"కుమారా, కులాభిమాన మెంత పనికైనను వెను దీయనిది. అది క్షత్రియులలో మఱియు హెచ్చు."



శ్రీ వేంకటకాళిదాస కవులు



శ్రీ గుడిపాటి సత్యనారాయణ శర్మగారు



శ్రీ సింగంపల్లి వెంకటాద్రిగారు



(6) శ్రీ కార్యమపూడి వేంకటకృష్ణ శతావధానిగారు



శ్రీ గున్నేపల్లి అప్పయలింగంగారు

ఆలోచన తెలుపు మొగముతో రాయలు, "అప్పాజీ, 'పానుపు వెలితి' యన్న మాటల కర్థమేమి? శయ్యావిసర్జన సూచనము శోభమునకు నన్ను రానే వద్దన్న యుద్దేశమా?" అని ప్రశ్నించెను.

"అబ్బాయీ, నీ యూహ సరి కాదు. పద్యమున 'అపాయముల్' అని బహువచనప్రయోగ మున్నది. ఆ మాటలు రెండవ యపాయమును దెలుపునవి."

"అది యెట్టిది?"

"నా యూహ యేమనఁగా: మనము కథలలో విన్నాము, నడుమఁ బూర్తిగా వెలితియుండి, వెలితి తెలియకుండ మీఁద దుప్పటి కప్పియున్న పానుపుల పైని బరున్న వెంటనే యమాంతముగా దిగువ లోఁతు నూతులలోను గోతులలోను బడి మనుష్యులు మరణించిన సంగతి. అట్టి పన్నాగ మేదో పన్నుదురన్న మాట. కాఁబట్టి నీవు నేఁటిరాత్రి వెంటనే పానుపెక్కక, దులిపినట్లు దానిని చేతితో గట్టిగాఁ దట్ట వలయును."

"అట్లయిన రాత్రి శోభనమునకు వెళ్లవలసిన దనియే మీ యుద్దేశమా? అపాయములు—"

"అపాయములేవో దేవి కృప వలన ముందుగాఁ దెలిసినవి. తెలిసిన యపాయము లుపాయమునఁ దప్పించుకొన వచ్చును. అందు వలన శత్రువుల కెక్కువ గుండె బెదురు కలుగును గాని, జంకి యపాయముల నడిమికిఁ బోకుండుట వలనఁ గాదు."

ఆలోచించుచు నంగీకారసూచకముగా రాయలు తల యూఁచెను.

"పుత్రా, ఇటలీ దేశమందలి మిలాను నగరమునఁ దయారైనదని చెప్పి, బుడతగీచుల రాయబారి న్యూనీజు పూర్వము నీకొక కవచము కానుక పెట్టెను. అది యిప్పుడు నీయొద్ద నున్నదా?"

"ఉన్నది."

"ఉక్కుదే యైనను, అది పట్టు బట్టంత మెత్తనిదై యొంటి నంటిపెట్టుకొనియుండి, కత్తి దెబ్బను బాఁకు పోటును దగుల నీయనిదని దానిని న్యూనీజు వర్ణించినాఁడు. ఆ కవచము నేఁటి రాత్రి నీవు లోపలఁ దొడుగుకొన వలయును."

"చిత్తము."

"తక్కిన యేర్పాటులన్నియు నేను జూచుకొనెదను. తాను బంపిన సందేశము మనము పోల్చుకొంటిమో లేదో యని దేవి యారాటపడుచుండును. ఆమె పంపిన మాదిరిదే యామెకుఁ బంపుటకై యొక లేఖ వ్రాయుము. తగిన యుగాది కానుకలు నేను జతపెట్టెదను," అని చెప్పి, తిమ్మరసుమంత్రి తెరతెఱచుకొని బయటికి వెడలెను.

గీర్వాణభాషయందు రసమంజరీ ముఖ్య మధుర కావ్యరచనకంటె, ఆంధ్రభాషయందు దేవి వ్రాసిన లేఖ కూర్చుటే యెక్కువ కష్టమన్న సంగతి మహాకవి యైన కృష్ణరాయని కప్పుడు బోధపడినది.

౨

కథానాయిక యైన యన్నపూర్ణాదేవి రూపవర్ణన మిప్పటి వఱకును లేకుండుట గొప్ప లోపమని చదువరులు భావింతురు. అసమర్థత దానికి హేతువని వారూహింపవచ్చును. ఆ యూహ కేవలమును దప్పు కాదు.

అన్నపూర్ణాంబిక మేను పసిమి కమ్మ పసిఁడిది; మోవి కావి జాతి కెంపుది; మోము గోము పున్నమ జాబిల్లిది; కన్నుల బెళుకు గండు బేడిసలది; నగవు తేట పండు వెన్నెలది. అన్నియు నెన్నికమైన లక్షణములే; కాని, యా లక్షణములలో దేనిమీఁదను జూపఱు వీక్షణములు ప్రసరింపక, కొదమతుమ్మెదకదుపులను గదుముచున్న యా ముదిత నల్లని తలవెండ్రుకలమీఁదనే ముందుగాఁ బడును. అత్యంతసుందరములైన యాసోగవెన్నెఱుల సొబగు మనస్సున నుంచుకొనియే కాఁబోలుఁ, గృష్ణరాయఁడు విష్ణు

చిత్తీయమందు నాయికావర్ణనము పట్టున "హేమాంగా భవి" భేత్యాదిపద్యమును రచించెను! ఆయొక్క పద్యమే కాదు. అన్నపూర్ణాంబ సౌందర్యము నాదర్శముగా నుంచుకొని కవిరాజైన యారాజకవి యాముక్తమాల్యద యనఁబడు చూడికుడుతనాంచారు రూపవర్ణనము నడిపె ననుటకు సందేహములేదు. అది చదువుకొనఁ బాఠకులకు హెచ్చరిక! ఏల యంటిరా, భర్తకంటె బాగుగా భార్యా రూపవర్ణనము చేయు వా రుండఁబోరుగదా?


అన్నపూర్ణాదేవి.

భర్త చేసినదైనను, బరులు చేసినదైనను, వట్టివర్ణనముఁబట్టి రూపము కన్నులకుఁ గిట్టుట వట్టిది. చరిత్రకారులు: "కృష్ణరాయలు మిక్కిలి పొట్టివాఁడు గాఁడు, పొడుగువాఁడును గాఁడు. సామాన్యమైన యెత్తుగలవాఁడై చక్కని ముఖవర్చస్సును, సుందరాకారమును, దృఢశరీరమును గలిగియుండెను. రాయలముఖముమీఁద స్ఫోటకపు మచ్చ లుండెను," అని వ్రాసినారు. ఆధారముగా రాయల రూపపటమే లేనియెడలఁ, బయ్యివ్రాఁత యారాజచంద్రుని యాకారమును మన కన్నులయెదుటికిఁ దెచ్చుట కేమంత యుపయోగకారి? అట్టి యాధారముగుటకై యన్నపూర్ణాంబ రూపపట మొక్కటియు లేకుండుట గట్టిలోపము.

రవివర్మ చిత్రపటములు సుప్రసిద్ధములు. ఆ చిత్తరువులందలి నాయికలందఱు నొక్కవిధమైన యాకారము గలవారు. భేదములు వయస్సులనుబట్టి, వ్యవస్థలను బట్టి, వలువలను బట్టి వచ్చినవి. ఇంచుక పొడుగుపాటిశరీరములు కొంచెము కోలవాటు ముఖములు, వంగిన కనుబొమ్మలు నిడుదఱెప్పలతోడి వెడఁదకన్నులు, రవంత సూదిగానున్న ముక్కులు, నిండైన క్రిందిపెదవులు, ఉగ్గులు దేఱి నిగ్గులు వాఱిన పెన్నెఱులు: ఇవి యా యాకారమునకు లక్షణములు. స్త్రీసౌందర్యము పరిపూర్ణత్వమున నట్లుండు నని యారాజచిత్రకారుఁ డూహించి యుండనోపును. అతని మేనక మేని సొంపు, మోహిని ముఖకళ, రాధరామణీయకత, కలిసి యన్నపూర్ణాంబ రూపము తేలును. ఆసొబగులన్నింటికంటె నామచ్చెకంటియందు హెచ్చుగాఁ గానవచ్చునది, స్త్రీల చెలువమునకుఁ జెలువమును దెచ్చు చిఱుసిగ్గు. సిగ్గుకతన శిరస్సించుక వంచుకొని యెప్పుడు నామె యుండుటయే, చూపఱుదృష్టు లామె శిరోజముల సౌందర్యముపై ముందుగాఁ బడుటకుఁ గారణము కావచ్చును.

౨

కనకగిరి రాచనగరియందలి యొక గదిలో వీరరుద్రగజపతి, యతని భార్య మాదమ్మాదేవి, యెత్తైయిన గద్దియలమీఁదఁ గూర్చుండిరి. గజపతి మొగమున గంటు పెట్టినట్లు బొమముడి యున్నది.

తల్లికిఁ గొంత చేరువగా మన కథానాయిక యన్నపూర్ణాంబ తలవంచుకొని నిలువఁబడి, "నాన్నగారూ, నన్నుఁ బిలిపించిన కారణమేమి?" అని కోకిలస్వరమున నడిగినది.

"అమ్మాయీ, ఉగాదికానుకలు పంపితివఁట నీవు కృష్ణరాయనికి! ఏల పంపితివి?" మొగమెత్తకయే యన్న

పూర్ణాంబ కొంత జంకుతో, "మన యింటివాడుక యది యని వింటిని. అమ్మ యుదయమున మీకుఁబంపిన యుగాది కానుకలుచూచి, చెలికత్తెల హెచ్చరికమీఁద నే నట్లు చేసితిని. అపరాధమైనయెడల, క్షమింప వేఁడెదను" అని సవినయముగ నుడివెను.

"మీ యమ్మ నాకుఁ బంపినదనఁగా, భార్యభర్తకు బంపుట జరిగినది. అదిగదా మనయింటి యాచారము?"

[హంసపాదము పెట్టి వెనుకటి సంగతి యొకటి యిక్కడఁ జెప్పవలసియున్నది. నిర్బంధము మీఁద వీరరుద్రగజపతి తన కొమార్తయైన యన్నపూర్ణాంబను కృష్ణదేవరాయలకు వివాహము చేసెనని రాయలు, తిమ్మరసుమంత్రి, తక్కినలోకులు, ననుకొనిరి కాని నిజముగా నట్లు జరుగలేదు. వీరరుద్రునికి విమలాంగి యను వేశ్యయొకతె యుంపుడుకత్తె. దానికొక కొడుకు: పేరు బాలచంద్రమహాళి; ఈడు నూఁగుమీసమును రాని పదునాఱవయేఁడు. అన్నపూర్ణాంబ పుట్టిననాఁడే వాఁడును బుట్టినాఁడు. వారిరువురును గవలపిల్లలలాగున రూపభేదమేమియును లేనివారు. ఆఁడువేసమున బాలచంద్రమహాళి యచ్చముగా నన్నపూర్ణాంబ. అట్టివేషమున బాలచంద్రమహాళిని రాయలకు ముడిపెట్టిరి. ఈగుట్టు వీరరుద్రునకు, మాదమ్మాదేవికి,వీరరుద్రుని పెద్దమంత్రికి, మాదమ్మాదేవి యాంతరంగికపరిచారికకుఁ, దక్క దదితరులకుఁ దెలియదు. తుదకుఁ జెలికత్తెలును బనికత్తెలును గూఁడఁ దమ యన్నపూర్ణాంబకే పెండ్లియైనదని నమ్ముచుండిరి. అందులకనుగుణ్యముగా దొంగ మంగళసూత్ర మొకటి యన్నపూర్ణాంబయఱుత వివాహానంతరమున వేసిరి. ఆటంకమను నెపమున శోభన మాఁపుట, యటుపైని జరుపవలసిన విధానమాలోచించి, యందులకుఁ దగిన యేర్పాటులు చేయుటకు ఆయేర్పాటులు చివరవరకును గూఁతునకుఁ దెలియ నీయ రాదన్న వీరరుద్రుని యుద్దేశము నెఱవేఱలేదు. గుట్టుదాఁచలేని యాఁడుదియు, మనసు పట్టలేని తల్లియు,నైన మాదమ్మ పెద్దమంత్రి, పన్నిన పన్నుగడను రెండుదినముల క్రిందటనే యన్నపూర్ణాంబకుఁ బూర్తిగా వెల్లడి చేసినది.]

"ఏమమ్మాయీ, మాఱుపలుకవు? మగనికే కదా యుగాది కానుకలు, మనలో?" అని వీరరుద్రుఁడు, రెట్టించెను.

వాల్చుమొగముతోనే యన్నపూర్ణాంబ, "నేనును నాభర్తగారికే పంపితిని," అని మెల్లగా ననెను.

"ఏమి?" అనిలేచి, "ఎట్లు మగఁడైనాఁడమ్మా, వాఁడు నీకు?" అని గజపతి ఘీంకరించెను.

"నాన్నగారూ, పెండ్లిపీఁటల మీఁద నాబదులుగ నెవరిని గూర్చుండఁ బెట్టిన నేమి? వివాహమంత్రములు నాపేరనే కదా నడిచినవి? అది గాక, రాయలవారికి నేను దేవినైతి నన్న ప్రసిద్ధి యాంధ్ర దేశమందెల్ల నల్లుకొన్నది. సావిత్రికి సత్యవంతునివలె, వారే నాభర్త, నాదైవము." ఈమాటలు పలికినప్పు డన్నపూర్ణాంబ కంఠస్వరము హెచ్చింపలేదు గాని, యాఁది పలికిన తీరును బట్టి మనోనిశ్చయము వెల్లడి యైనది.

వీరరుద్రుఁడు: "పుస్తె కట్టనివాఁడు——"

"నాన్నగారూ, పుస్తెకేమి? గాంధర్వవివాహమున్నది, మన క్షత్రియులలో."

"ఇదేమే తల్లీ, యిట్టి వెఱ్ఱి నీకు? భోగకాంతకుఁ బుట్టినవాఁడా, నీవు కోరుకొన్న మగఁడు?" ఈమాటలు మాదమ్మాదేవివి.

"అమ్మా, కిట్టని వారు పుట్టించిన మాటలకెక్కడకు? నాయత్త నాగాంబాదేవిగారు గొబ్బూరి వారి బొట్టె; సుక్షత్రియకాంత."

"ఎవరికిఁ బుట్టినను వాఁడు నాతో సంబంధమునకుఁ దగనివాఁడు; వానికిని నాకును దెగని నూడు- నేఁటిరాత్రి శోభనపు గదిలో వాఁడుచచ్చుట తప్పదు," అని గజపతి కాల నేల మర్దించెను.

"హరహరా!" అని యన్నపూర్ణాంబ చెవులు మూసికొన్నది.

"మన బాలచంద్రుడే మరల వధూవేషమున నాటకము నడిపించును. అమ్మాయీ, నీవెఱ్ఱిమొఱ్ఱి యూహలను గట్టిపెట్టి, వివాహమండువలెనే నేఁడును నీవు బాలచంద్రుని వేషముతో మెలఁగ వలయును," అని వీరరుద్రగజపతి శాసించెను.

నేలను మోఁకరించి యన్నపూర్ణాంబ, "నాన్నగారూ, నిష్ప్రయోజకములైన బాష్పములతో మిమ్ము బాధింపను. ఒక్కటి మాత్రము కటాక్షింపుఁడు. మీరను కొన్నట్లు జరిగినయెడల, నా వజ్రపు బాఁకు నాకు బాసట యగుటకు ముదల యిండు. పతితోడి సహగమనము పరమధర్మము గదా సతికి?" అని ప్రార్థించెను.

మాదమ్మాదేవి తటాలున లేచి కూఁతును గాఁగిట గ్రుచ్చి, "మా వెఱ్ఱితల్లీ, కన్యకవైన నీకు సహగమన కర్మమేమే? నీవు దీర్ఘసుమంగళివై వర్ధిల్లుము. అమ్మా, మీనాన్నగారి మాట వినుకొమ్ము. ఉత్తమ రాజకుమారుని కిచ్చి నీకు వారు పెండ్లిచేయఁ గలరు," అని గడ్డము పట్టుకొని బుజ్జగింప సాగినది.

వెడనవ్వుతో, "మాఱుమను మున్నదఁటమ్మా; మనలో?" అని యన్నపూర్ణాంబ యడిగెను.

పెట్లిపోవునట్లు మొగము చిట్లించి పెద్ద యడుగులతో గుమ్మము వఱకును నడిచి, "చీఁకటి పడులోపు ననే యమ్మాయి యిక్కడకు వచ్చియుండవలయును సుమీ," అని పలికి, వీరరుద్రుఁ డపరరుద్రుఁడయి బయటికి వెడలెను.



వీరరుద్రుఁ డపరరుద్రుఁడయి బయటికి వెడలెను.

౬

కనకగిరి యందలి కన్యకాంతఃపురమునకుఁ గలిసి యున్న ప్రమదావనమున నొక పొదరింట జలువరాతి తిన్నెపయి నొంటిగాఁ జెక్కిటఁ జేయి చేర్చుకొని యన్నపూర్ణాంబ కూర్చుండెను. తాను బంపిన గుప్తసందేశము భర్తకు బోధపడెనా లేదా యన్నది యామెకుఁ బట్టుకొన్న చింత.

ఇంతలో గొలగొల—కిలకిల—దులదుల మాటలాడుచు, నవ్వుచుఁ, బరువులు వాఱుచు, నామె నెచ్చెలులచ్చోటికి వచ్చి పడిరి. లోపటి చింత కనఁబడనీయకుండ నన్నపూర్ణాంబ ప్రసన్నవదనము దాల్చినది.

"ఏమమ్మా, చెల్లీ, అన్నపూర్ణా, మఱఁదిగారిని మనస్సునఁ దలఁచుకొనుచు మమ్ము మఱచినట్లున్నావు?" అని యందఱికంటెఁ బెద్దది తిరుమలమ్మ.

"కాదమ్మా తిరుమలక్కా, మఱఁదిగారు మహా సరసులు. * * * వారికి మెప్పు కలిగించుటెట్లని చెల్లెలు దిగులుపడుచున్నది," అని వెంగళమ్మ.

"వెంగళక్కా,—కాదు, కాదు; వెంగళప్పవే నీవు కాకున్న, శోభనమును గోమటిబేరముతోఁ బోల్చు వెఱ్ఱివారుందురా? కోమటి కున్నట్లు మఱఁదిగారికిఁ గుండబొజ్జ యున్నదనుకొంటి వా యేమి?" అని నాగమ్మ.

"నాగక్కా, వెఱ్ఱివెంగళప్పయని దానిని వెక్కిరించితివిగాని, యంతకంటె నీపేరే నీకు హెచ్చు సార్థకమైనది. తెలివితక్కువ నాగమ్మవు గనుక వెంగళక్క మాటలయందలి స్వారస్యము నీవు పోల్చుకొన లేకుంటివి. మన యన్నపూర్ణక్క * * కూరుచుండును. బావగారు కొసరికొసరి యడుగుదురు" అని యోబళమ్మ.

"ఓబళక్కా, ఓ! బళా! యని నిన్ను మెచ్చ వచ్చును. * * * * * * * అన్నపూర్ణక్కతో సరిసమానమైన కవితాశక్తి కలదన్న పేరుపడిన నీకిది యొక లెక్కా? అన్నపూర్ణక్కా, వారి యెక్క సక్కెపు మాటల కెక్కడకు? బావగారి కొసరు లవసరము లేకుండనే నీవు నీవి వదలుదువు," అని యందఱిలోఁ జిన్నది వరదమ్మ.

ఇట్లవరికిఁదోఁచినట్లు వారు శోభనపుఁ బెండ్లి కూఁతుతో సరససల్లాపము లాడసాగిరి. లోని సంతోష మాఁపి, లేని రోషముఁ జూపి, యన్నపూర్ణాంబ కసరిన కొలఁది సఖుల విసరులు హెచ్చినవి. ముమ్మరమైన యీ వేడుకలలో వారు మునిఁగియుండగా దాసి యొకతె బిరబిర వచ్చి, "రాయలవారియొద్దనుండి యుగాదికానుకలు మన యన్నపూర్ణాదేవి గారికి" అన్నది.



వెంటనే కృష్ణరాయలవారి పరిచారికలు నలుగురు నాలుగు బంగారుపళ్లెరములను నేలకు దింపి, చేతులుమోడ్చి నిలువఁబడిరి. మొదటిపళ్లెరములో జలతారు జిలుగుబుటేదారు పనిగల పసుపుపచ్చ బనారసుచీర, మంచి ముత్యములుపెట్టికుట్టిన వంగపండు రంగు మొకమలు రవిక; రెండవదానిలో నానావిధ నవరత్నఖచిత స్వర్ణాభరణములు; మూడవదానిలోఁ బసుపు, కుంకుమ, చందనము, పరిమళద్రవ్యములు, పుష్పములు; నాలవదానిలోఁ బసుపు రాసిన తాటాకు.

ఆ తాటియాకును దీసి వరదమ్మ, "మేలుశ్వేతీయ సుందరాకారము"—అని చదువ మొదలుపెట్టినది.

తటాలుమని యన్నపూర్ణాంబ యా తాటాకు లాగుకొనెను.

నవ్వుచుఁ దిరుమలమ్మ, "అవును. వరదమ్మ చిన్నతనముచేతనే కమ్మతీసి చదివినది గాని, యట్లు చదువఁ వచ్చునా? పచ్చిపచ్చిగా నే మేమివ్రాసిరో దానిలో మఱంది గారు?" అన్నది,

"ఆకారవర్ణనముతో నారంభించిన వారు నఖశిఖ పర్యంతము శివమెత్తినట్లు పొగడక విడుతురా?" అన్నది వెక్కిరింపుగా వెంగళమ్మ.

............................యిరువదియైదేండ్ల పడుచు పెండ్లికొడుకు" అని నవ్వుచుఁ గలిపినది నాగమ్మ.

"పద్యమా, గద్యమా, బావగారువ్రాసినది?" అని యడిగినది వరదమ్మ.

"అది మన యోబళమ్మ చెప్పవలయును. అన్నపూర్ణాంబ చెప్పఁగలదుగాని, చెప్పదు," అన్నది తిరుమలమ్మ.

ఓబళమ్మ కొంచెము యోజించి, "పద్యమే కాని, పద్యారంభము కాదు. వరదమ్మ తప్పుగా రెండవప్రక్కను జదివినది. ఆరంభము మొదటి ప్రక్క నుండును," అనెను.

తిరుమలమ్మ, "ఓబళమ్మా, చూతము మఱి నీశక్తి; మఱందిగారెట్లు వ్రాసియుందురో యూహించి పద్యమును బూర్తిగాఁ జెప్పుము" అని కోరినది.

"అవు నవును," "బాగున్నది," "మఱి చెప్పవే," అని వెంగళమ్మ, నాగమ్మ, వరదమ్మ, యొక్కసారిగాఁ గేకలు వేసి యోబళమ్మ చుట్టును మూగిరి.

ఓబళమ్మ యొప్పుకొని, మరిగడియ సమ్మెబ్బను మాత్రము కోరినది; అట్లే మౌనము దాల్చి యామె చుట్టును దక్కిన నలుగురు కూరుచుండిరి.

అన్నపూర్ణాంబ వరదమ్మ చేతి నుండి కమ్మ లాగుకొన్నందులకుఁ గల కారణము సూక్ష్మబుద్ధి గల

చదువరులు గ్రహించియే యుందురు. గుప్తసందేశమందలి కిటుకు తెలిసినది గనుక, వరదమ్మ వెల్లడిగాఁ జదివిన భాగములోనే 'రాయలు' అన్న పద మేర్పడినట్లు వారికి స్పష్టపడి యుండును. ఇప్పుడు సందు దొరకినది కాఁబట్టి యన్నపూర్ణాంబ కమ్మ యామూలాగ్రముగాఁ జదివెను. అం దిట్లున్నది:

మేలుత్వేదీయ సుందరాకారము బల్సౌగ్యము
సభాసదుల్ సౌరు స్తుత్యర్హమనిరి నీవ్రన్గొమ్మా
యుగాది కాన్కలివి కృష్ణదేవరాయ ప్రాణప్రియా.

నడిమి యక్షరములను వెనుకటి యట్లే తీసి త్రిప్పి నప్పుడు, "ప్రియ దేవి కాయువు నిత్యసౌభాగ్యము రాయలు," అని తేలును. అదిచూచి, తనసందేశమందలి కిటుకు భర్తకుఁ దెలిసినదిగదా యని యన్నపూర్ణాంబ నిబ్బరపడినది.

అరగడియమైనదని వరదమ్మ యనఁగానే పద్యము పూర్తిమైనదని చెప్పి యోబళమ్మ యిట్లు చదివెను.

"ఉ. ఆరసి చూడఁగా రతికి నన్నిట మేలు త్వదీయసుందరా
కారము, మేలు మే! లటులుగాన.................
గోర్కి,నిమేషమబ్దమనుకొంచుదినంబునుబుచ్చుచుంటి దే
వీ, ..............., వీలుగ............మీా నిశ్చ."

ఆపద్యమువిని, "మేలు!" "బళీ!" "భేషు!" "సేబాసు!" అని చప్పట్లు చఱచి, సఖులెల్ల గొల్లున నవ్వసాగిరి. అన్నపూర్ణాంబ చెక్కుల గులాబిసిగ్గుచేతఁ జెంగల్వపూరంగుగామాఱినది

ఇట్లు వారు సందడిగానున్న సమయమున మాదమ్మాదేవిగారి యాంతరంగిక పరిచారిక యచ్చటికి వచ్చి, పెండ్లియందువలెనే యానాఁడును దేవిగారే యన్నపూర్ణాంబకు స్వయముగా ముస్తాబుచేయుటకు ముచ్చటపడుచున్నారని చెప్పి, రాజపుత్రికను వెంటఁబెట్టుకొనిపోయెను.

౧౦

శోభనపు గది యంతయు స్త్రీమయము. పెండ్లికూతు వంక నున్న పేరంటాండ్రు ముప్పదిమంది కంటె హెచ్చు; అంత కంటె హెచ్చు పెండ్లికొడుకు వంక వచ్చిన పేరంటాండ్రు. వా రందఱును గట్టుకొన్న పట్టుచీరల పలు తెఱంగుల రంగులొకదాని వెంబడి నొకటి తోఁచి, వేళగానివేళ నింద్రధనుస్సుల సీనుచుండెను; పెట్టుకొన్న నగలయందలి వజ్రమణులు దీపకాంతిని దళుక్కున మెఱసి, చోటుగాని చోటఁ గ్రొమ్మెఱుంగులను గ్రుమ్మరించు చుండెను. అత్తరు, పన్నీరు, పునుఁగు, జవ్వాజి, యగరువత్తులు మొదలగు సుగంధద్రవ్యముల పరిమళము మల్లికాదిపుష్పసౌరభముతోఁ గలిసి గుబ్బుమనుచుండెను.

పీఁటల మీఁది తంతు సాంతమైనది; దంపతులు పానుపెక్కుటయే తరువాయి.

మంచము చేరిన వెంటనే రాయలు పర్యంకమధ్యభాగమును గుడిచేతితో గట్టిగాఁ దట్టెను. కుట్లు తెగినట్లు పటపటధ్వని పుట్టి, పఱుపు, దుప్పటి, తలగడలు' బాలీసులు; దిండులుఁ గలిసి పర్యంకమధ్యభాగమెల్ల గుబాలునఁ గూలఁబడి దిగువ నెచ్చటనో లోఁతు నీటను దబ్బునఁ బడిన చప్పుడు వినఁబడినది. మంచము నాలుగు కోళ్లు మాత్రమే మిగిలినవి.

పానుపుకూలఁబడుచున్న కాలముననే పెండ్లికొమార్తె



చేయిమెత్తి బాఁకుతో రాయలగుండెమీఁదఁ బొడిచెను. బాఁకుకొన వంగినదిగాని రాయలకుగాయముఁకలుగలేదు.

రాయల వెంట నున్న పేరంటాండ్రు దడాలునం దమ మొలల నొడ్డాణముల వలె నున్న కత్తులను బైకి లాగి, రాయల చుట్టును నిలిచిరి. వారిలో నిరువురు పెండ్లికొమార్తను బట్టుకొని చేతులు వెనుకకు విఱిచికట్టిరి. బలమును బట్టి రాయల పేరంటాండ్రు స్త్రీవేషమున నున్న కొజ్జాలనుట స్పష్టము.

శోభనపు గది యందంతటను గగ్గోలు, గలిబిలి, గందరగోళము! ఎక్కడనో యేదో బాకా యూదిన ధ్వని వినిపించినది. అంతఃపురమం దంతటను గలకలము, కలవరము, కంగారు! అటు పరుగెత్తువారు, ఇటు పరుగెత్తువారు, ఒకరి నొకరు త్రోసికొని పోవువారు, త్రొక్కుకొనిపోవువారు, "ఏమి యేమి?" యనువారు, "ఎక్కడెక్కడ?" నని కేకలువేయు వారు, స్త్రీలు, కొజ్జాలు, పురుషులు,పరిచారికలు,పరిచారకులు,భటులు, ప్రభువులు, భటులు, పరిచారకులు, పరిచారికలు, పురుషులు, కొజ్జాలు, స్త్రీలును గలిసి పెద్దసమ్మర్దము తేలినది. ఎక్కడనుండియో తిమ్మరసుమంత్రి యూట్టిపడి, రాయల ప్రక్క నిలుచుండెను. ధణంధణధణంధణ మని రణభేరిధ్వని యనుక్షణమును మ్రోంగసాగినది.

పరుగుపరుగునం బమునాతేండ్ల పడుచువాండొకండు వచ్చి, "ప్రాణభిక్ష! ప్రాణభిక్ష! నా జననీ జనకులకుం బ్రాణభిక్ష!" అని రాయలవారి పాదముల మీందబడెను.

"ఎవరవు నీవు? నీజననీజనకు లెవరు?"

"ఏలినవారి దేవిని; అభాగ్యురాలను; అన్నపూర్ణను."

తటాలున వంగి, "దేవీ లెమ్ము," అని కృష్ణరాయలు చేయూంత యిచ్చి యన్నపూర్ణాంబను లేవనెత్తి "ఏరీ, మా యత్తమామలు? 'అని యడిగెను.

"గూఢమైన సొరంగపు మార్గమునం గోటలో నుండి పాఱిపోవుచున్నారు. నాయందుం గటాక్షించి వారిని బట్టుకొనకుండ దేవరవారి సైనికుల కాజ్ఞ పెట్టం బ్రార్థన. వారు వింధ్యపర్వతమునకుం బోయి తలదాంచుకొందురంట!"

తిమ్మరసుమంత్రి ముఖము వంకం జూచి, రాజు దేవి కోరికకు సమ్మతించెను, "చంపందగిన యట్టిశత్రువు తన చేతం జిక్కనేని గీడుచేయరా," దన్న నీతి నీతియుగంధరుండును స్వామికార్య ధురంధురుండు నైన యా మంత్రిశేఖరుం డెఱుంగనిదా?

పెండ్లికొమార్త వేసమును జూపించి రాయలు, "ఇది యెవరు? ఆండుదా? మగవాండా? కొజ్జాయా?" అని చిఱునవ్వుతోం బ్రశ్నించెను.

అన్నపూర్ణాంబ, "మాతండ్రి గారి యుంపుడుకత్తె కొడుకు. పితాజ్ఞమూలమున నే యీ యకార్య కరణమునకుం బూనుకొనినాండు. ఇతనిని విడిపించి వింధ్యకుం బోవ ననుజ్ఞ యొసంగుండని మనవి, "అని విన్నవించినది.

"దేవీ, అటు కాదు. నీ వేషమును వేసిన హేతువున నీతని యందు మాకుం బ్రీతి కలిగినది. మీతండ్రిగారు రాజ్య మితని కిచ్చెదము. భయపడి పలాయితులైరి కాని, యున్న యెడల మా మామ గారికైనను హాని చేయక వారి రాజ్యమున వారిని నిల్పియుందుము, "అని రాయలు పలికెను.

ఓహో! ఏమి క్షమ! క్షమ నేలుటకుం దగినవాండే యా రాజనారాయణుం డనుటకు విష్ణుచిత్తీయమున యామునాచార్యుని నోట నతండు పలికించిన రాజనీతి వాక్యములు సాక్ష్యములు.

* * * * *

పూర్వదిగ్విజయ యాత్ర పూర్తి కావించి విద్యానగరమునకు వెళ్లిన పిమ్మట, శ్రీకృష్ణదేవరాయండు అన్నపూర్ణాంబను విధ్యుక్తముగా వివాహము చేసికొనెను. అప్పటి కప్పుడే కటకదేశాధీశ్వరుం డైన ప్రతాపరుద్రగజపతి పుత్రికయైన తిరుమలాంబ నతండు పెండ్లియాడి యుండెను గనుక, అన్నపూర్ణాంబ కృష్ణరాయలకుం బట్టపు దేవి కాక చిన్నాదేవియైనది. పట్టమహిషియైన

రుక్మిణి మీఁది కంటె సత్యభామయందు శ్రీ కృష్ణుని కెల్లో, యట్లే యన్నపూర్ణాదేవి మీఁదఁ దిరుమలదేవి మీఁది కంటె శ్రీ కృష్ణదేవరాయలకు మక్కువ యెక్కువ. తల్లిదండ్రులను గాదని తనయెడల సత్యముగా వర్తించిన భామ సత్యభామ కాదా, మన కృష్ణునకు?

*   *   *   *   *

రాయల ప్రాణరక్షణమునకుఁ గల్యాణమునకుఁ గారణములు, అన్నపూర్ణాదేవి పంపిన యుగాది కానుకలు. చదువరులారా, ఇట్టి యుగాది కానుకలు మీకును లభించునుగాక!

తే. గీ. క్రొత్త సంవత్సరంబు మీకు, భవదాప్త-
జనులకుఁ బ్రమోదకరమయి జరుగుఁ గాక!
ఇట్టి సంవత్సరంబు లనేకము లిటు
మీఁద మీకుఁ గల్గుతఁ బరమేశు కృపను.

[అనుబంధము]

1. (మొదటి పద్యము) — వివరంబు=రంధ్రము, కాఁ=కాఁగా (అయిన పిమ్మట) అరయుమా=చూడుము.

2. (అన్నపూర్ణాదేవి లేఖ)—నేను జేసికొన్న దే బంగారుపువ్వుల పూజ యనిపించుకొనును! అట్టిపూజ చేయుటచేతనేకదా మీకు భార్యనై పవిత్రురాల నైతిని? నన్నుఁబోలిన స్త్రీ లోకములో నుండునా? నాపాటి యాఁటది (యాడుది), అల=ఆ, రమ(లక్ష్మి)కాదు. కాదు + ఆ + ఉమ = ఆ పార్వతి కాదు. వివేచనము వరుసన్=ఆలోచించి చూడఁగా, ఒకవేళ, రాజమౌళి యోష = శివునిభార్య(పార్వతి), ఔనా? = ఔనేమో? [ఏలయన, నావలెనె యామె రాజమౌళి (చంద్రమౌళి) యోష]. ఆ సకి పేరునిక్కి=ఆపార్వతియొక్క యన్నపూర్ణ యన్నపేరు నాకును గలదు. భవాని (పార్వతి) ప్రేమమూలమున మగని విడిచి గడియయైన నుండఁబోదు. (నేను నట్లే యనుట). నన్నుఁ జూచుకొన్నట్లే నాప్రతిమ చూచుకొందురన్న దుర్భ్రమము (లేనిపోని యాశ) పుట్టి, యుగాదికానుకగా నేనిప్పుడు పంపుకొంటిని. (నా) భక్తిని బరీక్షించి, మీరు త్రిప్పుదురా? (కానుక త్రిప్పివేయ రనుట). ఎప్పటికైనను నేను మీకు విధేయురాలనే యగుదును. మరుఁడు (మన్మథుఁడు), తావకారి= (రూపమున) మీకు శత్రువు. మన్మథశత్రుత్వమున మీరీశ్వరులుగనుక, నేను, అచలజాతన్=పార్వతిని (స్థిరస్వభావముగలదానను) అన్నపూర్ణ(వ్రాలు).

3. శా. హేమాభాంగవిభాధరారుణిమ వ
క్త్రేందుప్రభాశ్రీలఁ ద
ద్భామారత్నము వొందదయ్యె మును త
త్తద్వర్ణయుక్తాఖ్యలన్;
శ్యామాత్వం బళి గర్వఘూర్వహకచ
చ్ఛాయాచ్ఛటం గాంచెఁ నొఁ
గా?మున్నర్వి శిరఃప్రధానమను వా
క్యం బెమ్మెయిం దప్పనే?

—ఆముక్తమాల్యద, ౫ ఆ., ౮ ప.

తాత్పర్యము—ఆ చిన్నదానికి శరీరముయొక్క హేమవర్ణముఁబట్టి హేమయన్న పేరుకాని, పెదవియొక్క యరుణవర్ణముఁబట్టి యరుణయన్న పేరుకాని, ముఖముయొక్క చంద్రవర్ణముఁబట్టి చంద్రయన్న పేరుకాని కలుగక, తుమ్మెదల గర్వము నణఁచు కురుల శ్యామ (నీల) వర్ణముఁబట్టి శ్యామయన్న పేరు ముందుగాఁ గలిగినది. (శ్యామయనఁగా యౌవనమధ్యస్థమైన స్త్రీ). అది సహజమే. సర్వావయవములలో శిరస్సు ప్రధానమని లోకములోఁ బూర్వమునుండియు నున్నమాట యెప్పుడును దప్పదు.

# పాతనాణెముల చిత్రములు



౧. మహాక్షత్రప రుద్రదమనుడు

క్రీస్తుశకము రెండవశతాబ్దమున నుజ్జయినిరాజధానిగ పశ్చిమ హిందూదేశమును పాలించిన క్షత్రపరాజు. జయదమనునికొడుకు చ స్తనుని మనుమడు. తన తండ్రికాలమున నతనినోడించి తమ రాజ్యమును గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణి హరించగా, శాతకర్ణి కుమారు డగు వాసిష్ఠీపుత్ర శ్రీ పులుమావిని తా నోడించి మరల తమ పూర్వరాజ్యమును సంపాదించి వృద్ధిపఱచెను. పులుమావి తనయల్లుడే యయినందున నతనిని రెండుమారు లోడించియు వేఱుకీడు దలపలేదు. ఇతనిరాజ్యము, సౌరాష్ట్ర, మాళవ, కచ్ఛ, సింధు, కొంకణదేశములతోఁజేరి గొప్పదై యుండెను.



౨. చస్తనుడు

క్షత్రపరాజ్య స్థాపకుడు క్రీస్తుశక ప్రథమశతాబ్దారంభమున, నుజ్జయిని రాజధానిగ మాళవదేశమును పాలించెను.

—కొ. నరసింహాచారి.




చిత్రకారులు: శ్రీవరదా వెంకటరత్నం గారు.

౧

"అమ్మడూ! నాన్నగారొచ్చారేమో, ఒకమారిల్లా రమ్మనూ."

"ఇంకారాలేదు. ఈవేళ ఆలస్యంగా వస్తారు కాబోలు" అని ఒక పదిహేనుసంవత్సరాల బాలిక చక్కని తాటాకుల కుటీరంముందున్న మాలతీపందిట్లో నిలబడి తల్లికి జవాబు చెప్పింది.

అస్తమిస్తూవున్న సూర్యకిరణాలు ఆ అమ్మాయి సుకుమార మూర్తిమీద ప్రసరిస్తున్నాయి. కుటీరంచుట్టూ వున్న పూల మొక్కలూ, పైగా కనుచూపుమేర వ్యాపించివున్న శాద్వలస్థలాలూ సూర్యకిరణ ప్రవాహంలో మునిగి మనోహరంగా వున్నాయి. గాలిచేత పూలమొక్కలన్నీ తల లూపుతున్నాయి. రంగురంగుల సీతాకోకచిలకలు తోటలో అన్నివేపులా యెగురుతూ పాఠశాలలోనుండి విడిచిపెట్టబడిన బాలికలలాగు కళ్లపండువుగా వున్నాయి.

కుటీరానికి ముందుగా ఒక ఫర్లాంగు దూరంలో గోదావరినది నిర్మలజలంతో ప్రవహిస్తూంది. నదికితూర్పుగావున్న పర్వతాలు సంధ్యా కాంతిలో యెర్రగా కనబడుతున్నాయి. పడమటిగట్టునవున్న కొండలనీడలు క్రమంగా పొడుగులై తూర్పువేపు కొండలమీద పాకుతున్నాయి. ఆఅమ్మాయి ఆవరణగేటులో కూచుని గోదావరీ యిసుక తిన్నెలవేపు చూస్తూంది.

సాంధ్యరాగంపోయి సన్నని చీకట్లు వస్తున్నాయి. అప్పుడిద్దరుపురుషులు చురుగ్గానడుస్తూ యిసుకతిన్నెలని దాటి కుటీరందగ్గిరకి వచ్చేరు. బాలిక "నాన్నగారూ?" అని సవితర్కంగా పలికింది.

"ఏమమ్మా!" అని ముందుగా నడుస్తూవున్న యాతడు కూతురికి బదులు పలికిన తర్వాత వాళ్లందరూ లోపలికి వెళ్లారు.

"రంగాచార్లూ! ఇలా కూర్చోవోయ్ యీ కుర్చీమీద," అని గృహయజమాని తనతో వచ్చిన యువకుడితో చెప్పి హాలులోవున్న కుర్చీ చూపెట్టి తనూ ఒక కుర్చీమీద కూచున్నాడు.

ఆహాలు కొంచెం విశాలమైందే. అందులో నాలుగైదు పడకకుర్చీలూ, రెండు పేముకుర్చీలూ వున్నాయి. మధ్యగా ఆరుపలకల మేజాబల్ల (hexagonal table) ఒకటి వుంది. దానిమీద రంగురంగుల పువ్వులు కుట్టినగుడ్డ ఒకటి పరిచివుంది. ఆ బల్లమధ్య ఒక చక్కని పింగాణీ కూజాలో రకరకాల పువ్వులు ఆకులమధ్య అందంగా అమర్చబడివున్నాయి. ఇంటి నడికప్పుకి వేలాడుతూ ఒకయినప



"వంటఅయింది మడిగట్టుకోవచ్చు"

గొలుసుకి తగిలించబడి ఒక "హ్యాంగింగ్ లైట్" (hanging light) మంచి కాంతితో హాలుని పూర్తిగా నింపేస్తూంది.

వాళ్లిద్దరూ అల్లా కూచుని యిష్టాగోష్టి మాట్లాడుకుంటూ వుండగా లోపలినుంచి ముప్పైయైదు సంవత్సరాలు వయస్సుగల స్త్రీ వచ్చి, "వంట అయింది. మడిగట్టుకోవచ్చు" అని చెప్పింది.

ఆవిడ అట్టే పొడుగూ పొట్టీ కాకుండా సమానమైన యెత్తు గలిగివుంది. శరీరం పండుతమలపాకులాగ కాంతివంతమైంది. కొద్దిగా స్థూలకాయం. చుట్టూ జరీపుడకంచు యెర్రపట్టుచీర కట్టుకుంది. చేతులు పొట్టిగా కత్తిరించిన దక్షిణాదిరవిక తొడుక్కుంది. ముఖం తెలివితేటలనీ, ప్రసన్నతనీ సూచిస్తూన్నది. మెడలో రెండు వరసల గడియారపుగొలుసు ఒక్కటితప్ప వేరే నగలు లేవు. నాగరికతా పరిచయం కలిగి ఆమె ఒక పెద్ద ఉద్యోగస్థుడి భార్యలా గుంది.

ఆవిణ్ణి చూసి గృహయజమాని "ఇదుగో చూశావా? ఇతను మన రామానుజాచార్లుగారి కొడుకు. రాజమండ్రీలో రెండేళ్లక్రితం 'ఇంటర్' చదువుతూ వుండేవాడు. మొన్ననే కాలేజీకి సెలవులిచ్చేరు కదూ! ఈఉదయం లాంచిమీద 'శ్రీరామగిరి' వచ్చాడు." అన్నాడు.

ఆవిడ యిదంతా విని, "అలాగా? ఈయేడు బి. ఏ. పరీక్షకి వెళ్లాట్టగదూ యితను?" అంది.

"అవునవును. అన్నట్టుగ మరిచిపోయాను. రంగాచారీ! పేపర్లన్నీ బాగా రాశావా?"

"బాగానేరాశానండి. కాని యీయేడు కెమిస్ట్రీ (Chemistry) పేపరు కొంచెం టఫ్ (tough)గా వుందిలెండి."

"ఊహూ. యిప్పుడు లోకనాథయ్యరేనా ప్రిన్సిపాలు (Principal)? సోమనాథరావుగారేనా హాస్టెలు వార్డెను (Hostel warden)? విశ్వేశ్వరయ్యరు అనంతపురంనించి మళ్లా వచ్చాడా? పాపం, మంచివాడుసుమా! అరవల్లో పుట్టతగ్గవాడుకాడు."

పైవిధంగా ప్రశ్నలడుగుతూ, రంగాచారి చెప్పేసమాధానాలు వింటూ కొంతసేపు మాట్లాడుకున్న తర్వాత, ఆయన "ఏమోయ్! ఈ పూటిక్కడ వుండిపో, పొద్దుపోయింది: It is too late to go home now" అన్నాడు.

రంగాచారి "పరవా లేదులెండి. ఎంతసేపూ? ఎంతోదూరం గనుకనా?" అని కళ్లజోడు తీసి తుడిచి, మళ్లా పెట్టుకుని, "It is only a matter of half a mile (ఒక అరమైలుదూరమేకదూ?)" అన్నాడు.

మరి అయిదునిముషాల్లో రంగాచారి గృహోన్ముఖుడైనాడు.

౨

నారాయణమూర్తి చిరకాలం రాజమహేంద్రవరంలో ప్రభుత్వ కళాశాల ప్రొఫెసరుగ పనిచేసి విద్యాధికుడని పేరు పొందినవాడు. ఉద్యోగం నుంచి విశ్రాంతి తీసుకుని రెండేళ్లుమాత్రమే అయింది. అతను బాగా ఆరడుగుల పొడుగు మనిషి. బక్కపల్చగా వుంటాడు. శరీరం పచ్చని నిమ్మపండు రంగు. తల చాలాభాగం నెరిసిపోయింది. నేత్రాల్లోని కాంతులు కళ్లజోడు అద్దాలుదాటి పైకి ప్రకాశిస్తూ వుంటాయి.

విశ్రాంతి తీసుకున్న తర్వాత జనసమూహాలతో క్రిక్కిరిసి వుండే పట్నాలంటే అతనికి తలనొప్పిగా తోచింది. ప్రకృతిసౌందర్యం నిండివుండే నిర్జనస్థలం యేదేనా చూసుకొని అక్కడ పరమేశ్వరధ్యానంలో, శాంతంగా తన జీవితశేషాన్ని గడపాలని నిశ్చయించుకున్నాడు. తినడానికి కావలసినంత ధన ముంది. అది వెచ్చించుకుంటూ భార్యతోనూ, యేకపుత్రికతోనూ ప్రశాంతమైన జీవనం గడపడానికి అతని అభిప్రాయం.

గౌతమీనది దక్కను పీఠభూమిని దాటి, తూర్పు కనుమలని చీల్చుకుని సముద్రంలో కలుస్తూంది. మెలికలు మెలికలుగా తిరుగుతూ కొండల్లో రమారమి యెనిమిదిమైళ్లపొడుగుంది ఆ మహానది. తూర్పు కనుమల మధ్య గోదావరీ తీరాన్ని 'శ్రీరామగిరి' అని ఒక చిన్నపల్లె వుంది. ఇక్కడ కొండమీద ఒకపురాతనదేవాలయం వుంది. శ్రీరామచంద్రమూర్తి దక్షిణానికి వెళ్లేటప్పుడు ఈపర్వతమ్మీద కొంతకాలం నివసించేడని యిక్కడ ప్రజలు భక్తితో చెబుతూ వుంటారు.

'శ్రీరామగిరి' లెక్క పది కోయకొంపలుగల కుగ్రామం. ఊరు దాటితే తూర్పున ఉన్నతాలైన పర్వతాలూ, మహారణ్యమూ వుంటాయి. పడమట చెప్పలేనంత లోతుతో గోదావరి గంభీరంగా ప్రవహిస్తూవుంటుంది. పర్వతమ్మీద స్వామివారి ఆలయం వుంది. ఆలయం చిన్నదైనా అందమైంది. ప్రకృతిశోభలో తెప్ప తేల్తూవున్న స్థలంలో కట్టబడ్డంచేత దాని అందం ద్విగుణీకృతమైపోయింది. గౌతమీనది తన శీతల శీకరాచ్ఛాదనంచేతనే నిత్యమూ తన్ను సేవిస్తూవుండగా, నదిలో పడవలమీద ప్రయాణంచేస్తూ నమస్కారాలు చేసే భక్తుల ప్రార్థనలు వింటూ వుంటాడు స్వామి పర్వతంమీదనుంచి. ఎక్కడ దేవాలయాలు కట్టినా దూరదృష్టి గలపూర్వులు సృష్టిశోభ అపరిమితంగా వుండే స్థలాలే యేరికట్టారు. ఆ నెపాన్నేనా మానవుడు ఒక్కసారి సర్వేశ్వరస్వరూపమైన ప్రకృతిని సందర్శిస్తాడుగదా అని మన పెద్దల ఆశ. గ్రామంలోనించి పర్వతమ్మీదకి చక్కని మెట్లవరస వుంది. అక్కడా అక్కడా కొన్నిసోపానాలు మాత్రం శిథిలావస్థలో వున్నాయి. ఒక్కసారి స్వామిఆలయంవఱకూ యెక్కి ఆమహోన్నత పర్వతాలవేపూ, అగాధమై మందగమనాన్ని వేంచేస్తూవున్న గౌతమీతల్లి వేపూ ఒక్కసారి చూస్తే చాలు, జన్మ ధన్యమైపోతుంది. ఆదృశ్యం మళ్లీ వెయ్యిజన్మాలకేనా మరపునకు రాదు? చూపుమేర నదీసైకతాలేకదా! ఈవేపు తిరిగితే అన్నీ పర్వతాలూ, అరణ్యాలేకదా! మహాశక్తిస్వరూపమైన ప్రకృతి తప్ప కలుమదుర్బలుడైన మానవుడు మనకక్కడ కనబడడు.

స్వామి అర్చకుడు రామానుజాచార్లు ఒక్కడిదే ఆ ఊళ్లో బ్రాహ్మణ గడప.

నారాయణమూర్తి శ్రీరామగిరికి ఒక అరమైలు దూరంలో నదీతీరాన్ని తన కుటీరం కట్టుకున్నాడు. ఉదయాన్నే లేచి స్నానం చేసి పర్వతమిన్నాద స్వామిదర్శనం చేసుకొని, యేడుగంట లయేసరికి కుటీరం చేరుకూ వుంటాడు. అతని కింకులో పుణ్యమే కాకుండా "morning walk" కూడా కలిసి ఒస్తుందట. తరవాత కాఫీ; గంట సేపు అమ్మాయికి చదువూ; భోంచేసి సంస్కృతగ్రంథకాలక్షేపమూ; సాయంత్రం యిసకతిప్పలమైకి షికారూ. అప్పుడప్పుడమ్మాయినికూడా తనతో షికారు తీసుకుపోతూవుంటాడాయన. ఆయనభార్య సుందరమ్మ ఎప్పుడో కాని వెళ్లేదికాదు.

పర్వదినాల్లో నారాయణమూర్తి కుటుంబసహితంగా స్వామి దర్శనంచేసి, కొండమీదనించి విశాలసైకతస్థలాలూ, ఆకాశాన్నంటుతూవున్న తూర్పుకనుమలూ మొదలైన ప్రకృతివైభవాలు భార్యకీ, అమ్మాయికీ చూపించి తాను సంతోషిస్తూ వుంటాడు.

మధ్యాహ్నం పనులు చక్కబెట్టుకుని, సుందరమ్మ కూతురికి క్షీణవాయిద్యం నేర్పి, భాగవతం చదివించుకుని వింటూ వుంటుంది. ప్రవాహపుపోర్జుల్లో కుటీరపు గవాక్షాల్లోనించి ఆచిన్నికుటుంబం నదీ శోభను తిలకిస్తూవుంటుంది.

3

దేవాలయానికి సాలీనా మూడువేలరూపాయిలరాబడి వుంది. అందులో రెండువేలు వచ్చేభూమే అర్చకుడిది. మిగిలినది నిత్యభోగాని కయ్యేఖర్చుకీ, స్వామివారికర్లకీ వినియోగపడాలని రాగిపట్టా లున్నాయి.

రామానుజాచార్లుకి ఒక కొడుకూ, ఒక కూతురూనూ. కొడుకు పేరు రంగాచార్లు, కూతురు పేరు నాంచారు. చుట్టుపక్కల కోయవాళ్లకి రామానుజాచార్లు చెప్పిందే వేదవాక్యం. రెండువేల రూపాయల రాబడి వున్నప్పటికీ రూపాయేనా మార్చవలసిన అవసరం లేకుండా అతనికి అన్నివస్తువులూ వాళ్లవల్ల సప్లయి అవుతాయి. చెయ్యిచూసి యేదో మాత్ర యివ్వడంమట్టుకి అతనికి వైద్యం తెలుసును. కోయకొంపెల్లో జ్వరం వస్తే చాలు, నామాలసంచీ, అతనూ ప్రత్యక్షం. అతని మంచిమనస్సే అతనిమాత్రలకి శక్తి యిస్తూందని యెరిగినవాళ్లు అంటారు.

దగ్గిర భద్రాచలంలో కొడుకుని స్కూలుఫైనలు ప్యాసు చేయించి రాజమండ్రీ కాలేజీలో ప్రవేశపెట్టాడు రామానుజాచార్లు. రంగాచారి యిప్పుడు బి.ఏ. చదువుతున్నాడు. నారాయణమూర్తికాలేజీలో ప్రొఫెసరుగా వున్నప్పుడు యఫ్.ఏ. చదువుతూవుండేవాడు.

రామానుజాచార్లు భార్య కుమార్తెతో కలిసి అప్పుడప్పుడు ప్రొఫెసరు గారింటికి వొస్తూపోతూ వుంటుంది. సుందరమ్మకూడా నాలుగైదురోజులకోమాటు ఆచార్లుగారింటికి వెళ్లి ఆయనభార్యతో ముచ్చటించి వస్తూవుంటుంది.

దగ్గిర బ్రాహ్మణ సహవాసం వేరే లేకపోవడంవల్ల ఆ రెండు కుటుంబాలూ చాలా అన్యోన్యంగా వుండేవి.

వైష్ణవసమారాధనలకీ, తిరునక్షత్రాలికీ "మేష్టారి" కుటుంబాన్ని ఆచార్లు ఆహ్వానంచేసేవాడు. సంస్కృతగ్రంథాల్లో సందేహాలొస్తే ఆచార్లే నారాయణమూర్తికి బోధపరుస్తూవుండేవాడు.

నారాయణమూర్తి అక్కడికి వచ్చి ఆరునెల్లయింది. నాంచారు తోచినప్పుడల్లా కుటీరానికి వెళ్లి "రాజ్యలక్ష్మి"తో ఆడుకుంటూవుంటుంది. సుందరమ్మ నాంచారుని ఒక్కొక్కప్పుడు నాలుగేసిరోజులు కుటీరంలోనే వుంచేసేది. ఒకయీడుపిల్లలు గనుక వాళ్లిద్దరికీ చాలా స్నేహం. "శ్రీరామగిరి"కీ కుటీరానికీ మధ్య ఒకగెడ్డ గోదావరిలో కలుస్తూంది. అందులో యిసకమీద వాళ్లిద్దరూ తరుచు ఆడుకుంటూ వుంటారు. "కుటీరానికి వచ్చింతర్వాత అమ్మాయికి company లేదు సుమా" అని నారాయణమూర్తి భార్యతో అనేవాడు. వాళ్లిద్దర్నూ ఒకరినొకరు ప్రేమించుకోవడం చూసి అతను సంతోషించాడు.

తండ్రి తనకి చెప్పిన కథల్ని రాజ్యం నాంచారుకి చెబుతూ వుంటుంది. నాంచారు "శౌనక మహర్షి" లాగ ఎంతవిన్నా తృప్తి పొందకుండా లక్షప్రశ్నలు వేస్తూవుంటుంది. నారాయణమూర్తి అమ్మాయికి పాఠం చెబుతూవుంటే నాంచారు పక్కని కూచుని వింతగా చూస్తూవుంటుంది. ఆమె యేదైనా పుస్తకాన్ని సునాయాసంగా చదవగలదు. కాని భూగోళము, దేశచరిత్ర యిలాంటివి ఆమెకి కొత్త. మంచి కథల పుస్తకాలుకూడా విశేషంగా చదవలేదు.

అందుచేత రాజ్యం చెప్పే కథలన్నా, ఆమె తండ్రి చెప్పే పాఠాలన్నా నాంచారుకి వింతా, కొత్తానూ. రాజ్యలక్ష్మి నాంచారుకి గురువుగారై అప్పుడప్పుడు కథలు చెబుతూ వుంటుంది. అలాంటి సమయాల్లో తను చిన్నప్పుడు చదువుకున్న జార్జిగరల్స్ స్కూలు హెడ్ మిస్ట్రెస్ (Geoge Girls' School Head-mistres) లాగ తానున్నానేమో నని అనుమానం.

రాజ్యలక్ష్మి పట్నవాసపుపిల్ల, నాంచారు పల్లెటూరి పిల్ల. నాంచారు కొండల్లో పుట్టి, కొండల్లో పెరిగిం దవడంచేత పరిపూర్ణమైన అంగసౌష్ఠవం గలిగి బలంగా వుంది. రాజ్యలక్ష్మి కొంచెం బక్కపల్చగా నాజూగ్గా వుంటుంది. కాని కుటీరానికి వచ్చినప్పటి నుంచీ ఆమెకి క్రమంగా బలం కలుసుతూంది. ఇసకలో పరుగెత్తడానికి రోజూ నాంచారుతో పందెం వేస్తూ వుంటుంది. కాని రోజూ ఓడిపోతూనే వుంటుంది.

౪

ఇంతలో వేసంకాలం రావడంతోటే రంగాచారి రాజమండ్రీ నుంచి శ్రీరామగిరి వచ్చాడు. వెంటనే గురువుగారింటికి వెళ్లి ఆయ



విఘ్నేశ్వరాది
ఆంధ్రభజన కూటము



శ్రీ వెంగల సుబ్బారెడ్డి గారు



శ్రీ సత్తి సాంబరెడ్డి గారు



(7) కమ్మయువజన సంఘ హిందీపాఠశాల, అయితానగరప్పాళెం, తెనాలి.



శ్రీ వామన రామచంద్ర నాయకుగారు



ఉ. శ్రీ. కార్లమపుడి రాజమన్నారుగారు



శ్రీ కవిరత్న నరసింహా శర్మగారు



ఆంధ్రదేశ హిందూమహాసభ సమావేశము, బెజవాడ.

దర్శనం చేసుకున్నాడు. గురు శిష్యు లిద్దరూ చాలాసేపు వివిధవిషయా లనుసరించి ముచ్చటించుకున్నారు. రంగాచారి తరుచు కుటీరానికి వచ్చి గురువుగారితో ముచ్చటిస్తూ వుండేవాడు. తమకి కలిగినంతవరకూ పాలూ పెరుగూ మొదలైనవాటిని కోవెల నౌకరుని పెట్టి గురువు గారికి పంపుతూ వుండేవాడు.

అతనికి తెలుగులో మొదటనించీ అభిరుచి యెక్కువ. చిన్నప్పుడే అతనికి కవిత్వం చెప్పడం, వ్యాసరచనా అలవాటైనాయి. "గౌతమీ లైబ్రరీ"లో అతను తిరగెయ్యని పుస్తకం లేదు. దానికితోడు పరిపూర్ణమైన ఆంగ్లవాఙ్మయంతోటి పరిచయం ఒకపక్కా, బాల్యం నుంచీ ప్రకృతి వైభవ సమృద్ధములైన పర్వత సీమల్లోనూ, గౌతమీ తీరాన్నీ నివాసం వేరొకపక్కా అతని భావనాశక్తిని బాగా విజృంభింపజేశాయి. పరమేశ్వర స్వరూపమైన ప్రకృతిని పద్యరూపాన్ని అర్చించడం అతనికి పరమానందం.

కాలేజీలో వార్షికోత్సవాలు (Anniversaries) మొదలైన వాట్లో రంగాచారి పద్యాలకే ప్రాముఖ్యము యెక్కువ. భారతి, శారద, ప్రబుద్ధాంధ్ర మొదలైన పత్రికలు అతనిపద్యాలనీ, కథలనీ ప్రకటిస్తూ వుంటాయి. "ఆంధ్రకవిమండలి"లో అత నొక మెంబరు. యువకవుల్లో అతనికి మంచిస్థానం వుందని పెద్దలు ఒప్పుకున్నారు.

*　*　*　*　*

ఎండాకాలం. సాయంత్రం నాలుగు గంట లౌతూంది. తూర్పు కనుమల ఉన్నతశిఖరాలు సూర్యకాంతిలో బంగారు పోత పోసుకున్నాయి. వేడిగాడుపులు కొద్దిగా తగ్గాయి. దూరాన్ని కొండపోళ్ల లోనించి పొగలూ, మంటలూ కనబడుతున్నాయి. ఒక లేళ్లగుంపు బెదురుతూ, బెదురుతూ కొండలోయలోనించి దిగి గోదావరీ జలాన్ని అతి ఆప్యాయనంగా తాగి మళ్లీ తుర్రున పారిపోయింది. జనసంచారం యెక్కడా లేదు. కొండశిఖరాన్ని ఒక పెద్దబండరాతిమీద ఒక 'అడివిపిల్లి' కూచుని గోదావరివంక చూస్తూంది.

రంగాచారి ఒక్కడూ గోదావరిఒడ్డున యిసకలో కూచుని యేవో కూనిరాగాలు తీస్తున్నాడు. ఒక పావుగంటలో నారాయణ మూర్తికూడా అక్కడి కొచ్చాడు. యథోచిత మర్యాద లైన తర్వాత నారాయణమూర్తి "రంగాచారీ! యీమధ్య కొత్తపద్యా లేమైనా రాసేవా?" అన్నాడు.

రం:—(చిరునవ్వుతో) "కొద్దిగా రాసేనండి. ఈమధ్య పరీక్షల తొందరనించి తీరుబాటు లేదుకదూ? ఇక్కడ కొచ్చింతరవాతమాత్రం కొద్దిగా రాశాను."

"ఏదీ, నీపద్యాలు విని చాలా రోజు లైంది. రెండు పద్యాలు చదువూ. నువ్వు College Anniversary (కళాశాలావార్షికోత్సవం) లో రాసిన పద్యాలు మాత్రం splendid (బాగు) గా వున్నాయి సుమా."



"నారాయణమూర్తి కూడా అక్కడి కొచ్చాడు."

రంగాచారి కంఠం సవరించుకుని చక్కని రాగంతో పద్యాలు చదవడం ప్రారంభించాడు. అతడు మంచి పాటకుడు కూడానూ. అతని చక్కని పద్యాలకి అతని సంగీతం వన్నె తెచ్చింది. కాలేజీ విద్యార్థులు సాయంకాలం రంగాచారిని "ఎంకిపాటలు నువ్వు పాడితే వినాలోయ్" అంటూ వేపుకుతింటారు. నారాయణమూర్తి ఆపద్యాల్లోనూ, ఆ మనోహరకంఠస్వరంలోనూ తన్ను తాను మరిచిపోయి "భేష్, excellent, splendid" అంటూ తన ఆనందాన్ని తెలియచేశాడు.

ఆ సాయంత్రం వాళ్లిద్దరూ ఇళ్లకి పోయేటప్పుడు నారాయణమూర్తి "ఏమోయ్! ఓమారు సుందరానికికూడా నువ్వు యీపద్యాలు వినిపించాలి. చక్కని పద్యాలూ, మంచిపాటా అంటే సుందరం చెవి కోసుకుంటుంది" అన్నాడు.

"అలాగే వస్తానండి. దాని కభ్యంతర మేమి? I think myself highly obliged" అన్నాడు.

Ꮘ

తను అప్పటివరకూ రాసిన పద్యాలన్నీ రంగాచారి గురువు గారికి చూపెట్టినాడు. నారాయణమూర్తీ, సుందరమ్మా అతని

వ్రాతలు వినీ, చదివీ సంతోషించారు. తరచు సాయంత్రంవేళ కుటీరం ముందర పచ్చికబయలుమీద కూచుని అతనిచేత పద్యాలు చదివించుకుని వాళ్లు ఆనందిస్తూ వుండేవారు.

మంచిరాగాలతో, హాయినింపు కంఠస్వరంతో తను రచించిన ప్రకృతివర్ణనలు రంగాచారి తల్లిదండ్రులముందు చదివేటప్పుడు రాజ్యలక్ష్మికూడా అక్కడే కూచుని వింటూ వుండేది. భావపూరితాలై, రసం చిప్పిల్లుతూవుండే అతని పద్యాలు ఆ అమ్మాయికి సంతోషం కలిగించాయి.

కొత్తగా వాఙ్మయరంగంలోకి దిగిన "యెంకిపాటలు" నారాయణమూర్తికి చాలా సరదా. ఎన్నిసార్లు విన్నాగాని అతనికి తనివితీరేది కాదు. రంగాచారిచేత ఒక్కొక్కపాట చదివించి భార్యకి వాటిలో వుండే భావాన్నీ, అందాన్నీ బాగా బోధపరుస్తూవుండేవాడు.

ఇవే కాక దేశంలో నూతనంగా రేకెత్తుతూవున్న భావకవిత్వ లక్షణాలు చెబుతూ, పేరుపొందిన కవుల రచనలు వినిపిస్తూ, వాటిలో వుండే సౌందర్యాన్ని విమర్శనపూర్వకంగా గురువుగారితో తరుచు రంగాచారి ముచ్చటిస్తూ వుండేవాడు. తండ్రిదగ్గిరే కూచుని రాజ్యం కూడా అవన్నీ వింటూ బోధపరచుకుంటూ వుండేది. "నాన్నా! యీసాయంత్రం మరోకసారి యెంకిపాటలు పాడించు నాన్నా" అంటూవుండేది.

"సాహితీసమితి"వారి నూతనపద్ధతులూ, ఉన్నతాశయాలూ, రచనాసౌందర్యాలూ, వారి సంభాషణల్లో దొర్లిపోతూవుండేవి. "సాహితీసమితి"ని చూసి లెక్కలేనన్ని యితర సంఘాలు బయలుదేరడం మొదలైనసంగతులు వారు ముచ్చటగా చెప్పుకునేవారు.

రాజ్యలక్ష్మి శ్రీరామగిరికి పోయి ఒక్కొక్కనాడు పొద్దు పోయిందంటే అక్కడే వుండిపోతూవుంటుంది. అలాంటిరోజుల్లో నాంచారు సోదరుని ఆంధ్రగ్రంథాలన్నిటినీ స్నేహితురాలికి చూపిస్తూవుంటుంది.

రంగాచారి పత్రికల్లో అప్పుడప్పుడు రాసిన కథలన్నిటినీ "ఆంధ్రభాషావిలాసినీ గ్రంథమండలి"కి ఇచ్చివేశాడు. వారాకథలనొకపుస్తకంగా అచ్చువేసుకున్నారు. దానికతడు "కథాలహరి" అని పేరు పెట్టాడు.

అతని పుస్తకాల్లో కొన్నింటిని రాజ్యం తాను చదువుకోడానికని యేరుకుంది. వాటిలో "కథాలహరి"కూడా వుంది. అవన్నీ చదవడంచేతా, కవిత్వతత్వాన్నిగురించి తండ్రికీ రంగాచారికీ జరిగే సంభాషణలు వింటూవుండడంచేతా ఆమెకి కవిత్వంలో ఒక విధమైన అభిరుచి కలిగింది.

నారాయణమూర్తితో తాను వివిధవిషయాల్నిగురించి ముచ్చటిస్తూవుండేటప్పుడు శ్రద్ధతో వింటూవుండే రాజ్యలక్ష్మి కౌతూహలాన్ని రంగాచారి కనిపెడుతూ వుండేవాడు. ఆధునికాంధ్రకవిత్వము నెడల ఆమెకిగల ప్రేమ చూసి అతడు మనసులో చాలా శ్లాఘించినాడు.

ఒకనాడు రంగాచారి మామూలుగా చదువుకునేగదిలో కూర్చున్నాడు. నాంచారు రాజ్యంతో ఆ పక్కగదిలో సంభాషిస్తూంది. మధ్యనున్న ద్వారంలోనించి వారిసంభాషణ వింటూ అతను వారి చర్యలు కనిపెడుతున్నాడు. "నువ్వీమధ్య మాయింటికి రావడం మానేశావు నేనుమాత్రం మీయింటికి రావాలి కాబోలూ?" అంది నాంచారు.

"అబ్బా! అంతపట్టుద లేమిటే? యీపుస్తకాలు చదువుకుంటూ వుండబట్టి రాలేదు. ఇదివరకల్లా వస్తూవుండేదాన్ని కానూ?"

"నేనుమాత్రం యిదివరకు రాలేదూ?"

"పోనీలే! నువ్వు అల్లా అంటే నే నేం చేసేది? నీకు కోపం వచ్చిందికాబోలు?"

"నాకు కోపం వస్తే నీకేం నష్టం?"

"పోనీగాని, మంచికథ చెబుతాను, కోపం పోతుందా?"

"ఏంకథ? చెప్పు చూద్దాము"— నాంచారు నవ్వుతూ అంది. రాజ్యం "కథాలహరి"లోది ఒక కథ చెప్పడం మొదలు పెట్టింది. నాంచారు మధ్యమధ్య ప్రశ్నలు వేస్తూ వింటూంది. కథలు చెప్పడంలో రాజ్యానికున్న నేర్పుకి రంగాచారి ఆశ్చర్యపడ్డాడు. కథలన్నిటిలో మంచి కథ యేరడంలో ఆమెకి వున్న సామర్థ్యం మెచ్చుకున్నాడు. అనేక కథలపుస్తకా లామె పట్టుకెళ్లింది. కాని తన పుస్తకంలో కథనే యేరి చెప్పడంవల్ల రంగాచారి మనస్సులో గర్విస్తూ ఆమె చెప్పేదంతా శ్రద్ధగా వింటున్నాడు.

కథ చెప్పడ మయింది. రాజ్యం నవ్వుతూ "ఏం? మంచి కథ చెప్పానా? నీకోపం పోయిందా?" అంది.

"నాకోపాని కేం గాని కథమాత్రం చాలా బాగుంది సుమా! నువ్వు చదివిన పుస్తకాల్లో యెందులోది యీకథ?"

"అయ్యో! ఆమాత్రం తెలీదూ? మీ అన్నయ్యరాసిందే యీ కథ. మీ అన్నయ్య నీ కెప్పుడూ కథలు చెప్పలేదూ?"

"ఏవో చెప్పాడు కాని యీకథమాత్రం చెప్పలేదు. నేనూ ఆ పుస్తకం చదవాలి."

రాజ్యం "కథాలహరి"చూపిస్తూ, "ఇదుగో పుస్తకం. మీఅన్నయ్యకి అప్పచెప్పి మరీ చదువుకో" అంది.

నాంచారు పుస్తకం పట్టుకెళ్లి, "అన్నయ్యా! యిదుగో, రాజ్యం తిరిగీ యిచ్చేసింది యీపుస్తకాన్ని" అంది.

"యిచ్చేయ నక్కరలేదు. మనయింట్లో యింకా యీపుస్తకాలు చాలా వున్నాయి. ఈ పుస్తకం వుంచుకోవచ్చునని చెప్పు."

రాజ్యం నిజంగా తండ్రితో చెప్పి ఆపుస్తకాన్ని కొనుక్కోవా లనుకుంది. ఆ పుస్తకాన్ని వుంచుకోమని చెప్పినందుకు అతని సౌజన్యతకి చాలా కృతజ్ఞురా లైంది. పుస్తకం అందుకుంటూ కొంచెంసిగ్గుతో, మందహాసంతో—కృతార్థు డైనట్లు తలుచుకుంటూవున్న గ్రంథకర్తగారి


రంగాచారి దృష్టి లామెదృష్టిలో కలిశాయి"

వంక—చూసింది. ఇదంతా చూస్తూవున్న రంగాచారి దృష్టి లామె దృష్టిలో కలిశాయి. తక్షణం ఆమె తన చూపులు మరల్చుకుంది. ఆ చూపులో సంతోషమూ, కృతజ్ఞతా సువ్యక్తమవుతున్నాయి. అంతే కాక, వేరొక అనిర్వచనీయమైన లలితభావం ఆ చిరునవ్వులో అతనికి గోచరించింది. ఆదరహాసమూ—ఆచూపులూ—అతని హృదయంలో వుండిపోయాయి. అతనిభావాలు యెక్కడెక్కడికో ఎగిరాయి. ఆలోచనలు కొంచెం తొందరపడ్డాయి. అతడు దీర్ఘాలోచనలో మునిగిపోయినాడు. కొంతసేపటి కొకనిట్టూర్పు విడిచి, "ఏమో! ఎవడికి తెలుసూ?" అనుకున్నాడు.

## ౬

వేసంకాలం. గౌతమీనది శుష్కించిపోయి వుంది. జలము వినీలమై, స్వచ్ఛమై వుంది. అయిదుగంటలు అయ్యేవరకూ వీధిమొగం చూడలేకుండా వున్నారు ప్రజలు. ఎండవేళ పశువులు నెమరువేస్తూ గోదావరిఒడ్డున మర్రిచెట్ల నీడల్లో నిలబడివున్నాయి. గేదెలు నీళ్లలో పరుండి పైకి మోర లెత్తి నెమరువేస్తున్నాయి. పశువులకాపుకుర్రాళ్లు చింతచెట్లనీడల్లో గోలీకాయ లాడుతున్నారు.

రంగాచారి మనస్సులో రాజ్యలక్ష్మిరూపం సునిశ్చలంగా కనబడుతూంది. అతని తలపు లన్నిట్లోనూ యిప్పు డావిగ్రహమే నిండిపోయింది. ఎల్లప్పుడూ ఆమె తనదృష్టిలో వుంటే బాగుండునేమో అని అతనికి తోచింది. ఆమె కనబడనంతసేపూ మనస్సు చిరాగ్గా వుండేది. రాజ్యాన్ని చూడ్డంతోటే ఎక్కడ లేని ఉత్సాహమూ, ఎక్కడ లేని సంతోషమూనూ. అతను తరుచుగా కుటీరంలోనే ఎక్కువకాలం గడపేవాడు. ఇదివరకు ప్రేమనుగురించి పుస్తకాల్లో చదివాడు గాని యిప్పుడు స్వయంగానే చూస్తున్నాడు.

ఇంతలో "విజ్ఞానచంద్రికా" వారి స్త్రీల బహుమతీపరీక్షలు వచ్చేయి. "రాజ్యాన్ని యీపరీక్షలికి పంపాలోయ్. What is your opinion?" అన్నాడు నారాయణమూర్తి శిష్యుడితో.

"Why, she is sure to get the first prize (ఆమెకి మొదటి బహుమానం తప్పకుండా వస్తుంది)."

"అయితే Examinations (పరీక్షలు) రెండునెల్లే వున్నాయి. రోజూ కాస్త శ్రద్ధగా చదివితేనే గాని బాగుండదు. నే నీ వైశాఖంలోపుగా రామాయణం పూర్తిచెయ్యా లనుకుంటున్నాను. నాకు టైము లేదు. నీకు తీరుబా టైనప్పుడు రోజూ ఒకగంట training యివ్వడానికి spare చెయ్యగలవా?"

"అందు కభ్యంతరం యేమిటి? నే నావిషయమై తగిన care తీసుకుంటాను లెండి."

"That is all right (సరే బాగుంది). నువ్వు చూస్తే మరి నేను వేరే కలగజేసుకో నక్కర్లేదు. నేనూ, మీనాన్నగారూ రామాయణం చదువుకుంటాము."

అది మొదలు రంగాచారి రాజ్యంచేత పరీక్షపుస్తకాలు చదివించడం ప్రారంభించాడు. తీక్ష్ణమైనబుద్ధితో ఆమె విషయాలని గ్రహిస్తూంది. ఒక్కొక్కనాడు సాయంకాలం ఇసకతిన్నెలమీద కూచుని రాజ్యానికి రసాయనశాస్త్రంలో పాఠాలు నేర్పుతూవుండేవాడు. నారాయణమూర్తి అతని బోధనాశక్తిని చూసి సంతోషంతో నవ్వుకుంటూ వుండేవాడు.

క్రమంగా రాజ్యానికి రంగాచారిదగ్గిర చనువు కలిగింది. నారాయణమూర్తి వేరేపనులమీద వున్నప్పుడు వాళ్లిద్దరే గోదావరి ఒడ్డుకి షికారు వెళ్లేవారు. అలాటి సమయాల్లో వారు స్వేచ్ఛగా వివిధ విషయాల్ని గురించి మాట్లాడుకుంటూవుండేవారు. సంఘదురాచారాలైన అతిబాల్యవివాహాలూ, నిర్బంధవైధవ్యమూ మొదలైనవి వాళ్ల సంభాషణల్లో దొర్లిపోయేవి. అట్టి దురాచారాలపైని ఆమెకిగల సునిశ్చితాభిప్రాయాలు అతనికి ఆశ్చర్యం కలిగిస్తూవుండేవి. ఒక్కొక్క దురాచారాన్ని గురించి కొంతసేపు చెప్పి దాని కుదాహరణంగా ప్రపం

చకంలో జరిగే ఘోరాలు కొన్ని తెలిపేటప్పుడు రాజ్యం మనస్సు కరిగిపోయేది. ఆ దురాచారాలఫలితంగా గంగపాలైన జీవితాలను గురించి విని ఆమె అశ్రువులు విడుస్తూవుండేది.

నారాయణమూర్తి సంఘసంస్కరణానికి ముందడుగు వేసిన వాళ్లలో ఒకడు. అసలు అతడు మొదట శుద్ధఛాందసుడు. అతడు వద్దంటున్నా వినక బంధువులంతా అతన్ని ప్రోత్సాహంచేసి, శాస్త్రాలు చూపించి రాజ్యానికి యెనిమిదోయేట వివాహం చేయించారు. కాని పెళ్లయిన నాలుగు నెల్లలో అల్లుణ్ని మశూచికం పొట్టబెట్టుకుంది. ఆదెబ్బతిన్న తరవాత నారాయణమూర్తికి బంధువులంటే మొహం దిరిగింది. ఇప్పుడు ముద్దుకుమార్తె యావజ్జీవమూ పడవలసిన బాధలు వాళ్లకేం నొప్పి? తనకిగానీ?

అందుచేత అతడు పూర్తిగా మారి ప్రబలమైన సంఘసంస్కర్తి అయిపోయినాడు. కుమార్తెను విద్యావతిని చేసి, పదెనిమిదేళ్ల వయస్సు రాగానే మళ్లా వివాహం చేద్దామనే ఉద్దేశం అతని హృదయకుహరాల్లో దాగునివుంది. రాజ్యలక్ష్మికి తనపెళ్లి ఎప్పుడు ఏలాగు జరిగిందో జ్ఞాపకమే లేదు. తండ్రికీ, బంధువులకీ తనవివాహవిషయంలో జరిగిన రాద్ధాంత సిద్ధాంతాలు తరుచు విన్నందువల్ల సంస్కరణాలవల్ల ఉపయోగం ఆమెకి బాగా తెలుసును.

౨

రెండు నెలలు గడిచేయి. రంగాచారి బి. యే. పరీక్షలో కృతార్థుడైనట్లు తెలిసింది. ఆనాడు నారాయణమూర్తికుటుంబాన్ని ఆచార్లగారు విందుకి పిలిచారు. రంగాచారి నిండు ఉత్సాహంతో వున్నాడు. ఆరోజున రాజ్యం ద్విగుణీకృతసౌందర్యంతో అతనికి కనబడింది. పచ్చని చలవచేసిన సేలం జరీ సిల్కుచీర కట్టుకుంది. ఎర్ర సిల్కుజాకెట్టు తొడుక్కుంది. జాకెట్టును దాటి ఆమె శరీరకాంతులు ముమ్మరంగా పైకి వస్తున్నాయి. మల్లెపువ్వులు కుట్టబడిన వాలు జడ కటిపర్యంతమూ వేలాడుతూంది. మందహాసపరిశోభితమై ముఖం కలకలలాడుతూంది. ప్రభాతసూర్యునికాంతిలో ముద్దులు గుల్కు గులాబీపువ్వుల్లాగు ఆమె చెక్కులు కాంతివంతములై వున్నాయి. వసంతాగమమున లలితారుణపల్లవ భూషణోజ్వలిత మగు లేమామిడిగున్నలాగు ఆమె అందము నేత్రపర్వమై, లక్ష్మీదాయకమై వుంది.

ఆనందాతిరేకాన్ని రంగాచారిశరీరం రోమాంచిత మైపోయింది. అంతవరకూ మనస్సులో అణిగివున్న ప్రేమ ఒక్కసారిగా పైకి పొంగిపోయింది. ఆమె ఒంటిగా వున్న సమయం కనిపెట్టి, "రాజ్యం! నీపరీక్షకూడా ప్యాసైతే మమ్మల్ని విందుకు పిలుస్తావా?" అనకుండా వుండలేకపోయినా డతడు. "ఇప్పుడు మమ్మల్ని పిల్చినందుకు బదులా యేమిటి?" అంటూ చిరునవ్వుతో ఆమె వెళ్లిపోయింది. ఆమె వెళ్లి



"రాజ్యం నీపరీక్షకూడ........విందుకు పిలుస్తావా?"

పోయినాగాని ఆజవాబుమాత్రం అతనిచెవుల్లో కోకిలపలుకుల్లాగు,— రామచిలకలరొదలాగు,— మనోహర వీణాస్వరంలాగు — రింగుమంటూనేవుంది.

రాజ్యానికి తన అభిలాష చెప్పాలని రంగాచారి అనేకసార్లు ప్రయత్నించాడు. కాని జంకుచేత మళ్లా మానుకున్నాడు. తనకోర్కె నోటితో చెప్పలే దన్నమాట గాని అతని ప్రతిచూపూ, ప్రతిచేష్ట అతనిప్రేమను వెయ్యినోళ్లతో చాటుతున్నాయి.

ఒకనాటిసాయంత్రం రంగాచారీ, రాజ్యమూ చాలాదూరం షికారుపోయారు. అక్కడ ఒకకొండగెడ్డ గోదావరిలో కలుస్తూంది. ఆగెడ్డఒడ్డున ఒకచాపరాతిమీద వాళ్లిద్దరూ కూర్చున్నారు.

సూర్యుడు గోదావరి ఆవలివైపు పర్వతాల్లోకి క్రమంగా దిగిపోతున్నాడు. అతని దివ్యతేజము గౌతమీ విమలజలాల్లో ప్రతిఫలిస్తూంది. కొండలమీద వివిధఫలవృక్షాలమీద వాలి పక్షులు సంతోషంతో చేస్తూవున్న రొదలు పెళ్లివారింట్లో గందరగోళంలా నుంది. గోదావరి మందంగా ప్రవహిస్తూంది. గెడ్డలో నీరు రాళ్లమీద కొట్టు

పనే టప్పుడు పై కెగిరిన తుంపురులు వృద్ధభానుని కాంతిలో కెంపు ల్లాను మెరుస్తున్నాయి. ఎక్కడా జనసంచారం లేదు. ఆప్రశాంత సమయంలో ప్రకృతిశోభ చూస్తూ వాళ్లిద్దరూ సంభాషించుకుంటు న్నారు. ఆరోజు తన మనోగతాభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పాలని రంగాచారి ఉదయంనించీ తనభావాలని సరిచేసుకుంటున్నాడు. అప్పటిసంభాషణని తనఅభిప్రాయం వెలిబుచ్చడానికి వీలుగా మార్చాలని అతను ప్రయత్నిస్తున్నాడు. క్రమంగా వారి సంభాషణ యీ రీతిగా మారింది:

"రాజ్యం! ప్రకృతి యీనత్తూ యీరోజున ద్విగుణీకృతమైన శోభతో ప్రకాశిస్తూంది, చూశావా?"

"ప్రకృతి వైభవానికి మనదేశం ప్రసిద్ధిపొందింది. గౌతమీతీర మంతా ప్రకృతి శోభాపరిపూర్ణమే కదా?"

"మనదేశం మహాతపస్సంపన్నులైన మహర్షులపాదధూళిచేత పవిత్రమైంది. ఇప్పుడు మనం కూర్చున్న యీప్రదేశం అంతా తపోవనాలచేత నిండినదే."

"యిల్లాంటి పవిత్రస్థలంలో జన్మించినందుకు మీరు అదృష్టవంతులు."

"ఈ స్థలపవిత్రతకి తోడు యీ సమయంకూడా బహుప్రశాంతంగావుంది. చూడూ. ఇవతల గోదావరీ, అవతల ఆపర్వతాలూ, ఆదేవాలయమూ, ఆసూర్యుడూ, ఆనుహారణ్యమూ—యివన్నీ చూస్తే యెట్టి అజ్ఞానికైనా సర్వమయుడైన భగవంతునిశక్తి బోధపడుతుందిసుమా."

"నిజం, నిజం. ఈసమయం బహుప్రశాంతమై యెట్టిమూఢుని హృదయానికీ కూడా శాశ్వతతత్వబోధ చెయ్యడానికి చాలివుంది—"

"రాజ్యం! (కొంచెం ఆలోచించి) యీపవిత్రస్థలంలో, ఈ ప్రశాంతసమయంలో, నీ కొకసంగతిచెప్ప దలుచుకున్నాను. ఇదియెంత రహస్యమైందో అంతపవిత్రమైందికూడాను. నీవు జ్ఞానవంతురాలవు గనుక బాగా ఆలోచించుకుని మరీ—జవాబు చెప్పవలసివుంటుంది."

రాజ్యం సాభిప్రాయంగా అతనివేపు చూస్తూంది. అతడు మళ్లా ప్రారంభించాడు.

"ఏనాడు నిన్ను చూశానో, ఏముహూర్తాన్ని నీ ముఖారవిందాన్ని చూశానో, నాటినుంచీ నామనస్సులో మొలకలెత్తి, క్రమంగా పెరిగి, పుష్పించిన నా ఆశాలతని ఫలింపచెయ్యడమో, తెంపేసి సమూలంగా నాశనం చెయ్యడమో నీచేతుల్లో వుంది.—ఇంత యెందుకూ? నాభావిభాగ్యదశ అంతా నీ హస్తగతమై వుంది."

రంగాచారి కొంతసే పాగి, ఒక్కనిట్టూర్పు పుచ్చి, గోదావరీ జలవంక తదేకధ్యానంగా చూస్తూ చెప్పడం మొదలుపెట్టాడు. రాజ్యం మౌనముద్రాంకితయై వింటూంది.

"రాజ్యం! నువ్వు నాచేత స్వయంగా చెప్పించాలంటే చెప్పాలి కాని, యిదివరకు నాప్రవర్తనే నాకు నీయెడలగల గాఢానురాగాన్ని తెలియచేయగలదు. నిన్ను చూసినవెంటనే నువ్వు నాహృదయరాజ్యలక్ష్మివై పోయినావు. నాహృదయ సింహాసనంమీద కూర్చోబెట్టి ప్రతిక్షణమూ, ప్రతిఘడియా, ప్రతిరోజూ నిన్ను మనోహరభావపుష్పాలచే అలంకరిస్తూ, పూజిస్తూవున్న భక్తుణ్ని అయిపోయినాను నేను. నీనిత్యసేవల్లో నాజీవితం గడిపేయడానికే నేను పూర్తిగా నిశ్చయించుకున్నాను. నీవు అంగీకరించినా, మానినా నీవే నాహృదయేశ్వరివి."

రంగాచారి రాజ్యలక్ష్మి మృదుహస్తాన్ని తనచేతుల మధ్య



"ఆస్పర్శసుఖాన్ని అతడు సర్వప్రపంచాన్నీ మరిచిపోయాడు."

పట్టుకున్నాడు. ఆస్పర్శసుఖాన్ని అతడు సర్వప్రపంచాన్నీ మరిచిపోయాడు. రాజ్యం తన చెయ్యి తీసుకోడానికి ప్రయత్నించలేదు. ఆమెహస్త మాతని హస్తములమధ్య నల్లే వుండిపోయింది. ఆమె మారు చెప్పకుండా యించుక సిగ్గుతో తల వంచుకుంది. మందమలయానిల ప్రేరణాన్ని ఆమె ముంగురు లా విశాలఫాలముపై నాట్యమాడుతున్నాయి.

రంగాచారి "రాజ్యం! నీహృదయం కోమలమైనదని నే నెరుగుదును. అందులో నా కొక్కింతస్థలం యివ్వకపో వనే ధైర్యాన్ని నేను ప్రార్థిస్తూవున్నాను. కనుక ఆలోచించుకుని మరీ జవాబు చెప్పు—" అన్నాడు.

రాజ్యం ఒక్కసారి మొగ మెత్తి చూసి మళ్లా తల వాల్చుకుంది. ఆచూపులవల్ల అతనికి కొంత ధైర్యం కలిగింది.

రంగాచారి మళ్లా, "నువ్వు మీ నాన్నగారి అభిప్రాయానికి జడియనక్కరలేదు. ఆయన యిష్టం సంపాదించే భారం నాది. నీ అభిమతం తెలియజేస్తివా, యింక యేఆటంకాలనీ నేను లక్ష్యపెట్టను. ఇంక నీయిష్టం చెప్పు. సరేనా?" అన్నాడు.

ఆమె ఒక గడియసేపాలోచించి మృదుమధురస్వరాన్ని "సరే" అని మాత్రం అంది. తక్షణం అతడా బాలికని గాఢాలింగన మొనర్చుకున్నాడు. పుష్పలతాసదృశ మగు ఆమె శరీర మా గాఢపరిష్వంగసుఖాన్ని మైమరచి పోయింది. అతిపవిత్ర ప్రణయలాంఛన మగు నా యువతీయువకుల పరీరంభమును తూర్పుదిశను మిలమిల మెరుస్తూవున్న ఒక నక్షత్రము తొంగిచూసింది.

సన్ననిచీకట్లు నాలుగు మూలలా కమ్ముకుంటున్నాయి. వేలకువేలు నక్షత్రాలతో వినిర్మలాంబరము నదీజలంలో ప్రతిబింబిస్తూంది. విహంగకులకలకలారావాలు పూర్తిగా శాంతించాయి.

ఆ ప్రశాంతసమయంలో, పవిత్రగౌతమీమహానది సాక్షిగ, అనంతకోటి నక్షత్రములు సాక్షిగ, వా రిద్దరూ తమప్రణయప్రమాణములు చేసుకున్నారు. వారి ప్రమాణవాక్యము లాలకించి వృక్షాలన్నీ తల లూపి తమ నిండారు సమ్మతిని వెళ్లబుచ్చినాయి.

౯

"విజ్ఞానచంద్రికా పరిషత్తు" వారి పరీక్షలైనాయి. మరి నెలరోజులనాటికి మూడు మొదటితరగతిబహుమానాలున్నూ, ఒక రెండవతరగతి బహుమానమున్నూ, మంచి యోగ్యతాపత్రికలున్నూ రాజ్యానికి వచ్చాయి. నిజంగానే ఆచార్లుగారి కుటుంబాన్ని ఆరోజున విందుకి ఆహ్వానించారు. ఆనందభారంచేత యించుక తల వంచుకొని సిగ్గుతో మందగమనాన్ని వచ్చి తన బహుమతుల్ని రాజ్యం రంగాచారికి చూపించింది. "ఇవన్నీ నీ శ్రమవల్ల వచ్చినవేనోయ్" అని నారాయణమూర్తి శిష్యుణ్ని శ్లాఘించాడు.

* * * * * *

ఆనాటి కానాడు రంగాచారికీ రాజ్యానికీ వుండే గురుశిష్యభావం స్నేహంగా పరిణమించింది. రోజు రోజూ వారిప్రేమ వృద్ధిపొందుతూంది. ప్రతిరోజూ వాళ్లిద్దరూ షికారు పోతూవుండేవారు. తీరుబాటున్న ప్రతిక్షుడియూ రంగాచారి కుటీరంలోనే గడిపేవాడు.

వారిద్దరి నడవడికా నారాయణమూర్తీ, సుందరమ్మా గమనించక పోలేదు. ఈవిషయమై వారు సంభాషించుకున్నారుకూడాను. అతిపవిత్రమై, దినదినమూ నూతన వికాసాన్ని పొందుతూవుండే నిర్మలప్రేమను అడ్డుపెట్టడానికి వాళ్లమనస్సులు ఒప్పుకోలేదు. అది మహాపాపంగా వాళ్లు భావించుకున్నారు. "నాపాపిష్టికళ్లకి యీనాటికి వెలుగు కనబడ్డది. మనపిల్ల సంతోషం మనది గాదా యేమిటి?" అని సుందరమ్మ భర్తతో అంటూవుండేది.

రాజ్యంతల్లిదండ్రులు యీవిషయంలో యెంతసౌజన్యత చూపించారో, రంగాచారి తల్లిదండ్రులు అంత పట్టుదల చూపించారు. నారాయణమూర్తియెడల రామానుజాచారికి గల స్నేహగౌరవాలు యిందులో పనిచెయ్యలేదు. చూచాయగా యీవార్త విన్నది మొదలు వాళ్లగుండెల్లో రాయి పడ్డట్లయింది. కుర్రాడు కులభ్రష్టుడై పోతున్నాడని వాళ్లు ఖంగారుపడ్డారు. ఈవిషయమై ప్రొఫెసరుగారితో ఆచార్లుగారు ఒకనాడు చాలా కష్టంగా మాట్లాడారు కూడాను. అది మొదలు ఆయన కుటీరానికి వెళ్లడం మానేశాడు. కొడుకుని వెళ్లవద్దన్నాడు గాని అతను వినలేదు.

"నామాటకి యెదురునడిచి, మతభ్రష్టుడై పోదలుచుకున్నప్పుడు నాయింట్లోమాత్రం వుండడ మెందుకూ?" అని యిద్దరు ముగ్గురుచేత కొడుక్కి తెలియచేశాడు. అతనుమాత్రం యేమీ జవాబియ్యలేదు.

ఒకనాడు వుదయం ఆరుగంటలనర అవుతుంది. గోదావరినదిమీదనుంచి చల్లనిగాలులు వస్తున్నాయి. సూర్యుడింకా కొండలపైకి రానందున కుటీరంవరకూ యెండ రాలేదు. రంగాచారి కుటీరం దక్షిణవసారాలో ఒకచక్కని పడకకుర్చీలో కూచుని దీర్ఘాలోచనలో మునిగివున్నాడు. గాలికి అతని ఉంగరాలు తిరిగిన క్రాపింగు మెల్లిగా కదిలి తెల్లని విశాలమైన నుదురుమీద పడుతున్నాది. పూలతోటలోనిపూలు సువాసనలు గుప్పుతున్నాయి. అనేక రకాల పక్షులు తోటలో చురుగ్గా ధ్వనిచేస్తున్నాయి. అతని మనస్సు కీసౌఖ్యమంతా తోచడంలేదు. భావబద్ధములైన అతని నేత్రాలు నిశ్చలంగా ప్రకాశిస్తున్నాయి. అతనిపక్కనే ఒకతుంగచాప పరిచివుంది. దానిపైని నగిషీ చెక్కిన గలీబుతో ఒక దిండు వుంది. ఆదిండుమీద ఒక "భారతి" సంచికా, విసనకర్రా వున్నాయి.

ఇంతలో లోపలనించి ఉప్మాతో వున్న వెండిపళ్లెం ఒక చేతులోనూ, కాఫీతో వున్న వెండిమరచెంబు యింకోచేతులోనూ పట్టుకుని రాజ్యం వచ్చింది. పళ్లెమూ, చెంబూ అక్కడ వుంచి మళ్లా లోపలికెళ్లి ఒక వెండి కాఫీగ్లాసుకూడా తీసుకొచ్చి చాపమీద కూచుంది.

రాజ్యాన్ని చూడ్డంతోటే అతనికి ఆలోచన తగ్గింది. లేత అరటాకులాగు కోమలమై, మనోహరమై వున్న ఆ సౌందర్యమూర్తిని చూసేసరికి అతని కెక్కడ లేని ఆనందమూ కలిగింది. సంపెంగపూవుల చాయను మరిపిస్తూవున్న ఆమె శరీరకాంతులు ఆపల్చనిచీర దాటిపై కొస్తున్నాయి. ఆమె కోమలాధరము సహజంగా అరుణమై, దర్శనీయమైన ఆ ముఖానికి తగినట్టుగా వుంది. మాట్లాడినప్పుడల్లా చెవులని వున్న వజ్రాలతమ్మెట్లు జిగజిగ మెరుస్తున్నాయి. వినీలములైన శిరోజములు కొద్దిగా చెదరి ఆ ముఖసౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. వక్షోభాగము సమున్నతమై గౌరవనీయమై వుంది. మంచి పనితనంగల బంగారు గడియారపుగొలుసు రెండువరసలతో మెడలో మెరుస్తూంది. చేతుల కున్న రెండుజతల బంగారుగాజులున్నూ శరీరకాంతిలో కలిసిపోయాయి. ఆమె అక్కడికి రావడంచేత వసారాలోని అన్ని వస్తువులకీ సౌందర్యమూ, కాంతీ, సువాసనా వచ్చేయని చెప్పడంలో అబద్ధం లేదు.

విలాసంగా మాట్లాడుకుంటూ వాళ్లిద్దరూ ఆపళ్లెంలో ఉప్మా తిన్నారు. రెండుగ్లాసుల్లోనూ రంగాచారి కాఫీ నింపాడు. వేడివేడి కాఫీ తాగడంతోటే వాళ్లిద్దరికీ చక్కని చెమటలు పోశాయి. రాజ్యం నుదుటిమీద చెమటబిందువులు ముత్యాలలా గున్నాయి. ఆమెకుంతల ములాబిందువుల్లో రెండు మూడు చోట్ల అంటుకున్నవి. రంగాచారి చొక్కా కున్న రోల్డు గోల్డు గుండీలు తీసేసి చల్లనిగాలిని ఆహ్వానించాడు. పవనబాలుడు అతని వలబనియనులోనుండి శరీరాన్ని తాకి తన్నాహ్వానించినందుకు కృతజ్ఞత చూపించుకున్నాడు.

అతని మనోవీధిలో రాజ్యంతోకూడిన తన భావిజీవితం పొడ కట్టింది. తన దైపోయిన రాజ్యాన్ని ఆధారంగా చేసుకుని అతడు సౌఖ్య సామ్రాజ్యాన్ని నిర్మించుకుంటున్నాడు. ఆ సుఖమయజీవితమే తన పరమావధిగా భావించుకున్నాడు. ఈసమయంలోనే,—యీతలపుల్లోనే—తనభావిసౌఖ్యాల కుండే అభ్యంతరాలు—పౌర్ణమి మనోహరచంద్రికాశోభితమైన నిర్మలగగనం భయంకరకాల మేఘాచ్ఛాదితమైపోయినట్లు—అతనికి తోచి, హృదయాన్ని కారుచీకట్లతో నింపాయి. మనోహ్లాదకరస్వప్నమున, సుందర తేజోమయమూర్తుల సందర్శనాన్ని తన్మయుడై యున్న మానవుడికి - హఠాత్తుగ - భయంకర నారీపిశాచదర్శన మైనట్లయింది. తండ్రిపట్టుదల, సంఘప్రతిష్ఠ—యివి మహాపర్వతాల్లాగు అతనికి కనబడ్డాయి.

అతడు నాలుగువేపులా చూసి ఒక్కనిట్టూర్పుతో, "రాజ్యం, మనస్నేహాని కెన్ని ఆటంకా లున్నాయి?" అన్నాడు.

"ఏమి ఆటంకాలూ?"

"ఏ మాటంకా లంటావా? మానాన్న పట్టుదలా, సంఘమూ మొదలైనవి. మనవివాహం అవడంతోటే నాకూ దేవాలయానికీ వుండే సంబంధం ఒదిలిపోతుంది. రాబడి తగ్గిపోతుంది దాని ఫలితంగా. ఇవన్నీ నాకు వేదన కలిగిస్తూన్నాయి."

ఇద్దరూ రెండు నిమిషాలు మాటాడ లేదు. ఆహృదయాల్లో ఎంతలేసి ఆలోచనలు కొట్టుకున్నాయో ఊహించవలసిందే గాని చెప్ప డానికి వీల్లేదు. చివరకి రాజ్యం అంది: "మీరు చెప్పినవన్నీ నేను యిదివరకే ఆలోచించాను. మహాశక్తితో, అనివార్యమైన వేగంతో భూచక్రాన్ని ముంచివేయడానికి వస్తూవున్న కాలప్రవాహాన్ని ఆపుచేయగలశక్తి ఒకవేళ ఉండవచ్చునేమో కాని,—నిర్మల ప్రేమవాహినిని అడ్డుపెట్టగల శక్తి యిప్పటికి పుట్టలేదు. పుట్టబోదుకూడాను. ఆసంగతి వేరే మీరు చెప్పడ మెందుకూ? ఈ అభ్యంతరాలని పవిత్రప్రేమ లెక్కచెయ్యదు. ప్రేమనిమగ్నమైన మనస్సుకి కులపర్వతాలు తృణప్రాయం—సప్తసముద్రాలూ సెలయేళ్లకంటే అధ్వాన్నం—అలాంటి సమయంలో మీరు చెప్పిన అభ్యంతరాలు లెక్కలోకి రావు ఉద్యోగం, ఉద్యోగం అంటారు. ఎందుకూ? మానాన్న ఆస్తికల్లా నేను వారసురాలి నన్నమాట మరిచిపోయారా? ఈ పర్వతాల్లోనే, యీఅరణ్యాల్లోనే, యీ జంతువుల్లోనే మనకాలం గడపాలని యెన్నిసార్లో



"ఇద్దరూ రెండునిమిషాలు మాటాడలేదు"

సంతోషంతో అనుకున్న మాటలు యింతలోనే మరుపా? మనకి సంఘమూ, ప్రపంచకమూ అన్నభయం యెందుకూ? ఈ జంతువు లేమైనా ప్రపంచానికి భయపడుతున్నాయా? తోడిమానవుల్ని నిర్బంధంలో వుంచి చిత్రవధ చేసే మనుష్యులకంటే యీఘాతుక జంతువులే మనకి యెక్కువస్నేహం చెయ్యతగ్గవిగా నాకు తోస్తుంది."

ఈ మాటలు రాజ్యం మెల్లగానూ, గంభీరంగానూ చెప్పేసి ఒక్కనిట్టూర్పు విడిచింది. వర్షాకాలంలో యిరుదరులూ నిండి ప్రశాంతంగా ప్రవహించే గంగాస్రవంతిలా గుంది ఆమెవాగ్ధోరణి.

రంగాచారికి ఆవేశ మెక్కువైపోయింది. తక్షణం రాజ్యం చేయి పట్టుకుని, "రాజ్యం! వూరికే అన్నాను గాని, యీ అభ్యంతరాలు నన్ను భయపెట్టలేదు. ఈ చెట్లకొమ్మల్లో మధురఫలాలు తిని విహరించే చిలకదంపతుల్లో మనం ఒకళ్లమై విహరిద్దాం. వేసవికాలంలో వెన్నెలలో గోదావరిలో నీరు తాగి యిసకతిన్నెలమీద విశ్రమించే లేళ్ల జతల్లో మనం ఒకళ్లమై విశ్రమిద్దాం. వసంతసంధ్యల్లో, పల్లవాలంకృతమైన ప్రకృతిని చూసి ఉప్పొంగి గానం చేసే పికద్వంద్వాల్లో మనం ఒకళ్లమై గానం చేద్దాం." కొంచెంసేపు వూరుకుని, "మానాన్నతో నానిశ్చయాన్ని చెప్పేసి రేపు ఒస్తాను. నేను మరి

యింటికి వెళ్లడానికి వీల్లేదు." అన్నాడు. పదిగంటలైన తర్వాత రంగాచారి యింటి కెళ్లాడు.

౬

రంగాచారి కుటీరంకాపురస్థుల్లో ఒకడైపోయాడు. "హిందూ సాంప్రదాయాలకి విరుద్ధంగా నడిచినందువల్ల స్వామిఅర్చనాది కార్యాలకి అనర్హు" డవడంచేత దేవస్థానపు యీనాములమీద రంగాచారికి హక్కు పోయింది.

* * * * * *

ఒకయేడాది గడిచింది. కొడుకుముఖం మళ్లీ తండ్రి చూడలేదు. కాని ఒక్కకొడుకూ దూరమైపోయినవిచారం అతన్ని కుంగదీసింది. మంచం పట్టినతర్వాత తన్ను చూడ్డానికి కొడుకు రెండుసార్లొస్తే అతను ఒప్పుకోలేదు. కాయిలా క్రుతిమించి రోగాన్ని బడ్డది. జీవితాశ లేనప్పుడుమాత్రం రామానుజాచార్లుకి కొడుకుచేసిన నేరం యేమీ లేదని బోధపడ్డాది.

ఒకనాడు వుదయం నారాయణమూర్తీ, రంగాచారీ శ్రీరామగిరి వెళ్లారు. రంగాచారి తండ్రిమంచంమీద కూచున్నాడు. పశ్చాత్తప్తుడైన ఆజనకుడు కొడుకు వీపుమీద తన శుష్కహస్తాన్ని వేసి నిమురుతూ హీనస్వరంతో, "నాయనా!" అన్నాడు. లోతుకి పోయి నిస్తేజములైన అతని నేత్రాల్లో ప్రేమరసం అశ్రురూపంగా బయలుదేరింది.

పితృభక్తుడైన కుమారుడు దుఃఖంతో, "నాన్నా! నన్ను క్షమించు" అని డగ్గుత్తికతో అన్నాడు.

"నాయనా! నిన్ను శ్రీరామచంద్రమూర్తి రక్షించుగాక!" అవసానదశలో పుత్రవత్సలుడును, పూజ్యుడునైన జనకుని పవిత్రాశీర్వాదమును రంగాచారి పొందినాడు. భక్త్యావేశంచేత తండ్రిపాదాలకు తన శిరము తగిలించాడు. ఆ అమూల్యాశీస్సు అతని మనస్సుకి ఉత్సాహదాయకమైంది. "తండ్రికి వ్యతిరేకంగా నడిచానుకదా!" అనే భారం అతనిమీదనుంచి పోయింది.

మరి రెండు రోజులకి నిష్కలంక చరిత్రుడున్నూ, దైవభక్తుడున్నూ అయిన ఆవృద్ధవైష్ణవుడు పరిపూర్ణమైన మనశ్శాంతితో పరమపదించాడు. ఈరోజుల్లో కుటీరవాసులు అక్కడే వుండిపోయారు. బంధువు లెవ్వరూ ఆయింటికి రాలేదు. విచారపు రోజులు గడిచాయి.

దేవాలయమాన్యాలన్నీ నాంచారు భర్తకి అప్పజెప్పి, శ్రీరామగిరిలోని తన యిల్లు చెల్లెలికీ, బావమరిదికీ యిచ్చేసి, రంగాచారి కుటీరంలోనే వుండిపోయాడు.

* * * * * *

మరి మూడుసంవత్సరాలనాటి సంగతి.

సాయంకాలం నాలుగు గంటలన్నర అవుతూంది. ఇసకతిన్నెలింకా చల్లబడలేదు. కోయబాలురు పసువుల్ని గోదావరిలో నీరు తాగిస్తూన్నారు. గాలికి సన్నని యిసకతెరలు పైకి లేస్తున్నాయి. చిన్న కెరటాలు ఒడ్డుకి తాకి మళ్లా లోపలికి పోతున్నాయి. స్వచ్ఛజలంతో గౌతమి మెల్లిగా నడుస్తూంది.

రంగాచారీ, రాజ్యమూ గోదావరివేపు షికారు బైలుదేరారు. రాజ్యంచెయ్యి రంగాచారిచేతులో బంధింపబడి వుంది. ఇద్దరూ మెల్లిగా మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. వాళ్ల వెనక యిరవైగజాల దూరంలో నారాయణమూర్తీ, సుందరమ్మా వొస్తున్నారు. నారాయణమూర్తిచేతుల్లో రెండేళ్ల పుత్రవాణ్ని ఎత్తుకుని, మాటిమాటికీ ముద్దులాడుతూ, వాడిచేష్టలు భార్యకి చూపిస్తూ వొస్తున్నాడు.

"అసలుకంటే వడ్డీ ముద్దుసుమండీ! మనరాజ్యాన్ని యెన్నడేనా మీ రిల్లాగ యెత్తుకుని ఆడించారా చిన్నప్పుడూ? మీకు మనవడు అంత ముద్దొస్తున్నాడేం?" అని నవ్వుతూ సుందరమ్మ భర్తతో అంది.





శ్రీ డి. యస్. పుట్టన్నగారు.



శ్రీ పి. టి. కుమారస్వామి శెట్టిగారు.



(8) వ్యవసాయకళాశాలాంధ్రవిద్యార్థి సంఘము, కోయంబత్తూరు.



శ్రీ గుడిపాటి శేషగిరిరావుగారు.



శ్రీ కే. కనకయ్యాగారు.




శ్రీ మారుతి వ్యాయామ మండలి, నంద్యాల.


తవిసెట్టి రామారావు




అంతయు నైనది. నిమ్మకు నీరెత్తినట్లు తండ్రికొడుకు లిద్దఱు మొగములు వ్రేలవైచుకొని, కుటీరమున కేతెంచిరి. తన్ముఖద్వారము బావురుమని వారి నాహ్వానించుచున్న ట్లున్నది. ఆకుటీర మిప్పటి కింకను నుత్ఫుల్ల ప్రసూన పరిమళ పరిష్వంగమునఁ జిక్కి, మైమఱచెను. నిశ్శబ్దము జగమును మ్రింగిన భంగిఁ దోఁచిన దావిషాదాక్రాంత మానసులకు. తలుపు దెఱచిరి. లోన నడుగిడిరి. సర్వము శూన్యమైనట్లు వారికి గోచరించినది.

నౌకరు సర్వమును చక్కఁబఱచెను. వస్తువు లేవియు చెదరలేదు. మిగుల పరిశుభ్రముగా నున్నవి. పెంపుడు పిల్లి దాలిగుంటలోఁ జేరినది. చలికాలపు ముసలిసూర్యుఁడు తనయనురాగకరములతో వాతాయనములగుండ దుఃఖితు లిర్వుర నోదార్చుచున్నాఁడు.

తండ్రి పడక కుర్చీలోఁ జేరగిలఁబడి, యొక్క నిట్టూర్పు విడిచెను. "పాపము! మీయమ్మ"—అంతే ఇఁక నాతఁడు మాటాడలేదు. రెండుమూడు బాష్పకణములు గన్నులనుండి జారినవి. నిష్కల్మషమైన—ప్రేమ పూరితమైన—జాలి కలిగించు నావృద్ధముఖమండలమున నరుణకాంతి యించుక యలముకొనియెను. వృద్ధజనకుఁ డొక్కింత వడికిఁ గన్నుఁగవ విప్పి చూచెను. కొమరుఁ డూరక వాపోవుచుండెను. అతని కిరువదియైదేండ్ల వయస్సు. జనకుఁడు ప్రేమ యుట్టిపడునట్లు నిజకరకమలములతోఁ దనయుని శిరమెల్లఁ దడవి, యాఘ్రాణించెను.




"నిజకరకమలములతోఁ దనయుని శిరమెల్ల దడవి, యాఘ్రాణించెను."

ఇంతలో ముసలిసేవకుఁడు మునివ్రేళ్లపై నడచుచు వచ్చి, నిశ్శబ్దముగాఁ దలుపుఁ దెఱచెను. "ఆర్యా! భుజించుటకు వేళ యైనది. ఎంత విచారించినను బ్రయోజనము లేదుకదా!—దయచేసి లేచిరండు." అని యావిశ్వాసము గల సేవకుఁడు పిలిచినవెంటనే వారిర్వురునుఁ దల లెత్తిచూచిరి.

బ్రదికినన్నాళ్లు ప్రతిజీవియు పొట్టపోషించుకొనవలసినదే కదా!—మరల నవీనజీవన స్రవంతి వారి వైపునకు బ్రవహించుచున్నది. వారి కాఁకలి మిక్కుటమైనది. ఆ యాఁకలి గతసంతోష కాలమునం దుండిన యాఁకలి కాదు. కడుపు మండుచున్న జంతువు కుండు నాఁకలి. అయినప్పటికి నట్టిసమయమున భుజించు తలఁపు మిక్కిలి లజ్జాకరమని వారికిఁ దోఁచినది. ఒకరిమొగము నొకరు చూచుకొనిరి. ఒక్కరును లేచుటకు సాహసింపలేదు.

ఎట్టకేలకు తండ్రి గద్గదకంఠుఁడై, "అవును, మురాద్—నీవన్నది నిజము. బ్రదికినన్నాళ్లు ఉదరపోషణ తప్పదు కదా!" అని కొమరునివైపు తిరిగి: "నాయనా! లెమ్ము—పొట్ట నిండించుకొందము." అందులకు కుమారుఁడు, "అటులనే, బాబా!" యని నిట్టూర్పుతో బదులుసెప్పి బయటి కేఁగెను. ఇంతలో నొకదాసి యతనికడ కరుదెంచి, తారకనాథమహాశయా! నేను తమకొఱకొక వస్తువును దాఁచియుంచితిని. ఒకవారము దినములక్రిందట జీవనైరాశ్యమైన దేవరజనని నాచేతి కీ లేఖ నిచ్చి, యామె ప్రాణవాయువు లనంత వాయువున లీనమైన వెనుక దీనిం దమ కందిమ్మని యానతిచ్చెను. ఆలేఖయే యిది" అని రహస్యముగా వక్కాణించెను.

చకితుఁడైన తారకనాథ్ పరిచారికవైపు తేఱిపాఱఁ జూచెను. ఆమె పిఱికితనమువలన వణఁకుచున్న హస్తమును జాఁపి, లేఖ నందించుచుండెను. ఒకయజ్ఞాత దుర్భర బాధను, ఒకరహస్య వృత్తాంతమునుఁ దెలియఁ జేయుటకీ కమ్మ సృజింపఁబడినదని యాతఁ డనుకొనెను. చాలప్రయత్నము మీఁదఁగాని యాతఁడు మెల్లగాఁ మాటలాడఁ జాలకపోయెను.



"అయిననిటు తెమ్ము"

"అయిన నిటు తెమ్ము" అని యాలేఖను గ్రహించి తారకనాథుఁడు తన మాతృమందిరమును జొచ్చెను. ఏ మున్న దక్కడ?—సర్వము శూన్యము—సర్వ మంధీభూతము — నిశ్శబ్దతానిరంకుశత్వము — గర్భనిర్భేదక ప్రదర్శనము. విచారమనస్కుఁడై యాతఁడు మాతృసందేశమును దెలిసికొన లేఖవంకఁ జూచెను. పైవిలాసము దతనిపేరే!—ఆప్రజ్వలితానురాగాక్షరములే!—ఆదివ్యలేఖని నేత్రగోళములలో తాండవమాడుచున్నట్లున్నది. ఆతఁ డాలేఖ నటునిటు ద్రిప్పెను. ఆతని రక్తనాళములు జలబరించినవి. తా నదివఱ కెల్లప్పుడును జూచి యానందించు ముద్దులొల్కు లేఖిని యాకాగితమున మిక్కిలి వణఁకి పోయినది.

ప్రక్కగదిలో భోజనము చేయుటకు పరికరము లమర్చుశబ్దము కర్ణగోచర మగుచుండెను. తారకనాథ్ మెల్లగా జాబు విప్పి చదువసాగెను:—

"నాముద్దుబిడ్డా!—

నాజీవయాత్రా సమర్పణ సమయ మేతెంచినదని నాకుఁదోఁచుచున్నది. దాన మనయిర్వుర యెడఁబాటు సంఘటిల్లును. కావున నిదే నా కడపటి వీడ్కోలు. అభినందనములు.

నా కిప్పటికి దేహదౌర్బల్యము, మనోవ్యథ నశించిన వనియే చెప్పవచ్చును. నీవు పెరిఁగి పెద్దవాఁడ వైతివి. వినయ విద్యాసంపన్నత నొందితివి. గ్రహింప శక్తి కల్గినది. నేను నీ విషయమున ననువర్తింప వలసిన నాదైవనిర్దిష్ట ధర్మమునుండి యొక్కయెడుగైన వెనుకంజ వేయలేదు. కాని యొక్క టున్నది. దాని నిదివఱలో వెల్లడించుటకు నాకు ధైర్యము చాలినది కాదు. ఇప్పుడు నాస్థితినిఁ బట్టి నీకడ దాని వెల్లడింపను తప్పక వచ్చినది.

నీవు ఎవతెను హృదయ పూర్వకముగఁ బ్రేమించితివో,—అన్నిటికన్న నెక్కుడుగ నెవ్వరిని గారవించితివో,—పసినిసుంగువై, యెవ్వరి యొడిలో శాల్యము

చేష్ట లొలికించి, ముద్దులు గురిపించితివో,—యౌవనదశలో నెవ్వతెకడ నీ కష్టనిష్ఠురకావ్యము విప్పి పోసితివో,—ఆ నీమాతృదేవి పతితురాలు — ఒక మహాపరాధిని.

నీవు సర్వకాల సర్వావస్థల యం దెవ్వని "బాబా!" యని నోరారఁ బిల్చుచుంటివో, యాపవిత్రజీవి నిక్కముగ నీతండ్రి గాఁడు. నాజీవితకాలమున నేను పవిత్ర ప్రణయసుధాధారలచే నభిషేక మొనర్చిన దీమహాజగత్తున నొక్క ప్రాణిని మాత్రమే. ఆతఁడే నీకన్నతండ్రి. అదే నా నేరము. అదే నన్నుఁ బాతాళమునకుఁ గ్రుంగఁ దీయుచున్నది. దానినే వెల్లడింప నశక్తురాల నైతిని. నీతండ్రి — నీ నిజమైన—నినుఁ గన్నతండ్రి, జీవించియే యున్నాఁడు. ఆతఁడు నిన్ను నీ శైశవదశయందు హృదయమున నొత్తి, ముద్దు లాడెడివాఁడు. ఇప్పటికిని నిన్నాతఁడు కడుజాగరూకతతో రహస్యముగాఁ గనిపెట్టుచున్నాఁడు. దాని నే నెఱుంగుదును. నీవు పెద్దవాఁడ వైతివి. నీ భావిజీవితమును నీవే నిర్ణయించుకొనఁ గలవు. కోరిన యెడల నీవు నీజీవితమును నొక్కమాఱుగా పరివర్తించుకొనఁగలవు. నాకు లేని ధైర్యసాహసములే నీ కున్న యెడల, రేపే నీ వొక గొప్ప జమీందారుఁడవు కాఁగలవు. పుత్రా!—నే నొక మహాభీరుకార్యము నాచరించుచున్నాను. భీరుజీవితమునే గడపితిని. కాని భీరురాలనై చనిపోవుటకు మాత్రము నే నొప్పుకొనను. ఒకనూరుతడవలు నిన్నుఁ గొని యిచ్చోటునుండి పాఱిపోవుటకుఁ బ్రయత్నించితిని. అయిన నాకు మనోబలము, ధైర్యసాహసములు శూన్యములై పోయినవి. నీ ప్రస్తుతపు తండ్రి యేమాత్ర మనుమానపడినను నాపలాయనమున కూఁతగా నుండెడిది. పాప మాతఁడు కోపముతో నొక్క పలుకైన నన్నుఁ డాడియుండలేదు. ఆతఁ డెల్లప్పుడు చాల మంచిగాను, దయాపూర్ణస్వాంతముతోను సంచరించుచూ వచ్చెను. అయినప్పటికిని, మహాపరాధిని—నేను—నాకు—ప్రేమలేదు—బాబూ!—నిజముగా లేదు సుమా!!—"

చదువు టింకను కాలేదు. నిశ్చేష్టితుఁడై నిలువఁబడిపోయెను. ఆహా! స్త్రీ లెంతకైన సాహసులే కదా!—ఆయువకుని జనని పరపురుషునిఁ బ్రేమించుటయు, నాతనివలనఁ గొమరునిఁ గనుటయు, నా నిగూఢరహస్యమును దాచియుంచుటయు స్వామిద్రోహ మొనర్చియు సిగ్గులేక,—నదరు బెదరులు లేక,—వికసితాధరపల్లవముల వణఁకు తొణఁకు లైన లేక, ఘోరాపరాధరహస్యమునుఁ దన మనఃపాతాళ గహ్వరంబునఁ బాఁతి బంధించి నంగనాచివలె నటించుటయు, నీచర్య లన్నియు "స్త్రీబుద్ధిః ప్రళయంకరీ" యను నార్యోక్తి నుపపాదించుచున్నవి. తారకనాథ్ సత్యవర్తనయందు భీరువులైన పరవనితలఁ జూచి యసహ్యించుకొనుచుండెడివాఁడు. ఇప్పుడో? తనదాఁకా వచ్చిన దాదోషవ్యాపారము. అంతటితో నాతని యహంభావము, ఆనందము అన్నియు



"హా! మాయా!"

నశించినవి. అపరిమితహృదయ భారముతో సాభిప్రాయంబుగా, "హా!—మాయా!!—" అని బాధతోఁ బలికెను. అదియుం గాక నాతఁడు పెంపుడుతండ్రికడ కడుంగడు గారాబంబుగాఁ బెరింగెను. అట్టి యమాయికుఁడగు పాప

పుణ్యము లెఱుఁగని మహోదారుఁ డైన యా మహాత్ముని వృద్ధుని కట్టి యవమానము గలిగించుట, ద్రోహ మొనర్చుట, మిక్కిలి పాపావహము, భీరుత్వము, నిర్లజ్జాత్వము

ఆతని యౌవనోదంతమంతయు నొక్కతఱి స్మృతి పథమునకు వచ్చెను. వెనుకటి బాల్యస్మృతి యా యువకుని మరల నొకపరి బాలునిఁగా మార్చినది. అప్పటి దినములలో నాతఁడు తండ్రికరమును గట్టిగఁ బట్టి, పాటల వెంబడి చాలనవ్వు సంతోషముతో నడచుచుండెడి వాఁడు. ఆదశ గతించినది. కొంత కాల మైనది. భయంకర వ్యాధి యొకటి దాఁకి, యాతని చావుబ్రదుకుల నడుమ సందిగ్ధావస్థలోఁ బడవైచినది. ఆ దినములలో తండ్రి యాతనిప్రక్క నహోరాత్రంబులు గాఁపుదలగాఁ గూరుచుండి, యప్పుడప్పుడు తన యవిరళోద్గత బాష్పవారి ధారలనందునుండి చిరునవ్వు వెలువరింప యత్నించుచు చుండెడివాఁడు. అంతటితోఁ గాలచక్రము మార్పుఁ జెందినది. వ్యాపారసంబంధములైన తికమకలు, మనస్తాపములు సంభవించినవి. అప్పుడు తారకనాథుఁడు రోగశయ్యపై నిద్రించువాని పగిది కనులు మూసికొని పరుండి విన్నసంభాషణములు గొన్ని యాతని భావనాలోకమునఁ బ్రవేశించినవి. తల్లి యొకటి రెండుమాటల మాత్ర మాడినది. ప్రియజనకునివాక్యము లాతని మనఃకందరాంతరమునం బ్రతిధ్వను లొసఁగుచున్నవి:

"ప్రియతమా! నే నింతటినుండి వ్యాపారవ్యవహారములఁ జక్కఁబఱచుకొని సాధ్యమైనంతవఱ కన్ని ఖర్చులఁ దగ్గించుకొందును. ఇక నే నెన్నండును పొగ పీల్చను. భోజన కాఫీశాలల కరుగుట మానివైచెదను. ప్రస్తుతము నావద్దఁ గల వస్త్రములు కొంతకాలము వచ్చును. కాని బాబుకుమాత్ర మేకొఱంతయుఁ గలుగఁ గూడదు. అందందు సేకరించి దాఁచియుంచిన ధనముతో బాబు అడిగినవెల్ల శక్తికొలంది తెచ్చియిచ్చుటకుఁ బ్రయత్నింపవలెను. పసిబిడ్డలు కష్టపడు కాలము ముందుండును. ఇప్పుడే మనమేల యాతని నసంతృప్తునిఁగాఁ జేయవలెను?"—

అని పల్కెడియట్టి నిరుపమ నిష్కల్మష ప్రేమమయ మహోదారుఁ డైన వృద్ధజనకునా యాతఁ డిట్లు మోసగించినది?

ప్రేగులు త్రెంచుకొని దుఃఖ మూడిపడుచుండెను. చాల ఏడ్చెను. ఆవాక్య మాతని దృక్పథమునకు వచ్చెను: "నీ భావిజీవితమును నీవే నిర్ణయించుకొనఁ గలవు"—అది నిజమే. ఇఁక నాలస్యము చేయుట కాతని కధికారము లేదు. మాతృ సందేశమునుఁ బరిపాలింపవలెను. అతులైశ్వర్యలోభాకృష్టుఁడై యాతఁ డట్లాచరించుట లేదు. మాతృదేవికి లేని మనోధైర్య మాతని కుండి తీరవలెను జనకున కేమియుఁ జెప్పకయే తారకనాథుఁ డచ్చోటు వాసి పోవలెను. చాల దూరము—ఇంకను దూరము: కనుపడకుండ పోవలెను. తిరిగి రానే కూడదు. అప్పుడు తనకు సంభవించిన యవమాన మంతయుఁ దనతోనే పోవును. అంతియ గాని, యా వృద్ధజనకుఁ డైన మహా పురుషుని ప్రక్క భోజనమునకు నుపవిష్టుఁ డగుటయు, నా దయాపూరితుని ప్రేమాలాపములు—గతించిన జనకునింగూర్చియాతని విచారభాషణముల వినుచుండుటయు దోషపూరితుఁ డైన తారకున కెట్లు సంభవించును? సంభవించినను మనస్కరించు టెట్లు?—

కర్తవ్యమును నిర్ణయించుకొనెను. మరల మాత నేర మాతని మనోవీథి నల్లకల్లోల మొనర్చినది.

"హా! మాయా! మాయా!!" అతఁడు విలపించుచుండెను. ఓదార్చువా రెవరు? "తల్లీ! యీఘోరవిశ్వాసఘాతుకత్వ మాదయామయుని ధర్మమూర్తికడ నె ట్లాచరించితి, వమ్మా? కఠోరహృదయా!—"

ఇఁక నో ప్రశాంత సంతోష జీవన తరంగిణీ! సెలవు. ప్రాణకోటులఁ గుకి నిడుకొని సంరక్షించు నో గృహ దేవతా! సెలవు. పరిసరోద్యానవన ప్రసూన సురభి శాహ్వానమా! సెలవు. ఇఁకమీఁద నాతఁ డచ్చోట కృతకజీవన మొనర్చుటకు హక్కు లేదు.

విచారమున మున్గి యాతఁడట్లే కొంతవడి నిశ్శబ్దముగా నుపవిష్టుఁడై యుండెను. భోజనశాలనుండి కంఠధ్వనులు వినవచ్చుచుండెను. చెవి యొగ్గెను:




"భోజనశాలనుండి కంఠధ్వనులు వినవచ్చుచుండెను. చెవి యొగ్గెను."

"పాపము! నాచిన్నిబాబు ఎంతగా వాపోవుచున్నాఁడో!—— ఆతఁ డిప్పుడు తల్లిగదిలోఁ బరుండి యేడ్చుచుండెను. దైవమా! ఏమిదుర్దశ!! ——నేను కాటికిఁ గాళ్లు చాఁపుకొనియున్న మూఁడుకాళ్ల ముదుసలిని. కాని యదృష్టమువలన నా కీబాలుఁడు గలిగెను. అతఁడు మంచివాఁడు. నన్ను వదలి యుండఁజాలఁడు. నేనును నాతని నెడఁబాసిన మఱుదినమందే మృతినొందుదును."

మనయువకుఁడు దానిని విని మిక్కిలి చకితుఁడయ్యెను. రక్తము వచ్చునట్లు పెదవి గొఱికికొనెను. జనకుఁ డింకను మాటాడుచునే యుండెను. కుమారుఁడు దానిం గొంచెముగొంచెముగా విన్నకొలంది నాతనిమనసు మారుచున్నది. ఆలోచనలు వేరొకమార్గముఁ బట్టినవి. ఇప్పు డాతనికిఁ గర్తవ్యధర్మము సులభమైనది. ఇంకను, "అతఁడు నన్ను వదలియుండఁజాలఁడు. నేనును నాతని నెడఁబాసిన మఱుదినమందే మృతి నొందుదును"——అను వాక్యము లాతని వీనులం బ్రతిధ్వనులతో మ్రోఁగిపోవుచున్నవి.

పాప మావృద్ధజనకు నొంటరి జీవనమున కొప్పగించి పాఱిపోవుట కాయువకుని కాళ్లాడునా? పుట్టినదాది తండ్రి తన కభిషేక మొనరించుచున్న నిర్మలప్రేమనిష్యంద వృష్టి కిదియా ప్రత్యుపకారము? పుత్రుని కడు జాగరూకతతోఁ బెంచుటకుఁ బడినమహాకష్టముల కన్నింటి కిది యా ప్రతిఫలము? కాని తారకనాథ్ ఆవృద్ధుని కుమారుఁడు కాఁడే? అన లాతఁ డచ్చట నిలుచుండుటకే యాతనికి భరింపరానిబాధ యేదో కలుగుచున్నది. అయినను నతని భావిజీవితము నాతఁడే నిర్ణయించుకొనవలెను. ఇప్పుడే, ఏమాత్ర మాలసింపకయే నిర్ణయించుకొనవలయును.

ఆతఁడింకను జాబునుఁ జేతియందే యుంచుకొనెను. పునఃపఠనమునకుఁ గడంగెను.

"నీప్రస్తుతపు తండ్రి యేమాత్ర మనుమానపడినను నాపలాయనమున కూఁతగా నుండెడిది. పాప! మాతఁడు ........................నిజముగా లేదుసుమా!"

మరల జనకుని వచనములు చెవి సోఁకినవి; ముసలి సేవకునితో సంభాషించుచుండెను:

"అవును, తాతా! ఇరువదియేఁడు లామెతో సౌఖ్యముగా నుంటిని. అందొక్కపరియైన మా సంతోషజీవన ప్రభాకరునిఁ గష్టజీమూతపటలి యరికట్టలేదు. కేవల మొక్కమొయిలేని తేటి చూడఁజాలక పోయినది."

తిరుగ నాయువకుఁడు తల్లేఖావశేషమును బూరింప మొదలిడెను:

"——నే నిప్పుడు నీ నిజజనకుని యాభిధేయమునుఁ జెప్పక తప్పదు. అది——"

చేతులు వణఁకెను. ఒక్కసారి మాత్రమాలేఖలోని తండ్రి పేరునుఁ జూచెను. అంతియే,—— మరల నెన్నండును దానిం జూడలేదు. ఆనామ మాతని హృదయ కేదారమున నాటుకొనిపోయినది. ఎన్నఁటికిని మఱవఁజాలఁడు.

అప్పుడే ఒక మృదువైన —— కరుణారసప్లుతమైన మధుర కంఠస్వరము వినవచ్చెను:

"రమ్ము, బాబా! రాత్రి యైనది. భుజించు వేళ మించి పోయినది. ఊరక వాపోయినఁ బ్రయోజనము లేదోయీ, పుత్రా!—"

మహత్తరమైన యొక చలితెమ్మెరతీవ తారకనాథుని రక్తనాళములలో మెఱుపు మెఱసిన ట్లయ్యెను. ఆపాదమస్తకము జలబరించినది. నిమిషమువఱకుఁ గనులు గట్టిగా మూసి యుంచెను. పిదప నాతఁడు నిప్పుపుల్ల గీసి యాజాబు కంటించెను. అది సాంతముగాఁ గాలువఱ కట్లే పట్టుకొని తదుపరి నేలపై విడిచెను. లేఖ యింక లేదు. మాఁడి మసి యైనది.

భోజనశాలతలుపుకడ కేఁగి దానిం దెఱచెను. ఒక్కింతకాలము జనకుని దయాపూర్ణ వదనముపై దృష్టి నిలిపెను. పాప! మావృద్ధుని ముఖమండలము దుఃఖముచే నరుణిమఁ దాల్చెను. చేతులు త్రొట్రిలుచున్నవి. తారకనాథుఁడు ముసలి శాంతమూర్తి—తనతండ్రికడ కేఁగి, యాతని గాఢముగాఁ గౌఁగిలించి,—




"బాబా—నా బాబా!!—నా ప్రియతమమైన ముసలిబాబా!!!—"అనియెను;—అంతే.

చిత్రకారుడు: శ్రీ తలిశెట్టి రామారావుగారు, బి. ఏ., బి. యల్.

---



శ్రీమతి హానో దేవిగారు



శ్రీమతి అల్లూరి వెంకటసీతమ్మగారు



శ్రీమతి కిట్టి శివరావుగారు



(9) శ్రీమతి దర్శి అన్నపూర్ణమ్మగారు



శ్రీమతి పద్మాబాయి సంజీవరావుగారు



ఆంధ్ర ఆర్టుథియేటరు, బెజవాడ. శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులుగారి నాటకబృందము



షేక్స్పియరు, సింబలైను నాటక పాత్రధారులగు చెన్నపురి యువతీమణులు.



# రాయసము వెంకటశివుడుగారు

౧

ఉదయగిరి రాజధానిగఁ జేసికొని, రెండవ జలాలుద్దీను మధ్యమాంధ్రరాష్ట్రము నేలుచుండెను. ఆమహమ్మదీయ ప్రభుని రాజ్యమందు జను లెవ్విధమగు ననర్థములకును బాలుగాక, సరిలేని సౌఖ్యసంపద లనుభవించుచుండిరి. హిందువులు, మహమ్మదీయులు నను తారతమ్యము లేక, ప్రజలందఱిని సమభావమున నవాబు పరిపాలించుచుండెను. జలాలుద్దీను సుజనులలో సుజనుఁడు. సూఫీసిద్ధాంతము లందపార భక్తి విశ్వాసములు గలిగి యుండు నాతనికి వానితోఁ దులతూఁగు హిందూవేదాంతి శాస్త్రమునందును అమిత గౌరవము గలదు. ఆతని కన్నులకు బీదసాదలు, పండితపామరులు నందఱు నొకటియె. జగమంతయు జగదీశుని జీవకళయె. ప్రజలెల్లరు భ్రాతృసమానులు. పరమాత్మునియందు బుద్ధి నిలిపి, జలాలుద్దీను పూర్వకాలపు ప్రభువరులగు జనక, అరీలియసు, అక్బరు మున్నగు మహనీయుల పాదచ్ఛాయలనే యడుగు లిడుచు, దేశపరిపాలన ధర్మము నిర్వర్తించుచుండెను.

లోకవిభవము లన్నిటికన్నను జలాలుద్దీనునకు చిత్తశాంతియె ప్రియతమము. అనేక మాఱు లాతనికి భూలోకజీవనము, ప్రజాపరిపాలనమును నతిదుర్భరము లుగఁ దోఁచి, తా నీకష్టభూయిష్ఠమగు సంసారము వదలి, ఏమెక్కాపుణ్యక్షేత్రమునకో, ఏపిరాజునగర వాటికకో చేరి, అందు పరమేశ్వర ధ్యానమందును, సూఫీవేదాంతుల సుఖగోష్ఠిని దినములు గడపఁగోరెను. ఐనను, తమ్ముఁడగు నాదరుషా కొండవీడు ప్రభువై, అన్నకు సర్వదా సాయము చేయుచు, ఆతని మనసు నకాండవైరాగ్యము నుండి రాజకార్యనిర్వహణమునకుఁ ద్రిప్పుచు, ఉదయగిరి ప్రభుత్వ మతఁడు వీడకుండునట్లు చేయుచుండెను.

జలాలుద్దీను పారసీక రాజకుటుంబములోని యొక సుందరిని బరిణయమయ్యెను. ఆసుకుమారి హిందూస్థానమునకు వచ్చి కొన్ని వత్సరము లైనను, ఈదేశపు శీతోష్ణస్థితులకును, జనాచారపద్ధతులకును నభ్యాసపడలేదు. ఆ ప్రాంతములకెల్ల నుదయగిరి యుద్యానవనమువంటిది. నడివేసవిమెండలు, దేశము నెంత దహించుచున్నను ఉన్నత పర్వతశిఖరమున హిమాలయమువలెఁ జల్లగ నుండు నుదయగిరి ఖిల్లాదరికి రాకుండును. ఆనగ రెంత సౌఖ్యావహముగ నున్నను, జులెయికాకాంత కను లెపుడును దూరపు పిరాజు వృక్షవాటికలమీఁదను, అందలి

పుష్పజాలముమీఁదను వాలియుండును! వసంతకాలమున నుదయగిరి తరు రాజముల నాశ్రయించు పికావళి పారసీకోద్యానముల నుండు గండుఁగోయిలలవంటివి గావని యాతరుణి తలంపు! హిందూదేశమందలి శీతకాలపు లేమెండ ఆలేమకు గ్రీష్మాతపమువలె దుస్సహముగ నుండును! ప్రభుపత్ని సౌఖ్యసదుపాయముల కేమి కొఱఁత వాటిల్లఁగలదు? ఆసుందరి కెటులైన హిందూదేశ నివాసము సుఖవంతముఁ జేయఁగోరి, నవాబు పారసీకమునుండి వివిధఫలపుష్పజాతుల మొలకలు తెప్పించి నాటించెను. నీటివసతిగల చల్లని యుదయగిరి నీచెట్లు వృద్ధినొందెను. కాని యెన్ని సౌఖ్యములుండినను, హిందూదేశ జీవనము కారాగృహవాసమని జులెయికారాణి యనుకొనుచు, నానాఁటఁ గృశింపఁజొచ్చెను. వ్యాకులిత హృదయమున జననమొంది, దేహమున వ్రేళ్లువాఱిన యావనిత వ్యాధి నేవైద్యులును బరిశీలింపలేకుండిరి. ఎట్టి పర్బతులు, లేహ్యములు నాసుకుమారి శరీరపువేఁడిమి నుపశమింపఁజేయనేరకుండెను. యునానిహకీములు, ఆయుర్వేదభిషగ్వరులును ఆరాజ్ఞికొఱ కుపయోగించిన రాజౌషధములు అడవిని గాచిన వెన్నెలలైపోయెను! జలాలుద్దీను మనశ్శాంతికి విఘాతము కల్పించుటకు ప్రియసతిశరీరాస్వస్థత ప్రబలకారణ మయ్యెను!

౨

అద్దంకి సీమ నొక ప్రఖ్యాత వైద్యవంశము గలదు. ఇరువదియైదు సంవత్సరముల ప్రాయముగల శ్రీనాథుఁడను యువకుఁ డావంశపువారిలో నిపుడు నుతికెక్కిన వైద్యుఁడు. వంశక్రమానుగతమైన వైద్యవిద్యానైపుణ్యముతోపాటు, ఈతఁడు ఉద్గ్రంథ పఠనము చేసి, దైవభక్తిపరుఁడై, పరోపకార చింతనము గలిగి, తనయొద్దకు వచ్చిన రోగుల జాడ్యపుజాడలు మిగుల మెలఁకువతోఁ బరిశీలించి, శ్రద్ధతోఁ తన్నివారణోపాయము లారయుచుండును. కావున వయస్సునఁ బిన్నయైనను, శ్రీనాథుఁడు అనుభవమునఁ బెద్దవాఁడె! ఎంతటి కఠినరోగమైనను, ఆవైద్యశిఖామణి చేతికి లొంగవలసినదె! ఉదయగిరీశ్వరుని భార్యయొక్క వ్యాధి సమాచారము తెలిసి, మిత్రుల ప్రేరేపణమువలన, ఆరాణి రోగనివారణార్థమై యాతఁడిలు బయలుదేఱెను. ఈ వైద్యుని బుద్ధికుశలతను గుఱించి మంత్రులవలన విని, నవాబు ఈతని మిగుల సత్కరించి, వైద్యము చేయింపఁ గోరి, ఖిల్లాపరిసరముల నుండెడి కదళికావనమునందలి భవనము నీతనికి విడిది చేసెను. మహమ్మదీయులలో ఘోషాపద్ధతి యుండుట లోకవిదితము. రాజకుటుంబములలో నీమరియాద మఱింత ప్రాముఖ్యము వహించియుండును. రోగిని జూడక, నాడీపరీక్ష వలనుపడక, ఇతరులు తెలిపెడి రోగచిహ్నములను బట్టి వ్యాధి నిర్ధారణచేయుట ఎట్టి వైద్యునికిని దుస్సాధ్యము. అనివార్యములగు ప్రతిబంధములఁ గూర్చి యను



"క్రిందనుంచిన పన్నీరుతొట్టెలో రాణి ముఖప్రతిబింబము......
...వ్యాధి నిరూపణము చేయఁబోయెను."

కొన నేమి ప్రయోజనము? బాల్యమున శ్రీనాథుఁడు తండ్రియొద్ద వైద్యవిద్యాభ్యాసము చేయు దినములలో, రాజాంతఃపురస్త్రీల నాడీపరీక్ష నెట్లు కనుఁగొనవలెనని యడిగి, రోగుల ఛాయాప్రతిఫల సందర్శనమువలన రోగ నిర్ధారణము చేయు విధ మాయనవలన గ్రహించెను. ఇపు డది శ్రీనాథుఁడు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, నవాబునకుఁ దెలి యఁబఱచెను. అంత నంతఃపురమున రోగిమంచముదగ్గఱ నొక తెర వేయించిరి. క్రింద నుంచిన పన్నీరుతొట్టెలో రాణి ముఖప్రతిబింబము స్పష్టముగఁ గానవచ్చెను. ఈ నీడను బరీక్షించి వైద్యుఁడు వ్యాధి నిరూపణము చేయఁ బోయెను. లేఁతతములమువంటి రాణి ముఖబింబము పండుటాకువలె నగుట, కనుకొనలందు నీలిమ మేర్పడుట, కనులు సోలుచుండుట, శిరము తూలుచుండుటయు రోగ మునకు ముఖ్య చిహ్నము లగునట్లు అతఁడు కనిపెట్టెను. వైద్యుని కోరికవలన నవాబు వేసిన ప్రశ్నములకు రాణి ప్రత్యుత్తరము లొసంగెను. ఆసంభాషణ మూలమున రోగికంఠధ్వని, ధోరణి, రుచులు, పరిస్థితులును దేట పడెను. ఇవ్విధమున నావైద్యుఁడు పరీక్షజరిపి, రోగనిర్ధా రణచేసెను.

## ౩

లోకము విరోధివర్గ పరిపూరితము! గురువునకు గురువు, వైద్యునికి వైద్యుఁడు, వర్తకునికి వర్తకుఁడు శత్రువులుగ నేర్పడుచున్నారు. ఒకరి నొకరు ద్వేషించి, వలనుపడుచో నొకరి నొకరు అటవీమృగములవలె కబ ళింపఁ జూచుచుందురు! అంతియ కాని, మిత్రత్వమె వ్యా పారసూత్రముగఁ జేకొని, ఒండొరుల భావానుభవముల సాహాయ్యమున జనులు తమవిధులను మఱింత బాగుగ నెఱవేర్చుట కర్తవ్యమని గ్రహింపకున్నారు. శ్రీనాథుని ప్రణాళిక యిట్టిది కాదు. రోగనిర్ధారణము పట్ల వైద్యునికి సర్వజ్ఞత్వము పనికిరాదు. రోగి కిదివఱకు వైద్యము చేసినవారు భిషక్కునకుఁ బరమమిత్రులని యాతని మతము. కావున శ్రీనాథుఁడు రాణి పూర్వపుచికిత్స కుల పరిచయముచేసి, రోగనివారణమును గూర్చి వారు సలిపిన కృషివివరము, వ్యాధినిగుఱించి వారికిఁగల యను భవములను గ్రహించెను. శిశువులకును, రాణివాసపు వారికిని వైద్యముచేయుట మిగుల కష్టము. పరదేశజనిత యగు జులెయికా కాంతయొక్క తనూతత్వ మతికోమ లము. మనోవ్యథచే నేర్పడిన మహామేహమునకు వైద్యు లు చేసిన ప్రతిక్రియలె వ్యాధిని మఱింత పెంచెను! బంగరు త్రాసువంటి యాసుకుమారతత్వమునకు కలకండపలుకె కఫోద్రేకము, మధుబిందువె మేహాధిక్యమును గలుగఁ జేయును! ఈవిషమ పరిస్థితులందు మిగుల శ్రద్ధ వహించి, తన మేధాశక్తినంతయు నుపయోగించి, శ్రీనాథుఁ డెట్ట కేలకు ఔషధానుపాన నిర్ణయము చేసెను.

## ౪

దైవానుగ్రహమువలన వైద్యకుమారుని మందు రాణికి గుణ మిచ్చుచుండెను. నిరతము పానుపు నంటిపెట్టు కొని యుండు జులెయికా యిపుడు పరిచారికల సాయ మున లేచి కూర్చుండి సంభాషింపఁ దొడఁగెను. సతి యిట్లు క్రమముగ నారోగ్యాభివృద్ధి గాంచుచుండుటకు ప్రభువు ముద మందెను. పుత్రిక యమితానంద భరిత యయ్యెను. పరిచారికలు ప్రసన్నవదనములతోఁ బనులు చేసికొనుచుండిరి.

శ్రీనాథుఁడు ప్రాతఃకాలముననె దేవునికి పూజ లు సమర్పించుచుండు వాఁడు. కదళికారామమున వలసిన పూవు లతనికి లభించుచుండునవి కావు. పెద్దకంచె కావల నేమైన పూలు చిక్కునేమోయని యొకనాఁడు వేకువ నచటికిఁబోయి, యాతఁడు మొగి మెత్తి చూచెను. అనేక జాతుల పుష్పలతిక లక్కడఁ గానవచ్చెను. అందొక నూ తనరమణీయకుసుమ మతని కనులకుఁ దట్టెను. అరుణ కమలముల కోమలత్వమందు మూర్తీభవించినటు లుం డెను! ఆకృతిని పద్మమునకంటెఁ జిన్నదయ్యును, అంద మున దానికంటె నిది మిన్నగఁ దోఁచెను! అంత నావిప్ర కుమారుని కింకొక యద్భుత దృశ్యము గానవయ్యెను. నవమల్లికల నపహసించు మేనిసోయగమున నొప్పెడి పదు

నాలుగువత్సరముల బాల యొకతె పొదరిండ్లలో నడచి వచ్చి, యీనూతనపుష్ప మొకటి కోసి, అరుణిమమందు దాని కెనయగు తనకోమలపాణితలమునఁ బట్టి సంతస



"నవమల్లికల నపహసించు మేనిసోయగమున నొప్పెడి......
సంతసమున నాఘ్రాణించుచుండెను."

మున నాఘ్రాణించుచుండెను. ఆసుందరి చెక్కులు, పెదవులు నరుణకాంతుల నలరారుచుండెను. ఆ మెలఁత మృదులాంగకముల నిర్మాణ రహస్యము లోకమున కెఱిఁగింప గుణపాఠముగ నుపకరించుటకె ధాత యీసుకుమార సుమముల సృజించెనా యనునటు లుండెను! ఈలలన నవాబు కుమారీరత్నమగు గుల్‌నారియె!

శ్రీనాథుఁడు గుల్‌నారిని జూచుట కిది మొదటిసారి కాదు. నాఁడు రాజాంతఃపురమున పన్నీటఁ గాన వచ్చిన రోగి కొక ప్రక్కగ నిలుచుండి నగిషీగోడ కాను కొనియుండు నొక బాల ప్రతిబింబ మాతని కనుల కపుడు గోచరించెను. అట్టి సుకుమార సుందరరూపము మానవ భామినులలో నుండునని తలంపక, అతిశ్రద్ధగ నుండెడి తన నయనముల భ్రమింపఁజేయుటకు ఏ గంధర్వాంగనయొ మానవాకృతి దాల్చి వచ్చెనని యాయువకుఁ డూహించెను! ఆకనులతీరు, మొగముసొరు, పలువరుస క్రమము, ముంగురుల కాంతులు నీక్షించి, ఈ జవ్వని దేవాంశ సంజనితయగు వనిత యని యావిప్రకుమారుఁడు విభ్రాంతి నొందెను! ఇపు డా సుందరాకారము మరల వాని కన్నులకుఁ బ్రసన్నమగునపుడు, ఈ కామిని మర్త్యలోక నివాసిని గావచ్చునని యొకింత విశ్వసించి నను, రాణి సన్నిహిత బంధువర్గములోనిదై యుండనోపునని యాయువకుఁడు తలపోసెను. ఏలనో వాని మది గురుతింపఁజాలని మెత్తని తాఁకునకు గుఱియయ్యెను. అతి సూక్ష్మరోగాంకురములు సరహస్యముగ శరీరమునకుఁ గావించిన యపకృతి గనిపెట్టిన దిట్టరి, గుల్‌నారినిగూర్చి తలంచునపుడు, తనహృదయసీమను కొల్లగొను కామచోరుని జాడలు పరికింప నేరకుండెను!

మోహ మెపుడు నొకప్రక్కనె ప్రసరించునని భావించుట మానవుల వెఱ్ఱి! అద్దంకినీసు వైద్యుఁడు ఖిల్లాలోఁ గాలు పెట్టి, తనజనని చికిత్సకుఁ బూనిననాఁటి నుండియు, గుల్‌నారి యాయువకునందు సదభిప్రాయమున నుండెను. బ్రహ్మతేజస్సున నొప్పెడి యావయస్యుని వదనపద్మమును అంతఃపుర గవాక్షములనుండి యాపొలఁతి పలుమారు పొడగాంచియుండెను. బుద్ధికౌశల్యమునకు నీడుజోడగు నయసంపదయు, ప్రజ్ఞాధికత కెనయగు సహృదయతయు ఆజవ్వనుని మోముదమ్మిని తమ్మిచూలి లిఖియించినట్టుగ గుల్‌నారికి నయనగోచరమయ్యెను! అనుభవశాలులు, వయోవృద్ధులు నగు ఘనవైద్యుల చేతులకుఁ జిక్కని వ్యాధి యీయువకునకుఁ దెల్లమగునాయని పలువు రనుకొన్నను, వీనికే యీరోగము గ్రాహ్యమగునని నమ్ముచు, వీనికే జయము సమకూర్పుమని రాజకుమారి యల్లాను ప్రార్థించుచుండును. ఈ వైద్యకుమారుని హస్తమమృతహస్తమనియు, ఇతఁ డిచ్చెడి యౌషధము సంజీవి యనియు గుల్‌నారి తల్లిని ప్రోత్సహించుచు, రోగనివార

ణమునకు దోహదములగు ధైర్యవిశ్వాసములను రాణి హృదయమునఁ బాదుకొల్పెను. ఇవ్విధమున శ్రీనాథుని యెడ సదభిప్రాయ సద్భావములు ఆయంతఃపుర సీమ నల్లుకొనియెను.

✗

శ్రీనాథుని పేరిపుడు సంస్థానమునం దెల్లెడలను వ్యాపించెను. చిరకాల వ్యాధిపీడితయగు జులెయికారాణి తొలకరివానకుఁ దెప్పిఱిలు పూలమొక్కవలె కలఁకఁ దేఱెను. నవాబు ఉత్తరువు ననుసరించి యన్ని సదుపాయము లీచిన్న వైద్యునకు సమకూరెను. సూర్యోదయ మగు నప్పటికి పూజకు వివిధజాతులపుష్పములు,పత్రములును రాజపుత్రిక స్వయముగ కోటనుండి పంపుచుండును. అన్నిటికంటె శ్రీనాథునికిఁ బ్రియమగుపూవు పేరులేని యామెట్టనిపూవె. ఆ పుష్పమునకు తన ప్రేయసియగు గుల్ నారికిని ఆవిప్రకుమారుఁడు సామ్యము గలిపించుకొని సంతసించుచుండును! ఆపూవుపేరు పన్నీరుపూవని వానికిపుడు తెలిసెను. గుల్ నారి మోవిచెక్కులు, పదపాణితలములు, పన్నీరు పువ్వను బోలియుండుటచేత, ఆసుందరిని పన్నీరుపువ్వని యా నరసుఁడు తన మనమున వ్యవహరించి, ముద మందుచుండును! దేవుని పూజలకును శ్రీనాథునికి పన్నీరు పూవులే ముఖ్యమయ్యెను. పన్నీరుపూల నెత్తావుల నాఘ్రాణించుట వాని కెంతో సంతోషజనకము. ఆతని కన్నులలను నేదదేర్చునది పన్నీరుపూవు. పన్నీరుపువ్వును గుఱించి యతఁడు పగలంతయుఁ దలపోయును, రాత్రులంతయు కలలు గాంచును! పురుషార్థములు, ముక్తిమోక్షములు శ్రీనాథునికి పన్నీరుపూవె! ఆకుసుమమె, ఆకుసుమకోమలియె, ఆప్రియునికిఁ గల్పతరువు. ఆతనికి స్వర్గము, సర్వమును, పన్నీరుపూవె!

ఒకనాఁడు శ్రీనాథుఁడు స్వవిషయ విమర్శన మొకింత సలిపెను. అతఁడీ పరదేశము వచ్చి కొన్నిమాసములైనది. దైవానుగ్రహమువలన, తాను వచ్చినకార్యము సఫలమగుట సత్యమె. కాని, యొరుల వ్యాధి నివారణఁ జేయ వచ్చిన తానె యనివార్య వ్యసనపీడితుఁడగుట యెంత శోచనీయము! పరదేశమందలి మక్కువచేత స్వస్థలమును మఱచెడి మందుఁ డెచటనైనఁ గలఁడా! తనకు ప్రేమాస్పదులగు ప్రాతబంధుగులను వీడి, క్రొత్త చుట్టములకై పరితపించుట యెట్టివెఱ్ఱి! మోహము వివేకము నడంచును. సత్కులసంజాతుఁడగు తా నీయవన జవ్వనిమీఁద వలపు గొనుట యెట్టి యవమానము! ఎంత యసభ్యము! అన్యజాతి మత సంప్రదాయములతో



“పన్నీరుపూల నెత్తావుల నాఘ్రాణించుట......సంతోషజనకము”

నొప్పెడి యాముస్లిము రాజకన్యక వైద్యవృత్తి జీవనము గాఁగల యొక విదేశ బ్రాహ్మణపుత్రకుని బ్రేమించి, యాతని పాణిగ్రహణ మొనర్చునా? అందని మ్రానిపండ్లకఱ్ఱులు సాఁప నేల?వచ్చినపని ముగించి, బహుమతి నంది, యింటి కేగి, తా నేల కృతార్థత నొందఁగూడదు?

శ్రీనాథునికి రాచకన్నియ మీఁది ప్రేమము ఆత్మవిమర్శనము, ఆత్మబోధనము లను సాధారణ చికిత్సాసాధనముల నతిక్రమించిన కఠినవ్యాధిగఁ బరిణమించెను! వలపు ప్రాణము నే లెక్కసేయనపుడు, వ్యక్తిలక్షణము

లగు కులజాత్యభిమానములు, లజ్జావమానములను పరిగణించునా? సంసారబంధములు కోసివైచిన విరాగివలె నీప్రియుఁడు ఏకాగ్రచిత్తుఁడై, ప్రేమాధినాధుని కంజలులు సలుపుచు, దినములు పుచ్చుచుండెను. ఆవిప్రపుత్రకుని కామ్యాస్లీము రామాస్మరణమె రామస్మరణ మయ్యెను! ఆసుందరి దినదినమును ప్రాతస్సమయమున తన మృదు కరములఁ బ్రీతితోఁ గోసి యంపెడి పన్నీరుపూవులె యా ప్రియుని కమూల్యములగు కానుకలు, ఆతని యిష్టదైవమున కభీష్టమగు పూజాద్రవ్యములును!

౬

ఇంక రాజగృహమునందలి గుల్నారిని గూర్చిన సమాచారములు పరికింపవలయును. ఏకైక పుత్రిక యగుటచేత గుల్నారి జననీజనకుల కన్నులకు పెన్నిధిమె! భువనమోహిని యగు పుత్రికయందు మాతాపితరుల కమిత వ్యామోహ ముండుట యాశ్చర్యము గాదు. ఆబాలయందుఁ గాన వచ్చెడి సుగుణశీల్యములు వారి ప్రేమవృక్షమునకు దోహదము లయ్యెను. అసమాన బుద్ధిచాతుర్యముతో భాసిల్లెడి యాబాల, జనకుని వేదాంత ప్రసంగములందు పాల్గొనుచుండును. గుల్నారి సాడీ మున్నగు పారసీక కవిపుంగవుల కావ్యరాజములు చదివి, అందలి మనోహరభావములను గూర్చి జననితో ముచ్చటించుచు, నిరతము యవనకవితా సుధారసము నాస్వాదించుచుండును. పారసీక కవులు వలచి వర్ణనలందు గుప్పించిన గులాబి పూవులను ప్రియ తనయకుఁ జూపించుటకె నవాబు పారసీకమునుండి గులాబియంటులు తెప్పించి, ఉదయగిరిని నాటించెను! ఆమొక్కల సంరక్షణభార మీ సుందరి మీఁదనే యుండెను. హిందూదేశీయు లనాదిగ పెరిషియానుండి వచ్చెడి గులాబిపూలసారమగు పన్నీరు వాడుచుండెడి వారు కాని, ఆ కుసుమముల దర్శనభాగ్య మిదివఱ కెఱుఁగరు! కావుననే యిపుడు ఉదయగిరి మీఁద విరివారు నీ క్రొత్త జాతిపూవులను దేశీయులు పన్నీరు పూవులని వ్యవహరింపఁ దొడంగిరి. నెల్లూరుసీమ వాసు నేటివఱకును గులాబి పూవులను పన్నీరు పూవులనియె పేర్కొనుచుందురు. ఆ పూఁబొదలను ప్రప్రథమమునఁ బెనుచుచుండినయారాచకన్నియకు "పన్నీరుపువ్వు" అని జనులు పేరిడిరి. గుల్నారి యను పారసీక నామమునకు నిదియె యర్థ మగుటచేత, అన్నివిధముల నారాజకుమారికి "పన్నీరుపువ్వు" సార్థకనామ మయ్యెను.

పొదరిండ్ల పొంచుచును, పూఁదీఁగలఁ జక్కఁజేయుచును, సతతము కుసుమములతోఁ గాలము గడపు గుల్నారిని మధులిహమను ముద్దుపేర తండ్రి పిలుచుచుండువాఁడు. గుల్నారి విద్యాబుద్ధులం దాఱితేఱిన వయస్యమైనను, తలిదండ్రుల కింకను బాలికయె! తాను బాలననియె యా తరుణియు తలంచుచుండును! కాని, కష్టానుభవము, కాముని ప్రబోధనమును ఎట్టి లేఁబ్రాయపు వారికిని వయసు గొనివచ్చును! ప్రేమమూర్తి యగు జనని చిరకాలవ్యాధి గుల్నారికి వ్యాకులతతోపాటు ప్రాయమును బెంచెను. యావన వైద్యుని చికిత్సచే తల్లి స్వస్థత నొందుటకు పుత్రిక యపరిమితముగ సంతోషించెను. ఆ యువకుఁ డసమానబుద్ధి ప్రజ్ఞలతో నొప్పువాఁడని వానిని జూచినపుడె గుల్నారి గ్రహించెను. ఆతని మూలమునఁ గదా జనని జీవములు దక్కెనని యారాచకన్నియ వైద్యునెడ మితి లేని కృతజ్ఞత గలిగి యుండెను. సుగుణాన్వితుఁ డగు నా సుందర పురుషునం దా సుదతికిఁ గుదిరిన సద్భావము వట్టి కృతజ్ఞత గాదు. ఆ యువకుని తన హృదయాధినాథునిగ గుల్నారి భావించెను! ఐనను, తన మన మిట్టి తలంపులకు లోనగుట బాల్యలక్షణమని యా తరుణి యొక్కొకతఱి తలపోసి, తనకుఁగల విద్యావివేకానుభవముల సాహాయ్యమున నద్దాని హసించి నిరోధింప యత్నించెను. కాని, ప్రేమాంకురము తనహృదయ క్షేత్రముల తలసూపఁగనె వేఱు తన్నిన వృక్ష మగుట కా యువతి విస్మయ మందెను! నూతనప్రేమ వ్యాజమున నిట్లు గుల్నారి వయస్థ యయ్యెను!

కుశాగ్రబుద్ధిగల గుల్నారి ఈ నూతనపాశమును ద్రుంపివేయ నెన్నిప్రయత్నములోచేసెను. తన కును బ్రియు

నికినిజాతిమతసాంఘికాచార విషయములఁగల వ్యత్యాసములను దలపోసెను. జననీజనకుల యసమ్మతినిఁగూర్చి యోజించెను. లోకుల వ్యాఖ్యానము లూహించెను. తన ప్రేమ సాఫల్యమునకు లోకమంతయు నడ్డుపడునట్టుగ భావించెను. ఐన నీప్రతిబంధకము లన్నియు దాఁటి వెడలి, ఆసుదతి హృదయమందలి ప్రేమలతిక తల యెత్తి యాకసమంటునట్లు గానవచ్చెను! మంకుపట్టుపట్టిన పసిపట్టివలె నా పడఁతి ప్రేమశిశువు మాతృహితబోధనలు పెడచెవిని బెట్టుచుండును! గింజుకొనినకొలఁది కంఠము బిగియించు నుఱిత్రాటివలె, తొలఁగింపవలెనని యత్నించిన కొలఁది ప్రేమపాశము హృదయమును బంధించుట కావనిత వనటఁ జెంది, చేయుట కేమియుఁదోఁపక, చేష్టలు దక్కియుండెను!

చేతనములకెల్ల చైతన్యమగు ప్రేమమునకు పెనుపు నైసర్గికలక్షణము. జనకుని యానచే ననుదినము క్రొత్తవైద్యుని పూజలకు పన్నీరుపూవు లంపెడి గుల్‌నారి, ఒకనాఁడు, తన ప్రణయవృత్తాంతము ప్రియునికిఁ దెల్పి యాతని మన మెఱుంగఁ గోరి, తాను వ్రాసిన చిన్నకమ్మ చుట్టును పూ లమర్చి బంతికట్టి, దానిని పూలలో నిమిడ్చి పూలగంప నెప్పటివలె వైద్యుని విడిది కంపెను! పూవుల కెదురుచూచుచుండు శ్రీనాథుఁడు, పూలమధ్య నుండు పూబంతి చూచి విస్మయ మంది, తనగుండియ లాత్రమునఁ గొట్టుకొనుచుండఁగ, అది మెల్లనవిప్పెను. లోనిలేఖ చూచి చదువుకొనునపుడు, ఆప్రియుని హృదయ మాలోకమున లేదు! ఏవిచిత్ర ప్రపంచముననో, ఏకల్పతరువుల నీడనో, తాను విశ్రమించుచు, సుందర పక్షిజాలముల కిలకిలారావములు వినుచుండునట్టుగ నాయువకునికిఁ దోఁచెను! లేఖా విషయము లెవ్వి? ఆయవనకన్యకమీఁద మది నిలుపుటచే తనకు లోక మెంత శోభాయమానముగ నున్నదో, తననుగూర్చియె తలంచుచు ప్రొద్దు పుచ్చుచుండుటచే నాతరుణికి నటులె యుండెను! కదళికావనమున సేవకులు కోసి కోటకుఁ గొనిపోయెడి ఫలపత్రముల మధ్యమున తన ప్రత్యుత్తరపు ప్రేమలేఖను బొందుపఱచి, విప్రకుమారుఁడు గుల్‌నారి కంపెను. ఈ విధమున నాయువతీ యువకుల ప్రేమానురాగములు పెంపారుచుండెను!

౭

సౌఖ్యదినములు క్షణములై సాగిపోవును. తాను వచ్చిన కార్యము దైవానుగ్రహమున సఫలమై రాణి సంపూర్ణారోగ్యము గాంచెఁ గావున, రాజానుమతి యైనచో, తాను బోయి వచ్చెదనని శ్రీనాథుఁడు నవాబునకు విన్నవించుకొనెను. మఱునాఁడు ప్రభువు నిండు కొలువున నుండి, శ్రీనాథు నుచితాసనాసీనుం జేసి, అతని వైద్య నైపుణ్యమును ప్రశంసించెను. మంత్రులు వానినెంతో శ్లాఘించిరి. వయసునఁ జిన్న యయ్యును, విద్యాప్రాభవముల నీతఁడు పెద్ద యనియు, వైద్యరహస్యము లీతనికివలె నింకెవ్వరికి నెఱుకపడవనియు, కావున నేలిక యొసంగెడి యెంతటి గొప్ప పారితోషికమును స్వీకరించుటకైన నీయువకుఁ డర్హుఁడనియు ఆస్థానవైద్యవేత్త యుపన్యసించెను. తనమీఁద నుదయగిరి వారికిఁ గల యపారకరుణయె తన జయమునకుఁ గారణము గాని, ఇతర వైద్యులకు లేని ప్రజ్ఞాతిశయము తనయందు లేదని శ్రీనాథుఁడు సవినయముగఁ బ్రత్యుత్తర మిచ్చెను. అంతట నవాబు శ్రీనాథునిచేత నొక గులాబిపూవు నుంచి, బంగరు పళ్లెరమున నుండిన వరహాలరాశి వాని కొసఁగఁబోయెను. తాను సువర్ణము తాఁకననియు, తన కష్టమున కొక పన్నీరుపూవె చాలు ననియు నాయువకుఁడు రాజునకు విన్నవించెను! గొప్ప బహుమతి వలద నెడి యిట్టి వెడఁగు లెందైన నుందురాయని పలువు రాశ్చర్య మందిరి. అద్దంకి సీమవారు సత్యకాలపువారని కొందఱును, బహుమతి చాలదని నవాబునకు నచ్చఁ జెప్పుటకె యీగడుసరి యిట్లు చేసెనని మఱికొందఱును అనుకొనిరి. అంతటితో సభ గలసెను.

వైద్యయువకుని యుద్దేశము నవాబున కేమియు బోధపడకుండెను. ఆయన యొకటి నిర్ధారణచేసికొనెను. ఇంత ధైర్యముగ మెలఁగనేర్చిన వాఁడు మిగుల యోగ్యుఁ

డైనను, అత్యాశాపీడిత హృదయుఁడైనను గావల యును! ఫలాపేక్షావిరహితులగు వేదాంతులకు ధనకాంక్షానిరోధ మెంతటిపని? ఒకవేళ నీతని మనసు అధిక ధనస్వీకారమునందె మగ్నమైన దనుకొన్నను, ఇంతటి మేలు చేసిన వైద్యుని కష్టము ప్రభువు లుంచుకొనుట న్యాయమా? కావున నిండుసభలోనికిఁ గాక, యీమా అంతఃపురమునకు రప్పించి, రహస్యముగ నభిప్రాయము గనుఁగొని, వాని ఋణము దీర్చివైచి, తాను కృతకృత్యత నొందవలెనని నవాబు ఉద్దేశించెను.

౭

ప్రభునాజ్ఞ ననుసరించి శ్రీనాథుఁ డామఱునాఁడు నగరున కేతెంచెను. రాణి పానుపున కడ్డముగఁ దెరవే యఁబడి యుండెను. నవాబు కాంచనవేదికపైఁ గూర్చుండి శ్రీనాథుఁడు తనకుఁ జేసిన సలాము లందుకొని, కురిచీలో నాతనిఁ గూర్చుండఁబెట్టెను. వెనుకటికంటె నెక్కువగ పసిఁడి నాణెములు పళ్లెరమునఁ దళుకొత్తుచుండెను. అపుడె వికసించిన యొక పెద్ద గులాబిపూవు సువర్ణరాశి పై సొబగొందుచుండెను. రాజ్ఞీ రాజపుత్రికలు తెరవెనుక నాసీనలై యుండిరి. ఆదెసనుండి తెరలు తెరలుగ వీతెంచు పూల నెత్తావులును, కాంచన కంకణముల కలస్వనము లును ఆసుందరు లీసభాకార్యక్రమము నతి కౌతుకా యత విలోచనముల విలోకించుచుండిరని ప్రకటనము చేయుచుండెను!

ప్రథమమున ప్రభువు కొన్ని యుపోద్ఘాత వచన ములు పలికెను. శ్రీనాథుఁడు తన కుటుంబమున కొనర్చిన మహోపకార మాతఁ డుగ్గడించి, తన కృతజ్ఞతాసూచక మగు నీచిన్ని కానుకను గైకొని తనను గౌరవింపుమని యాయువకుని వేఁడెను. శ్రీనాథుఁడు వినయపూర్వకమగు వినతు లొనర్చి తన హృదయము కాంచనరత్నములఁ దగిలియుండ లేదనియు, దేవరకు సమ్మతమయ్యెనేని తన వలపుల కొలికియగు నొక పన్నీరుపూవె చాలుననియు విన్నవించెను! ఈ చిన్ని కోరికకు రాజు, రాజ్ఞియు నద్భు తమందిరి. ఆశ్చర్యలగ్న మానసులు గానివారు వక్తయు, నాతని కలుముల రాణి యగు రాజకన్యకయును!

తురుష్కప్రభువు ధీశాలి; ధీరోదాత్తుఁడు. విప్ర పుత్రకుని పలుకులకు ఆమహనీయుని మనమున తొలకరి మెఱుపువలె నిపు డొక యోజన స్ఫురించెను! వైద్యు నచ టనె కూర్చుండుమని చెప్పి, రాజు చట్టన తెరలోనికిఁ బోయి, రాణితోఁ గొంత ముచ్చటించి, పిమ్మట పుత్రి కతో సంభాషించి, తెరవెలుపలకు వచ్చి, "యువకుఁడా! నీబుద్ధికుశలత మేలైనదని మున్నె యెఱింగితిని. ఇపుడు నీధైర్యము ప్రశంసనీయమని తెలిసినది. మఱియేజేని ప్రమో లనేని, నీసాహసమునకు నీశిరసె సమాధాన మీయవలసి యుండెడిది! నామనస్సునకు మాత్రము సత్యధర్మములె ముఖ్యములు గాని క్షణభంగురములగు జాత్యభిమాన ములు గావు. నీప్రణయచరిత్రము నిక్కువ మైనచోఁ, ప్రేమ సత్యములకు పెనుఁగొమ్మయగు పరమాత్ముఁడు నిన్నా శీర్వదించుఁ గాక! నీ కోరికను మరలఁ దెలిపెదవా?

"దేవర వారికి సాయం దనుగ్రహ మున్నచోఁ, నాకు పన్నీరుపూవు ప్రసాదింపవలయును!" అని శ్రీనా థుని ప్రత్యుత్తరము.

రాజు: "పన్నీరుపూవు మాకు ప్రియము, పవి త్రము నైనది! అద్దాని నీవు శయనగృహాలంకరణమునకే కాక, దేవతామందిరమునఁ గూడ గౌరవించెదవా? లలితకళా జన్మభూమి యగు పారసీకోద్యానములందును, ఆధ్యాత్మికవిద్యారహస్యములగు సూఫీదేవాలయ ప్రాంగణ ములందును ప్రభవించిన యీపూవుఁ దీఁగె పవిత్రవేద భూమి యందు వర్ధిల్లఁగలదని అంటు గట్టుట కనుపఁబడు చున్నది సుమీ!"

వైదికనిష్ఠాపరుఁ డగు నావిప్రకుమారుని ప్రేమ మున కిది క్లిష్టమగు సమస్య! ఐన దీని కాతఁ డొసఁగు సమాధానమును బట్టియె ఆతని ప్రేమమునకుఁ గల ధైర్యస్థైర్యములు తేటపడఁగలవు. ఇపు డతఁడు ఆవం తయుఁ గొంకక, "మహాప్రభూ! సత్యసంధత యన్నఁ



శ్రీమతి యం. యు. మిల్సు కన్యగారికి సన్మానము



 శ్రీ శారదా లేడి యూనియను (తిరువల్లిక్కేణి) వర్షవర్ధంతి.



శ్రీమతి ఫెలీసియా దేవసహాయం కన్యగారు.



శ్రీమతి అన్నటి. మామెను కన్యగారు.



శ్రీమతి కే. పార్వతి అమ్మగారు.



వుమెన్సు ఇండియన్ అసోసియేషన్, చెన్నపురి. (ఎగ్మూరు)

ముగ నుండెడి భగవద్భక్తుల వంశ్యుఁడనేని, పన్నీరు పువ్వును తగిన చొప్పున మన్నించి, ఎన్నఁటికిని వన్నెమాయన్ని విధమునఁ గాపాడఁగలను!" అని ప్రత్యుత్తర మిచ్చెను

అంత నవాబు దిగ్గన లేచి, ఒఱలో వ్రేలాడు కాంచన ఖడ్గము దీసి, "హృదయము గలిసిన చోటుల పదిలము లెందుకు?" అని పలికి, తెరనొక్కవ్రేటునఁ జీల్చి, "హృదయేశ్వరీ! మనప్రాణసమానయగు పుత్రిక పన్నీరు పూవునకు తగినవరుఁడీ వైద్యకుమారుఁడె సుమీ! దేవుఁడు ప్రీతితోఁ గలిపిన హృదయములు వేరుచేయుటకు మనుష్యమాత్రులము మన మెవ్వరము? స్వాంతము సత్యధర్మములందున్న సచ్చారిత్రులె స్వచ్ఛమగు ముసల్మానులు! బిస్మిల్లా! వీరి దాంపత్యము దైవసమ్మతము!" అని వక్కాణించెను.

అంత నా యువతీ యువకులు బాజ్షీరాజులకు మ్రొక్కి, వారి దీవనలతో గృహస్థాశ్రమస్వీకారము చేసిరి!

౯

కందుకూరు సీమలో పశ్చిమదిగ్భాగమున కమలూరను గ్రామము గలదు. అందు క్రొత్తగ నొక బ్రాహ్మణ కుటుంబము వచ్చి కాఁపురముండెను. ఏప్రభువు ప్రాపకముననో వారికి గొప్పభూవసతి ప్రాప్తించెను. గృహస్థుఁడు వైద్యశిఖామణి; గృహిణి అప్సరసవంటి శరీరసౌందర్యమున నొప్పునది. దేశభాష బాగుగ రాకుండుటచేతనో, మఱియే కారణముననో ఆగర్భశ్రీమంతురాలగు నాయిల్లాలెప్పుడు నిల్లు విడిచియుండునది కాదు. ఐనను, రూపగుణాధిక్యమున నాకోమలి దేవతావిగ్రహమె! పూలమొలకలు పెంచుటయందా సుందరి కెంతయు నాసక్తి. ఆపడఁతిపేరు పన్నీరుపువ్వు. వారి సంతతివారు పన్నీరుపూలవంటి శరీరసౌందర్యముననొప్పుచు, భక్తినిరతత్వమునకును, లలితకళలందభిరుచికిని వాసికెక్కియున్నారు.

౧౦

కమలూరు గ్రామమందును, చుట్టుప్రక్కల నైదాఱు గ్రామములందును ఇప్పటికిని "శ్రీనాథము" అను నింటిపేరు గల గొప్ప భూస్వాము లున్నారు. ఇచటఁ దప్ప దేశమందెచటను శ్రీనాథమువారు లేరు. మొట్టమొదట కొన్ని యనుమానములచేత ఆ వంశికులను తక్కిన బ్రాహ్మణ సంఘమువారు, కొంత తక్కువగఁ జూచిరఁట గాని, శ్రీనాథమువారి కిపుడట్టి బాధలు లేవు. సోముఁడు వారి యిష్టదేవత. స్త్రీపురుషులు లలాటమందలి బొట్టు మీఁద బాలచంద్రరేఖ నలంకరించుకొందురు. వింతయగు నొక చాంద్రాయణవ్రతము వారు జరుపుచుందురు. మహమ్మదీయులయెడ వీరు అత్యంత సోదరభావము గలిగి యున్నారు. ఈవంశమున పలువురు కవిత్వధోరణికిని, లలితకళాభిరతికిని ప్రసిద్ధి కెక్కియున్నారు. సమధిక నిష్ఠకును, శరీరసౌందర్యమునకును శ్రీనాథము వారు పేరుపడియున్నారు!



[ఈ ఐతిహ్యము నందలి ముఖ్యాంశములు స్పెయినుదేశీయుఁడగు జోసెఫ్ మేజిగ్ అను హిందూదేశచరిత్ర పరిశోధకుని దినచర్య పుస్తకమునుండి గ్రహింపఁబడినవి.]

## సందేహడోల

జి. జాషువకవి గారు

పుణ్య పాపంబు లని జగంబులు ధ్వనించు-నేది పుణ్యము? పాపమెయ్యది? మహాత్మ!
రెంటికి ఫలంబు లిడి సమర్థింతునంట-తెలియఁజేయుము నన్ను గద్దించుకొనుము.

సృష్టికర్తవు నీవు నీ సృష్టిలోని-మానవుఁడ నేను యిద్దరి మధ్య మనకు
ముసుఁగులో గ్రుద్దులాటలు పొసఁగవింక-హక్కు గలదయ్య ప్రశ్న సేయంగ నన్ను.

మోహనపదార్థములు కుప్పబోసియున్న-భూతలంబను కైతవమందిరమున
నన్నుఁ బుట్టించినావు మానవుఁడ నగుట-ననుభవించితి నందు కేమందు వీవు?

పక్షపాతంబు లేదు దైవమున కంద్రు-ఖలుఁడు సుఖియించు గుణశాలి కష్టపడును
కడకు నిద్దఱదెస నొక్కకంట నరయు-మృత్యుదేవత నేల నిర్మించినావొ?

ఎఱుక చేయక నను సృజియించినావు-తగవు దప్పిన దండింపఁ దలతువంట
వట్టిదిదియన్న ననుఁ బిచ్చివాఁడవందు-రందుకే నాకు సంశయం బంకురించు.

కరుణ నీలోన జన్మంబు గాంచునంట-నీవె కరుణకుఁ గడలేనినిలయ మంట
జీవినొక జీవికన్నంబు జేసినావు-నాథ! యిదిచూచి నాగుండె నలిగిపోవు.

స్వర్గనరకంబు లున్న వచ్చటికి నరుల-పుణ్యపాపంబులే కొంచుపోవునంద్రు
పల్కుదురు గాని కనివచ్చువాఁడు లేఁడు-యీరహస్యంబు రూపింపవేమి? సామి!

సిలుగులన్నియు ననుఁ బరీక్షించుకొఱకు-నీవు కల్పింతువట యిది నిక్కమయిన
జీవితం బెల్ల నేనిట్లు చివుకుచున్న-సర్వలోకేశ, యేది విశ్రాంతి నాకు?.

జగతి పుట్టిన యదిమొదల్జననమంది-భక్తులెందరు రాలిపోవంగలేదు
వారి గతియేమి? వారెల్ల స్వర్గసీమ-నుందురా? రూఢిసేయ వేమోయినాథ!

---

## వృక్షము - నరుఁడు

శాంతి శ్రీపతిశాస్త్రి గారు

అల నదీపార్శ్వసైకత స్థలిని మొలచి
యొక్క పెనువృక్షమదె తనయుపరిశాఖ
లొక్కవడిఁ జాచుకొనెఁ జూడు మూర్ధ్వదిశకు
నందుకొనుటకు దుస్సాధ్యమైన యట్టి
యాకసము దెసకుఁ గరతలాంగుళులటు;
—క్షితినిబద్ధితమయ్యు, స్వర్గతి కపేక్ష!—
మానవప్రకృతి కిది సమానముగద?
ఆత్మయూర్ధ్వగతిని స్వర్గయాన మరయ
దేహమును, బుద్ధియు నధోగతిని మెలఁగుచు
భౌతికపిపాసఁ దవిలి, మోహాతివృద్ధి
నరునిసద్గతిని నిరోధ పఱచుచుండు.

---

# ఉషారమణుడు

కీ. శే. అనంతపంతుల వేంకటేశ్వర్లు గారు

తెరులు నశించు; నేలసమతన్ గనగా నశియించు; నబ్దముల్
పొరిపొరి పొక్కి నేలఁ దమమూటలు డించెదు నెట్టకేలకున్;
నరుఁ డిల బుట్టి కష్టపడి నాగలి దున్నుక మన్ను జేరు; వ
త్సరములు పెక్కు మన్కిగని చావగ నౌ దుఃద కంచరున్; ననే
కరము దహించు జంపకయె కష్టపు నీలమరత్వ మక్కటా!

నీకరంబున నంతంత నేను తఱిగి-తిరుగుచుండెద గలయట్లు నెరియుకురులు
గలుగునీడనై, యోసంజనెలఁత! జగము-నిశ్చలంబగుహద్దున, నెమ్మదైన
ప్రాగ్దిశాభాగమున, నుషోభాసమాన-భవనముల, సాంద్రహిమధూమ వర్గములను.

అకటా! మునొ్నకయప్పు డీనెరియు ఛాయారూపమే, మానవా
ధికశృంగారమునన్ వెలుంగుచు భవత్ప్రేమార్హమై తన్ను దా
నొకదైవంబని నమ్ముకొంచు మురిసెన్; యోగంబు నేమందు? నే
రక సన్వేశితి జావు లేమి; నవలీలన్ దాని నాకిచ్చినా
వొకటన్; జాగము లెక్కసేయక ధనాఢ్యుల్ సేయున ట్లోచెలీ!

ఆనాఁడు మొదలు కిన్కన్-బూని కరకుకాల మిట్లు పొడిసేసియు నన్
బ్రాణము దీయదు; నిత్యం-బౌ నవయౌవనము నికటమం దిటులుందున్.

కటకట! నా కష్టకథ నాలకించి-బొటబొట కన్నీరు పుచ్చు నీలోల
లోచనంబుల భాసిలుచు భవన్మార్గ-సూచకు డిదె! వేగుఁజుక్క దోతెంచు:

ఏ మిపుడైన నీప్రేమంబుగాని-నీమురువైన నానేరము దిద్ద
గలుగుచో, నీయీవి గయికొన్ని, నన్ను-దొలగని మ్మిక నాదు తొల్లింటిదశకు—
మానవుడేల యీమనుజుల తెన్ను-బూనక వేఁడుగా బోగోరు టింతి!

సకలంబునకు మేలు సమకూర్చునట్టి-ప్రకటితవిధి హద్దు పాటించి నిలువ
కేల దానిని మీరనెంచుట? నరుడు;-చాలిక నా బుద్ధిచాలమి తెలిసె.

మెల్లగ మబ్బువీడగ సమీరము వీచెడు; నంత నాదు పు
ట్టిల్లగు భూప్రపంచ మొకయింత కనంబడెడున్; దురూహ్యమౌ
తొల్లిటి మిన్కుకాంతియును దొంగవలెన్ చనుదెంచు నంత, నీ
తెల్లని భ్రూలనుండి, భవదీయభుజమ్ములనుండి, నెమ్మిచే
నుల్లము పూర్వసత్వ మిపుడొంద చలించు నురంబునుండియున్.

ఆపయి నీకపోల మెఱనె యిరులందు వెలుంగు, నంత నీ
చూపులు నాకు జేరువగుచున్ మెలమెల్లన దళ్కువాఱె తా
రాపథమందు రిక్కగమి రంజన మాపకమున్నె నీహరుల్
నీపయి ప్రేమచే నెపుడు నిన్నె వహింపగ గోరి లేచుచున్

రేపకర్డన్, దమంబు సడలింపఁగఁ గేసరముల్ విదల్చి సం
దీపితకీలికీలలుగ దెల్లనిచీకటి గొట్టు డెక్కలన్.
అనుదిన మీవలెన్ బెరిగి యందముచెందుచు నీసదుత్తరం
బనకమె సాగెదీవు; భవదశ్రుకణంబులు నాకపోలమం
దునిచి మనంబునన్ జళుకు నుద్భవమందఁగఁ జేతుమేమి? నే
మును భువినేర్చినట్టి యొకపుక్కిటిమాట నిజంబొ?— "దేవు
కైనను వెనుకన్ మఱల్పనగునా? తనయీవి ఫలంబు—" నక్కటా!
కటకట! భాగ్యహీనుఁడనుగా! యిపు డాతొలివాఁడఁగాను నే;
నెటు మునుగాంచుచుండు నితరేక్షణ సద్ధృదయంబులన్ పరి
స్ఫుటముగ నీ శుభాకృతి సముద్భవమందుచునుండ, జాళువాఁ
కుటిలపుకుంతలంబులయి గొబ్బున శోభ వహింప నీకురుల్.
అబ్బురపుమార్పు నీకిటు లబ్బుచుండ-దాని కనురూపముగ మార్పు నేను గనెడు
వాఁడ; మెల్లన నీముఖవైఖరియు, భ-వనము గెంపాఱె కనులవరముతోనె
చురుకుదనము నానెత్తురు నెఱుగుచుండె.
వెండియు విశ్రమించి మురిపెంబున నే నటులుండ నీవు నా
దండను జేరి నాపెదవి దక్కనొసంటను గంటిరెప్పలన్
మెండుగ ముద్దు లుంతువు సుమీ! యవి పూవులకారుకాలమం
దుండి సగంబువీడి నలువొప్పెడు మొగ్గలకన్న హృద్యముల్.
ఆది బాగమంచునలె "నిలియన్" పురంబు-దుర్గముఁలు లేచుచుండ నేఁ దొల్లివిన్న
"అప్పొలో" గానమట్లు నీవపుడునాకు-వలపు లేమేమొ మెల్లగ బలికెదవుగ.
కల్గుగు శుభమ్ము నీకు! కలకాలము నీ తొలిదిక్కునందుఁ న
న్నిలుపక పోవనిమ్ము; మఱి నిన్నిక నాస్థితి యెట్లుఁకూడనొ"
ఖిలముగ జచ్చుభాగ్యమును, కీర్తియు గల్గు సుఖాసనీ జనా
వళి సదనాంతికంబులయి, స్పష్టముగా గనరానిక్షేత్ర భూ
ములపయి నుండియున్ మరణమున్ గని సౌఖ్యతరంబుగా నిలా
తలసుఖసుప్తులైన జనతండముగప్పి తృణావృతంబులై
వొలిచెడు మంటిపోకల సమూహమునుండియు, సాంద్రధూమముల్
నిలువున లేచివచ్చుతఱి నెమ్మనమెంతయు ఖిన్నమయ్యెడిన్.
చలివలె నేడు నీ తొగరుచాయలు రాగసుదీపనాల్పకం
బులగుచు నన్నుఁ ద్రొవు; రసపోషణశూన్యములౌ భవ
ద్ద్యుతుల్; మలయుచు దావకీన లసమానగృహాంతరసీమలన్
మడుంగులు వడు మత్పదంబులును గొంకరపోయెడు శీతలంబులై.
కావున నమరత్వము లే కోవేలుపుటింతి! భూమి కొనఁగుము నన్నున్
నీ వఖిలవస్తువుల జూ-తావలె గనుగొందు నాదునంతము భువిపై.
నీ వనూదయమును గ్రొత్తనీటు మగుడ-బూనుచుండుము పుడమిలో బుగ్గినొచు
నేను మఱచెద రిత్తయో నీభవనము-దెల్లయరదంబునన్ జనుదేఱు నిన్ను.

---

# వసంతగీతము

అనంతపంతుల రామలింగస్వామి గారు

రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!
వచ్చి ననుఁగూడి కమ్మని వలపుఁ గొలుపు;
చిగురు చీరధరింపక చిన్నవోదు
మలినజీర్ణచ్ఛదాంశుకంబులనుదాల్తు;
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చిననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
ఆశ్రితాళులకామోదమలరనీను
కళికలవిలాసనటనముఁ గానలేను;
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చిననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
కాంచనాలంకృతులువాసి కలఁగుచుందు
మరకతశలాటు భూషలు మానియుందు;
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చిననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
విమలసుమనోవికాసము వీడియుందు
మధురసాస్వాదనము మాట మరచియుందు;
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చి ననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
తిలకసౌందర్యమునుగని కులుకలేను
హితఫలంబులు ద్విజులకే నీయలేను;
కీరవాణులు మంగళగీతిఁ బాడ
ఘనతరులువేడ్క మిన్నంది కదలియాడ
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చి ననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
ప్రథితసహకార పల్లవధ్వజములెగుర,
సద్ద్విజశ్రుతిఘోషలు జాలుకొనఁగ,
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చిననుఁగూడి కమ్మనివలపుఁ గొలుపు;
పల్లవావళినీరాగ పటిమఁజాట,
గంధవాహుఁడు నీదురాకను దెలుపఁగ,
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చిననుఁగూడి కమ్మనివలపుఁ గొలుపు;
కవులు నీరాకఁగని కలకల వచింప
సరసు లతినిర్మలాస్యప్రశాంతిఁ జూప
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చి ననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
హాళిఁగొమ్మలు నీకు నివాళు లిడఁగ
చిన్నిలతకూన లొగి నీకు తెన్నుఁజూప
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చి ననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
కేతకీదళశస్త్రము కేలఁబూని
అతిరయాన పలాశసంహారమునకు
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చి ననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
నవ్యవనమాలికా భూషణములు దాల్చి
వంశగౌరవమును జాటుపదము లిడుచు
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చి ననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
రక్తిఁ బ్రియురాలిపైఁ బుష్పరజముఁజల్ల
మధువసంతము నాలిమై మరువఁబోయి
రమ్ము! ప్రాణేశ! మాధవా! రాగమూర్తి!

వచ్చి ననుఁగూడి కమ్మని వలపుఁగొలుపు;
నాఁడు ననువీడి కలకంఠిఁగూడిపోయి
నేఁటికేఁడాదియయ్యె నింకేటికయ్య?
చలముబూనను—కలకంఠిఁ గలిసిరమ్ము!
పొలఁతులిరువురు గలవారు పుడమిలేరో?

# అర్పణ*

వండ సూర్యప్రకాశరావు గారు

బ్రదుకు తెరువును గనలేక భ్రమసి—కేలు
జోలెఁ గీలించి—చూపఱు. జాలిఁ బొంద
'బిచ్చమో యమ్మ! తండ్రులో!! బిచ్చ'మంచు
నెలుఁగు రాల్పడ నింటింటఁ బిలచిపిలచి
సగము స్రుక్కినమేను దుస్సహము గాఁగఁ
బడుచు లేచుచు—క్షుద్గ్రామపథములందు—
దినదినంబును దిరుగాడుఁ దిరిపెకాఁడు.

ఒక్కనాఁడట్లు దిరుగాడుచున్న వేళఁ—
గనులు మిఱుమిట్లు గొలిపి, యక్కజపుఁగాంతి
వెల్లువలు దెసల స్రవించి పెల్లుకొనఁగ—
తన దెసకు మెల్లనఁ జనుదెంచు నొక యరిది
రథము ముష్టింపచుండు దూరానఁ గనియె.

కని, తదీయ మహోజ్జ్వలాఖండదీధి
తిప్రసార తేజోనుభూతి తనదు హృద
యమున విస్మయోద్వేగహర్షములు పెనుపఁ
గోర్కివల్లియుఁ దోడ్తోన కొనలు సూపె.

'అసదృశంబైన యీవైభవాతిశయముఁ
గాంచి, వేఱుమఱల నడుగంగవలెనె?—
ఇతఁడు నిఖిలధరాభరణైక దక్షు
రాజమూర్ధన్యశాసన ప్రవణుఁడగును
నిక్కువంబుగ; సుంతసందియము లేక
యఖిలజీవనపోషకుం డగును. అతని
ఘనకరద్వయము గురియుఁ గనకవృష్టి
బిచ్చమేల? నాయగచాట్లు విచ్చు నింక.'

అంచు బహుభంగి నూహాప్రపంచవీథిఁ
బరుగువాఱెడుమనసు నిల్పంగలేక
తుది మొఱుంగని యుత్కంఠఁ దోఁగి, యతఁడు
చిత్తరువుపోలెఁ దా నిరీక్షించుసంత.

అరద మొయ్యన నడతెంచి, యతని సవిధఁ
బొలిచి నిల్చుటయును, మహాపురుషుఁ డొకఁడు
దివ్యభూషణవిగ్రహదీప్తు లడరఁ
దేరు డిగి, నిజకరుణాప్రపూరదృష్టి
భిక్షుకునిఁ గాంచి, చిఱునవ్వు వెలయ—'ఓయి
యాచకా! నాకుఁ బ్రీతి నీయంగఁ దగిన
దెద్దియేనియుఁ గలదె నీయొద్ద నిపుడు?'
అని తటాలునఁ దనకరం బతనికు చాచి
కరము సమ్మదమునఁ బ్రతిగ్రహము వడయ
సిద్ధపాటయ్యెఁ, గడుమున స్తిమిత మెడలి
యగ్గలపుసంభ్రమంబున నయ్యకించ
నుఁడు తెలివి సెడి, యొక్కింతపడికిఁ దేఱి—
'అరయ నిక్కమొ! లేక సమ్యాటకనెనొ'!!
అర్థినర్థించు దాత లీయవనిఁ గలరె!!!

ఏదియొసఁగుదు నీతని కిప్పుడనుచుఁ
గ్రించుఁ దనమునఁ దశవు యోచించి, తనదు
జోలెయడుగున నలచేయిఁ జొనిపి, యచటి
ధాన్యచయమును బలుమాఱు తడవితడవి
యెట్టకేలకుఁ దెగువమై నేర్చి, యొక్క
చిఱుతగింజ నమ్మహనీయుచేత నునిచె.

చేత నిడినంతఁ గరుణమై స్వీకరించి
మొనయునక్కటికంపుఁజూడ్కి నిరుపేద
మెడలఁ బఱపి, యమ్మహనీయుఁ డెలమి నరద
మెక్కి, యరుగఁ జేసన్న గావించునంత.

రథము వెడలె; భిక్షుకు మనోరథము సడలె;
ఊహలడుగంటె; నోటఁ బ్రత్యూహమంటె;
భోగియగుదని యెప్పటి జోగియయ్యెఁ;
గర్మఫల మది తప్పింపఁ గలరె ధరణి.

---

* రవీంద్రుని గీతమునకు స్వేచ్ఛానుకరణము.

చేయునది లేక భిక్షుండు చిన్నవోయి
గతము తలపోసి, తనపురాకృతము నెగడి
పల్లెదారుల నెప్పటిపాటఁ దవిలి
సంజయగునంతఁ దనయవసథము సేరె.

చేరి, తానేలఁ దనమేను సేర్చి, దినము
సేకరించినధాన్యంబు ప్రోకవోసి
అందఁ బొడగాంచె సంతోషమలర నొక్క
చిఱుతవన్నియ బంగారు చిన్నిగింజ.

అదియు నతనిఁ బరీక్షించు నదియవోలెఁ
గళుకుమెఱుఁగను సోగవీక్షణము వఱపు;
నెగడు నునుగాంతి లేనవ్వు నెఱపి వాని
వెడఁగుఁదనమును గ్రేడించు విధము సూపు.

ఇట్టులంబైన మోహంపు టెరులుగెడపి
యతనిహృదయాన వెలుఁగిచ్చు నదియవోలె
నిద్ధవిజ్ఞాన దీపసాదృశ్య మూని
మిలమిలనిగుల్కు తెలికాంతి మిన్ముకలీను.

దానియునికికి మిగులఁజోద్యంబునెంది
అమ్మహోత్తరు మాహాత్మ్యమంచుఁ దెలిసి
తనదు దౌర్భాగ్యమునకు నుద్భ్రాంతుఁడగుచు
వితతచింతాభరంబున వివశుఁడయ్యె.

ఉపసంహారము

కొసరి, పీసంపుఁ జిఱుగింజ యొసఁగనలరి
చిత్రముగదాని స్వర్ణంబుసేసి యొసఁగె!;
నమ్మకముతోడ నాత్మార్పణంబుసేయ
నుజ్వలంబైన తనదు సాయుజ్యమిడఁడె!!

---

# విరహోత్కంఠ

అల్లంరాజు రంగనాయకులు గారు

ఈ వియోగానంత హేమంతరజని, నీ
కలగు స్వాంతమ్ముతో గ్రాగు నిట్టూర్పుతో
కాలసత్వావృతాభీల విపినాల, ని
న్నెట్టు లన్వేషింతు హృదయనీరజసదన!
శ్రమము హెచ్చినకొలఁది తమము ముసురుకొనంగ
తెరువుగానని కన్ను విరిసియే మూగయ్యె;
మృగభీషణారావమే దెసల మార్మ్రోయు
కొలఁది గ్రుత్తుకెల్ల సంక్షోభ పూరితమయ్యె!
ఒక్కయడుగేని ముందిడ నోపలేని
దీనురాలిని కరుణామృతానఁ దేల్చ
కుండ, దుస్సహకంటక యుతపథాల
నెంతకాలము పరువులెత్తింతో రమణ?
ఎపుడు వేగునో? ఎప్పుడీ హిమమహీధ
ఫాళి కరఁగునో నీమోహనామలేక్ష
ణాంచలమ్ముల? నెన్నఁడీ యడవి దాఁటి
మాలికల నీఁది, నీప్రేమ మందిరాంగ
ణమ్ము డాయుదునో? ఎప్డు నావిషాద
హాలహాల ఘూర్ప భవదమృతాంకతల్ప
మందుఁ జేర్చెదో తెలియలేనైతి నాథ!

# కాఁపుపిల్ల*

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

కట్టకట్టకు నడుమ బంగారు పూల-జనపచెట్టులు సింగారమును ఘటింప
దట్టముగఁ బండి యాచుట్టు పట్టుచేల-కన్న మిన్నగఁ దగు నొక్క జొన్నచేను.

వన్నెచిన్నెల చిన్నారి కన్నెతోర్తు-చీటికిని మాటి కటునిటు చేనిలోనఁ
గ్రుమ్మరుచునుండెఁ గన్నెరూపమ్ముఁదాల్చి-చేరి చరియించు ధాన్యలక్ష్మియొ యనంగ.

పొలఁతుక కట్టిన ముదుకకమ్ములకోఁక మైదీవెనునుజాయ మఱుఁగుపఱుపఁ
జెలిమిన్న తొడిగిన సెనగపూవులరైక మృదులబాహుద్యుతిఁ గొదవపఱుప
విరిబోణి పెట్టిన పెద్దకుంకుమబొట్టు ముద్దుమోము మెఱుంగు మోటుపఱుపఁ
బడఁతిధరించిన బళ్లారిగాజులు కరపల్లవచ్ఛవి గాకుపఱుప
ముగుద ముడిచిన తంగెడు పూలు వలుఁద-కొప్పుగౌరవము నొకింత కొంచెపఱుప
గరముఁ గన్పట్టె మసిపాఁతఁ గట్టఁబడిన-మానికంబట్టు లాయొయ్యారి మైపసందు.

పొలము మహాబ్ధి వాయుహతిఁ బొర్లెడుపైరు తరంగపంక్తి యం
దలరెడు మంచె కంజము తదంతరసీమఁ జెలంగునట్టి యొ
ప్పులగని లక్ష్మి యంచుఁ బలుపోకల వర్ణము లొప్పఁ బద్యముల్
గిలుకఁడె యానెలంతఁ దిలకించిన సత్కవి మైగగుర్పఁగన్.

ఆపడుచు సోయగం బది యట్టులుండఁ-గంఠ సారస్యము వచింపఁగాఁ దరంబె?
ఒక్కొకపు డామె యొకపల్లెటూరి రాగ-మాలపించినఁ గోయిల లాలకించు.

కంకి యొక టిత్తువా?-దోసకాయ తీసు-కొమ్మటందువ?-గోఁగాకు కోసుకొందు
నా?-యటంచును దమితీర నామెఁ బల్క-రించుకొని పాంథవితతి తరించుచుండు.

పాంథజను లట్లు తనుఁగాంచి భావవికృతిఁ-గాంచుట నెఱుంగ దింతి యకలుషహృదయ
ఒనరఁ దనుఁగాంచి యిందుకాంతోపలములు-కరఁగి నీరౌట చంద్రిక యెఱుఁగనట్లు.

వంచె చిక్కముఁగట్టి పడఁతికోయఁ దొడంగె పాఁడి బట్టెరు 'కలపటపు' గడ్డి.
వడివడిఁగిల్లె మాపటికూటిలోనికి కూరలే దని యింతగోఁగుకూర
అందందుఁ దిరుగుచు నందిచాపుల నేతె దొరపండిన పదిదోసపండ్లు
తొడరి కైకొనెఁ దాను త్రోవను దినుటకు పిడికెఁడు ముదిరిన పెసరకాయ
లింతలో భానుఁ డపరాద్రి పొంత కనుఁగ-గూరగాయలు పైఁటకొంగునబిగించి
పొంకముగ నెత్తిపైగడ్డి మోపువెట్టి-కదలె నింటికి మెలమెల్లఁ గాఁపుపిల్ల.

---

* ఈ పద్యములు పది పండ్రెం డేండ్లకు మునుపు నేను రచించిన 'స్వయంవరము' అను కృతిలోనివి.


శ్రీమతి లక్ష్మీనరసమ్మ గారు


శ్రీమతి యస్. కమలగారు


(11) బాల్యవివాహ నిరోధశాసనమును ఖండించు స్త్రీలమహాసభ, చెన్నపురి.



శ్రీమతి ఆనందబాయి కన్యగారు, అడ్వొకేటు.



శ్రీమతి డి. లక్ష్మీదేవి అమ్మగారు, బళ్లారి.



శ్రీమతి బి. సుబ్బమ్మ, బి. కామాక్షమ్మగారులు.



శ్రీమతి సుబ్బమ్మ, సీతారత్నంగారులు.

# సారంగధరుఁడు.

కొత్తపల్లి సూర్యరావు గారు

సారంగధరుని చరిత్రము లోకములో ననేకవిధములుగా వాడుకలో నున్నది. రాజమహేంద్రవరములోని వాఁడని ద్విపద సారంగధరచరిత్రములోను, గామజోగి శాస్త్రి రచించిన శారదకావ్యములోను నున్నది. చేమకూర వేంకటకవికృత సారంగధరచరిత్ర (పద్యకావ్యము) లో మాళవదేశములోని వాఁడని యున్నది.

౧. రాజమహేంద్రవరములోని రాజరాజనరేంద్రుని కుమారుఁడని జనులు రాజమహేంద్రవరములోని రాజరాజనరేంద్రునిమేడ, చిత్రాంగిమేడ, సారంగధరుని మెట్ట [వీథులలో దొర్లుగుండుఱాళ్లు] సారంగధరుని గోలిగుండ్లనని చెప్పుదురు. తన్మతావలంబకులకు ద్విపదశారదకావ్యములే యాధారములు. రాజమహేంద్రవరమును బాలించిన రాజరాజనరేంద్రునికి రత్నాంగి చిత్రాంగి యను భార్యలుండినట్లుగాని సారంగధరుఁడను కుమారుఁడున్నట్లుగాని చరిత్రజ్ఞులవలన నేను వినలేదు.

౨. వేంకటకవి పద్యకావ్యమే పై రెండుగ్రంథములకు నాధారమేమో. అందు రత్నాంగి కులసతియనియుఁ జిత్రాంగి భోగకుటిల శిరోజాతిలకమనియుఁ గలదు. రాజమహేంద్రవరవాదులు సారంగధరునికై వెదకించి చిత్రాంగిని రాజరాజనరేంద్రుఁడే పెండ్లియాడెనని చెప్పుదురు. కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు సారంగధరచరిత్ర పీఠికలో "ఈపావనచరిత్రముయొక్క కథాపురుషులు రాజమహేంద్రవరము నేలిన రాజరాజనరేంద్రుఁడును తత్పుత్రుఁడునని యాంధ్రదేశమున వాడుటకలదు. కాని"— అని యారంభించి గే కాని దానిని విమర్శించుటకుఁ గడంగరైరి. మాళవరాజని వేంకటకవిచెప్పిన సారంగధరచరిత్రమునకు "మూలమనం దగినట్టిది చౌరంగియను మహాపురుషుని కథ నాథచరిత్రమునం దిట్లున్నది." అని కొంత కథం జేర్చిరి. నేను దాని నిందుఁ జేర్చుచున్నాఁడను:

"రుద్రపురమును భులేశ్వరుఁడను రాజు ఏలుచుండెను. అతనికి చంద్రావతి యని పట్టపుదేవియు, చంద్రావతీనగరీపతి యగు సుభద్రుని కూఁతురు స్వయంవరలబ్ధ శోభావతియని మఱియొక దేవియు నుండిరి. శోభావతి సవతిని చంద్రావతిని వెలార్చుటకై ఆమెపై అంపలు మోపి రాజును నమ్మించెను. అంతట రాజు ఆమెను అరణ్యములో తల నఱుకు మని మంత్రి కప్పగించెను. మంత్రి యా సాధ్విని గర్భిణిని సంహరింప నొల్లక యడవిలో నొక శివాలయముకడ వదలిపోయి రాజుతో సంహరించినట్లే చెప్పెను. అప్పటికి శివసేవార్థము వచ్చిన యొక్క గంధర్వకన్య చంద్రావతిం గాంచి కనికరించి యామెకు మత్స్యేంద్రవ్రతము నుపదేశించెను. అనంతరము చంద్రావతి శుచిశ్రవసుఁడను మునీంద్రుని యాశ్రమమునకుం జని యట మునిపత్నుల ప్రాపుననుండి కుమారుం గనియెను. వానికి మునులు చంద్రశేఖరుఁడని నామ మిడి యథాకాలమున సకల సంస్కారములను తామే కావించిరి. తల్లి వానికి మత్స్యేంద్రోపాస్తి నుపదేశించెను.

ఇట్లుండ రుద్రపురములో భులేశ్వరుఁడు జన్నంబుఁ గావించెను. అందులకు శుచిశ్రవుఁడు శిష్యసమేతముగా నరిగెను. యజ్ఞభూమికడ ముని శిష్యులు బంతియాడుచుండ శోభావతి వారిలో చంద్రశేఖరుఁ గాంచి మోహించి వానిబంతిని తనచేటిచేత తెప్పించికొనియెను. బంతి యడుగఁబోయిన చంద్రశేఖరునికిని శోభావతికిని—పావురము నడుగంబోయిన సారంగధరునికిని, చిత్రాంగికిని—జరిగిన వృత్తాంతమే జరిగినది. దురాచారమునకు లోఁబడని యా మహానుభావునికి, చంద్రశేఖరునికి భులేశ్వరుఁడు శోభావతీప్రేరణంబున కాలుసేతులు (సప్తశృంగమను కొండకడ) తలారులచేత తఱిగించెను. ఆ నొప్పిలో చంద్రశేఖరుఁడు మత్స్యేంద్రనాథస్మరణ గావించుచుండెను. అంతట చంద్రశేఖరునికి శివపుత్రుఁడు మత్స్యేంద్రనాథుఁడు ప్రత్యక్షమాయెను. వెంటనే వానికి కాలుసేతులు వచ్చినవి. దేవతలు వానికి చౌరంగి యని పేరిడిరి. మత్స్యేంద్రనాథుఁడు వానిం దోడ్కొనిపోయి తల్లి కొసంగెను.

ఇంతలో రాజు తథ్య మెఱుకపడి శోకించుచుండ మత్స్యేంద్ర నాథుఁడు అతనికి ప్రాయశ్చిత్తముగా శివాలయము నిర్మింపు మని యానతిచ్చెను. రాజు అట్లే కావించెను. భువనేశ్వర మనుపేరి యా శివాలయము బదరికాశ్రమమున భక్తుల పాపములను హరించుచు విరాజిల్లు చున్నది."

ఇందు చంద్రశేఖరుని సారంగధరునిగా మార్చి చంద్రావతి శోభావతులను రత్నాంగి చిత్రాంగులనుగా వేంకటకవి యేల మార్చెను. స్వయంవరలబ్ధను భోగము పడఁతిగా నేల చేయును? ఎన్నటికో పుట్టిపెరిఁగిన చంద్రశేఖరుని శోభావతి యజ్ఞవాటముకడ బంతియాడుచున్నఁ జూచి మోహించె ననుటలో స్వారస్యము కనఁబడదు. కావుననే మూలకథ నందగినట్టిదని శాస్త్రిగారు వ్రాసిరి. ఈ కథను వెంకటకవి గ్రహించియుండఁడు. ఇచ్చొరంగి కథ కేవలపౌరాణికము, సారంగధరుని కథ యైతిహ్యము నను కొందును. వేంకటకవి యింత మార్పుచేయకుండఁ దన గ్రంథమునకుఁ దగినకథను దానెందుండి గ్రహించెనో తెలియదు. లోకమును, ద్విపద కావ్యాదికవులును, వేంకటకవి సారంగధరచరిత్రములోని—

క. రాజనరేంద్రుఁడు రిపుఘని
రాజనరేంద్రుఁడు కళాపరాక్రమరేఖా
రాజితభోగపరాజిత
రాజనరేంద్రుండు సుధాకరకులుం డలరున్.

గీ. మహిని రాజనరేంద్రుఁడు మాళవపతి
రాజరాజనరేంద్రుండు రాజరాజు
ననఁగఁ బేరెన్నికకునెక్కి యతిశయిల్లు
నింద్రవిభవుండు రాజమహేంద్రవిభుఁడు.

అను పద్యములలోని రాజరాజనరేంద్రుఁడు, రాజమహేంద్రవిభుఁడు నను మాటలం గొని మోసపోయిరా యను కొన్నచో వారి వెట్టిలోనేపడి చిత్రాంగికి మేడకట్టించి సారంగధరునికి బర్వతమును నిర్మించిన ప్రజలసామర్థ్యము నకు మెచ్చుకొనవలయును. కీ. శే. పిఠాపురము సంస్థానాధీశ్వరులు శ్రీరాజా రావు గంగాధరరామా రావు మహీపతి బహద్దరుగారి యభిలాషము చొప్పునఁ బ్రకటింపఁబడిన యింగ్లీషు సారంగధరచరిత్రములోని కథకుఁగూడ రాజమహేంద్రవరవాదుల యభిప్రాయములే ముఖ్యములై యున్నట్లు తోఁచుచున్నాను. ఆప్రతి నాకు ప్రస్తుతము లభింపలేదు.

3 ఈనడుమ 1929 సంవత్సరము అక్టోబరునెల "Supplement to the Quarterly Journal fo the Mythic Society" అను చిన్నిపొత్తమునందు "The exploits of King Kampila and Kumara Ramanatha" అను కథను జదివినాడను. ఆ కథ గంగకవికృత "కుమారరామన సాంగత్య" అను కన్నడగ్రంథము ననుసరించి M. H. Ramasarma, M. R. A. S. గారిచే నింగిలీషులో వ్రాయఁబడినది. అందలి సంగ్రహావిషయము లిందు వ్రాయుచున్నాఁడను. ఇందు, విషయము కొంతగలదు గాని సంపూర్ణముగాదు; సరియైన తెనుఁగునుగాదు.

"తుంగభద్రాతీరమున హంపికి సమీపమునఁ గలకుమ్మట దుర్గమును ముమ్మడిసింగని కుమారుఁడు కంపిలుఁడు పాలించెను. అతని కార్గురు భార్యలు. రత్నాజియను మేనఁగోడలే కడపటి భార్య. హరియమ్మ ప్రథమభార్య. హరియమ్మకు కాటన్న, రామనాథుఁడని యిద్దఱు పుత్రులును మారమ్మ, సింగమ్మయని యిద్దఱు పుత్రికలును గలరు. బైచప్ప, మానమల్లికరాజు, భావభైరవుఁడు నను *ముగ్గురు మంత్రులు. కంపిలుఁడు తన ముసలితనములో కాటన్నకంటెఁ జిన్నవాఁడైనను సమర్థుఁడగుటచే రామనాథునికే రాజ్యపరిపాలనము నప్పగించెను. అతఁడు 16 యేండ్లప్రాయముననే ప్రఖ్యాతవీరుఁడయ్యెను. ఢిల్లీసుల్తాను దక్షిణదేశమునందలి రాజులయొద్దఁ బన్నులు వసూలుచేసికొని రమ్మని యొకపల్లకిలోఁ దన చెప్పులుపెట్టి కొంత సైన్యమును అధికారులను, దాని వెంటను పంపెను. అది రామనాథుని కగౌరవముగఁ దోఁచి పల్లకి విఱుగఁగొట్టి సుల్తాను సేనలను చెల్లాచెదరు చేసెను. ఆసేనలు భయపడి రాజాధిరాజశ్రీ జగదాపియను తెలుగు ప్రభువును గుత్తిలో శరణు చొచ్చెను. జగదాపి సుల్తాను సేనను, తనసేనలును కలుపుకొని రామనాథుని కంపిల దుర్గముపైకి దాడివెడలెను. రామనాథుఁడు జగతాపినోడించెను. జగదాపి తన కూఁతును రామనాథునికిచ్చెను. ఆగెల్పులోని పది గుఱ్ఱములను రామనాథుఁడు తన తండ్రికి, ప్రేమపూర్వకముగాఁ బంపించెను. వానిని అతడు తన యొద్దనుంచుకొనక, తక్కిన కొడుకుల కిచ్చిన కారణ

* రాజమహేంద్రవరములోను, మాళవదేశములోను గూడ ముగ్గురు మంత్రులు.

మునఁ దండ్రికిని గొడుకునకును భేదముకలిగినది...కంపిలుఁడు రామనాథునితో "యప్పతి"రాజును జయించి అతనియొద్దనున్న "బొల్లా" యనుగుఱ్ఱమును దెమ్మని చెప్పినఁ బంతముపట్టి పోయి రామనాథుఁ డప్టేతెచ్చి వోరుగల్లురుద్రరాయనితో యుద్ధముచేసి జయించెను.... ఒక చైత్రమాసములో కంపిలుఁడు వేఁటాడుటకు "హాసనలెకు" వెళ్లినప్పుడు...రామనాథుఁడు తనతల్లిని అమ్మా! మాతాతగారి ముత్యాల బాలియిమ్మని యడిగి పుచ్చుకొని స్నేహితులతోఁగూడి యాడుచుండఁగా రత్నాజి తనసేవకురాలను సంగితోఁగూడ మేడమీఁది యేడవ యంతస్తున నిల్చి రామనాథుని జూచి మోహించి సంగిచేత నొక యుంగరమును మంచి గందమును వానియొద్దికిఁ బంపినది. గందము మాత్రము స్పృశించి తన సవతి తల్లి యుంగరము నతఁడు మరలఁ బంపివైచెను. తరువాత, ఆడుచున్న బంతి రత్నాజీ దొడ్డిలోఁబడినది. దానినడిగి తెమ్మని మొదట కాటన్నను బంపెను. ఆమె యీయలేదు. మరల బొల్లుగడను వానిని బంపెను. ఆమె రామనాథుఁడు వచ్చి తీసికొనిపోవలయునేగాని యితరుల కీయననియెను. రామనాథుఁడు తుదకుఁ దానే వెడలి, ఆమె నిర్బంధమునకు సమ్మతింపనందున (రాజమహేంద్రవరము చిత్రాంగివలెనే) దుఃఖితురాలివలె వేషమువేసికొని దుఃఖాగారమునందుండి రాజు వేఁటనుండి వచ్చినవెంటనే రామనాథునిపై లేనిపోని నిందలుమోపి నమ్మించెను. రాజాలోచింపకుఁడ రామనాథునితల నఱుకుమని యాజ్ఞాపించెను. బైచప్పయను మంత్రి ......రామనాథుని, అతని యైదుగురు భార్యలను తోడివారైన కాటన్న, లింగన్న, సంగన్న, చౌరాడ గంగన్న అను మొదలగు వారితో నేలమాలెములోదాఁచి చంపించినాఁడనని కృతక కర్మలు చేయించెను. రామనాథుఁడు మృతి నొందెనని యెల్ల తావులఁ బ్రకటమయ్యెను. ఈవార్త ఢిల్లీ సుల్తానునకు గొందలు సంతోషముతోఁ దెలియఁజేసిరి......సుల్తాను, లాలాలు, సుజ్జరులు, గౌడులు, పాండ్యులు మొదలగు తొమ్మిది లక్షల సేనలను పోగుచేసి దుశ్శకునములకు లక్ష్యముచేయక నేమిఖానుని యాధిపత్యమున కుమ్మటి దుర్గముమీఁదికిఁ బంపించెను.......ఈవార్తవిని కంపిలుఁడు బైచప్పతో నాలోచించుచుండఁగా, తురకరాయబారులు వచ్చిరి. ఏమియుఁదోఁపక కంపిలుఁడు రామనాథుని చంపుకొంటినని విచారించుచు రాయబారుల మాటలకు సమ్మతింపక తన యోధులను పూటుచేసి గెల్పుగొంటిరా మీకు బహుమాన మిచ్చెదనని తురకల నెదిరింపఁబంపెను. వారు చీఁకటిలో "చోరగండి"యను తావున నివసించిన శత్రుసైన్యము మీఁదఁబడి మర్దించి, వారి గుఱ్ఱములు మొదలగు సామగ్రులను గ్రహించిరి. దానికి నేమిఖాను క్రుద్ధుఁడై కుమ్మటి దుర్గమును ముట్టడింప సైన్యమును బంపెను. ఈసమయమున రామనాథుఁడుండినచో యీయాపద తప్పిపోవునని విచారించెడు కంపిలు నోదార్చి బైచప్ప "నేను పోయి యీసైన్యము నోడించి నేమిఖానును చంపి గెల్పుగొందు"నని బయలుదేఱి భూగృహములో నాలుగెలలనుండి దాఁగియుండిన రామనాథుని సపరివారముగ బైటికి రప్పించి వృత్తాంతముం జెప్పెను..... రామనాథుఁడు "బొల్లా" యను గుఱ్ఱమునెక్కి తన డెబ్బది యిద్దరు సరదారులతో వెడలి శత్రుసైన్యములోనికి దుమికి జయించెను......"

ఇత్యాదిగాఁగల యీకథయంతయు సారంగధర చరిత్రమునకుఁ దగియున్నది. ఇన్నివిధములుగా నున్న చరిత్రము నెవ్వరేవిధముగా మార్చిరో, యెవరికంటె ముందెవరు మార్చిరో తెలిసికొనుటకు నాకు శక్తిచాలదు. ఆది మధ్యాంత శూన్యముగా ముగించిన నన్ను మన్నింతురుగాక!

---

# రుద్రమదేవి

శ్రీ శేషాద్రిరమణ కవులు

అంతఃపురము విడనాడి యెఱుంగని
మగువ సంగ్రామభూములకుఁ జేరె
వాలు కేల ధరించు వైఖరి తెలియని
చెలువ వైరులనెల్లఁ జెండినైచె
గృహకృత్యముల నిర్వహించుటే నేరని
లలన సామ్రాజ్య పాలనమొనర్చె
ఒరులఁగాంచిన యంత నోసరిల్లు పొలంతి
యరిభూమి విభుల వెన్నాడితోలె
ఆంధ్ర సామ్రాజ్యమంతయు నద్వితీయ
విక్రమాతిశయంబున వెలయఁజేసె
కాకతీయ యశఃపతాకంబు నిల్పె
రుచిరవిక్రాంతి దీవి శ్రీరుద్రదేవి.

తొలుతనుండి మేమాంధ్రులము; మాది యాంధ్రజాతియని చాటినవారు కాకతీయులు. చాళుక్యులు, పల్లవులు, చోడులు రాష్ట్రకూటులు ఆంధ్రులా, ఆంధ్రేతరులా యను చర్చకుఁ దావుగలదుగాని కాకతీయులవిషయమున సందేహింపఁ బనిలేదు. విద్యానాథుఁడు ప్రతాపరుద్రుని ఆంధ్రనృపుఁడని, ఏకశిలానగరమును ఆంధ్రనగరమని కాకతీయసైనికులను ఆంధ్రభటులని పేర్కొని వారియాంధ్రజాతీయత సార్థకముగావించెను ఆంధ్రజాతికి, ఆంధ్రదేశమునకు, ఆంధ్రవాఙ్మయమునకు నపారమగు సేవగావించిన కాకతీయనృపాలురలోఁ బ్రథమగణనీయుఁడు ప్రోలరాజు. అంత్యమునఁ బ్రశంసింపఁ దగినవాఁడు ప్రతాపరుద్ర దేవచక్రవర్తి. మున్నొకమారు కాకతీయచరిత్రములను విపులముగఁ జర్చించియుంటిమిగాన నిపుడు కాకతీయచరిత్రహారమున నాయకమణి యనఁదగు రుద్రమదేవి చరిత్రమాత్రము లిఖింతుము.

రుద్రమదేవి గణపతిదేవపుత్త్రి. ఈయమ జననకాలము తెలుపు నాధారములు గానరావు. ఆంధ్రసామ్రాజ్యాధీశ్వరుఁడగు గణపతిదేవ చక్రవర్తికిని సోమదేవికి నీయమ పుత్రిక. గణపతిదేవికి రుద్రమదేవి భార్యయను వాదము భ్రాంతిమూలకము. ఈవాదమునకుఁ గలకారణములు మృగ్యములు. మార్కొపోలో యను ఇటలీదేశ యాత్రికుఁడు ఆంధ్రనగరపరిస్థితులు రుద్రమదేవి రాజ్యవిషయములు గ్రంథస్థము గావించుచు నీయమ గణపతిదేవుని భార్యయనెను. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతయగు కుమారస్వామి.

"పురా కిల కాకతికులసంభూతే గణపతినామ్ని మహారాజే దుహితృమాత్రసంతానే కదాచి ద్దైవయోగేన కాలపరిపాక ముపేయుషి తన్మహిషీ రుద్రదేవీనామ రాజ్ఞీ బహూని వర్షాణి తద్రాజ్య మకంటకం పరిపాల్య దౌహిత్రే ప్రతాపరుద్రే రాజ్యధురం నివధే"

(తాత్పర్యము. పూర్వము కాకతికులమునందు జనించిన గణపతి యనుమహారాజు పుత్రికాసంతానముమాత్రము గలవాఁడై ఒకానొకప్పుడు దైవయోగమున మరణింప నతనిభార్య రుద్రదేవిరాజ్ఞి కొన్ని సంవత్సరములు రాజ్యము నిష్కంటకముగాఁ బరిపాలించి వృద్ధురాలై మనుమఁడగు ప్రతాపరుద్రునకు రాజ్యము నొసఁగె)

ఏకామ్రనాథుఁడు ప్రతాపచరిత్రమున నిట్లేచెప్పెను. కూచిమంచిజగ్గకవి సోమదేవరాజీయమున నిట్లేచెప్పెను. స్థానికచరిత్రములలో నిట్లేకలదు.

ప్రతాపరుద్రీయవ్యాఖ్యాతయగు కుమారస్వామి సోమయాజి ఐదువందలసంవత్సరముల నాఁటివాఁడు. నాటికే రుద్రమదేవి గణపతి దేవుని భార్యయను ప్రవాదము రూఢమైయుండును. సమకాలికుఁడును బాటసారియునగు మార్కొపోలోఁగూడ నిటులె భ్రమపడినవాఁడయ్యెను. ఈ భ్రమకుఁ గారణములు తెలియవు.

సమకాలికులశాసనములు పూర్వాపరగ్రంథములు రుద్రమదేవి రాజ్ఞి గణపతిదేవునిపుత్రియని కంఠోక్తిగఁ జెప్పుచున్నవి. రుద్రమదేవి పరిపాలనము ప్రతాపరుద్రునిపట్టాభిషేకము గాంచిన విద్యానాథ మహాకవి ప్రతాపరుద్రీయనాటకప్రకరణములో రుద్రమదేవి ప్రతాపరుద్రదేవునకు మాతామహియనియు రుద్రదేవనామముతో రాజ్యమేలినదనియు సోమదేవియు గణపతిదేవుఁడాయమకు మాతాపితలనియుఁ జెప్పియున్నాఁడు.

"అన్యథాకథ మీశ్వరప్రసాదాదృతే నిరంకుశం స్త్రీవ్యక్తిని శేషస్య లోకాధిపత్యం? ఏవం మానుషశంభునా గణపతిమహారాజే నాద్భ్యంతర స్యానుభవమహిమ్నః సదృశమత్ర పుత్రఇతి వ్యవహారః కృతః తేషాం గుణానాం రుద్రఇత్యాఖ్యా.

(తాత్పర్యము: ఆమహేశ్వరు ననుగ్రహ మట్లుకానిచో నెడ స్త్రీ వ్యక్తికి నిరంపశమను నిట్టిలోకాధిపత్య మెట్లు చేకూరును? ఇట్లే మాన వశంభుఁడను గణపతినృపాలుఁడు ఈయమప్రభావము చిత్తమునందె ఱింగి తగినట్లు (రుద్రమదేవిని) కుమారుఁడని వ్యవహరించెను. అదను గుణముగా రుద్రాఖ్య యేర్పడెను.)

ఉదాహృతభాగములవలన రుద్రమదేవి గణపతిదేవునిపుత్రియ నియుఁ బుత్రికమహత్త్వము నెఱింగి మానవశంభుఁడను గణపతిదేవుఁడు కుమారుఁడనియె వ్యవహరించెననియు స్పష్టమగుచున్నది. కావుననే శాసనాదులందును గ్రంథములందును రుద్రదేవుఁడని వ్యవహరించియుం డురు. రుద్రమదేవి పురుషవేషముతో సభ కరుదెంచి రాజకీయవ్యవహా రములఁ బరిష్కరించెనని దనుటకు కీసమకాలికాధార మెంతయుఁ బ్రమాణము.

రుద్రమదేవిని పలుతావుల విద్యానాథమహాకవి రుద్రదేవుఁడని వ్యవహరించినాఁడు. రుద్రమదేవి పురుషవేషముతో రంగస్థలమునకుఁ బ్రవేశించుమందుఁగల ప్రతాపరుద్రీయములోని వైతాళికగీతము రుద్ర మదేవి కాకతీయవంశజాతయని కంఠోక్తిగ శాసించుచున్నది.

"యోఽయం జాత స్త్రిలోకీ ప్రథితసుచరితే కాకతీయాన్వవాయే
యస్మై శ్రేయాం స్యజస్రం వితరతి భగవా న్దేవదేవ స్స్వయంభూః;
యస్యాజ్ఞా సర్వపృథ్వీపతి మకుటమణిశ్రేణి కేళీవ యస్యా
సోఽయం భూపాలమౌళి ర్జయతి గుణమహా న్రుద్రదేవో నరేంద్రః.

(తాత్పర్యము: ఎవఁడు (రుద్రమదేవి) త్రిలోకప్రసిద్ధమగు కాక తీయాన్వయమున జనించెనో ఎవనికి స్వయంభూస్వామి నిత్యము శుభ ములఁ బ్రసాదించునో యెవని యాజ్ఞ రాజులకు మకుటభార్యమో ఆ రుద్రదేవనరేంద్రుఁడు జయముల నొందుచున్నాఁడు.)

యో రుద్రః రజతాచలే స్థితి మగా దర్ధాంగనారీః పురా
సోయం సంప్రతి కాకతీశ్వరకులే సర్వాంగనారిస్థితః

(ఏరుద్రుఁడు రజతాచలమునందు అర్ధాంగనారీశ్వరుఁడైయుండె నో యతఁ డిపుడు కాకతీశ్వరుని వంశమునందు సర్వాంగస్త్రీయై యున్నాఁడు.)

ఈ రెండుశ్లోకములు రుద్రమదేవిప్రవేశమును దెలుపు వైతా ళికగీతములు. మొదటిశ్లోకమునఁ గాకతీయవంశజుఁడని పేర్కొనఁ బడిన రుద్రమమహారాజే సర్వాంగస్త్రీయగు రుద్రమదేవి. ఈయమతల్లి సోమదేవి. తండ్రి గణపతిదేవుఁడనుట కుదాహృతవచనము గాక మఱి యొక శ్లోకముగూడఁ గలదు.

శ్లో. సైవసోమా చేతినిర్దిష్టా సోమా చేతిప్రథా మగాత్;
తనమాతా శివాసాక్షా ద్దేవో గణపతిః పితా.

(తాత్పర్యము: ఆమె ఉమయని పేరొందెఁగాన సోమయని చెప్పబడినది. కానసోమయనుపార్వతి నీతల్లి. సాక్షాన్మహేశ్వరుఁడగు గణపతి దేవుఁడునీతండ్రి యని శ్లోకభావము)

దీనివలన గణపతిదేవుఁడు రుద్రమదేవి తండ్రియనుట స్పష్టము. వ్యాఖ్యాత యీగణపతిదేవుఁడు రుద్రమదేవి తండ్రియగు నింకొకగణ పతిదేవుఁడనుట భ్రాంతిమూలము అట్లు తలంచినచో బాధకములు చాలగలవు. కాన ప్రతాపరుద్రీయమతము ననుసరించినచో రుద్రమ దేవి గణపతిదేవుని పుత్రియని నిర్ణయమగుచున్నది. ఈయంశమును స్థాపించు మల్కాపురశాసనమును శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రములో నుదాహరించిరి. రుద్రమదేవి కాలములోనే యామె యనుమతిగా గణింపఁదగిన విశ్వేశ్వరశంభుఁడు స్థాపించిన యీమల్కాపురశాసన మీయంశమును గృహపతిచుటలోఁ బరమప్రమాణముగ నున్నది.

"కతికతి న సంతి భూపాః కతికతి వా సుగుణగణాభరణాః.
గణపతినృపతి స్త్వేకో నరపతిశత పోషకః క్షోణ్యామ్;

* * * * *

రుద్రదేవీ సముదభూ త్కారుణ్యా త్సర్వభూభృతామ్,
గంభీరా న్మహత స్తస్మా ల్లక్ష్మీ రత్నాకరాదివ;

సర్వోర్వీశ కిరీటపట్టిమకుటే విన్యస్త పాదాంబుజా,
తా స్త్యేషా చతురంబురాశిరసనాం శ్రీరుద్రదేవీభువమ్;
యస్యా జన్మమహోత్సవో గణపతేః క్ష్మాపాలమూడామణేః,
విస్ఫూర్జ త్కలికాలకల్మషకథా ధ్వాంతౌఘ తేజోనిధిః;
సామ్రాజ్యే ఖలవర్జితం విరచితే శ్రీరుద్రదేవ్యాస్స్వయమ్,
చాతుర్వర్ణ్య నిజస్థితి ర్విజయతే విద్రాతి కాలః కలిః.

గణపతిదేవచక్రవర్తికిఁ దనయయై రుద్రమదేవిజనించి రాజులనందఱ లోఁగొని భూమండలమేలుచున్నదనియు గణపతిదేవుఁడు స్వయముగా రుద్రమదేవికి జన్మదినోత్సవమునందుఁ బట్టాభిషేకము గావించెననియుఁ బైశ్లోకములభావము.

ఈశాసన మెంతేని విలువగలది. గణపతిదేవుఁడు వార్ధకమున స్వయముగాఁ బుత్రియగు రుద్రమదేవికిఁ బట్టాభిషేకము గావించినయం శమును సమకాలికమగు నీశాసనముచెప్పుటచే నిదినిస్సంశయము. రుద్ర మదేవి గణపతిదేవునిపుత్రియనుట కీయాధారములుగాక యింక నేమే నియున్నచో నమూల్యమగు నీయంశము సిద్ధాంతముకాఁగలదు.

*స్వస్తి శ్రీకాకతీశో గణపతినృపతి
స్తస్య సాధ్వీ ద్రమాంబా పుత్రీ లోకైకవీరా

---

* ఈశాసనము నిజామాబాదుజిల్లాలో నొకబోయవానికిఁ జిక్కఁగా నైజాముదొరతనమువారిశాసనపరిశోధకసంఘమువారికి సంక్రమించినది. ఇది నాగరిలిపిలోనున్నది. నిజాముకాలేజి ప్రొఫెసరు సిరుగూరి హనుమంతరావు యం. ఏ. యల్. టి. వారి వద్దనున్న తామ్రఫలకములఁజూచి యుదాహృతభాగము వ్రాసికొంటిమి.

జని రజనిపతే ర్నిష్కలంకా కలేవ; త
స్యాం పృథ్వీముదగ్రై రరిదమనభయో వేజితై ర
ర్జయన్త్యాం లోకోద్దీపైః ప్రతాపై రకృతసుకృతి
నా మగ్రగేరగ్రహారం.

శూరభూపాలుని కోటగిరి తామ్రశాసనము.

ఈ శాసనకాలము శా. శ. 1195 సరియగు క్రీ. శ. 1273 ఇది రుద్రమదేవి కాకతీయసామ్రాజ్యమునకు గణపతిదేవుని పాలనమున యువరాజుగానున్న కాలము. శాసనకర్తయగు శూరమహీపతి రుద్రమదేవి సేనానాయకుఁడుగ కోటగిరిలోనుండి యీశాసనము వ్రాయించెను. సమకాలికముగాన నిందలియంశము విశ్వసనీయము.

"తత్పుత్రో గణపతినామధేయో సంజజ్ఞే జలనిధిమే
ఖలాం భువం యః; దోస్తంభే మణివలయం చకార
శతై ర్దిగ్నాగైః ఫణిపతినా కథంచిదూఢాం; జాతాతస్య
పయోనిధేరివ రమా శ్రీరుద్రదేవీసుతా భాస్వద్భిన్న నృప
మౌళిరత్ననివహై ర్నీరాజితాంఘ్రిద్వయా త్యాగేన త్రిదివ
ద్రుమాన్ దశదిశః కీర్త్యా ఘనానాం హతిం లక్ష్మ్యా కించ భు
జాబలేన విజయం న్యక్కుర్వతిర్వర్తతి. భాగ్యై ర్విశ్వస్య
తస్యాః పతిరభవ దథో వీరభద్రాభిధానః.

పోతినాయకుని సోలను పాకశాసనము.

ఈశాసనము రుద్రదేవిబంటగు పోతినాయకుఁడు స్థాపించినది. శాసనశిల పయిభాగము విరుగఁగొట్టఁబడినది. అందుచే శకాబ్దముగల భాగము నశించినది. పోతినాయకుఁడు రుద్రమదేవిబంటుగాన నీశాసనము రుద్రమదేవిరాజ్యకాలమున స్థాపింపఁబడినది. ఇందు రుద్రమదేవి భర్త నామము వీరభద్రాభిధానుఁడని కూడఁ గలదు. చరిత్రవిదుల కపరిచయనామమగు రుద్రదేవిభర్తపే రీశాసనమువలనఁ దెలియుట యొకవిశేషము. ఈశాసనశిల కొలనుపాక సోమనాథాలయమున నున్నది.

"దుర్వార దోర్విక్రమవైరివీర భూపాలవాతాశనవైనతే
యః; ప్రత్యర్థిపృథ్వీపతికుంజరేంద్ర విదారణక్రీడన
మోదమానః; ప్రభూతవిఖ్యాతపరాక్రమోభూత్తదం
గభూ శ్రీగణపత్యధీశః స్ఫురజ్జయ శ్రీమతి రుద్రభూ
పతీ తదాత్మజా కుర్వతి రాజ్యమున్నతమ్; విరోధిదా త్రీ
పతి గర్వపర్వతి క్షమాధర ద్వేషిణి రాజభూషణి.

శార్ఙ్గపాణిదేవుని పానుగల్లు శాసనము.

ఈశాసనము నల్లగొండచెంతగల ఛాయా సోమేశ్వరాలయములో నున్నది. ఈపానుగల్లు నల్లగొండకు నాలుగుమైళ్లదూరమునందున్నది. రుద్రమదేవి రాజ్యముచేయుచుండు కాలమున నీశాసనము స్థాపింపఁబడినది. శా.శ. 1189 (సరియగు 1267 క్రీ.శ)లో శార్ఙ్గపాణిరాయలు సూర్యగ్రహణమునఁ గొంతభూమి దానమిచ్చినటుల నీశాసనశిలపైన నేకలదు. గాన రుద్రమదేవికాలమున స్థాపింపఁబడినదిగాన నీశాసనము ప్రమాణము. ఇందు రుద్రమదేవి గణపతిదేవుని పుత్రియని స్పష్టముగాఁ జెప్పఁబడినది.

ఇనుగుర్తిలోని విష్ణ్వాలయము ముందున్న నాగరలిపిశాసనములోఁగూడ గణపతిదేవునిపుత్రి రుద్రమదేవియని గలదు.

వచన సోమరాజీయమునందుఁగూడ రుద్రమదేవి గణపతిదేవుని పుత్రియని వ్రాయఁబడియున్నది.

పదునాలుగవ శతాబ్దమున లిఖింపఁబడిన అనితల్లి కలువచేరు శాసనములో గణపతిదేవునిపుత్రి రుద్రమదేవి యని స్పష్టముగా వ్రాయఁబడియున్నది. చూడుఁడు.

"పిత ర్యుపరతే తద్వ దరక్ష దఖిలాం క్షితిమ్; వీరరుద్రమ
దేవీతి దుహితా మహితాగుణైః. అథ సా రుద్రమదేవీ ప్ర
తాపరుద్రే హృతారినృపభద్రే దౌహిత్రే సుచరిత్రే సర్వా
మూర్వీం నిధాయ ముదితవతి.

రుద్రమదేవి గణపతిదేవుని యనంతరము రాజ్యమేలుటయుఁ బిదప దౌహిత్రుఁడగు ప్రతాపరుద్రునకు రాజ్యము నొసంగుటయు నీశాసనమునందుఁ జెప్పఁబడెను.

క. వెండియు గణపతి ధరణీ
మండలపతిపుత్రి రుద్రమహదేవి కొగిన్
దండాధినాథులై భో
గండును పెగడన్న మనుమగన్నయ లెలమిన్.

శివయోగసారము కృత్యాది.

ఈగ్రంథము కొలనియాదిగణపతి దేవకృతము. ఇతఁడు దాదాపు శ్రీనాథునకు సమకాలికుఁడు. కాకతీయరాజుల విషయము లిక్కని చాలవఱకుఁ జరిత్రానుకూలముగఁ జెప్పెఁగాన నితఁడు వ్రాసినది ప్రమాణముగ భావింపఁదగును. ఈయంశమే యిటీవల రచింపఁబడిన వెంకటగిరి సంస్థాన చరిత్రమునందుఁగూడ నీ క్రిందివిధముగఁ జెప్పఁబడినది.

తే. గీ. ఘనత ప్రసాదాదిత్యుండు కాకతిగణ
పతి చేసిన నతనిసుతకుఁ బట్టణంబు
రమణతోఁగట్టి కాకతిరాయరాజ్య
స్థాపనాచార్యబిరుదు దాఁదనరఁగాంచె.

ఉదాహృతప్రమాణములవలన రుద్రమదేవి గణపతిదేవునిపుత్రి యనునంశము రూఢమగుచున్నది. గణపతిదేవునకు రుద్రమదేవి భార్య యనితొలుతఁ జెప్పినవాఁడు మార్కొపోలో యను ఇటలీయాత్రికుఁడు. ఇతని కాంధ్రదేశపరిస్థితులు తెలియవు. ఆంధ్రభాష రాదుగాన నీతని యూహలు త్యాజ్యములు. రెండవవాఁడు ప్రతాపరుద్రీయవ్యాఖ్యాతయగు కుమారస్వామి సోమయాజి. ఈయన మూలమునకు వ్యతిరేకముగా వ్యాఖ్యవ్రాసి ప్రమాదములపాలయ్యెనుగాన నీతనినిర్ణయము సిద్ధాం

తముగాదు. సర్వవిధముల రుద్రమదేవి గణపతిదేవుని పుత్రియనుటయే సత్యమునకుఁ జరిత్రమునకుఁ జేరున. పతివ్రతామతల్లియు, వీరశిరోరత్నము, కార్యఖడ్గకౌశలవతియు నగు శ్రీరుద్రమదేవిజీవితచరిత్రము నించుక చర్చింతము.

## రుద్రమదేవి కుటుంబము

రుద్రమదేవి కాకతివంశమునందు జనించెను. కాకతియను దేవత భక్తులుగాన నీవంశజులు కాకతీయులని పేరొందిరి. కాకతి జైనదేవతయనియు నీవంశమునఁగల ప్రోలరాజాదులు జైనులుగాన నీయూహ విశ్వసనీయమనియుఁ బలువురి తలంపు. ఒరంగంటిలో కాకతమ్మగుడి యున్నటులఁ గ్రీడాభిరామములోఁ గలదుగాని యిపుడా క్షేత్ర మంతరించినది. కుమారస్వామి కాకతియనునామె దుర్గయని తలంచి "కాకతిర్నామదుర్గా శక్తి రేకశిలానగరేశ్వరాణాం కులదేవతా; సా శక్తి ర్భజనీస్యేతి కాకతీయాః" అని చెప్పియున్నాఁడు. కాకతిదుర్గ కానిండు; జైనదేవత కానిండు. కాకతిదేవిని పూజించుకతననే వీరలు కాకతీయులైరి.

కాకతీయులు తొలుతఁ బశ్చిమచాళుక్యులవద్ద సేనానాయకులు. ఆరాజ్యము నశించినపిదపఁ బ్రోలరాజు హనుమకొండలోఁ దొలుత స్వతంత్రరాజ్యము నెలకొల్పెను. ఈయన కిరువురుకుమారులు. మొదటివాఁడు రుద్రదేవుఁడు. మా రుద్రదేవుఁడు విద్యాభూషణుఁడు; భాషావిదుఁడు; ప్రౌఢకవి. సంస్కృతాంధ్రములలో నితఁడు పెక్కుగ్రంథములు రచించెనఁటగాని యిప్పుడవి గోచరింపవు. ఈతని బలవంతముగఁ జంపి సోదరుఁడగు మహాదేవరాయలు రాజయ్యెను. మహాదేవరాయల జైత్రపాలుఁడను యాదవరాజు చంపెను. అనంతరము గణపతిదేవుఁడు ఆంధ్రదేశమున కధీశ్వరుఁడయ్యెను. ఈయనభార్య సోమదేవి. ఇతని తల్లి బయ్యమాంబ. గణపతిదేవుఁడు క్రీ. శ. 1199 మొదలు క్రీ. శ.1260 వఱకు అఱువదిసంవత్సరములు రాజ్యముపాలించి వృద్ధావస్థలో మరణించెను. గణపతిదేవునకుఁ బుత్రసంతానములేదు. రుద్రమదేవి గణపాంబయను పుత్రికలుమాత్రము గలరు. రుద్రమదేవిని గణపతిదేవుఁడు కుమారుఁడని ప్రకటించినట్లు ప్రతాపరుద్రీయమునందు గలదు. తరువాత నీయమను స్త్రీయని యెట్లువ్యవహరించిరో యీవ్యవహారమునకు గణపతిదేవుఁ డెట్లుపాటుపడెనో తెలియదు. రుద్రమదేవికిఁ దనయంత్యకాలమున ఆంధ్రసామ్రాజ్యమునొసంగి గణపతిదేవుఁడు పట్టాభిషేకము గావించెను. గణపతిదేవుని కాలమున అనంతరమున ఈయమను గాకతీయవంశజుఁడగు కాకతి రుద్రదేవుఁడని సేనానాయకులు విద్యానాథుఁడుసైతము వ్యవహరించిరి. భర్తృవంశనామమీయమ కేలసంక్రమింపలేదో తెలియదు. రుద్రమదేవిభర్త వంశాదికములు విశేషాంశములు నేటివఱకుఁ దెలియవు. కొలనుపాక పోతినాయకుని శాసనములోమాత్రము ఈక్రింది శ్లోకములు గలవు.

"జాతాతస్య పయోనిధే రివ రమా శ్రీరుద్రదేవీసుతా;

*       *       *       *       *       *       *

భాగ్యై ర్విశ్వస్యతస్యాః పతి రభవ దథో వీరభద్రాభిధానః;
సౌందర్యేణేందు మహ్నం పతి మపి మహసా మందభాసావి
తన్వ్ *       *       *  యద్వైవగ్ధం విదగ్ధాయదురవిత
రణం యాచకోదూయదాజ్ఞాం రాజానో యత్ప్రతాపం
విమతనృపతయోర్జానతే జ్ఞాతభావాః జ్యేష్ఠశ్చాలుక్య
వంశార్ణవ *       *       *       *

రుద్రమదేవిభర్త వీరభద్రదేవుఁడనియు నతఁడు జ్యేష్ఠచాలుక్య వంశజుఁడనియు నుదాహృతభాగములవలనఁ దెలియుచున్నది. ఆవలిభాగము భిన్నమగుటచే ముఖ్యచరిత్రాంశము లిట మరుగుపడినవి. ఈశాసనమునందె దానములొసంగుతావున రుద్రమదేవిభర్తయగు వీరభద్రదేవుఁ డీక్రిందివిధముగాఁ బ్రశంసింపఁబడినాఁడు:

'వీరేందు శేఖర నరాధిపనందనేన చాళుక్యవంశమణినా
ప్రతిపాదితాసా త్రింశన్నివర్తనసముద్వహన ప్రవీణః'

ఈవీరేందుశేఖరుని కొడుకే రుద్రమదేవిభర్తయనియుఁ జాళుక్యవంశమణియనియు స్పష్టము. రుద్రమదేవి జన్మముచేఁ గాకతీయవంశజురాలనియు భర్తృసంబంధముచేఁ జాళుక్యస్నుష యనియు స్పష్టమైనది. కాకతీయులు దుర్జయవంశజులనియు చతుర్థాన్వయులనియుఁ జెప్పుకొనిరి. చాళుక్యులు చంద్రవంశజులగు క్షత్రియులు. వీరల కెట్లు బాంధవ్యములు కుదిరెనో తెలియదు. రుద్రమదేవి భర్తయగు చాళుక్యవీరభద్రుఁడు సామాన్యుఁడు కాఁడు. వీరచూడామణి. సుందరాకారుఁడు. కార్యఖడ్గప్రవీణుఁడు గణపతిదేవుని యనంతరము రుద్రమదేవి రాజ్యపాలనము వహించుతఱి నీతఁడు రాజకీయ వ్యవహారములఁ జూచుచు రాజ్ఞియం దిరువురు కుమారులనుబడసి యే స్వతంత్ర సంగరములోనో మరణించియుండును. రుద్రమదేవి కిరువురుపుత్రికలు గలరు. ఒకతె ముమ్మడమ్మ. మఱియొకతె, రుయ్యాంబ. ముమ్మడమ్మ చాళుక్య వీరభద్రుని భార్యయని స్థానికచరిత్రములలోఁ గలదు. ఇది ప్రమాదము. ముమ్మడమ్మభర్త మహాదేవరాయలు. ఈయంశమును దెలుపు నితరాధారములు గలవు. ఈమహాదేవరాయలు నిడదవోలు పురాధీశుఁడని యొకవాదము గలదు. నిడదవోలు పురాధీశులలో నొకఁడగు మహాదేవరాయల శాసనములు ప్రతాపరుద్రుని రాజ్యకాలమునుండియే కనంబడుచున్నవి. కాన నీతఁడు వేఱొకఁడనియు సామంతవర్గములోని వాఁడనియుఁ దలంపనగును. రుద్రమదేవి కల్లుఁడె యైనచో సామ్రాజ్యమునువదలి చక్రవర్తియైన తనకుమారుఁడగు ప్రతాపరుద్రునివదలి తన స్వల్పసంస్థానమున కంత్యకాలమున రాఁబనియుండదు. ఈమహాదేవరాజు కాకతీయవంశమునకుఁ జెందిన వేఱొక మహాదేవుఁడైయుండును. కాకున్నచోఁ బ్రతాపరుద్రుఁడు కాకతీయుఁడగుట పొసఁగదు. రుద్రమదేవి కుమారునిగాఁగైకొనుటచేఁ

బ్రతాపరుద్రుఁడు కాకతీయుఁడయ్యె ననుపక్షమున విశ్వసనీయము గాదు. మహాదేవరాజు పూర్వోత్తరములు భావిపరిశోధనమునఁగాని తేల నవకాశములులేవు. రుద్రమదేవి రెండవ పుత్రి రుయ్యాంబను ఇందులూరిఅన్నయదేవుఁడు పెండ్లాడెను. ఈయన్నయ దేవుఁడు నియోగియని శివయోగసారమునఁ గలదు. క్షత్రియులు తనువాట స్థుఁడుగఁ జెప్పుకొనుచున్నారు. ఈవిషయ మింక విమర్శనపాత్రముగ నున్నది.

## రుద్రమదేవి పరిపాలనము

ఈయమ క్రీ. శ. 1262నుండి 1295వఱకు రాజ్యమును బాలించెను. శాసనములందు తఱుచుగ ఈయమను రుద్రదేవుఁడని వ్యవహరించిరి. ప్రతాపరుద్రీయములో బ్రతాపరుద్రునకు రుద్రదేవుఁడు తండ్రియనికలదు. రుద్రమదేవికి రుద్రదేవుఁడను వ్యవహారనామ ముండుటచేతను రుద్రమదేవి ప్రతాపరుద్రుని బుత్రునిగఁ దత్తుగైకొనుటచే తను నిట్లు విద్యానాథుఁడు వ్రాసెను.

స్వీకృతే పుత్రభావేన దౌహిత్రే ప్రాజ్ఞమాజ్ఞయా;
అస్మిన్నిధేహి భారేయే సర్వే ముర్వీధురా మితి.

"రాజ్ఞాక్షత్రియ మౌళిమండనమణి స్తాతస్యసానుగ్రహః"

"శిరసికృతస్తాతస్యనియోగః"

"కింరాజ్యేన శమోన్ముఖం రచయతా తాతాంఘ్రులాలంబనం"

"భవతాపిపృమాణ్ కుమారః"

"పిత్రా స్వయంభూపతినోపదిష్టం ప్రతాపరుద్రస్య మహాభిషేకం"

ఈయుదాహృతభాగములవలన రుద్రమదేవి ప్రతాపరుద్రుని దత్తస్వీకృతి గావించిన విషయమె గాక రుద్రమదేవి ప్రతాపరుద్రుని కుమారునిగను ప్రతాపరుద్రుఁడు రుద్రమదేవిని తండ్రిగను వ్యవహరించినవిషయము స్పష్టపడఁగలదు. రుద్రమదేవిఁ బ్రతాపరుద్రుఁడు తన యుఁడని విశ్వేశ్వరశంభుఁడీయంశమును మనస్సునం దుంచుకొనియే మల్కాపురశాసనమునం దీక్రిందివిధముగా వ్రాసియున్నాఁడు.

"శ్రీవిశ్వేశ్వర దేశికేంద్ర శివహస్తోద్భాసి దోర్విక్రమ.
స్త్రీక్షోణీశ జగద్దశః ప్రతిబల ప్రధ్వంసిజన్మక్షమః;
యస్యాః కాకతి వంశమౌక్తిక మణిః శ్రీరుద్రదేవస్సుత
స్తస్యాః కింకథయామ వైభవమహో శ్రీ రుద్రదేవ్యాఃపరం"

విద్యానాథుఁడు ప్రతాపరుద్రుని గణపతిదేవునకు మనుమఁడని చెప్పినాఁడు. రుద్రమదేవికిఁ బ్రతాపరుద్రుఁడు దత్తసంబంధముచేఁ గుమారుఁడు గాన గణపతిదేవునకుఁ బ్రతాపరుద్రుఁడు మనుమఁడైనాఁడు. కావుననే ప్రతాపరుద్రుఁడు గణపతిదేవునినప్త (మనుమఁడని) విద్యానాథుఁ డిట్లు ప్రతాపరుద్రీయమున వ్రాసెను.

"యస్త్వద్గోత్ర మహత్తరస్య జగతాం త్రాతు స్స్వయంభూ విభో
స్తత్తాదృక్చరితాద్భుతై ర్మహిమభి స్సీవ్యా ద్వితీయోఽభవత్;
దేవోఽసౌ గణపేశ్వరః ప్రతికలం స్వాగ్రప్రసాదోన్ముఖో
నప్తుస్తే కులమండనస్య మహతీం పుష్ణాతు రాజ్యశ్రియమ్"

ఈవాక్యము గణపతిదేవుని విద్యాంసులది. వంశజులమహిమ జూపుచు మృతుఁడగు గణపతిదేవుఁడు కాకతీయుల కులదైవతమగు స్వయంభూదేవునివలె నుండెను. ఆగణపతిదేవునకు మనుమఁడు ప్రతాపరుద్రచక్రవర్తి. ఈయంశమును జెప్పుటలో వ్యాఖ్యాతయగు కుమారస్వామిసోమయాజి ఈగణపేశ్వరుఁడు గణపతిదేవస్థాపిత మహేశ్వరుఁడనియుఁ గాన రాజునకు శివునకు నిటనభేదోపచారముగాన వీరరుద్రుఁడు శివునకు మనుమఁడని వ్యవహరింపఁబడెననియు విచిత్రవ్యాఖ్య గావించినాఁడు. ఇట్టిప్రమాదములు మూలవ్యతిరేకాభిప్రాయములు ప్రతాపరుద్రీయవ్యాఖ్యలోఁ దఱచుగాఁ గలవు. అవి చరిత్రనిర్ణయమున కడ్డుపడుచున్నవి.

రుద్రమదేవి రుద్రదేవుఁడనుపేరుతో రాజ్యమేలుచుఁ బ్రతాపరుద్రునిఁ గుమారునిగఁ జెప్పుకొనెనని యుదాహృతభాగములవలన సిద్ధాంతమగుచున్నది. రుద్రమదేవికిఁ బుత్రికాసంతానము మాత్రముండుటచేఁ దనయనంతరము రాజ్యము పరిపాలకునేమో యని విచారపడెను. పుత్రికలకును సంతానము గలుగకయుండెను. అందుచే నీయమ యిష్టదైవతలకు సంతానార్థియై మహోత్సవములు జరిపించెను. మొగిలిచర్ల ఏకవీరాదేవికి బంగారుకవచము చేయించెను. వడ్డిపల్లి వినాయకునకు స్వర్ణభూషణముల నొసంగెను. ఐనవోలు మైలారుదేవునకు దివ్యమగు నాలయముగట్టించెను. స్వయంభూస్వామియాలయమున మహోత్సవముల జరిపెను. ఈమహోత్సవఫలితమె పుత్రియగు ముమ్మడాంబయందుఁ బ్రతాపరుద్రమహారాజ జననముగఁ జరిపించెను. రుద్రమదేవి చిరకాలము రాజ్యముపాలించిన పిదప సామ్రాజ్యమును గుమారుఁడనఁబడు ప్రతాపరుద్రునకుఁ బట్టాభిషేకము గావించెను. ఈ యంశము ప్రతాపరుద్రీయమునందలి "చిరమాసక్తాం ధురం" అను వాక్యమువలన రూఢమగుచున్నది.

## రుద్రమదేవిపరిపాలనము

గణపతిదేవుఁడు కుమారుఁడని రుద్రమదేవిని వ్యవహరించెను. అందుచే నీయమ కొంతకాలము యువరాజపదవియందుండి రాజ్యవ్యవస్థ తిలకించి యుండుననుట సత్యము. కావుననే గణపతిదేవుని రాజ్యపాలనకాలమందుఁగూడ రుద్రమదేవి దానములు కనఁబడుచున్నవి. విశ్వేశ్వరశంభుఁడు, సామంతశూరుఁడు, శార్ఙ్గపాణి, ఘాతినాయకుఁడు మున్నగువారు గణపతిదేవుని రాజ్యకాలముననే రుద్రమదేవి త్యాగౌదార్యములఁ బ్రశంసించిరి, అంతియగాదు. రుద్రమదేవిని గణపతిదేవు పుత్రియనికూడ వ్యవహరించిరి. ఇందుచే రుద్రమదేవి స్త్రీవ్యక్తియని గణపతిదేవునికాలముననే వ్యవహరింపఁబడెననియు గణపతిదేవుఁడు పుత్రుఁడని చేసినప్రచారము ఎంతకాలమొ నిలువలేదని యు భావింపనగును.



సికంద్రాబాదు బాలికా పాఠశాలోపాధ్యాయులు.



శ్రీ సి. యన్. నల్లముత్తు అమ్మాళుకన్య వీడుకోలు.



బాల్యవివాహ నిరోధశాసనమును బలపరచు స్త్రీలమహాసభ, చెన్నపురి.

అనుమకొండ సామాన్యదుర్గముగాన శాత్రవులయొత్తిడి యెక్కుడయ్యెను. అందుచే నాస్థలము కాదని యనుకూలప్రదేశమును నిర్ణయించి ప్రోలరాజు ఒకయఖండశిలను బొడ్డురాయిగ నేర్పఱచి రామారణ్యత్రిపాదుల యాజ్ఞచే ఏకశిలానగరమును నిర్మించెను. రుద్రదేవుఁడు శివయంత్యకాలమున రాజ్యమును అనుమకొండనుండి ఓరుగంటికి మార్చుకొనెను. అనంతరము గణపతిదేవుఁడు పరిపాలనమునకువచ్చి ఓరుగల్లుకోట నింకను పెంపుచేసి వీథులఁదీర్చి పుట్టకోటను గట్టి పఱచి ఓరుగల్లుపురమున గొప్పసంత యేర్పఱచెను. రాజ్యము సర్వసంపత్సమృద్ధితో నలరారుచుండెను. పిదప రుద్రమదేవి ఏకశిలానగరరత్నసింహాసనము నెక్కి ప్రజారంజనముగఁ బరిపాలించెను. ఈమె ఓరుగంటికోట కెన్నియో మంచియేర్పాటులఁ జేసెను. రుద్రమదేవి ఓరుగంటికోటకుఁ గావించిన కట్టుదిట్టములు, ఏర్పాటులు స్థానికచరిత్రమునం దీక్రిందివిధముగాఁ జేర్కొనఁబడియున్నవి.

"తొలుతం జేయఁగ మిగిలిన కలుకోట నీయమ మహోన్నతంబుగాఁ గట్టించెను. తనప్రజలుండుటకు భూమికోట వేయించెను. అనుమ యున్నతంబుగాఁ బుట్టకోట వేయించెను. కలుకోటకు నాలుగు గవనులను, నాలుగుదిడ్డులను నేర్పఱచెను. భూమికోట కనిమిదిగవనుల, పదియాఱుదిడ్ల నేర్పఱచెను. అనేకశివాలయములఁ గట్టించెను. సకలజనంబులు తన్నంబాయని పలుకుటం జేసి అంబాలయను గ్రామము కట్టించెను. నిజనామంబున వేయిరుద్రవరములు గట్టించెను. అష్టదిక్కుల జయస్తంభము లెత్తించి మహావైభవముతో రాజ్యమేలుచుండెను.

రుద్రమదేవి ఒరంగంటికోటలోనున్న కాకతమ్మబావియు, శోభనాలబావియు, శిలాద్వారములు నాలిగింటిని, ఐనవోలు మైలారుదేవునకిట్టినె నాలుగుశిలాద్వారములును, కట్టించెనని స్థానికులు చెప్పుదురు. ఒరంగల్లుకోటలోని అక్కచెల్లెండ్రబావి రుద్రమదేవి గణపాంబ గట్టించెనని కొందఱు చెప్పుదురు. స్వయంభూదేవాలయమున కీయమ యెంతోశిల్పమును సమకూర్పఁజేసెనటఁగాని యవనవిప్లవములలో నాయాలయరాజము పూర్తిగఁ జెడఁగొట్టబడినది. రుద్రమదేవి రాజమందిరములపై నిలిపిన హేమకుంభములపయిగల బంగారులొడ్డులు విరోధిరాజులు హరించిరి. లోన నిముడ్చు శిలాకుంభము లిపుడు చెంగటగల గోరీలదొడ్డిపైఁ బెట్టఁబడియున్నవి. ఈచిహ్నములు రుద్రమదేవి సంపత్పరిపాలనమునకుఁ దార్కాణగనున్నవి.

స్త్రీకి అంకితులుగనుంట సావంతుల కవమానముగనుంటచే గణపతిదేవుని కాలమునుండి లోఁబడియున్న రాజులందఱు రుద్రమదేవిని దిరస్కరించి పన్నులొసంగక తిరుగఁబడిరి. జన్నిగదేవసాహిణి, గంగయసాహిణి, సామంతశూరుఁడు, త్రిపురాంతక మహారాజు, శార్ఙ్గదేవుఁడు, గోనగన్నారెడ్డి, నాగదేవరాజు, భోగరాజు, ప్రెగడన్న, మనుమగన్నయ్య, రుద్రప్రగడ, ప్రాసాదాదిత్యనాయకుఁడు మున్నగు ఆంధ్రసేనానాయకరత్నములు ప్రతిపక్షులనడంచి సామ్రాజ్యక్షేమము సంతరించుటలో మిగులఁ బాటుపడిరి. శివదేవుఁడు వీరశైవమతప్రచార మటులనుంచి శిథిలముకానున్న కాకతీయసామ్రాజ్యమును నిలువరింప నడుముకట్టి ముందు నిలచెను. రుద్రమదేవి స్వత్వము శక్తిసామర్థ్యాదులు స్పష్టపడువఱకుఁ బ్రతిపక్షులెల్లరు శక్తికొలంది ప్రతిఘటించుచు వచ్చిరి. అట్లు ప్రతిఘటించినవారిలో దేవగిరియాదవులు, కటకేశ్వరులు, మల్లికార్జునుఁడు, దామోదరరాయఁడు, సిద్ధయదేవచోడుడు, కదంబరాజు ప్రభృతులు ముఖ్యులు. కడప కర్నూలు మండలములలోఁ జోడులు, ద్రవిడమండలములలోఁ బాండ్యులు, తొండమండలములో క్షత్రియులు, ఆంధ్రమండలములలోని వెలనాటిచోడులు తిరుగుబాటునకు సిద్ధమైరి. కటకపల్లభుఁడు స్వాతంత్ర్యము ప్రకటించెను. శివదేవుని కార్యనైపుణి ప్రతినిధుల స్వామిభక్తి తన యద్వితీయపరాక్రమము సహాయముగాఁగొని రుద్రమదేవి యాంధ్రరాష్ట్రమునంతయు స్వాధీనపఱచికొనెను. కమ్మవీరులు రెడ్డిశూరులు వెలమవజీరులు రుద్రమదేవి కన్నివిధముల నండగానుండి స్వామిభక్తి ప్రకటించుటయే రుద్రమదేవి కద్వితీయవిజయము గలుగుటకుఁ గారణమయ్యెను.

రుద్రమదేవి తనపుత్రికలతో క్షేత్రసందర్శనమున కేఁగినపుడా యమ సవతికుమారులగు హరిహరరాయలు, మురారిదేవుఁడు పరివారముతోఁ జుట్టములవలె నగరములోఁ బ్రవేశించి రుద్రమదేవి లోనికి రాకుండ ద్వారములు మూయించిరి. రుద్రమదేవి బైటికోటలనుండి బలమును రప్పించి నెలలతరబడి పోరాడి ఓరుగంటికోట నాక్రమించుకొని సవతికుమారులకు ఇతరరాజద్రోహులకు నుచితశిక్షల విధించెను. రుద్రమదేవిచే నోడింపఁబడిన రాజులందఱు కుట్రజేసి దేవగిరిపాలించు మహాదేవరాయలఁ బ్రోత్సహించి 'మేమందఱము నీ కంకితులమగుదుము. ఓరుగల్లురాజ్య మాక్రమించుకొ'మ్మని ప్రోత్సహించిరి. సరిహద్దులలో నొకయాఁడుది రాజ్యమేలుట యవమానకరముగనెంచి యాకస్మికముగ మహాదేవరాయ లొకదినమున ఏకశిలానగరమును అఖండసైన్యసహితముగ ముట్టడించెను.

ఆంధ్రులలో నద్వితీయమగు పౌరుషము ప్రజ్వరిల్లెను. రుద్రమదేవికి విజయముసమకూర్పఁ దలంచి భటులెల్లరు సంగరసన్నద్ధులైరి. మహారాష్ట్రులు మొక్కవోనిపరాక్రమముతో ముందునకువచ్చి ఆంధ్రనగరమును సమీపించి యగడ్తలఁబూడ్వ సాగిరి. శివదేవుఁడు, ప్రసాదాదిత్యుఁడు, రుద్రదేవుఁడు మున్నగు ప్రముఖులు రుద్రమదేవికై సంగరరంగమునఁ బ్రాణములనువిడువఁ దలంచి నడుము కట్టిరి. ఈమహాసంగ్రామమునఁ బరరాజ్యము కబళింపనెంచిన మహాదేవరాయలకుఁ బరాభవము ప్రాప్తించెను. రుద్రమదేవిగడించిన యీవిజయము స్థానికచరిత్రమునం దీక్రిందివిధముగాఁ జెప్పఁబడినది.

"దేవగిరిరాజు సమస్తసేనాసమేతుండై ఏకశిలానగరంబుపై విడిసిన వారలతో నెదిరించి యొకపక్షంబు ఘోరయుద్ధంబు సేసి మూఁడు

లకులపదాతుల నుగ్గుగావించి లక్షగుఱ్ఱంబుల నేలఁగూలఁజేసెను. పారిన వారల వెన్నుదగిలి దేవగిరిచొచ్చుపర్యంతము తరిమి వారినుండి కోటి ద్రవ్యములు కానుకలుబట్టెను. మఱియు నాద్రవ్యంబు పరదార్లకుఁ బంచిపెట్టెను. అచట జయస్తంభములువేసి వారలఁ దనయాజ్ఞకు లోనుజేసెను.”

రుద్రమదేవి పరాజయమనుమాట యెఱుంగకుండ ముప్పది యాఱు సంవత్సరములు రాజ్యమును బాలించెను. ఈయమ సత్పరిపాలనమును విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమునందలి నొక ప్రకరణమునందుఁ బ్రశంసించి యున్నాఁడు. ఆంధ్ర సామ్రాజ్యమునకు సమస్తవైభవములు సమకూర్చి రుద్రమదేవి, రాజ్యభారము ప్రతాపరుద్రునిభుజస్కంధముపై నిడి వార్ధకమునఁ గొంతకాలము గడిపి శివసాయుజ్యము నొందెను.

## రుద్రమదేవి వైదుష్యము మతము

రుద్రమదేవి రాజ్యము పాలించినకాలములోఁ దిరుగుబాటులు మెండగుటచే ఘోరసంగ్రామములు జరుపవలసి వచ్చెను. మొక్కవోని పరాక్రమముతోఁ బ్రతిపక్షుల నెదిరించి రాజ్యమును స్తిమితముగావించుటతో నీయమజీవితము గడిచినది. గణపతిదేవునికాలపు విద్వాంసులందఱి నీయమ పోషించుచుండెను. అంత్యకాలమునఁ బ్రతాపరుద్రుఁడు తనయాస్థానమును బండితులతోఁ గవులతోనించి వేసెను. ఈ యుభయులకు మధ్యనున్న రుద్రమదేవి విద్యాప్రియురాలు రసజ్ఞురాలు అనుటకు సంశయముండదుగాని ఆనాఁటి వాఙ్మయవిశేషములను నిర్ణయింప నిపు డాధారములు లభించుటలేదు. గణపతిదేవుఁడు రుద్రమదేవికి బాల్యమున సంగ్రామవిద్యల నేర్పించెను. అందుచే అశ్వారోహణము, ఖడ్గపరిశ్రమ, లక్ష్యభేదనము మున్నగు వీరోచితకళలన్నియు బాల్యముననే పట్టుబడెను. శివదేవాదుల సహాయమునఁ బరిపాలనవిధానము నభ్యసించెను. తండ్రినిజూచి అరుల లోఁగొను రాజనీతి గడించెను. ప్రోలరాజుకాలమున దేశము జైనమతములో నిండియుండెను. ప్రథమరుద్రదేవుఁడు శైవమతమునఁ బ్రవేశించెను. గణపతిదేవుఁడు విశ్వేశ్వరశంభునివద్ద శైవదీక్షగైకొనెను. రుద్రమదేవియు నట్లే శివదీక్షనొందిన శివభక్తురాలు. ఈయమ కాలములో శివాలయములు రెండువేలు కట్టఁబడెను. తాను శైవమతాభిమానిని యైనను ఇతరమతస్థుల కాయమ యెట్టి నిర్బంధములు కలుగఁజేయలేదు. సర్వమతసమ్మతముగా నీయమ రాజ్యమేలినది. రుద్రమదేవి, పాలనమున మిక్కిలి కౌశలముగలదనుటకు గ్రంథాధారములు పెక్కులు గలవు. విరోధులనడఁచుటలో నీయమనుజెప్పి వేఱొకని జెప్పవలయును. ఎవరయినను నీయమను లక్ష్మియనియే వర్ణించిరి. ఈయమ మాన మీయమసౌందర్యాతిశయమునకు బ్రజారంజనమునకుఁ దార్కాణగాఁ గైకొనవచ్చును.

## ఉపసంహారము

ఆంధ్రకాంతలలో సామ్రాజ్యపాలనము నద్వితీయముగా నెఱపి లోకాంతవిశ్రాంతకీర్తి గన్నవారల యందుఁ బ్రథమగణ్య రుద్రమదేవి. భర్తయనంతరము పత్ని రాజ్యమునకువచ్చుట తెలుచుగఁ గలదుగాన రుద్రమదేవిని గణపతిదేవుని భార్యయని యిదివఱకువారు నిర్ణయించి మిగుల దోషమున కొడిగట్టిరి. నూతన పరిశోధనములవలన సత్యమిప్పటికి బైటపడినది. రుద్రమదేవి గణపతిదేవుని పుత్రియనుటకు నే చరిత్రవిదుఁడును నిఁక సంశయింపఁడు. కాకతీయులు దాదాపుగ మూఁడు నందల సంవత్సరము లాంధ్రదేశమును బాలించిరి. వారికాలమున ఆంధ్రశిల్పమునకు ఆంధ్రవాఙ్మయమునకు ఆంధ్రత్వమునకుఁ బేరు పెంపులు వచ్చెను. ఆంధ్రరాష్ట్రము బునరుద్ధరించి మేమాంధ్రులము మారాజధాని ఆంధ్రనగరము. మాజాతియాంధ్రజాతియని సగర్వముగాఁ జెప్పుకొన్న కాకతీయరాజులకాలమున ఆంధ్రదేశమునకుఁ గలిగిన మహోపకారము లిన్నియన్నియని నిరూపింప నయిలిగాదు. ఇందుఁ బ్రత్యేకించి రుద్రమదేవి గావించిన తటాకములు, ఆలయనిర్మాణములు, నగరప్రతిష్ఠాపనలు సంగ్రామములు తెలుపు ప్రత్యేకాధారములు లేవుగాన సమిష్టిదృష్టితో నీయమను బ్రశంసింపవలసి వచ్చినది. రుద్రమదేవిని బురుషుఁడని గణపతిదేవుఁడు వ్యవహరించి యొక చిన్నదానిని దెచ్చి పెండ్లిచేసెననియుఁ దరువాత సత్యమెఱింగి ప్రసాదాదిత్యుఁడు అను వెలమవీరుఁ డాచిన్నదానిని పురుషునిగ దైవసహాయమున నొనరించి రుద్రమదేవిని జంపెననియు స్థానికచరిత్రములలోఁ గలదు. ఇది విశ్వసింపరానిమాట. గణపతిదేవుని పాలనమునందే రుద్రమదేవి స్త్రీవ్యక్తియని శాసనాదులలో లిఖింపఁ బడినది. రుద్రదేవుఁడనుచు భ్రాంతినివారణార్థముగ రుద్రమదేవిని “సర్వాంగనారి”యని విద్యానాథుడు కంఠోక్తిగాఁ జెప్పినాఁడు—కాన నీకథ విశ్వసింపరానిది. రుద్రమదేవి వార్ధకమునఁ బ్రతాపరుద్రునకు రాజ్యమునప్పగించి వంశానుచారముగ వానప్రస్థాశ్రమము గైకొనమన్నటులఁ బ్రతాపరుద్రీయమునఁ గలదు. ఆంధ్రమాతయనఁదగు రుద్రమదేవి సమగ్రవీరజీవితము ప్రత్యేకరాష్ట్రసంపాదనసోన్ముఖులగు ఆంధ్రసోదరులకు నిత్యస్మరణీయము.

[సూచన—ఇం దుదాహరించిన స్థానికచరిత్రము ఒరంగల్లు శైవధర్మ ప్రచారిణివారు, ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ముద్రించిన ప్రతులనుండి మావద్దఁగల లిఖితగ్రంథమునుండి యుద్ధృతము. ఇం దుదాహరింపఁబడిన అముద్రితశాసనముల ప్రతులు పూర్తిగ మావద్దఁ గలవు. వీని అచ్చులు హైదరాబాదు ఆంధ్రపరిశోధక సంఘమునఁ గలవు. వావిళ్లవారి ప్రతాపరుద్రీయము నీవిషయమునఁ గైకొంటిమి.




దాసు దామోదరరావు గారు

ఇతరజాతుల యాధిక్యమును గుర్తించి మాత్రమే చిన్ననాటి నుండియు బఠించి స్వజాతియాధిక్యము నెఱుగకున్నవారు ప్రకృతము హిందువులలో ననేకులు గలరు. మనకును ఇతరజాతులను మించగల సామర్థ్య మున్నదని తెలిసికొనినగాని యభిమానము వర్ధిల్లదు. అభిమానమున్న గాని యిప్పటి నికృష్టస్థితినుండి బయల్పడుటకు యత్నము సేయము. వస్తుతః హిందూజాతి యాధిక్యము గలదనియు, స్వలాభాపేక్షాపరతంత్రులగు నితరుల ప్రచారమువలన మన నిజస్థితి మఱుగుపడినదనియు దెలిపి యాత్మవిశ్వాసమును బురికొల్పుచు దేశాభిమానులగు పెద్దలు కొన్ని గ్రంథముల రచియించిరి. వానిలో హరవిలాసశారదగారి "హిందువుల యాధిక్యము" ముఖ్యముగ నెన్నదగినది. గొప్ప గొప్పపాశ్చాత్యపండితులును, భారతదేశీయ చరిత్రకారులును వెలిబుచ్చిన యభిప్రాయములను క్రోడీకరించి, యన్నివిధముల హిందువు లితరజనులకంటె నధికులని వీరు ఋజువుచేసినారు. వీరి గ్రంథము ఈ వ్యాసమున కాధారము.

క్రీ. శ. ౧౪ వ శతాబ్దిలో అబ్దుల్ వాసఫ్ అను చరిత్రకారుడు తజియతులంసార్ అను చరిత్రగ్రంథమును వ్రాసెను. అందులో నిట్లనెను. "లోకములో నివాసయోగ్యములయిన స్థానములన్నింటిలో భారతభూమి యత్యంతసౌఖ్యదాయకము, ఆనందప్రదము. అచ్చటి ధూళి వాయువుకంటెను స్వచ్ఛము. అచ్చటి వాయువు కేవలము పవిత్రమే. అచ్చటి సముద్రప్రదేశములు స్వర్గారామతుల్యములు" అనెను.

భారతవర్షములో నితరభూముల ప్రధానలక్షణము లన్నియు గన్పట్టును. మనోహరములైన ప్రకృతిదృశ్యములు, అత్యంతసారవంతమైన నేల, దట్టములైన యడవులు, ఉన్నతపర్వతములు, గొప్ప నదులు, చెట్టుచేమలేని యెడారులు, నీటిచుక్కలేని మెట్టభూములు, అత్యుష్ణప్రదేశములు, అతిశీతలప్రదేశములు, అన్నియు నిక్కడ గలవు. భారతవర్షము భూలోకముయొక్క సంక్షిప్తరూపమని చేంబర్సువిజ్ఞానసర్వస్వము వాకొనుచున్నది. కాబట్టి భారతవర్షములో నైసర్గికసౌకర్యము లన్నియు నున్నవి.

మాక్సుముల్లరు ఇట్లనుచున్నాడు. "మానవుడు బుద్ధిని వినియోగించి కృషిచేసి కల్పించిన యేశాస్త్రమును, ఏకళను, సమగ్రముగ నేర్చుకొనగోరినను, భారతవర్షమునకు శుశ్రూష చేయకతప్పదు. భాషాశాస్త్రము, బ్రహ్మవిద్య, పురాణములు, తత్త్వవిచారము, చట్టములు, ఆచారములు, ప్రాచీనకళాస్వరూపము, ప్రాచీనప్రకృతిశాస్త్రములు, ఏదిచదువదలచినను, నీకిష్టమున్నను లేకున్నను, భారతవర్షమునకు బోవక తప్పదు. మానవచరిత్రప్రముఖములగు నతి మూల్యములయిన యంశములు భారతవర్షములో గుప్తపఱపబడినవి. అవి మఱియే చోటను లభింపవు."

లోకములో సాధారణముగ నొక్కొక్కజాతిని బరీక్షించి చూచినయెడ నది యేదో యొక యంశములో మాత్ర మాధిక్యము గలిగి యితరవిధముల హీనమైనదిగ గన్పించును. వాణిజ్యములోనో సంగరశక్తిలోనో యాధిక్యముగల జాతి యొకటి యుండవచ్చును. లేదా, ఒకతత్త్వజ్ఞానములోనో కవితాసంపదలోనో, శాస్త్రపరిశోధనములలోనో, కళాపరిజ్ఞానములోనో, యాధిక్య ముండవచ్చును. రాజకీయముగ నొకజాతి యుత్కృష్టమైనదిగ నుండి నీతిప్రవర్తనములోనో, బుద్ధివికాసములోనో కొఱవడవచ్చును. హిందువులవలె ననేకవిధముల నాధిక్యము గలజాతి వేఱు కానరాదు.

హిందువులు కవితాధోరణి గలవారని ప్రొఫెసరుహీరెన్, సంగీతధోరణి గలవారని ఆనీవిల్సన్, వాణిజ్యధోరణి గలవారని మిసెస్ మానింగ్, తత్త్వచింతకుల కూటమని మాక్సుముల్లరు, శాస్త్రపరిశోధనములో నిశితబుద్ధియు శ్రద్ధాళుత్వమును గలవారని ఎల్ఫిన్‌స్టను, కళాపారంగతులని కర్నలుటాడ్డు ననిరి. ఎటుజూచినను అగ్రస్థానము భారతవర్షముదే.

హిందువుల నాగరకత మిక్కిలి ప్రాచీనకాలమునాటిది. దీని తరువాత నెన్నో రాజ్యములు, ఎన్నో జాతులు, పుట్టి గిట్టినవి. హిందూసభ్యత మాత్రము, ఎన్ని రాజకీయసంఘటనములకును, సాంఘికవిప్లవములకును, చెక్కుచెదరక నిలిచియున్నది. హిందూజాతి నిర్మాణము మిక్కిలి దృఢమైనది.

## పరిపాలనము

జనసంఖ్యయు సంపదయు నెక్కడ సమృద్ధిగ నుండునో, ఆజాతి మంచిప్రభుత్వముచే బాలింపబడుచున్నదని ఎడ్మండుబర్కు సిద్ధాంతము. హిందువులు అసంఖ్యాకులని ప్రాచీనయాత్రికులు ఏక

గ్రీనముగ వచించిరి. ఆర్యావర్తములోని పట్టణముల నన్నింటి నెలు గుటగాని లెక్కించుటగాని దుస్తరమని అరయన్ వ్రాసెను. ఇతర జాతులవా రందరును గలిసి యెందరుందురో హిందువులందరున్నారని టెసియస్ వ్రాసెను.

భారతవర్షము యుగయుగములనుండి సంపదకు పేరుగాంచినదని చేంబర్సువిజ్ఞానసర్వస్వ మనుచున్నది. అలెగ్జాండరు ఈదేశముపై దండెత్తివచ్చుచు తనసేనతో మన మిపుడు అమితధనముతో మూల్గుచున్నట్టి బంగారు భారతవర్షమునకు జనుచున్నామనియు పారశీకస్థానము భారతవర్షముతో బోల్పరానిదనియు బలికెనని నైజు వ్రాసెను. గజినీమామూదు సోమనాథములో గొల్లకొట్టిన శివలింగములోని రత్నములను లెక్కపెట్టలేకపోయెనని లెత్బ్రిజి హిందూదేశ చరిత్రములో వ్రాసెను.

ప్రాచీనకాలమున భారతవర్షములో దొంగతనములేదని స్ట్రాబో వ్రాసెను. డాక్టరుజాన్సను కాలములో లండనునగరమున రాత్రివేళ వీధిలోనికి బోవుటకు భయముగనుండెడిది. అప్పటికి మనదేశములో నిండ్లతలుపులకు దాళములు వేసికొనుట యనగత్యము. హిందూదేశములో ప్రతిపట్టణమును స్వతంత్రమైన ప్రజాస్వామికమని లెఫ్టెనెంటు కర్నలు మార్కువిల్కున్ వ్రాసెను. ప్రతిభారతీయుడును స్వేచ్ఛగలవాడని అరయన్ అనెను. తన నాటిగ్రామములనుగూర్చి సర్ చార్లస్ మెట్కాఫ్ ఇట్లనెను. "ఒక్కొక్కగ్రామస్థులకు వారికి గావలసిన సమస్తమును అక్కడనే లభించుచుండెను. వారి కితరులతో నగత్యము లేదు. ఏది నశించినను, గ్రామసంఘములు యథాప్రకారముగ నుండుచు వచ్చినవి. రాజ్యములు తారుమారయినవి. పఠానులు, మొగలాయిలు, మహారాష్ట్రులు, సిక్కులు, బ్రిటిష్‌వారు ఒకరివెనుక నొకరు దేశపాలకులయిరి. కాని గ్రామసంఘములు చెక్కుచెదరక సౌఖ్యమును స్వాతంత్ర్యమును బ్రసాదించుచున్నవి." దక్షిణ హిందూస్థానములో మొదటిపరాంతకుని కాలములోను, మొదటిరాజరాజు కాలములోను, ఎన్నికలతో గూడిన గ్రామప్రజాస్వామికము లుండినట్లు, ఉత్తరమల్లూరులోను, తంజావూరులోను దొరకిన శాసనములనుబట్టి తెలియుచున్నది. మెగాస్థనీసు ఇట్టిగ్రామపాలక సంఘముల జూచినాడు.

## స్వభావము

భారతీయు డనృతమాడిన జెన్నడు నెఱుగముని అరయన్ అనెను. భారతీయులు ఋజుమార్గవర్తనులు, న్యాయబుద్ధిగలవారు, వారన్యాయముగ నెద్దియు స్వీకరింపరు, అని యువాన్‌చ్వాంగ్ అనెను. క్రీ. శ. ౨౩౧ సం॥లో సయామురాజు బంధువగు నూవే యీదేశమునకు వచ్చి చూచిపోయి, తనరాజుతో హిందువులు ఋజువర్తనమును న్యాయబుద్ధియు గలవారని చెప్పెను. భారతీయులు న్యాయబుద్ధియు విశ్వాసపాత్రతయు గలవారగుటచే నన్నిజాతులవారును భారతవర్షములో మూగుచున్నారని క్రీ.శ. ౧౧వ శతాబ్దిలో ఇద్రిసి తన భూగోళశాస్త్రములో వ్రాసెను. క్రీ. శ. ౧౩ వ శతాబ్దిలో ప్రపంచయాత్ర సలిపిన మార్కోపోలో బ్రాహ్మణులు ఏమిచ్చినను బొంకువారు కారని వ్రాసెను. కమాలుద్దీన్ సమర్కండి యను నొకరాయబారి వర్తకులకు భారతభూమిలో మిక్కిలి పదిలము గల దనినాడు. హిందువులు సత్యమును గౌరవింతురనియు, వ్యవహారములలో విశ్వాసపాత్రులనియు అబుల్ ఫజల్ వ్రాసెను. ఇన్నాళ్ళింగ్లండ్ క్రింద ఎంతెంత వ్యవహార మయినను లిఖితము లయిన వాగ్దానములు గాని, చెల్లుపత్రములు గాని యగత్యము లేకుండ కేవలము నోటిమాటపై జరుగుచుండెను. వైరాగ్యములోవలెనే సూనృతవాదిత్వములోను హిందువులు ప్రసిద్ధులని సర్ జాన్ మాల్కమ్ వ్రాసెను. ఆస్తి, స్వేచ్ఛ, ప్రాణము పోవునప్పుడైనను బొంకని హిందువులను నూఱులాది గాంచితిననియు, ఒకే గ్రామములోని జనులు అన్యోన్యము అసత్యము లాడుకొనుట యెఱుగరని చెప్పవచ్చుననియు కర్నలు స్లీమను అనెను. భారతవర్షములో బానిసత్వము లేదనియు, స్త్రీలు పతివ్రతలనియు, పురుషులు ధైర్యశాలురనియు మెగాస్థనీసు వ్రాసెను. హిందువులు విశ్వాసపాత్రులు, సూనృతవాదులు, న్యాయబుద్ధిగలవారు, పరాక్రమశాలురు, స్వామిభక్తులు, అభిమానధనులు నని క్రీ.శ. ౧౮౪౨ నుండి ౧౮౫౩ వఱకు అజమీరు మేర్వాడకు కమీషనరుగ నుండిన కర్నల్ డిక్సను శ్లాఘించెను. హిందువులకంటె విశ్వాసపాత్రమైన జాతి కానరాదని సర్ జాన్ మాల్కమ్ వ్రాసెను. హిందువులతో సంచరించినవారెవ్వరును, వారియందు నాగరకజనుల ముఖ్యలక్షణములలో నొక్కటయినను కొఱవడెనని చెప్పజాలరని బిషప్పు హెబరనెను. హిందువులు నెమ్మది, దయ, కృతజ్ఞత, విశ్వాసము, అనురాగములు గలవారును, అరిషడ్వర్గమునకు లొంగనివారును, అని మొదటి గవర్నరు జనరలు వారన్ హేస్టింగ్సు పార్లమెంటుకమిటీ యెదుట సాక్ష్యమిచ్చుచు చెప్పెను. "హిందువులు త్రాగుబోతులును స్వైరవర్తనులును గారు, పరిశుభ్రత గలవారు, కృతజ్ఞులు; మన సిపాయిలు తమవిదేశీయసేనానులయెడ జూపుచున్నంత విశ్వాసపాత్రత ఏ యితర ఏకజాతీయసైన్యములోను గూడ గానరాదని ఎల్‌ఫిన్‌స్టను వ్రాసెను. హిందువు లుత్తమమర్యాదల నెఱిగినవారని వార్డనెను.

హిందువుల సాహసౌదార్యములకు దృష్టాంతములు రాజస్థాన చరిత్రములో కొల్లలుగ నున్నవి. భారతీయులు స్వధర్మముకొఱకు గాని, ఆత్మగౌరవ రక్షణార్థముగాని ప్రాణము లర్పించుటకు లేశమాత్రమును వెనుదీయరని ఎల్‌ఫిన్‌స్టను వ్రాసెను. గ్రీకులు తాము చూచినంతలో హిందువులను మించిన ధైర్యశాలురు లేరని ఘంటాపథముగ బలికిరి. అనవరతవిజయముల గాంచిన యలగ్జాండరు మహావీరుని సేనలకు దొలుత బెదరుగల్పించిన యతడు మగధరాజ్యము నేలిన హిందూరాజు.

ప్రాచీనకాలమున స్త్రీలయెడ హిందువులు చూపినంత గౌరవాదరములు ఏయితర రాష్ట్రనివాసులును జూపలేదని విల్సను వ్రాసెను. "ఎక్కడ స్త్రీలు గౌరవింపబడుచున్నారో అక్కడ దేవతలు ప్రసన్నులగుచున్నారు, ఎక్కడ నగౌరవము పొందుచున్నారో అక్కడ చేయు కర్మలు నిష్ఫలములు" అని మనుధర్మశాస్త్రము శాసించుచున్నది. యుధిష్ఠిరుని రాజ్యపాలనములో ద్రౌపదీదేవి స్త్రీలధర్మములగూర్చియు, స్త్రీలహక్కులగూర్చియు, ప్రజలకు బోధించుచుండెను. రాజమందిరముయొక్కయు తత్సంబంధమైన ధనసంచయముయొక్కయు నిర్వాహము నామె పరిశీలించుచుండెను. రాష్ట్రకోశనిర్వాహములో సాయపడుచుండెను. మతప్రతిష్ఠాపనములపై పరిశీలనము చేయుచుండెను. స్త్రీలు ఆస్తిపై హక్కుదారులు కావచ్చునని ధర్మశాస్త్రములు సంపూర్ణముగ నామోదించినవి. ఘోషాపద్ధతి స్త్రీస్వాతంత్ర్యము నరికట్టలేదని కర్నలుటాడ్డభిప్రాయము. "రాజపుత్రస్త్రీలు అనుభవించు స్వేచ్ఛ, గౌరవము, సౌఖ్యము, నేను జాల మెచ్చుకొందును, నాకు దెలిసినంతలో వారు బందీకృతలై యున్నారని విలపించుట కెట్టి యవకాశమును గన్పింపదని యత డనెను. ఔరంగజేబుతో యుద్ధమాడి మోడివచ్చిన తనభర్తను గోటలోనికి రానీయకుండ ద్వారముల మూయించిన మార్వాడురాణి యొక్క యంతము పరాక్రమశాలినిగా బెర్నియరు వర్ణించెను. ఆరాజ్యములో స్త్రీలధైర్య మెట్లుండునో మచ్చుచూచుట కాకథ చాలునని ఫ్రెయర్ తెలిపి యుండెను.

## విదేశీయులతో సంబంధము

క్రీ. పూ. ౩౨౫ సం॥ నుండి ౨౮౬ సం॥ వఱకు నైగుప్తు నేలిన టాలమీఫిలడెల్ఫాసు హిందూరాజసభకు డైయానిసియసును రాయబారిగ బంపెనని విన్సెంటుస్మిత్తు వ్రాసెను. ఐరోపీయ యోధులు పూర్ణకవచధారులై తమిళరాజులయొద్ద నంగరక్షకులుగ నుండిరి. ఒకపాండ్యరాజుకొలువులోను, మఱికొందఱు తమిళరాజుల కొలువులోను, రోము దేశపు యుద్ధభటుల జేర్చుకొనుచుండెడివారు. మధురానగరపు కోట గుమ్మములయొద్ద కావలిగాచుటకై రోమీయభటులు నియోగింపబడుచుండిరి. పాండ్యరాజు పంపిన రాయబారి యొకడు అగస్టసును సిరియాలో సందర్శించినట్లు స్ట్రాబో వ్రాసెను. క్లాడియసు చక్రవర్తి యొద్దకు వచ్చిన యొకభారతీయరాయబారపు టువంతమును ప్లినీ వ్రాసెను. భారతీయులకును రోమీయులకును క్రీ. శ. ౫౩౦ సం॥ వఱకును పరస్పరసంబంధ ముండెడిది. అశోకుని బౌద్ధమతప్రచారకులు ఆశియా, ఐరోపా, ఆఫ్రికా ఖండములు మూడింటను వ్యాపించిరి. యోధాగ్రేసరబిరుదాంకితుడగు అలెగ్జాండరు అపజయమెఱుగని తనసైన్యముతో వచ్చి యొకచిన్న హిందూరాజ్యమును మాత్రమే జయింపగల్గెను. తక్షశిల యేలిక ౫౦౦౦ సైన్యమును దీసికొని పురుషోత్తమునితో బోరుటకు అలగ్జాండరుకు దోడయ్యెను. పైగా వచ్చిన సాయముగాక, అలగ్జాండరు సైన్యము పురుషోత్తముని సేనకు రెట్టింపుండెను. మగధదేశాధీశ్వరుండగు మహానందమహారాజు తనపైకి వచ్చుచున్నాడని విని అలగ్జాండరు సైన్యమునకు బెదరు పుట్టెను. అలగ్జాండరు అంతటితో వెనుకకు మఱలక ముందుకు సాగివచ్చినచో, వెనుక నీదేశముపై దండెత్తివచ్చి, సర్వనాశము పొందిన అసీరియారాణి సెమిరమిసుకు పట్టినగతియే యతనికి బట్టెడిది. అలగ్జాండరు సైన్యము సర్వనాశము గాకుండ నిలిపిన ప్రతిష్ఠయంతయు పురోగమన విసర్జనోపదేష్టలగు కైనాసుప్రభృతులదని విన్సెంటు స్మిత్తు వ్రాసెను.

## అన్యదేశవ్యాప్తి

మహాభారతయుద్ధానంతరమును, జనసమ్మర్ద మెక్కువగనున్నప్పుడును భారతీయులు అన్యదేశములకు వలసపోగి యట రాజ్యముల స్థాపించిరి. ఒకప్పుడు సింధునదీముఖద్వారప్రదేశములో నివసించుచుండిన నావికులు నౌకలెక్కి సముద్రతీరము నంటివచ్చి యైగుప్తు, న్యూబియా, అబిసీనియాలలో రాజ్యములు స్థాపించిరని పోకాకు వ్రాసెను. ఆయాదేశముల యూళ్లపేళ్లు రాజులపేళ్లు మొదలయినవి భారతీయనామధేయముల బోలియున్నవి. శిల్పవస్తుసారూప్యము మఱియొక నిదర్శనము. అమెనాఫిసు ఇతియోపియా నేలుచుండినపుడు భారతీయులచ్చట వలస లేర్పఱచుకొనిరని సింసెలకు వ్రాసెను. గ్రీసు, పారశీక తురుష్కస్థానములకు హిందువు లేగుచుండినట్లు వేఱుగదెలుపుట యనగత్యము. సైబీరియా ఫిన్లండులభాషలకు భారతీయభాషలతో సంబంధ మున్నదట. స్కాండినేవియాప్రజలు ఏడువారములకు వాడుపేళ్లు మనపేళ్లతో సరిపోవుచున్నవి. జన్మనుల ప్రాతఃస్నానము, దీర్ఘకవచధారణాద్యభ్యాసములు భారతీయుల యలవాట్లను బోలియున్నవని కర్నలు టాడ్ గమనించినాడు. హంగేరీయులు సంస్కృతభాషను బఠించినయెడల తమయుత్పత్తిని గూర్చియు, ఆచారమర్యాదల గూర్చియు, భాషనుగూర్చియు నెన్నోముఖ్యాంశముల దెలిసికొనగలరని సోమాడి కోరసు వ్రాసెను. పురాతనకాలమున బ్రిటనులోనుండిన డ్రూయిడుల విశ్వాసములును అనుష్ఠానములును బౌద్ధుల వానిని బోలియుండెను. డ్రూయిడులు భారతవర్షమునుండి బ్రిటనుకు బోయి యక్కడ స్థిరపడినవారని 'గాడ్ ఫ్రెహిగిన్సు' 'సెల్టిక్ డ్రూయిడ్సు' అను గ్రంథములో ఋజువు చేసెను. సెల్టికుజాతీయములకు సంస్కృతజాతీయములతో సాదృశ్య మున్నదని పిక్టె వ్రాసెను.

బుద్ధుని పుట్టుకకు పూర్వమే హిందువులు సయామములో స్థిరనివాసము లేర్పఱచుకొనిరి. సయామములో నిప్పటికి రెండు మూడుమైళ్ల చుట్టుకొలతగల గొప్ప హిందూదేవాలయ మున్నది. తక్షశిలకు జుట్టునున్న దేశమునకు వెనుక కాంభోజమని పేరు. కాంభోజులు క్రీ. శ. ౮వ శతాబ్దిప్రాంతమున ఆశియాఖండపు ఆగ్నేయభాగములో రాజ్యము స్థాపించి దానికి తమ జన్మభూమి పేరిడిరి. ఇది యిపుడు కాంబోడియా

యని వ్యవహరింపబడుచున్నది. చీనా యనుపేరు హిందువులు పెట్టినదని హీరెన్ వ్రాసెను. చీనాదేశపు మతము భారతవర్షమునుండి వచ్చినట్టిదని జార్జిస్జర్నా వ్రాసెను. క్రీ. పూ. ౬౫౧ సం. నుండి భారతవర్షమునకు చీనాకు నౌకాయానములు జరుగుచుండెను. జాపనీయసారస్వతముపై భారతీయప్రాబల్య మున్నట్లు వింటర్నిజు పండితుడు గమనించినాడు. క్రీ. శ. ౭౯౯ సం||లో నొక భారతీయుడును, ౮౧౧ సంవత్సరములో నొక భారతీయుడును జాపనుదేశమునకు మొట్టమొదటగా ప్రత్తిని గొంపోయి యక్కడ ప్రవేశపెట్టిరని జాపనుప్రభుత్వనివేదికలు వాకొనుచున్నవి. దక్షిణఅమెరికాలోని పెరూనివాసుల సాంఘికాచారములు భారతీయుల యాచారముల బోలియున్నవని పోకాకు వ్రాయుచున్నాడు. అక్కడ ఆర్యసంప్రదాయసిద్ధములైన దేవాలయములు, కోటలు, నీటికాలువలు, కొండచంతెనలు నున్నవని జెవూ వ్రాసెను. మెక్సికోవారు మా గణేశునివలె మనుష్యుని మొండెమును ఏనుగుతలయు గల విగ్రహము నారాధించుచుండెడివారట. ఉత్తరఅమెరికాలో ఆదిహార్మను గాన యున్నదట. పెరూవాస్తవ్యుల పెద్దపండుగ పేరు రామసీతా. ఈవిధముగ హిందూనాగరికతాచిహ్నము లన్నిదేశములలోను గన్పించుచున్నవి. డెల్మోగా రిట్లనిరి. "వేనవేలయేండ్లక్రింద భారతభూమిలో నిర్మింపబడిన నాగరకతయొక్క ప్రాబల్యము మనలను అనుదినజీవయాత్రలో నావరించియున్నది. నాగరకత కెక్కిన దేశములలో నది మూలమూలల వ్యాపించియున్నది. కలయుచో అమెరికా కేగి చూడుడు. ప్రపంచమున జాహ్నవీతీరములనుండి వచ్చినట్టి నాగరకతయొక్క ప్రాబల్యము ఐరోపాలోవలెనే అచ్చోకూడ గనుగొనగలము."

## సారస్వతము

"హిందూసారస్వతములో నేదేని యొక్కయనల్పభాగముతో బరిచయము గలిగించుకొనుట కొక్కని జీవితకాలము చాలదు; ఇప్పటివఱకు లిఖితములుగ మిగిలిన సంస్కృతగ్రంథములు గ్రీసు, ఇటలీ, రెండుదేశముల ప్రాచీన వాఙ్మయములను మించియున్నవి; సంస్కృత భాష అద్భుత నిర్మాణము గలది. ఇది గ్రీకుభాషకంటెను బరిపూర్ణము, లాటినుకంటెను బాహుళ్యము కలది. రెండింటికంటెను స్వచ్ఛతరము" అని సర్ విలియంజోన్సు వ్రాసెను. సంస్కృతము భాషలకు భాష యని మాక్సుముల్లరు అభిప్రాయము సంస్కృతము గ్రీకువలె వైపుల్యమును, లాటినువలె ధాటిగల వచోగాంభీర్యమును, హెబ్రూవలె భగవదంశయు గలదని ష్లెజలసెను. ఆధునికుల భాషాశాస్త్రము సంస్కృతము పఠింప నారంభించిన పిమ్మట మొదలిడబడెనని హంటరు సూచించుచున్నాడు. గ్రీకుభాష సంస్కృతభవమని పోకాకు; జెందుభాష సంస్కృతభవమని హీరెను, వర్తమానైరోపేయ భాష లన్నింటికిని సంస్కృతము మూలమని డూబాయి; సంస్కృతము గ్రీకులాటిను జర్మనుభాషలకు మాతృభాషయని యొకరు; నీవిధముగ భాషాశాస్త్రజ్ఞులు సంస్కృతమునకు మాతృస్థాన మిచ్చినారు. ఐరోపీయవర్ణసమామ్నాయమునుగూర్చి మాక్డొనలు పండితుడిట్లనెను: ఐరోపీయులమగు మనము ౨౫౦౦ సం||ల పిదప శాస్త్రజ్ఞాన మతిశయించియున్న యీకాలమున, మనభాషలోని యన్ని ధ్వనులను నిరూపించుటకు జాలనట్టి యక్షరమాల నుపయోగించుకొనుచున్నాము. ఎన్నడో మూడువేలయేండ్లనాటి ప్రాచీనసెమిటికు క్రమము ననుసరించి యచ్చులను హల్లులను గలియబోసి యవను లేర్పఱిచిన గందరగోళపు క్రమమునే నేటికిని యవలంబించుచున్నాము." కాబట్టి వర్ణసమామ్నాయములో ఐరోపీయులు నేటికిని హిందువులకంటెను వెనుబడియున్నారు. మానవసంఘముయొక్క విద్యాభ్యాసములో జతుర్వేదములు ప్రత్యేకాధ్యాయమని మాక్సుముల్లరనెను. వాల్టెయిరుచేతి కొకరు యజుర్వేదము ప్రతినీయగానాతడు, పౌరస్త్యులవలన పాశ్చాత్యులకు వచ్చిన యీయుత్తమయమూల్య బహుమానపు ఋణ మెన్నటికి దీరజాలదని యుద్ఘాటించెను. పాణిని రచియించిన సంస్కృతవ్యాకరణము లోకములోని సర్వవ్యాకరణములలోను అగ్రగణ్యమని హంటరనెను. పాణిని అసాధ్యమును సాధించినాడని జోన్సు కొనియాడెను. వ్యాకరణశబ్దముయొక్క సంపూర్ణార్థము సంస్కృతవ్యాకరణములకే చెల్లునని మానింగు వ్రాసెను. భారతీయ కవితాధన మక్షయమని మాక్సుడంకరనెను. యవనుల ఇలియడు ఒడిస్సేలు రెండును గలిసి ౩౦,౦౦౦ పాదములు. రామాయణము ౪౮,౦౦౦ పాదములు. మహాభారతము ౨,౨౦,౦౦౦ పాదములు. వైశాల్యమట్లుండ, పాత్రపోషణములో రామాయణ మహాభారతము లద్వితీయములు. యవనుల ప్రబంధములు రామాయణమహాభారతముల ననుసరించి వ్రాయబడినవని మాక్సుడంకరు ప్రభృతుల నమ్మకము. హిందూనాటకముల ప్రాశస్త్యమును గుఱించియు హిందూభావగీతముల కోమలత్వమును గుఱించియు ప్రశంసావాక్యముల నుదాహరించుట యనవసరము. కల్పనాకథలద్వారా నీతిబోధనేయుటలో హిందువు లితరుల కుపాధ్యాయులని ఎల్ఫిన్‌స్టన్ అనెను. పంచతంత్రమును పారశీకరాజగు నౌషర్వాను భారతవర్షమునుండి తెప్పించుకొని పల్లవిభాషలోనికి మార్పించుకొనెను. అది హారూనల్‌రషీదు కాలములో అరబ్బీభాషలో వ్రాయబడెను. టీరామ్‌ఘిజ్నవిసుల్తాను కాలములో పారశీభాషలోనికి మార్పబడెను. క్రీ. శ. ౧౨౫౦ సం|| ప్రాంతమున స్పానీయభాషలోనికిని, హెబ్రూభాషలోనికి గూడ బరివర్తింపబడెను. క్రీ. శ. ౧౨౭౦ సం||లో లాటిన్ ప్రతి యేర్పడినది. ఇది క్రీ. శ. ౧౪౮౦ సం||లో అచ్చుపడెను. జంతుపాత్రముల నీతికథలకు జన్మస్థానము భారతవర్షమని హంటరు వ్రాసెను. సిందుబాదుకథ భారతవర్షమునుండి వచ్చినదని డెస్లాంగచాంప్సు వ్రాసెను. ఒకరికి బోధచేసి తాము బోధనొందుటయే పరమావధి యనిభావించినవారగుటచే హిందువుల కవిత్వమంతటను నీతిబోధన మావరించియున్నదని హీరెన్ గమనించుచున్నాడు.

## తత్త్వజ్ఞానము

దేశములో పదిలము కుదురుబడి, ఆర్థికస్థితి బాగున్నప్పుడే తత్త్వవేత్త లుదయింతురని మాక్సుముల్ల రనుచున్నాడు. ఏకాగ్రచిత్తతలో తత్త్వవిచారము సలుపుటకు హిందువులకు ఈశ్వరుడు అసాధారణమైన ప్రజ్ఞను బ్రసాదించెనని యీపండితుడు వ్రాసెను. అన్ని యభిప్రాయభేదములును, సర్వచింతనారీతులును సమస్తతత్త్వశాస్త్ర సంప్రదాయములును, హిందువులచే సమగ్రముగ కృషిచేయబడి పూర్ణవికాసము నొంది గ్రంథస్థములయినవి. ఐరోపీయ తత్త్వశాస్త్రము లన్నింటికిని బ్రతిరూపములు హిందూశాస్త్రములలో నున్నవని అలగ్జాండరుడఫ్ వాక్రుచ్చెను. సమస్తతత్త్వశాస్త్రముల యంకురములును ఉపనిషత్తులలో నున్నవని గోల్డుస్టక్కరనెను. విశ్వమే దైవమనెడి యద్వైతముయొక్కయు స్పినోజా యద్వైతముయొక్కయు, హెగెల్ అద్వైతముయొక్కయు, సిద్ధాంతములన్నియు హిందువులలో గలవు. భారతీయుల మనశ్శాస్త్రము ఐరోపీయుల మనశ్శాస్త్రము కంటె నెన్నోమడుంగు లెక్కువ పరిపూర్ణమైన శాస్త్రమని బెసంటు వక్కాణించెను. హిందువులు వడివీధులలో సహా తత్త్వము మాటాడుకొనుచుందురని మాక్సుముల్ల రనెను. పాశ్చాత్యులు ఆత్మనిత్యత్వసిద్ధాంతమును వైకల్పికముగ భావింతురు. ఈసిద్ధాంతముపై విశ్వాసము భారతీయుల ప్రవర్తనమున కొకరూప మొసగినది. ప్రాచీనకాలమున భారతీయు లితరదేశస్థులకు తత్త్వశాస్త్రోపదేష్టలుగ నుండిరి. ఐగుప్తీయుల మతమును, పురాణగాథలును, తత్త్వశాస్త్రములును భారతీయులనుండి గ్రహించినట్టివని జారన్‌స్టర్నా స్పష్టపఱచినాడు. గొప్ప యవనతత్త్వవేత్తయగు పైథాగొరసు తత్త్వజ్ఞానము గ్రోలుటకై భారతవర్షమున కేతెంచెను. జన్మాంతరసిద్ధాంతము నతడిక్కడ నెఱిగెను. అనగ్సగొరసు, పిర్హొ మొదలగువారు గూడ ఈదేశములో తత్త్వవిద్య నభ్యసించిరి.

ముఖ్యములయిన హిందూతత్త్వశాస్త్రములకు దర్శనము లని పేరు. ఇవి యారు: న్యాయవైశేషికములు; సాంఖ్యయోగములు; పూర్వోత్తరమీమాంసలు. న్యాయశాస్త్రమునుగూర్చి ష్లెజ లిట్లు ప్రశంసించెను. "ఇది ప్రకృతిమిథ్యాత్వవాదమును బ్రతిపాదించు నిర్దుష్టమైన గ్రంథము. తర్కశాస్త్రసిద్ధమైన సందర్భశుద్ధి గలది. యవనులు దీనితో సమమైన స్థాయికి రాజాలరయిరి." వైశేషికుల పంచపాది యనుమానవాక్యము యవనుల త్రిపాదికంటె శాస్త్రీయమును సమగ్రము నని పండితుల యభిప్రాయము. మనసుయొక్క పూర్ణస్వాతంత్ర్యమును సమర్థించి తత్సంబంధమైన సమస్యలను హేతువాదముచే విప్పుటకు గావింపబడిన యత్నములలో సాంఖ్యము ప్రప్రథమమని మాక్డొన లనుచున్నాడు. యోగముచే భారతీయులు సాధించిన కృత్యములు అసాధారణములు. నలువదినిమిషములు నిరాధారముగ గాలిలో గూర్చున్న యోగిని గూర్చి విల్సను వ్రాసినాడు. ౪౫ ఏండ్లు సమాధిలో నుండి, యెన్ని బాధలు పెట్టినను చలింపక, స్త్రీస్పర్శచే దిగ్గన మేల్కొనిన యోగిని రాజేంద్రలాలుమిత్రుడు చూచెను. క్రీ. శ ౧౮౩౭ సం॥లో రంజితసింగు పరీక్షకై యొక యోగిని పెట్టెలో మూసి అన్నమునీరు లేకుండ భూస్థాపితముచేసి, నలువదిదినముల వెనుక వెలికి దీసినాడు. ఈకృత్యమును వెంటూరు, వేడ్ మొదలగు సేనానులును దానను గన్నులార గాంచితిమని మెగ్రిగోరు సిఖులచరిత్రములో వ్రాసెను. ఉపనిషత్తులగుఱించి షోపన్‌హైర్ ఇట్లు కొనియాడెను. "చిరకాలముక్రిందనే యంటుగట్టబడిన యూదీయమూఢవిశ్వాసములను, బనికిమాలిన వేదాంతమును ఈయుపనిషత్తులపారాయణముతో నొక్కిపెట్టున దుడిచిపెట్టుకొనిపోయినవి కదా. ఆహా, మన సిపుడెంత నిర్మలముగ నున్నది! ఒక్కొక్కపంక్తిలోను దక్క ఉపనిషత్పారాయణముతో దుల్యముగ హితకరములయిన చదువు లీలోకములో నెక్కడను లేవు. ఇవి నాజీవితములో నుపశమన మిచ్చినవి. నాజీవితానంతరము నుపశమన మిచ్చును."

## శాస్త్రజ్ఞానము

హిందువులు గొప్పబుద్ధిశాలురని యవనులు దృఢముగ నమ్ముచుండిరని ఎల్ఫిన్‌స్టన్ వ్రాసెను. ఇంటిలోపల నాడుకొను నాటలలో కెల్ల గొప్పదగు చతురంగము హిందువులు కనిపెట్టినది. హిందువులు శతఘ్నులను దుపాకిమందును జేయ నెఱుగుదురు. క్రీ. శ. ౧౮౮౭ సం॥లో కాశ్మీరదేశములో అక్షరుల్సనీకను సంస్కృతౌషధినిఘంటువు దొరకినది. భారతవర్షములో సిద్ధముచేయబడిన గాజు ఉత్తమమైనదని ప్లినీ వ్రాసెను.

### వైద్యము

"హిందూశాస్త్రములలో గూడ ఆరోగ్యసూత్రము లున్నవని మన కిపుడు తెలియుచున్న" దని చెన్నపురి గవర్నరు ఆంప్తిల్ ఉపన్యసించెను. "హిందూవైద్యశాస్త్రములో శరీరనిర్మాణమునుగూర్చి సమగ్రముగ వర్ణింపబడినది, హిందువుల ద్రవ్యగుణశాస్త్రములో నసంఖ్యాకములయిన దినుసు లుదాహరింపబడినవి" అని హంటరు విల్సను లనిరి. "శస్త్రచికిత్సలో భారతీయులు ప్రత్యేకకౌశలమును గడించిరి. నేటికిని మనము వారియొద్ద నేర్చుకొనదగిన యంశములు గల"వని వెబ రనెను. చేతముక్కుల నతుకుటను ఐరోపీయులు భారతవర్షమునుండి నేర్చిరని మాగ్డనలు వ్రాసెను. హిందువుల శస్త్రములు వెండ్రుకల నిలువున జీల్పగల్గునంతటి నిశితములని మానింగ నెను. "హిందువు లవయవచ్ఛేదము నెఱుగుదురు. శరీరములోపలి యంగములకును శస్త్రచికిత్స చేయుచుండిరి. విఱిగిన యెముకలను తొలగిన యెముకలను సరిచేయుచుండిరి. వారు ప్రసవవైద్యములో నిపుణులు, జంతువులకును జికిత్స చేయుచుండిరి" అనుచు హంటరు విపులముగ వ్రాసెను. క్రీ. శ. ౯ వ శతాబ్దిలో హిందూవైద్యగ్రంథము లనేకములు బాగ్దాదులో నరబ్బిభాషలోనికి బరివర్తింపబడెను. వైద్య

శాస్త్రము భారతవర్షములో నుద్భవించి యరబ్బులచే స్వీకరింపబడి యైరోపీయులలో వ్యాపించెను. క్రీ.శ ౧౮ వ శతాబ్దియంతమువఱకును ఐరోపీయు లరబ్బులయొద్ద నేర్చుకొనుచునేయుండిరి. ఐరోపాఖండము అజ్ఞానాంధకారమున నున్న కాలములో వైద్యశాస్త్రమీ దేశమున విశేషముగ వృద్ధిపొందియుండెనని ఆంప్తిల్ ఉపన్యసించెను. హిందూవైద్యులకు రసాయనవిద్య చక్కగ తెలియును. (రాయిగారి హిందూరసాయనశాస్త్రచరిత్ర పఠనార్హము.) టీకాలువేయు పద్ధతి స్పష్టముగ హిందూవైద్యగ్రంథములలో వ్రాయబడియున్నది.

## గణితము, జ్యోతిషము

"గణితశాస్త్రమునకు బునాదియగు దశగుణాంకక్రమమును హిందువులు కనిపెట్టినారు. క్రీ. శ. ౫, ౬ శతాబ్దులలో హిందువు లరబ్బుల కంకబీజగణితములు నేర్పిరి. అరబ్బులద్వారా ఐరోపీయులు గ్రహించిరి." హిందువు లీరెండుగణితములలోను అన్యసాహాయ్యము లేకుండ గొప్పపాండిత్యము సంపాదించిరని హంటరు వ్రాసెను. సూర్యసిద్ధాంతము క్రీ. పూ. ౨,౧౦౦ సం॥ల నాటిది. అంతకు బూర్వమే హిందువులకు రేఖాగణితము తెలిసియుండవలయు. సూర్యసిద్ధాంతములో బ్రయోగింపబడిన త్రికోణమితిసిద్ధాంతములు గ్రీకులకు దెలియనివి, ఇటీవల ఇన్నూరేండ్లక్రిందవఱకు నైరోపీయులకును దెలియవు. వృత్తముయొక్క వ్యాసపరిధులపాతమును, భుజముల కొలలబట్టి త్రిభుజము వైశాల్యమును గుణించు పద్ధతియు మొట్టమొదట హిందువులు గనుగొనిరని ఎల్ఫిన్‌స్టన్ సిద్ధాంతీకరించెను. బీజగణితమును రేఖాగణితమును గనిపెట్టి వానిని జ్యోతిషమున కన్వయించినవారు హిందువులని మోనియర్ విలియమ్సు వ్రాసెను. భాస్కరాచార్యునికి డిఫరెన్షల్ కాల్కులస్ తెలిసియుండునని లెత్‌బ్రిడ్జియు రాయియు వ్రాయుచున్నారు. హిందువుల ఖగోళశాస్త్రము క్రీ.పూ. ౩,౧౦౦ యేండ్లకును బూర్వపుది క్రీ. శ. ౧౬౮౭ సం॥లో ౧౪వలూయీపక్షమున సయామురాజు నొద్దకు రాయబార మేగిన లాహేరును, పిమ్మట పటొలేయు, జెంటిలును ఇక్కడనుండి గ్రహపథకముల నైరోపాకు గొంపోయిరి. వీనిలోని లెక్కలు ఇంచుకైన తారతమ్యము లేక కాసినీ మేయెర్ల పథకములతో సరిపోయినవి. రాశిసంజ్ఞల జ్ఞానము భారతవర్షమునుండి సంగ్రహింపబడినదని రాబర్ట్సను అనెను.

## సంగీతము

తొలుతగ భారతవర్షములో శాస్త్రరూపముదాల్చి గ్రంథస్థమయినది. భారతవర్షములో ఎంతచిన్నపాటగానికయినను చక్కని లయజ్ఞాన మున్నదని ఆనీవిల్సను వ్రాసెను. స్వరగ్రామమును హిందువు లతిసూక్ష్మముగ విభజించిరి. హిందువుల రాగములును, రాగిణులును ప్రత్యేక ప్రత్యేకముగ నొక్కొక్కరసము నుప్పతిల్ల జేయుటకై యుద్దేశింపబడినవి. ఒక్కొక్క రాగమున కొక్కొక్క ఋతువు నొక్కొక్కఘడియయు నిర్ణీతములై యుండును. అక్బరు బలవంతముచే నాయకగోపాలుడను గాయకుడు యమునానదిలో గంతమువఱకు మునిగి దీపకరాగ మాలాపించెనట. కొంతసేపగునప్పటికి వానిశరీరమునుండి యగ్ని బయల్వెడలి వానిని దహించెనని విలర్డ్ ప్రాచీనుల సంగీతమను గ్రంథములో వ్రాసెను.

## కళలు

హావెల్ ఇట్లు వ్రాసెను: "మోటుజనులకు కళాభిజ్ఞత యుండదు. మోటువాని కంటికి కెంపు గోలుపు నంశే మొక్కటియు లేని భారతీయకళ స్వప్నమయినది. చూపుదూరమునుబట్టి కన్పించు హ్రస్వదీర్ఘత్వముల సిద్ధాంతములును, పరస్పరపాతములును, శరీరనిర్మాణవైఖరియు, కొంచెముకొంచెముగా తెలిసికొని, పూర్వకవుల గ్రంథముల జదివి, కళావిమర్శనమునకు దగినవారమనుకొను నైరోపీయ పండితమ్మన్యులకు భారతీయకళలు రుచింపవు. అట్టివారిపుడు దౌర్భాగ్యవశమున భారతవర్షములోని చిత్రకళాప్రతిష్ఠాపనముల బరిపాలించువారిలో ముఖ్యులుగ నున్నారు." "ఐరోపీయకళ యైహికవస్తువుల సౌందర్యమును మాత్రమే నిరూపించును. భారతీయకళ యూర్ధ్వలోకపు సౌందర్యము నిహలోకవాసులకు బ్రసాదించును." "భారతీయు లయిరోపావాసులనుండి కళల నేర్చుకొనిరని ఋజువుచేయ యత్నించుటయే కొందఱకు పనిగా నున్నది. గాథుల యాలయముల లోను, వెనీసునగరములోని యాలయములలోను చిత్రపుపనులలో భారతీయకళాప్రాబల్యము కన్పించుచున్నదని వారెఱుగరు. రోమసామ్రాజ్యవిచ్ఛిన్నానంతరము భారతీయకళాప్రవాహము పశ్చిమముఖముగ బ్రవహించినది." "ఒకానొకజాతియొక్క కళాపరిమితిని గనుగొనవలసినప్పుడు, వారితరులనుండి యెంతవఱకు గ్రహించిరో చూడరాదు. వారితరుల కెంత బ్రసాదించిరో చూడవలెను. అన్నిదేశములవారును ఇతరులయొద్దనుండి బహుళముగ గ్రహించినట్లు గన్పించునుగాని భారతవర్షములో మాత్రము స్వయంకల్పితమే యధికముగ గన్పించుచున్నది. యవనులు కలలోనైన నెఱుగని యాదర్శములను, ఇటలీ యెన్నడును బొందజాలని సౌందర్యమును భారతవర్షము ప్రభవింపజేసినది. సర్వమానవులును భారతవర్షమునెడ గౌరవభావముతో గృతజ్ఞులై యుందురుగాక!"

## శిల్పము

ప్రాచీనభారతీయులు నిర్మించిన భవనము లెన్నివేలయేండ్లకును జెక్కుచెదరక యున్నవని తారనాథ్ వ్రాసెను. హిందూశిల్పులు జావాలోని బోరోబొదూరులో నిర్మించిన యాలయముయొక్క పనితనమునుగూర్చి హావెల్ కడుంగడు శ్లాఘించెను. కొండలలో మలచిన భవనములును దేవళములును ఒక్కయీదేశములోనే కాననగును. ఈగుహాదేవాలయముల నిర్మాణములో నొకవిశేష మున్నది. ఈమలను టలో నెక్కడనైన నొకింత ఱాయి హెచ్చుగ విఱిగిన దనుకొనుడు. అది సరిచేయరాని దోషము. అతికినను అతుకకున్నను గూడ వికారముగనే యుండును. అట్టి దోష మొక్కటయినను గన్పింపలేదని గ్రిఫిత్సు వ్రాసెను. శిల్పములో నైరోపీయులు భారతీయులకు నేర్ప



భారతమహిళాసంఘసభ, బెజవాడ



గుంటూరు భారతమహిళాసమాజము






బాలుడు - మాంచాల

వలసినదానికంటె వారివలన నేర్చుకొనవలసినది హెచ్చుగా నున్నదని హావెల్ ఉపదేశించుచున్నాడు.

## చిత్రలేఖనము

"నిలువుగోడలమీద, పంచె నొక్కమా అట్టె యంటించి యీడ్చివేసి లిఖించిన రేఖలు నాకద్భుతము గొల్పినవి. అట్లే లోకప్పుమీదను, ఇంచుకైన వలింపక, తీర్చి దిద్దినట్లు వ్రాసిన రేఖలు ఇంద్రజాలముగ దోచినవి" అని గ్రిఫిత్సు అజంతా చిత్రముల బ్రశంసించెను. ఈచిత్రములలో నొక విశేష మున్నది. గోడలు తడితడిగ నున్నప్పుడే పంచెలతో చిత్రములు వ్రాయబడినవి. ఒకసారి వ్రాసిన గీతను చెరుపుటకు వీలుకాదు. లోకప్పుమీద నట్టి చిత్రముల వ్రాయుట కష్టములో కష్టము.

## పరిశ్రమలు

భారతవర్షములో పనిపాటులు చేసికొని బ్రదుకు పేదరాలి చేతులు సహా ఐరోపీయసుందరయువతుల చేతులకంటెను గోమలముగ నుండును. ఒక్కొక్కపట్టుకాయలో ఇరువదివెవ్వేలు తరముల సన్నదనము లుండును. భారతవర్షములో పట్టుదారముల వడుకు స్త్రీలు, దారము నడివడిగ వ్రేళ్లసందున బరువెత్తుచుండగనే సన్నదనము మార్పుల గ్రహించుకొని యేర్చుచుందురు" అని ఆరము వ్రాసెను. భారతవర్షములో నేయుబడిన వస్త్రముల సన్నదనము నితరు లెవ్వరును బొందజాల కున్నారని ఎల్ఫిన్‌స్టన నెను. పరమసుందరము లయిన భారతీయవస్త్రములను వర్తకులు కష్టనష్టముల కోర్చి సేకరించుచుండెడివారని మన్రో యనెను. "మన యంత్రసామగ్రితోను మనశాస్త్రజ్ఞానముతోను ఇంతవఱకు ఢాకామజిలినులతో సమానమైన సన్నదనము గాని మన్నికగాని గల్గిన వస్త్రములను నేయజాలకున్నా"మని ఫోర్బ్సువాట్సును వాపోయెను.

భారతీయు లోషధులనుండి అద్దకపు దినుసుల సంగ్రహించి బట్టలకు వర్ణము లద్దుచుండిరి. భారతీయు లద్దెడి వర్ణములతో సమానమైన కాంతిగాని, మన్నికగాని గలవి, యీనాటివఱకు నైరోపీయులు పొందజాలకున్నారని ఎల్ఫిన్‌స్టన నెను. బంగారువస్తువులను, దంతపువస్తువులను, సూక్ష్మచిత్రములతో భారతీయులు కొద్ది యుపకరణముల సాహాయ్యముతో సిద్ధపఱచుచుండిరి. ౧౮౫౧ సం॥లో లండనులో జరిగిన ప్రదర్శనమందు భారతీయులు సిద్ధముచేసిన వస్తువు లనేకములు ప్రదర్శింపబడి గొప్పప్రశంస లందినవి.

ఇనుమును గరిగించి యుక్కుచేయుట యనాదినుండియు భారతీయు లెఱుగుదురని విల్సనసెను. భారతవర్షీయ ఖడ్గము లుత్తమములని టెసియస్ వ్రాసెను. క్రీ. పూ. ౧౮౧ సం॥ నాటి యుక్కుతునక యొక్కటి గ్వాలియరులో దొరకెను. దీనిని రాబర్టుహాడ్ఫీల్డు పరీక్షించి మిక్కిలి ప్రశస్తమైనదని కొనియాడెను. క్రీ.శ. రమారమి ౪౦౦ యేండ్ల నాటిదియు, కలితీలేని యినుముతో జేయబడినదియు నగు కుతుబుస్తంభముతో సమానమైన పరిమాణము గలది ఇతఃపూర్వ మెవ్వరును బోతపోసి యుండలేదు. దానిపై యక్షరము లిప్పటికిని గన్పించుచున్నవి. ఇంతకాలమయినను ఏమాత్రము త్రుప్పుపట్టకుండుటేల యని శాస్త్రజ్ఞు లాశ్చర్యపడుచున్నారు.

## వాణిజ్యము

భారతవర్షము ప్రాచీనకాలమునుండియు గొప్ప వర్తకస్థానమై ఖ్యాతిగాంచెనని చెంబర్సు విజ్ఞానసర్వస్వ మనుచున్నది. హిందువులకు గొప్పనౌకాబల ముండెడిది. వీరు పశ్చిమాశియా, గ్రీసు ఐగుప్తు దేశములతోను, జావా, సుమత్రా, చీనా, జాపనులతోను కోస్తా వ్యాపారము చేయుచుండిరని న్యూయలు వ్రాసెను. హీరామసోలోమోనులు రాజ్యపాలనము సేయుచుండినప్పటికే హిందువులైగుప్తుతో వాణిజ్యము చేయుచుండిరి. భారతీయులు రోమసామ్రాజ్యమున కేటేట నలువదిలక్షలరూప్యముల విలువగల సరుకు లమ్ముచుండిరని ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా వ్రాయుచున్నది. ఇటీవల ౧౬౬౬ సం॥లో మన మచిలీబందరునుండి వర్తకపుసరుకుల యోడలు, పెగూ, సయాము, సుమత్రా, కొచిన్‌చీనా, హోర్ముజు, మక్కా, మడగాస్కరులకు బోవుచుండెనని టావర్నియరు వ్రాసినాడు.

హిందువుల యాధిక్యమును గుఱించి యిట సంగ్రహముగా తెలుపబడినది. వివరముగ నెఱుగగోరినవారు హరవిలాసశారదగారి సంపూర్ణగ్రంథమును, వారు సంప్రతించిన యితరగ్రంథములను జదువదగును. భారతీయులు నిజశక్తిసామర్థ్యములను గుఱుతించుకొని, ప్రయత్నముచే నున్నతిబొందుదురు గాక.

---

ఉత్సాహి—3—బంతి ఆట



# సిద్ధ నాగార్జునుడు

భిషగ్వర వేటూరి శంకరశాస్త్రిగారు, ఎ. యం. ఎ. సి.

నాగార్జునుఁడు రసవాదమున సిద్ధిని బడసిన మహాయోగి. లభించిన ప్రమాణములనుబట్టి మొట్టమొదట రసవాదమునుగూర్చి పరిశ్రమసల్పినవాడును, దానియందు సిద్ధినిబడసినవాడును, తొలుతటి గ్రంథకర్తయునై యున్నాడు. ఈయన కవీశ్వరుడై గ్రంథముల రచించెను. భిషగ్వరుడై ఔషధయోగముల నిర్మించెను. వేదాంతియై మహాయాన మతప్రవర్తకు డయ్యెను. రసవాదజ్ఞుడై కాయసిద్ధినిబడసి, యక్షిణి ఇంద్రజాలాది విద్యలందు నిపుణుడై అమానుషశక్తులతో ప్రజ్వలించెను. అట్టి యీ మహాపురుషుని చరిత్ర మనకు స్మరణీయము. ఈయన జన్మతః బ్రాహ్మణుడు. కాలక్రమమున బౌద్ధమతదీక్షను స్వీకరించి బోధిసత్త్వు డయ్యెను. బౌద్ధమతమున మహాయాన మను నొక నూతనమతమును నిర్మించి దానికి ఆచార్యుడయ్యెను. సామాన్యులకే కాక మహారాజులకుగూడ బౌద్ధమతదీక్ష నిచ్చెను. భోజదేవునికి బౌద్ధమతదీక్ష నిచ్చినది సిద్ధనాగార్జునాచార్యుడేనట! తిబేతు దేశమున మహాయానమతమును వ్యాప్తికి దెచ్చినది యీయనయే! ఈయనజన్మస్థలము ప్రస్తుతము 'బిరార్' యని పిలువబడు 'బిదర్వ' దేశమున 'మహాకోసల' యని చరిత్రజ్ఞులు పలువురు వ్రాయుచున్నారు. ఈయన జన్మస్థలమును గూర్చియు, మతమునుగూర్చియు తారానాధుని 'హిస్టరీ ఆఫ్ బుద్ధిజమ్' అను గ్రంథమున గల యీ క్రిందిగాథను సర్. పి. సి. రేగారు తమ 'హిస్టరీ ఆఫ్ హిందూ కెమిస్ట్రీ' యను గ్రంథమున ఉదాహరించినారు:—

"ఒకధనికుడను విదర్భదేశపు బ్రాహ్మణుడు సంతానములేక విలపించుచుండగా, నూర్గురు బ్రాహ్మణులను దానధర్మములచే సంతుష్టిపరచిన యెడల తనకు సంతానముకల్గునని దివ్యసందేశము వచ్చెనట! ఆప్రకారము దైవారాధన మొనర్చి బ్రాహ్మణులను సంతుష్టిచేయగా, తనభార్య గర్భవతియై, పదిమాసములకు చక్కని కుమారుని గనెను. అందుల కాబ్రాహ్మణుడు ఆనందభరితుడై, దైవజ్ఞులను బిలిపించి కుమారుని జాతకమును జూపగా, వారము దినములకంటె నీ శిశువు జీవింపడనియు, ఇట్టి గండమే లేనిచో నీజాతకునికి అఖండశ్రేయస్సు కలదనియు, నూర్గురు బౌద్ధభిక్షువులను సంతృప్తిపరచిన యెడల, ఈ గండము గడచి శిశువు ఏడేండ్లు జీవించునని శాంతిని జెప్పి, ఆపైన జీవితమొసగుటకు మార్గము లేదని నష్టజాతకమును తెలియజేసిరి. అందుల కెంతయు తండ్రి విచారించి, చేయునదిలేక ఏడేండ్లయినను ముద్దుమురిపెములు తీరును గదా యని బౌద్ధభిక్షువుల నాదరింపగా, ఆశిశువు ఏడేండ్లు జీవించెను. ఏడవయేట అనివార్యముగా రానున్న గండమునకు తలిదండ్రులు తాళజాలక తమ కండ్లయెదుటనే, అట్టి విపత్తును చూడలేనివారై, కొందరినిజతజేర్చి ఆబాలుని నిర్జనారణ్యప్రదేశమున కంపిరి...

..........................................................

బాలుడు (నాగార్జునుడు) అడవిలో నుండగా ఒకనాడు 'అవలోకితేశ్వరక్షారపాణి' యను నొక బోధిసత్త్వుడు కుఱ్ఱని జూచి, గండమును ఎరిగినవాడై, మగధదేశమున గల 'నలంద' బౌద్ధవిహారమునకు వెడలినచో, మరణాపాయమునకు విముక్తి గల్గునని ఒక సందేశమును జెప్పెను. అట్లే ఆ బాలుడు (నాగార్జునుడు) ఆ విహారమునకుబోయి, మఠాధిపతియగు 'సరహాభద్రుని'వలన కొన్ని బౌద్ధగాథలను విని కొంతకాలమునకు తానుగూడ బౌద్ధమతదీక్షను గ్రహించి భిక్షు వయ్యెను. కాలక్రమమున తన బుద్ధివైభవముచే మఠాధిపత్యమునుగూడ వహించెను. కొన్నాళ్లకు దేశమున విపరీతమగు క్షామము గలుగుటచే, విహారమునందలి భిక్షువులకు పూటగడుచుటగూడ కష్టమయ్యెను. మఠనిర్వహణము తనకు దుర్భరమయ్యెను. మఠాధిపతియగు తాను తన్నివారణోపాయము నాలోచింపవలసినవాడై, మహాసముద్రమధ్యమున నొక ద్వీపమున గల ఒకానొక యోగీశ్వరుని సందర్శనమువలన, ఈక్షామము నివారణమగునని తెలిసికొని, ఆయనదర్శనమునకై ప్రయాణమునసల్పెను. సముద్రమును లంఘించుటకయి, మంత్రబద్ధమైన రెండు పత్రములను వెంటగొని వాని సహాయముతో సముద్రము దాటి ద్వీపమును ప్రవేశించి యోగిని సమీపించెను. మానవమాత్రు డెవ్వడును చేయజాలని, యిట్టి కార్యమును చేసినందులకు యోగి, యాశ్చర్యపడి, ఎట్లు దాటగలిగితివని

ప్రశ్నించెను. నాగార్జునుడు, తా నక్కడకు రావలసివచ్చిన యవసరమును, సవినయముగ విన్నవించి, ఎట్లు సముద్రముదాటినదియు జెప్పి, మంత్రబద్ధమైన పత్రముల రెండింటిలో నొకదానిని మాత్రము చూపి, రెండవదానిని, తన భిక్షాపాత్రమునందు దాచియుంచెను. లనకు రసవాదమున ప్రవేశము గల్పించి, సిద్ధిని బడయునట్లు చేయ ప్రార్థించెను. యోగి, తన రసవిద్యను జంబూద్వీపవాసులకు తెలుపరాదని, నాగార్జునుని అక్కడనే బంధించు తలంపుతో, మంత్రబద్ధమగు నాపత్రమును విడిచినగాని తనవిద్యను నేర్పననెను. నాగార్జును డందులకు అంగీకరించి, విద్యను నేర్చి, దానియందు ప్రావీణ్యమును బొంది, సిద్ధినిబడసినవాడై తనయొద్ద దాచియుంచిన రెండవ పత్రముయొక్క సహాయముతో నొకనాడు అదృశ్యు డయ్యెను..................తన విహారమునకు సురక్షితముగా జేరుకొని, తన హేమకరణ విద్యచే, క్షామనివారణ మొనర్చి, భిక్షువుల నందరిని సంతుష్టులజేసి, దేశమును సుభిక్షముగా మార్చెను."

ఈ పైగాథను ఉన్నదున్నట్లుగా మనము విశ్వసించినను, విశ్వసింపకపోయినను, నాగార్జునుడు మొట్టమొదట బ్రాహ్మణుడనియు, తరువాత బౌద్ధమతమును స్వీకరించి, నలందవిశ్వవిద్యాలయమున కొంతకాలము విద్యార్థిగను, తరువాత ఆచార్యుడుగను ఉండెననియు, విశ్వసింపవచ్చును.

ఈయనకాలమునుగూర్చి యెవ్వరును సునిశ్చితమైన నిర్ణయమునకు వచ్చినట్లు తెలియదు. పలువురు పలువిధములుగా వ్రాసినారు. విన్సెంటుస్మిత్ మతప్రకారము 125-150 A. D.లో రాజ్యమేలిన కనిష్కునికి సమకాలపువాడని సామాన్యాభిప్రాయము. సుప్రసిద్ధరసాయనశాస్త్రజ్ఞులగు సర్. పి. సి. రేగారు, నాగార్జునుడు రెండవశతాబ్దివాడని వ్రాసినారు. మఱియు 172-202 A. D.లో రాజ్యమేలిన ఆంధ్రవంశపు రాజగు యజ్ఞశ్రీ శాతకర్ణి మహారాజునకు, నాగార్జునుడు 'సుహృల్లేఖ' యనుపేర నొకలేఖను వ్రాసినట్లును, ఆమహారాజుచే నీ సిద్ధుడు ఆదరింపబడినట్లును, చైనాయాత్రికు డగు హ్యూయనుత్సాంగు గూడ వ్రాయుచున్నాడు. దీనికితోడుగా నాగార్జునునిచే రచింపబడినదని చెప్పబడుచున్న, రసరత్నాకరము, శాతవాహనునకును, నాగార్జునునకును, సంవాదరూపమున నుండుటచేత, ఈ ఊహ బలపడుచున్నది. కావున నాగార్జునుడు రెండవశతాబ్దిని ఉన్నవాడనియు, ఆంధ్రవంశపురాజగు శాతవాహనునిచే నాదరింపబడినాడనియు విశ్వసింపవచ్చును. కొంద రీయనను ఆంధ్రుడే నందురు. అది విశ్వసింపతగినదికాదు. తన అంతిమకాలము ఆంధ్ర దేశమున గడిపెననియు, ఆంధ్ర రాజులతోను, ఆంధ్ర దేశముతోను సంబంధముగలవాడనియు చెప్పుట యొప్పును.

ఈయనకు 'ఆర్యదేవుడను' ప్రియశిష్యు డున్నట్లు తారానాథు వ్రాయుచున్నారు. రత్నఘోషుడను మరొకశిష్యుడున్నట్లు రసరత్నాకరమునుబట్టి తెలియుచున్నది. జయప్రభాచార్యుడను యింకొకశిష్యు డున్నట్లు ఈక్రింది విషయమునుబట్టి మనము ఊహింపవలసియున్నది. జగ్గయ్యపేట బౌద్ధస్తూపమునుండి బయల్వెడలిన యొకశాసనశిల బౌద్ధవిగ్రహము గలదు, ఇప్పుడు చెన్నపురి మ్యూజియములో గలదు. అందు బుద్ధవిగ్రహమునకు అడుగున ఈక్రింది శాసన మున్నది. ఆశాసనమునకు ఇంగ్లీషున తర్జుమా ఇట్లు వ్రాయబడియున్నది:—

"Hail! The desciple of the revered Nagarjunacharya, (was) Jayaprabhacharya—Caused to be made by his (Jayaprabha's desciple Chandraprabha and................"

(From a Budhistic Stupa from Jaggayapet believed to belong to 2nd Century, Madras Musem)

నాగార్జునుడు యజ్ఞశ్రీశాతకర్ణి యాదరణమున నున్నప్పుడు కృష్ణాతీరమున ధాన్యకటక మనబడు 'అమరావతి' విశ్వవిద్యాలయమును నిర్మించినట్లును, అనేక బౌద్ధవిహారములను ఆంధ్ర దేశమున స్థాపించినట్లును, తన యవసానకాలము శ్రీపర్వతము (శ్రీశైలము)న గడపినట్లును, అక్కడకూడ నొకవిహారమును నిర్మించినట్లును కొన్నిప్రమాణములు గలవని చరిత్రజ్ఞులు వ్రాయుచున్నారు. ఈ ఊహ వాస్తవమే నని మనము నిశ్చయముగా నమ్మవచ్చును. రసరత్నాకరమున 'శ్రీశైలః ర్వతస్థాయీ, సిద్ధో నాగార్జునో మహాన్' అని యుండుటచేత నాగార్జునుడు శ్రీశైలమున నివసించెననియు, శ్రీశైలమే శ్రీపర్వ

తము కావచ్చుననియు మన మూహింపవచ్చును. శ్రీశైల మన్నను, శ్రీపర్వతమన్నను ఒకటేగదా!

శుక్లసంవత్సర ఉగాదిసంచికలో అమరావతీ స్తూపము' అను వ్యాసమున శ్రీయుత సోమశేఖరశర్మ గారు ఇట్లు వ్రాసినారు:—

"నాగార్జునాచార్యుల యంతిమదశలో ఆయన కావాసస్థానమైన శ్రీపర్వతము నిదివఱకు 'శ్రీశైల' మని భ్రమించియుండిరికాని, నాగార్జునకొండ (పల్నాడు) దగ్గర నిటీవల త్రవ్వగా బయల్పడిన స్తూప శాసనముల ననుసరించి నాగార్జునకొండయో తత్సమీపస్థమైన వేఱొక కొండయో (ప్రాయికముగా నాగార్జునకొండయే కాదగును) 'శ్రీపర్వత'మను పేర బరగుచుండినట్లు తెలియవచ్చుచున్నది."—(చూడుడు నాగార్జునకొండస్తూపపు శాసనములు.")

ఇందువలన నాగార్జునాచార్యుని అంతిమకాలవాసస్థానము శ్రీశైలముగాక, వేఱొకప్రదేశ మని శర్మగారూహించుచు, శ్రీశైలమునే శ్రీ పర్వత మని తలంచుట భ్రమయని కొట్టివేయుచున్నారు. అందుకు తగిన యాధారముల జూపినగాని, అట్లు తలంచువారి భ్రమ తొలగదు. ఆభారము శ్రీశర్మగారిపైన నున్నది. నాగార్జున కొండయో, తత్సమీపస్థ మగు వేఱొకకొండయో శ్రీపర్వతమగునని శర్మగారు చెప్పినప్పుడు, తత్సమీపస్థ మగుకొండ చేరువజిల్లాలోనే ఉన్న శ్రీశైలమే కాకూడదా యేమి? నాగార్జునుడు శ్రీశైలమందున్నను, నాగార్జున కొండ (పల్నాడు) యందుకూడ నివసించుచు, అక్కడ కూడ నొకవిహారమును నిర్మించి, వచ్చుచు పోవుచు నుండ వచ్చునుగదా!

నాగార్జునకొండ నిటీవలనే దొరతనమువారు త్రవ్వించి పరిశోధనలు జరిపినట్లును, కొన్ని శాసనములు, ప్రతిమలు, ఆభరణములు లభించినట్లును వినియున్నాము. అందేమైన విశేషములు దొరకియుండవచ్చును. అవియెల్ల ప్రకటితమైనగాని విశేషములు బయల్పడవు. ఏమయినను నాగార్జునుడు ఆంధ్రదేశమెల్ల సంచరించెననియు, అనేక బౌద్ధవిహారముల నిర్మించెననియు, శ్రీశైలముననే సిద్ధి పొందియుండుననియు మనము నమ్మదగియున్నది.

### గ్రంథములు

నాగార్జునుడు ఇరువదినాల్గుగ్రంథములు రచించినట్లు ఒక "బౌద్ధగ్రంథముల జాబితా" గలదనియు, అవియెల్ల ఈయన రచించెనని నమ్ముటకు వీలులేకున్నదనియు సర్ రేగారు వ్రాయుచున్నారు. ఈ క్రిందిగ్రంథములు మాత్రము నాగార్జునవిరచితము లని తగుసాక్ష్యముతో మనము నమ్మవచ్చును:—

1 లోహశాస్త్రము.
2. రసరత్నాకరము.
3. కచ్ఛపుటతంత్రము.
4. ఆరోగ్యమంజరి.
5. యోగసారము.
6. రసేంద్రమంగళము.
7. రతిశాస్త్రము.
8. రసకచ్ఛపుటము.
9. సిద్ధనాగార్జునీయము.

ఒక్కొకగ్రంథమునకు వివరణము నీక్రింద జూపుచున్నాను:—

1. లోహశాస్త్రము:—

"నాగార్జునో మునీంద్రః శశాస యల్లోహశాస్త్ర మతిగహనమ్"
చక్రదత్త, పు. 347.

"లోహస్య పాక విధునా నాగార్జున శిష్టమార్గవద్ధర్మః"
ర. చిం, పు 55.

"ముని రచిత శాస్త్రపారగత్వా,......
ముని రచితే తత్ర ముని నాగార్జునః" తత్త్వచంద్రిక, పు. 360.

2. రసరత్నాకరము:—

ప్రజ్ఞాపారమితా నిశీథసమయే స్వప్నే ప్రసాదీకృతమ్
నామ్నా తీక్ష్ణముఖం రసేంద్ర మమలం నాగార్జున ప్రోదితమ్.

* * * *

ప్రణిపత్యసర్వబుద్ధాన్ (సర్వబోధాన్) సకలదోషనిర్ముక్తాన్;
వక్ష్యే సర్వహితార్థం కక్షపుటం సర్వసిద్ధికరమ్.
శ్రీశైలపర్వతస్థాయీ సిద్ధో నాగార్జునో మహాన్;
సర్వసత్త్వోపకారీచ సర్వభాగ్య సమన్వితః.
ప్రార్థితో దవతే శీఘ్రం యశ్చపశ్యతియాదృశమ్;

దృష్ట్వా త్యాగంచ భోగంచ సుతకస్య ప్రసాదతః.
సర్వసత్వానుయా వేదీ స్వరసేన లక్షైవచ;
తేషాం మధ్యే ప్రధానంచ రత్నఘోషః ప్రచారకః.
కృతాంజలి పుటే భూత్వా నాగార్జున పురః స్థితః;
పృచ్ఛతే రసకర్మాణి విద్యా దానం వదస్య మే.

శ్రీనాగార్జున ఉవాచ:—

సాధు సాధు మహాప్రాజ్ఞ, తుష్టో ఽహం భక్తవత్సలః;
కథయామి న సందేహ స్తత్త్వయా పరిపృచ్ఛతామ్.
వలీ పలిత నాశంచ తథా కాలస్య ధ్వంసనమ్,
యథా లోహే తథా దేహే క్షమతే నాత్ర సంశయః;

* * * *

శాలివాహన ఉవాచ:—

సువర్ణరత్న భాండారం కుమారీ మదసుందరీ,
నివేదితో మయాత్మా మే శ్రీదేశో దేవి, దీయతామ్.
సాధుసాధు మహాప్రాజ్ఞ మమా దేశప్రపాలక;
సాధయామి న సందేహో యుష్మ త్సత్వేన సాధకమ్.

రత్నఘోష ఉవాచ:—

సాధయిత్వా ప్రయత్నేన కోటిభేదో మహారసః;
శరీరేణ వినా తేన సర్వం భవతి నిష్ఫలమ్.
ఇది నాగార్జున విరచితే రసరత్నాకరే.........ఇత్యాది...

**3. కచ్ఛపుటతంత్రము:—**

ఈగ్రంథమున ఇంద్రజాలము, యక్షిణీమొదలుగా గల తంత్రములు, వశీకరణప్రయోగములు వివరింపబడి యున్నవి. ఇరువదిరెండుపటలములవరకు గ్రంథము లభించు చున్నది. శ్రీ ముక్త్యాలరాజాగారి, ఆర్షరసాయనశాల యొక్క పుస్తకభాండాగారమున నీగ్రంథము గలదు. చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముననను లభించును. ఈగ్రంథమునగల విషయముల దెలుపుటకయి గ్రంథారంభశ్లోకముల నుదాహరించుచున్నాను:—

అస్యై ర్దేవ గణై స్సిద్ధై ర్మునిదేశికసాధకైః,
యద్యదుక్తం హి శాస్త్రేషు తత్సర్వ మవలోకితమ్.
శాంబశే. యామళే మాళీ కాళేను..........;
స్వచ్ఛందే లాకులే శైవే రాజ.........శ్వరీ.
అథ శే వాతులీతంత్రే ఉచ్ఛిష్టే సిద్ధశాబరే;
కేకినీ మేరుతంత్రేచ కాలచండీశ్వరీమతే;
శాకినీ డాకినీ తంత్రే ఐంద్రేనుగ్రహనిగ్రహే;
క్రాశికే శిల్పి తంత్రేచ క్రియా కాలగుణోత్తరే;
హరి మేఖలకే గ్రంథే యింద్రజాలే రసార్ణవే,
అథర్వణే మహావేదే చార్వాకే గరుడేపిచ;
ఇత్యేవ మాగమోక్తంచ వక్త్రా చక్రేణ యచ్చ్యుతమ్,
తత్సర్వంచ సమాకృష్య దుగ్ధా దమృతవోదరాత్;
సాయకానాం చితార్థాయ మన్త్రిఖండ మిహోచ్యతే,
వశ్య మాకర్షణం స్తంభం మోహ ముచ్చాట మారణమ్;
విద్వేషం వ్యాధికరణం పశు సర్వార్థనాశనమ్,
కౌతుకం చేంద్రజాలంచ యక్షిణీ మంత్రసాధనమ్;
దివ్యమదృశ్యం......ఘుకభేదకర్వంచ మృత సంజీవిసార్థకమ్,
తథా కచ్ఛపుటం తంత్రం సాంగోపాంగం అనేకథా;

* * * * ”

ఇతి సిద్ధనాగార్జునవిరచితే కచ్ఛపుటే.....పటలః—

ఇందు పేర్కొనిన గ్రంథములు హారిమేఖల ఇత్యాదులు ఇప్పుడు మనకు లభించుటలేదు.

**4. ఆరోగ్య మంజరి:—**

ఇది నాగార్జునరచిత మని రసరత్నాకరమునుండి తెలియుచున్నది. గాని పుస్తకముగాని వివరములుగాని తెలియవు.

**5. యోగసారము:—**

ఇట్టి గ్రంథము నాగార్జున విరచిత మని నేపాల్ కేటలాగువలన దెలియుచున్నది.

“ఇతినాగార్జున విరచితేయోగసారే”

యోగసారమను గ్రంథము వంగసేనయందు ఉదాహరింపబడియున్నది. అది యోగరత్నావళి యను గ్రంథ మగునని కొందరు అనుమానించిరి. ‘నేపాల్ కేటలాగున’ యోగసారమనుపేర గ్రంథము ఏతత్కర్తృకము గలదు కావున పై అనుమానమునకు అవకాశముండదు.

**6. రతిశాస్త్రము:—**

ఈ గ్రంథము నాగార్జుననకును, తుండికిని సంవాదరూపమున నున్నది. కామశాస్త్ర విషయిక గ్రంథము.

మొదట:—

సిద్ధనాగార్జునో నామ పురాసీత్ తాపసో మహాన్;
శాంతో దాంతో జితాత్మాచ నియతః ప్రయతః శుచిః,

చివర:—

ఇతితే కథితం విప్ర, యత్ పృష్టం తాపసేశ్వరః;
శ్రుత్వా చైతం విచార్యాయ రతిశాస్త్రే జ్ఞానీభవ.

గద్య:—

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే రతిరమణాఖ్యే రతిశాస్త్రే నాగార్జున తుండీసంవాదే నారీజాతి రస్రీతిసాధనోపాయనామక ఏకాదశపాద స్సమాప్తః ఇతి రతిశాస్త్రస్సమాప్తః"

8. రసకచ్ఛపుటము:—

ఇందు రసాదులశుద్ధులు, రసప్రయోగములు, ఇతర ఔషధముల యోగములు గలవు. ఇందు భారద్వాజ గోత్రుడగు గన్నిరాజునుగూర్చియు, వైఖానససూత్రముల గూర్చియు ప్రశంస కలదు. గ్రంథకర్త పరిశీలించిన ఇతర గ్రంథములనామములు పేర్కొనియున్నాడు. ఈగ్రంథము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకాలయమున గలదు:—

గ్రంథారంభము:—

జగన్మంగలం సర్వవిద్యాగణేశమ్
మహాభూషితం రక్తసిందూరవర్ణమ్;
జగద్విఘ్ననిఘ్నం తమానన్దపూర్ణమ్
జగన్మోహనం సర్వవిద్యాస్వరూపమ్.

*　　*　　*　　*

హంసాసన సమారూఢం పమరీం కామరూపిణీమ్,
త్రైలోక్య వరదాం దేవీం శారదీం చాదియోగినీమ్;
ఆమ్నాయో జగదారాధ్య శక్తవి(న్) బ్రహ్మాదికృతీమ్,
యః సిద్ధాత్మ మదేవాయ్యం తం గురుం జ్ఞానదర్శనమ్;
తా— ధన్వంతరివ్యాసం పీయూషం పారనం శుభమ్.
వ్యాలీ నాగార్జునం చైవ గోవిన్దం లోకనాయకమ్,
నీరనం రసరాజంచ రసస్తత్వం రసార్ణవమ్;
రసేన్ద్రం మంగళంచైవ రససిద్ధం రసామృతమ్,
భవానీసుతసోమంచ కాకచండీశ్వరీ మతమ్;
రసరత్నాకరాదీంశ్చ స్వచ్ఛందం చర్పటీమతమ్,
జినేంద్రస్యామృతం రాజ మృగాంక రసదీపికామ్;
.........రసశాస్త్రాణి దృష్ట్వా లోకహితాయవై,
భారద్వాజ సముత్పన్న గోత్రా ద్విజవర స్సుధీః;
పన్నిరాజో భువఖ్యాతో వైఖానస పదాంకితః,
తస్య రాజ స్సత్యవాదీ దేవ ద్విజపరాయణః;
రసరాజనిధిం వక్ష్య నాగేశ స్సర్వసిద్ధిదమ్,
వాపీకూప తటాకానాం వివరం గోతమ స్తకే;
కవాటకన్దరం చైవ భూమి భాసితమ స్తకే,
అష్టస్థానాని సూతాని దోషస్థాన మితి స్మృతమ్;
సకలం "కం యథా సూతో నిష్కలం" కో యథా పునః,
నమోస్తు సుత రాజాయ యేన వ్యాప్తం జగత్త్రియమ్;

*　　*　　*　　*

ఇంద్రగోపనిభం కాంతం దరదం రుధిరం తథా,
క్రామణం యేన జానీతే శ్రమ స్తస్య నిరర్థకమ్.

గద్య:—

ఇతి నాగార్జున విరచితే రసకచ్ఛపుటే ఘోటబంధసుకటికాతుయ, జలూకాబంధకాది సర్వపాషాణలోహ రత్నమారణం నామ అష్టమః పరిచ్ఛేదః.

9. సిద్ధనాగార్జునీయమ్.

ఇది, మధ్యపరగణాల, బేరార్ కేటలాగులో ఉదహరింపబడియున్నది. నం. 6464.

సిద్ధనాగార్జునుని పేర్కొనిన ఇతర గ్రంథకర్తలు:-

వ్యాఖ్యామధుకోశము:—

"ఆరోగ్యమంజర్యాం నాగార్జున ఇత్యాహ:—
ఉద్గారోపి విశుద్ధతా ముపగతే—భుక్తాదిషు
స్నిగ్ధత్వం వదనస్య సన్ధిషు రుజా కృత్వా శిరోగారవమ్,
మన్దా జీర్ణరసేతు లక్షణ మిదం తన్త్రాతిఖద్ధా
.........జ్వరమూర్ఛనాడిచభవేత్ సర్వామయశోభనమితి.

రసేంద్రచింతామణి

అథ తిర్యక్పాతనవిధిః :—

ఘటే రసం వినిక్షిప్య సజలం ఘటమన్యకమ్,
తిర్యక్ ముఖం ద్వయం కృత్వా తన్ముఖం రోధయేత్ సుధీః;
రసాధో జ్వాలయే దగ్నిం యావత్ సూతో జలం విశేత్,
తిర్య క్పాతన మిత్యుక్తం సిద్ధై ర్నాగార్జునాదిభిః.

ఈ క్రింది యౌషధయోగములు నాగార్జున నిర్మితములుగా, నాయుర్వేదగ్రంథములందు చెప్పబడియున్నవి.

1. నాగార్జునవర్తి.

ఇది నేత్రవ్యాధులయం దుపయోగపడును. ఈ యోగము గల శ్లోకము పాటలీపుత్రమునందు శిలా స్తంభముపైనకూడ చెక్కబడియున్నట్లు తెలియుచున్నది. ఆశ్లోకమును జూపుచున్నాను:

"త్రిఫలా వ్యోమ సిన్ధూత్థ యష్టీతుత్థ రసాంజనమ్,
ప్రపౌండరీకం జంతుఘ్నం లోధ్రం తామ్రం చతుర్దశ;
ద్రవ్యాణ్యేతాని సంచూర్ణ్య వర్తిః కార్యా నభోంజనా,
నాగార్జునేన లిఖితా స్తంభే పాటలిపుత్రకే."

2. చతుర్దశాంగవర్తి.
3. నాగార్జునయోగః (చ. ద.)
4. విశ్వేశ్వరరసః (ర. స. స.)
5. అభ్రవటికా (ర. ర. స.)
6. రసాభ్రవటీ (ర. ర. స.)
7. నాగార్జునాభ్రమ్ ( ,, )
8. బృహత్పాణినీయ భక్తగుటికా (ర. చి.)
9. మూలికాబంధనమ్ (ర. ప్ర. సు.)
10. నాగార్జునగుటికా
11. మృతసంజీవినీగుటికా
12. సిద్ధరసః
13. హరిద్రాఖండః

తిర్యక్పాతనయంత్రపద్ధతి, రసగంధకముల సంయోగముచే కజ్జలీవిధానము, నాగార్జున కల్పితము లని తెలియుచున్నది. ఈయనకుముందీ విధానము ప్రచారములో లేదు. నాగార్జున నిర్మితములైన పై యోగవివరముల దెలుపు శ్లోకములు విస్తరభీతిచే విడిచినాడను.

ఈవ్యాసము పి. సి. రే గారి 'హిందూకెమిస్ట్రీ', జి. యన్. ముఖర్జీగారి 'జర్నల్ ఆఫ్ ఆయుర్వేద' లోని వ్యాసము ఆధారముగాగొని వ్రాసినాను—వీరలకు కృతజ్ఞుడను.— వే. శం.

---

# ఋగ్వేదకాలము: ఇంద్రుడు, వజ్రాయుధము

గర్భాం అప్పారావు గారు, బి. ఏ.

ఋగ్వేదమున నార్యులైదుజాతులు (పంచజనులు)గా విభజింపబడి దేవతలను పూజించుటయందును, సాంఘిక మతాచారములందును సమత్వము వహించి, వ్యవసాయమే ప్రధానవృత్తిగలవారై, గ్రామణ్యధికారమున నుండు గ్రామములందును, రాజాధికారమున నుండు పురములందును నివసించుచు నసామాన్యనాగరికత గలవారైయున్నట్లు ఋగ్వేదము తెలుపుచున్నది. ఋగ్వేదవ్యాఖ్యాతశాయనుడు ముఖ్యజాతులు నాలుగనియు, నిషాదులు పంచములనియు చెప్పెను. కాని ఆర్యులు తమతమ గుణములబట్టియు, నభిరుచులబట్టియు వృత్తులవలంబించి వేరువేరుశాఖలుగా విభజింపబడిరి. వారిలో వారు సంబంధ బాంధవ్యములు జరుపుచుండెడివారు. నిజముగా నీయైదుభాగములవారు వేలువేలుజాతులవారు కాక భరతుడు, త్రిత్స్యవు, పూరుడు, అనువు, ద్రుహ్యువు, తుర్వసు అనునైదుగురి వంశములవారని చెప్పవచ్చును. వీరు కాక వేరుమతాచారములు గల అసురులు, దాసులు, దస్యులు, అనువారుకూడ నాకాలములో నుండెడివారు. వీరనాగరికులు. వీరును గాక సప్తసింధు ప్రాంతముల మోటువారగు ప్రజలు నివసించుచు నాగరికులగు నార్యుల గ్రామములపై బడి దోచుకొనెడి వారును గలరు. ఆర్యులీప్రాంతముల నాక్రమింపక మున్నే వీరచ్చట నుండెడివారు. ఆర్యుల జ్ఞానోదయముచే నీదస్యుతమము తరుమబడినది.

వీరు పై విషయములబట్టి పశ్చిమమున గాంధారము వఱకు, నుత్తరమున కాశ్మీరము, బాక్ట్రియాలవరకును వ్యాపించియుండు సప్తసింధు ప్రదేశమందలి పూర్వనివాసులని స్పష్టమగుచున్నది. మనుజుడు వానరరూపములనుండి కొంత విముక్తి చెందిన కాలమునుండియు నార్యులు సప్తసింధు నివాసులై యుండిరి. ఆర్యులు జ్ఞానవంతులైయున్నదశకు రాకముందు వారు దారువులను, శిలలను, అస్థులను ఆయుధములుగా ప్రయోగించెడు వివిధకాలావస్థల నచ్చటనే పొందిరని చెప్పవచ్చును. ఇదియే నిజమైనయెడ ఋగ్వేదమునం దీ యవస్థలగూర్చి కొంతవఱకు చెప్పబడియుండక పోదు. కావున దద్విషయముగూర్చి విచారింతము.

## ఆర్యులయాయుధములు–దారుశిలాస్థినిర్మితములు

మొదట మనుజుడు మాంసభక్షకుడు కాడు. ఆయుధము లెఱుగని కాలమున సులభసాధ్యములగు ఫలపర్ణకందమూలములు మనుజుడాహారముగా గ్రహించుట స్వభావము. దుంపలు త్రవ్వుటకు సూదిగల కఱ్ఱలు వాడబడుచుండెను. ఇవి మన్నికగలవి కాకపోవుటచే సూదిరాళ్లందుల కుపయోగింపబడుచుండెను. అప్పటి మనుజులు తేనెపట్టులనుగూడ గ్రహించి తేనె నాహారముగా నుపయోగించుట సైజము. మొదట మనుజుడు శాకాహారి యయినను జనసంఖ్య హెచ్చుటచే క్రమక్రమముగా కందమూలాదులు చాలక మనుజుడు జంతుమాంసభక్షణముకూడ నవలంబించెను. జంతుసంహారమునకు దగిన యాయుధములు చూడవలసివచ్చెను. ఇందునిమిత్తమే శాఖాకాండమునో, లేక యేరాతినో యుపయోగించుచుండెను. శాఖాకాండము మన్నిక లేకపోవుట రాతిని గాని, యెముకనుగాని యాయుధముగా నుపయోగించుట మేలని యెంచెను. పశువులయొక్కయు, దుప్పులయొక్కయు కొమ్ములు సూదిగా నుండుటచే నాయుధములుగా నవి యనువుపడుచుండెను. ఈ యెముకల ననువుదనమే రాతి యాయుధములు చేయుటయందు నేర్పరితనము కల్పించెను. రాళ్ల నుపయోగించు నవస్థనుండి ఎముకల నుపయోగించునవస్థకు వచ్చుసరికి వేయిసంవత్సరములు పట్టెను. ఈయస్థిప్రయోజనమువలన నార్యు లప్పటికి పశువులు, గుఱ్ఱములు పెంచుచు వ్యవసాయము ప్రారంభించిరని తెలియవచ్చుచున్నది. వ్యవసాయప్రారంభము వీరి సంచారజీవనమునుండి స్థిరజీవనమునకు మార్పు చూపుచున్నది. కాని అప్పటికిని మనుజుడు పశువులను బెంచుచు, వేటకుక్కలను వెంటబెట్టుకొనుచు, తన యాయుధములతో జంతుసంహారము చేయుచు సంచారజీవనము చేయుచుండెను.

ఇంద్రుని వజ్రము ప్రథమమున ఱాతితోను, తరువాత ఎముకతోను జేయబడినది. వృత్రాసురుని జంపిన యింద్రుని వజ్రాయుధము శిలాస్థి నిర్మితమని ఋగ్వేదము చెప్పుచున్నది. ఆకాలపు జనులు తాము ధరించెడు నాయుధములే తమదేవతలచే ధరింపజేయుట స్వభావము. దేవేంద్రుడు ధరించిన యాయుధమును బట్టి అప్పటి యార్యులనాగరికత తేటపడుచున్నది.

ఋగ్వేదమున 'పరశు'వనుమాట గుఱ్ఱపు ప్రక్కయెముక కర్థ మిచ్చుచున్నది. దాని యంచులు వాడిగా నుండుటచే ఖడ్గముగా వాడ బడుచుండెను. మొదట కుశతృణమును కోయు కొడవలిగాను, తరువాత యుద్ధమందు ఖడ్గముగాను నిది వాడబడుచుండెను.

ఇనుముయొక్క యుపయోగము తెలిసిన తరువాత నీయశ్వ పరశురూపమున నినుముతో నాయుధములు తయారుచేయబడుచుండెను. దధీచియెముకతో నింద్రుని వజ్రాయుధము తయారగునట్లు ఋగ్వేదమున జెప్పబడెను. మఱియు దధీచియెముకలనే వృత్రుని జంపుటకు తొంబదితొమ్మిది పర్యాయము లింద్రు డుపయోగించినట్లు చెప్పబడినది. త్వష్టృసాహాయ్యమున నీయాయుధ మింద్రునికి లభ్యమైనది. ఈవజ్రాయుధమే యుద్ధము చేయునపుడు కలిగిన తళతళలవలన బంగారు మయముగాను, ఇనుముతో జేయబడినదిగాను వర్ణింపబడినది. ఇది ఒక్కొకమారు చతుష్కోణములు గలదిగాను, నింకొక్కమారు శతకోటిగాను, సహస్రకోటిగాను వర్ణితమైనది. ఋగ్వేదకాలమునాటి కినుము మున్నగులోహము లుపయోగమం దున్నప్పటికి నంతకు పూర్వ మున్న యాయుధముల వృత్తాంత మిందువలన తెల్లమగుచున్నది. దధీచి ప్రజల సౌఖ్యమునకు యజ్ఞములు చేసి తానే త్వష్టను ప్రేరేపించి వృత్రాసుర వధకై తనయెముక నింద్రుని కాయుధముగా నొసగుమని స్వార్థత్యాగము చూపెను. ఈతడే మొదటియజ్ఞమును చేసినవాడు. ఈతనిగూర్చి ఋగ్వేదమున నొక చిన్నకథ కలదు. దధీచి యింద్రునికి ప్రవర్గ్యవైద్య మధువైద్యము నేర్పెను. ఇంకెవ్వరికి నీవిద్య నేర్పరాదని యింద్రుడు కోరినప్పటికి దధీచి యావిద్య నశ్వినీదేవతలకు నేర్పెను. అందుచే నింద్రుడు కోపగించి దధీచిని సంహరింప నెంచగా నశ్వినీదేవత లతనిని రక్షించుటకు దధీచిశిరము నశ్వశిరస్సు ఆకారముకలదిగామార్చిరి. అయిన నింద్రుడు కురుక్షేత్రమందున్న శర్యణావతి సరోవరతీరమున నాతనిశిరము తెగగొట్టెను. ఈకథ దధీచియెముకలనుండి యింద్రుని వజ్రాయుధము చేయబడినదని తెలుపుచున్నది. దధీచియనునది యొక్కగుఱ్ఱమనియు, గుఱ్ఱముయొక్క యెముకలనుండి యార్యులాయుధములు తయారుచేసికొనిరనియు నిందువలన గ్రహింపనగును. సప్తసింధు ప్రాంతమున నప్పటికిగల పెద్దజంతువు గుఱ్ఱమేయనియు చెప్పవచ్చును. అందుచేతనే సింధుదేశ సంబంధమగు సైంధవపదము ముఖ్యజంతువగు గుఱ్ఱమునకు రూఢియైనది. వజ్రపదము కఠినమగుజాతికి నొకప్పు డుపయోగింపబడుటచే నింద్రుని వజ్రాయుధము జాతిచేగూడ చేయబడియుండును. ఇందుకు దృష్టాంతముగా,

"ఓ ఇంద్రా! ఓసోమా! మీయాయుధముల నాకసమునుండి విసరుడు. నాశము లేనివియు, తీవ్రాగ్ని సదృశములునగు మీజాతియాయుధములచే రాక్షసుల బొడువుడు. మారుమాటాడనీక సాగనంపుడు" అని ఋగ్వేదమున జెప్పబడినది. ఇంద్రాయుధమునకు నశ్మ మనుపదము ప్రయోగింపబడెను. అశ్మమనగా ఱాయి. అందే యొకచో శృంగము మొనయందు గల బాణము చెప్పబడెను. దీనినిబట్టి యార్యుల యాయుధములు ఱాళ్లతోడ, నెముకలతోడ జేయబడెనని స్పష్టమగుచున్నది. ఋగ్వేదమందు దధిక్ర మను నొకదివ్యాశ్వము పేర్కొనబడెను. దధీచి యను పదము దానిరూపాంతరమయి యుండును. దధీచియనునది యొక గుఱ్ఱము కాని, లేక యశ్వరూపము నొందిన దధీచిమహర్షి కాని కావలెను. ఎట్లయిన నార్యు లెఱిగిన పెద్దజంతువగు గుఱ్ఱపు టెముకలతో నాయుధములు తయారుచేయుచుండిరి. దధీచికథ కురుక్షేత్రమునకు సంబంధించిన దగుటచే నీనవీనాస్థియుగము సప్తసింధు ప్రాంతముననే ప్రారంభమైనది.

తరువాత నింద్రుని వజ్రాయుధము హిరణ్మయమనియు, హరిద్వర్ణము కలదనియు, నినుముచే జేయబడెననియు ఋగ్వేదము నుడువుచున్నది. దానిని ఝుళిపించునపు డా యాకాంతులచే నొప్పుచుండెనని యూహించినను, ఆర్యులు కాంచనము, తామ్రము, కాంస్యము, అయస్సు మున్నగు లోహములు కాలానుక్రమమున దెలిసికొని వాని నుపయోగించుచు నాగరికతయం దభివృద్ధి గాంచుచుండినట్లు తెలియుచున్నది. ఇంద్రాయుధమును గురించి జాగ్రత్తగా తెలిసికొనినయెడ నార్యుల జ్ఞానాభివృద్ధియు, నాగరికతయు తెలియగలవు.

ఋగ్వేదమున నింద్రునికిగల ప్రాముఖ్యస్థాన మార్యులనాగరికతయం దింకొక విషయమును వెల్లడిచేయుచున్నది. ఆది మనుజుడు పూజించిన ద్యావాపృథ్వీ మిత్రావరుణాంశభాగార్యమణదక్షప్రజాపతులగు దేవతలలో నింద్రుడు చేరలేదు. మిత్రావరుణులు జ్యేష్ఠతనులని ఋగ్వేదము తెలుపుచున్నది. ఇంద్రుడు చాలకనిష్ఠుడును, మానవులవలెనే తలిదండ్రులు కలవాడునునై యున్నాడు. "మహాబలుడగు దేవుడు మహాబలుడగు కుమారుని బుట్టించెను. వీరమాత యాతని గాంచె" నని యింద్రునిగూర్చి ఋగ్వేదము చెప్పుచున్నది. ద్యావాపృథ్వ్యులు దివ్యజనకులని చెప్పబడిరి. వీరే యింద్రుని జనకులని చెప్పవచ్చును. ఋగ్వేదమున నొకచో నదితి యెనమండ్రు కుమారులగనెననియు, నం దేడుగురు దివ్యులు, నమర్త్యులు ననియు, నెనిమిదవవాడు మర్త్యులవలె జన్మములొందునట్లు విడువబడె ననియు చెప్పబడినది. ఆయేడుగురిలో నింద్రుడుకూడ చేరి దేవాదిత్యనామమున బరగుచుండెను. ఋగ్వేదపూర్వభాగమున నాదిత్యు లారుగురే చెప్పబడిరి. అం దింద్రుడు చేరలేదు. దీనిబట్టి యింద్రు డాదిత్యులలో నిటీవల జేర్పబడెనని స్పష్టమగుచున్నది. అదితికశ్యపు లీయాదిత్యులకు జనకులు. ద్యావాపృథ్వ్యులే యీఅదితికశ్యపులు. ఇంద్రుడు జనించినవెంటనే స్తన్యపాన మొనర్పక సోమపానము చేసెను. అందుచే నింద్రుని జననమునకు ముందే సోమపానము ప్రచారమం దుండెనని చెప్పవచ్చును.

ఇంద్రుని జననమునకు గారణ మేమి? మబ్బురూపమున దాల్చి వర్షమును లోబఱచుకొని యనావృష్టికి గారణభూతుడగు వృత్రుని సంహరించుటకే యింద్రుడు కల్పింపబడెను. ఇంద్రునికి వజ్రాయుధము తయారుచేసిన యగ్నిదేవుడగు త్వష్టృకుమారుడు వృత్రుడు. బ్రాహ్మణుడును, విశ్వరూపుడునునగు వృత్రు నా వజ్రాయుధముచేతనే యిం

ద్రుడు సంహరించెను. తనకుమారుని జంపెనని త్వష్టయు, నాతనిశిష్యులును యజ్ఞములు మాని, యింద్రుని పూజించుట మాని యతనికి బ్రియమగు సోమరస మర్పించుట వదలుకొనిరి. కొన్నాళ్ల కింద్రు డాతని యనుచరుల ప్రోత్సాహమున సోమపాన మొనర్చెను. అనగా త్వష్టయొక్క యనుచరులు వృత్రాసురవధకై యిష్టపడకపోగా నింద్రానుచరులు వృత్రుని వధ కోరి యింద్రునికి యుద్ధమందు బలము కలుగునట్లు సోమపానము చేయించిరి. ఇదియే యార్యులందు రెండు తెగలకు ద్వైధీభావము కలుగుటకు ముఖ్యకారణము. అయిన నీవైరుధ్యమునకు ముఖ్యకారణ మేమి?

వృత్తిభేదము—మండువేసవిదినములు గతించిన తరువాత వర్షాకాల ప్రారంభమున నాకసమున నావరించిన మేఘసముదాయమునే వృత్రాసురునిగా బరిగణించుచుండిరి. ఈకారణముననే వృత్రాసురుడు విశ్వరూపుడని చెప్పబడెను. పశువుల బెంచుచు చరజీవన మొనర్చు పూర్వార్యులవంటి జనులకు వేసగిని మలమల మాడియుండు మైదానములకును, కొండచరియలకును పశువులను మేప ననువుపడనందున వర్షాగమమునకై యెదురుచూచుచుండుట సైజము. సూర్యు నొక్కొకమారు మఱుగుపఱచి చల్లని నీటిని వర్షించు తమ పశువులకు తగిన పచ్చికను, పర్ణములను వృద్ధిచేసిన మేఘములు వారి కాహ్లాదకరములు. ఋగ్వేదమున మేఘమునకు గోత్ర మను పేరు గలదు. (గాః త్రాయతీతి గోత్ర—అనగా గోవులను రక్షించునది.) ఆర్యులు స్థిరగృహములు లేక గోపాలురై చరజీవనము చేయుచుండునపుడు గ్రీష్మానంతరమున వర్ష మొసంగు మేఘదర్శనము కాగానే యుత్సాహపూరితులై, యావర్షాకాలమును గౌరవించుటకై మధుసోమద్రాక్షారస సమర్పణలతో నుత్సవములు సలుపుచు వృత్రు నారాధించుచుండిరి. వృత్రునకే యీపదార్థములు సమర్పింపబడుటచే నాతడు దేవాసురగురువుగా పరిగణింపబడి వర్షాకాలము మూడుమాసములు నెక్కుడారాధింపబడుచుండెను. ఏకత ద్వైత త్రైతనులను ముగ్గు రీమూడుమాసముల కధిదేవతలు. మూడవవాడగు త్రైతనుడు కుంభ వృష్టిగా వర్ష ము కురిపించుచుండెను. చరజీవనము చేయుచున్నంతవరకు నార్యులు వృత్రునియందు గౌరవమే కాని యసూయ యెన్నడు చూపలేదు. ఋగ్వేదము నాటి పంచజనార్యజాతులలోని కొందరు వ్యవసాయ మవలంబించి సస్యములసొంత పాకలు వేసికొని స్థిరవాస మేర్పరచుకొనినపుడు అస్థిరమును, నిరాధారమునగు జీవనమార్గములగు ఫలకందమూలసంగ్రహణము కన్నను, మృగయాలబ్ధమగు మాంసముకన్నను, పశుక్షీరములకన్నను వ్యవసాయఫలమే మేలనితలచిరి. అపుడు వారిదృష్టిపథ మింకొకవిధమున మారెను. వ్యవసాయము జయప్రదముగా జరుగుటకు సకాలవర్ష మావశ్యకము. కాని వర్షములు సకాలమున పడుటలేదు. అందుచే వారు మేఘములు వర్ష మును విడువక తమదుస్థితికి కారణము లగుచున్న వని వారు మేఘముల ననూయతో జూచెడివారు. మేఘరూపుడగు వృత్రుడే తమ్ము బాధించు తలంపుతో నిట్లు వర్ష బంధనము చేయుచున్నాడని యాతని దౌష్ట్యమును గర్హించిరి. ఋగ్వేదమునందుచే నసితవర్ణుడును, మాయావియునగు వృత్రునిదుశ్చేష్టితములను నిర్మూలముచేయుటయే కాక యాతని సంహరించి యాతనిచే నిబద్ధమైన వర్ష మును, నాచ్ఛాదింపబడియున్న సూర్యుని విముక్తిచేయ సమర్థుడగు దేవునిసాయమును గాంక్షించువా రైరి. తనవజ్రాయుధముచే మేఘమును తుత్తునియలుచేసి వర్ష ధారలను వెడలగ్రక్కింపగలిగిన యింద్రుడు వీరికి దేవు డయ్యెను.

నిదాఘాంతమున కొంతకాలమువరకు, ప్రతిమనుజుడును భూమి చల్లబడుటకై వర్ష మున కెదురుచూచుచున్నపుడు మేఘము లేర్పడి సమూహముగా నాకసమున కూడుచుండుట తప్ప వర్ష బిందుపతనము చూపట్టదు. ప్రత్యద్భుత విషయమునందు నేదేనొక దేవత్వము కాని, సర్వశక్తిత్వము కాని యారోపించు వేదకాలమునాటియార్యుల కిట్లు వర్ష ము సకాలమున పడకుండుట కేదేనొక రాక్షస మాయ కారణమని యూహించుట వింతకాదు. ఈమాయకు కారణము వృత్రుడని యూహించిరి. అతని సంహరించుటకు తగినవాడు వజ్రాయుధధారియగు నింద్రుడే యని తలంచిరి. మేఘగర్జితములును, మెఱుపులును వీరిద్దఱికి జరిగిన యుద్ధమందు పుట్టినధ్వనులుగాను, ఖడ్గకాంతులుగాను నూహింపబడినవి.

కాని వృత్రుడు సులభసాధ్యుడు కాడు. వజ్రప్రహారముల దప్పించుకొనుచు యుద్ధము చాలకాలము చేయుచుండెను. కావున కర్షకులింద్రుడు హెచ్చరికతో యుద్ధము చేయలేదని తలంచి యాతని కుత్సాహమును, బలమును గలిగించుటకై సోమయజ్ఞములు చేయుచుండిరి. కావున సోమయజ్ఞ మింద్రుని సంతృప్తిపఱచుటకై ప్రారంభింపబడినది. ఈసోమయజ్ఞము లొక్కవర్ష కాలముననే కాక సోమరసమూలమున నింద్రునికి శక్తి గలిగి శత్రునితో పోరాడగలుగుటకు తదితరకాలములందుగూడ జేయబడుచుండెను. ఈసత్రయాగములు ప్రథమమున వర్షాగమార్థమై చేయబడుటచే కామార్థములని చెప్పవచ్చును. యుద్ధములో నింద్రునికి మరుత్తులు, పర్జన్యుడు, బృహస్పతి, విష్ణు, త్రైతనుడు మున్నగువారలు తోడ్పడుచుండిరి.

త్రైతనుడు, పర్జన్యుడు వీ రింద్రునికి పూర్వులు. త్రైతనుడు వర్షాధిదేవతలలో ప్రథముడు. వర్షాకాలము మూడవనెలలో కుంభవృష్టి కురిపించుచుండెను. గ్రీకుదేవతలలోకూడ సముద్రమును, మరుత్తులను తన యాజ్ఞలో నుంచగలిగిన ట్రైటన నను నొక సముద్రస్వామి కలడు. కనుక నార్యులలో మొదటి వర్షాధిదేవత త్రైతనుడు. కాని ఋగ్వేదమున నీతడింద్రుని యాజ్ఞకులోనై యున్నట్లు కన్పట్టుచున్నది. పర్జన్యు డొకడు మొదటి వర్షాధిదేవతవలె జూపట్టుచున్నాడు. నార్సుసారస్వతమున ఫయర్జిన్ (Fiorgyn) అనుపద ముఱు మనునర్థ మిచ్చునది కలదు. ఋగ్వేదమునకూడ పర్జన్యపదము మొదట వర్ష మేఘమునకును, క్రమముగా వర్షాధిదేవతకును చెందియుండెను.

ఊబుములు, మెఱుములు, మరుత్తులు—వీనిసాయమున పర్జన్యుడు వర్షము కురిపించుచుండెను. అందుచే నీతని వర్షాధిదేవతగా నార్యులు చూచుచుండిరి. ఆర్యులు చరజీవనము చేయునపుడే యీతని సాయ మవసరమై యుండెను. ఆర్యులు స్థిరజీవనము చేయునపుడు సకాల వర్షము, గోసస్యసంరక్షణ యవసరములయ్యెను. సకాలవర్షమునకై వృత్రుని సంహరించువాడును, దస్యులను, రాక్షసులను బారదోలువాడు నునగు నింద్రుడే పిదప వారికి పూజనీయు డయ్యెను. ఈ కారణమున నింద్రుడు త్రైతను పర్జన్యుల నధిగమించెను. పై విషయముల బట్టి వృత్రుని నార్యులలో నొకశాఖవా రసూయతో జూచుటకును, నింకొకరు వృత్రాసుర సంహారమును జేసిన యింద్రునినిందించుటకును గల కారణములను సులభముగా గ్రహింపగలుగుదుము.

వృత్రుడు దేవతలలోనివాడు. ఇతడు వర్షము నిచ్చువాడు. గోవుల బెంచుకొని జీవనము చేయ నార్యులకు పచ్చిక వృద్ధి కలిగించునంత వర్ష మప్పుడప్పుడు పడిన చాలును. స్థిరజీవనము చేయు కర్షకులకు నార్యుల కట్టి వర్షము చాలదు. కావున మొదటి తెగవారు వృత్రుని దేవునిగా భావించిరి. రెండవ తెగవా రాతడు తమకు సకాలవర్ష మురాకుండ నడ్డుపడుచున్నాడని యాతని రాక్షసునిగా బరిగణించిరి. ఈ ద్వంద్వభావమే ద్వంద్వప్రభుత్వమునకు మూలమయ్యెను. మతవిషయములందును ద్వంద్వముకలిగెను. కారణములు తుదముట్టినను క్రమముగా వారిలోనై షమ్యమువృద్ధియై యొక తెగవారు దేశమువిడుచుటకూడ సంభవించెను. "ఇంద్రా! దేవైకుడగు వృత్రుడు నీవజ్రఘాతమును ప్రతిహతము చేసినపుడు నీ వశ్వ వాలమువలె భయంకరుడవైతివి" అని ఋగ్వేదమున చెప్పబడినది. దేవశబ్దము 'దివ్ to shine–ప్రకాశించుట" అను ధాతువునుండి కలిగినది. వృత్రుడు నీలమేఘ రూపమున నున్నను మెఱుపురూపమున మేఘాంతర్గతుడయి యుండి ప్రకాశవంతు డగుటచే దేవతగా పరిగణింపబడెను.

ఇంద్రుని పారసీకులు రాక్షసునిగా బరిగణించిరి. అభిప్రాయభేదము కలిగి సప్తసింధు ప్రాంతములు వీడి పడమరగా పారసీకమున్నగు ప్రదేశములకు బోయిన యార్యు లింకను చరజీవనమే చేయుచుండిరి. వా రింకను కర్షకులు కాలేదు. అందుచే వారు వృత్రునే పూజించి యింద్రుని నసూయతో జూచిరి. వృత్రుని జంపుటకై యింద్రునికి బలము కలిగించిన సోమరసమును వారు నిరసించిరి. కర్షకులైన తరువాత వీరును వృత్రుని నిందించి యాతని వర్షాధిదేవతయగు త్రిష్ట్రియను వానిచే జంపించిరి. పిదప నీదేవతకు వృత్రఘ్నుడను పేరు కలిగెను. అయినను పూర్వము సప్తసింధుప్రాంతమున నున్నపుడు వైరమేశాఖతో గలిగెనో యాశాఖకు దేవుడగు నింద్రుని రాక్షసునిగానే వారు పరిగణించిరి.

ఇంద్రునికిపూర్వము వరుణు డొక డార్యదేవతలలో నున్నత పదవి నాక్రమించియుండెను. ఇతనికి మిత్రునితో నెక్కుడు సంబంధముండెడిది. మిత్రావరుణులు వరుసగా నహోరాత్రముల కధిదేవతలు. వరుణశబ్దము 'వృ to cover–కప్పు' అను ధాతువునుండి కలిగినది. చీకటిలో సర్వ ప్రపంచకము కప్పబడియుండును. భూమికి పైకప్పుగా నుండు నాకాశము, భూమ్యాకాశముల గప్పెడి చీకటి, ఆకసమును కప్పు మేఘములు, సముద్రము నావరించియున్న జలములు–వీని కన్నిటికి వరుణశబ్ద మన్వయించి యుండుటచే వరుణుడు సర్వాత్మకుడనియు, సర్వప్రపంచపరిపాలకుడనియు చెప్పబడి సమ్రాడ్విరుదము వహించెను. వరుణుడు భూమ్యాకాశములకు ప్రభువు. అతడు సూర్యుని సృజించెను. మరుత్తుల పుట్టించెను. నదీజల ప్రవాహము లతని యాజ్ఞ యందుండెడివి. అతడు తరువాత సముద్రాధిపతియని చెప్పబడెను. జలపృథ్వ్యాకాశములకు ప్రభువయి యొప్పుచుండెను. కాని యార్యులు కర్షకులయిన తరువాత వృత్రుని బాధ నీతడుకూడ తొలగింప లేదని తలచి పర్జన్యునివలె నీతనిగూడ నార్యులు క్రమక్రమముగా విడిచి వృత్రారియగు నింద్రునే తమప్రభువుగా నెన్నుకొనిరి. ఇట్లే యింద్రు డందఱ నధిగమించి యష్ట దిక్పాలాధిపతి యయ్యెను.

---

# శాస్త్రజ్ఞుల జీవితములు

**వి. వి. యస్. ఆరాధ్య గారు**

ఆంధ్రమున నింతవరకు మాననీయులగు పండితుల అమూల్యపరిశోధనఫలితముగా కొన్ని జీవితచరిత్రములు వెలువడినవి. అవియు కొంతమందికవులవి, రాజులవి మాత్రమే. కాని జాతియొక్క ఉద్ధారకులనదగుశాస్త్రజ్ఞులవికావు. ఏదేశమైనను శాస్త్రములు లేనిదే అభివృద్ధిలోనికి రాజాలదుగాన కవులు మొదలగువారి జీవితములతోపాటు శాస్త్రజ్ఞులచరిత్రగూడ పరిశోధించి ప్రకటించి వారియందలి కృతజ్ఞతను జూపుట మనవిధి. జ్యోతిష్య, గణితాది శాస్త్రములగూర్చి తెలుసుకొనుట అవసరమే యైనను వాటిని తజ్ఞులకు వదలి నాయథాశక్తి వైద్యుల జీవితమును గూర్చి వ్రాయప్రయత్నించెదను.

ఆయుర్వేదము నెంతమంది ప్రచారము చేసినను, ఎందరెన్ని సంహితల వ్రాసినను, మన కన్నియు కరవై పోయినవి. కొన్ని విప్లవముల వలనను, కొన్ని మన అజాగ్రత్త ఫలితమైన క్రిమిభక్షణ చేతను నశించినవి. పోగా మిగిలినవైనను సమగ్రముగా దొరకలేదు. ఐనను ఉన్నంతవరకే తృప్తిచెందుటకు మనము ఇతరతరములనుంచియు నేర్చితిమి గాన ఉన్న వాటిసహాయముతోనే ప్రకృతవిషయమునకు గడంగుదము.

## ఆంధ్రభాష - ఆయుర్వేదము

పోగా మిగిలిన గ్రంథములైనను ఆంధ్రభాషయందు పూర్తిగా లేవు. ప్రస్తుత మింతవరకు అచ్చుపడి ప్రచారములోనున్న ముఖ్యగ్రంథములు:

i. చరక—సూత్ర, చికిత్సలు.

ii. సుశ్రుత—శారీర—కల్ప.

iii. వాగ్భటం—శారీరం వినా మిగిలినస్థానములు.

iv. మాధవనిదానం.

v. శార్ఙ్గధర.

vi. చక్రదత్త.

vii. రసరత్నసముచ్చయం (ప్రథమభాగం).

viii. ధన్వంతరి నిఘంటువు—మొదలగునవి మాత్రమేగదా. ఇంకను కొన్నిటికి గోపాలాచార్యులవంటి మహనీయులచేత వ్యాఖ్యలు వ్రాసి యుంచబడినను మన దురదృష్టవశముచే అవియు మూలల మూల్గవలసినదే గాని మన కందు భాగ్యమబ్బలేదుగదా! ఇక ముందెటులుండునో?

## స్వతంత్ర రచన

ఇక స్వతంత్ర గ్రంథము లన్ననో, (సంగ్రహములు) ఏబసవరాజీయమో, చింతామణియో తప్ప పైన మందునకైనను కనుపింపవుగదా! నాగార్జున సిద్ధునిగూడ కొందరి మతానుసారము ఆంధ్రులలో కల్పుచో, మన కింకను కొన్ని రసగ్రంథములు మొదలగునవి లెక్కకు దొరకును గాని దృష్టి కగోచరములే.

## అనువాదములు - వ్యాఖ్యలు

ఆంధ్రానువాదము లేమైన నున్నవని సంతసింతమన్నను అవియు స్వల్పమే. ఇక మన కున్నవి ఆంధ్రవ్యాఖ్యలు కొన్ని, తాత్పర్యములతో నున్నవి కొన్ని యేగదా! ఇకనైనను ఏ కొంతమంది మహనీయుల దయవల్లనో ఏర్పడిన స్వల్పసంఖ్యాకములే గాని పండితులందరు ముంజంజ వేసి ఆంధ్రసోదరులకు గ్రంథము లర్పింప జూచుటలేదు గదా!

## దేశకాలాదులు

ఎట్టులో కష్టముల కోర్చి మనకు కొన్ని గ్రంథముల నందజేసిన భిషగ్వరులైనను, ఏగోపాలాచార్యుల వారో తప్ప మిగిలినవారు గ్రంథకర్తల దేశకాలాదుల పేర్కొన శ్రద్ధవహించరైరి. ఐనను ఆయుర్వేద విశారద చావలి రామమూర్తి శాస్త్రిగారు "ఆంధ్రాయుర్వేద గ్రంథములు" అను శీర్షికలో ఆంధ్రగ్రంథకర్తలగూర్చి కొంత పేర్కొనిరి.[1] కాన నేను ప్రాచీనగ్రంథకర్తలగూర్చి వ్రాయబూనెదను. ఇట్టి స్వల్పావకాశములో అందరగూర్చి చర్చించుట సంభవము గాదు గాన ప్రధాన గ్రంథకర్తల కొందరనుగూర్చియే వ్రాసి విరమించెదను.

వేదకాలమునాటి ఆయుర్వేదప్రచారకులగు బ్రహ్మ, ధన్వంతరి, శివుడు, దక్షప్రజాపతి, అశ్వినీదేవతలు, ఇంద్రుడు మొదలగు వారిని గూర్చి యిదమిత్థమని నిర్ణయించుటకు మన కేవిధమైన అవకాశములు లేవు. వారిగ్రంథములా అసలే లేవు గాన వారిని వదలి ప్రస్తుత మున్న

1. ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక for 1921-22, p. 191-193.

గ్రంథములు, చరిత్రలు మొదలగు ఉపకరణములచే భూలోకమున ఆయుర్వేదప్రచారము చేసినవారిని గూర్చి తెలుసు కొందము.

## చరకమహర్షి

వీరికి పతంజలి యనియు, గోవిందయోగియనియు నామాంతరములు. ఆశ్రమస్వీకారానంతర మున్న పేరు గోవిందయోగి[1] యనియు, శంకరాచార్యుని గురు[2] వనియు నవీనపరిశోధన ఫలితముగా కనుగొనిరి. ఈమహాత్ముడు వైద్యశాస్త్రమునందే గాక యోగశాస్త్రమునందును, వ్యాకరణశాస్త్రమునందును గూడ గ్రంథముల రచించెను. అవియే:—

i. పాతంజల యోగశాస్త్రము.

ii. పాతంజల భాష్యము (పాణినీయ అష్టాధ్యాయీభాష్యము).

## చరకుడు—పతంజలియేనా ?

"కఠచరకాల్లుక్" అని పాణినీయ సూత్రములయం దగపడుటచే పాణినికంటెను పూర్వుడని కొందరభిప్రాయపడిరి. కాని యీకఠచరకులు యజుర్వేదశాఖా ప్రవర్తకులగు మహర్షులు. "యజుర్వేదస్య షడశీతి ర్భేదా భవంతి; తత్ర చరకానామ ద్వాదశభేదాః చరకా ఆహ్వరకాః, కఠాః, ప్రాచ్యకఠాః..............ఇత్యాది."

—కాత్యాయనకృత చరణవ్యూహే.

ఇందుచెప్పబడ్డచరకుడు చాలాపూర్వుడుగాన అగ్నివేశసంహితా ప్రతిసంస్కర్తయు,పాణినీయభాష్యకర్తయునగు చరకుడు గాజాలడు.

త్రిపిటకమను చీనాదేశీయ బౌద్ధగ్రంథమున కనిష్కునకు వైద్యుడని యున్నది గావున ఈచరకుడే ప్రతిసంస్కర్తయని "లెవి"[3] యను పాశ్చాత్య పండితుని మతము. కాని యిదియు కానేరదు.

రాజతరంగిణి యను కాశ్మీర చరిత్రమున కనిష్కుడు తురుష్కరాజు[4] అనియు, 1750 సం. ల పూర్వపువాడనియు నుండుటచే చరకసంహితాకర్త యనుకొంద మన్నను, రాజ తరంగిణియందు కనిష్కుని గూర్చి చెప్పునప్పుడు చరకునిపేరుగాని, ప్రతిసంస్కర్త యనిగాని లేకుండుటచేతను ఇదియు నమ్మజాలము.

## పతంజలియే

చక్రపాణిదత్తుడు:—

"పాతంజలమహాభాష్యచరకప్రతి సంస్కృతైః,
మనోవాక్కాయదోషాణాం హర్త్రే కాపతయే నమః."

(చరకటీక.)

విజ్ఞానభిక్షు:—

శ్లో. "యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్య చ వైద్యకేన,
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలి రానతోఽస్మి."

(యోగవార్తికే.)

నాగేశభట్టు తనమంజూషయందు ఆప్తలక్షణమును చరకమునుండి గ్రహించుచు "చరకే పతంజలిః" అని వ్రాసెను.

భావమిశ్రుడును చరకుడును, పతంజలియు ఒక్కరనియే వ్రాసెను.

రామభద్రదీక్షితుడు:—

"సూత్రాణి యోగశాస్త్రే వైద్యకశాస్త్రేవ సంహితామతులాం,
కృత్వాపతంజలిమునిః ప్రచారయామాస జగదిదం త్రాతుమ్."

(పతంజలిచరిత్ర, 5 సర్గ.)

ఇంతియే కాక పాతంజలసూత్రవృత్తి మొదలగు వాటియందు భోజాదులు చెప్పుటచేతను, చరకముగూడా పాతంజలయోగసూత్రముల ననుకరించుటచేతను, యోగమును చరకములో మిక్కిలి పొగడి అదియే మోక్షద్వారమని (చ. శా. 1 అ.) చెప్పుటచేతను చరకమహర్షియే పతంజలి యని తేలినది.

## జన్మ - దేశము

ఆదిశేషుడు రోగాదులచే జను లనుభవించు బాధల చూడజాలక వేదవేదాంగ విదుడగు బ్రాహ్మణునకు పుత్రుడై[5] జన్మించి, శారీరక, మానసిక రోగనాశమునకై చరక సంహితను, యోగశాస్త్రమును రచించి ప్రకటించెను. రహస్యముగా భూలోకములో వచ్చి చరించుటచే చరకుడనియు, చేతిలో పడుటచే పతంజలియనియు చెప్పెదరు.[6] తక్షశిలా మహావిద్యాలయమున విద్యగరపుటచేతను, పాంచాలదేశమున అగ్నివేశ సంహితను సంస్కరించెనని తెలియుటచేతను, పశ్చిమోత్తర వాసియని తెలియుచున్నది.

## వైద్యగ్రంథరచన

i. చరకసంహిత:—

అగ్నివేశకృతమగు సంహిత నశించి సమగ్రముగా లేకపోవుటచే ఇతరభేలాది సంహితలనుండియు విషయము గ్రహించి ఒకసం

1. విద్యారణ్యకృత. శంకరవిజయం, అ. 5, శ్లో. 94, 95, 96, 97.
2. శంకరవిజయధ్వజం- గురుధ్యానం, పతంజలిని గూర్చి-శంకరుడు.
3. M. Sylvain Levi, in Jour. Asiatique, 1896, I. viii, p. 447 seq.
4. రాజతరంగిణి, 1 తరంగం.
5. భావప్రకాశం, 1 అ.
6. బౌద్ధమహాయుగం, 423 p.

హితనుగా చేసెను. అది చరకునిపేరుతోనే ప్రసిద్ధి చెందెను. ప్రస్తుతము మనకు దొరకు చరకసంహిత సంస్కరింపబడిన అగ్నివేశ సంహితయే. ఇదియు తరువాత నెన్నిమారులు సంస్కరింపబడెనో చెప్పజాలము.

## రస గ్రంథ రచన

పతంజలి 1 యను పేరు రసగ్రంథముల 2 లో చెప్పబడుటచేతను, ఇంకను కొన్ని రసప్రయోగములు చరకములో 3 చెప్పబడుటచేతను రసగ్రంథ నిర్మాతగూడనని చెప్పనగును.

ఆ గ్రంథములలో:—

పాతంజల తంత్రము:

ఈగ్రంథము దొరకకపోయినను శివదాసునిచే చక్రదత్త టీక యందు కొన్ని ఉదాహరింపబడినవి. కావున రసహృదయకర్తయు ఈగోవిందయోగియే కానచ్చునేమో!

## కాలము

క్రీ. పూ. 183 సం. శుంగవంశీయుడగు పుష్యమిత్రు డనురాజు (మగధదేశము) మౌర్యవంశీయుడైన బృహద్రథు డనువానిని జయించి రాజ్యము నొందెను. సాకేతపురిని జయింపజూచిన మిలిందు డనుయవనుని పారదోలెను. పతంజలి యీకాలములోనుండి అగ్నివేశ సంహితను సంస్కరించి ప్రచారముచేసెనని చెప్పవచ్చును.

i. మహాభాష్యమున చంద్రగుప్తాదులగూర్చి వ్రాసియుండుట;

ii. పుష్యమిత్రుని రాజప్రాసాదమునుగూర్చియు, అశ్వమేధ యాగమునుగూర్చియు వర్ణించుటచే సమకాలికు డనుకొనవచ్చును;

iii. రాజతరంగిణి4 యందు కాశ్మీరరాజగు అభిమన్యుని కాలమున చంద్రాచార్యుడను వైయాకరణి మహాభాష్యమును కాశ్మీరమున వ్యాప్తిచేసెనని యుండుట: అభిమన్యునికాలము క్రీ. శ. 40 సం.ల ప్రాంతము;—

ఇట్టి కారణములచే చరకుడు (పతంజలి) క్రీ. పూ. ఉండిన వాడనియు, కావున ద్విసహస్రాబ్దములకు పూర్వుడైనను కావలెననియు చెప్పవచ్చును. దీనినే భండార్కర్ 5 మొదలగు పండితు లంగీకరించిరి.

## సుశ్రుతుడు

విశ్వామిత్రుని కుమారుడు. క్షత్రియుడు. తన తమ్ములతో కలిసి ధన్వంతరివద్ద వైద్యవిద్య నభ్యసించుటకు వెడలి శల్యతంత్ర మభిమాన విద్యగా గ్రహించెను. సుశ్రుతమను గ్రంథమును తనపేరుతో రచించెను. కాని యిప్పుడు మనకు దొరకునది యిది కాదనియు, వేరొకటి యున్నదనియు పండితులు నిర్ణయించిరి. ఎటులైనను ఇప్పటిసుశ్రుతమందును వృద్ధసుశ్రుతమందలి విషయము చాల గలదు. అనేక శల్యతంత్రగ్రంథముల కిదియే మూలము.

## కాలనిర్ణయము

సరిగా కాలమును నిర్ణయించుట కష్టమే యైనను ఈక్రింద వ్రాయబోవు కారణములచేత 2,000 సం. పూర్వపువాడని నిర్ణయించవచ్చును:

i. క్రీ. శ. 775 సం. టర్కీలో చేరిన బాగదాద్ (Bagdad) పట్టణమున హరూన్ (Horun), మన్సూర్ (Mausun) అను కాలిఫులకాలమున సంస్కృతభాషనుండియో, పార్సీభాషనుండియో అరబ్బీ భాషలోనికి తర్జుమా చేయబడియుండుట 6 ఇప్పటికిని ఇవి "కితాబ్ షానూన్ అల్ హింద్"7 అనియు, "యిస్రుద్"8 అనియు ప్రచారములో నుండుట;

---

1. పాతంజలతంత్రం.

2. పాతంజలేతు స్వర్ణాదినాపి పాకజ్ఞాన ముక్తమ్:—

"తావల్లోహం పచే ద్వైద్యో యావ ద్వస్త్రేణ పీడితమ్, సముద్రం జాయతే వ్యక్తం న నిస్సరతి సింధవః."
శివదాసు, చక్రదత్త టీక - లోహ పాకవిధి.

3. "సర్వవ్యాధి నిబర్హణ మద్యాత్ కుష్టీరసకంచ నిగృహీతం." (చ. చి. 7. అ.)

"ఏవ మేవ చ లోహానాం ప్రయోగ స్సంప్రకీర్తితః, అనేనైవ విధానేన హేమ్నశ్చ రజతస్యచ,
అయః ప్రకర్షకృత్ సిద్ధః ప్రయోగ స్సర్వరోగనుత్." (చ. చి. 1 అ.)

4. క్రీ. శ. 12 శతాబ్దిలో కల్హణపండితునిచే వ్రాయబడినది.

5. *vide* Mabel Duff's Chronology of Ancient India; also Gold Stucker's Panini, p. 233-4; Prof. Bhandarkar's, Indian Antiquary. pp. 298-302.

6. Charaka (English Translation) by Avinashachandra Kaviratna, Introd. p. 2. దీనినే Prof. Wilson, Dr. P. C. Roy, కవిరాజ ఉమేశచంద్రగుప్త, Dr. హార్నల్, C. I. E. గార్లు ఆమోదించిరి.

7. బౌద్ధమహాయుగము, p. 403.

8. గణనాథసేన్ మహాశయులు "సస్రుద్" అనియు, "హరూన్ ఉల్ రసీద్" నరపతికాలమున తర్జుమా ఆయెననియు వ్రాసిరి. (ప్రత్య. శా. p. 43.)

ii. క్రీ. శ. 5వ శతాబ్దమువాడగు వాగ్భటునిచేత తన అష్టాంగ హృదయమున:—

"ఋషిప్రణీతే ప్రీతిశ్చే న్ముక్త్వా చరక సుశ్రుతౌ,
భేదాద్యాః కింన పఠ్యంతే తస్మాత్ గ్రాహ్యం సుభాషితమ్."
(వాగ్భట సమాప్తి.)

స్మరింపబడుట అని; అప్పటికే నాగార్జున సిద్ధునిచేత సంస్కరింపబడి యుండుట;

iii. సుశ్రుత సంస్కర్తయగు నాగార్జునాచార్యుడు యజ్ఞ[1] శ్రీ శాతకర్ణి[2] యను రాజునకు సమకాలీనుడు; అనగా క్రీ. శ. 172—205 సమయములో నున్నటులు తెలియుచున్నది. అప్పటికే ఖిలమై సంస్కారమును కోరిన సుశ్రుత సంహిత క్రీ.పూ. రచింపబడి యుండవలెను;—

కావున 2,000 వత్సరములకు చాల పూర్వుడనియే చెప్పవచ్చును.

## వాగ్భటాచార్యులు

ఈపేరుతో ముప్వురు గలరు:

i. అష్టాంగహృదయ, అష్టాంగ సంగ్రహకర్త.
ii. ఆయనతాత.
iii. రసరత్న సముచ్చయ గ్రంథకర్త.

### Iవ వాగ్భటుడు

సింధుదేశీయుడు. తాతగారి పేరు వాగ్భటుడు, తండ్రి సింహగుప్తుడు—అని అష్టాంగసంగ్రహమున చెప్పుకొనెను.

"భిషగ్వరో వాగ్భట ఇత్యభూన్మే
పితామహో నామధరోఽస్మి యస్య,
సుతోఽభవ త్తస్యచ సింహగుప్త
స్తస్యాప్యహం సింధుషుజాతజన్మా."

అని చెప్పుటచే ఇతని పూర్వులును వైద్యులే అని తెలియుచున్నది.

### కాలము

ఈవాగ్భటు డేకాలమువాడైనది నిర్ణయించుటకు సాధనములంతగా లేవు. కాని "ఇత్సింగ్" అను బౌద్ధ చైనాపండితుడు ఆయన గ్రంథమున[3] "అష్టాంగాయుర్వేద సంగ్రాహకుడు నవీనాచార్యుడు" అని వ్రాసెను. ఈబౌద్ధపరివ్రాజకుడు క్రీ. శ. 7వ శతాబ్దమున హిందూదేశమున పర్యటనముచేసెను. కాన వాగ్భటుడు 6వ శతాబ్దారంభమున నుండెనని చరిత్రజ్ఞులు నిర్ణయించిరి.

ఈక్రింది హేతువులచేతను ఇదియే నిశ్చయము:

i. సహస్రవర్ష పూర్వులగు చక్రపాణి, డల్లనాది పండితులచే వాగ్భటపాఠము గ్రహించబడుటచే అంతకంటెను పూర్వుడై యుండవలయును.

ii. క్రీ. శ. 8వ శతాబ్దమున సింధుదేశాక్రమణము చేయబడెను. కావున సింధుదేశజుడగు వాగ్భటుడు పూర్వుడు కానిచో అష్టాంగ సంగ్రహ, అష్టాంగహృదయములవంటి గ్రంథముల సమాప్తిచేయుట విప్లవసమయముల నెట్లగును? కొందరు [4]వాగ్భటుడు క్రీ. పూ. 2 శతాబ్దముల నాటివాడని చెప్పుచున్నను పై అభిప్రాయమే సర్వసమ్మతమైనది.

అష్టాంగసంగ్రహకారుడగు వాగ్భటు డితడు కాడు వేరొకడని "హార్నెల్"[5] అను పాశ్చాత్యపండితుని మతము. కాని యీరెండు గ్రంథములకు అన్నివిధముల సాదృశ్యము, పితృనామసాదృశ్యము, మతభేద మేమియు లేకుండుట మొదలగు కారణములచే వేరని చెప్పుటకు వడదు. వాగ్భటుడె అష్టాంగసంగ్రహ మను పెద్దగ్రంథమును రచించి, దానికి సంగ్రహముగా "హృదయమివ హృదయ మేతత్" రచించితినని తనగ్రంథసమాప్తియందు వివరించెను.

### మతము

మతము వైదికమే. కొందరు బౌద్ధు డనెదరు గాని ప్రమాణములు లేవు. బుద్ధదేవునియందు కొంత భక్తి గలవాడుగా నుండిన నుండవచ్చును.

i. మంగళాచరణము చేయుటయందు భగవంతునిగూర్చి చేయుటచేతను;

ii. బౌద్ధదేవాలయములగు చైత్యాదులకు పోగూడదని వ్రాయుటచేతను;

iii. చికిత్సలో వైదిక మంత్రముల చెప్పుట చేతను;—

వైదికమతావలంబియగు హిందువుడేయని చెప్పక తప్పదు.

### IIవ వాగ్భటుడు

పైవాగ్భటునితాతగారనియు, భిషగ్వరుడనియు అష్టాంగసంగ్రహమున వాగ్భటాచార్యులె చెప్పెను. ఈయన వ్రాసిన గ్రంథము లేవియు

1. ప్రత్యక్షశారీరం, p. 12 (సంస్కృత పీఠిక).
2. బౌద్ధమహాయుగం, p. 224.
3. Itsing's Buddhistic Practices in India (Translated by Prof. Takakusu), p. 128.
4. అష్టాంగహృదయ పీఠిక, English, by Annamoreswara Kunte, M.D.
5. *Vide* Dr. Hoernle's "Medicine of Ancient India," pt. 1, pp. 10-15.



శ్రీమతి కాదూరి రమణాబాయమ్మగారు



శ్రీమతి కే. నాగరత్నమ్మాళ్ కన్యగారు



స్త్రీ సనాతన ధర్మసమావేశము, చెన్నపురి

గానరావు. అష్టాంగసంగ్రహకర్త ఈవాగ్భటుడేయని కొందరు చెప్పెదరు గాని పైకారణములచే అట్లు గానేరదు.

### I వ వాగ్భటుడు

ఈతనిచే రచింపబడినదే 'రసరత్న సముచ్చయము'.

నామ మొక్కటె యైనను భిన్నుడె. ఇతడు చాలా తరువాతివాడు.

1 సముద్రమువలెగంభీరమైనదని చెప్పుకొనిన తన అష్టాంగసంగ్రహమందే రసవిషయ మేమియు చెప్పబడక పోవుట. ప్రాచీన వాగ్భటుని కంటెను తరువాతివారగు సోమదేవ గోవిందభగవత్పాదాదుల గ్రంథములలోని విషయముల గ్రహించుట; 1 ఈగోవిందభగవత్పాదులే శంకరాచార్యుని గురువనియు; 9 వ శతాబ్దివాడనియు శ్రీయుత గురునాథ త్ర్యంబక కాలే యను మహాశయులు రసహృదయ ఉపోద్ఘాతమున వ్రాసిరి:— కావున ఈవాగ్భటుడు తరువాతివాడనియు ఆవాగ్భటుడు కాడనియు తేలుచున్నది. కావుననే క్రీ. శ. 13 వ శతాబ్దివాడని డాక్టర్ ప్రఫుల్లచంద్ర రాయిగారు వ్రాసిరి. 2

గోవిందభగవత్పాదుడే పతంజలి, రసహృదయకర్త యనుకొన్నను, సోమదేవగ్రంథాదుల ప్రమాణము చాలును.

### అన్యగ్రంథములు

వాగ్భటునిపేరులో, వాగ్భటాలంకారము, కవికల్పతరువు మొదలగునవి యున్నవి. అవి ఏవాగ్భటుడు వ్రాసెనో నిర్ణయించుట తజ్ఞులకు వదలెదము.

### విజ్ఞప్తి

ఆయుర్వేదమునకు ప్రధానగ్రంథకర్తలగు ముగ్గురినిగూర్చియు నిప్పుడు వ్రాసితిని. అవకాశ మున్నచో ఇతర గ్రంథకర్తలను, సంస్కర్తలనుగూర్చి ముందు వ్రాసెదను. ఇక ముందైనను ఆంధ్రవిద్వద్వైద్యులు అనేకఆయుర్వేద గ్రంథముల నాంధ్రీకరించియు, తద్గ్రంథకర్తల చరిత్రల పరిశోధించి ప్రకటించియు, మాతృభాష నలంకరించి తమ ధర్మమును నిర్వర్తించెదరు గాక.

---



---

1. సోమదేవగ్రంథమునుంచి:—"రసపరిభాష" (ర. ర. స. 9. అ.)
గోవిందభగవత్పాదకృత రసహృదయమునుంచి:—'సుకృతఫలంతావదిదం', 'భ్రూయుగమధ్యగతం యత్' మొ.

2. Dr. P. C. Roy's History of Indian Chemistry, Vol. 1, p. XXXVI.



పొట్టకూటికి పాటుపడుచున్న ఉద్యోగి గౌరవము పొందుచుండ



ప్రజల జ్ఞానాభివృద్ధికి పాటుపడుచున్న జ్ఞానిని చూచువారు లేరు.

# స్త్రీలకు నవీనచట్టములు, వాని ప్రయోజనము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

భారత మహిళలకు వర్తమానకాలము గొప్ప శుభసమయమని చెప్ప దగియున్నది. బహుసంవత్సరములనుండి భారతదేశమున స్త్రీలకు స్వయంవ్యక్తిత్వము లేదు. విద్యామతసంఘరాజకీయార్థికాద్యనేక వ్యవహారముల స్త్రీ పురుషుల దయాధర్మభిక్షుకులై యుండుటయే స్త్రీని ధ్యుక్త ధర్మముగా నిర్ణయింపబడి, యది యొక సదాచారముగాను, సాధ్వీధర్మముగాను, ఉత్తమ నీతిగాను గణింపబడుచుండెను. కాని యిట్టి సతీధర్మములనను, పరాధీనతవల్లను స్త్రీసంఘము పొందిన దుస్థితి వర్ణనాతీతము. అయినను దుస్సహమగు నీదుస్థితిని అహంకహమికవల్ల పురుషులును, నజ్ఞానమువలన స్త్రీలును మొన్నమొన్నటివఱకు గుర్తింపజాలకుండిరి. కాని నేడు భారతస్త్రీపురుషులలో గల్గిన వివేకోదయమువలనను, పరప్రభుత్వపీడాక్లేశము వలనను ఖండాంతర నాగరికత సంపర్కమునను స్త్రీలకుగూడ ప్రత్యేక మనోబుద్ధిశక్త్యాదులు గలవనియు, అవకాశ మొసంగిన వారి బుద్ధి వివేకాదులు గూడ మనదేశపురోవృద్ధికి సాధనమేయనియు పురుషులు గమనించుట సంభవించినది. ఇది స్త్రీజాతి కెంతయు శుభావహమగు విషయ మనుటకు సందియము లేదు.

ఇప్పుడు స్త్రీలకు ప్రసాదింపబడుచున్న శాసనము లొకవిధమైనవి గావు. మతసంఘములకు జెందిన శారదాచట్టము, వయోనిర్ణయ చట్టము స్త్రీపునర్వివాహచట్టము నాదిగా గలవి స్త్రీలకు వైవాహికస్వాతంత్ర్యము నొనగూర్చునవిగా నున్నవి. వారసత్వ చట్టము స్త్రీల కార్థిక లాభము చేకూర్చుటకు దోడ్పడును. దేవదాసీల చట్టము, వ్యభిచార నిరోధకచట్ట మాదిగా గలవి స్త్రీల నైతికాభివృద్ధికి సహాయమగును. చట్టసభలలో స్థానిక సంఘములలో స్త్రీల కొసంగబడెడి హక్కులు స్త్రీలకు రాజకీయ స్వాతంత్ర్య మొనగూర్చునవిగా నున్నవి. నిజముగా నిట్టి శాసన లాభములు స్త్రీలసర్వతోముఖాభివృద్ధికి దోడ్పడుటకు సందియము లేదు. కాని మహాప్రయోజనకరములగు నిట్టి శాసనములు మన స్త్రీ లేమాత్రము వినియోగించుకొనగల స్థితిలో నున్నారనునది యిప్పుడాలోచింప వలసినమాట.

ఇల్లలుకగానే పండుగ కాలేదు. హక్కులు మాత్రము వచ్చి పడుచున్నవి. కాని అవి వినియోగించుకొనగల నేర్పుమాత్ర మిప్పుడు మన స్త్రీలకడ మృగ్యము. ఈసంస్కరణము లన్నియు మన పురోభివృద్ధికొఱకే ప్రసాదింపబడుచున్నవను విషయమునే స్త్రీ లెఱుగకున్నారు. మఱియు నివి స్త్రీలవినాశమునకే వచ్చినవని వాదించువారుగూడ మిక్కిలి. ఇట్టిమన స్త్రీలమౌఢ్యము, అజ్ఞానము దూరీకృతమగుటకు విద్యయే ఘనమైన సాధనము. తగినవిద్యాప్రదానము చేయక స్త్రీల కొసంగబడెడి హక్కులు అజీర్తిరోగి కపూర్వభక్ష్య బహుమానమువలె నిరుపయోగమగును. ఇంతకాలమునుండియు మనదేశమున స్త్రీలవిద్యాభివృద్ధికి వివాహ మొకప్రబలప్రతిబంధకముగా నుండెను. తమకొమార్తెలకున్నతవిద్య చెప్పింప జననీజనకు లెంత కుతూహలులయి యున్నను, సరిగా పిల్లకు బుద్ధి తెలిసి చదువునందించు కాసక్తి కల్గెడి పదునొకండు పదిరెండేండ్ల వయసున బాలికలకు వివాహ మొనర్చుట తప్పనిసరి యగుటచే చేయుటయు, తదుపరి యత్తగారు స్వీయాధికారమును పురస్కరించుకొని ఆఅత్తగారును(విద్యాలాభ మెఱుగనిది గాన)కోడలి విద్య కడ్డుపడుటయు మనదేశమున పరిపాటి. ఇట్టి గొప్పయిక్కట్టు నేటిస్త్రీలయదృష్టవిశేషమున వచ్చిన శారదాచట్టము తొలగించినది. ఈబాల్యవివాహనిషేధశాసనలాభముచే పదునాల్గు సంవత్సరములు నిండి పదునైదేండ్లు వచ్చునప్పటికి బాలికఆంగ్లపాఠశాలలో జదివినచో ప్రవేశపరీక్షయందును, జాతీయపాఠశాలలో జదివినచో విదుషీపరీక్షయందును నుత్తీర్ణ గావచ్చును. విద్య కవకాశమును, వివాహమునందు బాధ్యతయు నొసంగునదే శారదాచట్టముయొక్క పరమోద్దేశము. అయినను నీశారదాచట్టముచే స్త్రీలకు గల్గు లాభము లింకను గలవు. బాలికపదిరెండేండ్లకే గర్భవతియగుటయు, ఆగర్భవహనసామర్థ్యమును, సుఖప్రసవలాభమును లేక దుర్మరణముపాలగుటయు, అథవా జీవించినను రక్తమాంసములుక్షీణించి దుర్బలయు, రోగగ్రస్తయునై యల్లాడుటయు నీశాసనమువలన తొలగినవి. ముక్కుపచ్చలారని ముద్దుబాలల వృద్ధులపాల వేయుటయు నికజరుగనిపనియే. మఱియు నజ్ఞానులగు తలిదండ్రులు స్వీయలాభమునకై కొమరితల విక్రయించుటయు కట్టువడినది. మఱియు కసుగాయలవంటి బాలవితంతువులనుగూడ మన మిక నధికముగా గనజాలము. కాన యిన్ని విధముల స్త్రీల కుపయోగకరమగు శారదాచట్టము

భారతమహిళల బహుపుణ్యఫలవిశేషమే కాని కొందఱు వాదించుచున్నటులు లుపద్రవసూచకము గాదు.

ఇక రెండవచట్టము స్త్రీలవారసత్వములు. ఇది ఆర్థికసంబంధమైనది. ఇది యింకను చట్టము కాలేదు. కాని ఆందోళన ప్రారంభమైనది. త్వరలో నీశాసనముగూడ స్త్రీలకు రాగలదు. మనదేశమున వారసత్వములవిషయమున స్త్రీలకు గలుగుచున్న యన్యాయమింతయంత గాదు. మనహిందూన్యాయచట్టములందు తండ్రియాస్తి యందుగాని, పెనిమిటియాస్తియందుగాని స్త్రీకి స్వకీయమైన హక్కు లేదు. ఇందువలన నెన్నిరోకుటుంబములందు కడుపునబుట్టిన కుమార్తె యుండగా తండ్రియాస్తి నెవడో జ్ఞాతివాడు వచ్చి తన్నుకొనిపోవుట యుఃభర్తృవియోగదుఃఖముచే దేహమనఃక్లేశములపాలై యల్లాడుచున్న భార్య యుండగా నెవడో అంతపొంతలదాయాది న్యాయముగా విగతభర్తృకకు జెందవలసిన యాస్తి కధికారియై యామెకు భరణ మొసగు నంతటివా డగుటయు తఱచుగా సంభవించుచున్నది. స్త్రీలవిషయమున నింతకంటె దురన్యాయము వేఱొండు లేదు. కాని హిందూస్త్రీల యెడ మతసాంఘికనిర్బంధము లెంతకఠినతరములుగా నున్నవో ఆర్థికవిషయములుగూడ నంత నిర్దయాత్మకముగనే యున్నవి. కాన శారదా చట్టమువలన విద్యాలాభముపొందిన స్త్రీలు ముమ్మందుగా నీవిషయమై కృషిచేయనగును. మఱియొకచట్టము దేవదాసీలను గుఱించినది. మన మద్రాసురాజధానిలో దేవదాసీలస్థితి బహుదీనముగా నున్నది. కులవృత్తి యనుపేర బహునీచమగు వ్యభిచారకృత్యమున కొక సంఘపు స్త్రీలు పాల్పడి యల్లాడుచున్నారు. మహాశీలవతులకు సాధ్వీరత్నముల కునికిపట్టయి వన్నెయు వాసియుగన్న మన భారతదేశమున నిట్టిపడుపుకుల ముండుట మహావమానకరము. ఇట్టి హేయమైన వృత్తి రూపుమాసి వారికి వివాహభాగ్య మబ్బెడి యవకాశమును మద్రాసు చట్టనిర్మాణసభలో శ్రీముత్తులక్ష్మిరెడ్డిగారు గావించియున్నారు. ఏజాతియొక్క బాగోగు లాజాతికి జెందిన వారికి విశదమైనటులు లితరులకు దెలియదు. శ్రీముత్తులక్ష్మమ్మగారు శాసనసభాసభ్యత్వమును బడయుటచే కళావంతుల కిట్టి సంస్కరణము శీఘ్రకాలములో లభ్యమైనది. ఇందులకు శ్రీముత్తులక్ష్మమ్మగారును, నామె తీర్మానమున కనుకూలురుగా నున్న యధికసంఖ్యాక పురుషవరేణ్యులును స్త్రీలకృతజ్ఞత కెంతయు నర్హులు.

ఇంతియే గాక వ్యభిచారనిరోధకచట్టము (బ్రాథెల్సు) అనెడు మఱియొక యుత్కృష్టతీర్మానముగూడ మన చెన్నరాజధాని శాసనసభలో చర్చకు రానున్నది. దీనివలన నమాయికలగు బాలికలను వ్యభిచారవృత్తికై విత్తమునకు కొనువారును, పురికొల్పువారును, అట్టివారికి ఇల్లు బాడుగకిచ్చువారునుగూడ శిక్షాపాత్రులగుదురు. స్త్రీలనైతికరక్షణమునకు వజ్రకవచమువంటిదైన యీ బిల్లుగూడ చట్టమగును. మఱికొన్ని హక్కు లేమన; స్త్రీలకు రాజ్యాంగములో ప్రవేశార్హత. అనగా చట్టసభలలో, స్థానికసంఘములలో పురుషులతోపాటుగ స్త్రీలుకూడ నియోజక నియోజితాధికారమును బడయుట. ఇట్టిమహనీయాధికారము నాంగ్లదేశములో బడయుటకా దేశపు స్త్రీలు తీవ్రాందోళనము చేయవలసివచ్చెను. అప్పటి పురుషు లెంత యుదారమనస్కులైనను స్త్రీల కిట్టి యధికార మొసంగుటకు సులభముగా నంగీకరింపరైరి కాన అప్పటి స్త్రీలు సంఘములుగా నేర్పడి సభలు జరిపి తీర్మానములు గావించిరి. ప్రభుత్వమునకు విజ్ఞప్తులు పంపిరి. పార్లమెంటును కల్లోలపఱచిరి. ఖైదుల కేగిరి. ప్రాయోపవేశ ముండిరి. ఇంతమహాప్రయత్నమువలనగాని యాంగ్లస్త్రీలు రాజకీయాధికారమును బడయలేదు. కాని యెట్టియత్నములేకయే హిందూస్త్రీల కిట్టి రాజకీయాధికారము లభించినది. పురపాలకసంఘములలో, విద్యాసంఘములలో, లోకల్ బోర్డులలో, శాసననిర్మాణసభలలోగూడ మనస్త్రీల కిప్పు డెన్నికఅధికారమును, సభ్యత్వాధికారమును లభియించియున్నవి. ఈసదవకాశమువలననే శ్రీమతి ముత్తులక్ష్మమ్మగారు కళావంతుల స్త్రీలకట్టి మహోపకారము చేయగలిగిరి. ఒక్కస్త్రీ ప్రవేశమువలననే స్త్రీల కిట్టి యుపకృతి గల్గినప్పుడు అధికసంఖ్యాక నారీరత్నములు రాజకీయములో కృషిచేసిన స్త్రీల కెట్టెట్టి మేళ్లు చేకూరునో చెప్పవలయునా? కాని దీనిని వినియోగించుకొనగల నేర్పు హిందూస్త్రీల కిపుడు లేదు. తగిన విద్యావివేకములు లేకున్న స్త్రీలీహక్కును సద్వినియోగము చేయజాలరు. కాన మనహిందూస్త్రీలు శారదాచట్టమువలన చక్కని విద్యాలాభమును పొంది దైవ, మానవ సానుభూతిచే నుపలబ్ధమగుచున్న నవీనచట్టముల వినియోగించుకొను కౌశలము గడింతురుగాక. తన్మూలమున భారతదేశ పురోభివృద్ధికిని, పునర్నిర్మాణమునకును దోడ్పడుదురుగాక. భగవంతు డనుగ్రహించునుగాక.

---

# పూర్వమత సంప్రదాయములు

వల్లూరి సూర్యనారాయణరావు గారు

అనేకసంవత్సరముల నుండి వంశపారంపర్యముగ వచ్చు మనోభావములు త్వరగా నశించవు. ఒక్క కలము పోటుతో న్యాయశాస్త్రములను, నిబంధనలను మార్చవచ్చును గాని, పూర్వపు అలవాటులు మనలను చాలా కాలమువరకు అంటిపెట్టుకొని యుండును. ముఖ్యముగా మన మతాచారములు శీఘ్రముగ వదలవు. వానిలో కొన్ని మన ప్రస్తుతదైన్యస్థితికి కారణములని చెప్పవచ్చును. (1) హేతువాదము నుపయోగించి సత్యమును తెలిసికొనుటకు ప్రయత్నించకూడదు. పూర్వమత సంప్రదాయములవలననే సత్యమును నిర్ణయించవలెను. (2) మానవుని జీవితము అతని బుద్ధి నుపయోగించి నిర్ణయించుకొను మానవసూత్రములమీద గాక, యెన్నడును మార్చగూడని కొన్ని దైవికసూత్రముల మీదనే యాధారపడవలెను. (3) ఈ ఐహికజీవనము బుద్బుదమునంటిది. ఆముష్మికజీవనమే శాశ్వతము. (4) ప్రపంచములో జరుగు పనులన్నిటికిని పూర్వజన్మకృతకర్మయే కారణము. (5) జాతీయ జీవనములోని క్రమవికాసమునంతయు త్రోసివేసి, మతసంప్రదాయ శృంఖలములచే కట్టుపడి యుండవలెను. (6) మతగురువులకు మారుమాటాడక లొంగి యుండవలెను.

మన పూర్వాచారపరాయణులు ప్రస్తుత మతాచారములన్నియు మార్చకూడనివేయని వాదించుచు సంఘాభివృద్ధికి ఆటంకములు కలిగించుచుందురు. మూడు నాలుగువేల సంవత్సరముల క్రింద, అప్పటి ప్రజల కేర్పడిన నిబంధనలు ఈకాలమునకు పనికిరావని వారు నమ్మరు. చలనము లేక స్తంభించిన సంఘములు దినదినాభివృద్ధి నొందుచున్న సంఘములకు వీగి పోవునని వారికి తోచదు. రాజకీయ సాంఘి కార్థికాది విషయములలోనెల్ల పూర్వకాలమునాటి పరిస్థితులు ఈకాలమున కుపచరించవని వారు గుర్తించరు. ఏపూర్వాచారమైనను, మనకు నష్టదాయకమని తెలిసినపుడు త్రోసివేయవలసియుండునని వారు గ్రహించరు. ఇకముందు శ్రౌతస్మార్త కర్మలలో ఈకాలమునాటి ద్విజులు మునిగియుండుట సంభవించదు. మతములును, మతగురువులమీద నాధారపడిన రాజ్యములన్నియు అడుగంటినవి. ఆధునికనాగరికతలో రాజకీయజీవనము మతమునుండి విడదీయబడినది. మతమనునది ఆయావ్యక్తుల మనస్సాక్షికి వదలవలసినదేగాని లోకవ్యవహారములతో సంబంధింపజేసి నిర్బంధించబడు విషయము కాదు. మన దేశములోని హిందువులును, మహమ్మదీయులును తమపూర్వ సంప్రదాయముల నింకను పట్టుకొని వ్రేలాడుచున్నారు గాని, వారు తుర్కీ, యీజిప్టు, చీనా మొదలగు దేశములలో గత పదిసంవత్సరములలో నుండి జరుగుచుండిన మార్పులను గ్రహించిన యెడల ఆశ్చర్యమగ్నులగుదురు. స్త్రీలకును, పురుషులకును ఉన్నతవిద్య నేర్చుకొనుటకు సమానావకాశము లీయబడినవి. మతము రాజకీయవిషయముల నుండి తొలగింపబడినది. ఆధునిక విద్యావిధానము పాఠశాలలలో ప్రవేశపెట్టబడెను. విదేశభాషలలోని గ్రంథములన్నియు దేశభాషలలో ననువదించబడుచున్నవి. దేశభాషయొక్క లిపియు, అరబిక్కు, పెర్షియన్ పదములును సంపూర్ణముగ తుర్కీ ప్రభుత్వమువారు మార్చివేయుచున్నారు. స్త్రీలకు ఘోషా తీసివేసి, ఉన్నతవిద్య నిచ్చి రాజకీయ

వ్యవహారములలోకూడ పాల్గొనచేయుచున్నారు. ఏ మత మునకును ప్రత్యేక సౌకర్యములు కలుగజేయుచుండలేదు. పూర్వపు టోపీలను, దుస్తులను మార్చివేసికొనుచున్నారు. చీనాలో జుట్టుముళ్లను కత్తిరించివేయుచున్నారు. స్త్రీల పాదములను బిగించి చిన్నవి చేసికొనుట మానివేసినారు.

మనహిందువులలోకూడ, వేయి సంవత్సరముల క్రిందనున్న మతముయొక్క రూపమే మారిపోవుచున్నది. యజ్ఞములు నిరుపయోగములనియు, వానిపేరుమీద ఏ ప్రాణికిగాని అనవసరమైన హింస కావింపకూడదనియు ఇప్పుడు జనసామాన్యము గ్రహించినారు. జుట్టు బొట్టు కట్టులు పూర్తిగ మారిపోవుచున్నవి. మతమనునది యీ సాంఘికాచారములతో సంబంధము లేనిదని యువకులు కొన్నిప్రశ్నలు ఈ క్రింది విధముగ పూర్వాచార పరాయణుల నడుగుటకు మొదలుపెట్టిరి: (1) మతమను నది ఒకవిధమైన కర్మకాండకు లోబడుటయా, లేక భగవం తునితో ఐక్య మగుటకుగాని, ఆయన సాయుజ్యము నుండుటకుగాని ప్రయత్నించుటా? (2) ఆయన దయను సంపాదించుటకుగాని, కోపమును తప్పించుకొనుటకుగాని అర్థములేని కర్మలను చేయుటయా, లేక మోక్షసంపాద నకు ఆధ్యాత్మికసంబంధమైన నైతికపథమును త్రొక్కు టయా? (3) మతమనునది మనము చనిపోయిన తరు వాత, మన కాముష్మిక సుఖము నిచ్చుటకు మాత్ర మేర్పడి నదా, లేక మననిత్యజీవనమును పరిశుద్ధపరచి మనలను సరియైన మార్గములో నడపుట కేర్పడినదా? (4) భౌతిక విషయములలో మానవకోటికంతకు సౌఖ్యముల నిచ్చు విధానముల నరసి, వానికి కృషి సల్పుట సత్యమైన మతమా? లేక ఆముష్మికవిషయములను గురించి క్రియా శూన్యమైన వట్టి ఊహాలతోను, నిరర్థక కర్మలతోను కాలము వ్యర్థపుచ్చుట మతమా? (5) వీనిలో నేది వ్యక్తికి మోక్షదాయక మగుచున్నది? (6) ఈ మతవిషయ ములలో సాంఘికమోక్షము నాలోచించక, వ్యక్తిమోక్ష మునకే ప్రాధాన్య మీయవలెనా?

హైందవమతమనునది ఒకటి ప్రత్యేకముగ లేనే లేదు. ప్రపంచములోని మానవకోటికంతకును, వారివారి యోగ్యతలను బట్టి పరమేశ్వరుని సేవించుమార్గము లన్నియు దీనిలో చేరియున్నవి. మనఋషులు వీనిలో దేనిని నిరసించుటలేదు. ప్రపంచములోని యేదేశము వా డైనను, ఏజాతివాడైనను హైందవులలోని యేసమాజ ములోనైనను చేరవచ్చును. ఒక అమెరికాదేశీయుడుగాని, జపానుదేశీయుడుగాని మన దేశములో చాకలి, మంగలి వృత్తుల నవలంబించి ఆయా సమాజములో చేరి, వారి సంప్రదాయముల నవలంబించగానే హిందువు డగు చున్నాడు. ఈతడే కొంతకాలమునకు మన దేశములో ఏరాష్ట్రములోనో బ్రాహ్మణులలోకూడ చేరి పోవ చ్చును. మనమందరము ఇటులనే అయియుందుము మనమందరము మొదట మిశ్రజాతులవారమే. ఆర్యుల యొక్కయు, సితియన్, పార్థియన్, యవన, పారశీక, తు రేనియన్, మంగోలియన్ మొదలగు జాతులయొక్కయు వివిధరక్తములు మనవర్ణము లన్నిటిలో కలసియే యున్న వి. సుమారు మూడువేల సంవత్సరములనుండి, కొంత వరకు ఇవి శిలారూపము దాల్చి ప్రత్యేకముగ నున్నట్లు కనుపడును. మనమతము ఎవరిని హిందువుగ నుండకూడ దని అభ్యంతర పెట్టలేదు. క్రైస్తవులను, మహమ్మదీయు లను, ఇంక నితరమతములవారిని మన దేశసంప్రదాయ ములలో నిరాక్షేపముగ కలుపుకొనవచ్చును. అట్లు కలియుచున్నారు. అంతర్జాతీయ వివాహములవలన ముందు కలియగలరు.

హిందువులలో ఎవరి యిష్టప్రకారము వారు బ్రహ్మజిజ్ఞాస చేసికొనవచ్చును. ఈశ్వరుని కొక యాకార ము లేదనియు, ఆయనను పూజించుటవలన ఎట్టిలాభ నష్టము లుండవనియు చెప్పినంతమాత్రమున, అట్టివాడు హిందువు కాకపోడు. బౌద్ధులు, చార్వాకులు మొదలగు వారుకూడ హిందువులుగ పరిగణింపబడవచ్చును. బ్రాహ్మ ణమత మనునది యొకటి యున్నదనుమాట వాస్తవమే గాని, అది కేవలము కర్మలతో చేరియుండి, యిప్పుడు

నామమాత్రావశిష్టమై యున్నది. శ్రౌతస్మార్తకాండలను తెలిసికొని వానిని ఆచరణలో పెట్టు బ్రాహ్మణులే మిక్కిలి యరుదుగ నున్నారు. ఈ సృష్టియొక్క యుత్పత్తి, మరణము, పునర్జన్మ, మోక్షము, జీవుడు మొదలగువానిని గురించి హేతుపూర్వకమైనవాదము మనయుపనిషత్తులలోనే కనపడుచున్నది గనుక, అన్నిమతములలోను మన మతమే యుత్కృష్టమని మనము ప్రగల్భములు కొట్టుకొనుచుందుము గాని, యిది వేదాంతము గాని మతము కాదని తెలిసికొన్నయెడల నిప్పటి మూఢమతాచారములను త్రోసివేయక తప్పదు. అప్పుడీవర్ణాశ్రమధర్మసభలవారికిని, సనాతనమండలి వారికిని మతగ్రంథములు చూపించి సాంఘికవిషయములలో నోరెత్తుట కెట్టి స్థానము లేదు. పరమత సహనము వేదాంతుల కున్నది గాని, బ్రాహ్మణ మతస్థులకు లేదు. వీరి కున్న పట్టుదల యితరవర్ణముల వారికి గాని, యితరమతస్థులకు గాని లేదు. మన దేశములో నూటికి అయిదుగురైనను లేని యీబ్రాహ్మణమతస్థులాడించినట్లు తక్కినవర్ణముల వారు ఇంకను ఎంతకాల మాడదలచిరో గోచరము గాకుండ నున్నది. ఇప్పుడు బ్రాహ్మణులలోనే బ్రాహ్మణమతము అదృశ్యమగుచున్నది. జందెములుమాత్రము మిగిలియున్నవి. గుంజుపోయిన డొల్లవలె అర్థము తెలియని మంత్రములు, నిరర్థకమైన క్రియలు మాత్రము బ్రాహ్మణమత పురోహితులవద్ద కనపడుచున్నవి. తక్కినవారు వీనికి ఊరక తలలూపుచుందురు. ఇట్టి మతాచారములు మనలోని యల్పజ్ఞుల కింకను కొంతకాలము రుచించ వచ్చునేమో కాని, సామాన్యవిద్యను నేర్చుకొని, ప్రపంచములోని యితర జాతులవారిని గురించి తెలిసికొనుచు, కొంచెమైనను యింగితజ్ఞానము గలవారందరు ఈ శుష్కకర్మకాండకు త్రోసి రాజు చెప్పుచునే యున్నారు. శాఖాహార మొక్కటియే ఈదేశపు వైశ్య బ్రాహ్మణులకు గౌరవమును ప్రపంచమందంతటను కలుగజేయుచున్నది. మన పంచద్రావిడులలో కూడ ఈ సుగుణసంపత్తుకు తిలోదకము లిచ్చువా రనేకమంది యున్నారు. తమసంఘాపేక్షకు స్వవంచకులై మూఢాచారములకు దాసులగుచున్నారు. కాబట్టి, భక్తి, జ్ఞాన, ధ్యాన, కర్మయోగము లన్నియు నైతికమార్గమునకే త్రోవ చూపి మనల నందరిని తరింపచేయునని భగవద్గీత స్పష్టముగ చెప్పుచున్నపుడు, క్రైస్తు, మహమ్మదు, బుద్ధుడు, రాముడు,కృష్ణుడు మొదలగువా రందరియెడలను మనహైందవులకు గౌరవముండితీరును. మతములలో వ్యత్యాసములను పాటించము. సగుణ నిర్గుణోపాసకులలో నెవరిని నిరసించము. మూఢాచారములను త్రోసిపుచ్చెదము. మానవసేవయే భగవత్సేవగ నెంచి మానవసౌభ్రాత్రమునకు మనహిందువులు ముఖ్యముగా పాటుపడవలెను. దేశజుల ఐకమత్యమునకు భంగకరముగా నుండి, యిప్పటి యధోగతికి కారణభూతమైన బ్రాహ్మణ మతాచారములు, ఎంతపురాకృతము లైనను, మనము మార్చుకొనవలసియుందుము.

---

ఏలాగైతేనేమి అల్లుడు మామా కలుసుకున్నారు





తెనాలి సంస్కృతకలాశాలా పండితబృందము.



తెనాలి సంస్కృతకలాశాలా విద్యార్థిబృందము.

# గ్రహములదృష్టినిర్ణయము

సూరి రామసుబ్బరాయ శాస్త్రిగారు

౧

రవ్యాది గ్రహములకుఁ గల దృష్టి విషయమై భిన్నమతములు గాన్పించు చుండుటచే తద్విమర్శనకుఁ గడఁగుచున్నాను.

శ్లో. పశ్యంతి సప్తమాన్ సర్వే శనిజీవకుజాః పునః,
విశేషతశ్చ త్రిదశ త్రికోణ చతురస్రగాన్.

(జాతక చంద్రిక.)

సర్వగ్రహములు సప్తమస్థానమును, అందుండు గ్రహములను జూతురు. శని గురు కుజులు సప్తమమునే గాక, క్రమముగ త్రిదశ త్రికోణ చతురస్రములను గూడఁ జూతురు. అనఁగా శని తృతీయ దశమసప్తమములను, గురుఁడు పంచమనవమసప్తమములను, కుజుఁడు చతుర్థాష్టమసప్తమములను జూతురు. జాతకచంద్రిక సంక్షిప్త గ్రంథమగుటచే నిందు గ్రహములకుఁగల పాద అర్ధ త్రిపాద దృష్టులఁ గూర్చి వివరింపఁబడియుండలేదు. తద్విషయమై సారావళియందు:—

శ్లో. సవ్యం పశ్యంతి గ్రహా స్సదా చరణవృద్ధిత స్సర్వే,
త్రిదశత్రికోణచతురస్రసప్తగతాన్ ఫలం క్రమేణైవ.

గ్రహములు సర్వకాలము సవ్యగణనచే త్రిదశ త్రికోణ చతురస్ర సప్తమములను, అందుండు గ్రహములను పాదాభివృద్ధిచేఁ జూచుచు ఫలములఁ గూడ నట్లే యొసఁగుదురు. అనఁగా తృతీయ దశమములను పాదముగను, పంచమనవమముల నర్ధముగను, చతుర్థాష్టమములత్రిపాదముగను, సప్తమమును సంపూర్ణముగను జూచుచు తదనుగుణ్యముగ ఫలముల నొసఁగుదురు. ఇందుకు స్వల్పజాతకమందు:—

శ్లో. దశమతృతీయనవమపంచమచతుర్థాష్టమే కళత్రంచ,
పశ్యంతి పాదవృద్ధ్యా ఫలాని చైవం ప్రయచ్ఛంతి.

ఇట్లే యవనేశ్వరుల చేతను:—

శ్లో. ద్వా పశ్చిమా షష్ఠ మథ ద్వితీయం
సంస్థానరాశేః పరిహృత్య రాశిమ్,
శేషాన్ గ్రహః పశ్యతి సర్వకాల
మిష్టేషు చైషా విహితా దృగిష్టా.

జామిత్రభే దృష్టిఫలం సమగ్రం
స్వపాదహీనం చతురస్రయోశ్చ,
త్రికోణయో ర్దృష్టిఫలార్ధ మాహుః
దుశ్చిక్యసంజ్ఞే దశమేచ పాదమ్.

గ్రహము తానున్న స్థానమునుండి లాభవ్యయస్థానములను, షష్ఠమును, ద్వితీయమును వదలి తదితరస్థానములఁ జూచును. అందు సప్తమమును సంపూర్ణముగను, చతుర్థాష్టమముల త్రిపాదముగను, త్రికోణముల నర్ధముగను, త్రిదశములను పాదముగను జూచునని చెప్పఁబడినది.

౨

ఇట్లు రవ్యాది శన్యంతము సప్తగ్రహములకుఁ గల పాదార్ధత్రిపాదపూర్ణ దృష్టులఁగూర్చి వివరముగ శ్రీకాళిదాస మహాకవిచే నుత్తర కాలామృతమునందు:—

శ్లో. పూర్ణం పశ్యతి భానుజ స్త్రిదశమే చేత్పాదన్యూన్యైతరే
జీవో ధీనవమేఽర్ధయా తదితరే భౌమ శ్చతుర్థాష్టమే,
సర్వే పాదవిహీనయా నిఖిలయాపశ్యంతిన శ్వేఽస్తభమ్
విత్తాయన్యయవైరిణో న దదృశుః ఖేటాః స్థితస్థానతః.

శని తృతీయదశమముల సంపూర్ణముగను, తదితరులు, అనగా రవి చంద్ర కుజ బుధ గురు శుక్రులు పాదముగను జూతురు. గురుఁడు పంచమనవమములఁ బూర్ణముగను, తదితరగ్రహము లర్ధముగను జూతురు. కుజుఁడు చతుర్థాష్టమముల సంపూర్ణముగను, తదితరులు త్రిపాదముగను జూతురు. సప్తమమును సర్వగ్రహములు సంపూర్ణముగఁ జూతురు. గ్రహములు తాముండు స్థానములనుండి ద్వితీయలాభవ్యయషష్ఠములను జూడఁజాలరు. ఇట్లు సర్వగ్రహముల దృష్టియు వివరింపఁబడినది.

శని గురు కుజులకు త్రిదశాది స్థానములందుఁ బూర్ణదృష్టి యుండుటచే నన్యగ్రహములవలె వారికి సప్తమమున మాత్రము సంపూర్ణదృష్టి యుండఁ జాలదని కొందఱి యభిప్రాయము గలదు. ఇందుకు సారావళియందు:—

శ్లో. పూర్ణం పశ్యతి రవిజ స్తృతీయదశమే త్రికోణమపి జీవః,
చతురస్రంభూమిసుతః బుధార్కసితహిమకరాః కళత్రంచ.

గార్గ్యవచనముకూడ నిటులే యున్నది :—

శ్లో. దుశ్చిక్య స్వగతాన్ సౌరః త్రికోణస్థాన్ బృహస్పతిః,
చతుర్థాష్టమగాన్ భౌమః శేషా స్సప్తమసంస్థితాన్,
భవంతి వీక్షణే నిత్య ముక్తాధికఫలాః గ్రహాః.

ఇట్లు సప్తమమున శని గురు కుజులకుఁ బూర్ణదృష్టి యుండనేరదని కొందఱి మతమై యున్నను, సప్తమమున సర్వగ్రహములకుఁ బూర్ణదృష్టి యుండుటయే బహ్వాచార సమ్మతమై యున్నది. ఇందుకు బాదరాయణ వచనము:

శ్లో. రవిజ స్తృతీయదశమేగురుస్త్రికోణంకుజస్తుచతురస్రం,
పశ్యతి సమగ్ర మితరే చరణవృద్ధ్యాఽథ సప్తమంసర్వే.

ఇందు "అథ సప్తమం సర్వే" అని సర్వగ్రహములు సప్తమముఁ జూతురని చెప్పఁబడియున్నది. పరాశరహోరయందుఁగూడ నిట్లే చెప్పఁబడియున్నది: —

శ్లో. చంద్రార్కా—రార్యశుక్రజ్ఞాః పాదం మిత్రభకర్మణీ,
పశ్యంతిచ శనిః పూర్ణ మథ ధర్మసుతౌ గురుః.
సర్వేఽర్ధం బంధుమృత్యూచ పూర్ణం పశ్యతి భూమిజః,
పరే త్రిపాదం పూర్ణంచ సర్వే పశ్యంతి సప్తమమ్.

ఇందును "సర్వే పశ్యంతి సప్తమం" అని సర్వగ్రహములకు సప్తమమున సంపూర్ణదృష్టి యంగీకరింపఁబడినది. ఇంతియగాక,—

కృతేపైతామహంశాస్త్రం త్రేతాయాం బాదరాయణమ్
గార్గేయం ద్వాపరే ప్రోక్తం కలౌ పారాశరం స్మృతమ్.

ఇత్యాది ప్రమాణములచే కలియుగమునఁ బరాశరమతమే యాదరింపఁదగిన దగుటచే శ్రీపతి కేశవాద్యాచార్యుల చేతను తన్మతమే యవలంబింపఁబడినది. కావుననే తన్మతమే సర్వదా స్వీకరణీయమని యెంచఁదగియున్నది.

౩

దృష్టియనఁగఁ గాంతి యనియు, ప్రతి గ్రహముయొక్క కాంతియు నాగ్రహముండు స్థానమున కభిముఖముగ నుండు సప్తమ రాశియందు సంపూర్ణముగఁ బ్రసరించి, క్రమక్రమముగ దూరమగుకొలఁదిస్వల్పమగుచు నష్టమనవమదశమరాసులందు త్రిపాద, అర్ధ, పాదబలములు గలదై యేకాదశమునకు వచ్చునప్పటికి శూన్యమగుననియుఁ జెప్పుదురు. శని గురు కుజమండలముల యాకారభేదములంబట్టి తత్తద్గ్రహములనుండి వచ్చు కాంతి త్రిదశత్రికోణచతురస్రములందుఁ గూడఁ బూర్ణముగ వ్యాపించుననియుఁ జెప్పుదురు.

ప్రతిగ్రహమును దానున్న స్థానమునుండి సప్తమమును సంపూర్ణముగఁ జూచును. అనఁగాఁ దానున్న స్థానమునుండి యాఱురాసులంతరము లేక ౧౮౦ భాగలదూరమునుండి ౩౦ భాగలు, అనగా ౨౧౦ భాగలవరకు వ్యాపించు దృష్టియొక్క బలము సంపూర్ణము లేక ఒకరూపముగా పరిగణించఁ బడుచున్నది. ఇదియే సప్తమభావ సంపూర్ణదృష్టి. పిమ్మట నష్టమభావత్రిపాదదృష్టిప్రారంభమగును. ౭ రాసులు లేక ౨౧౧వ భాగ మొదలుగ ౨౪౦ వ

భాగవఱకునగు ముప్పదిభాగల యందు వ్యాపించిన దృష్టి సప్తమభావమున వ్యాపించిన దృష్టిలో త్రిపాదము ($\frac{3}{4}$) లేక ౪౫ విరూపముల ప్రమాణము బలము కలది. పిమ్మట నవమభావ అర్ధదృష్టి ప్రారంభమగును ౮ రాసులు లేక ౨౪౧ వ భాగ మొదలుగ ౨౭౦ వ భాగవఱకు నగు ముప్పది భాగలయందు వ్యాపించిన దృష్టి సప్తమభావ దృష్టిలో నర్ధము లేక ౩౦ విరూపములు బలము కలది. తదనంతరము దశమభావ పాదదృష్టి ప్రారంభమగును. ౯ రాసులు లేక ౨౭౧ వ భాగ మొదలుగ ౩౦౦వ భాగ వఱకునగు ముప్పదిభాగలయందు వ్యాపించినదృష్టి సప్తమ భావదృష్టిలో పాదము లేక ౧౫ విరూపముల బలము గలది. ఇట్లే తదితరభావము లందలి దృష్టియు నెంచఁదగి యున్నది. కావున నొక గ్రహము మఱియొక గ్రహముఁ గాని, భావముఁ గాని జూచుచున్నపు డాదృష్టియొక్క బలమును సాధింపవలసిన యెడల ముందుగ నాచూడఁబడు చున్న గ్రహము లేక భావము (దృశ్యము) యొక్క రాశ్యాదినుండి చూచుచున్న ద్రష్టయొక్క రాశ్యాదిఁ దీసివేయఁగావచ్చు నంతర మెంత రాశ్యాదికమగునో తెలిసికొని, యది మొదలుగ ముప్పది భాగలవఱకు వ్యాపించు దృష్టిని సాధించవలయును. ఈ ముప్పది భాగలయందు వ్యాపించు దృష్టియే దృశ్యమునందు వర్తించును.

ఇట్టి దృష్టి సాధనము శ్రీకాళిదాస మహాకవిచే నుత్తరకాలామృతమునందు:—

శ్లో. ద్రష్టారి శోధితదృశ్యకేంద్ర భవశా
త్తత్తత్ఫలం స్యా దధో
భాగేభ్య స్త్వనుపాతలబ్ధ కలికాః
స్వర్ణం కృతా దృ గ్భవేత్.

దృశ్యమునుండి ద్రష్టనుఁ దీసివేయఁగా వచ్చునంతరమగు రాసులవలన పైనఁ జెప్పినటుల దృష్టిని సాధించవలయును.

ఉదా.—దృశ్యము తులారాశి ప్రథమభాగయందున్న రవి. ద్రష్ట మేషలగ్న ప్రథమభాగయందున్న చంద్రుఁడు. దృశ్యముయొక్క రాశ్యాదియగు ౬-౧ నుండి ద్రష్టయొక్క రాశ్యాదియగు ౦-౧ ని దీసివేయఁగా నంతర మాఱు రాసులు. అంతరము ౬ రాసులు గనుక సప్తమ భావ పూర్ణదృష్టి ప్రారంభమయినది. ఇచ్చటినుండి ముప్పదిభాగలవఱకు నుండు దృష్టి సప్తమభావారంభము నుండి అంతమువఱకు నగు సంపూర్ణదృష్టియే గావున నీ దృశ్యమునందు వ్యాపించు ద్రష్టయొక్క బలము సంపూర్ణమైనది, అనఁగా నొక రూపము బలముగలది యని యెంచఁదగినది.

దృశ్యమునుండి ద్రష్టనుదీసివేయఁగా రాసులే గాక భాగాదికముగూడ శేషమైనయెడల, నారాశ్యాదినుండి ముప్పదిభాగలవఱకు నేయేరాసులయం దెన్ని భాగల దృష్టి సాధించవలసినదియో నిర్ణయించవలయును.

ఉదా.—దృశ్యద్రష్ట్రంతరము ౬-౧౦ రాశ్యాదికమైన యెడల, నది మొదలుగ ముప్పదిభాగలవఱకు, ననఁగా ౭-౧౦ రాశ్యాదివఱకు దృష్టిని సాధించవలయును. ఇందు ౬-౧౦ మొదలు ౭ వఱకు ౨౦ భాగలయందు సప్తమభావసంపూర్ణ దృష్టియు, ౭ మొదలు ౭-౧౦ వఱకు ౧౦ భాగలయందష్టమభావత్రిపాదదృష్టియుసాధించవలయును. సప్తమభావమున ౩౦ భాగలయందు వ్యాపించు దృష్టి సంపూర్ణము లేక ౬౦ విరూపములైనయెడల ౨౦ భాగలయం దెంతదృష్టి యని త్రైరాశికముఁ జేయఁగ, $\frac{౨౦}{౩౦}$ లేక $\frac{౨}{౩}$ లేక ౪౦ విరూపముల దృష్టి వచ్చును. ఇట్లే అష్టమభావమున ౩౦ భాగలయందు త్రిపాదము ($\frac{3}{4}$) లేక ౪౫ విరూపముల దృష్టి యుండుచో, ౧౦ భాగలయం దెంతదృష్టి యని త్రైరాశికముఁ జేయఁగ, $\frac{3}{4} \times \frac{౧౦}{౩౦} = \frac{౧}{౪}$ లేక ౧౫ విరూపముల దృష్టి యగును. ఇట్లు సప్తమభావమున నిరువది భాగలందును, నష్టమభావమున పదిభాగలందును వచ్చు దృష్టిఁ గలుపఁగ, $\frac{౨}{౩} + \frac{౧}{౪} = \frac{౮+౩}{౧౨} = \frac{౧౧}{౧౨}$ లేక ౫౫ విరూపముల దృష్టి యగును.

ఇట్లు గాకున్నను, ఈముప్పదిభాగలు సప్తమభావమునందే యైనచో, పూర్ణము లేక ౬౦ విరూపముల దృష్టి బల మగును. సప్తమభావదృష్టికంటె నష్టమభావదృష్టి ౧౫ విరూపములు తక్కువగుటచే ముప్పదిభాగలకు ౧౫

విరూపములు తగ్గిన యెడల నొక్కొక్క భాగకు ౘ విరూపము లేక ౩౦ ప్రరూపములు తక్కువగును. అష్టమ భావమున మన మిపుడు సాధించవలసిన ౧౦ భాగలయం దును పదియర్ధవిరూపములు లేక ౫ విరూపముల దృష్టిని తగ్గించవలయును. దీనిని ౬౦ విరూపములనుండి తగ్గించిన ౫౫ విరూపముల బల మగును. ఇట్లు గాక మొదటిభావము నందలి దృష్టికంటె రెండవభావమునందలి దృష్టి యధిక మైనదగుచో, నాభాగలయం దధికదృష్టిని సాధించి మొదటిభావమునందు వచ్చు దృష్టిలోఁదీసివేయవలయును. ఇట్లు దృష్టి సాధించుటలో శని గురు కుజులు ద్రష్ట లై నపుడు వారికి త్రిదశాదిస్థానములందుఁ బూర్ణదృష్టి యని యెంచి దృష్టి సాధించవలయును. ఈ పైయుదాహరణము నందు ద్రష్ట కుజుఁ డైనచో సప్తమాష్టమభావముల రెంటి యందును సంపూర్ణదృష్టి గలవాఁ డగుటచే నా దృష్టి బలము ౬౦విరూపములు లేక రూపము బలమగుచున్నది.

౪

దృష్టిసాధనము పరమకారుణికులగు పరాశరు లచే సులభోపాయంబున సూత్రప్రాయముగఁ దెల్పఁ బడినది:—

శ్లో. దృశ్యాద్విశోధ్య ద్రష్టారంపఞ్చాశిభ్యోఽధికంభవేత్,
దిగ్భ్యో విశోధ్యద్వాభ్యాంతుభాగీకృత్యచదృష్టయః.
శరాధికే వినా రాశిం భాగా ద్విఘ్నాశ్చ దృష్టయః,
వేదాధికే త్యజేద్భూతాత్ భాగా దృష్టి స్త్రిభాధికే.
విశోధ్యార్ణవతో ద్వాభ్యాంలబ్ధం త్రింశద్యుతం భవేత్,
శరాధికే వినా రాశిం భాగా స్తిథి యుతా స్తథా.
రూపాధికే వినా రాశిం భాగా ద్వాభ్యాం విభాజితాః.

ప్రథమమున నిందు (కుజ గురు శనులకుఁగల విశేష దృష్టి గాక) రవ్యాదులకుఁ గల సామాన్యదృష్టి సాధనము దెలుపఁబడినది. ఇందు దృష్టి విరూపములలోఁ దెలియఁ గలదు.

1. దృశ్యద్రష్టాంతరము ౬ రాసులుగాని, అంత కంటె నధికముగాని యైనయెడల, నాయంతరమును ౧౦ రాసులనుండి తీసివేసి భాగలఁ జేసి ౨ చే భాగించిన దృష్టి విరూపములలోఁ దెలియును. అంతరము ౧౦ రాసులు దాఁటి ౧౨ రాసుల లోపుగ నైన యెడల, దృష్టి శూన్యమని యెంచఁదగినది.

2. ౫ రాసులకంటె నధికమైన, రాసుల విడిచి యంశల రెట్టించ దృష్టి యగును.

3. ౪ రాసులకంటె నధికమైన, ౫ రాసులనుంచి తీసివేసిన వచ్చుభాగలే దృష్టి యగును.

4. ౩ రాసులకంటె నధికమైన, ౪ రాసులనుండి తీసివేసి భాగల ౨ చే భాగించి లబ్ధమునకు ౩౦ కలుప వలయును.

5. ౨ రాసులకంటె నధికమైన, రాసుల వదలి యంశలకు ౧౫ గలుపవలయును.

6. ౧ రాశియైన, రాశి వదలి భాగల ౨ చే భాగిం చవలయును.

శని గురు కుజులకు త్రికశాది స్థానములందుఁ గల విశేషదృష్టి సాధనార్థమై సూత్రములు:—

శ్లో. భాగా ద్వినిఘ్నా విధుభేంతరాశే
త్రింశద్యుతాంశా గజభేఽర్కజస్య,
దృష్టి ర్భవే ద్భగదళోనషష్టిః
ద్విభేంకభే ద్వి ఘ్నలవోనషష్టిః.
త్రిభేఽద్రిభేఽంశార్ధయుతేషు వేదాః
పశ్యేత జీవేన విహీనదృశ్యే,
ద్విఘ్నాంశకోనా యుగభేతు షష్టిః
సార్ధాంశకోనా గజభేఽపి షష్టిః.
త్రిభేఽద్రిభే భాగవిహీనషష్టిః
దృష్టిః ప్రణీతా ధరణీ సుతస్య,
పంచావనీ సంయుతసార్ధభాగా
ద్విభేంకభే షష్టి కలోన్మితైవ.

7. శని ద్రష్ట యయినపుడు దృశ్యద్రష్టాంతరము:
(i) ఒకరాశికంటె నధికమైన, రాశిని వదలి అంశల రెట్టించిన దృష్టి యగును.

(ii) ఎనిమిది రాసులకంటె నధికమైన, భాగలకు ౩౦ కలుపవలయును.

(iii) రెండుకంటె నధికమైన, భాగల ౨ చే భాగించి లబ్ధమును ౬౦ లో తీసివేయవలయును.

(v) తొమ్మిదికంటె నధికమైన, భాగల రెట్టించి ౬౦ లోఁ దీసివేయవలయును.

8. గురుఁడు ద్రష్ట యయినపుడు దృశ్యద్రష్ట్రంతరము:—

(i) 3 రాసులకంటె గాని, ౭ రాసులకంటెఁ గాని యధిక మైనయెడల, భాగల ౨ చే భాగించి లబ్ధమునకు ౪౫ కలుపవలయును.

(ii) ౪ రాసులకంటె నధికమైన, భాగల రెట్టించి ౬౦ లోఁ దీసివేయవలయును.

(iii) ౫ రాసులకంటె నధికమైన, భాగల $1\frac{1}{2}$ రెట్లు చేసి ౬౦ లోఁ దీసివేయవలయును.

9. కుజుఁడు ద్రష్ట యయినపుడు దృశ్యద్రష్ట్రంతరము:—

(i) 3 రాసులకంటెఁ గాని, ౭ రాసులకంటెఁ గాని యధిక మైనయెడల, భాగల ౬౦ లోఁ దీసివేయవలయును.

(ii) ౨ రాసులకంటె నధిక మైన, భాగల $1\frac{1}{2}$ రెట్లు చేసి ౪౫ కలుపవలయును.

(iii) ౬ రాసులకంటె నధికమైన, ౬౦ విరూపములే దృష్టి యగును.

తదితరభావములం దీ శని గురు కుజులకును ప్రథమమున ౧, ౨, 3 శ్లోకములందుఁ జెప్పఁబడినరీతిని దృష్టి సాధించవలయును. ఈ సూత్రములకు ఉపపత్తులు సుగమము లగుటచే వివరించలేదు. శ్రీపతి కేశవాది పద్ధతులందుఁ దెల్పఁబడిన దృష్టి సాధనవిధానము లింత సుగమమైనవి కాకుండుటచే వానిని గ్రహించలేదు.

---

# ప్రథమసమాగమము

వెదురుమూడి వేంకటకృష్ణారావుగారు

విరహాగ్నికీలల వ్రేఁగు పతికనులు చంద్రాస్య నరయంగఁ జల్లనయ్యె;
స్మరభూతవశతఁ గుదురునేని ప్రియు మది ముదిత కౌఁగిటి రతిఁ గుదుటఁ బడియె;
అతనువేఁడికి వెల్లనైన నాథుతనువు సుమగాత్రిఁ బెనయంగ సొబగుఁ జూపె;
మరుకాఁక వెగటైన వరుజిహ్వ జవ్వని యధరామృతం బాన మధురమయ్యె;
చిరవియోగార్తిభరమునఁ బరితపించి-చిక్కి- శల్యమైన పురుష సింహమునకు
మారు లేని దివ్యౌషధసార మయ్యె-నౌర! ప్రేయసీప్రథమసమాగమంబు!

---

# సంగీతము

## కర్ణాటక రాగములందలి శ్రుతులు

పండిత వింజమూరి వరాహనరసింహాచార్యులు గారు

క్రిందటి ఆంధ్రపత్రిక సంచికలందును, 1 విభవ సం॥ మాఘ మాసపు భారతి పత్రికయందును[2] భారతీయస్వరావళి గూర్చి యు, శ్రుతులగూర్చియు జెప్పియుంటిమి. భరతుడు, శార్ఙ్గదేవుడు, అహోబలుడు, రామామాత్యుడు మున్నగు వాగ్గేయులమతములును కొంత చెప్పబడెను. ఇంకను వీనివివరములను నేనురచించిన "22 శ్రుతులు-స్వరావళి" అనుగ్రంథమున జూడనగును. ఇందుచే నిప్పటికి తేలినయంశములు: (1) భారతీయ సంగీతము ద్వావింశతి శ్రుతులపై నాధారపడి యున్నదనియు, (2) ఈపద్ధతి ఒక్క షడ్జపంచమ లేక షడ్జ మధ్యమ భావమున (Quintal Harmony) మాత్రమే కాక షడ్జగాంధార భావము (Tertian Harmony) ననుసరించియు గలదనియు, (3) మన సంగీతమునందు 22 శ్రుతులకన్న నెక్కువ కాని, తక్కువకాని ఎంచ వీలు లేదనియు, (4) అట్లు ఎంచుట భిన్న పద్ధతి నవలంబించు చేయనియు, (5) పైభావములను చెడకుండగ రాగములందు మనకు వలయు శ్రుతుల నెల్ల చేర్చుకొనుట కూడ దనుటయే కాక స్వల్ప భేదములతోనున్న పెక్కు శ్రుతులను, అనగా 25/24, 256/243, 31/30, 21/20, 81/80 విలువలతోనున్న ఏకశ్రుతి ఋషభములను, ఇట్లు ద్విశ్రుతి ఋషభములను మున్నగువానిని చేర్చుకొనుచుంటిమా, మనస్వరావళి యగ్రాహ్యమై యసహ్యముగ నుండుననియు, (6) నట్టివి రాగములందు సువ్యక్తములగు వానినే యిరువది రెండింటిని మాత్రము గ్రహించి తక్కినవానిని గమకములచే గ్రహింపనగుననియు మున్నగునవి ఆయావ్యాసములందు చెప్పియుంటిమి. ఈ 22 శ్రుతుల విలువలు, ప్రమాణములు తీగెయందు వ్యక్తములగు విధమున వీనితావులు ఇత్యాదులుకూడ చెప్పబడెను. (చూ. శుక్ల ఆం. ప. సంచిక, పుట 267.)

ఇటీవల కొందఱు ఆంధ్రగాయకులు "స్వరములకును, శ్రుతులకును విలువ లెంచు టెట్లు" అని తమవిస్మయమును వెల్లడించుచుంట తగదు. వీరు చిలుకపలుకులవలె తాము నేర్చినది కచేరీలందు ప్రదర్శించుదురే కాని లక్షణము నెరింగి పూర్వపువాగ్గేయుల మతములను చక్కగ గ్రహించి ధ్వనిశాస్త్రానుగుణ్యముగ వానిని సమర్థించి చూపుటకు నుద్యుక్తులైనయ ట్లెంచరని నాతలంపు. బేగడరాగమును పాడునప్పుడు ఆ రాగమందలి నైసర్గికశ్రుతిని—రాగమును విస్పష్టముసేయు మధ్యమమును—శుద్ధమధ్యమముకన్న కొంచెము తీవ్రమగు దానినే పాడుచున్నారు కాని దానిని గుర్తించి యది తాము ఏయేతావులం దుపయోగించునదియు, నందులకు కారణములును గ్రహించుట వీరి కవసరము లేకపోయినను ఇష్టము లేకపోవుట భావ్యము కాదు. ఈపర్చ లక్ష్యమెరింగియు లక్షణముకూడ తెలిసినకాని తగనిపని. కావున వీ రీపని కియ్యకొనకయు నట్టివారిని సహింపకపోవుట శోచనీయము. తాత్కాలికసంగీతమున ఏయే రాగములందే యేశ్రుతులు వ్యక్తములగుచున్నవియు, నందులకు కారణములును కొన్ని రాగప్రయోగములనుండి గ్రహించి చెప్పుట ఇప్పుడు మిగుల ఆవశ్యకమగు పనిగ మద్రాసు సంగీత విద్వత్పరిషత్తు వారు ఎంచుచున్నారు. ఏతత్సభయొక్క సలహాసంఘసభ్యుడనగు నేను ఇదివరలో వారికిని, "హిందూపత్రిక" మున్నగువానికిని కొన్ని రాగములగూర్చి వ్రాసియుంటిని. వానిని సమగ్రముగ ఆంధ్ర సోదరులుకూడ గ్రహించి మన యాంధ్రదేశమందలి కర్ణాటకగాన కళ ఉత్కృష్టతనుకూడ నెల్లడించుటకు హెచ్చరించుచున్నాను.

### రాగములందలి శ్రుతుల నెంచుట

రాగములందు ఆయారాగకళాపోషకములగు శ్రుతులు గ్రహించుటకును, చెప్పుటకును సులభ సాధ్యము కాదని యెంచినప్పుడు కొంతవరకు భిన్న మతము లాకారణముచే బొడసూపు ననుటయు జెల్లు. అందుచే తర్జనభర్జనము చేసి యందరు సమ్మతించు విధమున తద్రాగప్రయోగములు తీసికొని సంవాదిపద్ధతిప్రకారము వీనియందు వ్యక్తములగు శ్రుతులను గ్రహించి చెప్పుట ముఖ్యము. ఇప్పుడును మనశ్శాస్త్రము (Psychology) ననుసరించిన కొన్నియంశములు పాటింపబడుట విదితము. సంగీతము, ప్రతిలలితకళయు, ఏల హృదయాకర్షక మగుచున్నది? మనోబలమును వృద్ధిచేయ లేనిది కళ

1 చూ. ఆం. ప. విభవ, శుక్లసంవత్సరాది సంచికలు.

2 చూ. భారతి, సంపుటము 6, సంఖ్య 2.

కానేరదు. రాగములందు ఒకస్వరమునుండి మరియొకస్వరమును గ్రహించునప్పుడు మనసు క్రిందిస్వరమునకు కరము చేరువగుటకే పైస్వరమును తగ్గింప యత్నించుచుండును. అనగా రాగసంచారములందు క్రింది స్వరమును చెప్పి పైస్వరమును చెప్ప బూనినప్పుడు దానిని కొంత కోమలము చేయుటయే మనోధర్మ మనవలయు. ఇది నియమము లేక శాస్త్రమునకు విరుద్ధముగనే యుండును. అయిన నేమి? మనోబలము హెచ్చగు కొలది బుద్ధిబలము, అందుచే శాస్త్రము కొంత కుంటువడును. అప్పుడే కళ రసవంత మగును. రసము నీరసమైన కళ యనము. ఇందుచే శ్రుతుల నెంచునప్పుడు ఈసంగతు లిప్పుడు ముఖ్యము లగుచున్నవి: (1) స్వరములు సామాన్యముగ షడ్జపంచమ లేక మధ్యమ, మరి గాంధార భావమున నుండును. (2) గమకవిహీనమైన స్వరములు దీర్ఘము లగుతరి, అనగా వానిమాత్రాకాలము పెరుగునప్పుడు, శ్రుతివిలువ హెచ్చును. కావుననే భైరవియందు చతుశ్శ్రుతి శుద్ధధైవతములును, కాంభోజిరాగమున కైశికి కాకలినిషాదములును, మరి నీలాంబరి, అఠాణా రాగములందు కైశికి కాకలినిషాదములును, ఇట్లు కొన్ని రాగములందు నియతిస్వరముల కన్న వెక్కులు వచ్చుట పైమనోధర్మము ననుసరించిన సంగతులవలననే యని యెఱుగవలయు. ఈసంగతు లెఱుగకయె మన పాటకు లట్లు పాడుచుంట విచిత్రము. అట్లు పాడనిది ఆరాగములు రంజితములు కావు. వీనిని మన వాగ్గేయులు భాషాంగము లనిరి.

## శ్రుతుల విలువలు

ఇక రాగములందు శ్రుతుల నిరూపించుటకు ముందు వీనివిలువలు, తంత్రియందు వీనిస్థానములు, స్వరస్థానముల పేర్లు మున్నగు నంశములు క్లుప్తముగ జెప్పవలసియున్నది. ఇదివరలో శ్రుతులవిలువలు వరుసగ షడ్జము1; ఏకశ్రుతిఋషభము 31/30 (లేక25/24); ద్విశ్రుతిఋషభము 16/15; త్రిశ్రుతిఋషభము 10/9; చతుశ్శ్రుతిఋషభము 9/8; మధ్యగాంధారము 32/27; సాధారణగాంధారము 6/5; అంతరగాంధారము 5/4;తీవ్ర లేక చ్యుతమధ్యమ గాంధారము 81/64; శుద్ధమధ్యమము 4/3; ఏకశ్రుతి మ. లేక తీవ్రమధ్యమము 27/20; ప్రతిమధ్యమము 45/32; వరాళిమధ్యమము 64/45; పంచమము 3/2; ఏకశ్రుతి ధ. 31/20 (లేక 25/16); ద్విశ్రుతి ధైవతము 8/5; త్రిశ్రుతి ధ. 5/3; చతుశ్శ్రుతి ధ. 27/16; మధ్యనిషాదము 16/9; కైశికి ని. 9/5; కాకలి ని. 15/8;తీవ్ర ని. లేకచ్యుత షడ్జనిషాదము 243/128; హెచ్చు స. 2: ఇట్లు చెప్పబడెను. ఇవి ఫిడేలునందు పలికింపబడు స్థానము లిట్లు గ్రహింతుము: షడ్జ తీగెయందు 31/30 (25/24), 16/15, 10/9, 9/8, 6/5, 5/4, 4/3 3/2 స్వరములు తీగెను 1/31 (1/25), 1/16, 1/10, 1/9, 1/6, 1/5, 1/4, 1/3 భాగములందు తాకిన కలుగుచున్నవి. ఈభాగములందే పంచమతీగెను తాకిన 31/20 (25/16), 8/5, 5/3, 27/16, 9/5,15/8, 2, 9/4 స్వరములును, మధ్యమతీగెయందు, అనగా ఫిడేలున మధ్యమము పలుకునదిగ జేసిన తీగెయందు, పైభాగముల చొప్పున తాకిన 62/45 (25/18), 64/45, 40/27, 3/2, 8/5, 5/3, 16/9, 2 స్వరములును పలుకును.

ఇట షడ్జ గాంధార పద్ధతియందలి 25/24 గల ఏకశ్రుతి విలువ కొంత మార్పుచేసినందువలన, అనగా ప్రతిమధ్యమమునకు(45/32)పంచమ భావముననున్న ద్విశ్రుతిఋషభపువిలువ 135/128 నుండి ఒకకోమా 81/80 విలువ తీసివేసిన కలుగుచున్నదని చెప్పియుంటిమి. (మా. శుక్ల సంచిక.) కాని దీనిని, మరి ఏకశ్రుతిధైవతమును ఇట్లెంచవచ్చును. ఏకశ్రుతిధైవతము అంతరగాంధారమునకు అంతర గాంధార మగుచున్నది. కావున ఏకశ్రుతి ధ.=5/4 × 5/4=25/16. దీనినుండి పంచమము తగ్గిన ఏకశ్రుతి రి.=25/16 ÷ 3/2=25/24 అగును. ఈ అంతరగాంధార భావమున నున్న కొన్ని విలువలు 48/25, 32/25, 25/18, 36/25-ఇట్లున్నవి. ఇవి ఏయేరాగములందు వచ్చునో తెలియవలసియున్నది. పైశ్రుతులపేర్లు గ్రహించుట కీసంగతులు గమనింపబడినవి:—

(1) శ్రుతులపేర్లు షడ్జాది స్వరస్థానానుగుణ్యముగ భరతాది వాగ్గేయులు|చెప్పువిధమున కొంతవర కనుకరించి చెప్పితిని. పూర్వవిరచితములందు వీనిపేర్లు భిన్నముగ గన్పట్టుటచే వానినెల్ల నెంచి సామరస్యముచేసి పైపేర్లను ఏర్పరచితిని. వానినే సంగీత పరిషత్తువారు ఆమోదింపనున్నారు.

(2) 32/27 మధ్యగాంధారము, 16/9 మధ్యనిషాదము పేర్లు చెప్పుటకు కారణము ఇవి శుద్ధమధ్యమమునకు మధ్యమభావమున నుంటయే. 4/3 × 4/3=16/9. 16/9 × 4/3=64/27. దీనికిసగము 32/27.

(3) చతుశ్శ్రుతి రి., చతుశ్శ్రుతి ధ.లు పూర్వపు వాగ్గేయులు ఎంచిరి కావున ఏకశ్రుతి, ద్విశ్రుతి, త్రిశ్రుతి ఇట్లు చేర్చి చెప్పితిమి.

(4) శుద్ధషట్శ్రుతి పేర్లు వేంకటమఖి చెప్పెను కాని ఇవి వివాదహేతుకములుగ నున్నవి కావున విద్యార్థులకు వీని నిప్పుడు చెప్ప నవసరము లేని కారణమున నవి చెప్పబడలేదు.

(5) శ్రుతుల విలువలు భరతాదివాగ్గేయుల మతము ననుసరించి షడ్జపంచమ లేక షడ్జమధ్యమ మరి, షడ్జ గాంధార భావమున పాశ్చాత్య శాస్త్రజ్ఞులు హెల్మహోల్ట్సు గ్రంథమునుండి* గ్రహించి ఫిడేలునందు వానిని నేను రాగములందు ఒప్పించి గ్రహించి నాశ్రుతివీణె (Sonometre) యందు వీనిని ధ్రువపరచుకొని చెప్పియుంటిని.

(6) హిందూస్థానీపద్ధతి ననుసరించిన-తీవ్ర కోమల-పేర్లు కర్నాటకమున కుపకరింపవనియు, భరతాదివాగ్గేయులు అహోబలుడు తప్ప వానిని ఎంచలేదనియు మొదలగు కారణములచే నవి యనుసరింపబడలేదు.

* Helmholtz: "Sensation of Tone", translated by E. J. Ellis.

(7) సాధారణ, అంతర, కైశికి, కాకలి పేర్లు భరతుడు, శార్ఙ్గదేవుడు, రామామాత్యుడు, సోమనార్యుడు, వేంకటమఖి మున్నగువారు చెప్పియుండిరి కావునను, ఇవి హెల్మహోల్ట్సు చెప్పినట్లు కంపించుచున్న తీగెయందు "అనురణనాత్మక" ధ్వనులై విలసిల్లుటచేతను వాని నట్లే చెప్పితిని.

(8) హిందూ సంగీతము, ముఖ్యముగ కర్ణాటకగానము, పాశ్చాత్యుల సంగీతమువలె గీతలపద్ధతితో చెప్ప వీలులేదు కావున మేళముల నేర్పఱచునప్పు డవి 12 స్వరస్థానములవలన కలిగినవనియు, రాగములు స్పష్టపఱచుటకు తక్కిన శ్రుతులు (మొత్తము 22) ఆవశ్యకము లగుననియు నెంచబడుచున్నది.

(9) ఇప్పుడును ఈ శ్రుతుల చేరికగల స్వరప్రయోగములు రాగకళను బాగుగ పోషించుటయే కాని అంతగ స్పష్టముగ చెప్పుట లేదు కావున నివి శరీరమందలి యస్థిపంజరమువలె మాత్ర మేర్పడుచున్నవని గ్రహింతుము. ఎముకల యసహ్యతను కప్పిపుచ్చుటకు వానిపై గల నాడులు, కండరములు, చర్మము ఆవశ్యకము లగునట్లు స్వరముల యసమర్థతను తగ్గించుటకు శ్రుతులు, మరి గమకములు ఆవశ్యకము లగుచున్నవని ఎంచుదుము.

(10) ప్రతిగాయకుడును ఒక్కొక్క శ్రుతియందు పాడుటలేదు కావున స్వరములు మరి శ్రుతులు విలువల, చలనములచొప్పున చెప్పుట కన్న షడ్జమునకుగల వీని సంబంధమును చెప్పుటే, అనగా వాని ప్రమాణమును (ratio) చెప్పుటే చెల్లు.

(11) ప్రతిస్వరము మధ్యగల యంతరముకూడ సంవాదానుగుణ్యముగనే యుండును. ఇవి సామాన్యముగ 16/15, 10/9, 9/8, 6/5, 5/4, 4/3-ఇట్లుండును.

(12) మేళకర్తల స్వరావళిని చెప్పునప్పుడు వేంకటమఖి మతమే స; ర, రి, రు; గ, గి, గు; మ, మి; ప; ధ, ధి, ధు; న, ని, ను- ఇట్లు అనుసరించి చెప్పుటే భావ్యము. (చూ. చతుర్దండిప్రకాశిక.)

## కొన్ని రాగములు

ఇట్లు పై ద్వావింశతి శ్రుతులు ఏయేరాగములందు కలుగునదియు నీవిధమున ఎంచి చెప్పుదుము:

### (1) తోడి రాగము:—

స్వరములు:

వేంకటమఖి పేర్లు—స-ర-గి-మ-ప-ధ-ని-స.

శ్రుతుల సంఖ్య—స-రి$_1$-గ$_2$-మ$_1$-ప-ద$_1$-ని$_2$-స.*

ప్రమాణములు (ratios)—1, 31/30 (25/24), 6/5, 4/3, 3/2, 8/5 (31/20), 9/5, 2.

అంతరములు (intervals)—1, 31/30 (25/24), 36/31, 10/9, 9/8, 31/30, 36/31, 10/9.

ఈ రాగమందలి (1) ధగగమగధ, నిసరి ధగాగమ, ధగరిస, (2) ధమ, మధ-ప్రయోగములందు గాంధారమధ్యమములతో మధ్యమసాధారణ గాంధారభావమున, అనగా 4/3, 6/5 అంతరవుచొప్పున నున్న 8/5 విలువగల ద్విశ్రుతిధైవతము వచ్చును. రిధని, ధరిని, ధరిస, ధధరిరిగగ మొదలగుప్రయోగములందు ధ ఏకశ్రుతికమై 31/20 (25/16) విలువతో నుండును. ఇప్పుడెల్ల నిషాదము 16/9 విలువగల శుద్ధ ని. యగుచున్నది. ఇట్లు ఆరోహణమున ధైవతము 8/5 విలువగల ద్విశ్రుతికముగను, అవరోహణమున నిది 31/20 (లేక 25/16) గల ఏకశ్రుతికముగను గన్పట్టును. 31/30, 31/20 విలువలు భారతీయగానమునకు తగవని కొందఱెంచునది సరికాదు. హెల్మహోల్ట్సు శాస్త్రవేత్త వానిని సంగీతయోగ్యములు (Musical notes) అని చెప్పినప్పుడును, మన సంగీతము ననుసరించని షడ్జపంచమ భావమున నవి లేవని చెప్పినంతమాత్రమున వానిని విడనాడకూడదు. కర్ణాటకగానమున నివియే కనబడుచున్నవి. కాని తోడిరాగమందు వలె ఫిడేలున ప్రయోగమున తీగెయందు 25/24 విలువగల శ్రుతిని తాకి క్రిందకు 31/30 విలువకు వచ్చుట యాచారము. ఈ రెండును చేరికగ నుంటచే కొందఱు దీనిని 25/24 గ నెంచుచున్నారు. దీనినుండి గమకముచే 31/30 రి. ని పలికింపవచ్చు ననుటచే తోడిరాగమున ఈ 25/24 ఋషభమును ఎంచినను భావ్యమే. తోడి జన్యమైన అసావేరిరాగమందు 32/27, 16/9 విలువలుగల మధ్యగాంధార నిషాదములు వచ్చుచున్నవి. మరియొక జన్యరాగము పున్నాగవరాళియందు 10/9 విలువగల త్రిశ్రుతిఋషభము గరిగమ మున్నగుప్రయోగములందు వచ్చును. కావున ఈ రాగము కోమలస్వరములనే గణించుననుట తథ్యము. దీనిని వేంకటమఖి ఔత్తరరాగమని చెప్పినాడు. ఇతని 19 మేళములం దిది కనుపించదు. "అరెరెదశరథరాజ" అనే ప్రాచీన వర్ణమందు తప్ప తక్కిన వర్ణములు, కృతులు ఇత్యాదులందు పంచమము వర్జింపబడుట లేదు.

### (2) మాయామాళవగౌళ రాగము:—

వేంకటమఖి పేర్లు—స-ర-గు-మ-ప-ద-ను-స.

శ్రుతుల సంఖ్య—స-రి$_2$-గ$_3$-మ$_1$-ప-ద$_2$-ని$_3$-స.

ప్రమాణములు—1, 16/15, 5/4, 4/3, 3/2, 8/5, 15/8, 2,

అంతరములు—16/15, 75/64, 16/15, 9/8, 16/15, 75/64, 16/15.

ఈ రాగమందలి స్వరములు మారునవి కావు. కావుననే బాలురకీ రాగస్వరావళి నేర్పబడుచున్నది. ఇందలి స్వరములు దాటుప్రయోగములుగ లేక ఒకటి వెంబడి యొకటి పూసగ్రుచ్చిన విధమున సరళ

* స్వరముక్రింది సంఖ్య యద్దాని శ్రుతులను చెప్పును.



శ్రీ గా॥ విశారద జి. రంగనాయకులుగారు, శ్రీ ప్రొఫెసరు టి. దక్షిణామూర్తిగారు (మెస్మరిస్టు) చీరాల.



(17) శ్రీ బాలసరస్వతీ లైబ్రరీ, అంగలూరు, కృష్ణాజిల్లా.



శ్రీ చల్లపల్లి రాజాగారు.



శ్రీ రాజా హరిశ్చంద్ర జగద్దేవుగారు, టెక్కలి.



టెక్కలి సీనియరు జమీందారుగారు.



సర్ నార్మన్ మార్షుబ్యాంక్సు, మదరాసు ఆక్టింగుగవర్నరు

ముగ జరుగును. శార్ఙ్గదేవుడు రేవగుప్త, సుజ్జరి మొదలగు జన్యరాగములతో జెప్పిన 22 వ పంచమగాంధార గ్రామరాగము మన మాయామాళవగౌళయే యని రామామాత్యుడు, సోమనార్యుడు, వేంకటమఖి మున్నగువారు ఎంచినారు. దీని ముఖ్యజన్యములగు సావేరి, సౌరాష్ట్రి, మలహరి ఇత్యాదులందు పైవిలువలు జరిగిపోవుచున్నవి. సావేరి రాగమందలి గాంధారనిషాదములగూర్చి వివాద మంగీకరించలేదు. దీనిగూర్చి పరిషత్ సభవారు కొంత విచారించి ప్రత్యేకసంఘమునకు వదలినారు. గరిస, రిగరిస మున్నగుచోట అంతరగాంధారము కలుగుటలేదు. సాధారణ గాంధారము వచ్చునని కొంద రెంచునది సరికాదు. అంతర సాధారణములకు మధ్యగ నున్నదని పెక్కురు తలంచుచున్నారు. దీని విలువ యీమధ్య నేను 39/32 గ కనుగొంటిని. దీనిని హెల్మ్‌హోల్ట్సు 39 వ "అనురణనాత్మకధ్వని" (Harmonic) గ జెప్పినాడు. ఇది $292\frac{1}{2}$ చలనములు కలది యగుచున్నది. ఇంకను దీని సత్యత్వముగూర్చి చర్చింపవలసియున్నది.

(3) నటభైరవి:—

వేంకటమఖి పేర్లు — స-రు-గి-మ-ప-ధ-ని-సం.

శ్రుతుల సంఖ్య — స-రి$_3$-గ$_1$-మ$_1$-ప-ధ$_2$-ని$_1$-సం.

ప్రమాణములు — 1, 10/9, 32/27, 4/3, 3/2, 8/5, 16/9, 2.

అంతరములు — 10/9, 16/15, 9/8, 9/8, 16/15, 10/9, 9/8.

ఈరాగము వేంకటమఖి 72 మేళములందు 20 వ నారీ రీతిగౌళ మేళము జన్యముగ జెప్పబడినది. ఇందుచే రీతిగౌళ ప్రయోగములను దీనిస్వరముల శ్రుతివిలువలను గ్రహించుట కుపయుక్తములు. రీతిగౌళ ప్రయోగములవలన ఋషభగాంధారములు 10/9, 32/27 గల విగ నెంచవలసియున్నది. కొన్నిచో సరినిధనిస, సిసరినిధ ఇత్యాదులందు రి. 16/15 విలువగలదిగ నున్నది. ధైవతముగూర్చి వివాద కలదు కాని సంగీత పరిషత్ సభవారు ఆరోహణమున 27/16 విలువగల చతుశ్రుతి ధ.యు, నవరోహణమున 8/5 విలువగల ద్విశ్రుతి ధ.యు వచ్చునని యెంచిరి. భైరవిప్రయోగములందు (1) ధనిస, ధారి, మనిధప, నిస నిస, నిధని, సనిధధపమపా మొదలగుచోట చతుశ్రుతి ధ.యు, (2) ధపమగప, నినిధనధప, రినిధప, సనినప, గరిసనినప మున్నగువాని యందు ద్విశ్రుతి 8/5 ధ.యు వచ్చుచున్నవి. సరినిధ, సరిగరినిధ, రినిధ, నిగరినిధ ఇత్యాదులుకూడ అవరోహణక్రమమున నున్నను వీని యందు 27/16 చతుశ్రుతి ధ.యే వచ్చుచున్నది. ఇందుచే నిది భాషాంగరాగమే యగుచున్నది కాని కొంద రెంచునట్లు రాగాంగముగ లేదు.

(4) ఖరహరప్రియ:—

వేంకటమఖి పేర్లు — స-రు గి-మ-ప-ధు-ని-సం.

శ్రుతులసంఖ్య — స-రి$_4$-గ$_2$ మ$_1$ ప-ధ$_3$-ని$_2$-సం.

ప్రమాణములు — 1, 9/8, 6/5, 4/3, 3/2, 5/3, 9/5, 2.

అంతరములు — 9/8, 16/15, 10/9, 9/8, 10/9, 16/15, 10/9.

ఈ రాగస్వరావళి మిగుల సరళముగ జరుగును. అనగా దాటు స్వరప్రయోగయుక్తము కాదు. దీని జన్యము శ్రీరాగమందువలె 9/5 విలువగల కైశికి నిషాదమే వచ్చును.

(5) కాంభోజి:—

వేంకటమఖి పేర్లు — స-రు-గు-మ-ప-ధు-ని-సం.

శ్రుతులసంఖ్య — స-రి$_4$-గ$_3$-మ$_1$-ప-ధ$_3$-ని$_1$-సం.

ప్రమాణములు — 1, 9/8, 5/4 4/3, 3/2, 5/3, 16/9, 2.

అంతరములు — 9/8, 10/9, 16/15, 9/8, 10/9, 16/15, 9/8.

(ధైవతము త్రిశ్రుతికముగను, నిషాదము మధ్యనిషాదముగను గ్రహించునది.) ధా,, ని, పనని,నిధ ప్రయోగములందువలె ధైవతము కొన్నిమాత్రలకాలము పెంచి పట్టవచ్చును కావున పంచమతీగెయందలిది షడ్జతీగె స.తో సంవాది యగుచున్నది. ఇందుచే దీనివిలువ 5/3 గల త్రిశ్రుతికముగ నెంచవలయును. వీణయందిది తీగె 2/5 వ భాగమున తాకిన, లేక తీగె 3/5 భాగములు కంపించునప్పుడు కలుగును. శంకరాభరణ ధైవతమిట్లు ముఖ్యసంవాదిగ లేక 27/16 విలువగల చతుశ్రుతికముగ నున్న దనునది మరువకూడదు. కాంభోజి యితరప్రయోగములు ధగా, గరిగస, ధమగ మొదలగుచోటను 5/3 ధ.యే యని యెంచవలయును. 'కరుణే' అనుపన్నమందు 'ధరి' అనునప్పుడీ విలువ గోచరించుట లేదు కాని 'ధరి' గమకముతో 'ధసరి' అని వాయింపబడునట్లు నాఅభిప్రాయము. కొన్ని అవరోహణ ప్రయోగములందును 'ధ,ని'ల విలువలు 27/16, 15/8 గ నెంచవలసియున్నది. అనగా కాకలినిషాదమును వచ్చుచున్నది. ఇందుచే నిదియు భాషాంగరాగమే. దీనిఋషభము శంకరాభరణమునందువలె స్థిరమైనది కాదు; అనగా అల్పమనుట. ఇది దీర్ఘముగ బట్ట వీలులేదు. దీని జన్యము మాళవిరాగమందు మని, నిమ మొదలగు ప్రయోగములవలన మధ్యనిషాదము 16/9 గ నెంచవలసియున్నది.

(6) శంకరాభరణము:—

వేంకటమఖి పేర్లు — స-రు-గు-మ-ప-ధు-ను-సం,

శ్రుతులసంఖ్య — స-రి$_4$-గ$_3$-మ$_1$-ప-ధ$_4$-ని$_3$-సం.

ప్రమాణములు — 1, 9/8, 5/4, 4/3, 3/2, 27/16, 15/8, 2.

అంతరములు — 9/8, 10/9, 16/15, 9/8, 9/8, 10/9, 16/15.

ఈరాగమున 243/128 విలువగల నిషాదము అల్పముగ, రినిధ, నిరిసని, సగపని, సనిధని మొదలగుచోట కలుగుచున్నది. ఇందలి 'రి, ధ'లు గమకములతో గాక ప్రత్యేకముగ మాత్రాకాల మెక్కువజేసి పట్ట వీలులేదు. 'సధప' ప్రయోగమును కలదు. దీని జన్యము కురంజి

యందును 243/128 నిషాదము కలుగుచున్నది. "స్వామి నిన్నే" వర్ణమందలి మమ,ధపగమ' అను నప్పుడు ధ. 5/3గ నున్నది. దీనిజన్యము కన్నడరాగమందలి సమగమ, మధపధ అనుచోట మొదటి ధ. త్రిశ్రుతికము 5/3గను, రెండవది చతుశ్రుతికము 27/16గ నున్నవి.

(7) కల్యాణి:—

వేంకటముఖి పేర్లు—స-రు-గు-మి-ప-ధు-ను-స.

శ్రుతులసంఖ్య—స-రి$_4$-గ$_4$-మ$_3$-ప-ధ$_4$-ని$_3$-స.

ప్రమాణములు—1,9/8, 81/64, 45/32,.3/2, 27/16, 243/128 (15/8), 2.

అంతరములు—9/8, 9/8, 10/9, 16/15, 9/8, 10/9, 16/9.

కళ్యాణిరాగ ప్రయోగములు ముఖ్యముగ ఈ విలువలనే స్థాపించుచున్నవి. ససాసనిధ, రిసని, నిధపమ, గమపధనీ మున్నగు ప్రయోగములందు తీవ్ర ని. లేక షడ్జనిషాదము 243/128 విలువకలదియే వచ్చును. ఈ నిషాదమే దీనిని బాగుగ స్ఫురింపచేయుచున్నదని తలంపబడుచున్నది. ఋషభము 9/8 విలువగల చతుశ్రుతికము కావున ధరినిదపమ, ధరీరి, ధరీరి, ధగరిపమ ఇత్యాదులనుండి ధైవతము విలువ 9/8 × 3/2=27/16గ నెంచుదుము. ధగరినిధ, గగధధనిని మున్నగు వానివలన గాంధారము 27/16 × 3/4=81/64 గల తీవ్రగాంధార మగుచున్నది. పగధమగరి, సమాగరిని, సరిగపమగరి, నిరీరి దగరి, పమమగ, నిధధ నిధ మొదలగు అటతాళవర్ణప్రయోగములవలన 'నిరీరి' యను నప్పుడు కాంభోజిరాగమునందు ధైవతము షడ్జతీగె స.తో పంచమ తీగె ధ. ముఖ్యసంవాది యైనట్లు, 'ని, రి'లు ముఖ్యసంవాదులుగ నుండుటచే నిషాదము విలువ 9/8 × 5/3=15/8గ నున్నది. మనిధనిప అనుటచే మ.15/8 × 3/4=45/32 విలువగలదిగ నెంచవలయును.పమగ,నిధ, గధప ఇట్టి దాటు స్వరప్రయోగము లెక్కువగ నిందు కలవు. ఋషభము యొక్క మాత్రాకాలము పెంచుటయు కలదు. గని, ధగ అనుచోట గ. విలువ 5/4గ నుండుట గమనించునది.

## తక్కిన శ్రుతులు

పైజెప్పబడిన రాగములందలి శ్రుతులలో 27/20, 64/45 విలువలు మిగిలినవి. 27/20 మ. బేగడరాగమందు కొన్నిచోట్ల వ్యక్తమగుచున్నది. అనగా ధపమా, గరిస, మామాగరి, ధా, పమా; ;గారి అను ప్రయోగములందువలె మధ్యమ మాత్రాకాలము పెరుగునప్పుడు ఈబేగడమధ్యమము 27/20 విలువకలది వచ్చును. తక్కినచోట్ల గరి గమపమ, మగమరిగమప, గమపధపసా మొదలగు ప్రయోగములందు 4/3 విలువగల మధ్యమమే వచ్చును. ఇక 64/45 మధ్యమము వరాళిరాగమందు కందుము. కనుకనే దీనిని వేంకటముఖి వరాళి మధ్యమమని నాడు. 243/128 నిషాదము శంకరాభరణమం దల్పముగను, కళ్యాణియం దెక్కువగను వచ్చు నంటిమి.

ఇట్లు 12 స్వరములవలననే కాక మన కర్ణాటక సంగీతము ఆయా రాగచ్ఛాయను స్ఫురింపజేయు తక్కినశ్రుతులుకూడ చేర్చుకొనుటవలననే మిగుల నవ్యమై ఘనత గాంచుచున్నది. వేంకటముఖి సోమనార్యులమతములు 81/80 విలువగల కోమావ్యత్యాసము చూపుటచే 81/80 విలువ మన రాగకళాపోషకముగ నెంచవచ్చును. తక్కిన స్వల్పభేదములు గమకములచే నేర్పడుచున్నవి. ఇట్లు రాగకళను బాగుగ నొప్పింపగలిగిన వాద్యములు మనవీణాయు, ననంతరము మన గాన పద్ధతియందు చొచ్చిన ఫిడేలు ననక తప్పదు. ఫిడేలును మనరాగకళ కుపకరించునదిగ జేసి కృతకృత్యులైన వడివేలు, తిరుక్కోడికావల్ కృష్ణయ్యర్ గార్లను సంగీతలోకము మరువజాలదు.

---

# మూగజీవుల మొఱ్ఱ

మం. వేంకటశర్మ గారు

ఎక్క డున్నావురా! యీశ్వరేశ్వరా! ప
రాత్పరా భక్తపోష పురాణపురుష!
నోరు మాలిన మమ్ము నిష్కారణమ్ము
బాధబెట్టుచు నున్నా రసాధునరులు.

కన్నతల్లియె శిశువుల గావకున్న
నూరివారలు పెంతురే యుగ్గు వోసి
లోకజనకుండ వగు నీవె సాకకున్న
లోకు లెవ్వరైన సాకుదురే కృపాళు!

ఆర్తరక్షక బిరుదున్నదంట నీకు
దీనబంధుండ వట నీవు దేవదేవ
ఆర్తులము దీనులము మమ్ము నాదరించి
బిరుదములు నేడు చూపింపవే మహాత్మ!

బలము లేని మాకు బలము గాగదవయ్య
దిక్కు లేని మాకు దిక్కు వగుచు
నండ నుండి యాపదంభోధినుండి మ
మ్ముద్ధరింప వయ్య శుద్ధచరిత.

సాదుతనము జూచి శాంతశీలము జూచి
కేవలంబు గలుగు కృపను జూచి
లోకు లెల్ల మమ్ము లోకువ జేసిరి
తగవు దీర్పనయ్య ధర్మమూర్తి!

తమను గొన్న నరులు తమకోసమే మేము
పుట్టినట్టు వారి పొట్ట నింపు
పనులకొఱకె మమ్ము పాలింపుచున్నారు
బుద్ధి చెప్పవయ్య పుణ్యమూర్తి!

ఒకరిసొత్తుకోర కొరుల జోలికి పోక
కృపను నీ వొసంగు తృణముతోనె
తృప్తి నొందు మమ్ము తెంపరుల్ శిక్షింప
నీయుపేక్ష న్యాయమే నటయ్య?

ఎవరు తిరిగి మరల హింసించు ప్రాణుల
నీచులైన జూడ నోడువారె
మెత్త నైనయెడల మొత్తుదు రీధూర్త
నైజ మాపవే యనాథనాథ!

ఎల్లలోకములకు నేలిక కల డంచు
తలపబోక దుర్మదంబు బలిసి
వక్రగాములైన వారి వారింపవా
చారుకీర్తి, లోకచక్రవర్తి!

అఖిలభూతకోటి కాధార మెవ్వడో
సర్వసముడు సర్వసాక్షి యెవడో
ఆదమూకలాప ఆనందరూప మా
ఆర్తి మాన్పవే మహానుభావ!

ద్రాక్షారామ దేవాలయమునందలి వినాయక విగ్రహప్రతికృతి



చిత్రకారుడు: వరదా వెంకటరత్నంగారు, రాజమహేంద్రవరము.

# ధాత్రీశిక్ష—శిశుపోషణ

భిషగ్వర పంతులవారు శ్రీ రామచంద్రరాజుగారు

వర్తమానకాలమున ఇంగ్లాండు దేశమున కన్న మనదేశమున శిశుమరణము లెన్నియో రెట్లధికముగ గానవచ్చుచున్నవి. దీనికి గారణ మరయ, మనదేశమున వ్యాపించియున్న బాల్యవివాహానర్థత, విద్యాహీనత ముఖ్యకారణములని తలపవచ్చును. బాల్యవివాహానర్థత మూలమున స్త్రీ కవయవములు పరిపక్వము గాకమునుపే-యనగా పండ్రెండు పదమూడు వత్సరముల వయస్సు రాకమునుపే సంతానవంతురాలగుచున్నది. అందువలన నట్టివారికిగల్గు సంతానము బలహీనమయి యకాలమృత్యువు వాతం బడుచున్నది. అట్టి బాల్యవివాహానర్థత ప్రభుత్వ శాసనమూలమున గొలదిదినములలో నశింపనై యున్నది. ఇక రెండవ విషయమగు విద్యాహీనతవలన స్త్రీ తనబిడ్డల నెటుల సంరక్షించుకొనవలసినది తెలియజాలక మృత్యువువాతం బడవేయుచున్నది. స్త్రీ బిడ్డలతల్లి కాగనె వారిని బెంచు భారము తన యందుగలిగియుండుటజేసి శిశుపోషణకృత్యములను నెల్లవిషయముల దెలిసికొని యుండు టెంతయు నవసరమై యున్నది. వివేకవంతురాలగు యువతి వినుకలిమూలమునగాని, గ్రంథస్థమగు శిశుపోషణవిధానమును తెలిసికొని కాని తనశిశువును సంరక్షించుకొనగలుగును. కావున స్త్రీవిద్యావశ్యకతను గురించి వేరుగ వ్రాయనక్కర లేదు.

భారతదేశవాసుల మగు మనము నవీన పాశ్చాత్య సంప్రదాయానుసారముగ శిశువుల బెంపబూనుట సరియగుపద్ధతిగా గానరాదు. ఆదేశపు శీతోష్ణస్థితుల ననుసరించి వ్రాయబడిన సిద్ధాంతము ఆదేశవాసులకే కాని మన కంత ప్రయోజనకారి కాజాలదు. అనేక వత్సరములకు బూర్వమే మనభారతదేశ సంప్రదాయమున కనుసరణముగ మహర్షి, చరక, సుశ్రుత వాగ్భటాదులు "ధాత్రీశిక్ష, శిశుపోషణము"నను విషయముల విపులముగ స్పష్టీకరించిరి. అట్టి మన భారత సంప్రదాయములను విధులచేతనే మన దేశపు శిశువు లాయురారోగ్యముల బొందగలుగుదురను టకు సందేహము లేదు. అట్టి సంప్రదాయముననుసరించి నా కాయుర్వేదమున గల స్వల్పజ్ఞానమును బురస్కరించుకొని యీ వ్యాసమును వ్రాయుచున్నాను.

శిశువులకు ముఖ్యముగ దల్లిపాలే సౌమ్యాహారము. తల్లియొక్క పాలు చాలనపుడు గాని తల్లి రోగభూయిష్ఠ యైనపుడుగాని, తల్లియొక్క స్తన్యము దూషితమయినపుడు గాని పాలిచ్చుటకు దాదిని నియమింప వలసియుండును. అట్టి దాదిని నియమించునప్పుడు గుణదోషముల విచారింపవలసి యుండును. స్వజాతిదై, మధ్యవయసు గలదై, స్వచ్ఛమగునవియు, విస్తారమగునవియు నయినపాలుగలదై, స్వల్పసంతోషియై బాలుని యెడల బుత్రవాత్సల్యము గలదియై యుండవలెను. శోకముచే బీడింపబడిన దానిని, ఆకలిగొన్న దానిని, రోగిని, వృద్ధను, గర్భిణిని జంచలగుణము గల దానిని నిషేధింపవలసియుండును. మఱియు శిశువునకు బాలిచ్చుతల్లి లేక దాది మాలిన్య రహితయై శుభ్రవస్త్రముల ధరించి యుండుటయు, పాలిచ్చుటకు ముందు స్తనముల నీటితో బ్రక్షాళనము జేసికొనుటయు నావశ్యకము. పాలిచ్చుటకు ముందు స్తనమందలి మొదటిధార పిండివేసి తదుపరి శిశువుచే ద్రాగింపవలెను. అట్లు గాక మొదటనుండియు ద్రాగించుచో బాలునియొక్క కంఠము క్షీరాధిక్యముచే బూరితమై ఛర్ది, శ్వాస, కాస మొదలగు రోగములపాలు కావచ్చును.

నోరెరుగని పసిపాపలకు రోగములు గలుగుట కాపాలిచ్చు తల్లియే ముఖ్యకారణమని యూహింపదగును. అందు మాత్ర లేక దాదియొక్క యనియతాహార విహారాదులవలన వారి స్తన్యము వాత, పిత్త, కఫములచే దూషితమగును. అట్టిపాలను ద్రాగించుటవలన పాపము నోరెరుగని శిశువులు రోగభూయిష్ఠులగుచున్నారు. అట్టి స్తన్యదోషములు, వాని వలనగలుగు నవగుణములు తెలిసికొనియుండుట ప్రతిమాతకు ముఖ్యమగు విషయమని వేరుగ వ్రాయనక్కఱలేదు.

ఏ స్త్రీ స్తన్యము నీట వేసిన కొంచెమైనను వేరు గాక నీటితో గలసిపోవునో యా స్తన్యము శుద్ధస్తన్యమనియు, నగరుగను, బుడగలు గలదిగను, రూక్షముగను నుండి నీటిలో వేసిన నీటితో గలియక నీటిపై తేలునదిగ నుండిన నా స్తన్యము వాతదూషితమనియు, పుల్లగను, చేదుగను నుండి నీటిలో వేసిన నీటిపై పసపురంగుగల రేఖ లేర్పడిన నది పిత్తదూషితమనియు, జిడ్డుగను, నుప్పగను, చిక్కగనునుండి నీటిలో వేసిన నీట మునుగునది కఫదూషితమనియు, వాతపిత్త కఫదోషములలో రెండు దోషలక్షణములు గలిగియుండునది ద్విదోషయుక్తమనియు, మూడు దోషములు గలది త్రిదోషదూషితమనియు దెలియనగును.

అందు వాతదోషముచే దూషితమైన స్తన్యము ద్రాగించుటవలన శిశువునకు శరీరకృశత్వము, శబ్దక్షీణత, మలమూత్రములయు, అధోవాయువులయు ప్రతిబంధము, దౌర్బల్యము కడుపునొప్పి మొదలగు గుణములు గలుగుచుండును. పిత్తముచే దూషితమైన స్తన్యమును ద్రాగించుటవలన శిశువునకు సదా శరీర ముష్ణముగ నుండుట, గుండెలలో మంటగలుగుట, నోరెండుట, విరేచనములగుట, ప్రతిసమయమందును బాలను గ్రక్కుట, నిరుత్సాహముగ నుండుట గలిగి తుదకు కామిల లేక పాండురోగములును, గలుగును. కఫముచే దూషితమయిన స్తన్యమును ద్రాగించుటవలన శిశువునకు ఛర్ది, చొల్లు గారుట, అధికనిద్ర, బద్దకము, శ్వాస, కాస, మంద్రాగ్ని, ముఖశోథ మున్నగు కఫజనితవ్యాధులు జనించును.

త్రిదోషములచే దూషితమైన స్తన్యమును ద్రాగించుటవలన పైన వ్రాసిన యనేక రోగోపద్రవములు గలుగును. అట్టివ్యాధికి "క్షీరాలసక"మని యాయుర్వేద శాస్త్రజ్ఞులు నామమిడిరి. ఈరోగము జనించిన శిశువు తప్పక మరణించును.

దీనినిబట్టి ప్రతిస్త్రీయు తన శిశువునకు రోగ మంకురింపగనే స్తన్యశోధనము చేయవలసియుండును. ఈవిధముగ నిరపరాధులగు శిశువుల తమ యజ్ఞానముచే భయంకరములగు రోగముల పాలుచేయు యువతి మాతయో, లేక యమదూతయో తెలియజాలము.

అజ్ఞానవతులగు మనదేశపు స్త్రీ లేరోగముచే బిల్ల లేడ్చినను ఆకలిచే నేడ్చుచుండిరని తలచి వారు రోగబాధచే ద్రావనొల్లకయున్న బలవంతముగ స్తనాగ్రము నాశిశువునోట నుంచి పిండుదురు. లేదా కాళ్లపై బరుండబెట్టుకొని బలవంతముగ నోట బాలను పోయుదురు. మఱియు భోజనసమయమున శిశువును దమయొద్దగూర్చుండ బెట్టుకొని తాము దినునాహార మాబాలునినోట గ్రుక్కుదురు. ఇట్టి మౌర్ఖ్యముచే నాయాహార మాబాలుని జీర్ణశక్తికి మించినదగుటచే పేగులయందు చేరుకొని వాంతులు గాని, విరేచనములు గాని గలిగించును. ఇట్టి దురాచారముల మూలమున నాబాలుని యమూల్య కోమల జీర్ణాశయములు భగ్నములై సర్వరోగములకు మూలకారణమగు నజీర్ణరోగమునకు స్థానములగుచున్నది. మొత్తముమీద శిశువులకు బండ్లు వచ్చువఱకు నన్నాద్యాహారములకంటె పాలే శ్రేష్ఠమైన యాహారముగా గన్పట్టుచున్నది. ఆట్టిపాలను శిశువు ఎంతవరకు సంతుష్టిగా ద్రాగునో యంతవఱకే యివ్వవలసి యుండును.

తల్లియొక్క లేదా యుపమాత యొక్క పాలు లభించనప్పుడు భారతదేశవాసులమగు మన శిశువులకు మేకవి గాని, ఆవువిగాని పాలే శ్రేష్ఠమైనయాహారము. అట్టివాలను ఇచ్చునపుడు పాలతో సమముగా నీటినిగలిపి, నీరు ఇంకునట్లు కాచి, కొలదిగ బటికిబెల్లపు చూర్ణమును గలిపి, నియమానుసారముగ నీక్రిందవిధముగ ద్రాగింపవలయును.

| బాలునివయస్సు | పాలిచ్చు నియమము | ఒక్కొక్కసారిచ్చు మోతాదు | రోజు మొత్తమునకు ఇచ్చు పాలు |
|---|---|---|---|
| మొదటివారమున | 2 గంటల కొకసారి | $\frac{1}{2}$ ఛటాంకు | 5 ఛటాంకులు |
| 2 లగాయతు 6 వారముల వరకు | $2\frac{1}{2}$ గంటల కొకసారి | 1 ఛటాంకు | 6 లగాయతు 8 ఛటాంకులు |
| 7 వారములు లగాయతు 6 మాసముల వరకు | 3 గంటల కొకసారి | $1\frac{1}{2}$ ఛటాంకు లగాయతు 2 ఛటాంకులు | 9 లగాయతు 12 ఛటాంకులు |
| 6 మాసముల లగాయతు 10 మాసములు | $3\frac{1}{2}$ గంటల కొకసారి | 2 ఛటాంకులు లగాయతు $2\frac{1}{2}$ ఛటాంకులు | 13 లగాయతు 20 ఛటాంకులు |
| 11 లగాయతు 15 మాసముల వరకు | 4 గంటల కొకసారి | $2\frac{1}{2}$ ఛటాంకులు లగాయతు 3 ఛటాంకులు | 14 ఛటాంకులు లగాయతు 22 ఛటాంకులు |

నీళ్లు కలపక కాచినపాలు సులభముగా పచనము గానేరక వాంతులు, విరేచనములు, కడుపునొప్పి, దౌర్బల్యము, శరీరకృశత్వము గలుగజేయును.

పాలను త్రాగించునపుడు సహింపదగినంత వేడి యుండుట యవసరము. చల్లనిపాల నిచ్చుట హానికరమై యుండును. ఉదయమున బితికినపాలు సాయంకాలము వఱకును, సాయంకాలమున బితికినపాలు రాత్రి రెండుయామములవఱకును త్రాగించుటకు బనికివచ్చును. బాలుని వయసు వృద్ధినందినకొలది పాలలో గలుపు నీటిని తగ్గించుచుండవలయును.

పాల నిచ్చునపుడు పాశ్చాత్య సంప్రదాయానుసారముగ స్తనరూపములగు సీసాల నుపయోగించుట శ్రేష్ఠము గాదు. అట్లివ్వక తప్పనిచో పాలిచ్చుటకు ముందు వేడినీటితో నా సీసాను శుభ్రమగునటులు కడుగవలయును. లేనిచో అందుల సందులయం దుండు నిలువపాలు లేక తొరకలు నవీనముగ బోసినపాలతో చేరి ఆపాలను ద్రాగిన శిశువునకు పేగులయందు దోడుకొని రోగముల గలుగజేయును.

పళ్లు పూర్తిగా వచ్చిన తరువాతగూడ గొంతకాలమువఱకు నన్నముతో పాలనుగూడ నిచ్చుచు క్రమక్రమముగా పాల నిచ్చుట మానవలెను. అంతే గాని యన్నము పెట్ట మొదలిడగనే పాలను మొదలంట మానివేయరాదు.

ఇంతవఱకు శిశువుల కీయవలసిన యాహారావశ్యకతను గురించి వ్రాసితిని. ఇక శిశుపరిచర్యను గురించి కొంత వ్రాసి విరమించుచున్నాను.

శిశుపరిచర్యయందు దల్లులు జాగరూకులై యుండవలెను. శిశువు నొడియందు సుఖకరముగ నుంచుకొనుచు వారి మనమున కుత్సాహముగు పనుల నాచరించుచుండవలెను. అజ్ఞానముచే స్త్రీలు స్వభావముగ శిశువులు భయభ్రాంతు లగునటులు, "బూచీ, రా! మాఅబ్బాయి నెత్తుకు పో. అదుగో రో బూచి వస్తూంది, ఎత్తుకపోతుందిలే" అని వారల జడిపించుచుందురు. అట్టిది దురాచారమని తెలిసికొనవలసియున్నది. శిశువుల నెన్నడు భయభ్రాంతుల జేయరాదు శిశువు నిద్రించునపుడు హఠాత్తుగా లేపరాదు వారలు స్వయముగా గూర్చుండుటకు శక్తిగలుగు నంతవరకు బలవంతముగా గూర్చుండబెట్టరాదు. శిశువుల కుపయోగించు వస్త్రములు మృదువులును, సుఖము నిచ్చునవియు నై యుండవలయును. తైలమర్దనము, ఉష్ణోదకస్నానము, నేత్రముల కంజనము మొదలగు కృత్యములు పుట్టుకనుండియు శిశువుల కత్యావశ్యకములు. శిశువు నిద్రించు గది శుభ్రమయినదిగను, విశాలమయినదిగను, స్వచ్ఛమైన గాలి ప్రసరించునదిగను నుండవలెను. వర్ష శీతకాలములందు చలిగాలి విసులకుండునటుల తలుపులు మూసి యుండవలయును.

నూయి, పాయికానా, తూముకాలువ, మురికినీటి గుంట, ఎత్తయిన లోతైన స్థలములయందును విడువరాదు. శిశువులకు పావలా కాసులు, బేడకాసులు, పైసలు మున్నగు చిన్నవస్తువులను, నల్లమందు డబ్బీ మొదలగు విషవస్తువులను క్రీడార్థము ఇవ్వరాదు. శిశువులు చేతి వ్రేళ్లను నోటియందుంచుకొను స్వభావము గలిగియుండుటచే అట్టివస్తువుల నోట నుంచుకొనుటవలన ప్రమాదము కలుగవచ్చును.

శిశువునకు 6వ లేక 8వ మాసమునందు కొంచెము అన్నము మెత్తగాజేసి నాకించవలెను. క్రమక్రమముగా వృద్ధిచేయవలెను. పళ్లు వచ్చేవరకు ఎట్టి కఠినపదార్థములను శిశువుల కివ్వరాదు. అట్లు చేయుటవలన సర్వరోగములకు కారణమగు నజీర్ణరోగము సంభవించును.

నారీమణు లీవిషయముల కొంతవఱకైన నాచరించి తమ బాలుర యారోగ్యభాగ్యమునకు దోడ్పడి భారత సౌభాగ్యమును పెంపొందింతురుగాక.

---

# స్వేచ్ఛావిహగము

శ్రీ. శ్రీనివాసరావుగారు (కవితాసమితి)

నీవు నభోవిటంకమున
      నిర్మల పాండుపయోదమాలికల్
త్రోవ యొసంగ పక్షములు
      దూయుచు హాయిగ సంచరించు స్వే
చ్ఛావిలసద్విహంగమవు
      స్వామి! క్షుధావిలమైన చూడ్కులన్
నీ విహరించు మార్గమున
      నిల్పి కనుంగొనుచుందు నే నిటన్.

ఏ రుచిరానురాగముల
      నీనెడు దూరదిశా నిశాంతమున్
చేరెదవో నినున్ కనక
      నే నిట గాసిల, ఏ ప్రఫుల్ల క
ల్హార సుమావళీ పరిమ
      ళమ్ములు మూగు సురాపగా సుధా
తీరములన్ చరించెదవొ
      దీనత నా కిట సంఘటించగన్.

నూతన పారిజాత సుమ
      నోరమణీయములైన భావముల్
పూతలు పూయు నామెద, వి
      ముక్తమహోన్నత మట్లు దాటుచున్
జ్యోతలమున్ విహారపరి
      ధూత గరున్మృదుకాంతివాహినీ
స్నాత మనోహరమ్ముగ నొ
      సర్చు నినున్ కనినంత వింతగన్.

కోమల పల్లవమ్ములయి
      కోర్కులు క్రొందనమున్ వహించగా
నామదియే ప్రసూన నవ
      నందనమై వికసించు; అంత నో
స్వామి! వియత్పథాల దిగి
      వచ్చెద వీవు నిగూఢవీథికా
ధామములన్ త్యజించుచు ని
      తాంతము నిందె నివాస మొందగన్.

---

## శివపూజకు




చిత్రకారుడు : శ్రీ చేపూరి సింహాచలంగారు, పర్లాకిమిడి.



ఆదిఆంధ్రాశ్రమ సహాయమును చెందుచున్న ఇతర గ్రామములనుండి వచ్చిన విద్యార్థులు.



(18) స్కూలుఫైనలు విద్యార్థులు, ఆది ఆంధ్రాశ్రమము, పిఠాపురము.



ఎలిమెంటరీస్కూలు, ఫకీర్ దీన్ పాళెము, బ్రహ్మసమాజమువారిది, పిఠాపురము.



కందరాడ ఎలిమెంటరీస్కూలు, బ్రహ్మసమాజమువారిది, పిఠాపురము.

# నత్రజని ఎరువులు-హిందూదేశములో వాటిఉపయోగము

మాటేటి రంగారావు గారు

హిందూదేశములో నత్రజని ఎరువులు (Nitrogenous Fertilizers) ఎంతవరకు అగత్యమో తెలియజేయుటకు ఈ వ్యాసము వ్రాయపూనితిని. ప్రతిసంవత్సరము ఇతరదేశములకు అనేకవేల టన్నుల నత్రజని తోళ్లు, నూనివిత్తులు, ఎముకలు, పెల్లుప్పు మొదలగు రూపములలో ఎగుమతికాగా, తిర్గి అవి మనదేశమునకు ఎరువులరూపములో దిగుమతి అగుచున్నవి. దీనికంతయు కారణము మన తెలివితక్కువయే. (1) మనహిందూదేశములో నత్రజనితో కూడిన ఎరువులు కావలసివున్నవా? (2) మనదేశములో వాటిని కొని ఉపయోగించు సామర్థ్యము కలదా? (1) మొదటిదానికి జవాబు: మనదేశమునకు అటువంటి ఎరువులు కొంతవరకు కావలసివున్న సంగతి నిజమే. కాని యింగ్లాండుమొదలగు దేశములలో వాటిని వుపయోగించు అనుభవశాలులు పెక్కురు వుండుటచే విశేషముగా వాడబడుచున్నవి. మనదేశములోకూడ అనుభవముమీద వుపయోగింపవచ్చును. (2) మనదేశములో సాగుచేయుభూములకు ఒక్కనత్రజని మాత్రమే సరిపోదు. ఫాస్ఫేటు, పొటాష్, మరియుసున్నము కూడా సమముగా కావలసియున్నవి. నత్రజనితో కూడిన రసాయన ఎరువులు మాత్రమే వుపయోగించినచో, అవి భూములను నిసత్తువ చేయుటయేగాక, మొక్కకు ఆహారముగా వుపయోగించు ఇతర ఖనిజసంబంధమైన పదార్థములను కూడా త్వరలో క్షయము చేయును. కాని వివేకముగా వాటిని వుపయోగించుమార్గములో వుపయోగించిన చాలలాభము తప్పక గలదు. కొంతమంది అన్నిబుతువులలోను వుండు కాఫీ, కొబ్బరి, అరటి మొదలగు పంటలకు నత్రజని సంబంధమైన రసాయన ఎరువులు ఒకసంవత్సరము వేసినచో ప్రతిసంవత్సరము వేయవలయునను నభిప్రాయముతో నున్నారు. మొక్కను నత్రజని ఎరువు వేసి పెంపుజేసి ఎక్కువపంట పొందినతర్వాత, తిరిగివచ్చు సంవత్సరములలో కూడా నత్రజని ఎరువు వేసిననే గాని ఫలితము నివ్వను. ప్రతిరైతు పెరీతిగా ప్రతిసంవత్సరము సత్తువచేయుటను తూగలేదు. కొంచెమించుమించుగా నల్లమందుకు అలవాటుపడిన మనిషిమోస్తరుగా, భూమికూడా నత్రజనికి అలవాటుపడుటచే కొద్దిగనో గొప్పనో వేసిననే గాని పంట నివ్వదు. కాని యీసంగతులన్నియు మొక్కకు కావలసిన అన్నిపదార్థములును కల్గియుండు పూర్తి ఎరువులు వేయుటచే సరిచేయవచ్చును. మరియు భూమిలోవున్న యితరపదార్థములు కూడా నత్రజనియొక్క ప్రేరేపణముచే మొక్కకు ఎక్కువపెంపు కలుగజేసి శూన్యము కాకుండా చేయవచ్చును.

హిందూదేశపురైతు నత్రజని ఎరువులు ఒక్క వరికి, చెఱకుకు తప్ప తదితరపంటలకు వుపయోగించడు. ఆవుపయోగించు ఎరువులు ఏమనగా, గానుగపిండ్లు, పచ్చియాకుఎరువులు. వీనిలో మొదటిది ఫాస్ఫేటు, పొటాష్, నత్రజని సరఫరాచేయును. రెండవది నత్రజనిని ఒక్కదానినిమాత్రమే సరఫరాచేసి మొక్కపెంపును వృద్ధిచేసి నప్పటికి తదితర ఎక్కువ నత్రజనిని కల్గినఎరువులవలె భూమిని సత్తువచేయదు. మనదేశములో పశువులపేడ ఎక్కువ పిడకలుగా వుపయోగించుటచే, భూమికి నత్రజనిని పశువులపేడరూపములో వుపయోగించి లాభము పొందజాలకున్నాము. నత్రజని ఎరువులను రైతులు బాగా అనుభవము సంపాదించి వుపయోగించిన లాభ ముండకపోదు. కొంతమంది చదువుకొన్న అనుభవశాలులగు హిందూదేశపు రైతులు నైట్రేటు ఆఫ్ సోడా మొదలగు నత్రజని ఎరువులను వాడి మంచిఫలితములను పొందిరి. ఒక్క. నైట్రేటు ఆఫ్ సోడా వేయుటచేతనే గాక మరియు వాసియయిన ఇతర వ్యవసాయపు పద్ధతులవలన కూడా ఫలితములను పొందిరి.

ఇంకా పంటలు తక్కువగా పండుటకు సరియైన నీటిసదుపాయము లేకపోవుటకూడా కారణమై యున్నది. సాధ్యమైనంతవరకు భూమిలో నున్న ఎంతమాత్రపు తడినైనను చక్కగా అణచిపెట్టి విత్తులు చల్లుసమయములో సరిగా నుపయోగించుకొని జాగ్రత్తగా పండించుకొనుచున్నారు. కొన్నిస్థలములలో రైతు వర్షాధారముననే జాగ్రత్తగా పంటలు పండించుచున్నారు. మరియు వ్యవసాయమును సానుకూలముగా చేయుటకు ఇంకా అనేక ఇతరవిషయములు కూడా సహాయము కావలెను. కాని భూమి యొక్క సత్తువను అభివృద్ధిచేయుటకు నత్రజని చాలముఖ్యమైనవాటిలో ముఖ్యమయినది.

తరచు ప్రతిభూమిలోను ఈనత్రజని విశేషముగా గలదు గాని అందులో మొక్కకు అందుబాటుఅయేది కొద్దిమాత్రమే. భూమిలో అనేక రసవాదశాస్త్ర సంబంధమైన మార్పులు చెందినగాని నత్ర

జని మొక్కకు అందుబాటు కాదు. ఈమార్పులన్నియు భూమిలో నున్న సూక్ష్మజీవులచే జరుగును. భూమిమీద నత్రజని ఎరువు ఏది వేసినను అనేకమార్పులు చెంది తుదకు నైట్రేటు రూపములోనికి వచ్చును. మొక్క యీ రూపములోనే నత్రజనిని గ్రహించును. ఇతర నత్రజని ఎరువులన్నింటికంటె నైట్రేటు ఆఫ్ సోడాలో నున్న నైట్రజన్ నైట్రేటురూపములోనే వుండుటచేత పంటకు త్వరగా సత్తువ చేయును. బాగా కుళ్లిన భూములలో (Peat soils) బొగ్గు (Carbon), నత్రజని (Nitrogen) భూమియొక్క మార్పునుబట్టి ఎక్కువతక్కువలలో నుండును. బాగా కుళ్ళిన భూములలో నత్రజని కార్బన్‌కంటె ఎక్కువగా నుండును. దీనికి కారణము భూమిలోనుండు సూక్ష్మజీవులే. తరచు భూములలో నైట్రేటు ఆఫ్ సోడా నైట్రజన్, భూమిలో దాగియున్న నైట్రజన్ భూమియొక్క తరహానుబట్టి, వాయుస్వరూపమునుబట్టి మారుచుండును. జలదారులనుబట్టియు, తీవ్రమైన సాగుచేతను భూమిలోనున్న నత్రజనిని తొందరగా వుపయోగములోనికి తీసుకువచ్చి భూమియొక్క సత్తువను వృద్ధిచేయుచున్నాము. ఇట్లు తొందరగా భూమిలోనున్న నత్రజనిని అంతయు పూర్తిగా నుపయోగమునకు తీసుకువచ్చి పంట నభివృద్ధిచేసి భూమి నిసత్తువ కాకుండు మార్గము చూడవలయును. కాని చాలావిషయములలో ఫాస్ఫేటుకూడ త్వరగా క్షీణించుచున్నది. మరియు భూమియొక్క నత్రజని సంబంధము లేని, ఇంద్రియ సంబంధమైన పదార్థముకూడా తీవ్రమైన సాగుచేత నష్టపడి భూమిబీదతనమునకు వచ్చును. ఈనష్టము కొన్నిచోట్ల పచ్చియాకు ఎరువు, గానుగపిండ్లు మొదలగునవి వేసి కొంతవరకు చక్కజేయబడుచున్నది. ఈవిషయములన్నియు తెలిసికొనుటకు హిందూదేశములో శీతోష్ణస్థితులు అనేకమార్పులుగా నుండుటచేతను, శీతోష్ణపరిమాణము, భూమియొక్క పరిస్థితులును అనేకవిధములుగా మారుటచేతను ఎక్కువపరిశోధనలు కావలసియున్నవి. వీని ననుసరించియే భూమియొక్క సత్తువ మారుచుండును. సాగులేని నేలలో నైట్రజన్ ఎక్కువగా ఒకసంవత్సరముకంటె మరియొక సంవత్సరము వృద్ధియగునని "రోథమ్సు స్టెడ్డు"లో నిరూపింపబడినది. సాగుచేయుభూమిలో నత్రజని చాల తక్కువగా నుండును. ఇంగ్లాండులో జలదారులు, మంచిసాగు జయకరముగా వ్యవసాయము చేయుటలో ఆధారములైవున్నవి. హిందూదేశములో పైసంగతులే పంటఅభివృద్ధిలో తనుసహాయము చేసినను భూమియొక్క సారము తగ్గించుచున్నవి. ఎందుచేత ననగా, నైట్రేట్సు త్వరలో నిర్మాణమై నీళ్లు పోవు ఏర్పాటులో చాలా కొట్టుకు పోవుచున్నవి. మరియు భూమిలో వుండు సావయవ పదార్థముకూడా చాలా తగ్గుట దీనికి కారణమై యున్నది. సావయవ పదార్థము భూమిలో ఎప్పుడు తగ్గునో అప్పుడు భూమిలో నత్రజనిని నిలువజేయు సూక్ష్మరేణువులుకూడ తగ్గును. సావయవ పదార్థము విస్తారముగా నున్నచో సూక్ష్మరేణువులు విస్తారముగా వుండి నైట్రేటును కాపుదలజేసి వర్షమును భూమిలోనుండి యివతలకు పోకుండా కాపుదల చేయును.

అందుచే భూములను సరిగా ఫలవంతము చేయుటకు తగినపదార్థములన్నియు భూమిలో కాపుదలజేయుటకు ఎడతెగని వ్యవసాయము చేయుట గాని, అసలు వ్యవసాయము చేయకుండా వుండుటకాని పనికిరాదు. మధ్యరకముగా నుండవలయును. విస్తారము ఎరువులు వేయు సామర్థ్యము మనదగ్గర నున్నప్పుడు పైవిషయము పాటించ నవసరముండదు. కావున హిందూదేశములో ఏభూమికి ఏపంట బాగా పండునో భూమియొక్క సారమును బట్టి తెలిసికొని వ్యవసాయము చేసిననే గాని యితర దేశములలోవలె క్రొత్తవ్యవసాయపు పద్ధతుల నవలంబించుట, నత్రజని ఎరువుల నుపయోగించుట మొదలగునవి అనవసరము. ఇంకా పరిశోధనలు జరిగిననే గాని, నైట్రజనును ఉపయోగించుకొనుట, ఉపయోగించుకోలేకపోవుట మొదలగుసంగతులు విపులముగా తెలియవు. నవీనయంత్ర సముదాయములు, నైట్రేటు ఆఫ్ సోడా మొదలగు రసాయన ఎరువులు-ఈవిషయములు తప్పక తగులాభము కలుగజేయవచ్చును.

ఇంకొకముఖ్యాంశము: ఒక్క నత్రజని మాత్రమే భూమియొక్క సత్తువకు అంత ముఖ్య పదార్థము కాదు. అది ఒక్కటియే భూమికి అందజేసినచో తప్పక భూమి కొద్దికాలములో క్షీణదశకు వచ్చును. అందుచే ఫాస్ఫేట్సు, పొటాష్ పదార్థములుకూడ చాలఅవసరము. తగిన నైట్రజన్ సప్లయి భూమిలో లేనిచో ఫాస్ఫేట్సు మాత్రమే వేసినను కూడ కొన్నిసమయములందు పంటకు అపాయము చేయవచ్చును.

మనహిందూదేశము నత్రజని ఎరువులకుగాని, లేక తదితర ఎరువులకుగాని వుపయోగించుటకు కావలసినపైకము ఖర్చుపెట్టకలదా? మనదేశమునుండి నూనెవిత్తులు, చేపఎరువు, ఎముకలు మొదలగునవి పైదేశములకు ఎగుమతి కాకుండా వుంచినయెడల కొంతవరకు పైసమస్య పూర్తిచేయగలము. వీటిసహాయమున నైట్రేటుసోడా మొదలగురసాయన ఎరువులకూడా చౌకగా నుపయోగించుకొనవచ్చును. మనదేశమునుండి నూనెవిత్తనములు వగైరా పైదేశములకు ఎగుమతికాబడి మరియొకరూపముతో మనదేశమునకు దిగుమతికాబడి విశేషము నష్టపరచుచున్నవి. ఈరీతిగా ప్రతిసంవత్సరము ఎంతయో నత్రజని పైదేశములకు ఎగుమతిచేసి మనవ్యవసాయములను పాడుచేసుకొనుచున్నాము. ప్రభుత్వ సంఘములుకూడా యీవిషయములలో రైతులకు మెండు సహాయము చేయవలసి యున్నది. మరియు రైతులకుకూడ నైట్రేటు ఆఫ్ సోడా, సూపరుఫాస్ఫేటు మొదలగు ఎరువుల నుపయోగించు పద్ధతులలో జ్ఞానవృద్ధిని కలుగజేయవలసి యున్నది. మరియు సాధ్యమైనంతవరకు రైతులకు ఈఎరువులు తక్కువవెలకు సరఫరాచేసిన లాభము పొందగలరు. ఈవిషయములలో గవర్నమెంటు వ్యవసాయపు డిపార్టుమెంటు చాలసహాయము రైతులకు చేయవలసియున్నది.

నత్రజని చాలవరకు మనము వ్యవసాయము చేయు అపరాలు మొదలగు పంటచక్రమును బట్టియు, విశేషము పచ్చియాకు ఎరువు వేసియు వృద్ధిచేయవచ్చును.

వర్తకమును, వ్యవసాయమును పరస్పరముగా వ్యవసాయపు డిపార్టుమెంటువారు కలిపి నడిపించినయెడల వ్యవసాయదారులకు పాడైపోక, వ్యవసాయమును వృద్ధిచేసుకొనుటకు తగిన అవకాశము కల్గియుండును. మనదేశములో వ్యవసాయమునకు కావలసిన ఖనిజములు పూర్తిగా గలవు. కాని వాటిపరిశ్రమ లేకపోవుటచేత మనదేశమునకు దీనగతి పట్టవలసివచ్చినది. మనదేశమునుండి పట్టుకుపోయి పరిశ్రమ చేసుకొనుచున్న యితరదేశములు ద్రవ్యముతో తులతూగుచున్నవి. దీనికంతయు కారణము మనఅజ్ఞానమే. మనము మనభూమిస్వాభావికముగా ఎంతపంట నివ్వగలదో, దానికి రెట్టింపు ఇంకా ఎక్కువ పంటలు కూడా పైనుదాహరించిన విషయములందు జాగ్రత్తపడినయెడల తప్పక పొందగలమని రూఢిగా చెప్పగలను. ఇప్పటిపరిస్థితులను బట్టి చూచిన, హిందూదేశము పైదేశమునుండి తనకు వచ్చు ఎరువులను విశేషద్రవ్యము ఖర్చుపెట్టి యుపయోగించి లాభము పొందగలదన్నమాట కల్ల. ఖర్చుపెట్టుటకు సామర్థ్యము ఉన్నయెడల పంటలను తప్పక అభివృద్ధిచేయవచ్చును. భూమినికూడ సారవంతము చేయవచ్చును. హిందూదేశములో ఎరువుల నుపయోగించుటనుగురించి యాలోచింపవలసినది చాల గలదు. ఇప్పటిలో సానుకూల మగునది కాదు. మనదేశము ఎంతకాలము ఇట్లు పైదేశములకు నూనెవిత్తులు, ఎముకలు, చేపయెరువు మొదలగునవి ఎగుమతి చేయగలదు? ఈలోపుగా దేశము పూర్తిగా నిసత్తువై పోవును. జనసంఖ్య అంతకంతకు వృద్ధియగుచున్నది. పంటలు క్షీణించుచున్నవి. కావున మనదేశమునుండి పైదేశములకు ఎరువుసంబంధమైన వస్తువులు ఎగుమతి కానటువంటి పద్ధతుల నవలంబించి జాగ్రత్తపడవలయును. ఈవిషయములో గవర్నమెంటు సహాయము చేయు నన్నమాట సర్వ అబద్ధము. ఎవరంతట వారు సౌఖ్యము కలుగజేసుకొని జాగ్రత్త పడవలయును. కావున పైవిషయములన్నియు రైతుసోదరులు జాగ్రత్తగా నాలోచించి తగినచర్యను తీసుకొని వ్యవసాయములను వృద్ధిచేసికొని సిరిసంపత్తులతో తులతూగవలసినదని నాప్రార్థన.

---

సామర్లకోట చెంత నున్న కుమారారామ భీమేశ్వరాలయమున గల నాట్య శిల్ప చిత్ర ప్రతికృతి



చిత్రకారుడు: శ్రీ వరదా వేంకటరత్నంగారు, రాజమహేంద్రవరము.

# *రైతు మొర

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు
అనువాదకుఁడు

(మంజరీ ద్విపద)

రామ! దయాధామ! రవివంశసోమ!
సిద్ధయోగివ్రతి శ్రేణి యందేము
చేరకున్నను నిట్టిచింతలం జివికి
పేదలమై రోగపీడలం జెంది
వివశులమై బలవిభవంబుఁ బాసి
కృశియింప నల్పిన కిల్బిషం బెద్ది?

* * * *

అడఁగక పాఱు మాయశ్రుప్రవాహ
మీనాఁడు నీవుగా కెవరు మాదక్కు
మేము ధైర్యముఁ బూని మెలఁగు టేలాగొ
నీవ చెప్పుము — దేవ! నిర్జీవమైన
మాచిత్తముల నెట్లు మరలఁ జంపెద

* * * *

ఈ వవతారంబు లెన్నియో తాల్చి
దుష్టరాక్షసకోటిఁ ద్రుంచితి కాని
అరయక నిర్దయులైన మానవుల
నేల మన్నించితో? ఎఱుఁగ కున్నాము.

ఆకలినాత్మల హస్తంబులందు
ఈ నేఁటి మాస్థితి నీక్షింపవయ్య
నిండారు కూర్మిమై నేమును మీకు
రక్షింపఁ దగినవారము కామటయ్య.

* * *

ప్రభువర్య! మే మెట్టి భయ మందలేదు?
ఈనాటికైన మాయెల్ల నాశనము
కాకున్న దే?—మాకుఁ గటకటా! ఇందె
నరకవాసం బబ్బినదికదా?—తుట్ట
తుదకు విసం బాని త్రుంగెదమన్న
దమ్మిడీమైన మా దగ్గర లేదు.

* * *

గతజన్మమం దెట్టి కలుషంబు సేయ
నిట్టిఫలంబు మా కిపుడు కల్గినదొ
అకట! మాహృదయంబు లట్లయ్యె నేఁడు
బ్రద్దలుగావయ్యె వజ్రంబు లట్లు—
ఈలోకమందు మే మీయవస్థలకె
జన్మించితిమటయ్య జగదీశ! చెపుమ.

* * *

అనఘ! పాపాత్ములమైనను మేము
తులలేని దీనబంధుఁడవౌట నీవు
మాయందు దయఁ జూపి మమ్ము మన్నింపు
మఖిలసద్గుణరాశి వగుటచే నీవు
మాతప్పు లెన్నకు మదిఁగిన్క విడుము.

* * *

సకలేశ! మమ్ముఁ గర్షకవంశమందు
నీవ పుట్టించితి, నీకుఁ గాకున్న
నేరికి శక్యమా నిట్లు గావింప
నిదియెల్ల నీమాయయే కదా? చూడ—
ఏకాంచియంబు నీ విచ్చితో మాకు
అనుభవించితిమి మే మద్దాని నిపుడు
ఈస్వల్పదానంబె ఏరీతి నీకుఁ
దృప్తినొసంగె? మాయెడల నో దేవ!

* * *

కర్షకవంశంబ కాని ఇంకెందు
మమ్ముఁ బుట్టింపంగ మార్గమ్ము లేదె?
నరకార్హులైన మానవు లంచునైన
మముఁ దలంపవుగదా మాకర్మ మేమొ—
పశువిహంగాదు లేబాధయు లేక
సమతమ మేఁతలం దనివి నందెడిని

---

* ఇది మైథిలీశరణగుప్తగారు రచించిన "కిసాన్" అను హిందీ ఖండకావ్యమునుండి తెనిగింపబడినది.

ఇంక మాస్థితి సెప్ప నేల వర్ణించి
సర్వంబు నెఱిఁగిన చతురుండ వీవు.

* * *

పగలెల్ల మాకృషి భారంబు నీడ్చి
మంచిమేఁతలు మేయు మాపులం దెట్లు
ఎట్టెటో కష్టించి యిల్లిల్లుఁ దిరిగి
కుక్కలుం దమపొట్టకూటి నార్జించు
ఈపాపమేమొ తండ్రీ! ప్రాణికోటి
కన్నంబును సృజించునట్టి మే మెపుడు
"అన్నమన్న" మటంచు నల్లాడవలసె.

* * *

కృషి నధిక్షేపించు హీనుఁ డెందేని
గలఁడేని వాఁడు దుర్గతి నందుఁగాక—
నేఁటికి నేసాక్షి నిర్మలచరిత
దినదినం బెంచి కీర్తించుచున్నాము
అఖిలజగన్మాతయైన యాసీత
ఎద్దాన జన్మించె? ఈకృషిం గాదె?
పండినదేశ దౌర్భాగ్యంబు కతన
నెన్నఁడో నశియించె కృషిగౌరవంబు.

* * *

ఓనాథ! విను మొకానొకనాఁడు రైతె
భారతావని నార్య పదవాచ్యుఁ డయ్యె
దివ్యమై వెలయు నీదేశంబునందు
"అన్నదాత" యటన్న సార్థక బిరుద
మితనికే సిద్ధించె నెల్ల రౌననఁగ
జనకునివంటి రాజర్షి యిచ్చోట
దున్నించె హలము దుర్దుఃఖాబ్ధి కలము
పతితపావనుఁడైన బలరామమూర్తి
తగ హలాయుధుఁడంచుఁ దాఁ బిల్వఁబడియె.

* * *

అతులలీలామయుం డగు కృష్ణు డిచట
నాలమందల మేపె నచ్చోట నిపుడు
నీచవృత్తులు పెక్కు నిష్పన్నమయ్యె
పుణ్యకాలంబెల్లఁ బోయె నయ్యయ్యొ
ఆగర్భభోగుల నల్లాడఁ జేయు
దుష్కాల మరుదెంచె దుర్భరంబగుచు.

* * *

నరలోక మెల్ల నీనాఁటికిఁ గూడ
జీవించుచుండె నేక్షేత్రమ్ము చేత
నాక్షేత్రమునకు మే మధిపులమయ్యు
అశ్రుధారలఁ ద్రావి యడలంగ వలసె
నిఖిలోదరంబుల నిండించు మేము
కఠినోపవాసముల్ గావింపవలసె
మాశుభకాలంబు మాయమైపోయె
బ్రదుకంగ వెరవు గన్పడ దయ్యె మాకు
చచ్చుచున్నామయో చచ్చు చున్నాము.

* * *

మామూలమున సభ్యమర్యాద గాంచి
వన్నెవాసియు గన్నవారలే మమ్ము
కడు నీచ దృష్టితోఁ గాంచుచున్నారు—
ఈవృత్తి బూని మే మెట్టి యిక్కట్ల
తల్లడిల్లుటలేదు?—తెడవులం బట్టి
భయద సంతాపప్రవాహ మధ్యమునఁ
దగిలి. మెచ్చోట నాధారంబు లేక
పోవుచున్నా మెద్ది పుట్టునో ముందు.

* * *

జగతి యెద్దాన సస్యశ్యామలమయి
కలకల దీపించుఁ గనుల పండువుగ
అద్దాన మాహృదయంబు లీనాఁడు
గడగడ లాడంగ కారణం బేమి
సేద్యంబు వివశమై చెడి ఘోరమైన
పన్నుల ద్రేగు పైఁ బడఁ గ్రుంగిపోయె
కర్షకులగు మాకు కడుశూన్యమైన
క్షేత్రంబు తినఁబోవ శేషించియుండె.

* * *

మండుటెండలలోన మంటగాడ్పులను
దగ్ధమౌచున్నవి తనువు లెంతేని

స్వేదరూపమున మాజీవరక్తంబు
ప్రతిదినం బెడలేక ప్రవహించుచుండె
సంతోషపర్యవసాయిమై వెలయు
ఫలము మాకేనాఁడు ప్రాప్తించ నొక్కొ
ఎనలేని దారిద్ర్యమే మమ్ముఁ జుట్టి
పాఱఁదోలఁగ సాధ్యపడదయ్యె నకట.

* * *

తెరపి సుంతయు లేక దేవ! మా తలను
కురియుచున్నదికదా కుంభవర్షంబు
అగ్గలంబగుసీతు పక్షిలోకమును
కర్కశమ్మునొనర్చి కారించుచుండె
ఇస్సిరో నరజన్మ మెత్తియు మేము
పశుధర్మమును బూని బ్రదుకంగవలసె
కటకటా! మాపాట్లు కాలుచుండినను
నిశ్చలంబయ్యె మానీచజీవితము.

* * *

భువి సేద్యగాండ్రమై పుట్టుటంజేసి
హాహారవంబె మా కాహారమయ్యె
ఘోరమహా మరణంబు కొఱకె మేమిటకు
వచ్చుచున్నారమా? వసటలేనట్టి
దిన మొకండేని సిద్ధింపదో? మాకు.

* * *

విద్యకై మేమును విద్య మాకొఱకు
చింతించుచుండ మాజీవితంబెల్ల
దున్నుట దోఁకుట తోడనే గడచె
మాకు విజ్ఞాన మేమాత్రంబు లేమి
నలరసాయన శాస్త్ర మటు నిద్రవోయె
ఎట్టిటో లభియించు నేకబీజంబె
మా కనర్ఘంబైన హార్తికంబయ్యె.

* * *

ఇతరదేశంబుల కృషికులవోలె
నిన్నటిసారంబు నేఁడు మా కేది?

ఎవ్వరిమాయయో ఎవరిమంత్రంబొ
ఎవ్వరికపటంబొ యిటుఁ సేయుచుండె
మాబలం బడుగంట మాభూమియెల్ల
నిస్సారమై కడు నిష్ఫలంబయ్యె.

* * *

రంగదుత్తుంగ తరంగ సంగతిని
చెంగటం బ్రవహించు జీవస్రవంతి
అట్లయ్యు మాపొలం బల్లాడుచుండె
బిట్టెండ తాఁకున బీటలు వాఱె.

* * *

అపరాధుల విధాన నందఱు వలన
భీతిల్లుచున్నాము పిఱికి తనాన
దేవ! మే మొక్కొక్క దివసంబు నెట్లు
దాఁటుచున్నారమో తరమె చెప్పంగ.

* * *

రక్తమంతయు నయో రాత్రిందివంబు
స్వేదరూపంబున క్షీణింపఁ దొడఁగె
పాడిపంటలసొత్తు వడ్డీలవలన
మాచేతులంబాసి మాయమై పోయె
అన్నంబు మాకిట నార్తనాదంబె
కడకు పానీయంబు కన్నీరొకండె
కడగానరాని యీకష్టంపు బ్రదుకు
మా కింక వలదయ్య మా కింక వలదు.

* * *

వ్యాకులమైన మావాణి నీతోడ
వెఱ్ఱిచే నిటు విన్నవించెడిం గాని
ఎఱుఁగవే నీవు మా యెల్ల దుర్దశల
ఈదీనులయవస్థ నెల్ల వీక్షించి
కృపఁజూపుమో దేవ! వృష్టిరూపమున.

* * *

చదువరీ! నీ వింక సద్భావ మూని
రైతుసోదరుల దుర్దశ లెల్లఁ దొలఁగ
మేలుకొల్పుము వారి మేల్కొల్పవయ్య
తరుణం బిదే నీకు తగుసేవ సల్ప

ఆలసించిన లాభ మానంత లేదు
ఏ దేశమందు రైతేడ్చుచున్నాడో
ఆ దేశమునకు రాదయ్య మోక్షంబు.

---

## పౌషి

సహదేవ సూర్యప్రకాశరావుగారు

విసిమివెన్నెల, తొలుకారు పసిడివన్నె
మొగలిపూలకన్నెల నరమోడ్పునిదుర
కలువరింతల చివురొత్తు వలపురేక
లేతనునుమబ్బు రేకలో లీన మాయె.

మధురమేమొ, ఆశారాగ మధురమేమొ
నీహసించు వెన్నెల హిమాసించి, పడుచు
కన్నెలరసందెపెదవి నిగారమందు
విరిసి వాసించిపోయె, జీవించిపోయె.

కలలె తారలై, వెన్నెలై, చలితలలిత
రాగమూర్తులై, వినువీథి మ్రోగిపోవు
లేక ఈనాడు ఏనాడు లేని యింత
మధురిమోన్మత్త లంస్యసీమంత మేమి?

ఓయి తారామనోహరా! యుష్మదీయ
హాసరాగాను రాగ వీక్షాంచలములు
నాకుటీజాలపదసీమ సోక, సుప్త
తప్తహృదయమ్ము తుల్లి నిద్రాణమాయె.

అపుడు సాంత్వన మిత్రములైన నీసు-
ధాకరమ్ము చాచెద వీవు నాకరమ్ము
కొరకు, అరచాటు సిగ్గు దొంతరల నిమిడి
కూర్చుకొనుచుండ ప్రేమావకుంఠనమ్ము.

నానిశాలోకనావేదనానుభూతి
బూచి, చరిత్రభ్రుకుటిలతాక్షోభ చూచి
మూతవారినకను లట్టె పులకరించి
విచ్చుకొనిపోవ చుంబించి వేసినావు.

పతితనిర్జీవ జీవితస్మృతుల, వెలుగు
చీకటుల కౌగిలింతల చిటులు, కుటిల
నీలినీలాలకాలిక నృత్యకేళి
స్వప్నవీథిక నలసాలసమ్ములాయె.

మనల దేనాటి బంధమ్మొ మలసిపోని
సొగసిపోని ఆశాకాశ శుభ్రవీథి
నిదుర దేలిన హృదిని గదించివైతు
వంతమేలేని కాల మున్నంత వరకు.

అంత నే సోలిపోదు నీ వంత నిత్య
యాత్ర సాగించుకొనుచు వియత్తలాన
పరిమళాహ్వాన తోరణపంక్తు లల్లు
చెచ్చటెచ్చటికో ప్రయాణించి పోదు.

---



దీ. బ. శ్రీ కో. సూర్యనారాయణమూర్తిగారు



రా. సా. శ్రీ చి, తమ్మిరెడ్డిగారు.



మి. శ్రీ పల్లెంపాటి గోపాలకృష్ణగారు



రా. సా. గుడ్లవల్లేటి వెంకటరత్నంపంతులుగారు.





రా. సా. వి. వి. యస్. యస్. శర్మగారు.



శ్రీ పి. సత్యనారాయణగారు



శ్రీ కారుమూరి సర్వేశలింగంగారు.



శ్రీ శనగపాటి పూర్ణయ్యగారు



శ్రీరామకృష్ణ సేవాశ్రమము, ఇచ్ఛాపురము.

# శపథములు - దివ్యములు

## (ఆర్యధర్మాచార్యుల మతము)

కిళాంబి రంగాచార్యులుగారు

పూర్వకాలమున భరతఖండవాసులగు నార్యులలోనె కాక ప్రపంచమందెల్లెడలను వివాదసమయములయందు యుక్తమగు సాక్ష్యము దొరకనపుడు ప్రాడ్వివాకులు మున్నగువారు సత్యాసత్య పరీక్షలయందు శపథములను, దివ్యములను నుపయోగించెడువారు. ఐరోపాఖండమునఁ బదునెనిమిదవ శతాబ్దమువఱకు నరునియొక్క దోషిత్వ నిర్దోషిత్వనిరూపణము దివ్యములచేతనే కావించుచుండెడివారని చరిత్ర నుడువుచున్నది. ధర్మశాస్త్రములఁ బరికించి చూచిన భారతీయు లీవిషయమై యెటు లాచరించుచుండెడివారో మనకుఁ దెలియును.

"యదా సాక్షీ న విద్యేత వివాదే వదతాం నృణామ్,
తదా దివ్యైః పరీక్షేత శపథైశ్చ పృథగ్విధైః."

వివదించుచున్న నరులకు యుక్తసాక్షి దొరకనపుడు వారలను నానావిధములగు దివ్యములచేతను, శపథములచేతను బరీక్షింపవలెను. సమంతమునను నపరాధముల యల్పానల్పత్వ విచారణమును గావించి యుక్తమగునటుల దివ్యములనో, శపథములనో ప్రయోగింపవలయు నని యాచార్యుల నిర్ణయము.

మహాపరాధ విషయమున భూపతి దివ్యములనె ప్రయోగింపవలయుననియును, నల్పాపరాధ విషయములందు నరుని శపథము చేయునట్లు కావింపవలయుననియును బూర్వాచార్యుల మతము.

"మహాపరాధే దివ్యాని చారయేత్తు మహీపతిః,
అల్పేషుతు నృపశ్రేష్ఠః శపథై శ్రావయే న్నరః."

బ్రాహ్మణుని సత్యముపైని, క్షత్రియుని వాహన శస్త్రములపైని, వైశ్యుని గో కనక బీజములపైని, లేక సమంతమున దేవతలు, పూజ్యులగు పితరులు, వారిచేఁ జేయఁబడిన కృత్యములు, దానములు మొదలగు వానిపైని శపథ మొనర్చునట్లు కావింపవలయును.

"సత్యం వాహనశస్త్రాణి గోబీజకనకానిచ,
దేవతాపితృపాదాంశ్చ దత్తాని సుకృతానిచ."

అని నారదవచనము. ముఖ్యముగా నభియోగాంశము గూఢమైనపుడును, సందిగ్ధమైనపుడును దివ్యములఁ బ్రయోగింపవలెనని మను భగవానుఁడు చెప్పెను.

దివ్యములు పంచవిధములు.

"ధటో ఽగ్ని రుదకంచైవ విషః కోశశ్చపంచకమ్,
ఉక్తా న్యేతాని దివ్యాని విశుద్ధ్యర్థం మహాత్మనామ్."

ధటదివ్యము, అగ్నిదివ్యము, ఉదకదివ్యము, విషదివ్యము, కోశదివ్యము అనునవియే పంచవిధములైన దివ్యములు.

ఈ దివ్యము లభియోగములలో నపరాధులుగా నిందింపఁబడినవారి విశుద్ధ్యర్థమును, సత్యాసత్యనిర్ణయముకొఱకును నేర్పఱుపఁబడినవి.

"సందిగ్ధార్థేఽభియుక్తానాం విశుద్ధ్యర్థం దురాత్మనామ్,
ప్రోక్తాని నారదే నేహ సత్యానృతవిశుద్ధయే."

ఎట్టివారి విషయమున దివ్యములను బ్రయోగింపనగును?

ఆర్తుల కుదకశుద్ధి ప్రయోగింపఁదగదు. పిత్తరోగులకు విషశుద్ధి కూడదు. శ్విత్రరోగి (శ్వేతిమ), కునఖి, అంధుఁడు అను నీమువ్వురికిని నగ్నిశుద్ధి కూడదు. దీక్షితులకు, భృశార్తులకు, వ్యాధితులకుఁ, దాపసులకు, స్త్రీలకు ధర్మము ననుసరించునెడల దివ్యములు కూడవు. మఱియు రాజద్రోహపునేరములందుఁ దప్ప, శిరోవర్తి (దండము నొందుటకు సిద్ధమైనవాఁడు) లేనిచో దివ్యప్రయోగముఁ గావింపఁగూడదు. అభియోగమును గోలుపోయిన వాది దండనమునకు సంసిద్ధుఁడైనపుడు గాని దివ్యశోధన చేయఁగూడదు. రాజసేవకుల విషయమున నీశోధనను భిన్నముగాఁ జెప్పుచున్నారు. రాజసేవకుల విషయమున రాజే శోధనను గావింపవచ్చును. ప్రత్యర్థులగు నరులపై దివ్యమును బ్రయోగింపఁగూడదు—అని నియమించుచు నారదుఁడు:

"తత్ప్రిక్షేన వినీతేన ధార్మికేన విజానతా,
ఉభయానుమతే దీవ్య దివ్యం సర్వం ప్రయత్నతః."

బుద్ధిమంతుఁడును, వినీతుఁడును, ధార్మికుఁడును, బ్రజ్ఞానంతుఁడును నగు రాజు గాని, ప్రాడ్వివాకుఁడు గాని వాది ప్రతివాదుల యిరువుర సమ్మతియు లేక దివ్యపంచకము నొక్కదానినైనఁ బ్రయోగింపఁగూడ దని యర్థము. ఇది నారదమతము.

ఏ యేకాలముల నే యే దివ్యశుద్ధులఁ గావింపఁగూడదు ?

శీతకాలమందుఁ దోయశుద్ధి కూడదు. ఉష్ణకాలమం దగ్నిశుద్ధి కూడదు. వర్ష కాలమున విషశుద్ధియును, బ్రమాదసమయమున ధటశుద్ధియును నిషిద్ధములు. మఱియు వర్ష కాలమున వహ్నిశుద్ధియు, శిశిరమున ధటశుద్ధియు, గ్రీష్మఋతువున సలిలశుద్ధియు, శీతకాలమున విషశుద్ధియుఁ బ్రయోగింపఁదగినవి.

## ధటశుద్ధి లేక తులాశుద్ధి

సభాస్థానమధ్యమునఁ గాని, రాజద్వారమునఁ గాని, దేవాలయముకడఁ గాని, శృంగాటకమునఁ గాని, యాఱుహస్తముల (హస్తమనఁ బదునెనిమిదంగుళములు) పొడవుగల నిడుపైన రెండుకఱ్ఱలను రెండుహస్తములు భూమిలోనికిని, నాలుగుహస్తములు వెలుపలకును నుండున ట్లొకటిన్నర హస్తముల దూరమునను దూర్పు పడమరలకుఁ బాఁతవలయును. తులాకాష్ఠము ఖదిర, తిందుక, శింశుప, శాలతరుసంబంధమైనదై యుండవలయును. దాని నిడుపు నాలుగు హస్తములు. చతురస్రములైనవి మూఁడుస్థానములు గలదియుఁ, గర్కటములు మున్నగువానితోఁ గూడినదియునై యుండవలయును. రెండు కొక్కెములనుండియు రెండుచిక్కములను వ్రేలఁగట్టుదురు. భారసూచకములగు రెండుదారుతోరణము లీశిక్యముల ననుసరించియుండును. తులానిర్మాణ మైన పిదప దానిని గంధమాల్యానులేపనయుక్తంబుగ నొనర్చి దధ్యక్షతహవిర్గంధాదులచేఁ బావనంబుగను, మంగళంబుగను నొనర్చి, చూపరులసమక్షమున నీతులాపరిశోధనము గావింపఁబడును. ఇట్టిశోధన యెల్లప్పుడును బూర్వాహ్ణముననే కావింపవలెను.

శోధన పొందు నరుఁడొకయహోరాత్ర ముపవసించి, సుస్నాతుఁడై, యార్ద్రవస్త్రములతో నుత్తరశిక్యమున నాసీనుఁడు కావలెను. దక్షిణశిక్యమున బుట్టనొకదాని నుంచి దానినిటుకలు, నిసుక మున్నగు వానిచేఁ దులాకాష్ఠము సమస్థితి పొందువఱకును నింపవలయును. తులాధారణకోవిదులగు సువర్ణకారులు, వణిజులు, కాంస్యకారులు తులాకాష్ఠసమత్వమును బరీక్షింతురు. తులాకాష్ఠసమత్వ చిహ్నములను దోరణములందు గుర్తించి నరునిఁ జిక్కమునుండి దింపెదరు. ఆసమయము నిర్వాతమును, వృష్టిరహితమును నయి యుండవలెను. పురుషునిఁ బరిగృహీతసమయునిగ నొనర్చి వానిశిరస్సునం దొక పత్రము నుంచి వానిని మరలఁ జిక్కము నెక్కింపవలయును. కక్షమును బట్టుకొని బ్రాహ్మణుఁ డిట్లు చెప్పవలయును: "ధర్మపర్యాయపదమగు ఘటనామధారివగు నో తులా! నీవు సర్వభూతముల పాపపుణ్యముల నెఱుఁగుదువు. వ్యవహారాభిశస్తుఁడగు నీనరుఁడు నీచేఁ దూఁపఁబడుచున్నాఁడు. సత్యమందు నీవు దేవతలను, నరులను నతిశయించుచున్నావు. (పూర్వము నీవు దేవతలచే నిర్మింపఁబడి సత్యాధికారిణివై యున్నావు. ఓకళ్యాణీ! సత్యమును జెప్పి నన్ను సంశయమునుండితప్పింపుము. నేను బాప మొనర్చినయెడల నన్నుఁ గ్రిందికిఁ ద్రోక్కుము. పరిశుద్ధుఁడనైన మీఁదికి లేవనెత్తుము.)"

"ధర్మవిరుద్ధము కాకుండ సంశయాస్పదుఁడైన వీనిని రక్షింపుము" అని యిట్లు లోకపాలురకు, దేవతలకు నివేదించి, యానరునిఁ గ్రిందికి దింపి, నిరీక్షింపవలయును. ఆ నరుని భారము మొదటికంటెఁ దక్కువగా నున్న యెడల వాఁడు శుద్ధుఁడనియు, వానిభార మిష్టకాదులభారముతో సమాన మైనను, నెక్కువ యైనను నా నరుఁడు దోషసహితుఁడని నిర్ధారణముచేయవలెను. కక్షాభేదమైనను, దులాభంగమైనను, గర్కటభంగమైనను, రజ్జువులు తెగినను, బ్రాడ్వివాకుఁ డానరునిఁ బరిశుద్ధునిఁగ నిర్ణయింపవలయును.

## అగ్నిశుద్ధి

ముప్పది రెండంగుళముల యంతర ముంచుచు నెనిమిది చక్రముల భూమిపైఁ జిత్రింపవలయును. ఏడశ్వత్థపత్రములను, నేమసూత్రతంతువులను వానికరములం గట్టవలయును. అగ్నికర్మయందుఁ గుశలుండును,జన్మ చేలోహకారుఁడును నగు వాఁ డిట్టికర్మలయం దలవడిన నొక్కనిచే నగ్నియం దయఃపిండమును గాల్పింపవలయును. ఏఁబది పలముల బరువుగల యయఃపిండము నెఱ్ఱగ మూఁడు పర్యాయములు కాల్చిన స్ఫులింగం బగునెడ, శుచియగు ద్విజుం డొక్కరుఁ డద్దానిఁగూర్చి సత్యపురస్కృతుండై యిట్లు చెప్పవలయును: "లోకపాలాధిష్ఠితంబైన మానవధర్మప్రబోధమును వినుఁడు. ఓ యగ్నీ ! పవిత్రంబును, బరమంబును, సర్వదేవముఖంబును నీవే. సర్వభూతముల హృదయములనుండి నీ వీవిషయము గుర్తెఱుంగుదువు. నీజిహ్వయందు సత్యాసత్యములు పుట్టినవి. వేదములయందు నిరూపింపఁబడిన యిద్దానికి విరుద్ధముగా నీవు సంచరింపఁగూడదు. నీ వీయధర్మకార్యము చేసితివని వాది నేరము మోపుచుండఁగాఁ, బ్రతివాది నే నీ యధర్మకార్యమును జేయలేదు; వాది చెప్పినదంతయు నబద్ధమని ఋజువుపఱచుటకగ్నిధారణను గావించుచున్నాఁడ నని ప్రతివాది చెప్పుచు నిన్నుఁ బట్టుకొనుచున్నాఁడు. కాన నో అగ్నీ! అతఁడు సత్యముఁ జెప్పినయెడల శైత్య మొందుము. లేక వాఁ డసత్యవాదియైన వానిహస్తములఁ బాపిహస్తములవలెఁ గాల్చుము" అను ప్రార్థన నొకపత్రము పై వ్రాసి యచట నుండు వారలకు వినిపించి, నేరస్థునినెత్తిపై నాపట్టమును గట్టి యాతనికా తప్తాయః పిండము నీయవలయును. స్నాతుఁడై యా నేరస్థుఁడు మధ్యచక్రమునఁ జొచ్చి, యా తప్తాయః పిండమును హస్తములతోఁ బట్టి మెల్ల మెల్లగ మిగిలిన యేడుచక్రములలోను సంచరించవలయును. ఎనిమిదవ చక్రమును జేరువఱకును దప్తాయఃపిండమును విడువకుండ నుండి దానిఁ జేరినపిదప జారవిడువవలయును. మండలప్రమాణము వానిపాదప్రమాణమునకు సరిగ నుండవలయును. మండల ప్రమాణమును మించి యొక్కపర్యాయమే యడుగు వేయరాదు. అయఃపిండమును బట్టుకొనక

పూర్వము వాని చేతులయందుండు మచ్చలను, గురుపులను జిహ్నముల చే స్మరించి కార్యాంతమున వానిహస్తములఁ బరిశోధింపవలయును. వాని హస్త మేమియుఁ గాల్పఁబడనట్లు కాన్పించిన నతనిచే నేడు పర్యాయములు ధాన్యపుగింజలను నల్పింపవలయును. తదనంతరము న్యాయస్థాన మలంకరించు సభ్యులు వాని నదగ్ధహస్తునిగ నిర్ణయించిన నట్టివానిని సత్కరించి నిర్దోషిగ విడువవలయును.

## ఉదకశోధన—పానీయవిధి

హేమంత శిశిర ఋతువులయందుఁ దప్పఁ దక్కినకాలముల యం దీశోధనఁ గావింపవలయును. అతివేగము లేని నదులయందును, సాగరములు, హ్రదములు, తటాకములు, సరసులు, నదములు మున్నగు వీనియందు నీశోధనను గావింపవలయును. మూఁడుశరములు అనతిబలం బగు విల్లునుండి విడువఁబడిన పిదప మజ్జనముఁ గావింపవలయును. నూటయేడంగుళములు పొడవుగల ధనుస్సు క్రూరంబనియు, నూట యాఱంగుళముల నిడుపుకలది మధ్యమమనియు, నూటయైదంగుళము లది మందమనియుఁ దెలియనగును. స్తంభమువలె బలవంతుఁడైన నరుఁడు నాభివఱకును నీటిలో నిలువఁబడవలయును. అభిశస్తుఁడైనవాఁడు వాని యూరువులను బట్టుకొని యుదకములో మజ్జనముఁ గావింపవలయును. మధ్యమశరము పడినచోటునకు శరప్రక్షేపణ స్థానమునుండి యతి వేగముతో యువకుఁ డొకఁడు వెళ్లవలెను. ఇంకొకఁడు సమానవేగ ముతో నామధ్యశరమును బ్రతిగ్రహించి మొదటి యాతఁడు బయలు వెడలిన స్థానమునకుఁ బోవలయును. శరగ్రహణస్థానమును జేరువఱకును నీట మునిఁగియున్న యభిశస్తుఁడు కనఁబడకపోయిన నభిశస్తుఁడు నిర్దోషిగ విడువఁబడును. ఒక్క యవయవము కనఁబడినను నభిశస్తుఁడు దోషియని నిర్ణయింపఁబడవలయును. మొదటమునిఁగినస్థానమునుండి తదితరస్థానమునకుఁబోయినను నభిశస్తుఁడు దోషియనిచెప్పఁబడుచున్నాఁడు.

## విష విధి

శరత్కాలమునను, హిమాగమసమయమునను, ధర్మతత్వార్థవిదులచే నిరూపింపఁబడిన పరిమితిగల విష మీయనగును. అపరాహ్ణమందుఁ గాని, సంధ్యాసమయమునఁ గాని, మధ్యాహ్నమందుఁ గాని, శరద్గ్రీష్మవసంతములందుఁ గాని (సంధ్యాసమయమునఁ గాని, మధ్యాహ్నమందుఁ గాని), విషశుద్ధిఁ గావింపవలయును. భగ్నమును, జారితమును, ధూపితమును, మిశ్రితమును నగు విషమును, గాలకూటమును, నలాబు విషమును గూడ నీ విధియం దుపయోగింపఁగూడదు. క్షత్రియ వైశ్య శూద్రులకు హైమవతంబును, యుక్తమగు గంధరసయుక్తంబును, నభిన్నమగు శార్ఙ్గవిషమును నీయవలయును. పలములో $7/8 \times 1/6 \times 1/20$, అనగా నేడు యవప్రమాణముల విషమును ఘృతములోఁ గలిపి యీయవలయును. శిశిరఋతువున విషవిధిఁ గావింపఁగూడదు. ఛాయాప్రదేశములో దినాంత మగునఱకును నీరాహారుఁడై యానరుఁ డుండవలయును. విషవేగక్లమాతీతుండై యుండిన నానరుండు శుద్ధుండని మనువు చెప్పెను.

## కోశవిధి

ఉపవాసముండి, స్నాతుఁడై, యార్ద్రవస్త్రధారియై యుండిన యాయభిశస్తునిచే దేవతావిగ్రహమును స్నానమాడించిన జలమును మూఁడు గ్రుక్కలు త్రాగింపవలయును. శోధాంతమున వారమురోజులలోఁ గాని, పదునైదు దినములలోఁ గాని వాని కట్టి యశుభమైనఁ గలిగిన నభిశస్తుఁడు ద్రోహియని నిర్ణయింపవలయును. మహాపరాధి, ధర్మహీనుఁడు, కృతఘ్నుఁడు, క్లీబుఁడు, కుత్సితుఁడు, నాస్తికుఁడు దాసుఁడు నను వీరివిషయమై కోశవిధిఁ గావింపఁగూడదు.

> " బ్రాహ్మణస్య ధటో దేయః క్షత్రియస్యాఽగ్ని రుచ్యతే,
> వైశ్యేతు సలిలం దేయం విషం శూద్రే ప్రదాపయేత్. "
>
> " న బ్రాహ్మణే విషం దద్యా న్న లోహం క్షత్రియో హరేత్,
> కోశాన్తాని తులాదీని గురు ష్వర్థేషు దాపయేత్. "

ధటాదిశోధపంచకమునుగుర్వర్థములందుఁ బ్రయోగింపవలయును. అభిశస్తుఁడునిర్దోషియనినిర్ణయింపఁబడినవానికినూటయేఁబదిపణములీయవలయును. దోషియనినిర్ణయింపఁబడినవానికి యుక్తదండనవిధింపవలెను.

## తండులవిధి

చౌర్యమం దీవిధిని బ్రయోగింపవలయునని ధర్మవేత్తలు చెప్పుచున్నారు. శుక్లములగు తండులములను మృణ్మయభాజనములందు, బ్రాడ్వివాకుఁడు శుచియై సూర్యవిగ్రహప్రక్షాళితోదకములోఁ గలిపి, సూర్యవిగ్రహము నెదుట నొకరాత్రి యుంచవలయును. ఉదయముననే వానిని మూఁడుభాగములుగఁ జేసి ప్రాఙ్ముఖుఁడును, స్నాతుఁడును నై యుపవాసము చేసి యున్న యాయభిశస్తునకు ప్రాడ్వివాకుఁడే నేరమును బ్రకటించియీయవలయును. అభిశస్తుఁడా తండులములను నమలిన పిదప నశ్వత్థపత్రముపైనిగాని,భూర్జపత్రముపైని గాని యుమియఁజేయవలయును. ఆయుమ్మియందు రక్తమున్నను,దంతజాలము క్షతమైకనుపడినను నభిశస్తుని నేరస్థునిగ నిర్ణయింపవలయును.

## తప్తమాషకలక్షణము

ప్రాడ్వివాకుఁడు శుచియై సౌవర్ణపాత్రయందుఁ గాని, రజతపాత్రయందుఁ గాని, యాయసపాత్రయందుఁ గాని, మృణ్మయపాత్రయందుఁ గాని ఘృతము నుంచి యాపాత్ర నగ్నిపై నుంచవలయును. ఉదకముతో ననేక పర్యాయములు కడుగఁబడి మెఱయుచున్న బంగారముతో కాని, వెండితో కాని, రాగితో కాని, ఇనుములో కాని చేయఁబడినమాషకము నందులో నుంచవలయును. కాఁగుచున్న అట్టినేతిలో నుండి ఆమాషకమును అనుమానితుఁడగు నాతఁడు అంగుష్ఠములోను, అనామికతోను బయటకుఁ దీయవలయును. వానియనామికను పరీక్ష చేయఁగా నది పొక్కులు లేకయుండిన యెడల నట్టివాఁడు నిర్దోషియనియు, లేనియెడల నాతఁడు దోషియనియు గుర్తింపఁగ వలయును.

నీళ్లకు






చిత్రకారుడు : శ్రీ వై. సుబ్బారావుగారు, రాజమహేంద్రవరము.

# ఎదురీత

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

స్వదేశాభిమానము, స్వరాజ్యకాంక్ష మున్నగునవి యిప్పు డెల్లచోటుల నెల్లరచే భరతఖండమునఁ బరమధర్మములుగాఁ జేకొనఁబడుచున్నవి. ఇందలి 'స్వ' అను పదమువలనఁ గలిగెడి యావేశ మొక్కొకసమయ మున జనసామాన్యమునం బడి హానికరమును గావచ్చునని తోఁచెడి. స్వకులాభిమానము, స్వమతాభిమానము, స్వశాఖాభిమానము, స్వగ్రామాభిమానము మున్నగునవి యొక్కొకప్పుడు పామరులలో నావేశముఖ మైనప్పుడు పరులపై విద్వేషము, అసూయ మొదలగువానిని బెంచి, యన్యాయ్యములును, అధర్మములును అగుపనులలోఁ గూడఁ బట్టుదలలు ప్రబలి యొకరి నొకరు తలకాయలు పగులఁగొట్టుకొను నంతటి దురవస్థయు దేశమునకు వాటిల్లవచ్చును. మొన్న మొన్నటిదాఁక మతాభిమానములతో శైవుల మొగము చూడని వైష్ణవులును, వైష్ణవులఁ గననొల్లని శైవులును ఇట్లే పరస్పరద్వేషములతో నొకసభలోఁ జేరి రేని చేతులు చేతులు కలియుట దగ్గఱకు వచ్చి, యైకమత్యము లేక, యెవ రనుకొనినది వారికిఁ జెల్లవలయు నను పట్టుదలలతోఁ బరిహాస పాత్రులై యుండుట యెవ్వరు నెఱుంగనిది కాదు. శ్రీ కందుకూరి వీరేశలింగముగారు రచించి యుండిన ప్రహసనములోఁ జూడఁదగు.

ఇది గాక స్వశాఖాభిమానము రేఁగినప్పుడు నియోగులు-వైదికులు, రెడ్లు-కమ్మవారు మున్నగు శాఖలలో నంతఃకలహములు బయలుదేఱి యెంతంత లేసి యన్యాయ్యములైన పట్టుదలలను గలిగించుచున్నవో, బలవంతులగు వారిచే దుర్బలుల కెట్టి యపకారములు గలిగించుచున్నవో, వీనివలన గౌరవార్హుల కగౌరవములును, అల్పులకు గౌరవములును ఎన్నివిధములఁ గలుగుచున్నవో ప్రస్తుతము మనకన్నులయెదుట జరిగెడి మనసంఘ పరిస్థితులను బట్టికూడ నెల్ల రెఱుంగనగు. ఇంత యేల? ఆంధ్ర విశ్వవిద్యాలయ కార్యస్థానము బెజవాడలోఁ బ్రతిష్ఠింపఁబడుట సహింపని యితరపట్టణవాసు లొనర్చిన కలవరమున కంతకును స్వగ్రామాభిమానములే కదా కారణము. దానివలనఁ బ్రభుత్వమువారికిఁ గూడ విసువు గలిగి, కొన్ని జిల్లాలు విడఁదీయఁబడుట మున్నగు ననర్థములు వాటిల్లి యాంధ్రజాతి కెంతటి యప్రతిష్ఠ కలిగినదో చూడుఁడు. ప్రతివాఁడును ప్రతివసతియుఁదన పట్టణమునకే, తనయింటికే, తనకే కావలయునని పాటుపడుటకును 'కలౌ సంఘే శక్తిః' అనుటకును ఎంతటి విరోధ మున్నదో చూడుఁడు. ఈస్వార్థపరాయణత్వము నే మన పూర్వవాఙ్మయము రాక్షస ప్రకృతినిగాఁ జెప్పుచున్నది. వేయేల? ఒక రైలుపెట్టెలోఁ గొందఱు కూరుచున్నా రనుకొనుఁడు. మఱికొంద ఱెక్కుటకు వచ్చినారు. అప్పుడు కూరుచున్నవా రంద ఱొక్కటె. ఎక్కువా రంద ఱొక్కటె. మనమందఱ మొకటి కావలదా? అని వీరు; మనలో నైకమత్యము వలదా? అని వారు. ఇట్లు తారసిల్లి ద్వంద్వ యుద్ధములకుఁ గారకు లగుచున్నారు. ఇట్టిచోట్ల వాండ్రుమాత్రము మన వంటివాండ్రు కారా? మనవలె రాలేదా? అనువివేక మొక్కింత గల్గినఁ గలహము లేదుకదా. దీనినే న్యాయదృష్టి యందురు. దీనినే ధర్మ కామ మందురు. దీనినే సర్వ

సమత్వ మందురు. దీనినే ప్రహ్లాదుఁడు "మీరు మే మను మతిభ్రమణంబున భిన్నులై ప్రవర్తిల్లక" యుండుఁడని చెప్పెను. ఈన్యాయపక్షపాతమునే సత్యాగ్రహ మనఁజను. సత్యమన ధర్మమును, న్యాయమును; ఆగ్రహమన పట్టుదల. దర్మముకొఱకును, న్యాయమునకును సర్వత్యాగము చేసి ప్రాణములకైన నాసపడక పోరాడుచుఁ బాటుపడుట మన పెద్దలు, మహాపురుషులు శ్రీరామ హరిశ్చంద్రాదులు చేసినపని. అదియే మన జాతీయధర్మము. అట్టిపట్టుదలను విద్యార్థుల మనసున నాటి పోషించునవియే జాతీయవిద్యలు. శ్రీరాములవారు రావణునితో యుద్ధము సేయునప్పుడు కోపము వచ్చినపుడెల్ల రావణుని "నీవు పరస్త్రీలను జెఱఁబట్టు దుష్టుఁడవు కాన నిన్నుఁ జంపవలెను" అనుచుండును. కాని "నాభార్యను దెచ్చి నాకపకారముఁ జేసినాఁడవు కాన నిన్నుఁ జంపుచున్నాను" అనఁడు. ఇది ధర్మనిష్ఠ. వీరిని ధర్మవీరులని మనవాఙ్మయము శ్లాఘించెడిని. వీరు స్వార్థపరాయణులలోఁ జేరరు. స్వార్థశూరులను కుక్షింభరులని, శిశ్నోదర పరాయణులని, రాక్షసులని మనగ్రంథజాలము దూషెడిని.

ప్రబలులగు పరులు స్వార్థపరాయణులై యెత్తి వచ్చియుండుకాలము మున్నుగాఁ గొన్ని సమయములలో స్వాభిమానము పూర్ణముగ నుద్భవించినఁ గాని యధోగతి నుండి భేదములచేఁ జెడియున్న సంఘముల కుద్ధరణము కల్గుట యసంభవమనుటయు నిజమే. కాని యా స్వాభిమానావేశ మప్పటిపరిస్థితుల ననుసరించి ధర్మజ్ఞులైన నాయకులచే సంఘమునఁ బ్రవేశపెట్టఁబడి, యాయవాంతరకార్యనిర్వాహ మగుదాఁక పదిలముగ హద్దుల దాఁటకుండఁగఁ గాపాడఁబడి కార్యాంతమున మరల నుపశాంతిఁ బొందింపఁబడవలసినది. ఎల్లవిషయములలో దేహాభిమానులై భేదదృష్టి గలిగియుండు పామరజనులకు స్వాభిమానావేశము శాశ్వతధర్మముగాఁ బాదుకొననీయఁగూడదు. జ్ఞానపరిపూర్ణులగు పెద్దలు ఆత్మయే ప్రపంచమంతయు నని భావింతురు. వారి స్వాభిమానము సర్వలోకక్షేమంకరము. ధర్మవిప్లవమును లోకసంగ్రహార్థముగ సహింపమియే వారిప్రవృత్తికిఁ గారణము.

స్వమతము నభిమానించుటకన్న సుమతము నభిమానించుట పామరులకు శ్రేయము. స్వరాజ్యము గోరుటకన్న సురాజ్యమును గోరుట సామాన్యజనులకు సముచితము. స్వక్షేమము, స్వగౌరవము మున్నగువానికై పాటుపడు ప్రజకన్న లోకక్షేమము, న్యాయము, ధర్మము అని వానియుద్ధరణముకై పాటుపడు జనము శ్లాఘ్యము. స్వశబ్దార్థమునకు మేర లేదు. స్వదేశాభిమాని పరదేశములతోఁ బోరాడును. స్వగ్రామాభిమాని పరగ్రామములతో, స్వకుటుంబాభిమాని పొరుగిండ్లవాండ్రతో, స్వదేహాభిమాని భార్యాపుత్రాదులతోఁ గూడ స్వార్థములందలి యపేక్షతోఁ బోరాడుట సాజము. కావున నిట్టి స్వాభిమానపిశాచము నాత్మలలోఁ బెరుఁగనీక, ధర్మకామము, సత్యాగ్రహము అనుమాటలతోఁ జెప్పఁబడు ధర్మదీక్షనే రక్షించుకొనుదక్షత నాబాలగోపాలముగఁ జిరకాలాభ్యస్తమైన మనజాతీయధర్మ మైనదాని నిప్పుడు గూడ సర్వప్రపంచమున నాటి సర్వలోకైకమత్యము సాధింప నాయకులు పాటుపడుదురు గాక.

# విక్టోరియా హిందూ వితంతు శరణాలయము, రాజమహేంద్రవరము

కామరాజు హనుమంత రావుగారు

## ప్రారంభము

ఆంధ్రదేశమునందు నవయుగమున సంఘ సంస్కరణోద్యమమునకు ఆదిపురుషులయిన శ్రీ రాయబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు మొదలిడిన సాంఘికకార్యములలో స్త్రీల యొక్క, వారిలో ముఖ్యముగ వితంతువులయొక్క, యభ్యున్నతికి చేయబడిన కృషి అగ్రస్థానము వహించుచున్నదని వేరుగ జెప్పనక్కరలేదు. బాలికా పాఠశాల యెటువంటిదియు నొక్కటికూడ లేక నారీమణులు విద్యాగంధ విహీనలయి యజ్ఞానాంధకారమున దోగాడుచున్న కాలములో స్త్రీవిద్యకొరకు ఆందోళనము జరపి తద్వ్యాపనమునకై తీవ్రకృషిని సలిపిన పుణ్యపురుషులు వీరేశలింగము పంతులుగారు. వివాహ మన నేమో యెరుగని చిరుతప్రాయమున పరిణయము గావింపబడి, వితంతువులయి, రామమోహనుని దయవలన దారుణసహగమన దురాచారమునుండి విడివడి సజీవులయి యుండగలిగినను, తమ సహజమగు వివాహేచ్ఛను నీడేర్చుకొనుట కవకాశము గానక అనేకబాధలు పడుచు క్రుంగి కృశించుచున్న యువతీరత్నముల యార్తనాదము విని వంగదేశమందు విద్యాసాగరులవలె ఆంధ్రదేశమందు శ్రీ పునర్వివాహోద్యమమును ప్రారంభించిన ధీరపురుషులు వీరేశలింగము పంతులుగారు. 1881 వ సంవత్సరమున వారు మొదటి వితంతూద్వాహము జరపిన నాటినుండియు పెండ్లిచేసికొను తలంపుగల వితంతువులు వారి వద్దకు వచ్చుచుండిరి. ఆ యనాథకాంత లెల్లరకు ప్రథమమున పంతులుగారి గృహమే శరణాలయమయ్యెను. పంతులుగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారు కూడ తోడ్పడుచు స్త్రీపునర్వివాహ ప్రయత్నములు ఫలప్రదములు గావించిరి. ఇట్లు నిర్విఘ్నముగ ఇరువది వివాహములు రాజమహేంద్రవరమున జరపిన తరువాత తమపుస్తకములను సంపుటములుగా ప్రచురించు నిమిత్తమును, రాజధానియందుండి మరింత జయప్రదమగు లాగున సంఘసంస్కరణమును నడుపవలె నన్న యాశతోను పంతులుగారు చెన్నపట్టణములో తమ నివాసముకొరకు సొంతయిల్లు కట్టించుకొని 1897 వ సంవత్సరము డిశంబరు నెలలో నచటికి జనిరి. 1904 వ సంవత్సరములో విశ్రాంతి గైకొనువరకు ఉద్యోగసందర్భముగా సహితము వారచటనే యుండవలసివచ్చెను. 1900 వ సంవత్సరములో విజయనగరమునం దొక వివాహమును, 1902 వ సంవత్సరములో గుంటూరునం దొకవివాహమును, రాజమహేంద్రవరమునం దొకవివాహమును జరపించుటకు పంతులుగారు పత్నీసహితముగా వెళ్లియుండిరి. మరియు చెన్నపురిలో నుండగా శరణాలయము నిమిత్తము ప్రత్యేకభవనము విశేషవ్యయప్రయాసములతో నిర్మింపగలిగిరి. కాని అది యుపయోగములోనికి రాలేదు. తమ యాశ్రయము గోరిన వితంతువులలో నొకరిద్దరు తప్ప తక్కినవారందరు తెనుగు దేశపువారై యుండుటవలనను, అభిమానమును బట్టి చూడ చెన్నపట్టణముకంటె రాజమహేంద్రవరమే సంఘసంస్కరణ కార్యములకు కేంద్రస్థానముగా నుండదగినదని తెలిసికొనుటచేతను, విశ్రాంతి బడసినతోడనే జన్మస్థలము జేరవలెనను కోరిక ప్రబలమగుట మూలముననను, పంతులుగారు చెన్నపురిలో తమకున్న యిల్లు, వస్తువులు మొదలయినవన్నియు విక్రయించి 1905 వ సంవత్సరములో రాజమహేంద్రవరము జేరిరి. మొదటినుండియు వితంతూద్వాహములకు సంబంధించిన పనులయందు యువకులు రక్షకభటులగుచు, ధనికులు ద్రవ్యసాహాయ్యము చేయుచు, అధికారులు సౌకర్యముల కలిగించుచు, పలువురు పలువిధముల పంతులుగారికి సాయపడిరి.

## స్థిరస్థాపనము

రాజమహేంద్రవరమునకు మరలి వచ్చిన కొలదికాలములోనే వితంతు శరణాలయము కట్టించు నిమిత్తము ప్రస్తుతము ఆనందోద్యానవనమని పిలువబడు సుమారు ముప్పది యకరములతోటను కొనగలిగిరి. తోటను వృద్ధిజేయుచు శరణాలయమునకు తగినయేర్పాటులను గావించు నుద్దేశముతో పంతులుగా రందే నివాస మేర్పరచుకొనిరి. వారి శిష్యకోటిలో నొకరయి స్త్రీ పునర్వివాహోద్యమమునం దధికమగు నభిమానము గలవారును, శ్రీమంతులు నగు శ్రీ మునుకుట్ల అచ్యుత రామయ్యగారు అయాచితముగ శరణాలయమునకు భవనము ఆతోటలో నిర్మించి యిచ్చెదమని వాగ్దానముచేసి, శీఘ్రకాలములో సుమారు ఐదు వేలరూపాయ లందునకై వ్యయపరచి తమవాగ్దానమును పూర్తిచేసికొనిరి. "అందు వితంతువుల వాసమునకు వరుసకై దేసి చొప్పున రెండువరుసలలో పదిగదులును, నాలుగు వర్ణములవారికిని నాలుగువంటయిండ్లును, శరణాలయ కార్యములను జూచువారు కాపురముండుటకయి మూడు పెద్దగదులుగల యిల్లును, దానియెదుటను పాఠశాల నిమిత్తమయి విశాలమయిన మూడుగదులుగల యిల్లును ఉన్నవి." ఇవి

యన్నియు నొకే యావరణములో గలవు. అందు పెద్ద నుయ్యికూడ త్రవ్వింపబడెను. ఈశరణాలయ భవనము 1908 వ సంవత్సరము నవంబరునెల 15 వ తేదిని తెరువబడెను. అంతకు ముందే 1906 వ సంవత్సరములో పంతులుగారు సంఘ సంస్కరణాభిమానుల సమావేశము గావించి, తాము ప్రారంభించిన కార్యములను నెరవేర్చుటకయి హితకారిణీ సమాజమను పేర నొకసంఘమును స్థాపించి, దానిని 1860 వ సంవత్సరపు 21 వ రాజశాసనము ప్రకారముగా రిజిష్టరు చేయించిరి. 41,500 రూపాయల విలువగల తమసొత్తునంతను ట్రస్టుడీడు మూలముగ హితకారిణీ సమాజము పరముజేసి స్థిరవసతి కొంత కల్పించిరి. వారు కలుగజేసిన యాధారమువలన నిప్పుడు సంవత్సరమునకు ఖర్చులు పోగా రమారమి మూడువేల రూపాయల యాదాయము లభించుచున్నది. ఇది వితంతు శరణాలయముయొక్క యక్కరల నిమిత్తము ముందు ఖర్చు పెట్టవలెననియు, అట్లు వ్యయపరుపగా మిగిలినది మాత్రమే యితర కార్యములకు వినియోగింపవలెననియు పంతులుగారు నిబంధనముచేసిరి. వితంతూద్వాహకార్యములకు ధనసాహాయ్యము చేయుచు పంతులుగారికి తోడ్పడిన వారిలో పైడా రామకృష్ణయ్యగారును, ఎస్. రంగయ్య సెట్టిగారును, కోలాచలము వెంకట్రావుగారును, పోలవరము జమీందారు క. ఆర్. వి. కృష్ణారావుగారును, న్యాపతి సుబ్బారావుపంతులుగారును, మన్నవ బుచ్చయ్య పంతులుగారును, డాక్టరు సి. బి. రామారావుగారును, దుగ్గిరాల సూర్యప్రకాశ రావుగారును, రఘుపతి వెంకటరత్నము నాయడుగారును, పిఠాపురము మహారాజా రావు సూర్యారావు బహద్దరుగారును ముఖ్యముగ పేర్కొనదగి యున్నారు.

## ఉద్దేశ్యము

ప్రారంభములో వితంతువులకు వివాహముచేయుటయే ప్రధానోద్దేశ్యముగ నుండెను. అప్పుడయినను వివాహము జరుగు పర్యంతము వారికి విద్యాబుద్ధులు గరపుటకు తగినయేర్పాటులు పంతులుగారు చేయుచు వచ్చిరి. స్త్రీవిద్యాభివృద్ధి విషయమునను వారికి విశేషమగు పట్టుదల గలదు. శరణాలయమున కనుబంధముగా స్త్రీలకొరకు నొక యున్నతపాఠశాల నడుపవలెనని తలంచి వారు రాజమహేంద్రవరమునకు చెన్నపురినుండి తిరిగి వచ్చినతోడనే శ్రీ విక్టోరియా బాలికా పాఠశాలను నెలకొలిపి, ఆరుగురు ఉపాధ్యాయులను, ఒక యుపాధ్యాయుని బెట్టి దానిని చాలవరకు వృద్ధిలోనికి దెచ్చిరి. అందు నిమిత్తము విశేషధనము ఖర్చుపెట్టిరి. కాని పైతరగతులకు వచ్చిన వెంటనే బాలికలు చదువు మానుచుండిరి. స్త్రీల యున్నతపాఠశాల ప్రత్యేకముగ స్థాపించుట తమకు సాధ్యము గాదని స్పష్టపడెను. శరణాలయ బాలికలలో కొందరు ఉన్నతవిద్య బడయుటకు సమర్థలయి యుందురు గావున పెద్దపాఠశాలను విరమించి వారినిమిత్తము కొలదిమంది యుపాధ్యాయులను నియమించి చిన్నపాఠశాలను శరణాలయమువద్దను నడుప ప్రారంభించిరి. ఉన్నత తరగతులలో త్వరితముగ చేరుటకు ఎట్టిశిక్షణ మవసరమో యదియే శరణాలయబాలికల కా చిన్నపాఠశాలయం దిప్పింపబడుచుండెను. అట్టి యర్హత బడసిన బాలికలు పంతులుగారిచే స్థాపింపబడిన బాలుర ఆస్తికోన్నత పాఠశాలయందు జేరి విద్య నభ్యసించుటకు చక్కని యేర్పాటులు చేయబడెను. శరణాలయ నివాసులకే కాక తదిర బాలికల కన్వరికైనను ఆస్తికోన్నత పాఠశాలయందు జీతములు పుచ్చుకొనక చదువు చెప్పవలె నను పద్ధతి పంతులుగా రేర్పరచిరి. వివాహముకొరకే గాక విద్యకొరకు వచ్చు వితంతువులును శరణాలయమునందు చేరవచ్చుననియు, అంతియ గాక వివాహమయిన బాలికలు గాని, కాని బాలికలు గాని వారి సంరక్షకులు భోజనాదులకు గావలసిన సొమ్మిచ్చు పద్ధతిని శరణాలయములో చేరవచ్చుననియు నిర్ణయించి శరణాలయోద్దేశము స్త్రీవిద్య యనికూడ పంతులుగారు వ్యక్తపరచిరి.

## విధులు

శరణాలయము నిమిత్తము పంతులుగారు నియమించిన విధులీక్రింద నుదాహరింపబడుచున్నవి:

"అనాథయువతుల యుపయోగార్థముగా రాజమహేంద్రవరమున వితంతు శరణాలయ మొకటి పెట్టబడియున్నది. నిరాధారులయియున్న యనాథకాంతల కష్టములను గొంతవఱకు తొలగించి, విద్యాదానమువలన వారిని సగౌరవజీవనమున కర్హులనుగా జేయుట యీశరణాలయముయొక్క ముఖ్యోద్దేశము. అందు నిమిత్తమయి ఇంగ్లీషు తెలుగుభాషలు నేర్పెడి పాఠశాల యొకటి స్థాపింపబడియున్నది. అందు కుట్టుపనికూడ నేర్పబడును.

"మనలో స్త్రీలు కొందఱు కొంచెమువిద్యరాగానే గర్వము కలవారయి పనిపాటు చేయుట తమగౌరవమున కర్హము కాదని భావించి సోమరులయి చెడుచున్నారు. ఈవితంతుశరణాలయమునం దిటువంటి దురభిప్రాయము లెంతమాత్రమును ప్రోత్సాహపఱుపబడవు. ఇందు జేరినవా రందఱును పాటుపడుట యభ్యాసము చేసికొనవలెను. వారు వంతుల వరుసను వంట చేసి, తక్కినవారికి వడ్డించుచుండవలెను. ఒకరు వంటచేయునప్పు డింకొకరు పైపనులను చేయుచుండవలెను.

"ఈప్రకారముగా వంటచేయుట, తెచ్చిన పదార్థములను జాగ్రత్తచేయుట, వెచ్చముల లెక్క లుంచుట, చిల్లరపనులను చక్కబెట్టుట మొదలయినవి వంతుల వరుసను జేయుచుండుటవలన నెల్లవారును చదువును మాత్రమే కాక గృహకృత్యముల తీర్పునుగూడ నేర్చుకొందురు. ఇందు జేరిన వారి వర్ణభేదమునకు భంగము గలుగకుండ కాపాడుటకయి ఆయావర్ణములవారికి దగినట్టుగా వేఱువేఱుగా వంటలు, భోజనములు చేసికొనుటకు స్థలము లేర్పఱుపబడియున్నవి. ఇందుండువారు ప్రతిదినమును ఎవరిబట్టలు వా రుతుకుకొని యారవేయుచు, ఎవరి పక్కలు వారు వేసికొని తెల్లవాఱి యెత్తివేయుచు ఉండవలెను.


శ్రీ యస్. డి. జోసఫ్, బి. ఏ., బి. ఇ. డి


శ్రీమాన్ ప్రకాశరావుచౌదరిగారు, బి యస్. సి. (ఆనర్స్)


శ్రీ ఉత్పత్తుల నరసింహాచార్యులుగారు ఎ. ఆర్. ఎ. సి.


(20) వైద్యరత్న వైద్యరాజ కవిరాజ పండితకత్యులు



శ్రీ అన్నావఝ్ఝల శివరామయ్యగారు



శ్రీ ఉడిపి గోపాలాచార్లుగారు, తులసిపూజ



శ్రీ సీతారామ హరిభజన భక్తసమాజము, ఉంగుటూరు




విహార సుందరి



చిత్రకారుడు: శ్రీ ఎ. వెంకటేశ్వర రావుగారు.

2. "ఈ శరణాలయమునం దున్నవారిలో నెవ్వరికయిన వ్యాధి వచ్చుట తటస్థించిన పక్షమున మందు లిచ్చుటకయి వైద్యుఁ డేర్పఱుపఁబడును గాని యందున్న వితంతువులే యుపచారములను, పథ్యపానములను వంతుల వరుసను జేయవలెను.

3. "విద్యయం దాసక్తిగల్గుబీద బాలవితంతువుల కీశరణాలయమునందు ధర్మార్థముగా అన్నవస్త్రాదులును, పుస్తకములు మొదలయినవియు నిచ్చి విద్య చెప్పింపఁబడును. ఆఱునెలల కొకపర్యాయము రెండేసిబట్ట లియ్యఁబడును.

4. "ఈవితంతుశరణాలయమునందుఁ జేరినవారు సత్ప్రవర్తనము కలవారయి యుండవలెను. వారినడత విషయమయి తగినంత శ్రద్ధ చేయఁబడును. ఇందుండు వారిలో నెవ్వరయిన కలహశీలలయి తఱచుగా నితరతరుణులతో తగవులాడుచున్నను, శరణాలయ విధులను మీఱి ప్రవర్తించుచున్నను, సత్ప్రవర్తనము గలవారు కాకపోయినను, పాఠములను జదువక తఱచుగా నశ్రద్ధ చేయుచున్నను, అట్టివారు వితంతు శరణాలయమునుండి పంపివేయఁబడుదురు.

5. "ఎల్లవారును తెల్లవారుజామున నైదుగంటలకు తప్పక నిద్రనుండి లేవవలయును. ఏడుగంటలలోపల దంతధావన స్నానాదికమును ప్రాచిపనులను, ప్రార్థనమును ముగించి చదువుకొనుటకు సిద్ధముగా నుండవలెను. ప్రాతఃకాలమున 6½ గంటలకును, సాయంకాలమున 4½ గంటలకును శరణాలయమునుండి సూపరింటెండెంటు వెంట ఆనందాశ్రమమునకు ప్రార్థనకు పోవలెను. సోమవారము మొదలుకొని శుక్రవారమువఱకును ప్రతిదినమును ఏడుగంటలు మొదలుకొని యెనిమిదిగంటలవఱకును పాఠములను జదువుకొనవలెను. ఎనిమిదిగంటలు మొదలుకొని పదిగంటలలోపల వంట, భోజనము మొదలయిన పనులు చేసికొని పాఠశాలకుఁ బోవుటకు సంసిద్ధురాండ్రయి యుండవలెను.

"భోజనవిషయమున నెవ్వరికిని ఆవశ్యక పదార్థములే కాని భోగములు జరపఁబడవు. శరణాలయములో నున్నంతకాల మెవ్వరును మాంసాహారమును తినఁగూడదు. పదిగంటల నర మొదలుకొని యొంటిగంటవఱకును శరణాలయములోనే స్థాపింపఁబడియున్న పాఠశాలకుఁ బోయి చదువుకొనవలెను. ఒంటిగంటకును రెండుగంటకును మధ్య మధ్యాహ్న భోజనము చేయవలెను. రెండుగంటలు మొదలుకొని నాలుగుగంటల నరవఱకును మరలఁ బాఠశాలకుఁ బోయి చదువుకోవలెను. నాలుగు గంటల నర మొదలుకొని యైదుగంటలవఱకును ఆనందాశ్రమములో ప్రార్థన చేసికొనీ; పిమ్మట పుస్తకములను, వార్తాపత్రికలను జదువుటలోఁగాని, బ్యాడ్మింటను మొదలయిన యాట లాడుటలోఁ గాని, వ్యాయామము చేయుటలోఁ గాని, సూపరింటెండెంటు వెంటనో, వేఱొక పెద్దవారి వెంటనో తోఁటలో తిరిగి కాని, విశ్రాంతి ననుభవించుటలోఁ గాని కాలము గడపవచ్చును. రాత్రి యాఱుగంటలు మొదలుకొని యేడుగంటల నరలోపల వంట చేసికొని భోజనములు చేసి, మఱునాఁటి పాఠములను జదువుకొనుటకు సంసిద్ధురాండ్రయి యుండవలెను. ఏడుగంటల నర మొదలుకొని తొమ్మిదిగంటలనరవఱకును దీపము వెలుతురున మఱునాటి పాఠములను జదువుకొనవలెను. రాత్రి తొమ్మిదిగంటల నరకు నిద్రకు పోవచ్చును. శనివారమునాఁడు ప్రాతఃకాల కృత్యములను యథాప్రకారముగా తీర్చుకొన్న తరువాత ఏడుగంటలు మొదలుకొని తొమ్మిదిగంటలలోపల తలంటి పోసికోవలెను. అటుతరువాత పదిగంటల నరలోపల వంట, భోజనము మొదలయినవి ముగింపవలెను. రెండుగంటలు మొదలుకొని నాలుగు గంటలలోపల పాఠములను, ఇతరగ్రంథములను జదువుకొనవలెను.

"ఆదివారమునాఁడు ప్రాతఃకాలమున 7 గంటలు మొదలు 8 గంటలవఱకును ప్రార్థనకు వచ్చి ధర్మోపదేశమును విని, తక్కిన కాలములో ఇష్టము వచ్చిన రీతిని యుక్తమార్గమున విశ్రాంతి ననుభవింపవచ్చును.

6. "వితంతు శరణాలయములోనివారు పయివారితో మాట్లాడఁదలఁచుకొన్నను, ఇతర వ్యవహారములు జరపఁదలఁచుకొన్నను, పయివారి కుత్తరములు వ్రాయఁదలఁచుకొన్నను సూపరింటెండెంటు సెలవును పొంది చేయవలెను. ఆవశ్యకమని తోఁచినయెడల సూపరింటెండెంటు ఇతరులతో మాట్లాడునప్పుడు తాను దగ్గఱ నుండవలెను; శరణాలయములోనివారు వ్రాసెడి యుత్తరములనుగాని, వారికి వచ్చెడి యుత్తరములను గాని సూపరింటెండెంటు విప్పించి చదివి చూడవచ్చును. అట్టి యుత్తరములలో వారి నడతను గాని, న్యాయబుద్ధిని గాని సందేహించుట కవకాశ మున్నయెడల, అట్టి యుత్తరమును వెంటనే ప్రసిడెంటుగారికి పంపి వారియుత్తరువు ప్రకారము చేయవలెను. ఆయన అట్టినడత విశేషమైనది కాదని తలఁచినయెడల, మందలించి మొదటి తప్పిదముక్రింద క్షమింపవచ్చును.

7. "వితంతు శరణాలయమం దున్నవారు తమకుఁ గావలసిన వస్తువులను సూపరింటెండెంటుద్వారా తెప్పించుకొనవలయునే కాని స్వయముగాఁ గాని, సేవకులవల్లఁగాని తెప్పించుకొనఁగూడదు. వారు విద్యాలయముతోఁ జేరిన సేవకులతో నేవిధమైన సంబంధమును పెట్టుకొనఁగూడదు.

8. "పెండ్లియైనవారినిగాని, కానివారినిగాని, వితంతువులను గాని వారి సంరక్షకులు బోర్డింగు స్టూడెంట్లనుగా నుంచఁగోరినయెడల, భోజనములకును, ఇతర వ్యయములకును గావలసిన సొమ్మిచ్చు పద్ధతిమీఁద అట్టివారు వితంతు శరణాలయములో చేర్చుకొనఁబడుదురు. అట్టి విద్యార్థినులు వేసవికాలపు సెలవులలో తమయిండ్లకు పోవచ్చును. అట్టి వారిసంరక్షకులు సూపరింటెండెంటు సెలవును పొంది యప్పుడప్పుడు వచ్చి తమ బాలికలతో మాట్లాడిపోవచ్చును. బోర్డింగు విద్యార్థినులు శరణాలయ నిబంధనల కన్నిటికి లోఁబడి యుండి, ఇతరులు వంట మొదలయినవి చేసికొనెడు సమయములో తమకాలమును పాఠములనో, సద్గ్రంథములనో చదువుకొనుటలో వినియోగపరుపవలెను.

9. "వితంతు శరణాలయములోని వారు తమ వ్యాయామమున కయి యేర్పాటు చేయఁబడిన స్థలమునందును, వేళయందును తప్ప, తక్కిన స్థలములయందును, వేళలయందును ఆటలాడుకొనఁగూడదు.

10. "వితంతు శరణాలయములో నుండువా రందఱును సూపరింటెండెంటుగారి యుత్తరువులకు లోఁబడి ప్రవర్తింపవలెను. సూపరింటెండెంటుగారి యుత్తరువునకు వ్యతిరిక్తముగా ప్రవర్తించినను, వారిని తిరస్కరించినను, నిందించినను, అట్టివారు ప్రసిడెంటుగారి యుత్తరువుమీఁద వితంతుశరణాలయమునుండి వెడలఁగొట్టఁబడుదురు. అట్టివారు వితంతు శరణాలయముతోఁ జేరిన పాఠశాలయందుఁ జదువుకొనుటకు సహితము ర్హులు కారు. సూపరింటెండెంటుగా రిచ్చెడి యుత్తరువులలోఁగాని, వారు చేసెడి యాదరణలోఁగాని లోపమున్నట్టు శరణాలయములో నున్నవారికి తోఁచినయెడల, అట్టిలోపములను వ్రాఁతమూలముగా ప్రసిడెంటుగారికి తెలుపవలెను. ప్రసిడెంటుగారు విమర్శించి స్వయముగాఁ గాని, కమిటీవారితో ఆలోచించి గాని, తీర్మానము చేయువఱకును సూపరింటెండెంటుగా రిచ్చిన యట్టి యుత్తరువునకు లోఁబడియే ప్రవర్తింపవలెను గాని వ్యతిరేకించి నడచుటగాని మఱియేవిధమైన యనాదరణను జూపుట గాని చేయఁగూడదు.

11. "సత్ప్రవర్తన విషయములోను, శుచిత్వవిషయములోను తప్ప, నితరవిషయములలో నధికారమును జూపక సూపరింటెండెంటుగారు వితంతు శరణాలయములోని వారి స్వమతాచారములను, కులాచారములను మన్నింపవలెను.

12. "తమ భార్యలతోఁ గలసి చూడవచ్చెడు తనుమనుష్యులను, ఇతర స్థలమునుండి వచ్చి చూడఁగోరెడు పెద్దమనుష్యులను తప్ప, నితరుల నెవ్వరిని వితంతు శరణాలయములోనికి రానియ్యఁగూడదు."

## విజ్ఞప్తి

హితకారిణీ సమాజము నెలకొల్పబడినను పంతులుగారు జీవించి యున్నంతవరకు కార్యభారమంతయు వారే వహించియుండిరి. వారు 1919 సంవత్సరములో మృతిజెందిన పిమ్మట పంతులుగారి సంస్థలను నడుపవలసిన బాధ్యత హితకారిణీ సమాజముపై బడినది. సమాజము వారు క్రమక్రమముగా తమకర్తవ్యముల తెలిసికొనుచు పంతులుగారి యుద్దేశ్యములను సఫలీకృతము గావించుటకు పాటుపడుచున్నారు. శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి యాజమాన్యమున జరగిన వీరేశలింగము పంతులుగారి కడచిన పదియవ వర్ధంతి సందర్భమున సమావేశమయిన వారందరు ఏకగ్రీవముగా ఈక్రింది తీర్మానము గావించి ప్రతి ఆంధ్రుని విధాయక కృత్య మెట్టిదియో వెల్లడిచేసిరి:

"కీ. శే. రాయబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులు గారిచే 1908 సం॥న స్థాపింపబడి, కొంత మంచి వసతినిగూడ కలిగి యుండి సంఘ సంస్కరణోద్యమమునకై పాటుపడుచున్న హితకారిణీ సమాజమును ఆంధ్రదేశ సంఘ సంస్కరణోద్యమమునకు కేంద్రసంస్థగా చేయుట ప్రయోజనకరమనియును, ఈసంస్థకు ఆంధ్రరాష్ట్రములోని అభిమానులెల్లరును తోడ్పడవలయుననియు నీసభవారుకోరుచున్నారు."

పిమ్మట నాగేశ్వరరావు పంతులుగారు ఎల్లరు హితకారిణీ సమాజసభ్యులయి సాధ్యమయినంత ధనసాహాయ్యము సమాజమునకుచేయవలసినదని ప్రోత్సహించుటయేగాక తాము వెంటనే సభ్యులయి సంవత్సరమునకు 250 రూపాయల చందా నొసంగెదమని తెలిపిరి. నూతనముగ కొందరు సభ్యులయిరి. ఇది యెంతయు శుభసూచకము. సమాజస్థితిగతుల నారయుచు, వలసిన సాహాయ్యమంతయు సమకూర్చుచు సమాజము వెంపొందించి ఆంధ్రులు పంతులుగారి యభీప్సిత మీడేర్తురుగాక!

# వాసనల స్వరూపము

పారనంది జగన్నాథస్వామి గారు, యం. ఏ., యల్. టి.

[గతించిన మూడు సంవత్సరముల ఆంధ్రపత్రిక సంచికలలో ఒక్కొక్క వాసనగురించి ప్రత్యేకముగా వ్రాసియుంటిని. ఇప్పుడు వాసనా సామాన్యము గురించి వ్రాస్తాను.]

జంతుపరిణామములో తయారై జాతిపరంపరలో వ్యక్తికి స్వతస్సిద్ధముగా జన్మతో సంక్రమించిన మనోవృత్తులు ఈ వాసనలు. ఇవి అభ్యాసమువల్లగాని, అనుభవమువల్లగాని నేర్చుకొన్నవి గావు. ఒకజాతి వ్యక్తులందరిలోనూ ఒకే విధాన్న ఇవి ప్రవర్తిస్తుంటవి కాబట్టి ఆవ్యక్తులందరికీ ఇవి సమములని చెప్పవచ్చును. కొన్ని కార్యాలను చేయుటకు తగినట్లుగా ప్రవర్తించుటకు గల శక్తి వాసన అని చెప్పగలము; ఆ కార్యము చేయుటకు భావిదృష్టిగాని విద్యాభ్యాసముగాని ఉండదు. పక్షి తన వెంద్రుకలకు కావలసిన తైలమును తయారుచేసి వెంద్రుకలకు పట్టించే పని అంతా వాసనా రూపముగా జరుగుతుంది. పట్టుపురుగుకు పట్టు తయారుచేసే శక్తి కలదు. ఈ పని ఆ పురుగు ఒక నియమిత కాలములో ఒక విధమైన పరిస్థితులలో చేస్తుంది. ఏవి మారినా ఆ కార్యము జరగదు. ప్రాణి నశించినా సరే కాని ఆవాసన మరియొకలాగు మారి ప్రవర్తించదు.

వాసనలవలె కనబడే కొన్ని ప్రాణివ్యాపారాలు ఉన్నవి. అవి రెండు రకములని చెప్పవచ్చును; స్వయం కార్యములు (Reflex acts), అభ్యాసకార్యములు (Habits). వీటికీ వాసనలకూ చాలా సామ్యములున్నా, అవి వేరువేరు రకములకు జెందినవి. వాసనల వ్యాపారాల గురించి కలిగే మానసిక జ్ఞానము స్వయం కార్యముల గురించి ఉండదు; అభ్యాసకార్యములు నేర్చుకొన్న కార్యములు కాని వాసనలు అట్లు నేర్చుకొనుటవల్ల స్థిరపడ్డవి కావు. అవి స్వతస్సిద్ధములు. వాసనలనుండి ఈ రెండు రకముల వృత్తులను విడదీయుటకు కొంత సూక్ష్మ పరిశోధన అవసరము. కోడిపిల్లలను, నెమలిపిల్లలను, బాతుపిల్లలను పరీక్షించి, వాటి పరుగెత్తుటలు, ఈదుటలు, మునిగి తేలుటలు, నేలపై ఒక్కరుటలు, భూమిమీద నుండే చిన్న వస్తువులను పొడుచుటలు, భయపడ్డప్పుడూ, ఆకలిగా నున్నపుడూ చేసేచేష్టలు--ఇవన్నీ వాసనల కార్యములని పరిశోధకులు చెప్పగలిగిరి. గూడు కట్టుట, గుడ్లను పొదువుట, పిల్లలను పెంచుట మొదలైన పక్షుల పనులు, శీతోష్ణ బాధలనుండి తప్పించుకొనుట, ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు పోవుట, ఆహారానికి పురుగుల్ను వేటాడువిధము--వీటి ఆరంభములు వ్యక్తిలో వాసనావ్యాపారాలే.

ఇవన్నీ మనోవృత్తులే అగుటవల్ల వాటికి అన్యోన్యసంబంధములు కలవు. వాసనల ప్రవృత్తిని అలవాటు చాలావరకు నిరోధిస్తుంది. ఆకలి వేస్తున్నప్పుడు ఆహారము స్వీకరించుట వాసనే యైనా, ఏ ఆహారము పడితే దానిని పుచ్చుకోక అలవాటు పడ్డదానికే వేచియుండుట అలవాటుయొక్క నిరోధము గదా. పక్షి గూడు కట్టుటకు అలవాటు పడ్డ కొమ్మ కొరకే వెదుకుతుంది. ఒక వాసనావ్యాపారము యుక్తకాలమందు ప్రారంభమై, క్రమముగా అభ్యాసమవుతుంది. ఒకవేళ వాసన బలము క్షీణించి పోయినా అభ్యాస బలమైనా నిలిచి ఉంటుంది. వాసన వ్యక్తమగుటకు ఉచిత పరిస్థితులు, యుక్తకాలము మొదలైన నియమములున్నవి. ఆకాలమందు దానికి నిరోధము కలిగి వ్యక్తముకాకపోతే వాసన హరించి పోవచ్చును. ఆతరువాత తగినవస్తువు ఉన్నా ఆవాసన ఉద్రేకించక పోవచ్చును. తల్లిపాలు కుడుచుట వాసనా వ్యాపారము. పుట్టిన క్షణమునుండి ఆప్రవృత్తి లేకుంటే కొన్నాళ్లయిన తరువాత బిడ్డ మరి కుడవకపోవును. కాని అన్నివాసనలు అంత క్షణికములు కానందున ప్రమాదములు అరుదు. నిరోధము మాత్రము కలిగి అనారోగ్యమునకు కారణము కావచ్చును.

వాసనలు అన్ని మనోవ్యాపారలకూ ఆధారములుగా ఉండి ఆవ్యాపారాలకు ఆవశ్యకములైన ప్రయోజక శక్తులను కల్పిస్తూ ప్రధాన బీజవృత్తులుగా ఉంటవి. మనస్సుకు అంతకూ కూడా ఇవి పునాదు వంటివి. మనస్సుగా వ్యక్తమయే అన్ని ఉత్కృష్ట వృత్తులూ వీటి నుండే ప్రారంభమవుతవి. వీటి సామగ్రినే ఉపయోగిస్తూ, ఆవృత్తులన్నీ విజృంభిస్తవని చెప్పవచ్చును. వ్యక్తియొక్కగాని, సంఘముయొక్కగాని వ్యాపారాలన్నిటికీ శక్తిని కల్పించుటలోనే కాకుండా ఉద్దేశాలను, ప్రయోజనాలనూ నిర్ణయించుటలోనూ కూడా ఇవే మూలకారణాలు. వాసనల ప్రవృత్తిలో మనస్సుయొక్క మూడు ప్రధాన వృత్తులు-జ్ఞాన కర్మ భావములు-వ్యక్తమవుతవని చెప్పవచ్చును.

వాసనలకు ఇంత ప్రాధాన్యము కలుగుటకు కారణము కలదు. వాటి ప్రారంభము చాలా పురాతనమైనది; అనాది అని చెప్పవచ్చును. ఎక్కడనో పరిణామములో అవి ఉత్పత్తి నొందినవి. మనుజుని పరిణామమునకు మూలమైన జంతుకోటిలో ఎక్కడనో అవి వ్యక్తమై విజృంభించినవి; క్రమముగా మనుజునికి అవి సంక్రమించినవి. పరిసరముల ప్రభావమువలన అవి క్రమముగా మార్పులు చెందుతూ, మనుజునిలో ఉత్కృష్టములుగాను, ప్రకారాంతరములుగాను పరిణమించినవి. అందుచేత వాసనల స్వరూపాన్ని పరీక్షించి తెలుసుకోవలె నంటే, జంతువుల, అందులో ముఖ్యముగ ఉత్కృష్ట జంతువుల చైతన్యవ్యాపారాలు చాలా సహకారులు. మనుజునికి విశేషమైన బుద్దివలన మారని వాసనలను సులభముగా తెలుసుకోవచ్చును. జంతువులలోనే కాకుండా పిల్లలలోను, అనాగరక ప్రజలలోనుకూడా ఎక్కువగా బుద్ధిసాంకర్యములేని వాసనలు వ్యక్తమవుతూ ఉంటవి. కాబట్టి జంతుసామాన్యమునకు ఒకేవిధాన తుల్యములుగా ఉండే శక్తులు ఇవి అని చెప్పవచ్చును. పరిణామములో ప్రసక్తములైన మార్పులవలన ఇవి చాలా కొద్దిగా మారుచుండెను. కాబట్టి ఇవి జాతికంతటికి తుల్యములుగా ఇప్పటికిన్నీ ఉన్నవి. ఒకజాతి వ్యక్తులందరూ ఒకేవిధమైన వాసనలను వ్యక్తపరుస్తూ ఉంటారు. వీటిని అందుచేత మనోనిర్మాణమునుండి తొలగించుట అసాధ్యము. వీటిని నిర్మూలింప ప్రయత్నించుట కొండలు తీసి పల్లపుభూములు కట్టవలెనని చేసే ప్రయత్నమువలె అసాధ్యము, అసంభవము.

ఇవే చైతన్యస్వరూపమని భావించే శాస్త్రజ్ఞు లున్నారు. చైతన్యమంతా ఇవే కాకున్నా, ఇవి వ్యక్తియొక్క ఇతర గుణములతో అభేద్యమైనట్లు మిలితములైనవి. అట్లు అనేకవిధములైన నిర్మాణములైనవి. మనుజునిలో ఈనిర్మాణములు ఎక్కువగా చిక్కుపడి వక్రగతుల ప్రవర్తిస్తూ ఉండుట సంభవమైనది. ఒకవాసన నిర్మాణమూ మరొకవాసన నిర్మాణము, ఇతర మనోవృత్తులూ అన్నీ కలిసి పోవుచుండుటచేత ఏవాసనకూ సాక్షాత్ ప్రవర్తన వీలుకాక ఈక్లిష్టగతి సిద్ధమవుతూ వచ్చినది. అందుకు తోడుగా బాహ్యపరిస్థితుల అనేకత్వము, మనుజునికి విశేషమైన బుద్ధి, ఆత్మజ్ఞానము, ఆదర్శ భావనాశక్తి మిలితములైన మనుజుని మనోవృత్తులు తయారైనవి.

అందుచేత వాసనలు మూడు అని శాస్త్రపరీక్షకులు నిర్ణయించినా, మనుజునిలో విజృంభణమై యున్నవి చాలా యెక్కువ. విభజించి పరీక్షించిన కొలదీ భిన్నభిన్న నిర్మాణములు కనబడతవి. అంతర్భావము చెప్పి సంకలన సూత్రమున కేంద్రీకరిస్తే ఈమూడింటిగా కనబడ తవి: ఈమూడూ ప్రాణికి అత్యవసరమైనవి, నిత్యవ్యాపారానికి ఆవశ్యకమైనవి; జీవనము నడుచుటకు ముఖ్యముగా కావలసినవి. వీటి ప్రయోజనము బాహ్యప్రపంచము. ఒక బాహ్యవస్తువుచేత ప్రేరితమై ఒక మనోవృత్తి ఉద్భవిస్తుంది; ఆవృత్తి ననుసరించి వ్యాపార ప్రవృత్తు లుంటవి. ఉదాహరణగా కొన్ని తిన్నని వృత్తులను పేర్కొనవచ్చును. ఒక వస్తువును చూడగా భయము కలుగుతుంది; దానినుండి పారిపోవుట సంభవిస్తుంది. చక్కని తినుబడి వస్తువు కనబడుతుంది; దానిని తినాలని ఉద్రేకము కలుగుతుంది. అనాథురాలైన ఒకస్త్రీని చూడగా కరుణ కలుగుతుంది; చేతనైన సాహాయ్యము ఆమెకు చేయాలని ప్రయత్నముగాని, లేక ఉద్దేశమైనా సంభవిస్తుంది. ఈ వ్యాపారములలో మూడురకాల మనోవృత్తులు ఉన్నవి. ఒక వస్తువును గ్రహించి, ఒకవిధమైన భావోద్రేకమును పొంది, అందుకు అనుగుణమైన ప్రవర్తన చేయ ఇచ్ఛాప్రయత్నాలు చేయుదుము. ఇవి జ్ఞానభావకర్మ సంబంధమైనవి; భయంకరమైన వస్తువునుగాని, చక్కని తినుబడి వస్తువునుగాని, అనాథస్త్రీనిగాని చూచుట; భయము, ఆకలి, కరుణ అనేభావములకు లోనగుట; పారిపోవుట, తినుట, రక్షించుట అనేవ్యాపారాలకు ఉద్యుక్తులగుట;—అందుకు ఉదాహరణములు. ఈ మూడువృత్తులు ప్రతీవాసన ప్రవృత్తిలోను వ్యక్తమవుతవి; మూడూ కలిసిన దానికే వాసన అనేపేరు అని చెప్పవచ్చును. కాని మనుజునిలో మాత్రము జ్ఞానసంబంధమైన వృత్తి విస్తరించినట్లు, మిగిలిన రెండూ విస్తరించ లేదు. మనుజుడు బుద్ధిబలముచేత కార్యసాధనములను చక్కగ తెలుసుకొని ఒకదాని కొకటి సరిజేస్తూ ప్రవర్తిస్తాడు.

కాబట్టే మనుజునిలో వాసనల ప్రవృత్తులు మీద నుదాహరించి నంత తిన్నగాను, సులువుగాను ఉండవు. అనేక కారణ సామగ్రిచేత ఇవి మనుజునిలో చిక్కుపడియున్నవని ఇదివరకే నిరూపింపడమైనది. ఇందువలన కలిగిన ఫలిత మేమి? మనుజుని క్షేమము ఎక్కువైనదా-అనే ప్రశ్న కలుగకమానదు. వాసనసామగ్రి మనోనిర్మాణములోని పునాదులువలె పాతుపడి యుండడముచేత, ఆధునికమైన బుద్ధివలన సంక్రమించిన నిర్మాణములు ఆవాసనలను మార్చలేనందున వాసనలకు, బుద్ధి ప్రవృత్తికి ఒకవిధమైన సంఘర్షణ కలుగుతున్నదని అభిప్రాయము. ఇట్టి విరోధమును నీతివేత్తలు, మతప్రచారకులు కనిపెట్టి ఒకవిధమైన మార్గమును వేశారు. వాసనలు పశుతుల్యములు కాబట్టి అవి మనుజునిలో ఉన్న పశుత్వమునకు సూచకములుగా నిర్ణయించారు. బుద్ధిబలముచేత ఆధ్యాత్మికపరుడైన మనుజుడు ఈశ్వర సాన్నిధ్యకాముడై ఈ పశు సంబంధ గుణాలను మాడ్చివేయవలెననిన్నీ, లేనియెడల అణిచివేయవలెననిన్నీ వారందరి బోధన. ఇన్నివేల సంవత్సరాల ఉద్బోధన తరువాతకూడా మనుజుడు, పండితులు కూడా పశువులై యుండుట అందరికీ తెలిసిన విషయమే. నవీన పరిశోధకులు ఈ నీతిమత పరాజయమును విచారణ స్థలముగా గ్రహించి, మనుజుని మనోనిర్మాణమును పరిణామ సిద్ధాంతము ననుసరించి విభజించి పరీక్షించిరి. అందుకు ఫలముగా పునాదులైన వాసనలప్రాబల్యము అంగీకరింపబడినది. పునాదులు మాడిపోవు, నాశనము పొందవు, బీజరూపాన్ని ప్రవర్తిస్తూ ఉండకమానవు. కాబట్టి వాటిని, వాటి బలాన్ని తెలుసుకొని తీరవలె ననే అభిప్రాయము సిద్ధాంతమైనది.

వాసనలకు పశువులలోవలెనే సంతృప్తి ఆవశ్యకము. కాని పశువులలో ఉన్నట్లు తిన్నగా తృప్తి కలుగుట అసంభవము. కొన్ని కొన్ని చోట్ల తిన్నగాను, సులువుగాను తృప్తి పొందుట శక్యమైనపుడు జీవనము సుఖముగా ఉంటుంది. నాగరక సంఘములలో నివసిస్తున్న ఈ ఆధ్యాత్మికాదర్శములకు ముందంజవేసే మనుజునికి అట్టి పశు సౌఖ్యము అరుదు. కాబట్టి మనుజుని ఉత్కృష్టతకు ఏది కారణమో అదే ఈ వాసనాబుద్ధుల వైరుధ్యమునకు కారణమైనది. ఈ వైరుధ్యమును సాధించుటకు గల మార్గములు మూడు. పూర్తిగా వాసనలకు లొంగిపోవుట; ఇది అంగీకారముకాని పని. వాసనలకు అతీతుడగుట; ఇది ఏ ఇద్దరిముగ్గురి దివ్యపురుషులకో తప్ప ఇతరులకు సాధ్యపడని పని. మూడో మార్గము రాజీమార్గము. వాసనల సంగతి, వాటి స్వభావము, ప్రవృత్తులను, వాటి అలోపోత్కృష్ట నిర్మాణములను, వాటి పరస్పర సంబంధాలను బాగా తెలుసుకోవలెను. వాటిని ఆత్మజ్ఞానముచేతను, బుద్ధి విశేషముచేతను చక్కపరచి, నిర్మాణములను పరస్పరము పోరాటము లేకుండ పొందుపరచి వ్యక్తులు ప్రవర్తింపడ మొక్కటే సాధ్యమైన పని. అందుకు ఉపాయము జ్ఞానమే. వాటిని తెలుసుకొన్నకొలదీ వాటిని స్వాధీనపరచుకొనుటకు తగిన సాధనాలు కూడా వ్యక్తమవుతూఉంటవి. బాహ్యప్రపంచమందలి భూతశక్తు లెట్లు జ్ఞానమూలము నమనుజునికి స్వాధీనములైనవో, అల్లే ఈ భయంకర వాసనలు కూడా జ్ఞానశక్తికి వశములై తీరును. అందుకు తార్కాణముగా వివిధావస్థలలో ఉన్న నాగరక జాతులవ్యక్తులు వ్యక్తపరుస్తున్న వాసనల తారతమ్యములు చాలును. అందరికీ స్వతస్సిద్ధముగా తుల్యములైన వాసనలు నాగరకతచే ప్రసక్తమైన బుద్ధిబలమువలన భిన్నరీతుల నిర్మాణములను బొంది ఎక్కువతక్కువ పశుబలము కలవిగా కనబడుతున్నవి.

కొందరి అభిప్రాయములో ఈ నాగరకతవలన వాసనలు పశువులలోవలె సాక్షాత్తు తృప్తిని పొందకున్నవనిన్నీ, అందుచేత కలుగుతున్న బాహ్యమైన నిరోధమువల్ల మనో నిర్మాణమునకు చాలా అనారోగ్యము సంక్రమిస్తున్నదనిన్నీ వాదిస్తున్నారు. ఇందులో యథార్థము లేకపోలేదు. ఈచర్చ గతవ్యాసాలలో చేసేయున్నాను. అందుచేత మనుజుడు పశుస్థితికి రావలసినదని తీర్మానించ నక్కరలేదు. వాసనల స్వరూపాన్ని తెలుసుకొని ప్రాథమిక వాసనాశక్తిని కొంతవరకు ఉత్కృష్ట మనోవృత్తుల క్రింద వినియోగపరచ సాధ్యము. బుద్ధిపూర్వకముగా అట్టిమార్పు జరగక ముందే మనస్సు ఆపనిని చేస్తూ ఉంటున్నది. పశువులలో మనశ్శక్తి అంతా వాసనల సాక్షాత్తు తృప్తికొరకే వినియోగ పడుతున్నది. సాంఘిక జీవనానికి అలవాటు పడ్డ మనుజుడు వ్యక్తులమధ్యను, వ్యక్తి సంఘముల మధ్యను ఏర్పాటుచేయవలసిన అన్యోన్యమును పోగొట్టుకొనలేక, వాసనల శక్తిని విరోధపరిహారము చేసుకొంటూ, సాక్షాత్తు తృప్తినుండి మార్చుతూ ప్రవర్తిస్తున్నాడు. సాక్షాత్తు తృప్తిక్రింద వినియోగము పొందక, ఉత్కృష్ట ప్రయోజనములకు మారక, అసహజమైన నిరోధమునకు లేబడే వాసనాశక్తే అనారోగ్యమునకు కారణ మవుతున్నది. ఈ చర్చకూడా పూర్వవ్యాసాలలో చేసియున్నాను. కాబట్టి బుద్ధివాసనలకు గల వైరుధ్యమునకు ప్రతీకారము ఒక్కటే:-వాసనల స్వరూపాన్ని చక్కగా యథార్థముగా తెలుసుకొని, ఆత్మజ్ఞానాగ్నిలో పశుగుణములను సానపెట్టి ఆదర్శప్రాయుడైన మనుజుడు విజృంభించగలడు.

---



రాధా - కృష్ణ

చిత్రకారుడు. నానుబాల - కుమారస్వామిగారు, కళానిలయము, సోంపేట.

# మహారాజా అప్పారావు

తురగా వేంకటరామయ్య గారు

౧

"శ్రీలసింపకు" లేఖినీ యమృతజగతి-నా యనంత తేజోమయుఁడై వెలుఁగు
నాంధ్రరాజర్షి శ్రీ నృసింహాప్పరాయ-దివ్యమూర్తిని రచియించి తీరు మిపుడె.

౨

కరుణోదారము గన్నుదోయి, నతలోకత్రాణదీక్షాకళా
స్ఫురణక్ బొల్చెడు నాననమ్ము సురసంపూజ్య ప్రభా యుక్త రా
జ్యరమాపీఠము వక్షుసీమ, రణవిద్యా ప్రౌఢిమానీతభూ
భరణోదీర్ణము దోర్యుగమ్ము గల యప్పారావుఁ జిత్రింపుమా.

౩

పైఁడి జరీపూల పట్టుషమ్లాఁ జుట్టి కలికితురాయిఁ బాగను ధరించి
ఆనందధామమై యలరు ఫాలమునందు నీర్నామమ్ముం దీర్చి నీటు గూర్చి
కొనగోట దువ్వి చిక్కని మీసముల దిద్ది దానదీక్షాపరత్వమును దెల్పి
మేలిమిం బోలు నెమ్మేని కాంతిని మించు "చీని" బారాబందు మేనఁ దొడిగి
పసిఁడియంచుల యుప్పాడపంచె గట్టి-గౌతమీతీరసీమా "మకాములందు"
పాలితులమధ్య జనకునిభాతి నున్న-శ్రీ నృసింహాప్పరావుఁ జిత్రించునాఁడె
లేఖినీ నీదుప్రజ్ఞ నైలింప మగును.

౪

క్షామవేళలఁ బయనమ్ము-సలుపునెడల నాపదలు వచ్చి దారిద్ర్య మబ్బుతఱిని
ఆమహాదానవీరు ధర్మప్పరావు-దలఁచినంతనె యన్నంబు గలుగు నంద్రు.

౫

తంబురా దాల్చి నిత్యమ్ము నమ్మహానీయుఁ బాటఁ బాడని యోగివరుఁడు లేఁడు
అమ్మహారాజు కీర్త్యంకితమ్ములఁ గాంచి ప్రియమందనట్టి యాత్రికుఁడు లేఁడు
శిష్యకోటికి విద్యఁ జెప్పి యానరనాథుఁ బేరుఁ జెప్పని శాస్త్రవిదుఁడు లేఁడు
జప మాచరించి యా జననాథునియశముఁ బలుకని తీర్థసంవాసి లేఁడు
ఆతపమ్ములఁ గొల్లేటి నరుగువేళ-నతని స్మరియించి సుఖముల నందనట్టి
పథికుఁడును లేఁడుహృదయమా! పాడఁగలవె-ఆనృసింహాప్పరాయకథామృతమ్ము!

౬

ప్రాజ్యమగు నీదు నిడుదవోల్ రాజ్యమందు-భాగ్యవశమున నీ దానపత్రములను
గాంచి యుప్పొంగినాఁడ "మేకా" కులాబ్ధి-రాజ! మహారాజ! ధర్మాప్పరాయభూప!

౭

ఈయగ్రహారము నిచ్చి, యప్పారావు వేదార్థములనెల్ల వినియె నండ్రు
ఈనూత్న ఖండ్రిగ నిచ్చి నృసింహుండు మంత్రశాస్త్రమ్ముల మనిచె నండ్రు
ఆసర్వదుం బాల నప్పరాట్ప్రభుఁ డిచ్చి గాలిగోపురశిల్ప మేలె నండ్రు
ఆ యగ్రహారము నప్పరావే యిచ్చెఁ జిత్రకారుల కని చెప్పుకొండ్రు
ఏమి? నీదానచరితమ్ము లెన్నిగతుల-నడచె నోయి! బ్రహ్మానంద నవ్యరాజ్య
పాలనాభారధౌరేయ పరమపూజ్య-రాజకులదీప! ధర్మాప్పరాయభూప?

౮

ఏను దిరిగితి నీదు సంస్థాన మెల్ల-దైవసద్మమ్ముఁ జెఱువును ధర్మవనము
లేని, దేగ్రామమును గాంచలేదు నీదు-హృదయమదియెట్టిదోపల్కు నెవనితరము?

౯

ఊరూరఁ బుస్తకాగారమ్ము లెన్నియో వెలసి విజ్ఞానమ్ము కలుగకున్నె
ఉచితమ్ముగా విద్య నొసఁగ మార్యూలనేక విద్యాలయమ్ములు వెలయకున్నె
పాశ్చాత్యలోక మచ్చబము నొందురీతుల నఖిల కలాజాల మలరకున్నె
అఖిలవాఙ్మయములం దగ్రతాంబూలమ్ము నాంధ్రభాషాదేవి యందకున్నె
ఆంధ్రదేశాన విశ్వవిద్యాలయమ్ము-నల త్రిశంకునిస్వర్గమ ట్లలరునొక్కొ ?
ఈ శతాబ్దిని నీ వుంటివేని మాకు-శ్రీ నృసింహాప్పరాయరాజా! "నమోఽస్తు".

ఆంధ్రలోకమునకు విజ్ఞప్తి: ఇమ్మహనీయుఁడు పందొమ్మిదవ శతాబ్దప్రారంభమున శ్రీనిడుదవోలు సంస్థానమును బాలించిన మహారాజు. ఈ మహారాజునామము ఆంధ్రదేశమునకుఁ గ్రొత్తలేదు. వీరి సమగ్రచరిత్రము నచిరకాలమునఁ బ్రకటింపఁబడ నున్నదని తెల్పుటకు సంతసించుచున్నాఁడను. దయామయులగు నాంధ్రులు నాయందు కరుణ వహించి "ధర్మాప్పారావు" వారి చరిత్రమునకు సంబంధించినయంశములు దమకు దెలిసినచో ౧౯౩౧ జూన్‌నెలలోపుగఁ బంపఁ బ్రార్థితులు.

———



శ్రీ చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు బి. ఎ. (ఆనర్సు), ఎ. యస్. ఎ. ఎ.



శ్రీ దంతులూరి
శ్రీరామచంద్ర రాజుగారు




శ్రీ ఉేకుమళ్ల వెంకాజీగారు, బి. ఏ., యఫ్. సి. యస్



శ్రీ డాక్టరు పిశిపాటి వెంకటరమణయ్యగారు



శ్రీ వి. ఆర్. చిత్రగారు




శ్రీ సౌభాగ్యవతి కీ. శే. పేరేపి సూర్యకాంత సత్సంగినీగారు



శ్రీమతి రాజరాజేశ్వరమ్మగారు



శ్రీమతి
దామెర్ల కమలరత్నంగారు



శ్రీయుతులు పి. జోసఫ్ విల్సన్ దంపతులు



శ్రీమతి లైడియా వేదనాయకం,
బి. ఏ., యల్. టి.



శ్రీమతి బి. వి. సుబ్బమ్మగారు



డాక్టరు జ్ఞా సతిగారు,
యం. బి., యఫ్. ఆర్. సి. యస్. ఇ.

౧

జిలుఁగుపటముల సోగకుచ్చియల కొనల
విసరి చిత్రించికొంటిఁ డీవియల కదుపు-
అది చెలఁగి పూవుటీరాల నల్లునెపుడు!
కోరిమెత్తని బెండురేకుల నమర్చి
మురువుమైఁ గట్టికొంటిని పూలగుత్తి-
యదియుఁ బుఁకించి నెత్తావి యలము నెపుడు?
మలచి తెలితళ్కు లీనెడు చలువఱాలఁ
గీలుకొల్పితి జవరాలి కీలుబొమ్మ-
అది నగవుపూతఁ బెదవులఁ గదపు నెపుడు?
ఆసపడి యూర్పుబిగఁబట్టి యందునందు
దీని వెన్నంటి వనభూమిఁ దిరుగుచుంటి
మధురగతి నీ పికమ్ము మర్మమ్ము విడిచి
పలపలని సంగతులు దూఁగఁ బాడు నెపుడు?
కనలు నాఁకటఁ దడవాలు గదరఁ జెదరి
మదముఁ గొని ఱేఁగు గండుతుమ్మెదను గదిసి
యాశ్రయించితిఁ గేల్సాచి—యది కరంగి
పుడిసిటను దేనెధారలఁ బోయునెపుడు?
ముద్దుటడుగుల రాయంచ మురువుఁజూచి
యాదటను గన్నుఁగవ చెవులంట విప్పి
వేచికొనియుంటి—నది తెక్కవిఱుపులురల
భరతసౌభాగ్యమును గనఁబఱచు నెపుడు?
ద్వంద్వభూయిష్ఠమై మాయఁ బట్టువడ్డ
ప్రకృతి నేనాశ్రయించి రే బవళు లనక
వేచియున్నాఁడ—నది నిజవృత్తిలోన
నిర్మలానందలేశమ్ము నిలుపు నెపుడు?

౨

జగము సొగసుల క్రొందళ్కు నిగనిగలను
పగటఁ గన్గొనలేక రెప్పలనువాల్చి
మరలఁ గన్నులు విప్పదు మాపులోన—
శాంతివిదలించి తొంటి చంచలతఁ గూర్చుఁ
జీఁకటిపటానఁ జుక్కల చిత్తరువులు!
చప్పుడేలేని యీ రేయి చాయలోనఁ
బొదవికొందును డెందంబు కదలకుండ-
అదను కనిపెట్టి నిలుకడఁ జెదరఁగొట్టు
పండుటాకుల కడసారి పలుకుములుకు!
ప్రేమపాశాల విదలించి, విరిసికొన్న
రేయితెక్కల నొదిగి నిద్రించుచుందు
లేపి కుదిలించి నన్నుఁ ద్రుళ్ళించివైచుఁ
గలఁ గలంగిన యేట్రింత కలవరింత!
క్షణవిరామమ్ములేక నిచ్చలుఁ జలించు
వెలుఁగునీడల మెలిగొన్న యలఁతి జగతిఁ
దవిలి తిరుగాడు వెఱ్ఱిడెందంబు నిలువఁ
దూలిపోవని శాంతిపథాలు గలవె?

౩

కఠినపాషాణమంటి వెన్కకుఁ దొరంగి
పడి, చివాలున నట్టిట్టు ప్రాఁకులాడు
సెలఁ గనుంగొని కన్నులు చెమ్మగిల్ల
వేడియూర్పులు వెడలఁ గంపించినాను!
అలలమడతలు వడిఁ జరియలఁ జలింప
గాలి శ్రుతిఁ గల్పి పిల్లగీతాలఁ బాడి
దొరలు సెలయేటినడకల మురువుఁ జూచి
నటన మాడితి నిర్మలానందవశత
నలయ నెమ్మేను, చెమ్మట లొఁసిజార!
మూఁగమై సోగరేకుల మొనలఁ దొడఁకఁ
బ్రొద్దుప్రొద్దునఁ గన్నీటి బొట్లరాల్చు
మల్లెపూఁజూచి డెందంబు జల్లురనఁగ
జాలిపడి కంటఁ దడిపెట్ట సాగినాను

కౌమరుపాయంపు పమ్యెర కుఱ్ఱవాని
జిలుఁగుకౌఁగిటఁ బలకించి వలపు లొలుకఁ
గలకలలనించు మల్లెమొగ్గలను గాంచి
మేలుమేలని తలయూఁచి మెచ్చినాను

నిడుదలైతూఁగు చిక్కని నెరులకొనలఁ
దుంటరితనాన సంజెను దుడిచివైచు
రేఁగుచీఁకటి డెందంపు రేయివంక
విన్నఁబాటునఁ గన్నులు విప్పలేక
యదరి నిద్దురకై దేవులాడినాను!

వగచు పులుఁగుల నోదార్చి, వడలు పూల
సేదఁ దేరిచి, నిలువెల్ల జేవురించు
సంజె డెందానఁ జక్కని శాంతినిలుపు
రేయిఁ గన్గొని కర మాదరించినాను!

అలుకకులుకులఁ దలపోసి నంతలోన
సృష్టినెలకొల్పు నిజబుద్ధి వృత్తినంటి
వెనుక ముం దాడు బొమ్మ యీ వెఱ్ఱిమనసు
తవిలి నిలువంగ శాంతిపథాలు గలవె?

౪

ప్రొద్దు తొలిజాము మిన్నంటిపోవువేళఁ
బసఁ దొరంగిన పుష్యంపుఁ బసక నేలఁ
దడవులాడుదు మంచు ముత్యాలకొరకు—
సంజె ముడివడి చీఁకట్లు సాగువేళఁ
గూర్కు జలజాకరము గట్టుఁకొనకుఁ బ్రాఁకి
తారులాడుదుఁ బద్మగంధంబు కొరకు—
బ్రమసి యొక్కెడ, రుచుల మరంగి యొకట
ననుభవాకాంక్షఁ దగిలి మోహమున మునిఁగి
వెరవెఱుంగక కొట్లాడి విన్నఁబోవు
సమయమెఱుఁగని కోర్కుల సంత, మనసు!

౫

తెరలు నీలంపుముక్కల తెగువఁ బాఱు
నీటికెరటాల నిలుకడ నెగడదంచు
నలుక నెక్కొన విసవిసలాడినాను-

పండువెన్నెల రేకల నిండువెలుఁగు
టందమును గారుచీఁకటు లంటెననుచు
విసువుదలతోడ బొమముడిఁ బెట్టినాను-

విడిన మెత్తని దిరిసెన విరుల నొరసి
చిరిపిగాలులు రాపిడి సేసె ననుచు
మీసములు రోసమున నెగమీటినాను-

ప్రకృతి నడిపించు కార్యకారణము లరసి
సత్యమెఱుఁగక యూరక జాలిఁదూలు
వెఱ్ఱిమనసును శిక్షించు విధులు గలవె?

౬

చివురుటాకుల కసిఁ దిని జిలుగుపాట
బ్రతుకు కోకిలఁ జిఱుతాలఁ బారఁదోలి
గునియు లేమావికొమ్మల దనిమి తెచ్చి
దుడుకుఁదనమునఁ గట్టితి తోరణములు-

అలరు రేకుల తేనెచెమ్మలను నాకి
కుప్పిగంతుల నిడి యాడికొనెడి తేఁటి
బెదర నదలించి క్రొవ్విరి చిదిమితెచ్చి
తొడరి ప్రియురాలి జడలోనఁ దురిమినాఁడ-

ఫలరసం బంటి నిలువెల్లఁ బులకలెత్త
నర్థమేలేని పలుకులనాడు చిలుక
సగము కొఱికినపండు మోసమునఁ దెచ్చి
తరుణ మెఱుఁగక గూటిలోఁ దాఁచినాఁడ-

గడపఁ దోరణ రాగమ్ము కగ్గిపోయె
కురులనీడను పూరేకు క్రుంగిపోయె-
గూటిలోఁ బండు తీయనఁ గోలుపోయె-
మురిసి విరిసిన డెందంబు ముడిఁగిపోయె-

౭

వ్రేలికొనఁ జెందిరపుఁగావి చాలదంచుఁ
బాటమరించిన చివురాకు పొత్తికలను
సన్నెపైనూరి గోరంట చాదినాను
తెచ్చఫడు చెట్టుకొమ్మ గుర్తింపనైతి-

ఒడలఁ గమ్మని తావులు వెడలవనుచు
విడిన పూవుల క్రొందళ్కు వడల బిడిచి
జిలుఁగుఁపన్నీట జలకమ్ము సేసినాను
ఱిచ్చపడు చెట్టుకొమ్మ గుర్తింపనైతి-

చెవులఁదీయని పలుకులు చేరవనుచు
చిన్నివన్నెల మురిపెంపుఁ జిలుకకొదమఁ
బట్టి పంజరమున మూఁతఁ బెట్టినాను
ఱిచ్చపడు చెట్టుకొమ్మ గుర్తింపనైతి-
సహజసౌందర్య సౌభాగ్య సంపదలను
జెలఁగు జగమున నేనేడ? జిలుఁగులేడ?

౮

ఈభరద్వాజ ఖగము మహీజశాఖ
నింత నడురేయికడ గళ మెత్తి పాడఁ
గడఁక నా డెంద మొక్కటే కరఁగునంటి-

ఈ గభీరనిశాశాంత హృదయ మదరి
కరఁగి పలపల రసతరంగములగములు
పొరలఁ బొరుట మదిఁ దలపోయనైతి!

జాలువారెడు నేటి వసంతవేళఁ
గ్రాలు మరుదంకురమ్ముల కౌఁగిలింతఁ
గెరలి నామేనె తగఁ బులకించునంటి-

మోడువారిన యీ మావి బోదెకొమ్మ
చెలఁగి నూతన జీవంపు చిలుపలూరఁ
బొటమరించుట మదిఁ దలపోయ నైతి!

ఈశరద్రాత్రి బ్రహ్మాండమెల్ల నిండు
పండువెన్నెల నవ్యశోభలను గాంచి
నేనె యానందబాష్పాల నింతునంటి-

సహజకాఠిన్య మెడల నీచలువఱాలు
నిగ్గుచెక్కులనంటఁ గన్నీటి ముత్తె
ములను రాల్చుట మదిఁ దలపోయనైతి!

సహజసుకుమార హృదయ మీజగమునిండు
నురువులేడ? మదీయానుభోగమేడ?

౯

ఈ పొలంతి లతాతన్వియే యటంచు
నామె కురులను నూత్నలతాంతములను
దుఱిమి కన్నీట రచియింతు దోహదమ్ము
పెన్నెరులలోనఁ గలకల విడునెపూలు?

ఈ పడంతుక వనబోడియే యటంచు
నామె నెమ్మేనఁ గింజల్క మలఁది, కనుల
తేఁటికొదమల నందందుఁ ద్రిప్పుచుందు
రెప్పకదలికఁ బుప్పొడి రేఁగి పడునె?

ఈ వెలఁది పూర్ణచంద్రాస్యయే యటంచు
నామె చిఱునవ్వురేకఁ బ్రేమామృతమ్ముఁ
జిలికి సౌధాగ్రమున నెలకొలుపుచుందు
చిఱునగవురేకఁ జలువఱా ల్చెమ్మగిలునె?
ప్రకృతితత్త్వము మారునే భ్రాంతిలోన!

౧౦

సంగతి మెలంగి నా యంతరంగ మెఱిఁగి
కోరికొమ్మల కడ గుసగుసలు వోవు
నీ తఱపి గాలి ననుగూర్చియే సతమ్ము
నింగిపై కెక్కె యిటునటు తొంగిచూచి
మృదుకరమ్ముల బూచేడి మేలుకొలిపి
రిక్క ననుఁ జూపి కనుగిల్పి వెక్కిరించు
అనువెఱింగి యీ నిశాకృశాంగి నన్ను
వెనుకపాటునఁ గికురించి, వెడఁదకనుల
నీలికోక చెఱంగుపింజెలమూయు (?)
వెఱ్ఱినై సృష్టిఁగప్పు నవిద్యఁదగులు
జీవిఁగని సృష్టి యెగతాళి సేయకున్నె?

౧౧

నాదుడెందంబు విడిన కెందామరేని
పూర్వవాసన వెన్నంటి పోవనేల?
నాపలుకు లమృతధారలఁ జేఁపునేసి
నోరఁగు పూఁదేనె కువ్వాళు లూరనేల?

నా మొగము పున్నమపు చందమామ యేని
నవ్వు వెలుఁగున కింత యానంద మేల ?
నేను ప్రకృతి నెఱింగిన జాణ నేని
నులుకు కులుకుల నయ్యాల లూఁగ నేల ?

౧౨

క్రమముగాఁ జేవ లెక్కి విరాగి యైన
మావిచివురాకుఁ గన్గొని మానియగుచు
దేశదేశాలఁ గొనకొని దిమ్మఁ దిరుగు
పికము లాలించి చివురాకుఁ బెట్టు నెవఁడు ?

పాడువారిన గూఁటిలోపలను గరఁగి
యొరయు గళమెత్తి జాలి నోసోసి యనుచు
మూఁడుప్రొద్దుల నొంటి వాపోవు గువ్వ
నాదరమ్మున నోదార్చ నరుగు నెవఁడు ?

జిలుఁగు జవ్వనమునఁ గ్రొత్త వలపులెల్లఁ
గ్రోరి గాలికిఁ బెట్టి సంకుచితవృత్తి
నేడు తలవంపులను వసివాడు సుమము
నింత గిలిగింత లిడి నగియించు నెవఁడు ?

తనకుఁ దానయి మాయలఁ దగిలి నొగులు
వెకలి సుఖదుఃఖములఁ గనిపెట్టు నెవఁడు ?

---

## ఉద్బోధ

వెలువోలు వసంతాదేవిగారు

నీ రమణీయజీవిత వినిర్మల భోగము లెల్ల వీడఁగా
గోరఁగ లేదు; ప్రాణము లకుంఠితయుద్ధమునం ద్యజింపఁగాఁ
గోరఁగ లేదు; బీదలకుఁ గూడు నొసంగఁగఁ జాలు ఖద్దరున్
ధారణ మింతఁ జేయు మనఁ దర్కము చేసెద వేల సోదరీ ?

క్రించుతనంబు మాని పరికించుము దేశపు నాఁటి నేఁటి తీ
రించుక, ఫ్రాన్సు దేశమున కేగెడి నీ మజిలీ లవేశ ! నీ
కొంచెపు దంతపుంబరిణఁ గూర్చెడి చీర లవేడ ! నీవిధిన్
వంచితవయ్యు నింత బలవంతపు పంత మదేల సోదరీ ?

దినదినమున్ దరిద్రదశ తీవ్రత దాల్చుచు దేశనాశభీ
తిని జనియింపఁ జేసెడిని; తీరికగల్గిన వేళలందు ఝు
మ్మని మధురస్వరంబు లొలయన్ భవదీయ కరాంగులీవిచా
లనమున శోభ లొల్కఁగను, రాట్నము త్రిప్పగ రాదె సోదరీ !

ఏల వృథావివాదము లహీనవిధమ్మున నీ యమూల్యమౌ
కాలము వెళ్ళబుచ్చెద వఖండఫలప్రదకార్యదీక్షలం
దేలిన నీదుపూర్వ రమణీమణు లట్లు మెలంగుచుండినన్
మేలగుఁగాదె ! యిట్టి మిడిమేలపు జీవనమేల సోదరీ !

అంత మహాత్ముఁ డా వయసునం దటు గ్రీష్మమునందు నాంధ్ర దే
శాంతము దాఁక మీకు నయి యట్టి ప్రచారము చేసిపోయె; నీ
కెంతటి జాలిగుండె గలదే ! ధరియింపవు ఖద్ద రెప్డు నీ
వింత తెలుంగు మాని కనవే ! కరణీయము వేగ సోదరీ !

---



శ్రీ డబ్ల్యు. ఏ. ఆర్యదాసుగారు



ఆర్య వైశ్యాభివర్ధనీసంఘము, మదనపల్లె



విమెన్సు ఇండియను అసోసియేషనువారు
రైటు ఆనరబుల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారికి స్వాగతము చెప్పుట



శ్రీ [illegible]ంకాల వేంకట సుబ్బారావుగారు, భీమవరము

## శ్రీ యం. ఆర్. శాస్త్రిగారు–నటకులు, తత్పాత్రములు



దుర్యోధనుడు (పార్సీపద్ధతి)



శ్రీరాణా రాజసింహ (రాజపుత్రయోధుడు)



పార్సీయువతి



దేవయాని

# యోగ వ్యాయామ శాస్త్రము

వ్యాయామప్రవీణ బులుసు రామభోగ రావుగారు

యోగమను మాటకు అర్థమేమి? ఎవడు యోగి? ఒక వస్తువుతో ఇంకొక వస్తువుకాని, కనుపడువస్తువులో కనుపడని గుణరూపముగనున్న పదార్థాధారమూలతత్త్వముకాని కలిసి యుండుటయే యోగ మనిపించుకొనుచున్నది.

ఇక యోగినిచూతము. పై రెండును సమత్వము వహించి యున్నవా లేవా? అని తెలిసికొనగలవాడే యోగి. ఇది సాధారణార్థము. దీనినే విపులముగ మనఋషులు మునులు, యోగులు, మొదలగువారు తెలిసికొని ఆచరించి ప్రపంచమునకు తేట తెల్లము తెలియజేసిరి. యోగమును గురించి కొంచెము విచారింతము:—

మనోబుద్ధి చిత్తాహంకారములను నాలుగు గుణతత్త్వపదార్థాధారాధిష్ఠాన దేవతలు. ౧. దేహము నాశ్రయించియున్న మొదటి తన గుణతత్త్వమే మనస్సు. ఇదియే అవినాభావసంబంధముతో ఉన్న బాహ్యదేహోన్మ రూపమున ప్రత్యక్ష మగుచున్న భిన్నభిన్న పదార్థాణు స్వరూప తేజస్విని గ్రహించుచున్నది. ౨. బుద్ధి:-ఇదమిత్థమని వస్తుతత్త్వమును గ్రహించి నిర్ధారణచేయునదే బుద్ధి. 3. చిత్తము:-కావలెననునది చిత్తము. ౪. పనిచేయునది అహంకారము. అహంకారము ద్వివిధము. వస్తుతత్త్వ నిరూపణచేసి, వస్త్వాధార సంబంధములను బలపరుచువాడు భౌతికాహంకారుడు. అణుపరమాణు పరిణామాంత్య సంస్కారాతీతుడే ఆధ్యాత్మికాహంకారుడు. ఇట్టి స్థితిలో యోగాభ్యాసపరుడెట్లు చరించి వ్యాయామము చేయగలడు?

పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, అను ఈదశేంద్రియములను కట్టివైచి హంసనిరోధము కావింపవలయును. దీనికి శరీరమందున్న మూలాధారము మొదలు సహస్రారమువరకును గల షట్చక్రములను స్వాధీనపరచుకొని ప్రాణవాయువును పూరించవలెను. ఇట్లు పూరించుటకు ముందు ఊపిరితిత్తులలోగల అపరిశుద్ధ వాయువును పైకి పంపుచుండవలెను. అటుతరువాత మరల మరల పూరించి, కుంభించి, రేచించుచుండవలెను.

## సక్రమ ప్రాణాయామము

మంచిగాలి వాటముగల నిర్జనప్రదేశమున కాలకృత్యములు తీర్చుకొని పరిశుద్ధాంతఃకరణముతో సుఖాసనమున కూరుచుని ప్రాణాయామాభ్యాసము చేయుము. సాధ్యమైనంత మట్టుకు దర్భాసనముపై వ్యాఘ్రాసనము కాని ఏణాసనముకాని వేసి పైచిత్రాసనముపరిచి స్థిరచిత్తతతో కూరుచుండుము. వెన్నువంచక సుఖాసీనుడవైయుండి చేతి మణికట్లును మోకాళ్ల చివరచిప్పలపైనుంచి కుడి ఎడమచేతులు వెన్నుకు దాపుచేసి తిన్నగ కూర్చుని యుండవలెను. ఇటుల ౧౦, ౧౫ నిముషములవరకు ప్రతిదినము ఏకాగ్రతగొని నిమీలితలోచనములతో (సగము మూసిన కండ్లతో) భ్రూమధ్యదృష్టినిల్పి (కనుబొమలనడుమ) ఉచ్ఛ్వాసనిశ్వాసముల నాపి గురుపాదములను ధ్యానించుచుండవలెను. అటు వెనుక (3 మాసముల తరువాత) తగిన గురునికడ ప్రాణాయామాభ్యాసము చేయవలయును.

## ప్రాణాయామ విధి

కుడి ముక్కురంధ్రముపై కుడిచేతి బొటనవ్రేలినుంచి ఎడమ ముక్కురంధ్రము ద్వారా గాలిపైకి చెవికి వినబడనంత మెల్లన విడిచిపెట్టవలెను. ఆవెనుక, ఆరంధ్రము ద్వారానే ఒకటిమొదలు నాల్గు వరకు శాంతముగ లెక్కపెట్టుటకు కావలసినంత కాలము పర్యంతము లోలో "ఓం"కారము నుచ్చరించుచు ప్రాణవాయువును పూరించి తర్జని, మధ్యమవ్రేళ్లతో యెడమముక్కు రంధ్రమును లెస్సగ బిగించి రెండు (౨) లెక్కపెట్టుటకు కావలసినంత కాలముదాక లోపల ఓంకారమును జపించుచు, పిదప యెడమముక్కు చరముపై ఆనియున్న వ్రేళ్లను వదల్పక కుడిచరముపై ఆనియున్న బొటనవ్రేలిని మెల్లన తీయుచు, చెడ్డగాలిని పైకి పంపుచుండవలెను. ఈ పంపునపుడు నాల్గు లెక్కపెట్టుటకు కావలసినంత కాలమును మాత్రము వినియోగించవలెను. వెనుక రెండు లెక్కపెట్టుటకు కావలసిన కాలమువరకు విశ్రాంతి తీసికొనవలెను. ఇటులు సక్రమముగ చేయుదానికే ప్రాణాయామని పేరు. ఈవిధముగ (౨౫) ప్రాణాయామములు చేసినచో ప్రతిదిన కార్యసిద్ధి కాగలదు.

## వ్యాయామము

వ్యాయామము వ్యాధిని దేహములోనికి చొరనీయదని పెద్దలు చెప్పినవాక్యము నాయనుభవముచే తెలిసికొన కలిగితిని. నేనీవాయు విషయములలో ఇంచుక నావ్యక్తికి సంబంధించినను అనుభవమును

తెలియజేయుచున్నాడను గాన చదువరులు మన్నింప ప్రార్థితులు— నా ౧౦ వ సం॥ములో వ్యాయామమును ప్రారంభించి, స్వగ్రామము విశాఖపట్నము జిల్లా, విజయనగరం తాలూకాలో చేరియున్న గరికి వలస అగ్రహారంలో నాకు ౧౨ వ సం॥ వచ్చువరకు నాతలిదండ్రుల దగ్గరనే పెరిగి పిమ్మట ఆంగ్ల విద్యాభ్యాసమునకై మాజిల్లాలోనున్న "పాలకొండ" తాలూకా డిటోగ్రామములో మా మేనత్త గారి యింటివద్ద కాపురముండవలెనని మా మాతాపితరులు నన్ను అచటికి పంపివేసిరి. అప్పటికి నాకు ౧౨ సంవత్సరముల ప్రాయము. నావిద్యాభ్యాసదినములలో పాఠశాలలలో ననుదినము గజపు సాధారణ వ్యాయామ శిక్షకునివద్ద వ్యాయామాభ్యాసము చేయుచు ఇంటికివచ్చిన పిమ్మట మరల దండెములు, బస్కీలు తీయుచుండెడివాడను. ఈ సూక్ష్మ స్వీయచరిత్రయే నావ్యాయామ విద్యానిపుణతకు దోహదమై నాయిప్పటి పరిపూర్ణ యౌవనమునకు కారణము. కాని, వేఱొద్దియును కాదు. నేనెన్ని దేశములకు వెళ్లినను, సముద్రయానములు విశేషముగ చేసినను శైత్య పైత్య బాధలులేక దివ్యరూపముతో నున్నానని నాసోదర, సోదరీమణులకు ఆదర్శమును చూపవలసి వచ్చుచున్నది. కృత, త్రేత, ద్వాపరయుగములలో, పరశురామ, రామ, కృష్ణాదులందరును యోగవ్యాయామాభ్యాసము జేసి అనేకవత్సరములవరకును జీవించి లోకోపకార మొనర్చియుండిరి. వారి సంతతులకు చెందిన మనముమాత్రము వ్యాయామము నుపేక్షించి రోగజరామరణములకు లోనై బానిసలముగ నుండవలసివచ్చినది.

అన్ని దేశములలోను వ్యాయామము మిన్నెక్కి ప్రతిధ్వనించుచుండ భారతీయులేల వ్యాయామాభ్యాస మొనర్చి బలవంతులై దేశాత్మరక్షణలకు తోడ్పడరు? జాలము వలదు లెండు! కసరత్తుచేసి రజోవీర్యములను అభివృద్ధిచేసికొని మంచి శరీరకులగుచు దేశదాస్య శృంఖలములను త్రెంపివేయుడు. భారతవీర కుమారవర్గములారా! నిద్రకిది సమయముకాదు. తెల్లవారినది. నిత్యకృత్యములకు యోగవ్యాయామము ప్రథమసోపానము. మీ మేడకు మొదటిమెట్టు కసరతు. శరీరము కసరతుచేయనిది చురుకుదనము కలిగియుండదు. చురుకుదనము లేనిది బుద్ధివికాసము కలుగదని నాయనుభవము. కసరతుచేయని మేధావుల విషయమయి మీ రేమనెదరని యందురేమో? కసరత్తు చేయని వట్టి మేధావుల మేధస్సు తమకుగాని, దేశమునకుగాని ఉపయోగపడదని నాయనుభవమే సాక్షి. ఒకవేళ వృథా మేధావు లుండినను వారు మేధా దక్షిణామూర్తికి దక్షిణలకే కాని దేశస్వాతంత్ర్యరమాకాంతోపాసనార్హులు కాజాలరని నాదృఢవిశ్వాసము. చేతనరహితులు దేశదారిద్ర్యమును పోగొట్టలేరు. కాన యువకులారా! యువతులారా! బాల బాలికలారా! గ్రామగ్రామమునందును యోగ వ్యాయామశాలలను, తాలిముఖానాలను ప్రతిష్ఠాపించి ఎల్లరకును వ్యాయామము, సాము, కత్తి, ఈత, సూర్యనమస్కారములు, యోగాసనములు, కుస్తి ముష్టియుద్ధము మొ॥ సమస్తమైన వీరకళలను నేర్పింపవలయును. రాజకీయములవలన కాని, కేవలసాహిత్యమువలనగాని, భారత స్వాతంత్ర్యదీక్ష కుదురదు. యోగవ్యాయామరణభేరి దశదిక్కులయందును మ్రోగించు భారము జిల్లా, తాలూకాధికారుల చేతులలో నున్నది. వారు మేల్కొని వారివారి గ్రామాదులలో పాఠశాలతోపాటు వ్యాయామము నిర్బంధము చేయింపగలరు. ఓం ఓం ఓం.

---

# కృష్ణరాయల పరిదేవనము

కాళ్లకూరి గోపాలరావు గారు

నిదురం బోయెడి నన్ను మోసముగ బంధీభూతుఁ గావించి, నో
రదుమం బట్టి, బలాత్కరించి యిపు డేలా తెచ్చినా రీడ? కే
యదనన్ మీ కపకారిఁ గాను గద? ద్రవ్యాపేక్షమైఁ జేసినన్,
మదలంకారము లెల్ల నిత్తుఁ గొనుఁడీ! మానంబు గాపాడుఁడీ!

* * * * * *

కనులం దీసెదరా? నృపాలకుఁడె యాజ్ఞాపించెనా? నమ్మఁజా
లను! దుర్మంత్రముచే మహీశుఁ డొకవేళన్ గోపముం జూపినన్,
మన సెట్లొప్పును ఘోరకర్మ మొనరింపన్ మీకు? రాజాజ్ఞ యెం
దును దుర్లంఘ్యమ యందురేని, యిదె నన్ ద్రోఁపుఁడీ వేఁడెదన్!

కన్నులు ముఖ్య మింద్రియనికాయమునం; దవి లేని మేను లే
కున్నను మేలు; తక్కినవి యుండియు నేమి ప్రయోజనంబు? తా
మన్నియు నేక మైనను, పరాశ్రయదుఃఖముఁ బాపనోపునే?
కన్నులు లేనియంతనె జగంబు సమస్తము లేనియట్లగున్!

* * * * * *

ఈ యకార్యంబునకు సాహసింప నోడి-క్రూరతీవ్రాగ్ని గ్రక్కెడి కాలు కూడ
క్రొన్నివురు ముసుం గిడుకొని కుములఁజొచ్చె;-ఏల యెంత వేఁడిన మీరు జాలిగొనరు?

* * * * * *

నయనోత్పాటన మెట్లుఁ దప్పదు; వృథా నా కేటికీ చింత? దు
ర్ణయ మైనన్, దుద కాత్మహత్యయె శరణ్యం బంధతాకష్టసం
చయమున్ బాపుకొనంగఁ; జావునకు లేశంబున్ విచారింప; ని
శ్చయ మెప్పట్టున నైన మృత్యు; వయినన్, స్వాంతంబు క్షోభిల్లెడిన్!

నాదెల్ల చిటిగంగన ప్రధానామాత్యు కల్పకతుల్యసంకల్పబలము
సాళువ తిమ్మరుసు సచివాగ్రగణ్యుని ఘనత గన్న ప్రయోగకౌశలంబు
ఆదిమసంస్థాపనాచార్యుఁ డైన విద్యారణ్యమునివర్యు నంతరాత్మ
ద్రవిడకర్ణాటవిప్లవ మడంచిన నాఁడు జయలక్ష్మి యిడిన యుత్సాహశక్తి
ఒక్కొకటియు నన్నియు నన్నుఁ బ్రోత్సహింప-విజయనగర సామ్రాజ్యంపు విస్తృతికయి
కంకణము గట్టుకొంటి; నక్కట! మదీయ-జీవితం బింతలో నిట్లు పోవఁదగునె?

శ్రీ కాకుళాంధ్రదేవా! కృపానిధి! నీ యనుగ్రహంబున కేని నోఁచనైతి;
ఓ దేశమాత! తాపోపశాంత్యర్థము కుతుకంబుతో నిన్నుఁ గొల్వనైతి;
హా! పితృకల్ప! తిమ్మరుసుమంత్రివరేణ్య! నీ ఋణంబును దీర్ప నేరనైతి;
ఆంధ్రవాణీ! నిన్ నిరంతరార్చనముల శిష్టు లౌ నన నుపాసింపనైతి;
నన్ను నమ్మిన ప్రజలార! నా యనుంగు-విహితులార! మీ కేమి గావింపనైతి;
ఆశ లన్నియు నడుగంటె వ్యర్థ మయ్యె; ఒక్క క్షణమును గ్రుడ్డినై యుండనోప!

*　*　*　*　*　*

నీ యనుజ్ఞ గొనక నీపూర లేసిచో-వేఁట కేఁగి యచట విశ్రమించి,
తేని కుట్ర కేను లోనైతి; నప్పాజి!-యెంత దుఃఖపడెదొ, యిది యెఱింగి?

(తిమ్మరుసునాటకమునుండి)

---

## సత్యనారాయణా!

పి. చిదంబరశాస్త్రిగారు

నీ కళ్యాణగుణంబు లెన్నుకొనుచున్ నీపేరు పేర్కొంచు నీ
శ్లోకంబుల్ పఠియించుకొంచు లవమున్ శోకంబు లేకుండ నే
నేకాలంబున నుండునట్లు దయతో వీక్షింపు మన్యంబు ని
న్నాకాంక్షింపను దండ్రి! రత్నగిరిధామా! సత్యనారాయణా!

నీపాదంబులు గొల్చు సేవకుల సాన్నిధ్యంబు నీయద్భుత
వ్యాపారంబుల నెన్ను భక్తుల సహావాసంబు నీసద్గుణా
లాపంబుం బొనరించు సుక్షేత్రముల సల్లాపంబు నా కబ్బన
ట్లెపట్లం గరుణింపఁగాఁగదపె తండ్రీ! సత్యనారాయణా!

మరణంబుల్ జననంబు లెన్నియును సంప్రాప్తింపఁగాఁ జేసినన్
సరియే యేభువనంబునం దునిచినన్ సంతోషమే కాని త్వ
చ్చరణధ్యానముమాత్ర మెల్లపుడు నాస్వాంతంబునం దెంతయున్
స్థిరమై యుండ ననుగ్రహింపుము కృపాబ్ధీ! సత్యనారాయణా!

కాయంబున్ వచనంబు మానసము నిన్ జెప్పఁగా నేటికిన్
నాయాత్మన్ నయితంబు నీకొసఁగితిన్ నాచేత నీ వేవిధిన్
జేయింపం దలపెట్టికొంటి పటులే చేయింపు మేదేనియున్
నీయాజ్ఞాచరులందు నే నొకఁడఁ దండ్రీ! సత్యనారాయణా!

మతిలో స్థైర్యము లేక సారె కిటు సంప్రార్థించుటేకాని సం
తత మీ విశ్వము లెల్ల నీకడుపులోనన్ బెట్టికొంచున్ మహా
దృతితోఁ బ్రోచుచునుండు నీ వొకని న న్నేతాదృశున్ బ్రోవవే
గతభేదా! కరుణాసమంచితకటాక్షా! సత్యనారాయణా!

---

యామాసా మాయా

## మాయాచక్రము

బుక్కపట్టణము-రామానుజయ్యగారు

శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఒర్జున, తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.

(భగవద్గీత అధ్యా. ౧౮, శ్లో. ౬౧.)

"యా-మా-సా-మాయా"

టీ. యా=ఏది, మా=లేదో, సా=అది, మాయా=మాయ.

లేనిదానిని ఉన్న దని భ్రమించుటయే 'మాయ' యనుట.

(అనులోమవిలోమములుగా ఎటు త్రిప్పి చదివినను చదువనగును.)

# భగవత్ప్రార్థనము

తోడూరిలక్ష్మీ నరసింహారావుగారు

ఉ. ఎవ్వఁడు వత్సలత్వమునఁ బృథ్వి శిలాతలిఁ గప్పఁ బెంచువాఁ
డెవ్వఁడు గర్భగోళమున నెంతయుఁ బ్రేమను బిడ్డఁ బెంచువాఁ
డెవ్వఁడు నీట జంతువు లనేకములం దయతోడఁ బెంచువాఁ
డవ్విభుఁ డిచ్చుఁగాతఁ బ్రియమారఁగ మాకును భాగ్యభోగ్యముల్.

ఉ. ఎవ్వని యల్కఁజేసి ఖలులెల్లను దామ వృథా ప్రయత్నులై
యవ్వల మానహాని విపదంబుధిలోపల మున్గుచుండు వా
రెవ్వని ప్రేమచే సుజనులెల్ల విపద్ఘనవార్ధి దాఁటి తా
మవ్వల సౌఖ్యముల్ గనుదు రవ్విభుఁ డిచ్చుత శోభనంబులన్.

ఉ. ఎవ్వఁడు సర్వమానవు లొకింతయునైనను దెల్విలేక తా
మివ్వసుధ న్నిశీథ మొడ లేమియెఱుంగక నిద్రపోవుచో
మవ్వపుఁ దల్లి వోలెఁ బెరిమం దగమేల్కని వారిఁగాచువాఁ
డవ్విభుఁ డొక్కఁడే మనకు నయ్యెడు గావుత రక్షకుం డిలన్.

ఉ. నమ్మను దల్లిదండ్రులను నమ్మను భార్యను నమ్మఁబుత్రులన్
నమ్మను గూఁతులం జెలుల నమ్మను నమ్మను దోడఁబుట్టువున్
నమ్మను అత్తమామలను నమ్మను బావమఱందులన్ ధరన్
నమ్మను నేలఱేఁడులను నమ్మెద నిన్నెద దీనరక్షకా!

ఉ. కన్నులు గల్గి యంధులిలఁ గాయము గల్గియు శూన్యులే సుమీ
యెన్నఁగ ముక్కుగల్గియు నిలేశులు ముక్కిడు; లయ్య; కర్ణముల్
పన్నుగఁగల్గియుం జెవిటివారలు, జిహ్వకగల్గి మూక లా
పన్నశరణ్య, దేవ, కొలువందగు భర్తవు నీ వొకండవే.

చ. తనతన యున్నతంబయిన స్థానముఁ గన్గొని తద్దపెద్దయా
తనతన సంపదం గనుచు దారసుతాదులఁగంచు నెంతయున్
మనమున గర్వమంది కడుమాన్యులనున్ నిరసింతు రక్కటా
జనవరు భృత్యులం గొలువ సర్వసమా! మది నిన్నె గొల్చెదన్.

ఉ. కష్టములోని మానవునిఁ గన్గొనఁ డెవ్వఁడుఁ, గాంచునేనియున్
సుష్ఠుగఁ జేయువాఁడ నిదె చూడుము నీదగు కార్యమంచుఁ దా
దుష్టత వాని ద్రవ్యమును దోఁచుటె కాక ఫలంబు సున్న యాఁ
గష్టముఁ బాప నీవొకఁడకావె కృపామతి, యార్తరక్షణా!

ఉ. ఒల్లను గాపురంబు గృహమొల్లను బెండ్లము నొల్లనింతయే
నొల్లను దల్లిదండ్రులను నొల్లను బిడ్డల నిశ్చయంబుగా
నొల్లను దోడఁబుట్టువుల నుర్విన ధర్మము లెల్లఁ జూడఁగా
నుల్లము నిన్ను జేరుటకె యాలొక నుచున్నది లోకనాయకా!

చ. పడితిని బెక్కుఁ గష్టములు వానిని వర్ణనచేయఁ జాల నేఁ
బడయఁగ నున్నవింక బహుభంగుల కష్టము లోర్వనోప నేఁ
బడితిని నీదుపాల నను బాలను ముంచెదొ నీట ముంచెదో
కడువడి లోకనాథ నను గావఁగ భారము నీదియే సుమీ.

చ. ఇది కడుమంచియంచు నిది యెంతయుఁ జెడ్డయటంచు నెంచఁగా
మదిని సమర్థుఁడన్ విను మ మర్త్యుఁడ మందుఁడ బుద్ధిహీనుఁడన్
సదయుఁడ వౌచు నీవ కడుసమ్మద మారఁగ నిశ్చయించి నా
కిదిహితమంచు నన్నడుప నెన్నెడు భారము నీదె యీశ్వరా!

చ. పరులను నమ్మినం ధరణిఁ బౌరుషముల్ బలహీన మౌటచే
వరమగు కార్యజాలములు వమ్మయిపోవును గావునం బరా
త్పరుఁడవు నిన్ను నమ్మెదను పౌరుషముల్ ఫలియించు టెల్ల నీ
కరుణను గాదె పౌరుషము కంటెను దైవము యెక్కుడౌఁగదా.

చ. సమయము భక్త కార్యమును జక్కఁగఁ జేయఁగ నిప్పువచ్చె నీ
సమయము దప్పెనేఁ జెడును సర్వజగత్ప్రభువా, మదీయ కా
ర్యము తగ నేరిచేతను దిరంబుగఁజేయఁగఁ జేసె దట్టి వారి
మదిని జొచ్చి చేయఁగదె శ్రేయము నాకిపు డార్తరక్షణా!

ఉ. వైరులు విఱ్ఱవీఁగుచును బారులు గట్టి ప్రలాపవాక్యముల్
వేరిమిఁ బ్రేలుచున్ మిగులసేడుక నిందును నందుఁ బోవుచు
న్నారు సమస్త లోకముల నాథుఁడవీవు తదీయగర్వమే
పారఁగఁ జెల్లనిచ్చు టిది యక్కట ధర్మమె యార్తరక్షణా!

ఉ. అడ్డములేదు నీ పనికి నాదటఁ దీర్చెద నొండొకండు నా
కొడ్డగ నన్ను నమ్మ తగ నుల్లములో నని తేనె మాటలం
దొడ్డగఁ బల్కు స్నేహితులు తుట్టతుదన్ విడనాడు వారు నూ
బుడ్డను నమ్మ యేటఁ బనుపోలిక వారలనమ్మ టచ్యుతా!

ఉ. ఇంతటివాఁడు చంద్రుఁడు మఱింతటివాఁ డల సూర్యదేవుఁడో
యింతటి యమ్మ భూవనిత యింతటివాఁడు సముద్రుఁడంచునుం
జింతన చేసి మానవులు చెప్పఁగ వచ్చినవారు లెక్కయే
యింతయు నంతనాఁ జనని యీవె సు మీ శుభదుండ వీశ్వరా!

చ. నిను గొనియాడనేర ధర నేరని పుత్రులఁ దల్లిదండ్రులెం
దును దిగవిడ్తురయ్య మది దుష్టుఁడు వీఁడని యెంచి దేవ, న
న్నును విడనాడఁబోకుము మనోగతి నా కొకయించుకంతయే
ఘనమగు నీ ప్రభావమును గన్గొననేరమి నాదుదోసమే.

ఉ. ఎన్నఁగ వచ్చు నిద్ధరణి వృక్షములం గలయాకు లెల్ల వే
యెన్నఁగ వచ్చు మింటఁ గల ఋక్షములం దరుణీశిరోజపం
క్తిన్నలి నెన్న వచ్చు జలధిం గలచేపల నెన్న వచ్చు నా
పన్నశరణ్య, నా వయినపాపము లెన్న నశక్య మీశ్వరా!

ఉ. ఎన్నఁగఁ జాల నిద్ధరణి నెట్టులు నా దగుపాపపుంజ మా
పన్నశరణ్య నీ దగుకృపారస పూరము నట్టులే ప్రభూ
యెన్నఁగఁ జాలఁ జువ్వె మది నెట్టులనైనఁ గృపార్ద్రదృష్టితో
డ న్నను జూచి కావు మగుడన్ భవబంధము నాకు నీకుమా.

చం. పరుల ధనంబు మీఁదఁ, బరభామలమీఁదను, స్వప్నమందు నేఁ
గరము దురాశ నాకుఁ గలుగంగ నొనర్పకు మయ్య, నీమహా
కరుణయు లేక సద్గుణము గల్గదు దోషము లైన నక్కటా
ధరణి మనుష్యులం దమకుఁ దామ వరింతురు లోకపాలకా!

చ. అరయఁగ నాదుదోషముల నన్నిఁటిఁ జేరిచి కుప్ప వేసినన్
ధరణితలంబు నాకసము దప్పక యేకమ యౌను దానినిం
గరము హరింప నీ దయిన కారుణికత్వము వెల్లిగొల్పినం
బోరిఁ బోరవేగఁ గొట్టుకొని పోవును గాక యిఁ కెట్లు పోవునే.

ఉ. తప్పులు పెక్కు సేసితిని తథ్యము, నీజనియించినాది గా
నొప్పులు లేవు చూడ నినునొల్లను గావ నటందు వేమొకో
తప్పులు సేయనప్పటికిఁ దథ్యము గాదటె కాచు టంట నీ
కొప్పులు పాపహారి యను నున్నతనామ మదెట్లు లీశ్వరా!

చ. పుడమిజనంబులెల్లఁ గడుఁబొందుగ మూరెడు బారెఁడైన యా
నుడువులచేత బేరులు మనోహరరీతిని బెట్టికొందు రా
నుడులు నిరర్థకంబులు వినోదజముల్ మఱి నీదు పేరులన్
నుడులవిసార్థకంబులు గనుంగొనఁ గావటె పాపనాశనా!

ఉ. పాపములెల్ల నీదయిన పావననామమునుం జపింపఁగాఁ
బాపిమహోన్నతంబగుచు భాసిలునట్టిపదం బొసంగెఁ దా
పాపికి నిత్య మక్షయశుభంబుల నీనెడునట్టిదైనదో
పాపవిదూర యీపుడమివారికి శక్యమె యిట్లు సేయఁగన్.

చ. మనమునవైన నావయినమాటలనైనను లోకనాథ నా
తనువునవైనను భువిని దద్దయుఁ దప్పులు సేయువాఁడనే
ననుదిన మల్లతప్పులు మహాత్మ, దయానిధి చల్లచూపుచేఁ
దను గని నన్ క్షమించి మఱిధన్యుని జేయఁగదే పరాత్పరా!

చ. నరు లిదిమంచి చెట్టయిది నాఁజన రింతయు వారిదృష్టిలో
నరయఁగ నెట్టులుండిన మనంబున నీ కతిసమ్మదంబుగా
ధరణి వెలుంగు రీతినిని దప్పక నాదగు చిత్తవృత్తినిం
గరుణను జేయవయ్య, త్రిజగన్నుత, పావనమూర్తి, యవ్యయా!

మానినీవృత్తము

నాదగునిల్లును నాదగువాకిలి నాదగుపెండ్లము నాసుతులున్
నాదగుతోఁటయు నాదగు దొడ్డియు నాదుసమస్తమటంచు మదో
న్మాదము మీఱఁగనుంటిని సర్వసమా, నినుఁ గానక యిద్ధరలో
నా దగు తప్పును గావఁగదే దయ నామది కీఁగదె విద్దియనున్.

మానిని

విద్దియయిచ్చితివేఁ దగదృశ్యము విశ్వము నశ్యమటంచు బరే
తద్దయు నామది నమ్మచు హృద్యముఁ దథ్యముఁగన్గొన నెల్లపుడున్
బెద్దయుఁ జింతన చేసెదనీదగు ప్రేమకు నర్హుఁడ నౌట కదే
యుద్ధిమెలుంగని నిక్కపుఁ ద్రోవ శుభోదయ, నిత్య దయాంబునిధీ!

మానిని

ఇచ్చుకొలందిని నిద్ధర వస్తువు లెల్లఁ దఱుంగును గాని బలే
యిచ్చుకొలందిని విద్దియ వింతగ హెచ్చుగుచుండు జగత్ప్రభుణా!
మచ్చిక నొక్కని డగ్గఱఁదీయుచు మక్కువఁ బెంచుట మాన్యులకున్
హెచ్చయి వెల్గుగుణం బదికాదటె యీఁగదె విద్దియనాకిపుడే.

మానిని

ఎవ్వఁడు వేడిన మానవనాథు లహీనదయామతి ద్రవ్యములన్
మవ్వముతోడుత నిత్తురు కల్గుప్రమాణములో వెనుదీయరనూ
యివ్వసుధాతలమందున నోజగదీశ్వర, కల్గిన వారలు నీ
మవ్వపుఁ బుత్రులు కారటె నీ మహిమంబు నమేయముగాదటవే.

మానిని

కావునవేగమ యోయి దయాంబుధి కారుణికత్వము మీఱఁగ నన్
గావుము విద్య యొసంగు మొకింతయుఁ గాలము వ్యర్థము కానిగరీ
దేవ, మహామహ, సువ్రత, నీదగు దివ్యమనంబునఁ జూడఁగదే,
యేవరియించిన యట్టి పదార్థము నీఁగదె నీకది లెక్కయటే!

మానిని

స్నానముసంధ్యలుమక్కులమాఁత్రలు సల్పుచునుందురు కొంద జిలన్
సేనలఁబోలెను బారులు దీర్చుచుఁ జేరుదు రొక్కెడఁ గొంద జిలన్
మానము వీడుచు గుంపులుగూడుచుమక్కువఁ గొందఱు పాడెద రో
శ్రీనిలయా, నినుఁగొల్వగ నిట్టులఁ చిన్నెలు వన్నెలు నేలయొకో.

మానిని

చిన్నెలు వన్నెలఁ జూచెడువారికిఁ జిత్రము పోలికనుంటకె చూ
చిన్నెలువన్నెలు మేనికిఁ బెట్టినఁ జిత్తము నిశ్చల మెట్లగునో
యెన్నఁగమక్కులమాఁత్రలె చూతురొ యింపగుబారుల తిన్నదనం
బున్న? చూతురొ త్రొక్కెడుచూతురొ భూతధరా, నినుఁజూ చెదరో!

మానిని

ఇట్టి వికారములేమియు నొల్ల నతీంద్రియ నిన్నను గన్గొనఁగా
నట్టిటువోవ నశక్తుఁడ సర్వమయా స్థిరపావన నీ కడయా
నట్టి స్థలంబులు వేళలు నెందును నక్కటకల్గునె క్రొమ్మెక్కడ నే
నెట్టి స్థలంబుల వేళల నుండెద నీశ్వర, యక్కడ నీ కపుడే

మానిని

పాపిని దుష్టుఁడ గర్విని లోభిని బందను దొంగను గావున నే
నోపను నల్గురిలోనికి వచ్చుట కొప్పుగ నిన్ను నుతింపఁగనే
నోపరమాత్ముఁడ, మానసమందున నొంటి నుతించెద నెల్లపుడున్
నాపరమంబగు భక్తియ చూడుము నాదగువేషము చూడకుమీ,

మానిని

నామది చూడఁగ నూదియెనంత యనాథుఁడ లోకములోఁగలయా
భామల నెల్లరఁ గోరుచునుండును బార్థివులెల్ల గ భాగ్యములం
గోమునఁ గోరునుగానియ దేమికొ కొంచెము యేని యెఱుంగదుసూ
నీ మహిమం బలభామలు భాగ్యము నిండుగనుండుటఁ గావలయున్.

మానిని

కావున నామది దిద్దుము వేగము కారుణికోత్తమ దిద్దఁగనీ
కేవళమాఁ జెలివారికి శక్యమె యియ్యిలలోపల లోకగురూ
తావలమై తగుమానస మొక్కటి తప్పుల కన్నిఁటికిం దలఁ పం
గావున మానసముందగదిద్దుట కార్యము చూడఁగఁ దొల్దొలుతన్.

మానిని

తప్పుల కీకలికాలములోపల ధారుణిఁ జేసినకార్యము లే
యొప్పఁ ప్రధానములయ్యెడుఁ గాకగుణోన్నత చిత్తము కాదనుచుం
జెప్పెను దాస్మృతి నొక్కఋషీంద్రుఁడు చిన్మయ యాగతిధర్మ
మునుం జెప్పెనతండిలఁ దాస్మృతి లేకని చిత్తమునందుఁదలంతుఁజుమీ!

మానిని

ఒప్పుల కీకలికాలములోపల నుర్వినిఁ గార్యము లే పనిలే
దెప్పుడుఁ దాన ప్రధానము చిత్త మహీనఫలంబుల నీ ననుచుం
జెప్పెను దాస్మృతి నల్ల ఋషీంద్రుఁడు చిన్మయయాగతి ధర్మమునుం
జెప్పెన తండిలఁ దాస్మృతి లేకని చిత్తమునందుఁ దలంతుఁ జుమీ.

మానిని

ఆఋషిచెప్పిన వాక్యము తథ్యము యయ్యెన యేఁ గరుణాజలధీ
యేరికఁ ధారుణిఁ జిత్తములోపల నెయ్యెయిదుష్కృతముల్ సలుపం
బోరిడిచిన్నరహస్యము తన్మని బుద్ధికి నెట్టులతోఁ పదోకో
కారణ మక్కట నాదగు బుద్ధికిఁగానఁగరా దొకయింతయినన్.

మానిని

ఈ విషయంబున నెంతయుఁ బండితు లేనియు భిన్నులు గాఁదగరీ
భూవలయంబున మానవులెల్లరు బుద్ధిని నిల్పఁగఁగార్యము నూ
యీవె ప్రసన్నత నామది కింతయు నిష్పృహ వేగము యీవరదా!
కావున నన్నిటి కాస్పదమా మదికంటె బరీయము లేదు సుమీ

---



శ్రీ నడింపల్లి జగన్నాథరావు పంతులుగారు



కీ. శే. సోడిశెట్టి వెంకటరత్నముగారు-రాజమండ్రి



కీ. శే. నాగుమంత్రి సూర్యనారాయణగారు

(23)



శ్రీ వాసిరెడ్డి రామానాయకుగారు
తుమ్మపూడి, గుంటూరు.



శ్రీ శ్రీపాద భాపన్నగారు



శ్రీ యస్. నారాయణాచార్యులుగారు



శ్రీ కాంచీ కామకోటి పీఠాధీశ్వర
జగద్గురు శ్రీ మచ్చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ స్వాములవారు



పండిత చిదిరమఠం వీరభద్రేశ్వర శర్మగారు
(హిమాలయ యాత్రలో)

## పిచ్చా—తగాదా!



(మద్యపాన నిషేధ ప్రచారము నుద్దేశించినది)

## వివాహ బహుమానము



బంగారు నిలువుటద్దము. అద్భుత శిల్పమందిరము. రవలు కెంపులు పొదుగబడి యున్నవి. శ్రీ బాపాలాల్ అండు కో వారు దీనిని తయారు చేసినారు. వీరు చెన్నపురము నందలి సుప్రసిద్ధ నగలవర్తకులలో నొకరు.

# దాహకచిత్రము

చిట్టాప్రెగడ సీతారామాంజనేయులు గారు

"పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చభవ్యం తదేవాగ్ని స్త దాదిత్య స్తద్వాయు స్తదుచంద్రమాః తదేవశుక్రః తద్బ్రహ్మ తదాప తత్ప్రజాపతిః భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్."— శ్వేతాశ్వతరోపనిషత్.

తతసౌజన్యవదాన్యమాన్యగుణస్వార్థత్యాగి లేడూర! ద
త్సతిలే, దింట! నవార్య కీలలుదయించఁ, తద్గృహం బగ్ని కా
హుతి యయ్యెన్; ఫలితార్థమెన్న భవదీ యోద్వేగమా గాక, దు
ష్కృత మెట్లౌను? జగన్నియంత వనువాసిన్; భక్తమూర్తీ! శివా!

పరుడాప్తుం డొరు డంత్యజుం డొకటిగా, బర్వెత్తుచున్, నెత్తి నె
త్తిరికుండల్; జలమోడ్చె పుట్టములు; జ్ఞప్తిన్ గూరె నైమిత్తికో
త్తరమా సంచయనమ్ము; ఆర్పఁబడె దత్తద్గేహశల్యమ్ములున్;
స్థిరమా! దుర్భ్రమ; చిత్రకర్మమగు సృష్టిన్; భక్తమూర్తీ! శివా!

ఎఱుఁగన్నేరని దెల్ల నిగ్రహముగా నెన్నున్; నినున్ దూఱు; వం
దురు; వాక్యార్థము జేయు; దిగ్భ్రమగొనున్; దుష్కర్మ గోచారముల్
దురవస్థల్ గలిగించునంచు డిగులొందున్; మూఢు డన్నింట నొ
క్క రసాత్మైక్య విచిత్రలీల గనలేకన్ భక్తమూర్తీ! శివా!

ఒకగేహమ్మున నిప్పుముట్టుకొననా! ఊరెల్ల సామగ్రి బై
టకు జేరున్; బహుసంఖ్యలోన నొకడౌటన్, జ్ఞానియున్ భ్రాంతి నొం
దకపో; డింతట సృష్టిరక్షణ చణుండా! మర్త్య; డాయారసా
త్మక లీలన్ శుభమిత్తు వం చెఱుగ రాదా! భక్తమూర్తీ! శివా!

ఎదివచ్చున్; ఎదిపోవు; నెయ్య దిట రానేరాదో! పోబోరొ! అ
య్యది కన్గొన్న మహామహుండె! భవదుద్యత్పాదపంకేరుహా
భ్యుదయాస్తోక రసైకపానజనితామోదైక్య చిద్భావనా
స్పద సింహాసన మెక్క నర్హుడగు! దేవా! భక్తమూర్తీ! శివా!

---



కీ. శే. తటవర్తి రామబ్రహ్మముగారు



శ్రీ రా. బ. యల్. వెంకటరెడ్డిగారు, కడపమండలమున జరిగిన రెడ్డి మహాజన సభాధ్యక్షులు.



భారతదేశీయ విద్వత్సమ్మేళన-తెనాలి
వైద్యరాజసింహ ధవళేశ్వరపు చిరంజీవాచార్యులుగారు-ప్రతిష్ఠాపకులు. (కూర్చున్నవారిలో నాలవవారు)



శ్రీ కాళ్లకూరి గోపాలరాయకవిగారు
అపూర్వసంఘసంస్కరణాది బహుగ్రంథకర్తలు.
ఇటీవలనే వీరి 'వాల్మీకి' (మనఃపరిణామనిరూపకము)
నాటకము ప్రకటితమైనది.



ఆంధ్రవిద్యార్థులు-సూపరువైజరు తరగతి
(చివర సంవత్సరము)
చెన్నపురి టెక్స్టయిలు ఇన్‌స్టిట్యూటు.
(బట్టలనేతను నేర్పుబడి)

# శుక్ల సంవత్సర విశేషములు

౧౯౨౯

ఏప్రిల్ ౧౦. శ్రీ. గా. వేమవరపు రామదాసుపంతులుగారు భారత వ్యవసాయ పరిశోధకమండలి సభ్యులుగా నెన్నుకొన బడిరి.

,, ౧౪. సైమనుకమిషను ఇంగ్లాండుకు బయలుదేరినది.

,, ౨౬. సైమను కమిషను లండను జేరుట.

,, ౩౦. మదరాసు గవర్నరుగా లెప్టినెంటు కర్నలు జార్జిస్టాన్లీ గారి నియామకము.

మే ౨. ఆంధ్రవైద్యమహాసభ, ఏలూరు; అధ్యక్షులు డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు.

,, ౧౧. ఆంధ్రదేశవర్ణాశ్రమసభ, బెజవాడ.

,, ౧౯. నిఖిలభారతాయుర్వేదసమ్మేళనము, నాసిక.

,, ౨౧. మహాత్ముని ఆంధ్రదేశ పర్యటనము ముగిసినది. రూ. ౨,౫౨,౦౮౦. వసూలయినది.

మే ౨౫. స్వదేశసంస్థాన ప్రజామహాసభ, బొంబాయి. అధ్యక్షుడు: శ్రీ సి. వై. చింతామణిగారు.

,, ౨౬. 'బ్యాంక్ ఆఫ్ హిందూస్థాన్'సంస్థాపనము.

,, ౨౮. యూనియనుబోర్డులసభ, గ్రంథాలయసభ, సంగీత మహాసభ, పదియవ ఆంధ్రసారస్వతమహాసభ, విజయనగరము. అధ్యక్షుడు: శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు.

జూన్ ౧. రెండవ అఖిలభారతదేశీయ దేవాంగ మహాసభ. అధ్యక్షుడు: శ్రీ. పిట్టి కుమారస్వామి శెట్టిగారు, కోయంబత్తూరు.

,, ౪. బాల్డ్వినుగారి రాజీనామా.

,, ౫. రామ్సే మేక్డనాల్డుగారు ప్రధానమంత్రిగా నియమింపబడుట.

,, ౮. కెప్టన్ వెజ్‌వుడ్ బెన్నుగారు భారత రాజ్యాంగ కార్యదర్శిగా నియమింపబడుట.

,, ౧౦. 'ఆంధ్రరత్న', రాణాప్రతాపజయంతులు.

౧౯౨౯

జూన్ ౧౫. పదవ కమ్మమహాజనసభ, అంగలూరు. అధ్యక్షుడు బొల్లిని మునిస్వామి నాయుడుగారు. కమ్మవిద్యార్థి మహాసభ.

,, ౧౬. దేశబంధుదాసుగారి వర్ధంతి.

,, ౧౭. శ్రీకళాప్రపూర్ణ మహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రిగారి నిర్యాణము.

,, ౧౯. ఆంధ్రనాటకకళాపరిషత్సభ, తెనాలి,

,, ౨౯. ఆర్యవైశ్యమహాసభ, పెద్దాపురము, సర్ గంగారాం గారు, రు. ౫౧ లక్షలు వితంతూద్వాహములకు, వికలాంగులకు, అనాథలకు దానపత్రము వ్రాసి యిచ్చిరి.

జూలై ౪. దర్భాంగమహారాజాగారినిర్యాణము.

,, ౬. ఆంధ్రప్రావిడెంటుకంపెనీ ప్రారంభము, బందరు.

,, ౭. భారతయువజన మహాసభ, సింహళము, అధ్యక్షురాలు: శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతిగారు.

,, ౧౦. అల్లూరి సీతారామరాజుగారి జన్మదినోత్సవము.

,, ౧౨. కలకత్తాలో మహాత్ముడు విదేశవస్త్రదహనమొనర్చినందులకు, ఒక రూపాయజుల్మానా విధింపబడెను.

,, ౧౩. శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారిని (కాంగ్రెసు అనుబంధము ప్రకటించినందులకు) రాజమండ్రిలో అరెస్టు చేసిరి.

,, ౨౧. చెన్నపురి రాష్ట్రీయ సహకార మహాసభ, సర్. యం. సి. ముత్తయ్యశెట్టిగారి నిర్యాణము.

,, ౨౨. శ్రీమతి సరోజినీదేవిగారు ప్రపంచయాత్రనుండి మరలి స్వదేశమును చేరిరి.

,, ౨౫. ప్రాథమికపాఠశాలోపాధ్యాయసమితిసమావేశము.

ఆగస్టు ౧. శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రిగారి నిర్యాణము.

,, ౧౦. మద్దూరి అన్నపూర్ణయ్యగారికి రెండున్నర సంవత్సరములు కఠినశిక్ష విధింపబడెను.

,, ౧౧. ఆంధ్ర కో-ఆపరేటివ్ ఇన్‌స్టిట్యూటు సంస్థాపనము, బెజవాడ.

౧౯-౨౯

ఆగష్టు ౧౫. గాంధిజిన్నాగార్ల సంప్రతింపు.

,, ౧౯ చెన్నపురియందు వ్యవసాయపు బ్యాంకు స్థాపింపబడినది.

,, ౨౪. ప్రకృతివైద్యమహాసభ, బోలారం. (నైజాం)

,, ౨౮. శ్రీ సి. వి. రామన్ దంపతుల ఇటలీ ప్రయాణము.

సెప్టంబరు 3. శ్రీవల్లభభాయి పటేలుగారు చెన్నపురికి విచ్చేయుట.

,, ౮. ఆంధ్ర, కృష్ణాపత్రికలసన్మానసభ, బెజవాడ.

,, ౧౨. వైశ్యరత్న శనగపల్లి రామస్వామి గుప్తగారి నిర్యాణము.

,, ౧3. ౬3 దినములు జయిలులో నిరశనవ్రతమునుబూనియుండిన జతీంద్రనాథ దాసుగారి నిర్యాణము.

,, ౧౯ నాలుగు నెలలు నిరశనవ్రతమును బూనియుండిన ఫొంగి విజయగారి నిర్యాణము.

,, ౨౪. శారదాబిల్లు శాసనసభవారి ఆమోదమును పొందినది.

,, ౨౮. శారదాబిల్లు సామ్రాజ్యశాసనసభఆమోదమునుబొందినది.

,, 30. లండనులో లేబరుపార్టీ సమావేశము.

అక్టోబరు

,, ౨. గాంధిమహాత్ముని షష్టిపూర్తి.

,, ౫. బ్రాహ్మణేతర సమావేశము, నెల్లూరు, అధ్యక్షుడు: బి. మునిస్వామినాయుడుగారు.

,, ౧3. రాజప్రతినిధి రౌండుటేబిల్ సమావేశప్రకటనము.

,, ౧౭. లజపతిరాయి వర్థంతి.

,, ౨౬. లార్డుగోషనుగారు గవర్నరుపదవిని వదలి ఇంగ్లాండుకు ప్రయాణమయిరి.

నవంబరు 3. ఆంధ్రగాయక మహాసభ, బెజవాడ. అధ్యక్షుడు: శ్రీ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు

,, ,, ఆంధ్రరాష్ట్రీయమహాసభ, బెజవాడ. అధ్యక్షుడు. శ్రీ నడింపల్లి-వెంకటలక్ష్మీనరసింహారావుగారు.

,, ,, ఆంధ్రయువజనమహాసభ. బెజవాడ, అధ్యక్షుడు: శ్రీ. కే. యఫ్. నారిమనుగారు.

,, ,, ఆంధ్రమహాసభ. బెజవాడ, అధ్యక్షుడు: శ్రీ. క. కోటిరెడ్డిగారు.

,, ,, ఆంధ్రస్థానిక సంస్థలసభ బెజవాడ. అధ్యక్షుడు; శ్రీ. పి. సి. వెంకటపతిరాజుగారు.

౧౯-౨౯

నవంబరు 3. ఆంధ్రమహిళా మహాసభ బెజవాడ. అధ్యక్షురాలు శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు.

,, ౫. వ్యాయామ మహాసభ, బెజవాడ, అధ్యక్షుడు: శ్రీ ఉయ్యూరురాజాగారు.

,, ,, ఆంధ్రదేశ రైతులసభ బెజవాడ, అధ్యక్షుడు: ప్రొఫెసర్ జి. రంగనాయకులుగారు.

,, ౬. హిందూమహాసభ బెజవాడ, అధ్యక్షుడు: శ్రీ డాక్టరు మూంజిగారు.

,, ,, ఆదిమాంధ్రమహాసభ, బెజవాడ, అధ్యక్షుడు: శ్రీపత్తిపాటి ఆదినారాయణగారు.

,, ౯. ఆంధ్రదేశ సనాతనమహాసభ, బెజవాడ. అధ్యక్షుడు శ్రీ. జి. కృష్ణమాచార్యులుగారు.

,, ౧౨. సర్జార్జి స్టాన్లీగారు. మదరాసు గవర్నరు అధికారమును స్వీకరించిరి.

,, ౨3. ప్రథమరంగూను ఆంధ్రసభ, రంగూను. అధ్యక్షులు: దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు.

,, ,, ఆంధ్రమహిళామండల సాంఘికసమావేశము, అధ్యక్షురాలు. శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు.

,, ౨౯. ట్రేడుయూనియన్ కాంగ్రెసు, నాగపూరు. అధ్యక్షుడు: శ్రీ పండిత జవహరలాలునెహ్రూగారు.

,, 30. అఖిలభారతసనాతనధర్మమహాసభ. చెన్నపురి. అధ్యక్షులు: శ్రీ. పండిత శ్యామసుందర చక్రవర్తి గారు.

,, ,, శ్రీ తంబీగారు మధ్యరాష్ట్రముల గవర్న రధికారమును స్వీకరించుట.

డిసంబరు ౧3. మాంచెస్టరు విశ్వవిద్యాలయమున ప్రొఫెసరు రాధాకృష్ణన్ గారు హిబ్బర్టు ఉపన్యాసముల నొసగిరి.

,, ౨౧. రెండవ బొంబాయి రాష్ట్రాంధ్రమహాసభ, బొంబాయి. అధ్యక్షులు: శ్రీ. గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు.

,, ౨౨. లాహోరుకాంగ్రెసుప్రదర్శన ప్రారంభము, లాహోరు. ఆరంభకులు: సర్ పి. సి. రేగారు.

,, ౨3. రాజప్రతినిధి స్పెషల్ ట్రెయిన్‌పైన బాంబు పడుట.

,, ౨౫. దేశీయసాంఘిక మహాసభ, లాహోరు. అధ్యక్షులు. శ్రీ హరవిలాస శారదాగారు.

౧౯౨౯

డిసెంబరు ౨౬. గ్రంథాలయ మహాసభా ప్రారంభము, లాహోరు. ప్రారంభకులు: సర్. పి. సి. రేగారు

,, ,, ఆర్యమహిళామహాసభ, లాహోరు. అధ్యక్షురాలు: శ్రీమతి అనంత రుక్మిణమ్మగారు.

,, ౨౭. అఖిలభారతఉపాధ్యాయ మహాసభ, చెన్నపురి. అధ్యక్షులు: సర్. పి. యస్. శివస్వామిఅయ్యరుగారు.

,, ,, అఖిలభారతగ్రంథాలయమహాసభ, లాహోరు.

,, ,, ఆరవఅఖిలభారతవైద్యసమావేశము, లాహోరు. అధ్యక్షులు: శ్రీ విధనచంద్రరాయిగారు

,, ౨౮. ఆంధ్రదేశకళావంతుల మహాసభ, విజయనగరము. అధ్యక్షులు: శ్రీ. గుంటూరు వీరరాఘవులుగారు.

,, ౨౯. ౪౪వ అఖిలభారత జాతీయ మహాసభ, లాహోరు. అధ్యక్షులు: శ్రీ. పండిత జవహరిలాలు నెహ్రూగారు.

,, ,, అఖిలభారతమితవాదిమహాసభ, చెన్నపురి. అధ్యక్షులు: సర్ ఫిరోజిషా సేత్నాగారు.

,, ౩౦. అఖిలభారత జాతీయమహాసభ స్వాతంత్ర్య తీర్మానము నామోదించుట.

,, ౩౧. అఖిలభారత ఖిలాఫతు మహాసభ, లాహోరు.

౧౯౩౦

జనవరి ౧ సర్ కె. వి. రెడ్డిగారు చెన్నపురిని చేరిరి.

,, ౨. భారతీయ విజ్ఞానశాస్త్ర మహాసభా ప్రారంభము, అలహాబాదు. ప్రారంభకులు: సర్ మాల్కామ్ హెయిలీగారు.

,, ,, పత్రికాసంపాదక మహాసభ, లాహోరు. అధ్యక్షులు: శ్రీ. అబ్దుల్లా బ్రెల్వీగారు.

,, ౨౬. "స్వాతంత్ర్యదిన" మహోత్సవము.

ఫిబ్రవరి ౧౩. శ్రీకృష్ణదేవరాయవర్ధంతి.

,, ౧౪. సంయుక్త భారతవాణిజ్య సంఘమహాసభ, అధ్యక్షులు: జి. డి. బిర్లాగారు.

,, ౨౧. వివిధపక్షనాయకులమహాసభ, ఢిల్లీ. అధ్యక్షులు: ఎ. పి. పాత్రోగారు.

మార్చి ౬. మహాత్ముడు రాజప్రతినిధికి అంత్యసందేశమును బంపెను.

,, ౭. సర్దారు వల్లభాయిపటేలుగారి అరెస్టు. వారికి శిక్ష నాలుగు మాసములు.

,, ౮. శ్రీ. బులుసు సాంబమూర్తిగారి కారాగృహ విముక్తి.

,, ౧౨. సబర్మతీ ఆశ్రమమునుండి శాసనోల్లంఘనార్థము ప్రథమ సత్యాగ్రహదళము బయలుదేరెను. నాయకుడు: మహాత్మాగాంధీ.

---

# ఆంధ్రభారత కవితా విమర్శనము

(ఆంధ్రగ్రంథమాల ౧౨-వ గ్రంథము) క్రౌను ౪౨౦ పుటలు. వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త: కోరాడ రామకృష్ణయ్యగారు, యం. ఏ.

ఈ గ్రంథమునందు విమర్శింపబడిన క్రిందివిషయములే దీని ప్రశస్తినిచాటును.

ఆంధ్రవాఙ్మయము; భారతము:— విమర్శనపద్ధతులు ఆంధ్రవాఙ్మయయుగములు ప్రాచీన దేశకాలపరిస్థితులు, చాళుక్యులకాలమున నాంధ్రభాషాస్థితి, అహదనకరశాసనములోని తెలుఁగుభాగము, చాళుక్యభీమరాజ దీక్షాసి యుద్ధమల్లాది శాసనములు, శిష్టభాష, జానుదెనుఁగు, భారతరచన-ఛందస్సామగ్రి, ప్రాచీన భాషాస్వరూపము-జన్యభాషలు.

మతస్థితి-వాఙ్మయము:—భారతరచన-అవతారికలు, నన్నయవైదికదృష్టికి నిదర్శనములు, నన్నయ తరువాతి కాలస్థితి, ఆరణ్యపర్వశేషపూరణప్రశంస, ఆరణ్యపర్వశేషమునందలి తిక్కన యనుకరణములు. తిక్కన భారతరచన, అద్వైతభావము, యవతారికలు, కవితావేశము.

భారతాంధ్రీకరణము—తిక్కన:—విరాటపర్వకథ, అందలి వస్త్వైక్యము, పాండవప్రవేశము, శమీవృక్షముపై నాయుధనిక్షేపణము, బృహన్నల సారథిగాఁ గుదురుకొనుట, విరటునికొలువు-భీముఁడు, కీచకవధ తదనంతర విశేషములు.

తిక్కనార్యుని కళాప్రతిభలు:—విరాటపర్వము—ప్రబంధలక్షణములు, మూలకథపై తిక్కనవేసిన యాంధ్రతాముద్ర, తిక్కనార్యుని వర్ణనలు, ప్రకృతివర్ణనలు, తిక్కన మనోవృత్తివివరణశక్తి, నాటకకళాచాతుర్యము, తిక్కన శృంగారవర్ణనలు, రసపాత్రపోషణరీతులు, నాటకరీతులు, తిక్కనార్యుని భాషాశైలులు, పూర్వోత్తరసందర్భముల పొందిక, ఉపమాలంకార ప్రయోగము, సందర్భానుకూలముగ భావమును స్ఫురింపఁజేయు పదరచన, జాతీయప్రయోగ నైపుణ్యము, అర్థముమాఱిన ధాతువులు, పదజాలము, కారక విశేషములు, ఉపసంహారము. ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల; ౭, తంబుశెట్టివీథి, చెన్నపురి.



శ్రీ బత్తుల కామాక్షమ్మగారు



శ్రీ జి. యర్రా. శారదాకన్యగారు



శ్రీ సి. కె. కొసుకుట్టి కన్యగారు



కీ. శే. పంతగాని లూథియా దేవిగారు



శ్రీ గ్రేస్ ఆనందరావు సతిగారు



శ్రీ గ్రేసు వేదాంతాచారికన్యగారు



శ్రీ బాలసుందరం శెట్టి సతిగారు



శ్రీ చిన్నలక్షుమ్మగారు



శ్రీ భారతమహిళా శారదాసమాజము - అనంతపురము



శ్రీ అయ్యదేవర బాలా
త్రిపురసుందరమ్మగారు



శ్రీ ఎమిలీ కిన్నర్డ్డ కన్యగారు



కీ. శే. సబ్నవిస్
వెంకటసుబ్రహ్మణ్య కృష్ణారావుగారు



శ్రీ వెలువోలు
సీతారామయ్య చౌదరిగారు




## రెండుకోట్ల ఆంధ్ర మహాజనులకు
## ఇది యొక్కటే దైనికపత్రిక.

ఆంధ్రదేశవార్తలను, భారతదేశవార్తలను, ప్రపంచవార్తలను ఏరోజున కారోజున ప్రకటించుచుండును. వార్తలకు సంబంధించిన పటములు ప్రచురింపఁబడును. ప్రజలస్వాతంత్ర్యమును కాపాడుటకును స్వరాజ్యము నతిశీఘ్రకాలములో సంపాదించుటకును, ఆంధ్రపత్రిక తోడ్పడినరీతిని మఱే యేపత్రికయు తోడ్పడనేరదు. కాంగ్రెసు నాదేశమును, ఆంధ్రదేశమునం దన్నిమూలలను వ్యాపింపజేయుటలో ఆంధ్రపత్రికను మించిన పత్రికయే లేదు. ఆంధ్రుల క్షేమమును పెంపుజేసి ఆంధ్రత్వసిద్ధికై పాటుపడుపత్రిక ఆంధ్రపత్రికయే. ఆంధ్రపత్రికను పోషించుట ఆంధ్రమహాజనుల ప్రధానవిధి యగుచున్నది. శైలి సులభమై ఎల్లరకును గ్రాహ్య మగురీతిని పత్రికావ్యాసము లలరారుచుండును.

### చందా యేర్పాటులు

| | | |
|---|---|---|
| దినపత్రిక సంవత్సర చందా రు. | 24 0 0 | వారపత్రిక సంవత్సరం 1కి, చందా రూ. 4 0 0 |
| ,, అర్థ సంవత్సరము ,, ,, | 12 0 0 | వారపత్రిక సంవత్సరమునకు తక్కువ చందాకు పంపబడదు. |
| ,, మూడుమాసములు,, ,, | 6 4 0 | |
| ,, మాసమునకు ,, ,, | 2 2 0 | |

### నూతనసంవత్సరాదిసంచిక వెలలు

| | | | |
|---|---|---|---|
| దినపత్రిక సంవత్సరచందాదారులకు | ... | ... | 1 0 0 |
| దినపత్రిక సంవత్సరముకు తక్కువ చందాదారులకు | ... | ... | 1 4 0 |
| వారపత్రిక చందాదారులకు | ... | ... | 1 4 0 |
| ఇతరులకు | ... | ... | 2 0 0 |

(వి. పి. ఖర్చులు ప్రత్యేకము.)

## ఆంధ్రపత్రికాకార్యాలయము,

7, తంబుశెట్టి వీథి, మద్రాసు.




## సచిత్ర మాసపత్రిక

### ప్రతి చాంద్రమాసాదిని ప్రచురింపబడును.

ప్రతి సంచికయందును 3, 4 వర్ణచిత్రములు, ఇతరచిత్రములు నుండును.
చందా సం॥ంకి రూ. 6-0-0. విడిపత్రిక వెల రూ. 0-10-0

**మాదిరి పత్రిక అణాలు 0-10-0.**

స్టాంపులను పంపిననే పంపబడును. ఉచితముగ పంపబడదు.
మాదిరిపత్రిక తెప్పించుకొన్నతర్వాత చందాదార్లుగ చేరువారు ఆసొమ్మును మినహాయించుకొని తక్కినసొమ్ము మాత్రము పంపవచ్చును.

ప్రకటన ధరలు:—

ఒకనెలకు మాత్రము సాధారణ పుట 1-కి రూ 30-0-0
సాధారణపుట ½ కి రూ. 15-0-0; సాధారణపుట ¼ కి రూ. 8-0 0
6 నెలలకు అంతకుపైన సాధారణపుట 1-కి నెలకు 1-కి రూ. 25-0-0
నెలకు ½-కి, రూ. 12-0-0; నెలకు ¼-కి రూ. 7-0-0

## మేనేజరు, "భారతి"

తపాలపెట్టె నెంబరు 212, మదరాసు.

